శ్రీ

# శ్రీ శివభారతము.

(శివాజీప్రబంధము.)

Remember Shivaji! And count this Life as grass;
In this world and the next rely on Fame alone,
Remember Shivaji! His form, his noble aims,
Forget not also all his valiant deeds on earth.

RAMDASA SWAMY.


గ్రంథకర్త

గడియారము వేంకటశేషశాస్త్రి

శతావధాని.

శ్రీ

# ఉపోద్ఘాతము.

---

మనకు మహాకావ్యములు రచించుకాలము గడచినదని యొకచో తొందఱపడి వ్రాసితిని†. ఆతప్పునకు ప్రాయశ్చిత్తముగా ఈ 'శివభారతము' న కిప్పు డుపోద్ఘాతముగా రెండుమాటలు వ్రాయుచున్నాను. దీని యుద్దేశమును ఫలమును అదే; ఈ కార్యమున నా యధికారమును అంతే.

ఈ గ్రంథకర్తగారి పరిచయముగాని దర్శనముగాని నాకీవఱకును లభించిన భాగ్యములేదు. వారు అహేతుక పక్షపాతముతో నాకు తమ గ్రంథమును బంపి తొలిపలుకులు వ్రాయుమని నియమించినదే మా యిద్దఱి పరిచయమున కంకురార్పణము. ఆధునికాంధ్రకవిమండలములో వారిపేరుగూడ నేను చదివిన జ్ఞప్తి లేదు. మఱి వారింకేమైన గ్రంథములు రచించినారేమో యెఱుఁగను. తెలుఁగు దేశములో కవితలేనిది అవధానము లేదుగనుక, వీరి కిదివఱకే లభించిన 'కవిసింహ' బిరుదము 'అవధాని పంచానన' బిరుదమునకే ప్రతిపదమేమో యనికూడ నాకు సందేహము గలిగినది — అనఁగా ఈ గ్రంథమును చదువకమునుపు. దీనికి నా జ్ఞాన సంకోచము కారణమో లేక వారికవితయొక్క గజగర్భపద్ధతి కారణమో చెప్పలేను.

ఎట్లును ఆధునికాంధ్రసాహిత్యమందు నాకుఁగల యల్పానుభవములో మహాకావ్యమను పేరున కింతతగిన గ్రంథమును నేఁజూడలేదు. దీనిరాశియు పెద్దది; సుమారు ౩౫౦౦ పద్యములు. గుణము అంతకన్న గొప్పది.

విషయము శుష్కమగు చరిత్రము. శుష్కమనఁగా:— కథకు పనికివచ్చు ముఖ్యసందర్భములు కొన్ని మనమెఱుఁగుదుముగాని, కావ్య

---

† 'క్రొక్కాఱుమెఱుఁగులు' అను అనంతపురపు కవికుమారసమితివారి పద్యసంహితకు పీఠిక.

మునకు పనికివచ్చు వ్యక్తుల విశిష్టధర్మములుగాని, వారి నిత్యనైమిత్తి జీవితముతో మేళవించిన అసంఖ్య పరికరములుగాని, మన ప్రాచీనమహా పురుషులనుగూర్చి మనమెఱుఁగము. ఇప్పటికి మన చరిత్రజ్ఞానము వట్టి కొండగుర్తులగుంపు. రావణుని జంపిన రాముఁడు, ఆదిల్ ఖానుని జంపిన కృష్ణదేవరాయఁడు, అఫజుల్ ఖానుని పులిగోళ్ళతో అక్కఱచీల్చిన శివాజి, వీరికి పరస్పర వ్యక్తిభేదమును గల్పించుకొనుట చాలకష్టము. దుష్టశిక్ష ణము, శిష్టరక్షణము, ధర్మనీతి మతముల నుద్ధరించుట, అసిధారావ్రతము గా సత్యము, సౌశీల్యము, ఔదార్యము, శౌర్యము, మొదలగు మహా తత్త్వములను పాలించి యాచరించుట, దానికై మితిలేని కష్టపరంపరలకు గుఱియగుట — ఇత్యాదిప్రధాన స్థూలభావములతోనే మనచరిత్రమహా పురుషుల వ్యక్తిసత్యాపనము మనమిప్పుడు చేసికోవలసియున్నది. కాని యింతమాత్రపు మూలద్రవ్యముతోనే మహాకావ్యము రచింపవచ్చునను తత్త్వమును ఈ శివభారతము వెల్లడించినది.

అసాధారణమగు తమ శీలసిద్ధులచే కావ్యరచనోత్సాహమును గల్గించు మహాపురుషులు మన హిందూదేశచరిత్రలో పలువు రున్నారు. ఆయుద్రేకమునకు లోఁగి యెందఱో ఖండాఖండకావ్యములను రచించి నారుగూడ. కాని, ప్రాయికముగ వారికావ్యములందలి వ్యక్తులకు జీవకళ మందము. వ్యక్తులు కథాసూత్రములను నడుపుదురుగాని, యందలి బ్రదుకు తాము బ్రదికినట్లుగాఁదోఁపరు. మఱియు ఇట్టిరచనలలో గ్రంథకర్త లకు కథానాయకులందు భక్తిగౌరవములు, వారిశత్రువులయెడ ద్వేషా సూయలును కృతినిర్మాణమునకు మూలసాధనములుగా నుండును. పై భావము లెంతన్యాయ్యములైనను వాని యుద్రేకమును చాలవఱకు హద్దులోనుంచని యెడల అవి, కవికి కావ్యనిర్మాణమున ముఖ్యముగా వలసిన ప్రశాంతచిత్తమునకు, దాని ఫలమగు ప్రతిభావికాసమునకును-

ఉద్దుగా పరిణమించి పని చెయుచును. "నానృషిఃకురుతేకావ్యమ్" అను వ్యతిరేక విధి కిదే భావమని నా తలఁపు. శాంతిసిద్ధి కలవాఁడే ఋషి. అది కలవారందఱును కావ్యకర్తలు కాలేరు కాని, కావ్యకర్తకుమాత్రము ఋషిత్వసిద్ధి లేనిది వాని చేతినిర్మాణమునకు మహాకావ్యమను పేరురాద నుట మాత్రము సత్యము.

ఈతత్త్వమునకు ప్రథమోదాహరణము మనలో తిక్కనసోమయాజి. అతఁ డుపాసించిన హరిహరనాథుఁడు 'శాంతమూర్తి'. అతనిది 'భేదము లేనిభక్తి'. భేదములేమియే శాంతిపరిణామము. ఫలము ఆనందము. ప్రతి పర్వాంత మాలినీపద్యము కడపటి పాదమందలి హరిహరనాథ సంబోధ నలందు ఆనందశబ్దము తప్పక ప్రయోగించి యీ తెలుఁగు మహర్షి తన జీవితమందలి జీవకళను వెలిపెట్టినాఁడు. 'వైదికమార్గనిష్ఠమగువర్తనము' నందే యుండియు లౌకికప్రపంచమందెల్ల నిరర్గళముగ తేజరిల్లినాఁడు. కావుననే ఆయన ప్రళయసాగరమువంటి మహాభారతపు మహోద్రేచక భావకల్లోలములలో నెమ్మదిగా, ఏక్షోభయులేక, నిర్లిప్తుఁడై, నగుమొగ ముతో, కడముట్టనీఁదినాఁడు; మనల నీఁదించుచున్నాఁడు. ఏ సన్నివేశము ను వర్ణించినను, ఏపాత్రమును చిత్రించినను, ఏధర్మముచు నిర్వచించినను ప్రతిపద్యమునందును తనదే యొకముద్రవైచి, ఒకటేవిధమగు శయ్యతో ఎగుడుదిగుళ్ళు లేక పదునైదు పర్వములు రచించి, ఇంతటి మహాకార్యము కడపట, పూర్ణకార్యసిద్ధునికి, చిత్తశుద్ధునికి సహజమగు గాంభీర్యముతో

'హరిహరనాథ! సర్వభువనార్చిత! నన్ దయఁజూడు మెప్పుడున్'

స్వర్గారోహణ పర్వము. ప. ౯౭.

అని యొకచిన్నమాటతో తిక్కన తనచేతులు దులుపుకొనఁగల్గుటకు నిజమైనమూలము, సహజమగు నాతని ప్రతిభారత్నమును సంస్కరించి సానఁబెట్టిన యీ యానందానుభవమే.

ప్రకృతగ్రంథమునకు 'శివభారత' మని పేరుపెట్టిన శ్రీగడియారము వేంకట శేషశాస్త్రిగారు పైతత్త్వమును చాల గౌరవించినారనుటకు దీని యందలి ప్రతిపద్యమును సాక్షిగానున్నది. భారతకథవలె శివాజి కథయు ప్రతి హిందువుయొక్కయు చిత్తవృత్తి నుడికించి సివమెత్తఁజేయునట్టిది. కథచెప్పువారును వినువారును వివేకమును గోలుపోవుట యిందు చాల సులభము ఈ సాహసకార్యమునకు చేయివేసినను వీ రాశ్రయించినది పూర్వసూరిక్షుణ్ణమగు ఘంటాపథము. నడచునప్పుడు కుడియెడమల నుండు సందుగొందులు చూచుటకేకాని చొచ్చుటకుఁగాదు. ఇందు అసహ్యములగు తూగడింపులుగాని, వికారములగు పరువులు గంతులు గాని చేయవీలులేదు. పాత్రములాడు మాటలన్నియు అచ్చుకట్టుగా ఆలోచించినవేతప్ప ఆక్రోశపు టధికప్రసంగములు గావు. అక్కఱలేని అర్థముకాని చక్కందాలు లేవు. ఇందలి వ్యక్తులు, చిక్కఁదనము చక్కఁదనము గలిగి, సందర్భమునకు స్వరూపమునకుఁ దగినట్లు చెప్పవలసిన వన్నియుఁ జెప్పి, చేయవలసినవన్నియుఁ జేసితీఱును. చారిత్రవ్యక్తుల యాధిభౌతికస్వరూపము మనకిప్పు డెక్కువగా తెలిసికొన వీలులేదంటిని గదా, ఆలోపము విధిలేకయుందునుగలదు. కాని, కవిగారికి వారివిషయమున తీవ్రమై తలస్పర్శియగు ఆధ్యాత్మిక దృష్టికలదు గావున, పైలోపము మన మనస్సునకుఁ దగులదు.. కవిత్వమందలిమహత్త్వమున కిది యొక ప్రధాన సాక్ష్యము; పాత్రముల యాత్మల వర్చస్సును చిత్రించి, వారి భౌతిక స్వరూపము తెలియుదనుచింతయే మనకు పుట్టనీకచేయుట.

ఇందలి భాష ఛందస్సుకూడ పై చిత్తవృత్తినే చాటుచున్నవి. అందందు అపురూపముగా వాడిన సంస్కృత పదములు — సమాసములు చూచితిమేని ఆభాషయందు వీరికిఁగల గొప్పచొరవ స్పష్టమగును. కాని, యీరచనలో దానిని వీరు చాల అణఁచిపెట్టుకొన్నారు. తుద మొదలు నడకయంతయు తెలుఁగుపలుకుబళ్ళతోనే సాగించినారు.

'సంస్కృతముకూడ'దను బిగుమానములేదు సరిగదా, తెలుఁగు తమపనికి చాలదేమో యను పేదసందేహమును వీరికిలేదు. కనుకనే యీ భారతము భాష, గొప్పవర్చస్సుతో ప్రసన్నమధురముగా ప్రవహించు చున్నది. పలుచోట్ల 'తెలుఁగుకింత లగువుబిగువు కలదా'యని యాశ్చర్య పడునట్లుచేయు నుడికారము లిందుఁగలవు. కారణము ఈకవిగారు,

> "పాత్రమునఁగాక ప్రకృతిలోఁ బుటలు విప్పి
> పదములనుగాక భావముల్ పట్టి తరిచి"
>
> శివభారతము. ఆ. ౩ ప. ౨౧౭.

నవారు గావున. గ్రంథమంతయు నిందు కుదాహరణము గనుక వేఱుగా నిం దుదాహరించుట పునరుక్తిదోష మగును.

ఇందలి ఛందస్సు నాఁటినుండి నేటిదాఁక తెలుఁగు నాటిలో మెదిపి నిలిపినదే. అందును తిక్కనకు ప్రీతిపాత్రములగు చంపకాది చతుష్టయము, కందగీతములు, ఆటవెలఁది-ఇవిమాత్రమే వీరుగ్రహించిరి. క్రొత్తక్రొత్త మార్గములలో నడకలలో పద్యములనుప్రయోగించు పరీక్షా దృష్టి వీరికిలేదు. ఉన్నవి, వాడుకపడినవి, చాలునను వినయము వీరికిఁ గలదు. కావ్యమందలి రసభావసిద్ధికి ఛందస్సుగూడ ముఖ్యమైన సాధన మను కొందఱిసిద్ధాంతమున వీరికి నమ్మికలేదని తలఁచెదను. నామట్టుకు నాకు లేదు.

అనపేక్షిత విస్తరముగా ఈ పీఠికను పెంచుపాపమునఁ బోను. మహాకావ్యము ముందున్నది. సాంతముగా చదివి చూడుఁడని ఆంధ్రులను వేఁడుచున్నాను. అట్లుచేసినవా రానందింపకుండుట యసంభవమని, యసాధ్యమని నా నమ్మిక.

మైసూరు,
18-2-1943.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

Sri C. Ramalinga Reddy, KT.,

M. A., (Cantab.) Hon., D. Litt.,

VICE-CHANCELLOR, ANDHRA UNIVERSITY,

## PREFACE.

' *I have read the SIVABHARATHAM with great interest. It is an epic poem dealing with the life and achievements of a historical personage, namely, Shivaji the Great. The theme is thus very attractive, and the presentation of the theme does great credit to the Poet. It is a book which deserves wide popularity.*

GUNTUR,
8th April, 1943

*C. R. Reddy.*

## శ్రీ శ్రీ శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజు

"ధీరాగ్రేసరిమూర్తి, హైందవధరిత్రీ భాగ్య సత్స్థాపన
ప్రారంభుండు, దయాగుణాంబుధి, మహారాష్ట్రీయోత్తంసుండౌ-
వీరక్షత్రియమౌళి, దేశ మత గో వేదాది రక్షావ్రతి
శ్రీరమ్యుండు, భవానిభక్తుండు, శివాజీరాజు సామాన్యుడే!||

అతనిచరితము హైందవ। జాతిపారాయణము, భావిజగదభ్యుదయ
స్ఫీతము, ధర్మోపేతము। నీతిపథము, నిగమసూక్తి నిభమై వెలయున్||"

# అ భి ప్రా య ము లు.

"కళాప్రపూర్ణ" 'మహోపాధ్యాయ'

డాక్టర్. చిలుకూరి నారాయణరావు, అనంతపురము,

M. A., L. T., Ph. D., D. Litt.

"శ్రీ శివభారతము" - ఎంత చక్కని పేరు! 'శివ' ము మంగళాశాసకము;

'మూఁడవకన్ను నెన్నుదుట, ముమ్మొనవాలు కరమ్మునందు, శే
షేఁడు శిరమ్మునందుఁ జిగిరింపక, నాఁడనసూయయింటఁ బా
రాడినపాపఁడే మనగృహమ్మున' ... ... ... ...

భారతీయులగృహమ్మున — ఉదయించిన యపరశివునివృత్తాంత మితి వృత్తము. భవానీ కృపాదత్త కరవాల పునర్లబ్ధ భారతరాజ్యలక్ష్మీకము, ఆంధ్రమహాభారతమున నన్నయభట్టారకుడు వ్రాసినంత మహాగ్రంథము, మహాభారతవీరసంతతి అంతరించలేదని - ధర్మసంస్థాపనార్థ మవిరతముగా వీరపురుషు లీ భారతావని నుద్భవింపగలరని స్మృతిపథమునకు తెచ్చే ఉద్గ్రంథము — 'శివభారతము'.

శివాజీ 'కొండఎలుక' - వెక్కిరింపు! ఇంకానయము - చూరెలుక, చుంచెలుక - అనలేదు అయ్యలు! కడుపుమంట - చేతగానితనము - ఓర్వ లేమి! అంతే. కానీ, ఒకవిధముగా ఒప్పుకొందాము - శివాజీ 'కొండ ఎలుకే' - అంటేకొండంతఎలుక - వినాయకుని దివ్యవాహనము - మహా పర్వతములను దొలిచి క్రుంగజేయగల ఎలుక; చెదపుట్టలను దొలిచి, అందలి విషసర్పముల కాస్పదములేకుండ చేయడము దాని కెంతటిపని! చేసినది, మరుగునకుపోయినది, నిద్రపోతున్నది. సమయమువచ్చినపుడు మేలుకొంటుంది —— మరొకరూపముతో.

సనాతనధర్మ పునరుద్ధరణమునకు కంకణముగట్టి పరిశ్రమించిన

వారిలో రాజపుత్రులు — తరువాత మహారాష్ట్రులు ముఖ్యులు. ఇద్దరును భారతచరిత్రములో మహాప్రఖ్యాతి పొందినవారు. కాని, ఒకరు కృత కృత్యులు కాలేరు; కాలక్రమమున శత్రువులకు వశులై, పరరాజ్యాభివృద్ధికి పట్టుగొమ్మ లయినారు శత్రువులను ధిక్కరించి, శౌర్య సాహసములను వెలయించి - అంతరించినవా రంతరించగా మిగిలినయోధులు పరులసింహాసనముమ్రోల మోకరించి, తల వంచినారు. భారత నారీ ధర్మమును నిలుపుటకై అగ్నియందు ప్రవేశించిన వీరపతివ్రతలు గతింపగా కొందరు రాజపుత్రస్త్రీలు మొగలు జనానాలో ప్రవేశించినారు. అది కాలమహిమ. దానికి 'మొండితెగువ' కారణము.

మహారాష్ట్రు లట్టివారుకారు వారు రాజపుత్రులవలెకాక 'సమయ మోర్పుఘనులు.' వారికి 'మోటుతెగువ' లేదు. 'అడఁగుఁగాక, పేడి యగుఁగాక, పెనువీఁక నాలఁ ద్రిప్పువాఁడె యర్జునుండు'. పరాపహృతమైన భారతభూధేనువును త్రిప్పి శివాజీ అర్జునుడై, నాటి భారతోదంతము నవిచ్ఛిన్నముగ సాగించినాడు - కృతకృత్యుడైనాడు. ఒకొక్క మహారాష్ట్రుడు ఒకొక్క భారతీయుడు తనయంతటివా డగుటకు వలయు దీక్షాబీజములను వెదజల్లి నిష్క్రమించినాడు.

శివుని హృదయకోశము చిన్ననాటనే విరిసి వాసనల విరజిమ్మినది.

'ధీరహృదయంబు హృదయముల్ దెలుచుచూపు,
పలుకుపొందిక, పొందికపలుకు తెలివి,
ధర్మభంగాసహిష్ణు వర్తనము బెరయ
విరిసి, యెల్లరమదులఁ బుష్పించె శివుఁడు'

శివునికి యవనులపై అసూయ లేదు. భారతభూమి సకలప్రపంచమునకు ఆతిథ్య మీయగలదు. కాని, ఆతడు 'నా' 'నీ' అనేభేదములమూలమున ఒకతెగ కన్యాయము జరుగడమును సహించలేదు.

'యవనుల్ హైందవు లన్న భిన్నత నసూయం జూపఁగా లేదు, తా

మెవ కీరాజ్యము నేలినఁ దగవు లేనేలేను; 'సీ' 'నా' యటం చవకాశమ్మునుబట్టి యొక్క-తెగ కన్యాయంబు గావింప, 'నా నవు' నం చూరక 'వంతుపాటపని' సేయంజాలఁ' — డాతడు.
ఈ 'వంతుపాటపని' జరుగునప్పుడు సంఘర్షణము, అగ్గి, కార్చిచ్చు కలుగుతూఉంటవి. భారతావనీపాలకు లెవరైనా ఇట్టి విపరీతపరిణామము కలుగకుండా చేయడమే నీతి.

నిజమైనకావ్యమునకును పరబ్రహ్మమునకును పోలిక గలదు. ఆపరబ్రహ్మము, 'శాంతము, శివము, సుందరము' గా మహర్షులచేత నిర్దేశింపబడినది. ఆవిశేషణములకు 'సత్య' మనే విశేషణమును ముందుగా చేర్చుకోవలసిన దనికూడా వారి ఆశయము. కావ్యవిషయమున నవి 'సత్యము, శాంతము, సుందరము, శివము' అనేవరుసతో అనుసంధానము పొందవలెను.

'శివభార' తేతిహాసము సత్యమైనది. ఆకథ ఏనాడో జరిగినదై ఉంటే, పురాణము - కట్టుకథ అని విపరీతవిమర్శకులు త్రోసిపుచ్చేవారు కాని, అదిమనకన్నులయెదుట పొడగట్టుతూనేఉన్నది. చరిత్రము దాని యాథార్థ్యము నుద్ఘోషిస్తూనే ఉన్నది.

'శివభారత' మహాకావ్యమునకు 'శాంతము' స్థాయి. మహాగంభీర జలధి ఎంత ప్రశాంతస్వరూపము గలదో ఇదిన్ని అట్లే. కాని, ఆజలధి అంతర్భాగములోని సంక్షోభ మనిర్వాచ్యము. శివాజీచరిత్రము, అతని కాలపుచరిత్రము సంక్షోభపూరితమైనది. కాని, ఆచరిత్రమునకు సంపూర్ణచిహ్నముగా వెలసిన శివుడు తొనుకుబెనుకులు లేనివాడు. అట్టి స్వరూపమును ధ్యేయముగా చేసికొన్నకవియు నట్టివాడే. అట్టివాడు కాకున్న నిట్టి కావ్యసృష్టి కలుగజాలదు. ఈ ధ్యానశివస్వరూపము శాంతము, నిర్మలము, ప్రసాదగుణభూయిష్ఠము. ఆశాంతమూర్తి, ధ్యానశివ

మూర్తిహృదయమో! ఎవరుచెప్పగలరు? ఆధ్యాసమునకు ప్రయో జనము — త్రిపురాసురసంహారమా? హైమవతీ పాణిగ్రహణమా?

'శివభారత' మొక సుందర కలాసృష్టి. నవయౌవన సుందరమూర్తి ఆంధ్రభారతి కవిహృదయమున రూపమునొంది, సకలసంస్కారములను సంతరింపించుకొని, సారస్వతరంగమున కెక్కినది. ఆమె ముంజేతిచిలుక ముద్దులుమాటగట్టు తెలుగుపలుకులను మురిపముతో ముచ్చటిస్తున్నది. ఆమెముఖము నిగమసూక్తుల గానముచేస్తూ ధర్మోపన్యాసము కావిస్తు న్నది. ఆమెచేతియందలి అక్షమాల భారతధర్మ మననధ్యానాదుల జేయ వలెనని భారతీయుల నుద్బోధిస్తున్నది. అమె యొయ్యారముగాగ్రహిం చిన వీణనుండి మంద్ర, మధ్యమ తార భేదములతో 'సరిగమపదనిస' స్వరములు భావపూరితములై బయలువెడలుతూ లోకమును సమ్మో హితము జేస్తున్నవి. ఆమె మరియొకచేతియందు ధరించిన ఆ పుస్తకమే 'శ్రీ శివభారతము.'

భావము, ఔచిత్యము, అలంకారము, రసము రీతి, పాకము, శయ్య, ఉక్తివిశేషము, వక్రోక్తి, స్వభావోక్తి, ధ్వని ఆలంకారికు లేవేవి కావ్య మునకు ప్రాణమని వేర్వేరుమాటలతో నిరూపించినారో వాటికన్నింటికిన్నీ ఉదాహరణములు కావలెనంటే 'శ్రీ శివభారతము' ను చదువవలెను. ఒకొక్కఆశ్వాసము, దానిలోని ఒక్కొక్కఘట్టము, ఒకొక్కఘట్టములోని ఒకొక్కపద్యము, ఒకొక్కపద్యములోని ఒకొక్కపదముకూడా ఔచిత్య మున తూగి ఆనందమునకు దోహదమిచ్చిన వీ 'శివభారతము' లో.

ఇట్టికావ్యములే ప్రపంచమునకు 'శివ' మును ప్రసాదించేవి. 'సివ' మెత్తించే గ్రంథములు ప్రపంచసారస్వతములో బయలుదేరినవి, బయలు దేరుతున్నవి. అవి సూత్రముతెగిన గాలిపటములు. గాలి యెటువీస్తే అట్లాపోయేవి. వాటికొక ధ్యేయము లేదు. అవి వినోదమును కలిగించిన కలిగించవచ్చును. అంతేవాటిప్రయోజనము,

పైనిఁవ్రాసిన వతిశయోక్తులు కావు; స్తుతివాక్యములు కావు. ముఖస్తుతిచేసే స్వభావము నాకు లేదు. ఒకసారి కాదు, పదిసార్లు గ్రంథ మును చదివినతరువాత, ఒకరుచదువగా విన్నతర్వాత, నాకు కలిగిన తలపులకు ప్రతిధ్వనులవి. కవి నాకు పూర్వపరిచితుడు కాడు. అతనిని స్తుతించుటవల్ల నాకు కలుగబోయే ఐహికలాభమున్నూ లేదు. నాదృష్టి పథమున - ఎవ్వరిదృష్టిపథమునను అత డితఃపూర్వము పడినవాడుకాడు. పడ నాసించినవాడు కాడు. ఇంకా ఎంతమంది ఇట్టి మహాకవు లాంధ్ర లోకమున నొదిగివున్నారో! ఇంకను ఎంతటి మహాకావ్యములు సృష్టి నొంది, ఏమూలల నణగిఉన్నవో! వానిని బయటికితెచ్చి, చదివి, ఆంధ్రులు ధన్యులగుదురుగాక!

---

## శ్రీ విశ్వనాథ, సత్యనారాయణగారు, బెజవాడ.

తమరచన మధుర గంగాస్రవంతి. మీవస్తువు నేటిభారతహృదయ నిష్ఠమైనది. బహుచరిత్రగ్రంథ పరిశోధనయు, ధర్మశాస్త్ర పరిశీలనా విష యములు పొందుపరచుటయు, ననేకములైన యచ్చాంధ్ర పదములపొందిక యు మీ మేధాపటుత్వమును మీయందలి కవిశబ్దాన్వర్థతనుజాటుచున్నవి. ప్రత్యేకముగా నాకు "బాజీప్రభుకథ" యు 'తానాజీ మరణమున శివాజీ దుఃఖమును' రమ్యతమములుగా నున్నవి. ............ మహారాష్ట్రి బహ్మనీసేనల గెలుపులు 'ఏతము త్రొక్కినట్లుగ' ఉన్నవి యన్న మీయుపమ పరమ స్వతంత్రము రమ్యతమమైయున్నది. మీ పద్యరచన ఒక తేనె కాలువ. అనేకశబ్దము లుపయోగించుటలో, ఔచిత్యమెఱిగిన స్వాతంత్ర్య మవలంబించుటలో మీరు నిజమైనకవు లనిపించు కొందురు. "సతాం సద్భి స్సంగః కథమపిహి పుణ్యేన భవతి." మీ దర్శనము తాదృక్పుణ్యావి శేషము నాయందున్నచో నెప్పుడో కాక పోదు.

---

శ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారు, గుంటూరు.

మ॥ సుకవీ! వేంకటశేషశాస్త్రి! యమృతస్రోతస్వినీ స్నిగ్ధ తా
వక దివ్యచ్ఛివభారతంబుఁ గవితాస్వాధ్యాయితన్ బూని, పీ
ఠికయున్ నాంది నుపస్పృశించి తమి రెట్టింపన్, శరత్సాంద్ర చం
ద్రికలన్ దూఁగుచుఁగూడఁ గూర్మిగొన కర్థిన్ ద్రాగుమన్ దోఁగు
దున్॥

చ॥ చిరకవితా తపోఽర్జ్జ రససిద్ధిఁ దరించిన సంస్కృతాంధ్ర భా
సురకవిరా ణ్మహాంశ శతశోభ శుభాకృతి శేషశాస్త్రి ధీ
వరుఁడయి పొల్చి, నేఁడు శివభారతమున్ వెలయించెఁ, గాదనన్
బరగునె యీ యనన్యగుణమాధురి యింత యపూర్వవైఖరిన్॥

సీ॥ ఆకాశగంగా మహాప్రవాహావగాహాఖండసుఖ మబ్బినట్టులయ్యె
మలయమారుత సముచ్చలిత దుగ్ధాబ్ధి భంగాగ్రడోలల నూఁగినట్టు
లయ్యె
అచ్ఛానవద్యామరానోకహ ప్రసూనాస్రవద్రస మాని నట్టులయ్యె
ఘనసారపాంసు ముక్తాచూర్ణ పూర్ణ దివ్యతల్పములఁ బొర్లినట్టులయ్యె

గీ॥ మ్రుచ్చుకైతల మెచ్చఁగాఁబోని నాకు, నీ శివాజీప్రబంధ వాణీప్రసన్న
రసవిశేష నిషేవణావసరమందు, నోకలాపూర్ణ! శేషశాస్త్రీ!
కవీంద్ర!॥

శా॥ చారిత్రంబో ప్రబంధమో ప్రధనశిక్షా సంగ్రహంబో యలం
కారగ్రంథమొ ధర్మశాస్త్రమొ కలాంగంబో మహాభారత
శ్రీ రూపాంతరమో! యెఱుంగునెవఁ? డో శ్రీ శేషశాస్త్రీ! కళో
ద్ధారా! నీ శివభారతోరుకృతి యాథాతథ్య మభ్యూహ్యమా॥

చ॥ అమలినభావనిర్వృతి కథాన్వయవిస్తృతి చారుకల్పనో
త్తమస్మృతి వాక్చమత్కృతి స్వతంత్రత వాక్యపదార్థతోలన
క్షమత రసానుసంఘటనచాతురి మున్నగు కావ్యశిల్ప ని
స్సమ గుణ సంపదున్నతి నిసర్గజమౌఁగద నీకు సత్కవీ! ॥

ఉ॥ పాయని వేషభాషల శివాజిగ బాజిగ షాజిగా జిజా
బాయిగ సాయిబాయిగ నవాబ్జిగ దాదోజి ఖాండదేవుగా
నా యవురంగజీబుగ సమర్థుఁడుగా నెటు మాఱుచున్న నా
ప్యాయ మొసంగు నీ యవికృతాకృతి నీకృతిఁ గాంతు నోకృతీ!॥

ఉ॥ రాసిరి మించురాణ శివరాణ్మణి భారతధర్మ వీర సిం
హాసన మెక్కువేళ నభయార్థిత వేడ భవాని వాని కా
శాసనతన్ 'తథా' స్తనుచుఁ జాటినమాట భవత్ప్రబంధ వి
న్యాసముచేఁ బ్రతిధ్వనితమై ధృతిఁ గూర్చుత భారతోర్వికిన్॥

శా॥ ఏకాంశంబున మున్ను దాల్చిన యసంఖ్యేయావతారంబులం
దే కించిన్మహిమంబొ సూపిన త్రిలోకేశుండు సర్వాంశ సు
శ్రీకైకాకృతి శ్రీ శివాజిగ ధరిత్రిన్ బొల్చి చాటెన్ బ్రభా
ప్రాకట్యంబని విన్చు నీసుకృతి విశ్వశ్లాఘ్యమో సత్కవీ!॥

చ॥ నవ నవనీత దివ్య సుమనస్స్మృతి సిద్ధ సుధాద్రవోప మం
బవు భవదీయ భవ్య బహుళావ్యయ నవ్య శివాజి కావ్యగౌ
రవము మహత్తరంబయి తిరంబయి యంబరచుంబితర్థి నా
రవి శశితార మిమ్మహి విరాజిలు నోజ శివాజి తేజుతోన్॥

ప్రతిభానుత్తమవృత్తమౌ యల మహారాష్ట్రానువిద్ధంబు, స్వా
ర్జిత సామ్రాజ్యుఁడు నాయకుం డిఁక శివాజీ చ్ఛత్రరాణ్మౌళి, సం
భృత వాగ్భారుఁడు శేషశాస్త్రికవి; లో కొందింక! నో యాంధ్రభా
రతి! యేత చ్ఛివభారతాకృతి మహార్హప్రౌఢి భోగింపుమా!॥

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం, సికింద్రాబాదు.

క॥ చదివితి మీ శివగీతము । పొదుగున మొగమిడిన లేఁగపోల్కిఁ; దదీయా
స్వాదనామల పరిమళములు । చిదిమెను నాతమ్మిమొగ్గ శేషయ సుకవీ!॥

క॥ అక్షయలీలా పరమ వి । లక్షణ యీజగతి; తదమల స్తన్యరుచుల్
నిక్షేపింపఁ గలిగెఁ గవి । ద్రాక్షా మధురాక్షరముల రససిద్ధుండై॥

క॥ అంగీయందదు కర్మలఁ । బొందీపొందదు తపోవిభూతుల నే యా
నందం బది కవికోకిల । కుందవచస్సులను నిలువుఁగొను శేషకవీ!॥

క॥ అవితథ మధురోపాసన । దవిలిన కవి భావనాపథము రసియింపన్
గవితారసాలమునఁ బ । ల్లవించె నశరీర మంగళ బ్రహ్మకళల్॥

క॥ నవనవములు కల్పన, లభి । నవ సుభగములైన భావనలు తరళింపన్
భవదీయకవిత హాయ్యం । గవీనమటు పరిమళించుఁగా శేషకవీ!॥

---

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, సూరవరం.

( శివభారతవర్ధంతికిఁ బంపినయాశీస్సులు. )

శా॥ నాకం బెట్లు గడుఁజిన్నలో మతియొకింతన్ బెద్దలోగాని ము
క్కాఁకల్ దీఱిన జ్ఞానవృద్ధులనుచున్ గ్రంథంబె మిమ్ముల్ సహ
స్రాకారంబులఁ జెప్పు; నే నిపుడు మి మ్మాశీర్వదింపన్ బహిః
ప్రాకారంబున కెక్కు టొప్పిడినొకో! వాక్ఛేష! శేషాహ్వయా!॥

క॥ మఱి కాదు కూడదని మీ । రెఱుఁగక బలవంతపఱతురేని 'తథాస్తు'
చుఱికెద నిదె 'యన్యోన్యం । గురవో విప్రా' యటంట గురిగాఁ గొను
చున్॥

శా॥ ఆశీర్వాదము నే నొనర్చుటది యే మంతో విశేషంబు! ది
గ్దేశాభ్యర్హిత యావదంధ్రవసుధా ధిష్ఠానవ ద్వశ్య వా
గీశానంద మరందసుందర మహా హృద్వీణయా వాణియే
యాశీర్వాదము లిచ్చుచున్నయది గాదా! శేషశాస్త్రీ! సుధీ!॥

శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడుగారు,
స్నేహలతా కవితాసంఘము, శ్రీ జటప్రోలుసంస్థానము, కొల్లాపురం.

చ॥ పలుకులు కండచక్కెరలు, భవ్యము లేరచనావిధాన కృ
తులు, రసపోషణం బమృతతుల్యము, పోకడలెల్లఁ గ్రొత్తలై
తేఁపులఁదన్ను, భావము ముదంబిడు, నింతటి గోస్తనీఫలం
బులఁ దలపించు కైతవలపుల్ మెఱపుల్ దలఁపంగ వచ్చునే!॥

ఉ॥ ఆఁగకయాడునట్టి గడియారమువోలె క్షణంబుగాని చే
యాఁగక కైతవ్రాయు గడియారము వేంకటశేషశాస్త్రి మే
ధా గరిమంబు - దివ్యకవితారుచి వేఱ వచింపనేల? కా
వ్యాగమ సర్వసార సుగుణాకర మీకృతి యొండు చాలదే!॥

ఉ॥ వీరులలోన మేటియగు వీరుఁడు శ్రీ శివరాజమౌళినిన్
గూరిచి యొక్కకావ్యము మనోహర భావపదార్థ బంధమున్
సౌరభమెల్లచోట్ల వెదఁజల్లెడు క్రొవ్విరజాజిదండయో
తీరున వ్రాసినట్టి కవిధీరు ఋణంబు నెవండు తీర్చెడిన్॥

ఉ॥ పేరునఁ బెక్కుగ్రంథములు పెద్దగఁజేసి రచింపవచ్చు, నీ
వీరచరిత్ర కుద్దియనిపింపఁ బ్రబంధము వ్రాయవచ్చునే?
పారముతేనివిద్య, ప్రతిభా బలమున్, గవితావిభూతి తో
డై రచియించెఁగాక మహితాత్ముఁడు శేషయశాస్త్రి యీకృతిన్॥

ఉ॥ భారతగాథవోలె శివభారతమున్ నుతికెక్కఁజాలు శో
భారమణీయకావ్యము; శివాజియు హైందవధర్మరక్షణో
దారుఁడు; తిక్కనార్యు నవతారమ యీకవి; యీప్రబంధ మి
ద్ధారుణిఁ దెల్గువారలకు దారినిఁజూపెడు దీపమయ్యెడిన్॥

చ॥ సరస పదార్థ భావ గుణసంపద పొంపిరివోవునట్లు గా
విరచనచేసినట్టి కృతి విశ్వజగన్నుతమై తనర్చు; న
క్కరణి రచింపఁబడ్డ ఘనకావ్యమ యీ శివభారతంబు భా
స్కర శశితారకాగణ వికాసముఁ గల్గెడి దాఁక వెల్గుతన్॥

విద్వాన్, శ్రీ జోస్యం జనార్దనశాస్త్రిగారు, తాడిపత్రి, (అనంతపురం జిల్లా)

మ॥ శివలీలా మహిమావిశేషముల నాశేషుం డశేషంబుగా
వివరింపంగ నశక్తుఁడయ్యెనఁట తా వేనోళ్ళవాఁడై; యదే
శివలీలా మహిమా విశేషముల నిశ్శేషంబు వేనోళ్ళ వాఁ
డవుగా, నెట్లు రచించితౌర: కవిసింహా! శేష విద్వన్మణీ!॥

ఉ॥ తోఁచినరీతిగాక సరితూఁచినరీతిగ దేశకాల పా
త్రోచిత సూచితాశయ నిరూపణ లోకముహెచ్చరించి, యు
ద్వాఁచఁగ గంటగొట్టుటకు నూఁది 'అలారము' గొట్ట దిట్టయా
నాచతురత్వమెల్ల గడియారమువారికి నైజమేకదా!॥

చ॥ మనమున నిక్కగాటమగు మక్కువపేడని పూర్వజన్మ వా —
సనవెలిగా — నదేకవనశక్తి, యదేగుణరక్తి, యయ్యదే
యనుపమదేశభక్తి యెట్టులబ్బును రాయలసీమఁ బుట్టువం
దిన యలనాఁటిభారతపుఁ దిక్కనవే మొకొ శేషసత్కవీ! ॥

సీ॥ ఎల్లకాలము తన చల్లనినీడలఁ బధికాధికశ్రమ పాపఁజాలు,
నలుదెసల్ పరువాఱి నకనకల్ బడి మేఁతకై చేరు కవికోకిలాశ్రయమగు
రాయలసీమ సారస్వతాశ్రమవనంబు రాగపల్లవ సుమరాజితముగ
లాతి పూఁదేనెల మూతిముట్టఁగవచ్చు సరసాళులకుఁదృప్తి సంతరింప

తే॥ మాఱుతల్లుల యేవపు మాటపోటు
కెంతయునుగుంది పిల్లకోయిలలు పోత
రించి తమకుత్తుకల్ సవరించుకొనఁగ
నొదవెఁ "గవితావసంత" భాగ్యోదయంబు:॥

---

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు,
పల్లిపాలెము. (వయా) కాకినాడ.

......"1943 లో శ్రీ శివభారతము వెలువడినది. ఆ కృతిచూచి తెలుఁగు మహాకవులెల్లఁ దెలతెల్లవోయిరి. 'ఇట్టిమహాకవి ఈ వరకుఁ బుట్టలేదని కాదు- ఇన్నాళ్లదాఁక నీకవితావసంతుఁ డేసందులో డాఁగి యుండెనని క్రమముగా నేఁటికి గడియారము శేషశాస్త్రి నెఱుఁగని

పండితుఁడు, తెలియనికవి. వినని తెనుఁగు రసికుఁడు లేఁడనినచో నమ్ముఁడు; ఆయన శివభారతకవిత సాహిత్యసభలలో గానము చేయుచున్నారు. హరి కథలలోఁ బాడుచున్నారు. పురాణముగాఁ బారాయణముగావించుచు న్నారు. నేను విన్నంతలో కన్నంతలో శేషశాస్త్రిగారి శివభారత మరసి శిరఃకంపముగావింపనివాఁడు లేఁడు, నేఁడు శాస్త్రిగారి యీాడు అయిదవ పదిలోనున్నది. శివభారత మించుమించు నాలుగు దశాబ్దుల భారతీతపస్సు పంట. శతాబ్దులు సహస్రాబ్దులు తెలుఁగువారి కడుపులు నిండించు రాయ లసీమ పంట, గ్రంథకర్త విజ్ఞప్తియిట్టులున్నది.

"......ఈ గ్రంథరచన వఱకు నదియొక కవితాతపస్సు. మూఁడు పర్వముల ప్రాయముతో అరణ్య అజ్ఞాతవాసముల సంస్కారముతోఁ బక్వ మైన భారతగాథ. అది సోమయాజి కవిత్వమున ఉత్తరగోగ్రహణముతో విధిగా నీ శివభారతరచన యారంభమైనది. ఇంతయు ధర్మదేవతా వరప్ర సాదము. అప్పటి నాయితరకృతులు లోకమెన్నఁడో చదువవచ్చును. నా కవిత్వమునుపేర నిప్పటికి శివభారతము చాలును......"

ఈ పలుకులు విలువఁగట్టలేనివి. శివభారతకృతియెల్ల నొకయెత్తు- ఈ యక్షరములన్నియు నొకయెత్తును. ఇది చిత్తశుద్ధిగా వ్రాసినమాట. వారికృతి పూర్తిగఁ జదివిచూచి నాలో నేననుకొంటిని:- "శేషశాస్త్రి గారూ! నన్నయమూర్త్యంతరమగు సోమయాజులా మీారు? కవిత్రయ భారతమువలె 'జగములున్నంతవఱకెల్ల జనులు చదివితనియుటకు' శివాజీ ప్రబంధము రచించి శివభారతమని పేరుపెట్టుకొంటిరా? ఎంత గడుసుద నము! అవును. తిక్కన భావనాశక్తి, పలుకుబడిసొంపు, కళావేత్తృత, రాజకీయ పరిజ్ఞానము మీారొక్కరే దక్కించుకొంటిరి కాఁబోలు! కానిచో గ్రంథాది విజ్ఞప్తిలో నటులు వ్రాసికొనుట కెన్నిగుండె లుండవలె! అని... ... శివభారతము ఆదినుండి తుదిదాఁక నొకేతీరుఁదీయ్యముగల కవితలో సాగినది. గ్రంథమంతయు రసఘుటిక. జాతీయపుదుడులు వాడుటలో, చిక్కనిపలుకు లేరికొని పొదుగుటలో, వైపువాటము లెఱిఁగి పద్యములు నడుపుటలో, నడుమ నడుమఁ బానకములో మిరియపుఁ బలుకులవలె సం స్కృత పదములు సంతరించుటలో, నాఁటినేఁటి రాజ్యాంగ రహస్యములు

సమన్వయ పరచుటలో, ఔచితి పాటించుటలో శివభారత కవికిఁగల జగ
జాణతనము మనతెనుఁగు నేలలో నీనాఁడు పలుచగ నున్నదనుటకు
సాహసింతును. ఉభయ స్కంధముల బలిమితో సారస్వత సాగరము
లోఁతులు ముట్టి రసామృత కలశమును జేపట్టిన భావుక కవులలో మన
శేషశాస్త్రిగారు ఒక భావుకమహాకవి. ఇందులకు శివభారతమే జెండా
యెత్తి నిలఁబడును......"

## "THE INDIAN LITERATURES OF TODAY"

Published for the P. E. N. All India centre, Bombay.

Page 171.

"Sri Gadiyaram Venkata Sesha Sastri of Proddatur, Cuddapah District, is the proud author of SIVA BHARATAMU, a work which next to the Mahabharata of Tikkana of seven centuries ago stands in volume, poetic excellence and scope as the greatest living monument of the present age and of the ages that have preceded it. If the Mahabharata is the story of heroes who have receded into the hoary past, the Siva Bharatamu is the story of modern Bharatavarsha and of the master of the present Bharatavarsha, namely Sivaji the great, who established the great Maratha empire as a bulwark against alien culture and alien domination. Parallels in incident and treatment can be found in plenty between the two great works. This achievement of Sesha Sastri has taken Telugu literature back to the eminent heights from which it had its source. The Andhras have rightly placed the kavi ganda penderamu,' the envied golden anklet on his foot in appreciation of the service done by him to Telugu poetry."

శ్రీ

# విజ్ఞప్తి.

---

ఆవిష్కరణమైన యేడాదిలోపలనే శివభారత ప్రతులన్నియుఁ జెల్లిపోయినవి. అది తెలుఁగువారి రసికత్వమునకు గుర్తు. ఈ నాలుగేండ్ల నుండియు నెందఱో చదువరుల కాశాభంగము కలిగించితిని, దానికిఁ గాలపరిస్థితి కారణము. రెండవకూర్పుతో శివభారత మందఱి యందుబాటునకిచ్చి, ఈ వసంతోత్సవము సార్థకపరచినవారు, శ్రీ శ్రీ తిక్కవరపు రామిరెడ్డి మహోదయులు; ఆ విశేషమంతయు వారి "యశోదార్యపతాక"లో విస్తరింపఁబడినది. శ్రీవారి యుచితజ్ఞతా గుణజ్ఞతా రసజ్ఞతలు తెలుఁగువారికి దివ్యజ్యోతులై వెలయుఁగాక! వారిసంతానము తరతరమ్ములవెంట శాశ్వత సారస్వతోద్ధరణ దీక్షాదక్షులై భోగభాగ్యములఁ బుష్పించుగాక!

శివభారతము చదివి యానందించుటేగాక, దానిని హరికథగఁ బురాణముగఁ బారాయణముగఁ బ్రమాణగ్రంథముగ నుపయోగించుకొని యాంధ్రలోకము నారచనఁజరితార్థము చేసినది. ఆంధ్రపత్రిక. ఆంధ్రప్రభ, కృష్ణ, త్రిలింగ, రేనాడు, భారతి, అభినవసరస్వతి, పి. ఈ. యన్. మున్నగు పత్రికలు తమ యమూల్యాభిప్రాయములతో శివభారతమును నాల్గువైపుల సుపరిచితముఁజేసినవి. శ్రీ విశ్వనాథవారు, శేషాద్రిరమణకవులు, మధునాపంతులవారు, చిలుకూరివారు, గాడిచర్లవారు మున్నగు సారస్వతవేత్తలు వ్యాసములతోఁ బ్రశంసలతో శివభారత గుణగౌరవము బగ్గడించి తమయానందమును వెల్లడించిరి. మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయములు పాఠ్యగ్రంథముగ నియమించి గౌరవించినవి. చెన్నపురి, కొల్లాపురం, తాడిపత్రి, ఆదవాని, ఎమ్మిగనూరు, యాడికి, నంద్యాల, హిందూపురము, ప్రొద్దుటూరు, రాజంపేట, మదనపల్లి, పుల్లంపేట, ముక్త్యాల, (నవ్యసాహిత్యపరిషత్తు) నెల్లూరు మున్నగుపురముల విద్యా

సంస్థలు, సాహితీపరిషత్తులు, పౌరమహాజన సంఘములు, ఆహ్వానించి, బిరుదులతో, సేల్వాలతో, రజతపాత్రలతో, నూటపదియార్లతో, సన్మాన పత్రములతోఁ బ్రత్యేక సత్కారములు జరపినవి. కృష్ణదేవరాయపరిషత్తువారు హిందూపుర సేవామందిరమున శ్రీ కృష్ణదేవరాయల విజయోత్సవ వసంతోత్సవములఁ బ్రత్యేకసభలు జరిపి "కవిగండ పెండేరము" న సమ్మానించిరి. మిత్రులు, శ్రీ వి. రామసుబ్బారాయుడుగారు, మునునూరి సూర్యనారాయణమూర్తి భాగవతులుగారు, పెక్కుసభల శివభారతపరనముఁజేసి బహుముఖ ప్రచారము గలిగించిరి. ఈ యందఱి హృదయసౌరభముల వెల్లడించి, వారియాదర ప్రీతి గౌరవములకుఁ గృతజ్ఞతాంజలి పట్టుచున్నాను.

శివభారతమును సాదరముగఁ జదివి 'ఇది యాంధ్రసారస్వత మహాకావ్యముగాఁ' బ్రేమించి యమూల్యములైన సంస్కారములు సలహాలు సూచించిన పూజ్యులు, బ్రహ్మశ్రీ వేలూరి, శివరామశాస్త్రిలవారి యుపకృతిని రసికతను స్మరించుచున్నాను. వారి యాశీస్సులతోడి శివభారత విపుల సమీక్ష యదనున కందకపోయినను నచిరకాలమున నాంధ్రసాహిత్యము నలంకరింపఁగలదని యాసించుచున్నాను. శివభారతావిష్కరణముతోఁ బల్లవించిన యనురాగమును కోరకిత-కుసుమిత దశాక్రమముగఁ గవిగండపెండేరమును దొడుగుటతోఁ బండించి దీవించిన యభిమానశాలి, కళాప్రపూర్ణ- మహోపాధ్యాయ, డాక్టరు చిలుకూరి, నారాయణరావు, M. A, Ph, D. L. T, D. Lt, గారి యుదార హృదయమును నే నెన్నఁడు మరువఁజాలను .ఇట్లే నాహితకాంక్షులు ఉపకర్తలు పెద్దలు పిన్న లెందఱో కలరు, అందరికి నా ధన్యవాదములు.

ఈ కూర్పునఁ జేసినమార్పు లేవియు లేవు, మునుపటి ముద్రాదోషముల దిద్దుటయు, నచ్చటచ్చట నుచిత పదప్రయోగము ననుసంధించుటయు జరిగినది. "పైనఁ" అనునది 'పైని' యని మార్చుట సమంజసమని

కొందఱుపెద్దలు సూచించిరి, 'పైనఁ' అనుటయు శిష్ట వ్యవహారసిద్ధమే; యని మఱికొంద ఱనుమతించిరి. ఏమైన నప్పటికే కొంతగ్రంథ మచ్చగుట చేతను ప్రవాహిన్యైన భాషలో దీని సాధుత్వా సాధుత్వములు పండిత లోకమేనిర్ణయింపఁ గలఁగనియు దాని నట్లే యుంచితిని.

కార్య సమ్మర్దమునఁ దీఱుబడి లేకున్నను కేవల శ్రద్ధాసక్తులతో నాభారము తానువహించి 'ప్రూఫులు' దిద్ది, యీ ముద్రణము నిట్లు నిర్వహించిన నా మిత్రులు, విద్వాన్, శ్రీ జోస్యము జనార్దనశాస్త్రిగారిని హృదయపూర్వకముగా దీవించుచున్నాను. కేవ లాదరాభిమానములతో వ్యయప్రయాసల కోర్చి శివభారతమును సర్వాంగ సుందరముగ ముద్రించి వెలయించిన మిత్రులు, శ్రీ దేశబంధు ముద్రణాలయాధికారులు అందఱి యభినందనములకుఁ బాత్రులు. శివభారత ప్రకాశకుఁడుగా నాటఁకి నేఁటికి సర్వభారము వహించి తోడ్పడు స్నిగ్ధహృదయుఁడు శ్రీ కొరటమద్ది కృష్ణయ్య, B. A, గారికి ఆయురారోగ్య భాగ్యములఁ బ్రసాదింప భగవానుని వేఁడుచున్నాను. శివభారతముపై నాదరముతోఁ బలువురు మిత్రులు, పండితకవులు, తమ హృదయామోదమును దెలుపుచు వ్రాసిన వ్యాసములు పద్యములు ప్రశంసలు మున్నగునవి యించుమించు శివభారతమంత కలవు. అన్నిటిని ముద్రించుట గ్రంథమునకును జదువరులకును నాకును బరువు కాఁగలదనియే నాభయము. శివభారత సాహిత్యమంతయు నొక సంపుటముగఁ బ్రకటించు నవకాశమును భగవానుఁ డీయవలెను. ఇప్పటి కందఱి మన్నన గోరుచున్నాను. ఎంతజాగరూకత వహించినను దొరలిన నెరసులకుఁ దెలుఁగునాడు మమ్ము మన్నింపక పోదని విశ్వసించుచున్నాను,

ఇంతచెప్పినను, నామిత్రులు శ్రీ చెరుకుపల్లి సుందరరామయ్య గారిని తడవనిచో నీవిజ్ఞప్తి పూర్తికాదనియే నాతలంపు. వారి నీ ఛందోమయాశీషముల నభినందించు చున్నాను.

# అభినందనము.

—)o(—

గీ॥ అతఁడె సుందరరామయ్య- యాంగ్లవిద్యఁ
బట్టభద్రుఁ; డుపాధ్యాయ పద కుటుంబ
గౌరవాదిక మితర సాధారణంబ
మైన, గుణముఁ బ్రేమించు సౌహార్ద మురవు!

చ॥ తెలిసిన దెంతయున్నఁ దన తెల్వి నెఱుంగ; డనాథ సాధు బా
ధలకుఁ గరంగి తోడ్పడువిధమ్ములఁ జూపెడు రక్తి శక్తి యే
కలిమికిఁ జూపఁ; డీశ్వర జగత్తునకంటెఁ గవీంద్ర భావనా
ఫలిత జగత్తునన్ రస పిపాసితుఁడై మథియించుఁ గావ్యముల్॥

ఉ॥ దైవముసేయు మే లిదిగదా యన మా కొక పాఠశాలలో
జీవిక యబ్బె; యోగ్య గుణశీల పరస్పరమైత్రి త్రోసినన్
బోవని దేమొ- మాచెలిమి పొంగి, గురుత్వము భక్తి రక్తి యి
మ్మై వికసింప, నా యనుగుఁడై తిగిచెన్ ననుఁ గావ్యసృష్టికిన్॥

చ॥ పనిగొని పొత్తముల్ చదివి పాయని యోర్మిఁ జరిత్రమెల్లఁ జ
క్కన వడఁబోసి యిచ్చుటయె గా, దపుడప్పుడు యోగ్యమైన సూ
చనలిడి జాగు నోగు నలసత్వము వో ననుఁ బ్రోత్సహించి, యీ
పని తనదైనయట్లు శివభారతసృష్టిని నాకుఁ దోడ్పడెన్॥

ఉ॥ అంతటి స్నిగ్ధ సాధు హృదయంబున స్వార్థములేని వృత్తి నే
కాంత హితుండు- శిష్యుఁ డనుయాయిగఁ గూడ ననున్ భజింపుచున్
సంతసమందువాని కిడఁజాలిన దేది! శుభమ్ములంద దీ
వింతు; మఱొక్కజన్మ సుకవి ప్రవరుండయి మేల్మి గాంచుతన్!॥

గడియారము, వేంకటశేషశాస్త్రి.

---

"శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు, నెల్లూరు.
(శివభారత ద్వితీయముద్రణదాతలు )"

శ్రీ

"శ్రీ శివభారత ద్వితీయముద్రా ప్రదాతలు"

# శ్రీ శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి

## ఔదార్య పతాక.

మ॥ అమృతాసార మరందబిందు మధుర వ్యాహారముల్ గూర్చి, ర
మ్యముగా శ్రీ శివభారతంబు రచియింపఁ జేయు నీ సత్కటా
క్షము నేఁ డీశివభారతంబు వెలయంగాఁ జేయు శ్రీరామిరె
డ్డి మహౌదార్యము వల్కఁ జో విధివధూటీ! సుంత రానీఁగదే! ॥

మ॥ అదిగో తూర్పున స్వర్గఖండ- మది దివ్యారామ కేదార భా
గ్యద జీవాతు పినాకినీ జల తరంగ స్నాత వాతార్భ కా,
న దినోపాసిత రంగనాథ కరుణానుజ్ఞాత నిత్యోత్సవా
స్పదమై నెల్లురు వొల్చెడుఁ గురు కవి బ్రహ్మ ప్రతిష్ఠాంకమై॥

చ॥ పరువపుఁ దెల్గుపైఁదలికిఁ బాపటబొట్టన నందగించు నె
ల్లురుపురి మూలపేట సిరులుం గళ లొప్పిన పూలతోఁట; యం
దరు దగుచుం 'సుదర్శనమహాల్' వెలయుం దెలిరాలమేడ - సుం
దర తరుణాబ్జ పత్రశత దంతురి తాంతర కర్ణికాభమై॥

ఉ॥ అందు వసించుఁ దిక్కవర పన్వయరత్నము రామిరెడ్డి - మో
మందున లేఁతనవ్వు - మది యందునఁ జల్లని శాంతిలక్ష్మి - వ
ల్కందుఁ బరోపకార కరుణాకర శీకరవృష్టి - వర్తనం
బందు మహా యుగద్వయ సమన్వయమూర్తి వెలుంగుచుండఁగన్॥

ఉ॥ పెద్దలు సేయు పుణ్యములు - పేద లొనర్చెడు దేవపూజలున్
దద్దయుఁ బండి నిండి యిటుదక్కె నన్ ధనధాన్యలక్ష్ములై
మిద్దెలు మేడలై గనులు మేలిమితోఁటలు నాలమందలై
యొద్దికఁ గొల్చు భృత్యగణ మొప్పఁ దగున్ దదుదార భాగ్యముల్॥

శా॥ విద్యా శీల వివేకవంతులు కళావేత్తల్ మహోదాత్త సం
పద్యుక్తుల్ రసమూర్తులౌ సుతులు మక్కల్ కూఁతు లల్లుండ్రు బం
ధూద్యోగుల్ విలసిల్లు తద్భవన మోహో! విశ్వవిద్యాలయం -
బుద్యానేందిర - యింద్రసౌధ మన నుద్యోతించు విద్యుత్ప్రభల్॥

తే॥ రవికవీంద్రుని విశ్వభారతిని గొలిచి
గాంధి గురుదేవు త్యాగశిక్షణము గఱచి
మనసు పండించి, తత్కుటుంబమున పాపఁ
డైన స్వాతంత్ర్యయోధుఁడై యాటలాడు॥

తే॥ ఖద్దరు ధరించు టతుల దీక్షావ్రతంబు
కష్ట మెదురెక్కి చెరకేగు టిష్ట తపము
గాఁగ, స్వాతంత్ర్య రథమును లాగినారు
భరతవీథులఁ దత్కుటుంబమునవారు॥

చ॥ అనుపమ శీలభూషిత దయామయి సాధ్వి సుదర్శనాంబ పూ
జ్యుని నరవిందు శ్రీ రమణయోగి భజించియుఁ, బేదసాదులన్
దనిపియుఁ గొన్న శాంతి సమదర్శనభావము దేశభక్తియున్
దనప్రజ కిచ్చి, నాథుసవిధమ్మున దైవముఁ జేరె ధన్యయై॥

ఉ॥ ఆయమ పేరనే ప్రథితమైనది మేడ సుదర్శనాఖ్యమై.
యాయమ కీర్తిమూర్తికి శుభాంకిత మైనది కావ్య మొండు; నేఁ
డాయమ తృప్తికై యిడుదు రన్నము వస్త్రము పేదవారి కా
హ్లాయమకముగా నుగాది; నిటు లామె నిజేశ్వరుఁ బాయ దెన్నఁడున్॥

మ॥ అడుగో! ధీనిధి రామిరెడ్డి తనతో నర్ధాంగి లేదయ్యు, మా
నఁడు కర్తవ్యముఁ - బూనఁ జేతగుల మింటన్ బైట నిర్లిప్తుఁడై,
కడలిన్ నౌకకుఁ గర్ణధారువలెఁ 'బక్కా' దేశకాలజ్ఞుఁడై
నడుపున్ లోకహితంబు నాత్మవిధి నంతర్బుద్ధ శుద్ధాత్ముఁడై॥

చ॥ కలిమియు మాటచెల్లుబడి గౌరవ లాంఛన సుప్రతిష్ఠలున్
గలుగుకొలంది, ధర్మరసికత్వ మదంభవినీతవర్తనం
బులు చిగిరింప, నాదరణ పూలు - వదాన్యత పండ్లు - జాలి తే
నెలు వెలయించి, యాచితి గణించి, యతం డలరించు నర్థులన్॥

గీ॥ భారతాగమ పఠనంబు, భరతభూమి
భాగ్యచింతన, భారత భవ్య ధర్మ
పాలన, మనాథ ని స్వార్త లాలనంబు
రామిరెడ్డికి నిత్యపారాయణములు॥

సీ॥ వెలయించినాఁ డాంధ్ర విశ్వవిద్యాలయం
బున దివ్యభవనంబు జనకుపేర,
నొదవించినాఁడు 'విద్యోదయ' హైస్కూలు
భవనభాగము చెన్నపట్టణమునఁ
గస్తూరిబా స్మారకము బాలికాపాఠ
శాల కేఁబదివే లొసంగినాఁడు
నేటేట నర్పించు నూటపదార్ల నొ
క్క-కవీంద్రుఁ బిలిచి తిక్కనజయంతి

తే॥ మఱియు సత్కళాగోష్ఠుల జరిపి యందు
నర్హత లెఱింగి యుచిత మర్యాద లిచ్చు
నతని శారదామండపం బలరుఁ దొంటి
రెడ్డిరాజులకొల్వు లీలల నెసఁగ॥

చ॥ పనివడి యెన్నఁ డన్య నుతిపాఠము లొల్లఁగఁబోని నాదు లే
ఖినిఁ గదలించి యిట్లు పలికించిన తద్గుణ నీతి ధర్మ వ
ర్తన సముదాత్త రేఖల కెదన్ ముదమందుచు, నొం డొక ళ్ళెఱుం
గని మము నిట్లు కూర్చిన సుఖస్మృతి సంఘటనన్ వచించెదన్॥

మ॥ అనుసంవత్సర మట్ల తిక్కనజయం త్యాహ్వాన సమ్మాన వా
ర్తను - దోడ్తో శివభారతం బొకటి యందన్ జేయఁగా నాత్మకాం
తను వ్రాయించిరి రెడ్డిగారు; మది హర్షం బందియున్ వారికో
రికను దీర్పన్ వెరవేది, వ్రాసితి మృదూక్తిస్ఫూర్తి సీరీతిగన్॥

మ॥ "తమపిల్పున్ గొని యాంధ్రభారత విధాతన్ గొల్వ నేతెంతుఁ; గా
ని మనస్వీ! శివభారతం బెటు లెటన్ దేనేర్తు! దత్తావళి
ష్టముగా రెండవకూర్పుకై యొకటి యుండన్, "లేను లే" దం చస
త్యము మూఁడేండ్లుగఁ బల్కితిన్ బ్రజలయుత్సాహంబు జోకొట్టుచున్॥

గీ॥ రసికులగు మీరు గోర నిరాకరించు
తెంపు లే దాట దానినే పంపికొందు,
నెప్పుడో ద్వితీయ ముద్రణాదృష్టలక్ష్మి
చేయివిసరిన నపుడె యాచింతు మిమ్ము॥"

మ॥ అనుచున్ బంపితిఁ గమ్మ - కావ్య; మటుపై నా తత్త్వసంవేది యే
మని భావించెనొ! వచ్చెఁ దిక్కనజయం త్యాహ్వాన; మేనున్ మహా
జన విద్వత్సభ సోమయాజి కవితాసౌభాగ్యముల్ వల్క నం
తన తన్పున్ గొని రామిరెడ్డియుఁ దదాసానంబునన్ నిల్చుచున్॥

చ॥ మృదు మధురోక్తి భారతకవీంద్రుల గొప్పతనంబు వల్క, యం
దుఁ దనకు నించు తిక్కన యనూనమహత్త్వము నెంచి, నవ్య కా
వ్యదశల మాటవెంట శివభారతగౌరవ ముగ్గడించి, కో
విదమణి రామిరెడ్డి తనిపెన్ నను నూటపదార్ల సత్కృతిన్॥

ఉ॥ అంతట లేఁతనవ్వు వెలయంగ సదస్యులఁ జూచి పల్కె "నే
డింతయుఁ దండ్రిపేరఁ బ్రతియేట నొసర్చెడు కార్య; మిందు నా
సంతస - మాంధ్రభారతము సత్కృతికిన్ శివభారతంబు - రూ
పాంతర భారతంబు మన కందుట - సత్కృతు లందఁజేయుటల్॥

ఉ॥ ఉత్తమధార ధోరణి రసోర్జిత భావ పదార్థ బంధ సం
పత్తులు నిల్వనన్ దొరయుమాత్రమగాక, మఱిన్ గురించి స
ద్వృత్తికి మానవున్ నడుపు తీయనితోఁటలు పూలబాటలై
యుత్తఱిఁ గావ్యముల్ వెలయు టెంతయు భావ్యము భవ్యమై తగున్॥

ఉ॥ ఇప్పటి తెన్గుఁ గబ్బముల నీశివభారత మట్టిదాట నేఁ
జెప్పఁగనేల యీ తెనుఁగుసీమయె చాటఁగ; దత్ప్రబంధమున్
దప్పక చూడఁగోరి పలుతావుల నే వెదికింప నెందునున్
గప్పుర మట్టులై ప్రతి యొకండు లభింపద యింతకాలమున్॥

ఉ॥ మానవజాతి కభ్యుదయ మార్గముఁ జూపెడు నిట్టి కావ్య సం
తానము యావదాంధ్ర జనతా సులభంబుగ నుండు టెప్పు డెం
తేని యవశ్యమైనతఱి నీశివభారత మి ట్లలభ్యమై
మానజగంబునన్ వెలుఁగుమాయుట కన్నులు మాయుటే యగున్॥

ఉ॥ కావున నంద ఱందుకొనఁగాఁదగు రెండవకూర్పు దీనికిన్
గావలె; నందుకై వలయు కార్యకలాపము లన్నిటన్ ధనా
భావముఁ దీర్చు టాద్యము; శుభమ్మని దాని భరింతునేను; స
ర్వావయ వాభిరామ మగునట్లు కృతిన్ వెలయింపఁ గోరెదన్॥

చ॥ అడుగుట నేర్వనట్టి నియతాత్మకుఁ డీకవి; కావ్య మెవ్వరే
నడుగఁ దలంపులన్ దఱుమునట్టిది; రాయలు లేఁడు - లేఁడు ముం
దడుగిడు ధీరుఁ; డియ్యెడ సమాచితమయ్యె విధేయమంచు నే
నొడివితిఁ - దెల్గుతల్లి నిటు నోఁచుచు నూపురసేవ సేయఁగన్॥"

మ॥ అని యౌచిత్యము వల్కి, కప్పురపు వీడ్యం బిచ్చి, వర్ధంతి సం
తనమెల్లన్ ముగియించి వీడ్కొనియె; నంతన్ బ్రొద్దునన్ నన్నుఁ 'గా
రునఁ బిల్పించి వినోదగోష్ఠిఁ గవివర్యుల్ గొల్వ నానా విమ
ర్శనముల్ కావ్య కళాప్రసంగములు మీఱన్ గాలమున్ బుచ్చుచున్॥

తే॥ పసిఁడి పళ్ళెంబులోఁ బుష్ప ఫల సుగంధ
ములును గర్పూర తాంబూలములును బదియు
నైదువందల ధనముఁ బూర్ణానురాగ
హృదయమున నించి నాకు నర్పించి యనియె॥

చ॥ "ప్రకృతము కాగితమ్ముఁ గొనవచ్చు నటం చిది యిచ్చుచుంటి, అ
చ్చుకుఁ బయి నందచందముల చుంగులకున్ దగు విల్వవిల్వ యొం
తకుదిగు - నంతయున్ గొనుఁ డనంతరమం" దని సాదరోక్తి వీ
డుకొలిపె; నేఁ గృతజ్ఞత కడున్ దలమోసి గృహమ్ముఁ జేరితిన్॥

చ॥ అది యొకదివ్యదృశ్య మటులై మదిలో మెఱపుల్ వెలార్చు చు
న్నది -"యతఁ డెవ్వఁ - డే నెవఁడ! యాచన లే, దొరు మేలిమాట లే
దొదవినచెల్మి సేవ వినయోక్తులు లే; విటు తానుదాన సా
హృదమున మూఁడువే లొసఁగునే శివభారత ముద్ధరింపఁగన్!॥

ఉ॥ ఎందఱు లే రుదారు - లవనీశ ధనేశ సరస్వతీశతల్
వొంది, పురందరున్ దొరయు భోగము భాగ్యముఁ గన్నవారల!
య్యందఱి కెందు డెందముల కందని దేగతి రెడ్డిగారికిన్
గందువ చిక్కె! వేఁడి వెలిగాఁ గను మూఁడవక న్నిదే మొకో!॥

ఉ॥ కీర్తినిఁ గోరి, పల్కుబడికిన్ బరువెత్తి, స్వకార్య లాభ సం
పూర్తికి మూఁగి, పత్రికలు మ్రోఁగఁ బ్రశంసలు రేఁగ సాగు ఆ
ధూర్త వదాన్యతాసరణిఁ ద్రొక్క. కదంభ నిగూఢదాన ని
ర్వర్తన మెట్టి యాత్మపరిపాకమొ యెంత వివేకమొ గదే!॥

శా॥ ఘన మైశ్వర్యము, దాని మించిన వివేక ప్రాభవ స్ఫూర్తి, మే
లున దానిం దలమీఱు సంతతియు - నల్లుండైన గోపాలరె
డ్డి నిదేశించు ప్రభుత్వమంత్రి - యిటులై శ్రీవుల్ విరాజిల్ల, నిం
త నిరాడంబరుఁ డీతఁ డింత సులభుండా! యింత భావజ్ఞుఁడా! ॥

మ॥ కవి కావ్యమ్ములతోఁ బ్రజాభ్యుదయముం గల్పించువాఁ డౌటఁ, ద
త్కవి కావ్యమ్ములఁ బెంచి మన్చుట ప్రజాకర్తవ్యముం - దద్విభు
త్వ విధేయం బగుఁ; దద్ద్వయంబు తమత్రోవల్ దప్పుచోఁ జీఁకటి
ల్లవు నీ తెల్గున నింటిపెద్దయన సంధ్యాదీప మెవ్వండిరుం!॥

గీ॥ ఇంత యోజించి, యౌచిత్య మెంచి, తెలుఁగు
నాట నేఁటికి వలయు సంతన గ్రహించి
లలిత సారస్వతజ్యోతి వెలుఁగఁజేయ-
దక్కినది యగ్రసోదరత్వము దనంత॥

చ॥ అవు - నిటు లాంధ్రదేశమున నంతట దక్కిన దగ్రజత్వ గౌ
రవ మది రెడ్డిగారికి; స్వరస్వతి కాయన తీర్చిదిద్ద నై
కవిధ సపర్యలం దెలుఁగుగడ్డ కృతజ్ఞత మోసి ధన్యవా
ద వితతి మ్రోయుచున్న దుచితజ్ఞ గుణజ్ఞ రసజ్ఞతా శ్రుతిం"॥

చ॥ అని యనుకొంచు నామది బయల్పడు తన్పున రెడ్డిగారి మే
ల్గొనములఁ బొల్చు నీ కుసుమగుచ్ఛము - రెండవకూర్పు తీర్పు నం
దిన శివభారతం బిపుడు తెన్గుజగంబున కందఁజేసి, యీ
యనువునఁ గావ్యసృష్టి చరితార్థత వల్కెదఁ దెల్గుతల్లికిం॥

శా॥ "అమ్మా! ఆంధ్రసవిత్రి! స్వర్ణయుగమా ఆనాఁటి నీ యందచం
దమ్ముల్ మాసినవేమొ చూడు! మదియున్గా, కెప్పుడుం బూయుఁగా
యు మ్మా కావ్యకళా వసంతవని; యీ యుద్యానముం బెంప డెం
దమ్ముల్ విచ్చి యుదారులౌ రసికు లున్నా రిందు నత్యైపులం!

ఉ॥ అందఱిలోనఁ దిక్క వరపన్వయ మిప్డు పాలసంద్రమై
యిందిర తోడుగా - నమృత మెద్దఁగఁ - గల్పక కామధేను పూ
ర్ణేందుల వెల్వరించె, నిటు తేచిన నెల్లురు స్వర్గఖండమై
నందనమై ప్రజాహితమనస్కృత సత్కృళ లుద్ధరించెడిన్॥

తే॥ కావున సరస్వతీః కలకాల మిట్లు
తరతరంబులవెంట సత్కృళలఁ బెంపఁ
దిక్కవర పన్వయము సుప్రతిష్ఠితముగ
వెలయ - సంపద ల్వోలయ దీవింపవమ్మ!॥

గడియారము వేంకటశేషశాస్త్రి.

# విషయసూచిక.

శ్రీమత్పరదేవతాయైనమః

# పుష్పాంజలి.

గీతి.

"ప్రకృతిపరమేశ్వరులుగాఁ బ్రపంచసృష్టి
తలఁపుమెలపున నెనసి, కాన్పులకు మురిసి,
కష్టముల కోర్చి పెంచి లోకమునకిచ్చు
తల్లిదండ్రులౌ మీ ధన్య తపముఁ దలఁతు॥

శ్రీ శివప్రభుచరిత షాజీ జిజాంబి
కా హృదయనాడికా ప్రేమవాహినీ వి
గాహనముల మీ జీవితోత్కర్షఁ దలఁచి
పొంగియు కన్నుల నుబుకు నశ్రువుల నిలుతు॥

ఆట పాటలు చదువు సంధ్య యని కడచె
మూవ ప్రాయము మీ ప్రేమభూములందు,
న న్నొక గృహస్థుఁ జేసితి; రిన్ని కళలు
వడసి, యనుభోక్తనై ఋణంపడితి మీకు!॥

స్వర్గ మర్త్యాంతరమున మీ చరణమంటి
యెటుల బదులిత్తు! ఏమిత్తు! ఎంతయిత్తు!
అది యసాధ్యము; ఇదియ నా హృదయగీతి
కృతి సమర్పింతుఁ దత్పదాంకితముఁ జేసి॥

మాతృ పితృ దైవ పూజా సుమస్రజంబు
భావ సురభిళ మీ 'శివభారతంబు'
జగము లున్నంతవఱ కెల్లజనులు చదివి
తనియుదురుగాక! మీమది తనియుఁగాక!"॥

# శ్రీ శివ భారతము.

(శివాజీ ప్రబంధము.)

## నాంది

★

శా॥ శ్రీలంగూర్చు కటాక్షమాలికల నాశీర్వాదములొప్పసి, హృ
ద్యాలాపమ్ముల బుజ్జగించుకొని, శ్రేయః పాయసాన్నంబు వి
ద్యాలాలిత్యముఁ గీర్త్యలంకరణ మొయ్యన్ బెట్టి, భక్తావళిన్
బాలింపంగల కన్నతల్లి జగదంబన్ గొల్తుఁ గామేశ్వరిన్॥

సీ॥ ఆర్యప్రపంచ మాత్మారామమయ్యు, న
నార్య గుణోద్వృత్తి యలము కొనఁగఁ,
దతమహా నవిద్య నాత్మ ప్రత్యయ మడంగ,
ననజా త్యహంకార మావరింప,
భామినీ రాజ్యంబు ప్రబలఁగా, * మోహా లు
ప్త స్వతంత్రతఁ బరవశత మిగుల,
నద నెంచి, యోగవిద్యాతపోబలశక్తి
నధ్యాత్మ శివతేజ మవతరింపఁ

తే॥ జేసి, విమత విక్రాంతి భంజించి, స్వీయ
మగు మహారాష్ట్ర నవ్య కల్యాణ సిద్ధి
కలరు జగదంబ, భక్త జనావలంబ
శరణు సొచ్చెద జ్ఞాన భిక్షా ప్రతీక్ష॥

తే॥ చిన్నకొడుకని కడుఁ బెద్దచేసి, ప్రేమ
మధుర మృదుచిత్తముల నన్ను మనిపినట్టి,
నాదు పితృదైవతంబుల, నరసమాంబ —
రామయార్యుని, ఘనుల స్వర్గతులఁ దలఁతు॥

---

* "మోహాల్ (మోగల్) + లుప్త" అనియు భేదము.

మ॥ అనురాగంబునఁ జేరఁదీసి హిత విద్యా బుద్ధులన్నేర్పి, 'పెం
చిన శిష్యుండు కవీంద్రుఁడౌత' మని యాశీర్వాదములోసఁగి, పా
త్రునిఁగావించిన శిష్యవత్సలు గురున్ రూపావతారాన్వయున్
దిననాథోపము శేషశాస్త్రిఁ బితృభక్తిన్ గొల్తు శ్రేయోర్థినై॥

తే॥ కాళిదాసాది గీర్వాణ కవుల, నన్న
యాదిక ప్రాక్తనాద్యతనాంధ్రకవుల,
భవ్య కావ్యప్రపంచ సౌభాగ్యసృష్టి
నపర భారతీ నాథుల నభినుతింతు॥

చ॥ హరిహరనాథ శాంత మధురాకృతి లోపలిచూపునన్, బురా
చరిత తపఃఫలం బుభయ సత్కవిమిత్రత వెల్గ, ధ్యాన త
త్పరుఁడయి భారతాగమము వల్కెడు తిక్కన వాక్కువెంటఁ ద
త్కరమునఁ దాండవించు వరదాయిని లేఖిని నే భజించెదన్॥

# ప్ర స్తా వ న.

మ॥ అని యస్మత్పితృదేవ దేవనుతి నాంద్యాహ్వానమున్ జేసి, నూ
తనమున్ శారిగ్గుణ సమ్మితం బౌకప్రబంధం బేను నిర్మింపఁగా
ననుసంధింపుచు, నొక్కనాఁ డమల సాయంకాలవాహ్యాళి నా
యనుఁగు న్నెచ్చెలితోడఁగూడి పురబాహ్యక్షోణికిన్ బోయినన్॥

తే॥ అచట నామిత్రుఁ డాఙ్గ్లవిద్యా విశార
దుం, డుపాధ్యాయ పట్టభద్రుండు, చెఱుకు
పల్లి సుందర రామయాహ్వయుఁడు మధుర
భాషణ వినోద గోష్ఠిమైఁ బలికె నిట్లు॥

చ॥ "కవులు శతావధాను లనఁగా మిము విందుము; గ్రంథకర్తృ గౌ
రవమున కేల చూడ" రని, రక్తి వచింపఁగ నిట్టులంటి, "నీ
నవయుగమందు గ్రంథరచనన్ బలుదారులు దోఁచుఁ; గైతలోఁ
జవి, యనుభూతి, లక్ష్యమును, శైలి తమంతయి కట్టు లేదగున్॥

ఉ॥ ఇంతయుఁ దేర్చికొన్న నితివృత్తము తేఱదు; పూర్వగాథ సా
యంతనపద్మమై ఫలితమైనది; కల్పితగాథ బూటకం,
బంత రసారమై, విలువ కందని దైనది; ఖండగీతి భా
వాంతర లక్ష్యమై, జగమునంట దుదాసిత నాయకోన్నతిన్॥

ఉ॥ ఇన్నిటిలోన మేలిమి రహించెడు దేశచరిత్ర నేఁడు; సం
పన్నుఁ డుదాత్తుఁడున్ జగదుపస్కృతి కాశ్రయమైన నాయకుం
డున్న తుఁ డబ్బె నేనిఁ, గృతియున్ జనరంజకమై తనర్చు; నా
యెన్నిక నట్టిగాథ లభియింపమి నింతట నూరకుండితిన్"॥

చ॥ అనఁగ నతండు "మీ రుచితమౌ కథఁ గోరుదు రేని, నుదాత్త వ
ర్తనుఁడగు శ్రీ శివాజి చరితమ్మును గైకొనుఁ; డుత్తమ వ్రతుం
డనఁదగు నాయకుం డతఁడటంచు జగమ్మె యెఱుంగు; నేఁటి కీ
ఘను చరితమ్ముపైఁ గలవు గ్రంథములెన్నియొ పెక్కు భాషలన్॥

శా॥ ధీరాగ్రేసరమూర్తి, హైందవధరిత్రీ భాగ్య సత్స్థాపన
ప్రారంభుండు, దయాగుణాంబుధి, మహారాష్ట్రాన్వయోత్తంసుఁడౌ
వీరక్షత్రియమౌళి, భవ్య భరతోర్వీ ధర్మరక్షార్పిత
శ్రీరమ్యుండు, భవానిభక్తుఁడు, శివాజీరాజు సామాన్యుఁడే!॥

క॥ ఆతని చరితము హైందవ
జాతి పరాయణము, భావిజగ దభ్యుదయ
స్ఫీతము, ధర్మోపేతము,
నీతిపథము, నిగమసూక్తి నిభమై వెలయున్॥

ఉ॥ వ్రాయుఁడు తచ్చరిత్ర — రసబంధుర బంధము గాఁగ, భారతా
మ్నాయము దీటుగా, నుభయ మార్గ సమన్వయ ధోరణీ గుణ
ధ్యేయముగాఁగఁ; గావలయు నెల్లచరిత్రము గూర్చియిత్తుఁ; గా
త్యాయని మీకుఁ జెన్నిధిగదా, కవితాసుధఁ బంచిపెట్టుఁడీ!”॥

చ॥ అనుటయు, నాప్తవాక్యము శుభాంకముగాఁగొని, స్నేహపూర్ణుఁడా
తనికిఁ గృతజ్ఞతన్ దెలిపి, దాన దయా శమ ధర్మ వీర వ
ర్తనుఁడు ప్రబంధనాయకపదమ్మున కబ్బెను శ్రీశివప్రభుం
డని ముదమంది, గ్రంథరచనాదరణంబున నుత్సహింపుచున్॥

చ॥ పరహిత, మాత్మనిర్వృతి యపార యశోధన గౌరవాది వి
స్ఫురణము లందఁజేసి యిహమున్ బరమున్ వెలయించి, మానవున్
ధరఁ జరితార్థుఁజేయు కవితాకళ నావశమౌటఁ, బంచమ
స్వరమున నాలపించెద వసంత వనాంత రసాల శాఖలన్॥

సీ॥ ఊరు — కుముద్వతీ తీరాగ్రహార స
మ్మాన్యతఁ గన్న నెమళ్ళదిన్నె,
వేద శాస్త్రార్థవి ద్విబుధ మందార మ
హాంబుధి ‘గడియార’ మన్వయంబు,
తలిదండ్రు — లనిశ సీతారామ పాదసే
వా ధన్య పుణ్యదంపతులు — వార,
లన్నలు మువ్వు — రభిన్న భావులు వేద
విధి విత్తములు కళావిదులు ఘనులు,
తే॥ భవ్యమైత్రేయ మునిగోత్ర భవుఁడ, వారి
చిన్నితమ్ముఁడ, వేంకట శేషశాస్త్రి —
నేను ‘శివభారతము’ రచియించి సకల
రసికజనహస్తముల సమర్పణము సేతు॥

శ్రీ సర్వేశ్వరదేవతాయై నమః

# శ్రీ శివభారతము

## (శివాజీప్రబంధము.)

### ప్రథమాశ్వాసము.

మంతము, సకల కళా
సీమ, ప్రకృతిసహజ భాగ్యసేవధి, విజ్ఞా
నామృత భాండము, దైవత
భూమి, ఋషులభూమి, భరతభూమిం దలతుఁ॥

### భారతదేశము - దక్షిణ పీఠభూమి.

సీ॥ అచలావతంసమై యలరు హిమాలయం
బుత్తరసీమయై యొప్పుచుండఁ,
బూర్వ దక్షిణ పశ్చిమోర్వీ విశాలత
కాయత జలరాసు లవధిగాఁగ,
నలరు "భారతదేశ" మనుభూమి; దాని మ
ధ్యమ భాగమందు వింధ్యాద్రి గలదు;
వింధ్యాద్రి కుత్తరవీథి "నార్యావర్త"
మొప్పు నుత్తరభారతోర్వి యనఁగ

తే॥ వింధ్య దక్షిణవీథిఁ బవిత్రనదులు
తపతి, గోదావరియు, భీమతటిని, కృష్ణ,
తుంగభద్రయుఁ, గావేరి పొంగిపాఱు
పావనస్థలి దక్షిణ భారతోర్వి॥

ఉ॥ తూరుపుమో ముదక్కిరము తోఁప, శయించిన దక్షిణోర్వి కా
ధార పదోపధాన మగు దక్షిణ వారిధి; వింధ్యసీమ వి
స్ఫారకికీటమై తనరు; సహ్యనగంబు నితంబబింబ శో
భారమణీయమై, సకలభారవహక్షమమై, తనర్చెడిన్॥ 3

తే॥ వితత దక్షిణ భారతోర్వని సగంబు,
నర్మదా తుంగభద్రల నడిమినేల
వెలయు "దక్కను" "దక్షిణపీఠభూమి"
యనఁగఁ, గడమ కర్ణాటరాజ్యం బనంగ॥ 4

సీ॥ శ్రీరామమూర్తి కాంతారవాసము సేయు
నపుడు దక్కను దండకాఖ్య మడవి;
నాఁ డగస్త్యుఁడు దక్షిణాపథ మేగుచోఁ
గొండజాతులఁ జూచియుండె నిచటఁ;
బాణిని సంస్కృత వ్యాకరణమ్మున
వినిచె నొక్కింత దక్కనుగుఱించి;
కాత్యాయనమహర్షి కాఁపురంబులు సేర్చెఁ
దనతోడియార్యసంతతుల నిచట;

తే॥ వరుస నెందఱో యిట్లు కాఁపురము సేరఁ
గరలి, దక్కను బహుజనాకీర్ణమయ్యెఁ;
బ్రజలు రాజులు రాజ్యముల్ ప్రబల, నిండు
సూర్యవంశరాజన్యులు సొచ్చి రపుడె॥ 5

మ॥ అలకావేదికి గౌతమీనదికి మధ్యన్, సూర్యవంశీయ రా
జులు "కొల్హాపురి" రాజధాని గయికొంచున్ రాజ్యమేలంగఁ, ద
త్కులజుండైన శిశోదరాయఁ డభితో గోదావరీ నర్మదా
స్థల "మస్సీ" ద్పురి రాజధానిగను రాజ్యంబేలె నత్యున్నతిన్॥ 6

మ॥ అనఘుండైతగు శాలివాహన నృపుం డప్డు ప్రతిష్ఠానప
త్తన సింహాసన మెక్కెఁ జో, నతనిపై దండెత్తె శ్రీవిక్రమా
ర్క నృపాలాగ్రణి; యాతనిన్ దఱిమి, యుగ్రస్ఫూర్తి నోడించి, ద
క్కనులో నిల్పెను శాలివాహనుఁడు చొక్కం బాంధ్రసామ్రాజ్యమున్॥

తే॥ బలియుఁడై, శాలివాహనప్రభుఁడు సూర్య
వంశ రాజులఁ బరిమార్చెఁ, బారఁదోలె;
ననదయూచు, శిశోదరాయని నెలంత
తనయుతోడ నార్యావర్తమునకుఁ బోయె। 8

తే॥ తేజఁగన్న "శిశోదియా" రాజపుత్రి
వంశ మవ్వాని పేరనే ప్రథితమయ్యె;
నా "శిశోదియా" వంశ విఖ్యాతుఁ డొకఁడు
సొరిది "భోన్సలే" కుల మూలపురుషుఁ డయ్యె॥ 9

క॥ చనె శాలివాహనుం; డా
తని వెనుకన్ బెక్కునృపులు దారసిలిరి; ద
క్కను క్రీడాకందుకమై
యనువుపడియె "నాంధ్రభృత్యు" లనువారలకున్॥ 10

ఉ॥ శూరుల నాంధ్రభృత్యులగు† "చోటుల" "నాగుల" నొత్తరాహు లా
భీరులు గెల్చి, యేలి రొకపెంపున బొంబయిప్రాంతమెల్ల; న
వ్వారల "రాష్ట్రకూటు" లనువారు మహారథు లోర్చి పేర్చి; ర
న్వారిఁ గదంబరాజు, లలవారిఁ జళుక్యు లడంచి రుద్ధతిన్॥ 11

---

† "The Chutus and the Nagas, the so-called Andhra-bhrityas, established a vigorous though short rule in the various parts of the Deccan..........In the meanwhile........... the Abhirs established themselves in the western portion of the Deccan............The power that successfully wrested

ఉ॥ దక్షిణపీఠభూమి బలితంబగు రాజ్యముగాఁ, జళుక్య రా
జాక్షతశక్తి యేలెఁ దత్తమై; పులకేశి ద్వితీయుఁ డందు హ
ర్యక్షము వోలెనుండి, యెదురన్ జనుదెంచిన హర్షవర్ధనున్
శిక్షితుఁ జేసి, వింధ్యనగసీమను దాఁటఁగఁ దోలె వేల్మిడిన్॥ 12

సీ॥ చాళుక్య రాజ్యంబు జరిగె, నాఱవ శతా
బ్దమునుండి యెన్మిది దాఁటుదాఁక;
మరల "మహారథ" మహితరాజ్యము నిల్చెఁ
బదునొకండవ శతాబ్దంబుదాఁక;
నందు, రాజాధిరాజాదిక బిరుదముల్
గొనె వీరదంతిదుర్గుండు; మొదటి
కృష్ణుఁ డెల్లోరాపురిని నొక్క-రాతి యం
ద మలంచెఁ గైలాసనాథగుడిని;

తే॥ వారి నణఁచి, చాళుక్యవైభవము మరల
వఱలెఁ; బదుమూఁడవ శతాబ్దివచ్చె; నపుడు
దేవగిరి యాదవప్రభుదీప్తి మెఱసి
దక్కనున నాల్గుమూలలఁ దాండవించె। 13

తే॥ సింగనయు రామదేవుండు చెలఁగిపోవ
రామచంద్రదేవుం డట రాజ్యమేలెఁ;
దొంగిచూచి రొకట రెంటఁ దొడరి యవను;
లంతఁ బదుమూఁడవ శతాబ్ద మంతుముట్టె॥ 14

---

political control ........... after the Abhirs would appear to be the Rashtrakutas............The power of the Rashtrakutas in the Deccan was eclipsed by a new dynasty—that of the Chalukyas........the Kadambas."

Page 162. A History of India - Part I. Hindu India- by C. S. Srinivasachari & M. S. Ramaswami Iyengar.

క॥ "అల్లాయుద్దీన్ ఖిల్జి"
మల్లడిఁగొని కప్పునుండె; "మాలికాఫర్"
కొల్లఁగొనె; యాదవశ్రీ
నల్పై, జతుర్దశ శతాబ్ది నగమగునరికీ॥ 15

§ సీ॥ మనసుపెట్టుచు "మహమ్మదుటుగ్లు" కినువాఁడు
దక్కనుభూమిపై దండువెడలె;
నటనున్న ప్రజలెల్ల నతనిమాఱ్కొన "జఫ
ర్ఖాను" సేనాపతిగా నొనర్చి;
రతఁడు టుగ్లకుఁ బారఁదఁచె డిల్లిఁ జేర;
నతని సుల్తానుగా ననుమతించి,
జను "అల్లాయుద్దీన్ హసన్ గంగుభామిని"
యను బిరుదిచ్చి రాతనికి మెచ్చి;
తే॥ జఫరుఖాను సుల్తానుఁడై సంతరించె
వితతమైయున్న దక్షిణావీరభూమిఁ;
దనకు యజమానుఁడౌ బ్రాహ్మణునిఁ దలంచి,
"బహమనీరాజ్య" మని, తనప్రభుత నెఱపె॥ 16

§ "In the time of Mahomed-bin-Taglak an insurrection took place in the Deccan. .... .... .... The people elected Zuffir Khan, destined to be the founder of a race of kings. He repulsed the Mahomedans. He was the slave of a Brahmin, an inhabitant of Delhi. He discovered the merits of his slave and foretold his subsequent fortune. On being raised to empire Zuffir Khan did not forget the brahmin, whom he appointed to the charge of the treasury. Zuffir Khan became the King and took the title of "Sultan Allauddeen Hoossein Kangoh Bhamini."
Chapter I. A History of the Mahrattas, by James Grant Duff.

## బహమనీ ప్రభుత్వము.

చ॥ నెలకొనె నప్పుడే "బహమనీ" ప్రభుతాంక పతాక; దానఁ ద
మ్ములమది కుందుపో; దరులపోటు దొలంగదు; మిత్రహానియున్
దలఁగదు; కొంతయైనఁ గుముదమ్ముల దిమ్ముడిపోదు; మానదే
యలజడి; షోడశాంకము శతాబ్దము పాదము వెట్టె నంతలోన్॥ 17

ఉ॥ *భామినిరాజ్య మష్టయిను భాగము లయ్యె; "బరీదుషా" "ఉమ
ద్షా" మొదలున్న రెండునివి తా మడఁగెన్ దమలోనఁబోరి; "నై
జా" మహామత్పురంబును, బిజాపుర "మాదిలుశాహియున్," "గుతు
బ్షా" మఱిగోలకొండయనఁ, బ్రస్తుతముండెను మూఁడురాజ్యముల్॥18

ఉ॥ వారును వీరు నొండొకరి వంపఁగఁ బైబడి, కొల్లగొట్టుచున్
బోరి, విభుత్వముల్ విభవము ల్గొనుచుండఁగ, హైందవప్రజా
వారము వారిబారిఁ బలుబాముల నొందుచు, దిక్కులేని సం
సారముఁ, దీరులేని వ్యవసాయముఁ, జేయఁగ రోసి రెంతయున్॥ 19

మ॥ జనసామాన్యము కష్టజీవనములన్ సాగించుచుండంగ, "నా"
నని "కా" దం చొకదారి చూపఁగలవాఁ డానాఁడు లేఁడయ్యె; శ
క్తిని భక్తిన్ గనిపించి, యాదొరలరక్తిన్ గొంతజాగీరొ వి
స్నని యుద్యోగమొ కొందఱుంది; రదియైనన్ గొప్పగా నెంచుచున్॥

---

* "In the years 1489 — 1512 five kingdoms branched off from the withering trunk of the Bahamini Kingdom. Of these Bijapur, Golkonda and Ahmadnagar grew to be large, powerful and long-lived kingdom. The other two, Berar and Beder, were small and were swallowed up, after a short life, by their powerful neighbours."

Page 160. A History of India, by
*C. S. Srini*

ఉ॥ కొంకణరాజ్యభూమి తమకుఁ జననస్థలమౌచు, రాజరా
జాంకముగొన్న శూరులు మహారథవంశజు లప్పుడప్పుడుఁ
బింకము సూపుచుండినను, బెంపఁటి నేఁటికి నిల్చి రిందు, ని
శ్శంకితవృత్తి రైతులయి, జాగిరుదారులునై, స్వతంత్రులై॥ 21

తే॥ ధవళయవనిక "సినిమా" ప్రదర్శనమునఁ
దాండవింపవె వివిధచిత్రములు వరుసఁ!
దిమిర గంభీర కాళరాత్రిని గమించి,
యరుణ గర్భరేఖలు ప్రాచి నలముకొనవె!॥ 22

అహమదునగర రాజ్యము, లుకజీ - షాజీ.

సీ॥ పదియునేడవ శతాబ్దముపుట్టి, యప్పుడ
ప్పుడె పప్పుటడుగుల నడుచుచుండ,
నైజామహమ్మదునగర రాజ్యమున మ
హారాష్ట్రవీరద్వయంబు వెలసె;
వారిలో నొకఁడు, † దేవగిరి యాదవరాజ
కులజుండు, పేర లఖూజి, "సింధు
ఖేడు" పరగణాకుఁ గీర్తిత దేశము
ఖుండునై, పదివేల గుఱ్ఱములకుఁ
తే॥ బెద్దదొరయౌచు, సులతానుపేర్మిఁగాంచి,
తన మహాశక్తి రాజ్యతంత్రములునడిపె;
మొగలులు దండురా వెనుముట్టి తఱిమె
నల్లునిఁ గూడి, నర్మదయవలి కరుగ॥ 23

† "లుకజీ జాధవుడు దేవగిరి యాదవరాజుల వంశజుఁడు. ... ఇతడు ... సింధు ఖేడు పరగణాకు దేశముఖుఁడుగానుండెఁ బదివేల గుఱ్ఱపురౌతులకు నధికారియై యుండెను. క్రీ. శ. 1630 ... మొగలులను నర్మదానది యవతలి తీరమునకుఁ దోలిరి."
పేజీ 7, శ్రీ శివాజీ చరిత్రము. - కె. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.

ఉ॥ ఆ యసమాన వీరమణి కల్లుఁడె రెండవవాఁడు, భోఁసలా
ఖ్యాయుత వంశవర్ధనుఁ, డఖండ పరాక్రమ ధూర్వహుండు, "షా
జీ; యపు డాతఁడచ్చట వసించె, నిజామువిభుత్వలక్ష్మికిన్
ఛాయనికోట లట్లు తనబాహువు లొప్పిన దండనాథుఁడై॥ 24

* సీ॥ తండ్రియా మాలోజి తా నైదువేల మా
నసబుదారుఁడై నిజశక్తి నెఱపి,
నైజామువలస "పూనా" "సుపా" జాగీరు,
"శివనేరు" "చాకణ్" ప్రసిద్ధ దుర్గ
ముల యేలుబడి, ప్రాంతముల దేశముఖిగిరి,
రాజాంకబిరుదమ్ము రాణఁగాని యె;
నా హక్కు-లెల్లఁ దా నందుచు, షాజీ ని
జాముగాజ్య ప్రతిష్ఠాత యయ్యెఁ;
తే॥ బలుకుబడి, రాజమర్యాద, కలిమిపెంపు,
జీజియాబాయి యభిమానసీమ భార్య,
కొడుకు సాంభాజి రెండేండ్ల బుడుత గల్గి,
యతనికాపుర మానంద వితత మయ్యె॥ 25

ఉ॥ మామయు నల్లుఁడున్ విమతమండల శిక్షణ దక్షులౌచు, నై
జామున సవ్య దక్షిణ భుజంబు లనం దగి; రింతలో బలో
ద్దాముఁడు "మాలికంబరు" ప్రధానుఁ డటన్ మరణించె; బాలరా
జేమి యెఱుంగఁడౌట, మొలకెత్తె నరాజక మందుఁ గ్రిందుగన్॥ 26

---

* "Maloji was raised to the rank of Commander of 5,000 horse and presented with the jaghirs of Poona, Supa and the forts of Chakan and Sivaneri."

*"Shivaji — the Mahratha," by Rawlinson.*

## నైజాము విప్లవము - లుకజీ షాజీల యభిప్రాయభేదములు.

ఆ॥ వె॥ నాధునదుపు లేనినాతి, పెంచనికోఁతి,
మావటీఁడు లేని మత్తగజము,
గరిడిలేనిసాము, దొరలేనిరాజ్యంబు
చెడునుగాదె! యొరులఁ జెఱచుఁగాదె!॥ 27

చ॥ ఎఱుఁగనిపిన్నవాఁడు ధరణీశుఁడు; మంత్రి గతించె; నందఱున్
దొరలయి, రాజ్యమున్ దమకుఁదోఁచినటుల్ నడిపీథిలోనికాఁ
పురముగఁజేసి; రయ్యదనుఁబొంచిన మోగలుపాదుషాహి కొం
దఱఁ దనవైపులాగె సరదారుల, లాభము లాసగొల్పుచున్॥ 28

చ॥ § "తొలుతటినుండి బాహుబలధూర్వహ దుర్గములౌ మరాటవీ
రులు గలయంతకున్, మనముదొక్కఁగ లేము నిజాము" నంచుఁ, దాఁ
దెలిసినపాదుషా తనివిదీరఁగ లాభముఁజూపి, కూర్మిరం
జిల బలవంతపెట్టి లుకజీ షహాజీలను దన్నుఁజేరఁగన్॥ 29

చ॥ కులబలపౌరుషంబుల, నకుంఠిత రాజసభా ప్రతిష్ఠలన్
బలుకుబడిన్ గడించి, యహమత్పురరాజ్యము నెల్లవారు రం
జిల నడిపించుచున్న లుకజీ పడిపోవునిజామురాజ్యమున్
నిలుపఁగలేమిఁ, దా నచట నిల్వఁగలేమిఁ, దలంచె నాత్మలోన్॥ 30

---

§ Shahjahan saw that as long as the Nizam Shahi was supported by the Maratha power it was impossible to subvert it. He, therefore, began to sow intrigues. He corrupted Lukhaji Jadhav and other nobles and drew over to the Mogul side.

Page 18. "The Life of Sivaji Maharaja", by

N. S. Takakhav M. A.

సీ॥ సులతాను బాలుఁడై, కల్ప్రభుత్వము వాని
జననిచేతులవెంట సాగుచుంటఁ,
గొఱవిరాయె, మాలికాంబరుకుమారుండు ప
త్తేఖాను మంత్రిగాఁ దిరుగఁబడుట,
నల్లరిమూఁకతో నతఁడు విజృంభించి
తనమాటవెలివెట్టి చెనకుచుంట,
నినమొన్న బాలుఁడై తనవెంటఁదిరుగుపా
జీని నేఁడు వజీరుఁజేయనుంట,
తే॥ మెండుకొని ముట్టిపలుమారు దండునడిపి,
మొగలుపాదుషా తమపైకి మొగియుచుంట,
నొకటిపై నొండు చెలరేఁగి వికటమగుటఁ,
దలఁచె లుకజీవిభుండు పెత్తనమునెడుట॥ 31

చ॥ "ఇది సవరింపరాదు, సహించఁగరా; దిట నిల్చియున్న, దు
ర్మదులగువీరుగాని, పగరాఁజినవారునుగాని, పొంచి యా
పదలు ఘటించుటే నిజము; వారిని వీరి నడంపఁ బెంపఁగా
నదుకనివేళ యిప్పుడు నిజాభ్యుదయంబుఁ దలంచు టొప్పదే!" 32

చ॥ అని తలపోసి, దేవగిరియాదవరాజ కులీనతా నిబం
ధన మభిమాన మొత్తిడిగొనఁ, లుకజీ యహమత్పురంబుఁ బా
యను మది నిశ్చయించి, తనయాపుదొలంగిన నెట్టిచిక్కు ల
ల్లుని కొడఁగూడునో, యతఁడు లోఁబడునోతన కంచు నెంచుచున్॥

చ॥ కడుపును బట్టియిచ్చుమమకారము దోఁప, హితాభిలాషియై
చిడిమిడిపాటు వీడి, లుకజీవిభుఁ డల్లునిఁ "గూడర" మ్మటం
చడిగెఁ; బ్రియమ్ములాడె; హితుఁడై బలవంతముసల్పెఁ; గాని లోఁ
బడఁడు షహాజి, పెంచినసవాబులపై ననురక్తిఁజూపుచున్॥ 34

తే॥ చెదరకుండినయల్లుచిచేయి పట్టి
యనియె నిటు; "వెఱ్ఱిముదిరి వేదాంతిగాకు;
ముడుకురక్తంపుఁబొందుడు కుడుగవయ్య!
పిల్లకాకి యెఱుంగునే వింటిదెబ్బ!॥ 35

చ॥ కుడి యెడమందలంచు దుడుకుందనముంగలవీరి నమ్మి చె
ప్పుడయినఁ జేటుఁగూర్చుఁ; జెడిపోవుచుండె నిజాము; పాదుపా
విడువఁడుదీని; వీర లవివేకులు; వీరినిఁగూడి యేలచే
డ్పడవలె? నిన్నుతోఁ గలియువహ్నికి సమ్మెటపెట్టు దప్పునే? 36

ఉ॥ నే నెటులైన నేఁడె పయనింతు; నిజామును నిల్పుయత్నముఁ
మానుము; నన్నుఁజూడు; మొకమంచి యెసంగిన నేను బోదునే?
మానక యింతకాల మభిమానమునఁ దలయొడ్డి, యిందు సుల్తా
నులఁగొల్చునే నిటుతొలంగుట యేలనినైన నెంచవో?॥ 37

తే॥ మాన మభిమాన మనునవి మంచివైనఁ,
దనకుపూలినధర్మపథంబు, మొదలు
చెడ్డబేరము, తలమీఱుసివము, సుతికి
మించురాగము రక్తిపుట్టించఁగలవె?"॥

చ॥ అను లుకజీనుఘల్వోని, షహాజి నయమ్ము ప్రియమ్ము దోఁప ని
ట్లనుఁ "దమపల్కు మిక్కిలియుదాత్తము; నాహితమెంచి కూడ ర
మ్మనియెదు; మీయుదారహృదయమ్మున కేను గృతజ్ఞుఁడఁ; మనం
బున నెడఁబోక, నావచనముల్ గొనియుఁ నయముఁ దలంపుఁడీ!॥

ఆ॥ వె॥ "ఎనయుమార్పులెల్ల నిట ననుకూలముల్
గా" వటంచు, దీనిఁ గడకుఁదోసి,
మొగలుకొలువుఁ జేరఁబోక తొందరపాటు
గా, దురాశపరుపుగాఁగఁ దోఁచు 40

సీ॥ తొలుత మాతండ్రి కుద్యోగమిప్పించి, యా
దరువిచ్చి, హితబుద్ధి నరసినావు;
పేదయానాతండు పెద్దవాఁడై, సరి
సాటిగౌరవమంద సలిపినాఁడ;
వైదేశ్లవాఁడనై యాడు నన్నెత్తి, నీ
తోడఁజేర్చికొని, మన్నుదుడిచినావు;
చనవిచ్చి, కడుపారఁగనినపుత్రికనిచ్చి
నీయంతవానిఁగా నెరపినావు;

ఆ॥ వె॥ నీదుమాటవినక, నిన్నెడఁబాయఁగాఁ
దలఁపుఁగొనుట గొప్పతప్పె; నైన
ధర్మ మొకట, రాజ్యతంత్రమ్ము నొక్కట
నిలిపి, తూఁచి, నీవె నిర్ణయింపు॥ 41

క॥ లోకముమెచ్చినధర్మముఁ
గైకొనఁదగు; రాజనీతిగాఁ దంత్రంబుల్
వాకొందు; రడియు నదియు వి
వేకార్థం, బొండొకంట విఱుగనికలిమిన్॥ 42

ఉ॥ నాకెటునీవు, నీకు యవనప్రభుఁడల్లె; కృతఘ్నతాభరం
బేకవిధంబ; నీవుచననెంచిన మొగలుపాదుషాహి యే
మీ కుబంధువా? యహమదీశుఁడు నీ కహితంబుసేసినాఁ
డా? కడుపోమఁగా దొరకదా యొకచేరెఁడు మాతృకుక్షిలోన్?॥

చ॥ మదవదరాతి శీర్ష సుమమంజరులన్ గొనగోటగిల్లి, స
మ్మదమున దేశమాతపరపూజ యొనర్పఁగ నేరమైతి; మ
య్యది యటులుండనిమ్ము; మనసార నినున్ ననునమ్మి, రాజ్యసం
పద మనచేతఁబెట్టెఁ; దగవా సులతానుని గొంతుకోయుటల్?॥ 45

ఉ॥ నమ్మినవారలన్ నిలువునన్ బడఁగూల్చుట ధర్మమో? ప్రతా
పమ్మునఁ బందెమాడి, నిలుపన్ దలఁపొందుట ధర్మమో? విచా
ర మ్మొనరింపు; నామది తిరం బిటులయ్యెఁ;- గృతఘ్నతాపవా
దమ్ముభయమ్ము నీకుఁగలదా? యదినాకును; లేద? యేమనన్!॥ 45

ఉ॥ తప్పనిదేమొ నాకెటు కృతఘ్నత; యైనను నీవు ధర్మమున్
దప్పిన నిన్నుఁదప్పుట కృతఘ్నతగాదని పెద్దలందు; రీ
యొప్పులుఁదప్పు లట్లునిచి, యొక్కటి చూడుము; మాతృభూమికిన్
దెప్పరమైన దాస్యనిరతిన్ దొలఁగింపఁదలంచు టొప్పదే?॥ 46

తే॥ మన మహారాష్ట్రభూదేవి మునిగియున్న
దుద్ధతారి బలాంబుధి; నుద్ధరింపఁ
జొరుము; వీరవరాహబంధురత మెఱసి;
కదిసి నీవెంటవత్తు; నియ్యెడను విడకు॥ 47

ఉ॥ నీవునునేనునున్ గదిసినిల్చిన, భామినిరాజ్యమెంత? యు
ద్ధావని విచ్చిపాఱదె, భయమ్మున మొగలుదండు మొన్న? గాం
డీవికి నీడుగా, రణపటిష్ఠ విహారములన్ స్వదేశ ల
క్ష్మీవిజయంబుఁదెత్తుఁ; బరికింపుము నీవటు కృష్ణుపోలికన్"॥ 48

చ॥ అను షహజీ నుడు ల్వినుచు, నర్ధనిమీలిత లోచనాంతచా
లనపరివృత్తపాల కుటిలభ్రుకుటీ నట దాత్మభావ బం
ధనుఁడయి జాధవుండనె; "యథార్థమ నీ వనుమాట; యైన నా
కు నివి సుదుర్ఘటంబులగు గొంతెమకోరిక లంచుఁ దోఁచెడిన్॥ 49

తే॥ స్వహితపరు, లన్యవైభవాసహనమతులు
మనమహారాష్ట్రలోకపక్షమునకు రారు;
రాకపో, రొక్కటిగ జాతిరక్తి మెఱసి
నవాబులు; తలఁతు వేమేమొ నీవు॥ 50

ఉ॥ తల్లికి నోఁచకున్నఁ బినతల్లికి నోఁతురె? నిన్నుఁజూచి రా
గిల్లుట నేను బోవువఱకే; పయిమాట వచింపనేల? నీ
యుల్లమునందు నాటుకొనియున్నవి యూహలు పెక్కు; వాని న
ర్తిల్లఁగఁ జేయఁ, దాళ మొనరించెడువారల నే నెఱుఁగుదున్॥ 51

చ॥ వివరము లేల నీకు వినిపింప, వివాదముఁ బెంప? నున్న బాం
ధవమున నట్టులాడితి; గతంబు గతంబు; భవిష్యదర్థ మె
ట్లవునో! స్వయంసహాయమున కర్హతయబ్బిన, దంతెచాలు; జా
ధవుఁ డెప్పుడైన నీమనసు దాఁకిన, నాఁడె యెఱుఁగుమన్నియున్ 52

ఆ॥ వె॥ ఒకపటేలు పల్లెలకుఁ, దాత బాబాజి:
తండ్రి యైదువేల దళము నేత:
యతనిపుత్రుఁ డీమహారాష్ట్రనిర్మాత:
భోన్సలేకులప్రభూతి యార!"॥ 53

చ॥ అని లుకజీవిభుండు మనసంటినయీసునఁ "బోయివత్తు" నం
చని, బదులిచ్ఛగింపక రయమ్మున వెల్వడి, పాదుషాహి దా
పునఁ ¶ బదునైదువేల హయముల్ గలసేనకు నాథుఁడౌచు, న
ల్లునిజతనమ్ము లెంచి, యొకలోపము తాపము కోపముఁ గనెన్॥ 54

తే॥ షాహాజీ స్వప్రతిష్ఠకై సలుపుచున్న
యత్నములు తనకైన ద్రోహములుగాఁగ,
నతనితోఁ జేరుచుట్టమ్ము లాప్తులెల్లఁ
దనకు రిపులుగాఁ దలఁచి, జాధవుఁడు కినిసె॥ 55

---

¶ "Lakhoji Jadhavarao, indeed, went over to the Moghuls, who in 1621 conferred upon him command of 15,000 horse and 2,000 foot.

Page 40. "Rise of the Maratha Power", by *M. G. Ranade Vol. I,*

సీ॥ కవగూడి పెనుప్రాపుగానున్న మామ వే
ర్వడిపోవఁ, దన యొంటిపాటుఁ దలఁచి,
యభిమానధనుఁడైన యతనిమాటలడాఁగి
యుబుకారు మదిలోని యుడుకుఁ దలఁచి,
పొగరాఁజి రవిలి కప్పులనంటి మంచు నై
జామువిప్లవ దవజ్వాలఁ దలఁచి,
గుటివెట్టుకొని, గావుగొనఁ బొంచియున్న మొ
గలుసింగ ముసుటుచూపులఁ దలంచి,
తే॥ తలఁచి, యురియాడు మనసుఱెక్కలు బిగించి,
యలవుఁ జలమును బలము నిశ్చలముఁ జేసి
సిద్ధసాధనుఁడైన షాజీవిభుండు
కడఁగి కర్తవ్యదక్ష దీక్షను వహించె॥ 56

సీ॥ తనతోడి సరదారులను బిల్చి మాటాడె;
మంత్రుల వేర్వేఱ మందలించెఁ;
దనమరాటావారి నెనసి మంతనమాడె;
సామంతులకును లంచములు సూపె;
నొండొకళ్లకు మైత్రిమొదవింప సమకట్టె;
భేదవాదములఁ గల్పించి చూచె;
సులతానుమది డాసి, కలవరమడఁచి, యా
ప్తతఁ జూపి, యభయహస్తంబు నిచ్చె;
తే॥ శక్తిభక్తుల నయభయసరణిఁ గొలిపె;
నెంతయత్నించినను ఫలమింత లేక
తుదకు షాజీవిభుండు నెమ్మదిని విసిగెఁ
"బాసిపోయిన దక్క ఆపద" దటంచు॥ 57

చ॥ "మిగిలిన దొక్క-దారి; బలిమిన్ గరవాలము నెత్తి, సర్వమున్
దెగఁగొని బుద్ధిసెప్పు, టిది తేఁకువ గా; దిదిగాక, మామయున్
మొగలులఁ జేరె; నెప్పు డెటుమూఁగునొ! యెవ్వరినైన నమ్మఁగాఁ
దగ" దనుచున్ షహాజి బలితమ్ముగ యోజనఁజేసె; నింతలోన్॥ 58

తే॥ తనకు లోఁబడ కొకప్రియత్నమ్ము నడిపి,
పరులఁగూడిన యల్లునిపంత మెఱిఁగి,
నయముతోఁ గానికార్యమ్ము భయముసూపి,
మాటపట్టింపు గెలువఁగా, మదిఁ దలంచి॥ 59

మ॥ లుకజీజాధవుఁ డల్లమోగలుల బల్మిన్ గెల్వ నగ్గించి, పొం
దికపూటాడి నవాబుకన్నుడిచి, సంధిన్ బొంద నూల్కొల్పెఁ; గొం
డికవాఁడైననవాబు మెత్తవడెఁ; గౌటిల్యంబు వాటించి, మ
చ్చికఁ జూపించుచుఁ, బాదుషా యనుమతించెన్ సంతసించెన్ మదిన్॥

చ॥ గుసగుస లంతఁ బ్రాఁకి తనకున్ వినరాఁగ షహాజి చాల వె
క్కసపడుచున్, నవాబువినఁగా ననె "భీతిల నేలనయ్య మా
నసమున నీకు? మోగలులనమ్మి యెవండు సుఖంబునొందెఁ? బా
యసము విసమ్మునన్ గలుపఁడా లుకజీ? యిది నీ వెఱుంగవో?॥ 61

ఆ॥ పాముపడగనీడఁ బండెద: విపు డేమి
భయము వచ్చెనీకుఁ? బ్రాణమిచ్చి
నిన్నుఁ గాచియుందు నే" ననె షాజీ: న
వాబు వినక సంధి పట్టుకొనియె॥ 62

క॥ మంచిఁ దలంపుచు, నిటు గా
వించిన జతనంబు లడవివెన్నెల, ఫణీంద్రా
వించినపా లౌటకుఁ జిం
తించుచు, ని ల్లతఁడు తనమదిన్ దలపోసెన్॥ 63

చ॥ "తనహిత మెంచి, నా కగు హితంబు నడంచి, హితంబుఁగోరు మా
మను విడనాడి తొంటియభిమానముఁ జూప, నవాబు నన్నుఁ గై
కొనఁ; డిది వీనిలోప మనఁగూడదను, కృత్రిమరాజనీతి పం
డినఫల; మానుగాక వికటింపఁగ నేటికి మామ నాపయిన్?॥ 64

ఉ॥ నామతమున్ వచించితి; మనంబున నచ్చకపోయెఁ; బోవుఁగా
కేమి, చలంబువట్టి యది యింతలు నంతలు సేయనేల? షా
జీ మిసిమింతుఁడై తను భజించునటంచుఁ దలంచెనో? నిజ
క్షేమము దేశమున్ బరులచేతులఁ బెట్టుట యిట్టిదే కదా! 65

మ॥ "మనచేయూఁత నిజాము నిల్పుద; మహంభావించి నైజాము మా
రొక్కనుచో దాని నడంచి, మొగలులు ముక్కుంజూపకుండంగఁ బై
కొని, స్వాతంత్ర్యము నిల్పికొంద" మనుపల్కుల్ మామ కెగ్గయ్యె; న
న్ననుమానించె నవాబు; స్వార్థపరు లౌరా యెంతకుం జాలరో!॥ 66

తే॥ మొగముఁ జూచినయపుడెల్ల నెగిరిపడుచు,
"సంధి గానీయఁ" డంచు మచ్చరముఁ గొనుచుఁ,
దప్పుఁగొను రాజమాత పెత్తనముక్రింద
మనుటకంటె, నెందేనియుఁ జనుట తగదె?॥ 67

ఉ॥ ఇమ్మెయి నేఁదలంపఁ బనియేమి? యతండు నతండు పొందులా
భమ్ములఁ జూతుఁగాక: గుణవంతున కెందుఁ గొఱంతయున్నె? పూ
లమ్మినవీటఁ గట్టియల నమ్మఁగరా" దనుచున్, నిజాముఁరా
జ్యమ్మును వీడిపోఁదలఁచె; సత్త్వఘనుం డవమాన మోర్చునే?॥ 68

ఉ॥ మామయొనర్చినట్టి యవమాన, మరాజకమైనయూరు, నై
జామును మొగలు ల్గలియుసంధియునున్, దననిశ్చయంబు భా
ర్యామణి కుగ్గడించె నతఁ; డామెయు మే లనిసమ్మతించి, "యి
క్లే మనమేగుట్లొప్పుఁ; [illegible] కంచని తొందరించినన్॥ 69

### పాజీ భార్యతోఁగూడ సహమదునగరము వీడిపోవుట

తే॥ ఎవరితోఁ జెప్పఁగా మది నిచ్ఛఁగొనక,
సర్వసామగ్రిఁ గొనుచు, విశ్వాసపాత్రు
లైన సుభటులు గొల్వఁగా, నతఁడు పురము
విడిచెఁ; గాని పురం బెటు విడుచు నతని?॥ 70

సీ॥ తల్లిపా ల్త్రావి వీఁగి, తప్పితారుచు, దోఁగి
యాడిన రమ్యహర్మ్యములఁ జూచి,
చిఱుతనాఁ డీడుబాలురఁ గూడియాడిన
కమనీయ క్రీడాంగణములఁ జూచి,
పరిణయోత్సవవేళఁ బట్టపేనుఁగు నెక్కి
వలగొన్న రాచబాటలను జూచి,
నిఖలప్రభుత్వసన్నిధి దండనాథ ప
ట్టముఁ గొన్న కొల్వుకూటమ్ముఁ జూచి,
తే॥ చూచుచూపుల నూరి, యుంచులకుఁ బారి,
మగిడి, కనుఱెప్ప తుదలంటి, మంచుదొరయు
నుడుకుఁ గన్నీటి నడఁచి, "నీ వీడుతు"నంచు
నదరుఁ బెదవుల పాజీ ప్రయాణమయ్యె॥ 71

తే॥ గర్భదళములఁ బువుపిండెఁ గప్పికొన్న
పరువపుందీవ, చూలాలు, పసుపుఁ బూసి
కుంకుమముఁ బెట్టి, శివునింటికోడ లనఁగ
జీజియాబాయి ధవునండఁ జేరి నడిచె॥ 72

మ॥ తననాథుండు మనంబునన్ మిగులసంతాపంబుఁ గొన్నాఁ డటం
చనుతాపమ్మున డగ్గరించి, యుచితవ్యాహారనీహార సం
జనితాప్యాయనుఁ జేసి, మో మెనసి, యుత్సాహంబు దీపింప ని
ట్లనె "నాథా! మది నింతవంత గొననేలా? దీన మే లున్నదే?॥ 73

ఆ॥ వె॥ ఈనిజాముఱాజ్య మెట్లైన మనకేమి?
చేయవలసినంత చేసినారు;
వినరు వారు; మిమ్ము విడఁదీసె దైవ; మీ
ముంగ్లపాదల లేదొ మొగలిపువ్వ?॥ 74

మ॥ మనకున్ జిక్కులుగూర్చు నీయవననంపర్కంబు నిట్లాడఁదీ
సినపున్నెంబున కుత్సహింపవలె; గాసింబొంద మీకేల? కం
సునకుంబాసిన వాసుదేవుఁడ వటంచున్ మిమ్ముభావింతు; నా
జనకుం డీసునఁ దప్పుదారిఁ జనె; నిచ్చల్ పాపముల్ పండవే?॥ 75

ఆ॥ వె॥ ప్రకృతిసాధనములఁ బటుసత్త్వ మెనయించి,
తపముఁ జేసి, దేశదాస్యమోక్ష
సిద్ధిఁగనుఁడు; మీకు సిద్ధింపదా, భగీ
రథుఁడు గంగఁ దేరఁ బ్రభవమందు"॥ 76

మ॥ అని యావీరవధూవతంస ముచిత వ్యాపార మేపారఁ బ
ల్కిన, షాజీ కనుదోయి విప్పలరఁ దెల్విం బొంది, యిల్లాలిమే
లున కుప్పొంగెఁ; బ్రయాణ మింత చను నాలో వెన్క దూరంబుగాఁ
గనుపించెన్ జటులాపతత్తురగ రింఖాధూత ధూళిచ్ఛటల్॥ 77

చ॥ "వెనుకొనివచ్చె నీతురగవీరపతాకిని; యెవ్వరింతగా
ననువునఁ బొంచి దూఁకి" రనియారయుచో: నొకదూత వచ్చి, యొ
య్యన $ "లుకజీవిభుండు ప్రళయాంతకుఁడై మిముదాకి యోర్వఁగా
ఘనతర సైన్యమున్గొని, యెకాయకి వచ్చె" నటంచుఁ దెల్పినన్॥ 78

---

$ "Lukhaji pursued him until the barriers of Phaltan were reached."

Page 18. "The Life of Sivaji Maharaja", by
*N. S. Takakhav, M. A.*

ఉ॥ అల్లుఁడు లేఁడు; తోడిభటు లంతకు లే; రొక శ్రీనివాస రా
వల్లన వచ్చి యున్నకథయంతయుఁ దెల్పిన, నూర్పువుచ్చి, ఘూ
ర్ణిల్లుమనంబుతో మిణుఁగుఱించిన కన్నులతోడ జీజియా
యుల్లము దూసిపోవఁ బరుషోక్తులఁగ్రిక్కి, లఖూజి యిట్లనున్॥ 91

ఉ॥ "తప్పిగొనెంగదే పరువుదప్పినశూరుఁడు! మీస మున్నచో
నిప్పని సేయనేల, యెదురెక్కి నిలంబడి పోరరాదె? యీ
యప్ప యరిప్రకాండము లయంబొనరించి, స్వదేశలక్ష్మికిన్
గొప్పకిరీట ముంచునఁట, కోటలుదాఁటెడు మాటలేటికో!॥ 92

సీ॥ నీమాటవినని నాతో మచ్చరించి, నీ
మతము సాధింపఁ గుచ్చితముఁబూని,
నీశ్రీనివాసుతో నీమేనమామతోఁ
గుటిలుఁడౌ మోహితేకులజుతోడఁ
గలయికల్నెఱపి, చొక్కపుఁజెల్మిఁ $ జుట్టఱి
కంబు నొండొరులతోఁ గట్టిగొనుచు;
నను విడఁదీసి, యీసునఁ జిక్కుముడివెట్టి
యడఁగఁద్రొక్కఁగ నిట్లు వెడలినాఁడ;
తే॥ గీ॥ విది యెఱింగితి మొన్న; నీమెదడుఁదీసి
చక్కఁబఱుపఁగా నిటు కాలుద్రొక్కుకొనుచు
వచ్చితిని; నీబలంబెల్లఁ దెచ్చి నిలుము:
తేల్చెదను నేనొ వారలో దిక్కునీకు॥ 93

ఉ॥ నాపెనుపొంది, నాదుకరుణంగొని యల్లుఁడవై ఘనుండవై
రేపునుమాపు నన్ననుసరింపుచు, నేఁటికిఁ గోఱవచ్చి, న
న్నాపుచు బుద్ధిసెప్పఁగలవా తులువా? నినుఁ జేరఁదీసినన్
బాపపుఁ బాఁపజాతులకుఁ బాలిడిపెంచిన ముప్పుదప్పునే?॥ 94

$ "He (Lukhaji) feared that Shahji might be reinforced with the militia of the Nimbalkars." *N. S. Takakhav.*

లుకజీ జీజియాల సంభాషణము.

ఉ॥ ¶ నాయుపకారమెల్లఁ దిని, నాకె దురంతము లెన్నుచున్, విష
ప్రాయుఁడవైననిన్ దఱిమిపట్టక, యాయువుముట్ట కుండరా:
దేయెడనైన దిక్కుగలదే గొనిర” మ్మనునంత, జీజియా
డాయుచు, “నాగు-మాగు: వికటంబుగఁ దాండవమాడనేటికిన్?” 95

మ॥ అని కాత్యాయనివోలె దూఁకి, సముఖంబై, కంటఁ గెంపూర, నీ
వినసింగంబటు రోఁజుచున్ బలికెఁ “గానీ! దిక్కులేదేమి నా
కును నాభర్తకు? నాయువుంగొనెదవా కోర్కె? రమ్ము నేనుంటి నా
తనియర్థాంగము; నేమిచేసెదవో, పంతంబెట్టిదో చూచెదన్! 96

ఉ॥ అంతరువెంచి, నీదుమరియాదలనెంచి, హితంబునెంచి వ
ర్తింతువుగాక; నీపలుకుతీండ్రమునన్ మదివేండ్రి మొప్ప న
ర్తింతువో, జీజియాను గుఱుతింపవో, చంపెదో, చంపనేర్తువో?
యెంతకసాయి! పీవు మనియే, నను దిక్కఱఁజేయుచుంటివే!॥ 97

ఉ॥ కెవ్వన హుంకరించి యడికించెద, నాయుధ మెత్తనుంటి వీ
వెవ్వరిపైన? నీయెడఁద కింతవివేకము చాలదయ్యెనే?
గువ్వలుఁగూడఁ గాన్పులను గూరిమిఁ బెంచుజగంబునందు నీ
వెవ్వఁడవయ్య? యాదరణకెక్కరె యల్లుఁడు నాడుబిడ్డయున్? 98

చ॥ కనికర మింతలేనికొటికాఁడవు నన్నిటుపెంచనేల, పు
ట్టినయపుడే గళ మ్మటమటించినఁ బోవదె? వెంటనంటి యి
య్యనువున వేఁటలాడ మనసయ్యెనె? కన్ననిసుంగు ప్రింగువ
ర్తనమది సర్పజాతికిఁగదా, యొకమానవుఁ డిట్లుసేయునే॥ 99

---

¶ “Her father never excused the injury that had mortified his pride, and the turn of events, which made Shahaji king-maker at Ahmednagar and Daulatabad, only aggravated this enemity ...... He retired to Bijapur hotly pursued by his father-in-law” *M. G. Ranade.*

మ॥ ఒక కీడే యొనరించినాఁ డనుము, నీ వుద్రేకముఁ గాంచుమో?
ప్రకటంబౌ మనజాధవాన్వయపుమర్యాదల్ దిగంద్రోతువో?
"లుకజీ యల్లున కిల్లొనర్చె ననుచుఁ లోకమ్ము పైకెత్తుని
దకు నీయూఁదలవంతువో? ప్రణయబంధ మ్మిట్లు పోకార్తువో?। 100

తే॥ వింతవేమకఁ దొలికాన్పు సంతరించి
బుడుతమన్మనిఁ గౌఁగిటఁ బొదివికొన్న
సదయహస్తంబు లిపు డిట్లుపదిలపడెనె
పదనుకత్తులఁ గుత్తుకల్ చిదిమిపోయ?॥ 101

తే॥ పసుపుఁకుంకుము, నుదుటిపై బాసికంబు
పెండ్లియుడుపులు, నునుసిగ్గుపెంపు దోఁప,
నడుగులంటిన మ మ్మెత్తి, యాదరించి
యిడిన దీవనపరమార్థ మిదియె, తండ్రి?॥ 102

సీ॥ అనురాగనిలయ నాజననిమాల్యాదేవి
కడుపులోఁ గార్చిచ్చుఁ గనలఁజేసి,
కన్నీటిబుగ్గ బుగ్గలజాఱఁ గుమిలిపో
యెడు నన్న "యక్లోజి" యెడఁదఁ ద్రుంచి,
తల్లితెక్కలప్రోపుఁ దలఁగని సాంభాజి
భావిజీవితనౌక భంగపఱచి,
కమియమాగినపండు గర్భపిండ మగల్చి
కఱకుఁగాఁకలదాలిఁ గ్రాఁగఁజేసి,
తే॥ ఇంతప్రళయంబుఁ గలిగింపనేలనయ్య?
కనికరములేదొ, పాపసంకటమురాదొ
కన్నతండ్రివిగాదొ, యక్కసముపోదొ
వలదువలదయ్య పచ్చనియిలు రగుల్ప! 103

సీ॥ రంగపంచమిపండుగం "గులాల్బుక్క" యూ
డెడుమమ్ముఁ గని కూర్మిపడిననాఁడు
పదిమందిబందుగుల్ బలిసినచవికెలో
మెచ్చి కన్యాదాన మిచ్చునాఁడు
పెండ్లిలో మెఱవడివెంట బెత్తముఁగొంచు
జనుల బరాబరుల్ సలుపునాఁడు
పుడికి బుద్ధులుసెప్పి, యొడినించి, మగనితో
నత్తగారింటికి ననుపునాఁడు
తే॥ మొగమునందాడు నానందముదరి నేఁడు
చెదరి భయదమై నిప్పులుచెరుగుచున్న
దయ్యొ! కనుఁజాల నిను; నీ లయాంతమూర్తి
యుడిగి, శాంతించి, సుప్రసన్నుఁడవు గమ్ము!॥ 104

ఆ॥ వె॥ ఉబికి, రెండుకనుల నురియాడుచున్నది
కన్నప్రేమ - నన్నుఁగొన్నప్రేమ
నాకెకాదుఁ జూడు నీకును; దండ్రి! యీ
కనుల మూసికొనెదొ? కాచికొనెదొ?॥ 105

మ॥ పసుపుం గుంకుమ పూలు పూజలిడి, సౌభాగ్యంబు శోభిల్ల, భూ
మిసురవ్రాతము దీవనల్ గురియ, నా మేలెంచి కట్టించి తిం
పెసఁగన్ మంగళసూత్ర మీమెడను; దండ్రీ! దీని నీచేతులా
ర,"—సతీరత్నము వెక్కియేడ్చె నెదజాఱన్ రుద్ధకంఠంబునన్॥

చ॥ పలపలఁ గంటిజా లురలిపాఱఁ, గరాళకరాసి జాఱఁ, దొ
ట్రిలునడ మీఱ, జాథపుఁడు ఱిప్పునఁ బుత్రికదాపుఁజేరి, చే
తులఁగొని, యక్కునన్ జొనిపి, తొంగలిఱెప్పలసోన లొత్తి, కెం
పొలసినబుగ్గల న్నిమిరి, ముద్దాడినకుత్తుకతోడ నిట్లనెన్॥ 107

సీ॥ “కళవళపడి యెంతయలసితివే తల్లి!
దయలేని నావంటితండ్రివలనఁ,
దడిలేదు పెదవిపై, దడ తగ్గలే, దపా
యములేమగాదె గర్భాశయమునఁ?
గనలుకుంపటి రాఁజుకొని కాఱుపొగ ప్రాముఁ
గననైతి నిట్లంటుకొనుట, తల్లి!
తఱిమొంచి, యమృతమ్ముగురియించి, సొదనార్పి
నిలిపితివమ్మ! పెద్దలతపమ్ము;
తే॥ ఆఁడుబిడ్డవు, దొడ్డయిల్లాల, విపుడు
నిండుచూలాల, వీవు కన్నీరువిడువ
నాకులమునిల్చునే? తల్లి! నన్నుఁజూడు
చూడు నీపుట్టినింటికి శోభనములు॥ 108

చ॥ ననువిను; సింధుఖేదునకు నావెనుకన్ జనుదెమ్ముతల్లి! నీ
పెనిమిటినిన్ గుమారుఁ బిలిపించెదఁ, గానుపు సంతరించెదన్,
దనయునిఁ గుస్తరించుకొనుదంపతులన్ మిముఁ దండ్రిచూపులన్
గని మది సంతసింతు; నుపకారమయీ! యిది సమ్మతింపవే!”॥ 109

చ॥ అని బతిమాలుతండ్రి కిటులాడె “దయామయ! నీమనంబువ
చ్చిన, దిదిచాలుఁ; జాలనివిశేషము దైవము నిర్వహించు; నా
ధునిపను పిట్టులుండె; నిది త్రోయఁగరా; దభిమానశాలి నిన్
గన మొగమోడు; ఆయనకుఁగానిది నాకును నీకు నర్హమే?॥ 110

ఉ॥ అక్షరమక్షరం బెఱుఁగవా తమయల్లునిచిత్తవృత్తి? ప్ర
త్యక్షమగాదె నీ కెదిరియాడక యూరక జాఱిపోక! శాం
తిక్షమ్ము నన్యబుద్ధి గమనింపను; తెంపకు ప్రేమవల్లి; ఫా
లాక్షునితోడుగా నతనియం దొకదోసము లే; దెఱుంగవే!॥ 111

తే॥ తండ్రియెడఁదలోఁ దనయకుఁ దావుగల్గి,
యల్లునకు లేకపోవు టెంతైనఁ గలదె?
తలఁపకుము వేఱు; నీ ప్రేమనిలయమునకుఁ
దలుపుమూయకు; మిదియె ప్రార్థనము తండ్రి!"॥ 112

సీ॥ అనుమాటలకు బదులాడఁజాలక, లుక
జీ జాధవుఁడు సుతచేయి వట్టి,
"భయపడకమ్మ! నీపతియండ నుండు; మీ
జరిగినదంతయు మఱచిపొమ్మ;
తలఁచినమాత్ర తెక్కలుగట్టుకొని వచ్చి
వ్రాలెద; దూరమఁగావగపుఁ గొనకు;
కనుగల్గియుండు; మీకానుపు సేయ మీ
తల్లి మాల్యాబాయి తరలివచ్చు;"
ఆ॥ వె॥ ననుచు బుజ్జగించి, యభయహస్తం బిచ్చి
వలయుధనము దీవనల నొసంగి
శ్రీనివాసరావుచేతిప్రా పమరించి
జాధవుండు మరలిచనియెఁ బురికి॥ 113

తే॥ ఒక్కదక్షుఁడు, జయచంద్రుఁడొక్కఁ డుండి
రవని విపరీతదృష్టాంత; మంతెగాని,
కన్నబిడ్డకై ప్రాణముల్ కరఁగిపోయు
తండ్రియెడఁదకు సహజవత్సలత యరుదె!॥ 114

ఆ॥ వె॥ ప్రాణమెత్తుచూచి, పరిచర్య నడిపించి
జీజియా మనంబుచింత లుడిపి,
తడవు కొంత గడపి, దాదోజిఁ బిలిపింప
శ్రీనివాసరావు చెప్పిపంపె॥ 115

## దాదోజీఖాండదేవునితో జీజియాబాయి శివనేరుఁ జేరుట.

సీ॥ కలికు కొండలు గాసి, కాఱుమబ్బులు రేఁగి,
చిమ్మచీఁకటి తెరల్ గ్రమ్ముకొనుచుఁ
దళతళ మెఱపుల్ బెళపెళయుఱుములై
కుండపోఁతలవాన గురిసి వెలియు
సుప్రభాతమునాఁటి సురుచిరప్రకృతి శో
భల శాంతగంభీర భావుకముల
ననుభవింపుచు, జీజియాబాయి విస్మయ
వికచనేత్రముల భావింపుచుండ

తే॥ గీ॥ నంతలో నేగుదెంచె, బ్రహ్మస్వరూప
తా సుభగమూర్తియై వచ్చుతరణికరణి
ఘనుఁడు విశ్వాసి దాదోజిఖాండదేవుఁ
డనెడు సచివుఁడు బ్రాహ్మణుం డామెకడకు॥ 116

క॥ వచ్చినయతనిఁ గని, సిరి
వచ్చినయటు చన్నయుసురు వచ్చినయటుల్
మెచ్చుచు, విచ్చినమొగమునఁ
దచ్చరణములందుఁ గంటితడితో వ్రాలెన్॥ 117

తే॥ భర్త నెడఁబాసి, వాల్మీకిపదములంటి
పనవుచున్న సీతను దలంపునకుఁదెచ్చు
జీజియాబాయి నెత్తి, దాదోజి చలువ
పొలపమున నూఱడించుచుఁ బలికెనిట్లు॥ 118

ఉ చ॥ "అడలకుమమ్మ! నీచరితమంత యెఱింగితి; నీ విటుల్ భయం
పడఁ బనియేమి? నాయుసురు పందెముగా నినుఁగాచికొందు; నె
ప్పుడు తగవేది, యట్టియనువుల్ పచరించెదఁ; గార్యమేమియి
య్యెడ? శివనేరుదుర్గమున కిప్పుడ పోవుద" మంచు, నాతఁడున్॥ 119

తే॥ పూలపలుపులఁ బల్లకిఁ బొందుపఱచి,
జీజియాబాయి నందు వేంచేయఁజేసి,
తగిన పరివారముల్ గొని తరలి చనియెఁ,
బ్రోవఁగాచుచు "శివనేరు" దుర్గమునకు॥ 120

తే॥ ఉచిత పరికర భరితమా నొక్కమేడ
విడిసి, తండ్రియై దాదోజి వేయికనుల
నరయుచుండఁగఁ, బలిరాక లరయు చామె
కణ్వుచెంత శకుంతలకరణి నుండె॥ 121

షాజీ తనకర్తవ్యము నిశ్చయించుకొనుట

ఉ॥ జున్నరుపీడి, దాపయినచోట నొకించుక వేచి, న్యాయయుక్
జన్న తెలుంగు నాత్మసతి సౌఖ్యముగా "శివనేరు" దుర్గమం
దున్న తెలుం గెఱింగి, మదియూఱటఁబొంది; షహాజి మీఁదఁబో
నెన్నుచుఁ, బైపయిన్ మొలకలెత్తుతలంపులఁ దోఁగె నీగతిన్॥ 122

తే॥ గీ॥ "నెలలునిండినసతిఁ బాయు నెఱిఁ దపింతు
నా? నిలువులేని రాజ్యతంత్రముఁ దలంతు
నా? పగలుగొన్న చుట్టాల ననుసరింతు
నా? యొకనిఁబట్టి దైవ మిట్లాడనేల?॥ 123

చ॥ ఇది యొకదుర్ఘటంబగుపరీక్ష; తితిక్షకుఁ దావులేను; "మే
లిది" "యిదికీ" డటంచు మనసిచ్చి, సహాయముఁజూపి, వెంటదూఁ
కెదనను మామ యిట్టులడికించె; నిజామునవాబు కొన్న మే
లదిమి కృతఘ్నుఁడయ్యె; నిఁక నాత్మసహాయమ నిల్చియుండెడిన్॥

చ॥ అనుకొనియుంటి, నాబలమునంతయు నూఁది స్వతంత్రరాజ్యల
క్ష్మిని నెలకొల్ప; మామ యది ఛిన్నముభిన్నముచేసె; మామయే
యని యననేల, దైవమున కయ్యది యిష్టముకాదు; కానిచో
ననువులుదప్పునే? యిటుల నందినకొమ్మలు చీలిపోవునే?॥ 125

ఉ॥ ఒక్కొకఁ డుద్భవించు, బలుపొందిన యాత్మబలంబు నూఁది లా
వెక్కుచుఁ ద న్నెదుర్చునవియెల్లను ద్రొక్కుచుఁ, ద న్నడంచినన్
నిక్కుచు, నిప్పు - నీరమున, నిప్పుల - నీరము నేర్చికూర్చి పై
కెక్కెడు ధీరసత్త్వుఁ; డిది యెల్లరకున్ దరియాకొలందియే!॥ 126

ఉ॥ నా కొనగూడియున్న కరణంబులు లావటియుండె; నెందునన్
శా్రీకి ధణంధణించె యవనప్రభుతాపటు తాండవంబు; నా
యేక ధనుర్ధరత్వము జయింపఁగనోపునె దీని? నిప్పు డా
కోకిలవృత్తి యుత్తమ మగుందగ తెక్కలువచ్చునంతకున్॥ 172

ఆ॥ వె॥ కడఁక సమయమోర్చుఘనుఁ బంద యన్నచో
మోటుతెగువవాని మూర్ఖుఁ డనరె?
అడఁగుఁగాక, పేడియగుఁగాక, పెనువీఁక
నాలఁ ద్రిప్పువాఁడె యర్జునుండు॥ 128

ఉ॥ మోగలుపాదుషాహి తనుమ్రొక్కినవారలఁ ద్రొక్కివైచు; నా
యాగమనంబుఁ గైకొన దహమ్మదురాజ్యము; గోలకొండలో
నా గుఱుతున్నవారలు గనంబడ, రొంటరిపాటు మేలె? నా
జాగిరుఁ జేరునేర్పున బిజాపురమున్ గదలించిచూచెదన్॥ 129

చ॥ అగును మురారిపంతు సచివాగ్రణి యచ్చట, మేటిమాటఁ దీ
ర్పఁగలుగు నేర్పువాఁడు, కులబంధువు ప్రాణహితుం; డతండు నా
కగు నుపకారమారసి సహాయము చేయకపోఁడు; వ్రేలుమో
పఁగ నెడమున్నఁ గా లిడఁగవచ్చుఁ, బరుండగవచ్చు నాపయిన్॥ 130

తే॥ గీ॥ జీజియాబాయి నోమ దాదోజి గలఁడు,
భయములే" దని తలపోసి, భటులఁగొనుచుఁ
దరలి, "భీమా" తరంగిణి తటమువెంట
నడచి, "సూపా" భిధానమండలముఁ జేరె। 131

క॥ ఆ మండలమున "సూపా"
నామకపత్తనము: దాన నవ్యవిభవశో
భామంజులమైతగు నిజ
ధామంబున విడిసి, కార్యతత్పరుఁ డయ్యెన్॥ 132

చ॥ తనభటులందు నొక్కయుచితజ్ఞుని ధీరునిఁ బల్కుపొందువిం
దెనసినవానిఁ జేరి, తగవెల్ల వచించి, "హితమ్ముఁగొంచు ర"
మ్మనుచు బిజాపురమ్మునకు నంపి, నిజోద్యమసిద్ధిఁ గోరుచున్
మునుకొని దుర్గముల్ బలఁగముల్ గమనింపుచునుండె నచ్చటన్॥

తే॥ ఇంతలోన బిజాపుర మేగినట్టి
భటుఁడు చనుదెంచి యచ్చటివార్తఁ దెలిపె
దాన లాభములేమి వ్యక్తముగఁ దెలిసి
యరయుచుండె స్వతంత్రరాజ్యంబు తెరువు॥ 134

శివాజీ జన్మవృత్తాంతము దాదోజీ షాజీకిఁ దెలుపుట.

మ॥ అలసాయాత సమీర సంయమిత సంధ్యా గర్భనిర్భిన్నకం
దళ బాలారుణ పాదచోదన దళన్మందేహ సందోహమై
చెలువొందొకసుప్రభాతమున షాజీ కాల్యకృత్యంబులన్
గలయన్ దీరిచియుండ, వచ్చె నటకున్ దాదోజి మోదంబునన్॥ 135

ఉ॥ విచ్చినమోముతో, విరియవిచ్చినకన్నులతోడఁ జేరఁగా
వచ్చి "సుపుత్రలాభమున వర్ధిలు" మంచు శుభాశిషమ్ము వా
క్రుచ్చినఁ, బొంగి మేనఁగలక్రొన్నగలెల్లను నిల్వుదోఁపుగా
నిచ్చె షహాజి యాతనికి, నెల్లరకున్ దగఁబంచెఁ గానుకల్॥ 136

క॥ "జీజా సుఖమున్నదె దా
దోజీ! సుతుఁడెట్టులుండె? దోసమ్ములు లే
వే? జాతకమెట్టిది?" యని
షాజీ ప్రశ్నింప, నతఁ డెపంగ నిట్లనియెన్॥ 137.

ఉ॥ "ఏయెడరుఁ దపోబలము నెల్లలముఁ? సుఖముండె జీజియా
బాయి; కుమారుఁ డున్నత శివంకరలక్షణ లక్షితుండు; రా
జా! యవిజయ్య తేజమున కాస్పద మాముఖమండలంబు ని
ధ్యేయము; యిట్టిమూర్తి గలదే జగమందని నాకుఁ దోఁచెడుఁ॥ 138

ఉ॥ మూఁడవకన్ను నెన్నుదుట, ముమ్మొనవాలు కరమ్మునందు, రే
ఱేఁడు శిరమ్మునందుఁ జిగిరింపక, నాఁ డనసూయయింటఁ బా
రాడినపాపఁడే మనగృహమ్మున నేఁ డుదయించెనేమొ? తే
కాడినవానిచాయ లవి యట్టివి; ధన్యుఁడ వీవు భూవరా! 139

తే॥ ¶ పదియునేనూర్ల నాలుగుపదుల తొమ్మి
దైన శాలివాహనశక హాయనములఁ
ప్రభవ వైశాఖ సితపక్ష పంచమీ కు
జాంక వాసరమున సుతోదయము రాజ!॥ 140

క॥ శివ మార్ద్రానక్షత్రము
శివదైవత, మమృతకరుఁడు చెందినవేళఁ
గవి దైవత వృషరాశిఁ
భువనోద్ధారకుఁడు సుతుఁడు పుట్టె నరేంద్రా!॥ 141

¶ "క్రీ॥శ॥౧౬౨౭ సం- ఏప్రెల్ నెల ౨౫ తే॥ కలిగతము ౪౭౨౮, శాలి ౧౫౪౯ విక్రమ ౧౬౮౪ ప్రభవ సం॥ వైశాఖ శు॥ ౫ మంగళవారము ౧౯-౪౮, ఆర్ద్రా ౫౪-౦ అతిగండ ౩-౩౭, బాల ౧౯-౪౮, ది-వి ౧౬-౩ త్యాజ్య ౩-౫౦, అహస్సు ౩౧-౨౪ భుక్తి ౧-౪౦, ఈరోజున ఉదయాది ౫-౩ ఘడియలకు వృషభలగ్నమందు జననము.

—: శ్రీ శివాజీ జాతక చక్రము :—

| | ర బు | ల | చం |
|---|---|---|---|
| కు శు | రాశి చక్రము | | రా |
| కే | | | |
| | గు | | శ |

| | శ | ల | శు |
|---|---|---|---|
| రా | అంశా చక్రము | | ర |
| | | | కే |
| చం కు | బు గు | | |

"శ్రీశివాజీ జాతకగ్రంథము" తెల్కపల్లి వెంకటసుబ్రహ్మణ్యసిద్ధాంతి.

తే॥ ఆర్యమతములఁ బరులు ఱాపాడునాఁడు
శంకరాచార్యుఁగన్న వైశాఖపంచ
మీదినంబిది నేఁడు జన్మింపఁజేసె
నపరశివు: నెట్టిమేలు ముం దరయఁగలదొ!"॥ 142

తే॥ అని పలుకు ఖాండదేవువాక్యముల కలరి
"సర్వమును శ్రీభవానీప్రసాద" మనుచు
సంతసముఁదెల్పి, మనసులో సరదుకొన్న
చిటితలంపుల షాజీ వచించెనిటుల॥ 143

మ॥ * "మును మాతండ్రికిఁ డెల్ల భవానియె వరంబుల్ గొన్ని "నీవంశమం
దనఘుం డొక్కఁడుపుట్టి, నాతఁడు స్వరాజ్యంబుల్ బ్రతిష్ఠించి ని
ల్పును ధర్మస్థితి, యిర్వదేడు తరముల్ పాల్పారుఁ దద్రాజ్య" మం
చని; యీనాఁడవి నిక్కమైనటులతలంపై కోర్కు లూరించెడిన్॥ 144

ఉ॥ $ మున్నొకనాఁడు నిద్రఁగనుమూసిన నా కొకయోగి తోఁచి, పై
చిన్నెలె పల్కి, పండొకటి చేతనిడెన్, జనె; మేలుకాంచి నే
విన్నది జీజియాకు వినిపించితిఁ; బండు భుజించినాము; నాఁ
డిన్నియు స్వప్నగాథ, లవియే నిజమయ్యెఁ గ్రమక్రమంబుగన్॥ 145

---

* Goddess Bhavani declared to ·Mallojee; namely, that "There shall be one of thy family who shall became a king: he shall be endowed with the qualities and attributes of Sambh; he shall re-establish and preserve justice in Maharashtra;........his reign shall form an epoch and his posterity shall mount the throne for twenty-seven generations.
Page 71, A History of the Mahrattas, by *James Grant Duff*.

$ One night he (Shahji) dreamt that a Hindu anchorite put a mango in his hand and said: "Share the fruit with your wife and you will be the father of a son, who will be the incarnation of the God Shiva." When Shahji awoke

సీ॥ అహమదునగరంబునం దున్నయపుడె మా
యిరువురిలోఁ దోఁచె నివియ రెండు
బాధవుండిచ్చిన చనవు వాని భరించి
పాదుల నెదిగించి ప్రోదిసేసెఁ;
బ్రతికూల కాల తీవ్రతరేఁగి, యింతలో
వానిసుస్థితికి నెవ్వగలు గూర్చె
నిజసత్త్వమెనసి పూనికమెట్టి తఱిఁబట్టి
యనుకూలగతి నిప్పు డవతరించె
తే॥ ¶ నవియసుమ్మి స్వతంత్రరాజ్య ప్రతిష్ఠ
యొకటి, జీజియాగన్న యభ్యుదయ మొకటి
నేను దానిని, నీవుదీనిని భరించి
పెంచుదము, దానినిది ముందు పెంచుఁగాక॥ 146

తే॥ గీ॥ శ్రీ శివాదేవికరుణ నార్జించుకతన
నిపుడు శివనేరుదుర్గమం దెనయుకతన
ముందు హైందవధర శివం బందుకతన
నితనికి "శివాజి" యనునామ మే నొనర్తు॥ 147

చ॥ ఇఁకఁ బయనింపుమీావు; బరువెల్లను నీపయి నిల్పియుండెఁ; బు
త్రకుఁ గనిపెట్టి; జాగిరులరాబడిఁ బెంచుచు, రాజ్యభారముః
సుకముగఁ దీర్పు; మీా వనుపుసొమ్మున సాగుచునుండు నాదుపూ
నిక; తగుసూత్రధారుఁడవు నీవ గదయ్య స్వరాజ్యనాటికః!॥ 148

---

from his dream, he found a mango in his hand, visited his wife and shared it with her. The offspring of this reunion was the birth of a little boy,

*Page 181 "Great Men of India" by Rush Brook Williams.*

¶ ".... .... and he (Shahji) was himself secretly preparing for the inauguration of an independent sovereignty." N. S. T

తే॥ జరుగుసంగతులెల్ల నీ వరయుచుండి
వలయుచో సాయమేదైనఁ బంపుచుండు,
మరుగుమిా" యంచు దాదోజినంపి, తాను
సమయసముచితసన్నాహ సహితుఁడయ్యె॥

సీ॥ "అలజహాంగీరు మొగలుపాదుషా పోయె"
ననువార్త యింతలో నతఁడు వినుచు,
"దైవము నాప్రయత్నము మెచ్చె, నిఁకఁ గొంత
యడఁగు మొగలు దండయాత్ర, లిప్పు
డహమదునగరరాజ్యము నన్నుఁ దాఁకలే,
దనుకూలమిది" యని యపుడె కదలి,
"భోఁసలే" కుల మూలపురుష వాసస్థాన
మగు "వెరోళా" ప్రాంత మాక్రమించి,

తే॥ బలిసి, "జున్నరు" "దౌలతాబా" "దహమదు
నగరు" "సంగమనేరుల" నడుమఁగల్గు
దేశమును గెల్చి, వైరుల తేజ మడఁచి,
యచట ❀ షాజీ స్వతంత్రరాజ్యమును నిలిపె॥ 150

చ॥ పృథులతరంబు "భీమగడ" పెద్దలుగట్టినకోట నేఁటికిన్
శిథిలతఁ బొందియుండ, షహాజీ యది చక్కనొనర్చి, వైరిని
ర్మథనబలంబు లందుఁ దనరన్ "షహాజీగడ" మన్నపేరునన్
బ్రథితముగా నొనర్చి, యది ప్రాపుగ నేలుచునుండెఁ బ్రాంతముల్॥

---

❀ "He brought within his grasp all the Balaghat (upland) country from Junair and Sangamner to Ahmadnagar and Daulatabad and attained to great power."

Page 249. "The Moderan Review" September 1917.
'The Rise of Shaji Bhonsla' by
*Prof. Jadunath Sarkar, M. A. F. R. S.*

ఉ॥ కాలము కొంతపోయె; నట "ఖాండిషు" నేలెడు "కాణజహానులో
డీ" లయకాలుఁడై ప్రతిఘటింపఁగ, వాని నడంపవచ్చె నా
భీలత షాజహా; నతఁడు పెంపుమెయిన్ దనపైకి వచ్చుచో
నాలము పోలదంచని షహాజియు సంధియొనర్చె వానితో॥ 152

తే॥ కన్నుడచి పాదుషా నిట్లు కలియఁబలికి,
కన్ను బెదరించి నైజాముకాలుగట్టి,
కన్నుగలిగి స్వరాజ్యంబుఁ గాచికొనుచుఁ
గుఱచవాయ నైజాము లోఁగొనియె నతఁడు॥ 153

ఆ॥ దండుగట్టుకొని, "పరెండా" పురమ్మును
గెలిచి రాజధానిసలిపి, యందు
విడిదిసేసి రాజ్యవిభవ మేలుచునుండె,
నపుడె యొకవిపర్యయంబు జరిగె॥ 154

లుకజీహత్య; షాజీ జీజియాల పరితాపము.

సీ॥ తముపీడి స్వార్థలాభముఁగోరి, మొగలు
పాదుషా పాదంబుపట్టె ననుచుఁ,
దమమర్మములు సెప్పి తంత్రముల్ నడిపి, మొ
గలులదాపునఁ గమ్మ నలిపె ననుచుఁ,
దమకుఁ బ్రాపైనయుత్తము షాహాజీఁ దోలి,
తమకు దౌర్బల్యంబుఁ దార్చె ననుచుఁ,
దమరాజ్య మతఁడు కొంతకుఁగొంత గైకొను
చుండ, నూరక చూచుచుండె ననుచు,

తే॥ ఇంత లుకజీకుతంత్రమం చెంచి పొంచి,
నమ్మకముఁజూపి, రాజకార్యమ్ము పేరఁ
బిలువనంపి, నిజాంనవాబులు వధించి
రతని సకుటుంబముగ సభాభ్యంతరమున॥ 155

మ॥ ఒకనాఁ డాషహాజీహితుండగు నిజాముద్యోగి యేతెంచి, చీ
లికలైయున్న నిజామువిప్లవము లోలిన్ దెల్పి, "మోసంపు ట
ల్లిక సుల్తానులు గొల్వుకుంబిలిచి బల్మిన్ బుత్రునిన్ బౌత్రునిన్
లుకజీజాధవుఁ గొంతుకోసి" రనుపల్కుల్ వల్కఁగా రుద్రుఁడై॥ 156

శా॥ "ఏమేమీ? లుకజీవిభున్ దునిమినారే? కొల్వుకూటమ్ములో
నే? మోసంబొనరించియే? తెగువయేమీ త్రుళ్ళిపాటెంత? సుం
తే మామాటఁ దలంపరే? తలచినారే దిక్కులేదంచు? నై
జామ్మెల్లన్ దిటమాని వటంచు నడియాసన్ జేసి చెల్లాడిరే?॥ 157

శా॥ వాలున్ డాలునుబూని బట్టబయలన్ బోరాడి పోరాడుచున్
లీలాకేళి నరాతిమస్తముల బల్మిన్ దున్మితూఁటాడఁ మీ
సాలన్ ద్రిప్పిన నొప్పుఁగాక; యిటు మూసన్ ద్రమ్ముచున్, వంటయి
ల్లాలై కూరలుగాయలున్ దఱుగుటేర్పా నేర్పు వీరాళికిన్?॥ 158

శా॥ మోగల్ సైన్యములున్ బిజాపురబలంబుల్ చుట్టి ధట్టించునాఁ
డీ గాండ్రింపులు లేవు; నేఁడు పులులైరే, యిట్లు వేఁటాడిరే!
మోగల్ పాదుషహాను జేరుటయె తప్పో? తప్పు దండించుటో
యీగోషా తెరగ్రుద్దులాటలివి? ఛీ! ఛీ! యింత కార్పణ్యమే?॥ 159

ఉ॥ చేసిరి చేతనైనపని చీఁకటికొట్టున; దీన క్షాత్రవు
ల్మాసిరటంచు నూఱట జెలంగిరొకో సులతానుగారు? వి
శ్వాసనిహంతలన్ బులిమి పామెడు దాఁక మరాటుఁ డెవ్వఁడే
నీసుదొలంగఁడం చెఱుఁగఁడే? యిఁకనైన నెఱుంగకుండునే?॥ 160

మ॥ ఒకచో మామకుమామకునున్ గలుగఁగా కొక్కింత భేదమ్ము, కం
టికినిన్ ఱెప్పకు దూరమౌనె? మదిఁ గౌటిల్యంబుఁ బాటించుచున్
లుకజీజాధవు నట్లు సేసినపు, డల్లుండైనవాఁ డెంత తే
లికయైపోయెఁ! గులావమాన ఖలికాత్మిన్ గ్రుంగువారుందురే?॥

తే॥ అనుచు, నవమానధూతరోషాగ్ని యొకటఁ
గుములుచుండ, వేఱొకట దిక్కుదరిలేక
కఠినహత్యా విదీర్ణాంగకములఁ బొరలు
చున్నచుట్టాలు మదికిరా నూర్పువుచ్చి॥ 162

మ॥ "కసురుంబిందెల దూసిపోసి చిదుమంగాఁ జేతులెత్లాడెనో!
నిసుఁగుల్ దిక్కఱి యెంతగాఁబదరి "తండ్రీ"యంచు వాపోయిరో!
యసిధారన్ జళిపించి పైఁబడెడు హత్యాభృత్యులన్ గాంచుఁ, దా
నసహాయుండయి మామ యెట్టి మరణాయాసంబునన్ గ్రాఁగెనో!॥

ఆ॥ వె॥ "అందఱుండి తండ్రి యాఱడిఁబోయెనే!
యాపువీరుఁ డొక్కఁడైన లేఁడె!"
యనుచుఁ బనవు జీజియాబాయిమొగ మెట్లు
చూడనేర్తు! మొగము చూపనేర్తు!"॥ 164

చ॥ అని బలితంపుఁజింత నురియాడుచు నూరుపువుచ్చి, జీజియా
కనువుగ వార్తనంపి, యెట్లులైనఁ బగందెగఁదీయఁ గొంతయో
జనగొని, జీజియామది విషాదదవానల మార్చు టిప్పు డొ
ప్పని కడుతొందరంగొని, షహాజి చనెన్ శివనేరుకోటకున్॥ 165

చ॥ పరుగులువారుడెందమునఁ బర్విడి, రాజగృహంబుడాసి, బా
వురుమనియున్న వాఁకిటికిఁ బోఁ దడుమాడుచు ముందుసాగి, ని
వ్వెఱగొనియున్న సేవకుల వెల్వెలఁబోయిన ఖాండదేవునిన్
నెఱిదురపిల్లుభార్యఁ గని, నిల్వున నీరయి నిల్చెదాపునన్॥ 166

చ॥ నిలిచినవాథుఁగాంచి, మదినిండినశోకము పొంగి కన్నుఁ దె
ప్పలఁగురియన్, జిజాంబ "యొకఁబోసఁగదే గురుదైవతంబు! మి
మ్మొల మముఁగాచుకోట పడిపోయెఁగదే! [illegible] బుట్టినింటయా
సలు చెడిపోయెనే! పరువుచాలనిబిడ్డలఁ [illegible]॥ 167

మ॥ అకటా! అంతటివాని కిట్టిమరణంబా! గొఱ్ఱెలఁబట్టి గొం
తుకలఁగోయు కసాయులట్లు గొలువందుఁ దండ్రికిఁ బిడ్డ బి
డ్డకునుఁ దండ్రియు దిక్కులేనిగతిఁ గట్టా చుట్టిమట్టాడిరే!
యొకఁడే నించుక జాలిగుండెగలుగండో! కాంచఁడో బిడ్డలఁ॥ 168

సీ॥ మొనమొన్న నేగదా జననిఁ బంపుమనంచుఁ
బోతివే యెటు మాయమైతితండ్రి!
పసుపుకుంకుమకల్మి నెసఁగుమహాలక్ష్మి
తల్లి కీకడవ్రాఁత తప్పదయ్యె!
"నే నుంటిఁగాదె యక్కా! నీకు భయమేమి"
యంటివే యన్న! యెందుంటివయ్య!
పూలుగంధము వెట్టి పూజించునిలువేల్పు
లొకరైన వచ్చి యాదుకొనరైరె!
తే॥ తొలఁగితివె నన్ను! నీప్రేమనిలయమునకుఁ
దలుపుమూసితివే, తండ్రి! తరలిపోతె!
కన్నసంతాన మిటుబైలుగాలిఁదోలి
కన్నుఁగవ మూసికొంటివే! కన్నతండ్రి!॥ 169

ఉ॥ రోసముదూసి, నాఁ డొడలెఱుంగక యేమిశపించి, యీవిప
ర్యాసముఁ దెచ్చికొంటినొ గదా జనకా! "చిటిమన్నుఁ డింద" మం
చాసలుమీఱ నీదునొడియం దిడ నోఁచఁగనైతి; వట్టియా
యాసమగాక నేను సుతనై సుక మేమిఘటింపఁ గల్గితిఁ?॥ 170

తే॥ గీ॥ రక్తమునుబోసి నైజామురాజ్యమెల్లఁ
బెంచితివి; వారు ని న్నిట్లు ద్రుంచినారె?
నీదుబలమున దేశంబు నేఁటి [illegible]
[illegible] వారికన్నులఁ దండ్రి!॥ 171

తే॥ గీ॥ వేచి భారతసంపదల్ దోఁచికొనఁగ
యవను లనువునై ఈదీప మార్చినారె!"
అనుచు, నాథునిమోమువై పెనసిచూచి
మెలుఁగు సవరించుకొని, యామె పలికెనిట్లు॥ 172

ఉ॥ "కన్నులుచెమ్మగిల్లఁ దటకాపడి నిల్వఁగనేల నాథ· మీ
పున్నెము నాదుపున్నె మిటుపూచిఫలించె, గతించె సర్వ; మీ
కన్నులయాట మామ కొడికంపుఁదిలోదక మిత్తువో? తెగం
గొన్న కసాయిదాయగమికుత్తుక నెత్తురుదోయి లిత్తువో?॥ 173

చ॥ ఒకయభిమానవంతునకు నోర్చుకొనందగుపాటియే కిరా
తకజన దుర్విహారమిది? దర్పసమగ్ర భుజార్గళచ్ఛిదా
వికలితరాజలోకుఁడగు వీరున కేమివచింపఁ? దండ్రిమే
రకుఁ దగు మామ; యా పరశురాముకృతజ్ఞత నిర్వహింపవే!॥ 174

ఆ॥ గీ॥ పుట్టినిల్లు తఱిగిపోయి నశ్వత్థామఁ
దలఁచుకొన్న ద్రుపదతనయ నైతి;
బావసాయ మందు పార్థుండవౌచు, నా
కంటినీటఁ బగఱఁ గాల్పవలదె!॥ 175

చ॥ కరకరగోయుచున్న మదికాఁకలకున్ నిలుపోపలేక, యం
తరువును దాఁటి, కొంతబెడిదమ్ముగ నాడితినేమొ! వేఱుగా
నరయక యీసముద్యమమహాభరమున్ దరిజేర్పు; మందు కే
తెరు వుచితంబొ దానిని విధింపుము; నీమత మేను ద్రొక్కఁదన్॥ 176

ఆ॥ వె॥ నాయభీష్ట మిదియు, నన్ను మన్నింపుము,
దుడుకుఁగొనకు, మలఁత[illegible] మెడరు
మఱచిపోకు; నాదుమంగళసూత్రమ్ముఁ
గాచికొనుచు, సవ్యసాచి [illegible] 177

చ॥ ఇది యొకసాధనంబ యగునేమొ తలంచిన నాత్మరాజ్య సం
పదకుఁ; గృతజ్ఞతన్ నెఱపుపట్టుదలన్ బదనెక్కి, దుష్టులన్
మదమడఁగించి, ధర్మగమనంబును బెంచి, స్వరాజ్యసిద్ధి కా
స్పద మగుఁగాక నీదుకరవాల కరాళ విహారవైఖరుల్"॥ 178

చ॥ అని తగవార మేటితెగువార మనంబునదూయు జీజియాఁ
గని షహాజీ వచించెఁ, "గలఁగన్ బనిలేదు, నిజమ్ము వల్కి: తే
యనుచిత మేలగల్గు? దిటవారిన దిప్పుడు నామనంబు, మా
నిని! యిదె వాలుగైకొనెద నీహృదయమ్మున సానఁబెట్టుచున్॥ 179

మ॥ కనె నిన్నున్, గొనె నన్నుఁ; బెంచె ననురాగంబంది యుండాఁక; న
య్యనఘున్ ముట్టుమదాంధులన్ జెఱుప కే నల్లుండనే? బీడుగాఁ
జనుఁగా కొక్కఁడుదిక్కులేనిగతి నైజామెల్ల; ఆనాఁడె వా
డని నీమోము గందు, నీమనసు ముట్టంగందు, దీక్షావతీ!॥ 180

తే॥ గీ॥ కొలుతుఁ జాణక్య చంద్రగుప్తుల తపంబు;
నిలుతు నీమాట, నామాట నిలిపికొందు;
భయపడకు నన్నుఁగూర్చి; యాపదలు నీకుఁ
బొడమునో! వీరపత్నివి; పోయివత్తు"॥ 181

మ॥ అని జీజానెలవంద, నామె మొగమింతై చెంగటన్నిల్చి, దాఁ
చిన ప్రేమైకఫలంబుగా సుతు శివాజీఁ జేతికందిచ్చె; ఆ
తనయున్ గౌఁగిటఁ జేర్చి;ముద్దుఁగొని, చేతన్ ముంగురుల్ దువ్వి, వి
చ్చినమోమున్ దనుపారఁగాఁ గనియె షాజీ తృప్తనేత్రంబులన్॥

తే॥ గీ॥ చూపు మరలించి, భార్యకు సుతునొసంగి,
"ప్రాణపదముగా నితనిఁ గాపాడు" మనుచు
నచ్చగాఁజెప్పి, దాదోజి హెచ్చరించి,
గుండెతిటువ్రిన [illegible] 183

ఉ॥ పోయెడునాథుఁ జూపులెడఁబోయెడునంతకుఁ జూచి, జీజియా
బాయి మదిన్ మరల్చి, "యొకపాపముఁ జేసితినేమొ! తెంపుమైఁ
బోయె; సహాయమేదయినఁ బుట్టునొకో! కులదైవతంబు కా
త్యాయనియే మముం గనుప నాదరు" వంచు నిమీలతాక్షియై॥ 184

తే॥ "ఉడికిపోయినమనసులో నోర్మిలేక,
పుట్టినింటిమమత్వ మాపుకొనలేక,
దుడుకుచేసితినే మొ! యీ యెడరుఁబాపి
చేరఁదీయుము, విభుని రక్షించు తల్లి!"॥ 185

చ॥ అని పరమేశ్వరిం గొలిచి, యారట మూఱట మూరిఁబోవ, నా
థునివిజయంబు నభ్యుదయదోహదముల్ దలపోయుచుండె; నో
పినకడఁకన్ షహాజి తలపెట్టిన కర్జము త్రోవలెత్తి, మి
త్రునిఁ గనఁబోయె జున్నరుకు, దూరవిచారస హస్పృహాయతిన్॥186

పాజీప్రతీకారప్రయత్నము - రెండవవివాహము.

ఉ॥ వచ్చిననెయ్యునిన్ గరమువ్రచ్చి, మనంబునుముట్టి, లోనికిన్
జొచ్చి, గతాగతమ్ములగుచొప్పులెఱింగి, భవిష్యదర్థముల్
దర్చి, హితాహితమ్ములఁ దిరమ్ముగనారసి, శ్రీనివాసరా
వచ్చపుఁజెల్మికల్మి యలరార వచించె నుదారధోరణిన్॥ 187

చ॥ "జరిగినదానిలోఁ గల దసహ్యావిషం బమృతంబుఁగూడఁ; దొం
దరపడరాదు; వార్ధిమథనంబున మందర సర్ప కూర్మ శం
కరులును మోహినీసతియుఁ గావలె: ముప్పదిమూఁడుకోట్ల ని
ర్జరు లొకతాడు లాగవలెఁ: దాగవలెన్ సుధ; లక్ష్మిరావలెన్॥

ఉ॥ ఉన్నవి కొన్ని సాధనము, లోర్పుమెయిన్ సమకూర్చుకోఁదగున్
గొన్నిటి; గడ్డిపోఁచలనుగూర్చి పెనంచిన మత్తుటేనుఁగున్
బన్నఁగవచ్చు; నామతముఁబట్టుము, సర్వసహాయసంపదల్
మున్నుగఁబెట్టి నీదుతలఁపుల్ గెలిపించెదఁ; గొంత యాఁగుమీ!॥189

సీ॥ నాసేన నీదుసైన్యము చేరిపోరినఁ
జాల, దీయరుల గగ్గోలువఱుప,
మహితుండు నీమేనమామ "వెంకోజి నిం
బళుకరుఁ" డతనిఁ జేపట్టవలయు;
బలియుండు గుంపెడుబలఁగమ్మువాఁడు "శా
జీమోహితే" వానిఁ జేర్పవలయు;
వారిసాహాయ్యమేర్పడినచో మనకత్తి
కెదురొడ్డువాఁడులేఁ డింతనిజము,
తే॥ గీ॥ అందు "బాజీ" దలంచినాఁ డతనిచెల్లె
లల "తుకాబాయి" నీకు నిల్లాలిఁజేయ
ననుమతింపుము నీవు; నే ననువుపఱతు
నదియు నిదియును, నూతనాభ్యుదయభంగి॥ 190

చ॥ ఒక విడఁదీయరాని కౌతుకున్నది నీకును నాకుఁగూడ: దా
నికిఁ దగునుత్తరంబు గమనించుట నీపని; నాకుఁ దోఁచినం
తకుఁ దగుధర్మమందు బహుదారపరిగ్రహ మిష్టు; నీవు కా
ముకత నెసంగి మాఱువలపుంగొన, విందున దోసమున్నదే?॥ 191

మ॥ ప్రణయోపాసకులైనదంపతుల తాత్పర్యంబు వ్యాఖ్యాత కం
దని యానందమయాద్వయత్వ; మనుసంధానమ్మునన్ నేర్పుమిం
చినవా రన్నిసమన్వయించి, విజయశ్రీఁగందు; రీపైన నీ
మనసున్ డగ్గఱి, జీజియాఁదలఁచి, సౌమ్యం బుత్తరం బీఁదగున్॥ 192

మ॥ కడఁకన్ బూనిన కార్యనిర్వహణదీక్షాదక్షతన్ బెంచు; ని
ప్పుడు పేరందినవానిలో మొదటి దీ "మోతే" కులం, బిట్టి వం
గడపుంజుట్టఱికంబు మే ల్దలఁపు; మేకగ్రీవమిత్రుండవై
యడుగంబూనిన నన్నుఁజూడుము కుమారా! సమ్మతిన్ జూపుమా!"॥

తే॥ గీ॥ అనెడుచెలికాని వేఁడుకో లవధరించి,
ముందువెనుకు బాగోగుల సందడించి,
యరమరలువాయఁ బ్రిణయమర్మరము లఁణచి,
పొందికలుమీఱ, షాజీవిభుండు పలికె॥ 1

మ॥ "సుకమున్ గష్టముఁగూర్చి నేఁ దలఁపఁ; గ్రచ్చుల్ గ్రుచ్చులేనైన, వ
మకునై కార్యముఁ గొంటి, దానిగెలిపింపన్ నిన్నుఁబ్రాపించితిన్
లుకజీ పోయినమీఁద నీ వతనియట్లున్ నాకు సర్వార్థసా
ధకుఁడౌమామవు, నేనుసాధనమ, సాధ్యాం బెట్లొ సాధింపుమీ!॥ 19

చ॥ ఎఱుఁగుదు జీజియామది; యొకింతతొనంకనికుండ, కార్యబం
ధురతయెఱుంగు, నా నడచుతోవ లెఱుంగు, మఱుంగులేదు; క
న్పఱచియయుండె నామతముఁబట్టఁగ సమ్మతి; యైన నామె నే
నరయుదు, నీవు నీతలఁచినట్లుగఁ గార్యము సాగఁదోలుమీ!"॥ 19

చ॥ అనుషహాజీనుడుల్ విని, మహాముదమందుచు శ్రీనివాసరా
వనుపదమేగి, కార్యగతులన్నియు సిద్ధముచేసి, పెండ్లిపె
త్తనమున నిల్పెపేకయును దానయి లగ్నమువెట్టె; జీజియా
యనుమతి మెల్లఁగైకొనె షహాజియుఁ, బెండ్లికిఁబోయి రెల్లరున్॥197

తే॥ గీ॥ పరిణయోత్సవ మతివైభవమున జరిగె
విందువేడుకల్ గొని బంధువితతి యేగెఁ
బ్రితినవెరవేర్పఁ దొందరపడి, షహాజి
శ్రీనివాసరావును జెంతఁజేరి పలికె॥ 198

నైజాముపై షాజీదండయాత్రలు - విజయము.

చ॥ "అనుకొనియున్న శత్రువిలయం బనుమోహామముఁ దీర్పకుండఁ దీ
అని కసిరేఁగ వారిరుధిరమ్మున వసంతము లాడకుండ, బో
రన జయలక్ష్మిఁగైకొని పురమ్మున నుత్సవమేగకుండ, నీ
వొనరుచుపెండ్లి పూర్తియగునో? యవశిష్టము నిర్వహింపుమీ॥ 199

సీ॥ అహమదునగరరాజ్యంబు కల్లోల సం
కులమాట నిది యనుకూలవేళ;
యటఁ బ్రధానామాత్యుఁడైన ఫత్తేఖాను
చెఱఁబెట్టఁబడియె; వజీరుపదవి
రాఁబట్టెఁ ¶ దన భార్యరాయబారమ్ముల
నంపి "హామీదుఖా" ననెడియవనుఁ;
డతఁడును సులతానుఁ డనువ్రుమైఁ బిలిపించి,
వంచించి మామఁ జంపించినారు;
తే॥ మొన్న జున్నరుప్రాంతముల్ గొన్నయపుడు
నన్నుఁదాఁకిరే? భయముఁగొన్నారుగాక:
నేఁడుమాత్ర మడ్డమువచ్చునే నిజాము
బలము? బలమఱి దొంగపోటులకు మరగె॥ 200

చ॥ అది యటులుండె; లోఁ గలఁతలంటి బిజాపురరాజ్య మీదెసన్
గదుపఁగలేనుపాదము; మొగల్బలఁగం బిటురాదు, సంధికిన్
గుదిరినదాట; నిట్టు లనుకూలత లెంచితిఁగాని యందఱున్
గదిసినఁగూడఁ బైపడి తెగంగొన కూరక జాఱనిత్తుమే?॥ 201

ఉ॥ ఊరక కాలముం గడపు టొప్పదు; సైన్యములెల్ల నొక్కటన్
జేరిచి, సర్వసాధనవిశిష్టముగాఁ బలుమొగ్గరంబులన్
దీరిచి, నీవు సేన కధినేతవుగా మును మోహరింపుచున్
భేరిని వేయఁబంపు, మరివీర విదారణ దారుణమ్ముగన్॥ 202

---

¶ Khafi Khan says that Aamid Khan, an Abyssinian noble, who had risen to power on account of the fascination of his wife's beauty upon the Sultan, succeded Fatteh Khan as Vizier.

Page 23. "The Life of Sivaji Maharaja," by
*N. S. Takakhav, M. A.*

సీ॥ నాచేతనుండె "పూనా" "సుపా" జాగీరు;
జున్నరుప్రాంతముల్ గొన్నవయ్యె;
నిపుడు "బారామతి" "యిందపూర్" ప్రాంతమ్ము
లరికట్టి, కొంకణ మాక్రమింత;
మింతటితో మూఁడువంతులు చేరుకు
నహమదునగరరాజ్యమున మనకుఁ;
దక్షిణభాగమ్ము దక్కుఁదనంతనే,
విడువనిపూనికిఁ బైఁబడితిమేని;
తే॥ గీ॥ గాలిమేడలుగావివి, కావటంచు
రుజువుసేయును, రిపులమార్కొనును నేఁడె"
యనుచు షాజీ వచింప, మిన్నంది యతఁడు
సకల సైన్యసన్నాహముల్ సంతరించె॥ 203

సీ॥ ఒఱపాడు తరఁగతంపరవోలె గుఱ్ఱపుఁ
బౌఁజులు మున్ముందు పరుగువాఱఁ,
దళతళలాడు సీఁటెలు బారులనుదీరి
వీరపదాతులు వెంటనడువ,
వెనఁకువఁ గాఁకదీరిన మరాటావీరు
లంగరక్షకులౌచు ననుసరింప,
శంఖచక్రములట్లు చక్రరక్షకులౌచు
మఱఁదియు మిత్రుండు నురవడింపఁ
తే॥ గీ॥ నుత్తమాశ్వంబుపై మధ్యమోర్వి నిలిచి,
పెండ్లియుడుపుల నిన్నటిపెండ్లికొడుకు
నేఁడు వీరవిహారసందీప్తుఁ డగుచు,
నడిమి షాజీవిభుండు సైన్యములఁ దఱిమె॥ 204

ఉ॥ ఆమడలామడల్ దఱిమియాడుచుఁబోయి పరాక్రమించి, "బా
రామతి" "యిందపూర్" పరిసరమ్ములఁ జుట్టినుముట్టి, శాత్రవ
స్తోమముఁ బిల్కుమార్చి, పటుదుర్గములన్ గయికొంచు, రాజ్యము
ద్దామత నాక్రమించె నరితండముగుండెలు తల్లడిల్లఁగన్॥ 205

చ॥ జరుగఁ షహాజివిక్రమము చారులుదెల్ప, హమీముఖానుఁ డా
తురపడి తద్విజృంభణముఁ దోలఁగ సేనల సైన్యనాథులన్
దఱిమె; షహాజి వారిబలదర్పము లాఱడిఁబుచ్చి, కొందఱన్
దఱిమె యమాలయంబునకుఁ, దక్కినవారి నిజాముఁజేరఁగన్॥ 206

ఉ॥ చిక్కినదానితోఁ దనవిఁజెంద, కహమ్మదురాజ్యసీమకున్
బ్రిక్క బిజాపురాంకమగురాజ్యములో నెలకొన్న "షోలపూ"
"రక్కలకోట" "గుల్బరగ" యన్పురముల్ గొనుచున్, నిజాములోఁ
బెక్కులు దుర్గముల్ గెలిచి, పెంపునఁ గొంకణభాగముల్ గొనెన్॥

చ॥ ఇటుబలశాలివై రిపులనేఁచి, స్వతంత్రము రాజ్యలక్ష్మి న
చ్చట నెలకొల్పి, యాపులయి సాయముఁజేసినవారి సాదరో
త్కట బహుమానమానితులఁగాఁ దమయూళ్లకు వీడుకొల్పె; న
ప్పటి షహాజీ కడంకవిని పాదుషహా యిటులంపె వార్తలన్॥ 208

చ॥ "విపుల భవద్భుజాబలము వింటిమి: దక్షిణమందు మాప్రభు
త్వపు టధికారివై నిలుము: ద్రవ్యములక్షలురెండు, సేన య
చ్చపుహరు లైదువేలిడెద: జాగిరుగాఁ "దలినేరు" ప్రాంతమున్
తపతికి దక్షిణమ్మున స్వతంత్రముఁజేసెద; సమ్మతింపుమీ!" 209

ఉ॥ ఈగతిఁ బాదుషాపిలువ, నిచ్చకువచ్చినదయ్యు ముందు బా
గోగుల కూఁతగాఁదలఁచి యూఁకొని, కైకొనియున్న రాజ్యమం
దాఁగని యేల్బడిన్నడిపి, యందకతక్కు నిజామురాజ్యమున్
లోఁగొనఁబొంచి, తత్సమయలోచనుఁడయ్యె షహాజి యచ్చటన్॥

సీ॥ "అహమదునగరరాజ్యము నెల్లఁ గైకొన
షాజీ, హమీదుఖాఁ జాలఁడయ్యె"
నని నవాబైన బర్హానునిజాముషహా వ
జీరు పత్తేఖానుఁ జెలఁగు బాపె;
నతఁడు సమర్థుఁడై యదియది సవరించు
నంతలోన నవాబుహత్య జరిగె;
నిదియుఁ బత్తేఖానుఁడే చేసెనని మోపి
బిరుసెక్కి ప్రజలెల్లఁ దిరుగఁబడిరి;
తే॥ గీ॥ రాజ్యమేమైనఁ దనప్రాణరక్షణంబుఁ
దలచి, యాతఁడు మొగలుకొలువుఁ జేరెఁ;
దఱియెఱింగి షాజీ యసూంతముగ దూఁకి
తలుపులేనినైజామెల్ల గెలిచికొనియె॥ 211

ఉ॥ మామనుజంపనైనకసి మాసె, నిజామునవాబు పోయెఁ, జే
రామునఁ ద్రుళ్లిపోయిన యహమ్మదురాజ్యము చేతఁజిక్కె; సం
గ్రామకిరీటియై రిపులఁ గ్రాఁచి ప్రతిజ్ఞను నిర్వహించి, షా
జీ ముదమందె, - నింతపనిచేసిన యాత్మసతిన్ దలంచుచున్॥ 212

ఉ॥ పూవులకన్నఁ గోమలము, పూజ్యము, భారతభూ పతివ్రతా
దైవము; సుప్రసాదమిళితంబుగ నాయమ చూచెనేని, సు
శ్రీవిభవమ్ము లన్ గురియు; రేఁగి కనుంగవ జేవురించినన్,
గావిరిగుప్పునిప్పులు బుకన్ జగమెల్ల దహింపకుండునే?॥ 213

చ॥ జరిగిననాథుగెల్పువిని, సంతసపున్నుడిఁ బంపె జీజియా
తరుణి: తుకావధూటికి సుతప్రభవంబనువార్త వచ్చె; దాం
తరగొనివచ్చు నభ్యుదయధన్యతకున్ గుఱియై, షహాజి చే
కురిన నిజాములక్ష్మిమఱుఁగుల్ గొనెఁ జిక్కులువాయ - దువ్వుచున్॥

తే॥ గీ॥ అచటిసరదార్లు తక్కినయవనిపతులు
ప్రజలు కనుకుట్టువడకుండ, $ బాలునొకని
రాజుగాఁజూపి, తా స్వతంత్రతను నడిపె;
నెఱిఁగె మొగలుపాదుషా యీతెఱంగు॥ 215

మొగలులు షాజీపై దండెత్తుట.

మ॥ తెగువన్ జేరఁగవచ్చి తన్ గొలుచు పత్తేఖానుఁ జేపట్టి, మ
ర్మగుఁడౌ నాతనిచే నిజామును జయింపన్ వచ్చు నంచెంచి, ముం
దుగ షాజీకిడు జాగిరున్ బదవిఁ దోడ్తో వాని కిప్పించి, యా
మొగలుం బాదుషహా నిజాముపయికిన్ బుత్తెంచె నావీరునిన్॥ 216

ఉ॥ వాదరదీరియున్న పరివారముతో నతఁడేగి, దౌలతా
బాదును ముట్టడించి యటఁ బ్రాంతములెల్లను లోఁగొనంగ, షా
జీ దురతిక్రమంబులగు సేనలతో నెదిరించి మించె; వీ
రాదరణీయవైఖరి మహాహవ మచ్చటఁ జెల్లె వారికిన్॥ 217

చ॥ మిడుతలదండువోలె బలిమిన్ బయిపైఁబడి నేలయీనిన
ట్లడరుచునున్న మొగలుబలాంబుధి నీఁదఁగ నోహటించి, రా
వడి నిలుచున్నసైన్యములపాటు దలంచి, షహాజి సాహసం
బుడిగి నెపంబువెట్టి, సమయోచితభంగి రణంబు వెల్వడెన్॥ 218

చ॥ "అహమదుపట్టణం బరిగినంత ఫలం బిసుమంతలేదు: దు
స్సహరిపులన్ జయింపఁగ బిజాపురమేగి, మురారిపంతు నా
సహచరు సాయమున్ గొనుచు శాత్రవులన్ బరిమార్తు" నంచు స
స్పృహుఁడగుచున్, షహాజి యనివీడి బిజాపురిత్రోవలన్ జనెన్॥219

$ The Maratha chief (Shahji) took out of the fort Judhan, a Nizam Shahi prince named Murtaza Nizam Shah II aged 10 or 11 years.......and carried on the government for three years. 'The Modern Review' September, 1917.
*Prof. Jadunath Sarkar, M. A., F. R. S.*

సీ॥ చాలకాలమునుండి సమయంబువేచిన
పాదుషా కిది మేటిపండు గయ్యె;
నహమదునగరరాజ్యము బీడుపడియుండె
నాకరిలోనొకరు లే కున్కఁజేసి;
సులతాను మరణించె; శూరుఁడు మంత్రి ప
త్తేఖాను మొగలుతేరు నడిపె;
మొనమొన్న రాజ్యంబుగొనిన షాజీ నేఁడు
బలమఱి పరులపంచలకుఁ బాఱె;
తే॥ గీ॥ "అదనిది" యటంచు మొగలుసైన్యములు కట్ట
తెగినచెఱువునీరమువోలె దేశమెల్ల
ముంచుకొనిపాఱి, జనుల బాధించుకొనుచుఁ,
దఱిమె షాజీని శివనేరుదాఁటిపోవ॥ 220

జీజియా మొగలుల దాడినుండి తప్పించుకొనుట.

తే॥ తఱుముకొనివచ్చు మొగలుదాడి నెఱిఁగి,
జీజియా తన్ను సుతుని రక్షించుకొనుచు,
నిన్నశివనేరు, మాహుళినేఁడు, రేపు
కొండనాగడ, మిటు మార్చుచుండె వసతి॥ 221

మ॥ తమకుంజిక్కనియూళ్ళు కొల్లగొని, పేదల్ సాదు భంజించి, దే
శము గగ్గోలొనరించి, మొగలులు "వైజా" పట్టణంబం దప
త్యముతోడాఁగినజీజియా నెఱిఁగి, తొల్తన్ వారిబంధింప ను
గ్రముగాముట్టి; రదల్చి యామె కసిరేఁగన్ వారివారింపుచున్॥ 222

శా॥ "ఏమీ! మొగలుపాదుషాప్రభుతయిట్లే? శూరధర్మంబు కాం
తామర్యాదకు భంగముల్ దలఁచు టౌనా? రాణివాసంపు "గో
షా" మన్నించు మహాత్ములీయు లిటు స్వేచ్ఛన్ జొత్తురే? లేదు కా
దా మీ కొండొక యాఁడుతోఁ? బడిదియె మీకౌనేని మీరోర్తురా?॥

ఉ॥ ఈఁటెలదూసి, బల్లెములనేసి, ఫిరంగులుమోసి, లేఁతకుం
దేటిని వేఁటలాడుమగదేబెలు కయ్యము లాడ నేటికో!
కూటికి బిచ్చమెత్తుకొనఁగూడదొ? కూలికి గుండమెక్కి స
య్యాటములేల? హైందవకులాంగనఁదాఁకినఁ దక్కిపోదు రే? 224

ఉ॥ తోడటియున్న నన్ను విడఁద్రోయుచు, నాసుతుఁ బట్టనుంటిరే
యోడక? దూడపైనఁ గరమూఁదిన బెబ్బులినైనఁ గొట్టి గో
రాడుచుఁ గొమ్ములన్ జెలిగియార్చెడు ధేనువుభంగి, గాళికా
క్రీడనముల్ వెలార్చి విహరించెద; నడ్డముదాఁకి చూడుఁడీ! 225

తే॥ సతుల గోవుల విప్రసంతతుల సురలఁ
గసురుఁగందులఁ గలఁచి, యిక్కటులువఱచు
తులువకోలములఁ దుడిచి, తుందుడుకు లడఁచు
కాళికాదేవి మిమ్ముల గావుగొనదె!"॥ 226

మ॥ అను జీజాపలు కాదరింపక తురుష్కానీకినీనాథు లా
మెను బుత్రున్ జెఱపట్టఁగాఁదలఁచి బల్మిన్ జుట్టి; రాలోన నం
దునఁ గొల్వున్న మరాటవీరులు "బహాదూర్జీ" "మహాదేవజీ"
యను జీజాపినతండ్రి యన్నయగువా రడ్డంబుగా నిల్చుచున్॥ 227

చ॥ "ఇదివినుఁడయ్య! యీయబల యేయపరాధమొనర్చె? షాజిపై
నొదవినయగ్గి నీమెపయి నూఁదఁగనేల? కృతఘ్నుఁడౌతఁ డీ
పెఁ దఱుమఁగొట్టి, వేఱొకతెఁ బెండిలియయ్యె; నభాగ్యభిన్నయై
బ్రదు కెడరోయు నీమెఁ జెఱపట్టి కఠోరముసేఁత మంచిదే?॥ 228

ఆ॥ వె॥ పరువులేనుదీనఁ; బాముషామెచ్చఁ; డీ
వనిత విడువుఁ" డనఁగ, వార లల్లె
వెడలి; రామె జరుగువిధమెల్లఁ బతికి వి
న్నించి, సుతున కుగ్గువెట్టుచుండె॥ 229

బిజాపురమంత్రి మురారిపంతు షాజీకి సాయమేగుట.

చ॥ అచట బిజాపురమ్మున మహాసచివుండు మురారిపంతు దా
నిచటి యుదంతమెల్లవిని, "యిట్టులె మొగలుదండు సాగుచోఁ
బ్రిచలితమౌనొయేమొ మనరాజ్యముగూడ; నిజాము త్రోవయా
నిచటికిరాఁగ; దాని నిపుడే బలితమ్ముగఁజేయు టొప్పదే!॥ 230

క॥ మనలోమన మెటు తగవులఁ
గొనుచున్నను సహజవైరి గూడినచో నా
తనిఁ దఱుము టొప్పు; షాజీ
కనువుగ సైన్యముల సాయమంపుట తగదే!"॥ 231

చ॥ అనితలపోసి, యీవిషయ మల్లనవాబున కెక్కఁబల్కి, యా
తని పనుపొంది, సేనఁగొని తత్పరతన్ జనుచుండి. దారిలో
వినియె మురారిపంతుఁడు "రవిగ్రహణంబను పర్వవేళ"నేఁ
డని; మదినెంచె స్నానము సమంచితదానము లాచరింపఁగన్॥ 232

క॥ "ఇది యింద్రాణీ భీమా
నదులు గలియుచోటు, పావనంబు "తులాపూర్"
పొదలునిట" ననుచు నాతఁడు
నది మునుకలువెట్టి తర్పణంబులు సలిపెన్॥ 233

ఉ। ఏనుఁగుతూఁగునంతధన మెత్తుచు దానముసేయఁగోరి, యా
యేనుఁగు దూచునట్టి వేరవేది, మురారి తలంచుచుండె షా
జీ; నతఁ డింతలో నచటఁజేరెఁ; బరస్పరకార్యగౌరవా
ధానత ముచ్చటించుకొని, తత్పరులైరి గజమ్ము తూఁచఁగన్। 234

తే। ఓడలో నేన్గునెక్కించి, యోడమునుక
నీట గుర్తించి, దానికి దీటుధనముఁ
జేర్చి తూచుట షాజీ వచింప, నతఁడు
మెచ్చి యారీతి దానముల్ హెచ్చుసలిపె। 235

చ॥ పదపడి కర్జముల్ గొని, యపారధనంబు నసంఖ్యసైన్యసం
పద సమకూర్చి, "శత్రుబలవాహిని వెన్కకునెట్ట నిప్పుడే
కదలుడ" మంచు నుత్సుకత గన్పడ మంత్రి మురారి వల్క, న
భ్యుదిత భుజావిజృంభణ సమున్నతిమీఱ షహాజి నవ్వుచున్॥ 236

తే॥ "ఇట్టి మీయభిమాన మొక్కింతచాలుఁ;
జాలు షహజీ యొకండ యీశత్రుబలము
బడలువడఁజేయ; సేనతోఁడ్పడినఁ జాలు"
నన, మురారియు నతని ధైర్యమును మెచ్చి॥ 237

చ॥ "నడుపుముసేన, శత్రుబలనాశముసేయుము; నా సహాయ మె
ప్పుడువలెనన్నఁ దత్క్షణమ పుచ్చెద, నీకు నవాబుచెంత నా
కుడియెడ నున్నతాసనముఁ గూర్చెదఁ, గోర్కులు తీర్చెదన్, దెగం
బడి విజయమ్ముదె" మ్మనుచుఁబల్కి, మురారి షహాజి నంపినన్॥ 238

చ॥ అఱిముఱినేగి వెన్నఱిమి, యాతఁడు మోగలుసేనముట్టి, చి
చ్చుఱపిడుగట్లుదాఁకి, పెలుచన్ గలఁచన్, గెలుపాసలేక "యూ
పిరి గలదేని యుప్పుఁదినియుండగవచ్చు" నటంచు మోగలుల్
పరువులువెట్టి; రిట్లు తెగువన్ బలుమాఱులు దోలె వారలన్॥ 239

శా॥ డాబుల్గొట్టుచు మోగలుద్దెగి "పరెండా" ప్రాంతముల్ముట్టి, "క
ర్కీ" బాధించి, "నిజాము" దొమ్మిఁగొనుకోర్కిన్ బల్మఱుల్ముట్ట,షా
జీ బాహాటముగా నెదిర్చెఁ, దఱిమెన్, జీకాకుగావించె; నీ
లోఁ బీజాపురమందు మెండుకొనెఁ గల్లోలంబు లొక్కుమ్మడిన్॥ 240

తే॥ పలుకుబడిమై బిజాపుర ప్రభుతనడుపు
మంత్రిని మురారిపంతు, నమాత్యుఁ "గవసు
ఖాను" నోర్వక యొంటిపాటూని, హత్య
సేసి రాకొల్వులోనున్న చెనఁటిదొరలు॥ 241

## నైజాముపై మోగలుల పునర్దండయాత్ర - షాజీసంధి.

ఉ॥ ఱెక్కలులేనిపక్షివలె ఱిచ్చవడెన్ షహాజీ విభుండు; లా
వెక్కుచు మోగలుల్ సమయమెంచి. బలమ్ములఁబెంచి, యొక్కటన్
దక్కనునెల్లమ్రింగ బలితమ్మగు పూనికమించి, దిక్కులన్
బిక్కటిలంగ దండు నడిపించిరి దక్షిణ పీఠభూమికిన్॥ 242

మ॥ సరదారుల్ పదివేలు గొల్వఁగ "సయిస్తాఖానుఁ" డొక్కంట, ము
ష్కరుఁడా "ఖాన్‌జమనుండు" వేఱొకట, మోగల్ సర్వసేనానులై
తరఁగల్ వోలె బలమ్ముల న్నడిపి, చెంతన్ "దౌలతాబాదు" "జు
న్నరుఁ" "గ్ఱి" "నహామదుప్పరంబును" "బరెండా"నన్నిటిన్ ముట్టినన్॥

క॥ కనుచూపుమేర నెందును
గనఁబడి కేకిసలుగొను మొగలుసైన్యంబున్
గనుఁగొని, షాజీ నివ్వెఱఁ
గొని, యుద్ధముసేఁత మానుకొని, యిటు దలఁచెన్॥ 244

సీ॥ "కసిపెట్టుకొనుచు మోగలుపాదుషా యఖం
డముగఁ బల్మఱు దండునడిపె నిచట;
నహామదునగరరాజ్యము లోనఁ గుప్పిళ్లువ
ట్టుచు నెత్తురోడి గొడ్డుపడిపోయెఁ;
బ్రాపుగానున్న బిజాపురమంత్రి ము
రారితోఁ దదుపకారములు దీఱె;
ననవరతంబుఁ గయ్యములాడియాడి నా
బలములెల్ల నలంత సొలసిపోయె;
తే॥ నొంటితెగువఁ బైపడి మొదలంటఁ జెడుట
నీతిగా" దని షాహాజీ నిశ్చయించి,
బీజపూరుసుల్తానుల పెత్తనమునఁ
బాదుషాగారితో సంధిచాదుకొలిపె॥ 245

తే॥ గీ॥ అలనిజాములో నర్ధరాజ్యమునకన్నఁ
బయిగఁ గైకొని, షాహాజీపట్టుకొన్న
⁋ యాఱుదుర్గముల్ దనవిగా నాక్రమించి,
దండుమరలించి పాదుషా తరలిచనియె॥ 246

తే॥ గీ॥ జరుగుసంధిలోఁ బాదుషా సంగ్రహించు
కొనినరాజ్యముగాక, తక్కినదియెల్ల
సాయమొనరించి యాదిలుషాహి గొనియె;
నంతనైజామురాజ్య మిట్లంతరించె॥ 247

చ॥ అనుకొని నట్లుగాక కొఱఁదై తనకార్యమసంగ, షాహాజీ
తనయునిఁ జూడనైనను బదంబు మరల్పక పోరి, పాదుషా
మనసుమరల్చి, ¶ కొన్నిబహుమాన చమూ ధన గౌరవాదులన్
గొని, రణరంగముల్ విడిచి, కొండొకతీరుబడిన్ దలంచుచున్॥ 248

మ॥ తనకున్ నిల్చిన సొంతజాగిరులచెంతన్ నిల్చియుండంగ, నా
తనిబల్మిన్ గనుచున్ బిజాపురపు సుల్తా నంతలోఁ బిల్వఁ బం
ప, నతం డచ్చటికేగి యందుఁ గలఁతల్ వారింపుచున్ శాంతిని
ల్పిన, సుల్తా నదిమెచ్చికొం చతని సల్పెన్ దొడ్డసర్దారుగన్॥ 249

ఉ॥ సాటియొకింతలేనిబలశాలి షహాజి నవాబుపంపెఁ గ
ర్ణాటకదండయాత్రి; బవరమ్ములఁదేరిన రంగరాయఁ డా
మేటి నెదిర్చితాఁకె; గడిమించి కలంచి షహాజి వాని పో
రాట మడంచి, పూర్ణవిజయంబున వచ్చి, నవాబుఁ గన్గొనెన్॥ 250

---

⁋ He entered the Bijapur service and gave up to the Mughals his Nizam Shahi princeling, together with Junnar and six other forts still held by his men. Evidently he got good terms out of the Imperial Government.

Page 48. "History of Aurangazeb" Volume I.
*Prof. Jadunath Sarkar, M. A.F. R. S.*

సీ॥ మహమదాదిలుశాహి షహాజీపరాక్రమ
మగ్గించి, మేటిమర్యాద సలిపెఁ;
గన్నడమ్మున గెల్చుకొన్న ప్రాంతములెల్ల
నతనిజాగీరుగా ననుమతించెఁ;
ꣳ దనరాజ్యమందు "రత్నపురంబు" "దేవగడ్"
"మావళా" మొదలుగా మాన్యమిచ్చెఁ;
బేర్మి నీరానదీ భీమానదులమధ్యఁ
గలదేశమున కధికారిఁ జేసెఁ;
తే॥ గీ॥ దనమహారాజ్యసర్వతంత్రములు నడుపఁ
గుడిబుజమ్ముగాఁ గొల్వొచ్చి కుదురుపఱచె;
నిటు బిజాపురరాజ్యమం దెలమిఁగొనుచుఁ
జెలఁగె బల్మినిఁగల్మి షాజీవిభుండు॥ 251.

ప్రథమాశ్వాసము - సంపూర్ణము.

---

ꣳ Not long after, the districts of Ratanpore, Deogad, Kanakgiri and Raidurg were added to his jagir (already given in the Carnatic) and his Maharashtra jagir likewise received the addition of Indapur, Baramati and Maval. In addition to all this, the deshmukhi of twenty-two villages in the Karhad district was conferred upon Shahji.

*N. S. Takakhav, M. A.*

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివభారతము

## (శివాజీప్రబంధము.)

---

### ద్వితీయాశ్వాసము.

---

చ॥ జరిగిన సంధిమేరకు నిజామువిభుత్వ మడంగె; నందు ను
త్తరమునఁ గొంతభాగమును దక్కొనె మొగలుపాదుషా; బిజా
పురమునఁజేరె నందువిడిపోయిన దక్షిణమెల్ల; నంతఁ దా
మొరయుచు రెండురాజ్యములు నొండొకటిన్ గబళింప మెల్గొనెన్॥

క॥ ఈరెండు రాజ్యములను మ
హారాష్ట్రం బడఁగియుండె, యమునా గంగా
పూరాంతర్లీన నిరా
కార సరస్వతియవోలె గణనా గుణమై॥ 2

మ॥ ¶ అమితప్రాభవులౌ మహారథులు పెంపారన్ మహారాష్ట్రరా
జ్యము మున్నేలిరి, - దక్షిణోత్తరము కృష్ణా తాపతీ మధ్యభా
గము, పూర్వాపరదిగ్విభాగము "వెయింగానా" నదీభాగ ప
శ్చిమవారాన్నిధిమధ్య; మీయవధి నిల్చెన్ నాఁటికిన్ నేఁటికిన్॥ 3

తే॥ కొంకణము, సహ్యపర్వతక్షోణి, దాని
తూర్పు పీఠభూమియు, నిన్నిదొరసి కొనుచుఁ
దత మహారాష్ట్ర రాజ్యాభిధాన మందు;
నిదియ రంగస్థలము మనచదువు కథకు॥ 4

---

¶ the name Maha-rashtra was confined to the Western edge of the Deccan plateau, bounded on the north by the Tapati, on the south by the upper courses of the Krishna and on the east by the Sina.

Page 2, "Sivaji and his times" by *J. N. Sarkar.*

సీ॥ * ఒకగీత, - "నందోడు" నుండియు సాత్పురా
కనుమలవెంటఁ దూర్పునకుఁబోయి,
యట "వెయింగానా" మహానదివెంట ద
క్షిణము "వార్ధా" నది; జేరుదాఁక
నడిచి, యచ్చటినుండి పడమర "మణిఘరు"
"మాహారుఁ" జేరుచు మరలి, దక్షి
ణమున "బీడారు"కు నడిచి, యాపైని ప
శ్చిమము "షోలాపూరుఁ" జేరి, యచట

చే॥ దక్షిణముమళ్లి, కృష్ణనుదాఁకి, వక్రి
గతిని మూలగా "గోవా"ను గలియవలయు;
నుత్తరమునుండి యీరేఖ నొదిఁగియున్న
ధర మహారాష్ట్ర, మపరాబ్ధి తటము వఱకు॥ 5

సీ॥ అటు పశ్చిమాంబుధి, యిటు సహ్య పర్వతం
బీరెంటి నడుమ విస్తారభూమి
కొంకణదేశమై కొమరారుఁ, బొడవుగా
నుత్తర దక్షిణా భ్యున్నతమయి;
పైరుపచ్చల కంత సారవంతముగాని
వెలినేల గులకరాల్ గలదిగ్గాయెనఁ,
బలురకంబుల పూల పండ్ల గుత్తులుఁ బ్రేలు
రమ్యత రోద్యానరాజి గలదు;

తే॥ ఎండలో వానలోఁ దపముండియుండి,
దైవమునునమ్మి జీవితాధ్యాయ మెట్లొ
జరుపు నిరుపేద రైతు కాఁపురము లిచటఁ
గలవు, గుడిలేని శంభులింగముల కరణి॥ 6

* *Historical Atlas of India by Charles Joppen, S. J.*

చ॥ ఉఱుముచుఁ బశ్చిమాంబునిధి యూర్మిక లొండొరుఁ ద్రోపులాడఁగాఁ
బెరసినయుప్పు, సహ్యాధరపెట్టిన కందలుఁ గాయగూరలున్
బరువపు జీవనంబు నడుపంగ, స్వతంత్రత సొంతహక్కుగాఁ
బెరిఁగినవీరులై ప్రకృతి పెంచిన బిడ్డలు వొల్తు రచ్చటన్॥ 7

ఉ॥ కొంకణరాజ్యమున్ నిలుపుకోట, సముద్రము పొంగు నాఁపఁగా
నుంకువ గొన్నమేటి, రవియుగ్రత మాపెడు మాంత్రికుండు, ప
ర్యంకమునందు నాడెడు తరంగిణులన్ గని యుబ్బు తండ్రి, ని
శ్శంకపు "మావళా" నెలవు "సహ్యము" కొంకణమంటి రాజిలున్॥

మ॥ మన కీ సహ్య మహా మహీధరము సమ్మాన్యంబు; శ్రీదేవి శం
భునియిల్లా లిట § "నేకవీర" యనఁగాఁ బొల్పారు. నీశైలకుం
జ నితంబాంత దరీ ఝరీ తటములన్ జాగ్ర న్మహారాష్ట్ర వీ
రుని హుంకారము మూలమూల నుఱిమెన్ రూక్షక్రియా భీలమై॥ 9

చ॥ పలితములౌ దినాంత రవిభానుల బంగరుపీరుదేలు లో
యలు దరులొప్పు నీగిరి తటాగ్రము లెక్కుచు, మావళేలు దా
పులఁ దొనఁకాడు పశ్చిమ సముద్రపుఁ దుంగతరంగపాళి ము
న్కలుగొను గాలిమానగమి కౌఁగిళులన్ రమియింతు రెంతయున్॥

ఉ॥ సాద్రి నగంబు తూరుపుదెసన్ వరుసన్ గిరిపాద మంటి, యు
క్షుద్రములైన దుర్గములు శోభిలుఁ; దొంటినృపుల్ స్వరాజ్యమున్
భద్రముఁజేయఁ గట్టి; రివి పాడటి నేఁడు సపత్న మండలీ
ముద్ర వహించెఁ జీమగమి పుట్టలు పాములకైన కైవడిన్॥ 11

---

§ శ్లో॥ విపులే విపులా దేవీ కల్యాణీ మలయాచలే।
సహ్యాద్రా వేకవీరాతు హరిశ్చంద్రేతు చంద్రికా॥

"దేవీభాగవతము" — 7 స్కంధము, 30 అధ్యాయము, 66 శ్లోకము.

సీ॥ పగడాలదండ చెల్వము మించు నామర్గ
వితతికిఁ దూర్పుగాఁ బీఠభూమి,
"తపతి" "యింద్రాణి" "గౌతమి" "భీమ" "నీర" "కృ
ష్ణ" యు నాటలాడెడు చలువనేల,
"భాండూరు" శిఖరి "భాస్వన్నాథ" "మంబికా
నాథ" మఱి గిరుల నందమగుసీమ,
పావనక్షేత్రముల్ "పండరి" "నాసిక"
"తులజ" "కొల్హాపురి" వెలయు నెలవు,
తే॥ నదుల గట్టుల గుట్టల నెదిగి యొదుగు
ఫలితవనరాజిఁ గనువిందు నొలుపుఁగాని,
పండి యొఱగిన పచ్చని పైరులిచ్చి
కడుపు విందులుసేయఁ బాల్పడని దయ్యె॥ 12

మహారాష్ట్రులు స్వభావ - వృత్తి - పరిస్థితులు.

క॥ ఇట్టి మహారాష్ట్రము సిరి
పట్టయి, శౌర్యంబు విడిదిపట్టయి, యరులన్
నెట్టుచుఁ గీర్తికిఁ బట్టము
గట్టెన్ జనరంజనానుగత వైఖరులన్॥ 13
తే॥ దక్షిణోత్తరములనుండి ద్రవిడు లార్యు
లిందుఁ జేరంగ, నందఱు నేకమగుచుఁ
గ్రమముగా మించిఁ యొకమహారాష్ట్రజాతి
యందుఁ దెలువారె మిశ్ర గుణాశ్రయముగ॥ 14
ఉ॥ ఆర్యులరూపు - ద్రావిడగుణాతిశయంబు - నిసర్గధైర్యగాం
భీర్యము - లేకరూపతను బెంపఁగ, దక్షిణపీఠభూమిలో
నార్యు లకన్న ద్రావిడులకన్న దృఢాంగు, లుపాత్తసాహసౌ
దార్యులునై జనుల్ యశముఁదాల్చిరి దుర్దమకార్యధుర్యతన్॥ 15

చ॥ విడువని దైవభక్తి, తమపెద్దలనాఁటి పవిత్ర ధర్మముల్
నడిపెడు జాతిరక్తి, యొరు నమ్మక సేగి దమించి జీవికన్
గడపు స్వతంత్రశక్తి, కొఱగాములనోర్చి మతంబు దేశమున్
బుడుకు నురుప్రసక్తి, యివి పుట్టుకతోడనె పుట్టెవారికిన్॥ 16

ఉ॥ మంచితనంబు నమ్మకపు మాట హితంబొనరించుకీర్తిఁ గా
నిప్పించినవారికిన్, దెగువఁబెంచి శరీరముఁ బ్రాణమైన న
ర్పించి శుభంబుసేఁత, గికురించి నికారముసేయువారి సా
ధించి నిజంబుదెల్పి పగదీఁత, మరాటులకున్ నిసర్గముల్॥ 17

మ॥ గుములౌ కొండలయున్కి; వాహినులు పెక్కుల్ పొంగి పారాడుటన్
సమ నిమ్నోన్నత మూషరంబు నుపలచ్ఛన్నంబు.నిస్సారమై
న మహారాష్ట్రమునన్ జనుల్ మనుదు, రెండన్ వానఁగొల్వొండి దు
ర్దమ యోగంబున నైహికంబుఁ బర మంతర్వహ్ని సాధించుచున్॥ 18

చ॥ నదులు మహీధరంబులు వనంబులుఁ దల్లియుఁదోడునీడగా
నెదిగినవారలై, జను లకృత్రిమ నిష్ఠురవృత్తి జీవనా
భ్యుదయ పరోపకారముల నోమెడుచో మెయిఁబొంగు ఘర్మబి
ద్బుదములమొగ్గలన్ జిదిమి, దోయిలివట్టుదు రర్ఘ్యమెత్తుచున్॥ 19

చ॥ విరియని భాషలో నొదుఁగు విద్యలు, చిత్తముకంటెఁ జేతికిన్
బరిచితమైనవిద్య లోకపాటిగనేరిచి, కావ్యబంధముల్
విరచన సేఁత కంటె, మదివిప్పి రసంబునుగుప్పి, భావనా
పరిణతిఁ దంత్రులన్ గలిపిపాట మరాటుల కాటమై తగున్॥ 20

మ॥ వ్యవసాయంబును కూలినాలి పనులున్ వాణిజ్య భైషజ్యముల్
వ్యవహారంబులు వృత్తి విద్యలును బూర్వాచార ముద్యోగగౌ
రవముల్ వారును వారుఁబొందిరి మహారాష్ట్రంబునన్; యోగిభా
గవతుల్ మించిరి గొంద, ఱందఱ నమస్కారంబులన్ బొందుచున్॥

శా॥ "గోసాయీ" "బయిరాగి" "సాధు" వను శాస్త్రుల్ వైష్ణవుల్ శైవస
న్న్యాసుల్ దేశికులౌచు, నేకులమువారైనన్ మతాచార్యులై
వాసింగాంచిరి; వృత్తిఁబట్టి కులముల్ వ్యాపించి యందున్న, వ్య
త్యాసంబున్ గొన, రందఱొక్క తెగవారై సంఘ మర్యాదలన్॥

తే॥ హైందవ మతంబులోని జీవాణువులను
చాటలను బద్యములనింపి పాడికొనుచు,
సాధుజనులు బైరాగి గోసాయి గములు
గాదె వోసిరి భక్తియాగామి రక్తి॥ 23

దక్కనులో బహామనీరాజ్యములు - పరిపాలన.

క॥ ఈరాజ్యమేలుచుండిరి
నేరుపునై నిపుడు "బహామనీ" సులతానుల్;
పౌరుషము విరియఁ జిమ్మ, మ
హారాష్ట్రులు తోడు నీడలై సాయపడన్॥ 24

ఉ॥ దక్కను భామినీదొరలు తామటు యావనులయ్యు, నెయ్యమున్
మక్కువఁజూపి హైందవుల మానసముల్ తనివొందఁ జేయుటల్
పెక్కుతెఱంగులై, సవతి బిడ్డలు, కౌరవపాండు పుత్రు ల
ట్లొక్క కుటుంబమందలి యమోమయతల్ గనుచుండి రెంతయున్॥

ఉ॥ † కన్నెలఁ బెండ్లియాడి, యధికారము లిచ్చియు, గొంద ఱందు నే
యన్నెముఁ బున్నె మెంచక; సహాసన భోజన పానరక్తి మీా
ఱ న్నటి యుంచి; వారి బయిరాగుల పీరిఫకీరులన్ సమా
నోన్నతి గౌరవించి, రిటు లొండొక నెయ్యము నామతింపుచున్॥ 26

---

† "The Mahomedan rulers in the Deccan took Hindu wives in their harems." (Page 31)

"Some Mahomedan Fakirs have been ranked with the Hindu saints in general veneration and there are some saints who are venerated by both communities alike." (P.24)

*Rise of the Maratha Power" by M. G. Ranade.*

శా॥ "ఈరాజ్యంబిది మీది, యేల్బడియు మీదే, మాకు సుల్తానులన్
బేరోక్కం డడిచాలు, నెల్లరును దృష్టిన్ బొంద నేలింపుఁ"డం
చూరన్ బల్కెడు నానవాబుల సుహృద్యోగంబు స్వార్థైక లా
భాపేక్షంబని యన్వయించెఁ బ్రజ; యారా! రాజ్యమెభ్భంగిదో!॥ 27

తే॥ మంచి తనముఁ జూప నశక్తిమించుఁ; బరుసఁ
దనముతోఁడ నతృప్తి తప్పనిద యయ్యెఁ;
మనసు ప్రేమింపవలెఁగాక మాటవరుసఁ
దేనెపూఁతల రాజ్యంబు తియ్య నగునె! 28

సీ॥ † ఆదృతిలేని మతాచారములఁ జూచి,
యరయని దేవాలయములఁ జూచి,
విఱిగెడు జాతీయ విద్యలగతిఁ జూచి,
ఖిలమైన వృత్తి విద్యలనుజూచి,
పన్నువసూలు దబాయింపులను జూచి,
ఫలమీయఁగాలేని పొలముఁ జూచి,
కడు క్షేమఁగాలేని కాఁపురంబులఁ జూచి,
మొఱ లాలకింపని దొరలఁజూచి,
తే॥ నిలువు మాఱిన వేషభాషలఁ దలంచి,
పొదుఁగుఁజేసిన పరమతాభ్యుదయ మెంచి,
కన్ను గూర్కెడు స్వమతంబుఁ గాంచలేక
యుడికిపోయె మరాటుల యెడఁద లపుడు॥ 29

† "The history of the Deccan Sultanates is a long tale of intrigue and wars, not relieved by a single act of real benevolence to the people consciously undertaken. Even judged by the standard of public morality prevailing in that age, we are forced to conclude that the Hindus who formed the bulk of the population were most cruelly treated and

చ॥ మొదవును లేఁగ మూతివిఱుపుల్ గనకుండఁగ సంతరింపుచున్
బిదికినఁ, గుండపాల్గురియుఁ; బెట్టక ముట్టక త్రాటఁ గట్టుచున్
బొదుఁగును గోయుచో రుధిర పూరము జాఱదె? యిట్టి యేల్బడిన్
మెదిగిన రాజులున్ ప్రజలు మేలిమిఁదాలిమిఁ బొంద నేర్తురే!॥ 30

ఉ॥ తీఱని యుమ్మలో మునిఁగి తేలుచు, నాఁటి మరాటులున్ "శిలే
దారు' 'హవాలుదారు" 'సరదారును' 'మాన్సబుదారును' 'ముజుం
దా' రనుపేరఁగొందఱు, స్వతంత్రులు జాగిరుదార్లు రైతులన్
చేరులఁగొందఱై, మదిఁ దపించి రతంత్ర పరాశ్రయంబులన్॥ 31

ఆ॥ వే॥ తల్లిలేని దూడ తఱవుచు, నేయావు
పొదుఁగునైన మూతిముట్టఁబోవఁ
జుఱుకుఁగాలిప్రేటు కఱకుఁగొమ్ముల పోటు
గాక, కడుపు నిండు కరణి గలదె!॥ 32

శా॥ "స్వాతంత్ర్యంబునఁబుట్టి చావవలె" నన్వారల్ మహారాష్ట్రు లీ
రీతుల్ గొందఱుమెచ్చ కొక్క పెరదారిన్ దీసి; రేకొందఱో
యోతప్రోతము లెంచ కాదొరల యుద్యోగంబుసాగించి; రు
ఖ్యాతల్వో నెదురొడ్డి నీయలలు తా మొండొండు ఊపాడుచున్

క॥ కడుపునకై కౌలీనత
నడఁపంగా నిష్టపడని యభిమానధనుల్
పడఁతులతోఁ గొడుకులతో
నిడుమఁ గుడిచి రడవులన్ మహీధరదరులన్॥ 34

---

oppressed beyond measure." "A History of India - Part II" *P., 135, C. S. Srinivasachari & M.S.Ramaswami Aiyangar.*

† "Everything, therefore, seemed to be leading up to one inevitable end — the ruin and the devastation of the Hindu Province, the annihilation of their old royal houses. the destruction of their religion, their temples, their cities."
*"A Forgotten Empire" Mr. Sewell*

సీ॥ కావిగుడ్డల బూది కఱకు మైపూఁతల
రాజరాజచ్ఛాయ గాజువాఱఁ,
గాయగూరల వంటకట్టెల నులిమాడి
వజ్రాయుధపు టంచువాఁడి మ్రగ్గఁ,
గాలిగజ్జెలు చిట్టికరతాళములు నవ్వ
దొరమగంటిమి యుమ్మఁ గరఁగిపోవ,
గుఱ్ఱాల నదలించి గోవుల సవరించి
రాచపుట్టువు కొండఱాల మఱుఁగ,
తే॥ యతులు, పేదరైతులు, భక్తతతులు, పసుల
కాపరులునై మహారాష్ట్ర భూపు లిపుడు
నాఁటి యజ్ఞాతవాస పాండవులు వోలె
నుడికిపోయిరి గూఢాగ్ని హోత్రదీక్ష॥ 35

సీ॥ ఎల్లఁదోలెడునాథు నెఱమగా నొడిఁగట్టి
చదునార విత్తనాల్ చల్లునపుడు
మూన్నెల్లపాపని మూపుజోలెఁ దగిల్చి
తెగని లిక్కులఁ గల్పుదీయునపుడు
నడిమింట మండు నెండలకాఁకఁ గమలుచుఁ
గోడవండ్లఁ బైరులు గోయునప్పు
డెదిరి పంజలుదీర్చి యిరుత్రాళ్ళ బిగియించి
ముడిగడ్డిమోపులు మోయునపుడు
తే॥ ముంగురుల ముంచి చెమ్మటల్ మొగమునిండఁ
బెదవి కమలించి యొగయూర్పు లెద బిగింప,
ఆ "మరాటా" కుటుంబిను లడరుటగ్గిఁ
గడఁక సాగించి రబిచార కర్మదీక్ష॥ 36

శివాజీ జన్మమునకుఁ బూర్వరంగము.

క॥ తమవారి చెయిదములకుఁ
గుములుచుఁ, బయివారి యెడను కుడి చూపులకుఁ
గమలు మహారాష్ట్రముపై
నమరె నపుడు మొగలు దండయాత్రలు కఱ్ఱకై॥ 37

ఉ॥ ఏ శుభలగ్నమం దడుగు లేసిరొ దక్కనుపైనఁ దొల్లి ఢి
ల్లీశులు: నాఁటఁగోలె వెరవేది మహారథరాజ్యలక్ష్మి శో
భా శిథిలాంగకంబులఁ దపస్విని యై, పచరించె జీర్ణ ప
ర్ణాశన దావసేవన గుహాంగణ జంతుసహాధివాసముల్॥ 38

మ॥ చిలుముంబాయఁ గటారి నూఱికొని, "ఖిల్జీ" బిక్షతౌరుష్క సే
నల పాదాహత ధూళిధూమములు మింటన్ బ్రామఁ, దతూర్యరతా
జ్వలనజ్వాలల హైందవప్రజల సర్వస్వంబు వేల్పించుకాఁ
కలు నాఁడున్ "సినిమా" ప్రదర్శనములై కన్పట్టె నవ్వారికిన్॥ 39

మ॥ ఖిలిజీ వంశమువారి దారిఁగొనుచున్ గ్రేళ్ళెత్తి, "తుగ్ల" క్కులుల్
పెలుచన్ దండులుదోలి దక్షిపుటుర్విన్ దొ్రక్కి; రవ్వారి సేఁ
తలకున్ జాతిమతావరోధముల కద్దంబైన విఖ్యాతగా
థలు కీర్తించిరి దక్షిణోర్విజను లంతస్తాప మేపారఁగన్॥ 40

తే॥ పుండ్లుపోఁ - బోని పెనుగంట్లుపోలెఁ, దొంటి
యవనుల దురంతములగుర్తు లడఁగ లేద,
మరల నవ్వాని గాయమ్ముగ పఱచునట్లు
"గింగు" రనిమోసె మొగలు ఫిరంగిగుండు॥ 41

మ॥ $ చనినాఁ డక్బరు చల్లఁగా మిణుఁగురుల్ సంధించి, మామంచివాఁ
డన; నవ్వాని రగుల్చినాఁడు సెగ లల్లార్పన్ జహంగీరు; త
త్తనయుం డాసెగలెల్లఁ బైఁ జెరుగుచున్ దండెత్తినాఁ; డిట్లు ద
క్కనులోఁదొంటి దురంతముల్ మరల నిక్కన్ జొచ్చె నానాఁటికిన్॥

$ "A new danger threatened the country in the attempts.

చ॥ ♆ ఇవి యొకనాఁటి దుండగములే! తరముల్ బడి మూఁడునాల్గుహైం
దవుల మనంబులన్ దవిలి, తాఁకినచోఁ బొగరాఁజి మంటలన్
గవియుచు, నందునందు సుడిగాడ్పులఁ దేలుచు, మానస వ్యథా
దవ దహనంబు నల్దెసలఁ దట్టె మరాటులనాట నాఁటికిన్॥ 43

తే॥ పసులకాపరి గుడిసెలోఁ, బంటుకాఁపు
మనసులో, వీరయోధు కగ్గొనలయందు,
నల మరాటా కుటుంబమం దన్ని యెడలఁ
బ్రాఁకి, స్వమతాభిమానంబు పాదుకొనియె॥ 44

చ॥ అదనపు టెండలన్ బఱియలై, తొలుకారునఁ బొంగి, నాగటన్
మెదుగుచు, నెర్వులన్ బలిసి, మిక్కిలి మొక్కలువాసి, వానలన్
బమనయి, విత్తనంబుగొలుపన్ దగి, దక్షిణభూమి నేఁటి క
భ్యుదయము వేచియుండె మనసాగ్గి మహాపురుషావతారమున్॥ 45

చ॥ మెఱుపులవంటిచూపు, నులిమీసల బుగ్గలనంటు గడ్డపుం
బరుఁజులు, ముళ్ళకన్బొమలు పర్వఁగ, జేగురుగొన్న మోముతోఁ
దురగము నెక్కి నల్గడల దూఁకు మహారథు ధర్మరక్షణా
తురతకుఁ బూర్వరంగమగు త్రోవలు పెక్కులు దోఁచె నీగతిన్॥ 46

---

made by the Delhi Emperors, from Akbar to Aurangzeb, to extend the Mahomedan power again to the south of the Narmada and the Tapti rivers." (Page 36)

♆ "The new Moghul invasion threatened the land.... the like of which had not troubled their ancestors three enturies .before. Those three centuries had left lasting memories of past horrors and justified apprehensions of the renewal of the fanatical intolerance and cruelty which the Mahomedan Conquerors, left to themselves, were so prone to exhibit in their dealings with the people of the country.'

*P. 45 "Rise of the Maratha Power" by M. G .Ranade.*

సీ॥ ఆది శిశోదరాయఁడుఁ దత్కులంబువా
రేలునాఁడు కుసుమ్ల నెసఁగిమించి,
రాష్ట్రకూటులు మహారథులు పాలించునాఁ
డంకురించి చివుళ్ల నందగించి,
దంతిదుర్గాది భూధవుల యేల్బడినాఁడు
మూపప్రాయవు నిండుమొగ్గఁ దొడిగి,
యాదవప్రభుల రాజ్యమునాఁడు కమియ మాఁ
గిన పండ్లబరువునఁ గొనలువిరిసి,
తే॥ యల మహారాష్ట్రరాజ్య కల్పాగమంబు
భామినీరాజ్యవాత విధ్వస్తమయ్యెఁ;
¶ చెదరె బీజముల్, దక్షిణక్షేత్రమందు
మొలచె సహ్యాద్రిభవ నదీజలముచలువ॥ 47

చ॥ మొలచిన మొక్కలందు బలుపుల్ గనుచున్, వడిదేఱు కాఁడతో
నలముచు, నూఁగుదేఱు చిగురాకుల నిక్కిన మొక్క, - భోస్నలే
కులచిత పూర్వపుణ్యములకున్ నెలవై † శివనేరు కోటలో
నెలకొనె, జీజియా పొదుపు నిండిన పొత్తిటఁ బ్రోదిఁగాంచుచున్॥ 48

ఉ॥ అట్టి యుదీర్ణ దేవగిరి యాదవరాజ మహాన్వయంబునన్
బుట్టి, శిశోదియాంక రసపుత్ర కులీనుని భోస్నలే విభున్
బట్టిన వీరయోష, దురుపప్లవ ఘూర్ణితచిత్త, జీజియా
పట్టినిఁ బెంచుచుండెఁ బులిపాల మగంటిమి నుగ్గువెట్టుచున్॥ 49

---

¶ "The Maratha power had been already created, though scattered in small centres all over the country."

† "The seed was sown for which the ground had been prepared for more than three centuries .... when Shivaji ... was born at Shivaner." (Pages 38 & 39)

*"Rise of the Maratha Power" by M. G. Ranade*

సీ॥ తలయంటి నీర్వోసి తడియార్చి పొగయించి
తిలకంబు నుదుటిపైఁ దీర్చునపుడు
నొడిఁజేరి పైఁటలోనొదిఁగి మ్రాఁగన్నులఁ
జనుఁద్రావు సుతుమోము గనెడునపుడు
నాటబొమ్మలకు మోకాటఁ బారాడుచో
నాక్కవేయుచు నెచ్చరించునపుడుఁ
"జందమామా! రావె! జాబిల్లి! రా!" యని
పిలిచి, పాల్బువ్వఁ దిన్పించునపుడు
తే॥ జీజియాబాయి పెద్దలచేత విన్న
చిత్తముననున్న యవతార చిహ్నములను
దనయుచూపులో నవ్వులోఁ దడవికొనుచు
నిలువుతెప్పలఁ గబళించి నెమరువేయు॥ 50

తే॥ పూలపొత్తిలిఁ దొట్లలోఁ బుత్త్రునునిచి
పోరుమాన్పించి, నిద్దురపుచ్చునపుడు
విరివిఁగన్న మహారాష్ట్ర వీరచరిత
లాలపించుచు జీజియా జోలఁబాడు॥ 51

చ॥ నడువగనేర్చి, ముద్దులుగొనన్ జిటిపల్కులు వింతలూరఁగా
నుడువఁగనేర్చి, యాటల ననుంగులవెంబడిఁ బుట్టచెండులన్
విడువఁగనేర్చి, హానియొదవించెడుప్రాణి యదెట్టిదైననున్
బొడువఁగనేర్చి, తల్లి ముదమున్ గనుచుండ శివాజి వర్ధిలెన్॥ 52

నిద్దురవాయ బాలతరణిన్ దొలికూఁతలలేపి, కాలు క
న్నద్రి జగంబుచూపి, హిత మారయఁజేసెడు మాత జీజియా
ముద్దుకుమారు వెంటగొనిపోవు, నటన్ శివనేరుకోటలోఁ
బెద్దలనాఁటినుండి యిలువేల్పు భవాని నమస్కరింపఁగన్॥ 53

తే॥ కొండవరుసల శివనేరు కోటచుట్టు
గుహల నొక్కటఁ గొలువున్న గుజ్జువేల్పు
గణపతికి మ్రొక్కుఁదల్లితోఁగదలి శివుఁడు
భావికృతులకు విఘ్నముల్ వ్రాయకుండ॥ 54

ఉ॥ తా నొకరాజు, మేటిసరదారులు కొందఱు, కొంద ఱన్య రా
ట్సేనలుగాఁగ బాలురను జేరిచి, వ్యూహము లొడ్డి, దుర్గసం
తానము లెక్కి, భేదనవిధానములున్ విజయొందిరాను సం
ధానము లాటలాడెఁ బిననాఁడె, శివాజి భవిష్యదర్థముల్॥ 55

మ॥ కనుదానిన్ వినుదానిఁ జెప్పకయె చక్కన్నేర్చు ధీశాలితన్
గని దాదోజి శివాజి మెచ్చుకొని ప్రక్కన్ జేర్చి, యాడించు మె
ల్పున వ్రాయన్ జదువంగ, నంకగణితంబున్ గూర్పఁగా నేర్పి, యొ
య్యన రాజ్యాంగవిధానముల్ వినిచెఁ బ్రత్యక్షానుమానాదులన్॥

మ॥ కలఁతన్ జెందెండు నాత్మదేశమతముల్ గాపాడ, శస్త్రాస్త్ర వి
ద్యలుఁ జాణక్యతపంబులున్ జదువు విద్వాంసుల్, మహారాష్ట్ర వీ
రులు వేదాంగములెత్తి యర్థముల మార్పున్ దీర్పు చర్చించు తా
తల తాటాకులమీఁది గంటములవ్రాతఁల్ గోఁతలున్ మెత్తురే!॥ 57

ఆ॥ వె॥ ఆత్మదేశ గౌర వాభ్యుదయంబుల
నామతించు జీజియా వధూటి
తనయు గుణగణంబువిని, చిన్నికథలుగాఁ
బూర్వ వీర చరితముల్ వచించె॥ 58

మ॥ చనవారన్ దొడఁజేర్చి మై నిమిరి జీజా పుత్రు నగ్గించి, ప్రా
క్తనగాథల్ వినిపించునప్పు డతఁడుత్సాహంబునన్ బొంగి, దు
ర్జన శిక్షాపర వీరవిక్రమకథా సంక్రాంత దుర్దాంత వ
ర్తనుఁడై మైమఱ పందుఁ, గాళియ ఫణాగ్ర వ్యగ్ర నాట్యంబులన్॥ 59

సీ॥ "అతిథిపూజకుఁ గుటీరాంగణ మేతెంచు
పతిదేవతను జెఱపట్టికొనిరొ"
"దగు పెద్ద కొలువులో ధర్మాసనముచెంతఁ
జెరలాడి మగనాలి చీర లొలిచె"
"బసుపు గుడ్డల పెండ్లి పడుచు మెర్వడి నాఁగి
కుత్తుకఁ దెగఁగోయఁ గత్తిదూసె"
"నద్దమందైన నీయతిఁవ జూపింపవో
యని, దండుగొని కోట కగ్గిపెట్టె"
తే॥ నను పురాణ కథాగీతు లాలపింప
వినుచుఁ, దద్భావ భావనావేశపరతఁ
గంట వేఁడినీ రూర, నై గగురుపాటు
నడరి ఘూర్ణిల్లు బాలవీరుఁడు శివుండు॥ 60

చ॥ శివు నవతార మేయని వచింపగనొప్పు శివాజి, ప్రాగ్భవో
ద్భవమగు భక్తిసంపదయుఁ దల్లియొసంగు మతాభిమానముఁ
బువెడలించుతావివలెఁ బొంగిన సాహస ధైర్య శౌర్య గా
రవము లెలర్పఁగాఁ జిఱుతప్రాయపు టాటల మేల్మిమీఱ గనెఁ॥ 61

షాజీపరిస్థితి జీజీయా శివాజికిఁ దెల్పుట.

తే॥ శివుని యీ యాటలెల్ల షాజీవిభుండు
మొగలు దండుతోఁ దలపడి పోరుచుంటఁ,
గంటితోఁగాక మనసుతోఁగాంచుచుండె
నోడుగెలుపుల నుయ్యాల లూఁగికొనుచు॥ 62

తే॥ ఓటమిని మిన్నంగి గెలుపున నుబికి, మొగలు
దండు షాజీనిఁ బలుమాఱు దఱిమికొనుచుఁ
బ్రజలఁ బీడించి గగ్గోలు పఱచుచుండ
గళవళంబడె నాఁడు దక్కను ధరిత్రి॥ 63

తే॥ తన్నుఁ గారించి, షాజీనిఁ దఱుములాడి
ప్రజల నుడికించు మొగలు కర్కశత నెంచి
జీజియాబాయి యెడఁదలోఁ జింతఁ దవిలి
యురియుచుండె; నిట్లుండఁగా నొక్కనాఁడు॥ 64

ఉ॥ ఆటల బాలురన్ గలిసి యాడుచు బాలశివుండు, వీధులం
దోటమొగంబులన్ జనము లొండొకరుం గుమిగూడి, ముందుపో
రాటము, లందుమోగలుల యాగడ, మిప్పుడువత్తురేమొ య
న్మాటలు వించు, డెందము కుమారిలఁ దల్లినిఁజూడ నెంచుచున్॥ 65

చ॥ సరగున మేడకున్ జని, విషాద మలీమసమైన మోమునన్
గారలిన చెమ్మటన్ గరఁగు కుంకుము చాఱలుగట్టి. చెక్కులన్
దొరఁగెడు నశ్రుపూరములతో డిగజాఱ, విఘూర్ణితాక్షులన్
బఱపెడు జీజియాఁగని శివాజి కుఠార విదారి తాత్ముఁడై॥ 66

మ॥ "జననీ! యేమిది? బిడ్డతో గిరిగుహా స్వచ్ఛంద నిష్పందతన్
గను సింగంబును ఱెచ్చకొట్టి బ్రతుకంగా నెవ్వఁడూహించె? నీ
కనుసోనల్ గురియించి దప్పి నడఁపంగా నెవ్వఁడాసించె? నిం
డిన కుండన్ దొనఁకించు గాలితుటుముల్ నేఁడిందు రాపాడెనే?" 67

చ॥ అని యొడిఁజేరి పైచెఱఁగు నద్దుచుఁ గన్నులయూటలొత్తి, మో
మొనసెడుచూపుతో ననునయించు కుమారునిఁ జూచి, జీజియా
కునుకఁగనున్న దీపమునకున్ జము రందినయట్లులై, మనం
బునఁ జెరలాడు వేఁడివగపున్ డిగమ్రింగుచు, నిట్లువాకొనెన్॥ 68

మ॥ "తనయా! నేఁటికిఁగల్గె నామనసువంతల్ దెల్ప - నూఁకొట్టు; 'నుం
డెనొ లేదో జగమెల్లనిండిన భవానీమాత, నా ప్రార్థనల్
వినలేదో' యనుకొంటి; దక్షిణ ధరావిఖ్యాత జీమూత దు
ర్దినములోవ్వివ, జపారుణారుణ ముషశ్శ్రీ దోఁచినట్లయ్యెడున్॥ 69

శా॥ అన్నా! దక్షిణ భారతోర్విని జనం బాబాలగోపాలముం
గన్నారన్ నిమరించిరే? పిడికెఁ డన్నంబైన నిశ్చింతగాఁ
దిన్నారే? 'యెపు డెల్లపైఁబడునో యుద్వృత్తిఁ మొగల్దండు' లం
చున్నా రాపునుదాపు లేనిప్రజలై యుత్సాహముం బాయుచున్॥

ఉ॥ ఈ దవకీల లాఁగి మొనరెత్తులఁబోరుచు, నీవుతండ్రితో
డేది కుటుంబమేది నిలుపేది శ్రమింపఁదుచుండ, వారిఁ గా
లూఁదఁగనీక యే తఱుముచున్నది మోగలుదండు దేశ మం
దేద యొనర్చి; యింత మిడిమేల మిదేలని యుమ్మలించెదన్॥ 71

మ॥ అయి దా తేఁడులవాఁడ వీవెఱుఁగ, వన్నా! మొన్న మోగల్‌చమూ
చయముల్ గత్తిఁ గటారిదూసి కసిమించన్ డాసి, మీయయ్య నే
బయలన్ నిల్వఁగనీక తోలె, నటుపైఁ బంతంబు సాధింప నా
పయికిన్ దూఁకె, నిఁకేమి వల్కుదుఁ? దలంపన్ మేను గంపించెడిన్॥

సీ॥ ఉదరమ్మునంట నిన్ బొదివి, మర్కటివోలెఁ
బ్రతిదుర్గమున కెగఁబ్రాఁక లేక,
పావురుగాని యాపదఁబాప, రాచిల్క
వలెఁ బంజరమున నిన్నిలుపలేక,
కంసు కటారిసోఁకఁగనీక, వసుదేవు
వలె గోకులముఁ జేర్చువాఁడు లేక,
పులివాతఁబడు గోవువలె, లేఁగదరిఁ జేరి
దిక్కులేని తనంబు దెలుపలేక

తే॥ యలసిపోయితిఁ; 'దోడు లేనైతి' ననుచుఁ
గుమిలిపోయితి; మొగలు కక్కుఱితి నెదిరి
ధిక్కరించితి; 'నీకై తెంపుసేయ
నొక్కఁడు లేఁడయ్యెనో' యంచు నుడికిపోతి॥ 73

ఉ॥ దేవత లాపువచ్చినగతిన్ బినతండ్రియుఁ దమ్ముఁడుండి, యా
యా వివరమ్ములాడి హితమాడి తెగంబడి దేవురించి, నా
జీవములిచ్చి; రిపొదువు చిక్కనిచో, శివనేరుకోటలో
నీవును నేనును న్గలిసి, నేఁడు మొగమ్ములఁ జూచికొందుమే!॥ 74

చ॥ ఇది యొకఁడే తలంప వచియింప: నిజాము నవాబు మోసపుం
జిదుగుల నీదుతాత లుకజీఁ దనకొల్వుకుఁ బిల్చి, భృత్యులన్
బొదువఁగఁజేసి, గొట్టియలఁబోలెఁ గుటుంబము నెల్లఁగూల్చె. నీ
చిదగొద లిట్టిరోఁతలు నశింపవె హైందవభూమి నెన్నఁడున్!॥ 75

ఉ॥ † కన్నులపండువై తనుపుఁగాంచిన గోవుల నిండుపైరులన్
గన్నెల విప్రులన్ జెఱచి, గండతనమ్మునఁ గాడు బీడుగాఁ
దన్నుచుదున్నుచున్ మొగలు దండులు రా, నదలించి ధీరతన్
వెన్నడిఁ బాఱఁదోలఁగల వీరుఁ డొకం డిట లేకపోయెనే!॥ 76

ఉ॥ క్రమ్మెడు నీఁటెపోటులకు ఱొమ్మిడుచున్ బయిదూఁకి వైరి జీ
వమ్ములఁ దీయుదాఁక ధరపైఁ బడనొల్లని మేటి వీర వం
శమ్ములు గొడ్డుపోయినవి, సాగుచునున్నది వారియాట; దై
వమ్మెపుడోము! నెవ్వఁ మనవంశములన్ మఱు లుద్భవించునో!"॥ 77

మ॥ అనుమాటల్ విని, బాల్యచాపలము ద్రోయన్, దల్లిగెకొన్నవే
దనదూయన్, శివబాలుఁడుక్కెనసి, "మాతా! మానుమీచింత; క్రూ
ర నిరాస మ్మొనరింప దేవుఁ డవతారం బొందు; సింగంబు నీ
నిన సహ్యావని గొడ్డువోవునె? భవానీమాత కన్నాయునే? 78

† "The long wars of Mughal aggression .... completed their ruin. The oppressed ryots fled from their homes, the deserted fields lapsed into the jungle; many once flourishing villages became manless wilderness."

Page 191, "History of Aurangzeb" Vol. I. - *J.N.Sarkar.*

సీ॥ కార్తవీర్యుఁడుఁగొన్న కపిలధేనువుఁదేర
రణభీము భార్గవరామునట్లు,
లేకచక్రిపురంబు నెరియించు బకు గెల్వ
ద్విరదాయుతస్థేము భీమునట్లు,
లాదితేయులగెల్చి యమృతకుంభముఁదేరఁ
దత విపక్ష దిధక్షుఁ దార్క్ష్యునట్లు,
లమరసామ్రాజ్యాపహర్తయౌ బలిఁదొ్రొక్క
మాయావతార వామనునియట్లు,
తే॥ పనుపుమీ నన్ను; సంశయపడకు తల్లి!
యమృతవాక్కులదీవించు, మదియచాలుఁ;
జలము బలమును శక్తియుక్తులను జూపి
జయముఁగొనివత్తు; నీ మనశ్శరముఁ బుత్తు॥ 79

ఉ॥ ఈ యబలాట మాను జననీ! "మనహైందవభూమినోమఁగాఁ
బాయక భోన్సలే కుల తపంబునకున్ వరమిచ్చియుండెఁ గా
త్యాయని" యంచు వింటిమిగదా! జగదంబ నిజార్థసిద్ధికై
యే యవతారమే నభినయించుత్వరన్ దెర యెత్తకుండునే!"॥ 80

మ॥ అనుటల్ దా నమృతాభిషేకమునయట్లై జీజియాబాయి పు
త్రునిఁజేయారఁ గవుంగలించుకొని, మూర్ధన్గొంచు, "నాతండ్రి! నీ
వనుమాటల్, గొనుకార్యముల్ గెలిచి, దీర్ఘాయు ర్యశో వీర్య వ
ర్ధనతన్ మించుత; వజ్రవర్మ మవుగాతన్ నీకు నాదీవనల్"॥ 81

మ॥ అని దీవించెడు నంతలోపలఁ "దధా" స్తంచున్, సుధాస్తార వా
చనుఁడై వచ్చిన ఖాండదేవుని నమస్కారంబులన్ గొల్చి; రా
యనయున్ డెందమునందు విందు కనులందై మోమునందై నుడిం
గొనుటందై వెడజాలువాఱ, నిటు వాక్రుచ్చెన్ శుభాశంసియై॥ 82

## పాజీయుత్తరము - పునహాప్రయాణము.

శా॥ "అమ్మా! నేఁటికి విచ్చిపోయినవి నిత్యంబై మహారాష్ట్ర రా
జ్యమ్ముంగా ముట్టిన కాలమేఘములు: సస్యశ్యామల క్షేత్ర ర
మ్యవమ్మౌ నింక నుపాంత భూములు, వరాహవ్యాఘ్ర భల్లాది స
త్వమ్ముల్ దోల శివాజి మేల్కొనె నుదాత్తక్షాత్ర ధర్మంబునన్॥83

ఉ॥ తీరనికయ్యముల్ వొడిచి, తెప్పిరి నేఁడు షహాజిరాజు తన్
గోరు బిజాపురప్రభువునన్ బెనుబాసటగాఁగ నిల్చి, స
త్కారముతోడ మేటియధికారములంది, జనంబుమెచ్చ స
ర్దారుఁడునుం బ్రధానుఁడయి, తా వసియించె బిజాపురమ్మునన్॥ 84

ఉ॥ దుర్మదులైన మోగలులతో దురముల్ భరమాను దేశమున్
శర్మవిదూరమున్ జలుప, సంధిగొనెన్ షహాజీవిభుండు; త
త్కర్మఫలంబుగా మనకుదక్కెనరాజ్యము కొంతవోయె; నీ
నిర్మల పుణ్యభూమి శివనేరు పడెఁగా మొగలాయిచేతులన్॥ 85

ఉ॥ పట్టినపట్టు దీర్చి, యొకపాటివిరామముతోడ నెమ్మదిన్
మెట్టి, నివాసపుస్థిరత మేకొనఁగాఁ "బునహాపురమ్మునన్
బట్టిని మిమ్ముఁ గందు" నని పంపిన యీశుభలేఖ యిప్పుడే
ముట్టినదమ్మ! మీ పయనమున్ బతియానతిఁ జేయఁగోరెదన్"॥ 86

మ॥ అనుమాటల్ విని జీజియా యుబికి "దాదా! నేఁడు నానాథు నె
మ్మన మీపాటివిరామముం గొని, ననున్ మన్నింపఁ గాలంబు వ
చ్చెనె? కష్టమ్ములు విచ్చెనే? శిరముపై జీరాడి మమ్మేఁచు దు
ర్దినముల్ విచ్చెనె? మాభవాని ననుఁ దంద్రీ! నేఁటికిన్ మెచ్చెనే? 87

మ॥ చనెఁగాదా పదియేండ్లకాల! మపు డాసాంభాజి నెమ్మోము నా
కనులన్ గట్టినయట్టులుండె; నల రాకాయామినుల్ గూడ నం
ధ నిశీథమ్ములె యయ్యె; వేళకగు నన్నంబేది, నీరేది, యిం
తనువా నిద్దురయేది, యేమయిరొగాదా! తండ్రియుఁగా బిడ్డఁడుఁగా॥ 88

ఉ॥ తల్లినిఁబోలి గర్భమున దాఁచి, శుభమ్ములఁ బుట్టినిల్లు న
త్తిల్లును విస్మృతింగొలిపి యేలిన మా శివనేరుకోటలోఁ
జల్లఁగఁ గాలముల్ గడపఁజాలుచు; మాశివుఁడెన్నఁడేని వ
ధ్ఢిల్లి నియంతయై కొలువుదీరినఁ, గన్నులఁ జూడఁ గోరితిన్॥ 89

తే॥ ఇంతలో నిట్టివిపరీత మెఱుఁగనైతిఁ;
దఱుముచున్నాఁడు బలవంతపఱచి మమ్ము
నాలిదైవము; మాశివనగర మింక
శివునిఁబాసిన కైలాస శిఖరిగాదె!॥ 90

శా॥ దాదా! నామది నిండిపోయె; నిదియుత్సాహంబొ! శోకంబొ? ని
ర్వేదంబో! త్వరపాటొ! నేనెఱుఁగఁ; దండ్రీ! సర్వసన్నాహ మా
పాదింపన్ నియమింపు; మీ విపు దుపప్లావ్యంబునన్ బాండవ
శ్రీ దర్శింపఁగఁబోవు కృష్ణుఁడవు; ధాత్రీత్వంబు నీదేసుమీ!”॥ 91

తే॥ అవెడుపల్కుల కలరి, కల్యాణయాత్ర
సముచితంబుగ దాదోజి సంతరించె;
జీజియాయి బాకొడుకును జేయివట్టి,
కరఁగి కరడెత్తుతలఁపులఁ గదలినడిచె॥ 92

ఉ॥ ద్వారముజేరి, గాటమగు భక్తిమెయిన్ గృహదేవతా నమ
స్కారముఁజేసి, యాభ్యుదయికంబగు దాన సమర్చనాదికా
చారములెల్లఁదీర్చి, పరిచారకులన్ దనియించి, తోరణ
ద్వారము దాసి, యచ్చటి భవానికి మ్రొక్కులువెట్టి, వెల్వడెన్॥ 93

తే॥ క్రిందఁ గనుపట్టు నుపవన క్షేత్రములను
వరుస దిగిపోవు నిడుపు సోపానములను
గనుచు, ద్వారమ్ముదాఁటి, యుత్కంఠతోడ
మనసుఁ గనులను గోటవైపునకుఁ దిగిచి॥ 94

చ॥ బురుజులతో, బిగింపుబలుపుంగని నిక్కినకోటతో, నభం
గుర పురతఃకవాటముల గుబ్బలతో, గిరిపంక్తితో, నిరం
తర తరురాజితో, వెలుఁగు దాగలియా శివనేరు దుర్గపుం
బరి నిలువెల్లఁజూచి, యెడఁబాటు తలంపున నీడలాడఁగన్॥ 95

సీ॥ "నడిపించితివి, తోడుపడి కాన్పుసవరించి
యల యాఁడుబిడ్డ మర్యాదలెల్ల;
నాడిపించితివి, బిడ్డ నొడిఁజేర్చి పుడికించి
పెద్దకోడలి యింటిపెరిమయెల్లఁ;
గుడిపించితివి, పీటయిడి పళ్ళెరంబిడి
వియ్యపురాలి యొప్పిదములెల్ల;
విడిపించితివి, నీదుకడుపులోఁ జోటిచ్చి
సవతి పుట్టింటిమచ్చరములెల్లఁ;
తే॥ బదివసంతముల్ నీదుగర్భమున నడిచెఁ;
బ్రోచితివి నీదుచెక్కిలఁ బొదివికొనుచు;
మఱతుమే నిన్ను! మాశివపురుటియిల్ల!
పతిని దరిసింప సెలవిచ్చి పనుపుతల్లి!" 96

చ॥ అనెడుతలంపులన్ బెదవియాడ, మనమ్మొరియాడఁ, గన్నులన్
మినుమినుకాడ, ఱెప్పతుది మిట్టిన ముత్తెములాడ, జీజియా
గొనకొనుకూర్మితోఁ బసుపుఁగుంకుమ దోయిలివట్టి, భక్తి భా
వనము కృతజ్ఞత న్మెరయ, వాకొనె దీవనపల్కులీగతిన్॥ 97

తే॥ "శివుఁడు శివుఁడేని, యంబ శాంభవియ యేని,
భరతభూమి పతివ్రతాకరమ యేని,
శివుని పురుటిల్లు తద్యశశ్శ్రీల పొరసి
దక్షిణ ధ్రువతారయై తనరుఁగాక!" 98

మ॥ అను జీజాపలుకందిబాలశివుఁ "డంబా! నేఁడు నీవిచ్చు దీ
వనముల్ నాయభిమానముద్రయిడి, సౌవర్ణాక్షరశ్రీల నిం
డిన యీపద్యము భావిహైందవులకున్ నిత్యోపహారమ్ముగా
నొనరింతున్; శివనేరు వాఙ్మయ చిరాయుశ్శ్రీల రాజిల్లుతన్!"॥ 99

తే॥ అనుచుఁ దల్లియుఁ గొడుకు జోహారులిచ్చి,
నడువ నసిలేని మదిలేనియడుగు ద్రిప్పి,
త్రోవ నడిపించు దాదోజితోడఁ గదలి;
రంతఁ బల్లకి సోపాన మవతరించె॥ 100

తే॥ మొదట విస్తారమై, కొంత పోవఁ బోవ
ముగురుమాత్రమే యొకటిగాఁ బోవజాలు,
నిఱుకుత్రోవలో సైన్యమ్ము లొరసికొనుచు
నాయుధము లెత్తిచన వేడుకై రహించె॥ 101

మ॥ ఇరుపార్శ్వంబులు కొండలంబలిసి, మధ్యేమార్గసోపానముల్
తరఁగల్గా, డిగఁబాఱు నిర్ఝరముమీఁదన్ దేలితూఁగాడు మం
థరమౌ నోడయుఁబోలెఁ బల్లకి బహిర్ద్వారంబు లేడింటినిన్
వరుసన్ దాఁటుచుఁబోయి నేలపయి నిల్వన్, వారు వెన్జూచుచున్॥

మ॥ * ధరణీ గర్భము దాఁటి, చక్కఁగ శిలీంధ్రమ్మట్లు పైకుబ్బి, మి
న్నరయన్ నిక్కుచు, వేనవేలడుగు లెత్తైకొండపైఁ గోట లే
డరిగాఫా శివనేరు దుర్గ మవిభేద్య శ్రీల శ్రీచక్ర గో
పురమై కన్పడ, మ్రొక్కులిచ్చిరి తలంపులోని వీడ్కొల్పులన్॥103

* "The hill of Sivaneri rises at a straight line from the surrounding ground level and is thousands of feet high........ Eight or nine gateways (toranas) (were) built........over the narrow pathway.....It is one of the holiest of the holy places of Dakhan, because....from this....mountain top of Sivaneri ....Maharaja Sivaji....greeted the first rising Sun of his new life."—P. 269. "Modern Review" Sept. 1937. *AdrisBanerji*

ఉ॥ మునుకొని వీరయోధభటముఖ్యు లుదాయుధులౌచుఁ బర్వఁడన్
వెనుకొని ఖాండదేవుఁ డట వింత విశేషము ముచ్చటించుచున్,
దనహయ మొక్క-పార్శ్వమున దాపుగొనన్ గదలించి, ముందునన్
వెనుకను గన్నువెట్టి నడిపించెఁ బ్రయాణము సత్వరమ్ముగన్॥ 104

క॥ "అది 'చాకణు దుర్గం' బను
నది; యింద్రాణీస్రవంతి యదియ; తుకారా
ముదయించిన 'దేహూ' పుర
మిది" యని దాదోజి వింతలెన్నుచు నడిపెన్॥ 105

మ॥ పునహా పట్టణ సౌధరాజి కనుచూపుం దాయ, నుత్తుంగ కే
తనముల్, గోపురచంద్రశాలిక, లభేద్యంబైన ప్రాకారముల్,
వనముల్, పచ్చికనేల, లంతికమునన్ బారాడు "మ్యూటా" నదీ
స్వనదూర్ముల్ గనుచుండఁ బల్లకి పురద్వారంబు దాయన్ జనెన్॥

ఉ॥ అచ్చటి ద్వారపాలురు నయమ్ము ప్రియమ్మును జూపి లోనికిన్
బుచ్చిన, రాజవీధి హయమున్ నడిపించుచు, ఖాండదేవుఁడున్
బొచ్చెములేనిభక్తి జనముల్ కరముల్ ముకుళింప వీడుకో
లిచ్చుచుఁ బోయి, సేన విడియించె నొకానొక మేడచెంగటన్॥ 107

క॥ అది, "రాజమహాలు" నా నొ
ప్పిదమా భవనంబు; దాన విడియుచు, జీజా
సుదతీమణి తనయునితో
ముదమునఁ బతిరాక కెదురుపోవుచు నుండెన్॥ 108

శా॥ షాజీరాజు బిజాపురప్రభుపునాజ్ఞన్ గన్నడంబేగి, ఘో
రాజిన్ దద్రిపులన్ జయించి, సులతా నందిచ్చు మర్యాద లా
యీజాగీ రధికారలాంఛనములెన్నేఁ బొంది "పూనా" పురిన్
జీజాబాయి శివాజినిన్ గనఁగ వచ్చెన్ నెంతమోదంబునన్॥ 109

ఉ॥ ఉండఁగఁ బండఁగా నిముస మూపిరి యాడఁగనీక, యొంటనుర్
నిండినగండముల్ దొలఁచి, నేఁటికి రాజకుటుంబ మొక్కచో
నొండొరుఁ గూడి సంతసము నొందఁగఁ జేయు భవానికూరిమిన్
గుండల గాదెలం గొలిచి, కొల్చిరి తత్పుణ్యపురీ జనుల్॥ 110

తే॥ చీడపుర్వులఁ బాసి, కొంజివురు మొగ్గ
దొడిగి, పూచిన విరజాజితోఁట వోలె
నాపదలఁ బాసి, యభ్యుదయమ్ము దాసి
సిరులఁ గళకళలాడె షాజీ గృహంబు॥ 111

సీ॥ పరిసర సహ్యాభూధర దుర్గ వాహినీ
తీర కాంతార సంచారములను,
ఉభయ సంధ్యోపాస నోద్ఘుష్యమాణ భ
వానీప్రభావ నిధ్యానములను,
స్థిరభక్తిభావోపదిశ్యమాన పురాణ
రమణీయ హరికథా శ్రవణములను,
నిపుణ దాదోజీప్రణీత రాజ్యాంగతం
త్రి విధాన దత్తావధానములను,
తే॥ సంక్షుభిత మాతృదేవతా శ్రావ్యమాణ
సాధు గో విప్ర విప్లవ స్మరణములను
బడుచుఁబ్రాయంపుఁ దెర బయల్పడి, శివాజి
యుత్తరాయణ బాలార్కు నోరిమఁ గనియె॥ 112

శా॥ దాదోజీ వినిపింపఁగా శివుని శ్రద్ధా సాహ సోత్సాహ దీ
క్షా దాక్షిణ్య పరాక్రమక్రమ తితిక్షా శక్తు లాలించి, షా
జీ దుస్సాధము భోంసలేకుల తపశ్శ్రీ పండిన ట్లెంచి స
మ్మోదమ్ముం గనె, సాధు సిద్ధ వచనంబుల్ లోన భావింపుచున్॥

తే॥ స్వమత గో దేశ ధర్మ రక్షణముకొఱకు
నుచిత వజ్రాయుధమ్ముగా నొఱపువెట్టి
తనయుఁ బెంచిన జీజియా "ధర్మపత్ని"
"వీరపత్ని" యటంచు గర్వించె నతఁడు॥ 114

శివాజీకల్యాణము - బిజాపురిలోనివాసము.

ఉ॥ ధీర గుణానురక్తి గడిదేఱు కుమారకుఁ జూచి, వియ్యపుం
గోరికఁజీరు బంధువులకుల్ మొగమోడియు, నాఁటి సాంఘికా
చారము నెంచి, బాంధవముసాగిన పక్షబలంబు హెచ్చు తీ
రారసి, షాహజీ తలఁచె నగ్ర కుమారకు పెండ్లి సేయఁగన్॥ 115

ఉ॥ $ ఆయతకీర్తి నింబళుకరన్వయుఁడౌ జగదేవరావు భా
గ్యాయతనంపుఁ దమ్మి యలరార జనించిన లక్ష్మియౌ సయీ
బాయినిఁ బెండ్లియాడి, గుణవంతుఁడు బాలశివుండు నేఁడు భా
ర్యాయుతుఁడౌచుఁ, బెద్దల శుభాశిషముల్ గొనె దోయిలించుచున్॥

తే॥ తల్లియనుమతిఁ దత భారతస్వతంత్ర
రాజ్యలక్ష్మికిఁ గంఠసూత్రంబుఁ గట్టఁ
దలఁచెడు శివుండు తండ్రిపెత్తనము క్రిందఁ
జవి యెఱుంగని లేఁతసంసారి యయ్యె॥ 117

చ॥ జరిగె వివాహవైభవ; మజస్ర వినోద విహార వృత్తి సం
బరముగఁ గొన్నినాళ్ళు గడపంబడె; నంత షహాజిరాజు జా
గిరు పరికించు నేలుబడికిన్ మతిమంతుని ఖాండదేవు నే
ర్పఱచి, సతీ సుతానుగ పురస్కృతుఁడై చనె బీజపూరుకున్॥ 118

---

$ "The marriage of Shivji took place at Poona in 1640 with great pomp and eclat. The bride chosen was Sayi bai, a daughter of the distinguished Nimbalkar family."

*N. S. Takakhav, M. A.*

సీ॥ భార్యలు "జీజియాబాయి" "తుకాబాయి"
యనురాగనిలయలై యనుసరింపఁ,
దనయులు "సాంభాజి" యను "శ్రీశివాజి" "వెం
కోజి" యు నెద ముద్దుగురియుచుండఁ,
దన యాప్తసచివుండు దాదోజిఖాండదే
వుఁడు సర్వకార్యముల్ నడుపుచుండ,
సులతానుఁ డాతనికొలువులో నుద్యోగ
లెనలేని మర్యాద లిచ్చుచుండ,
తే॥ నచట నిచ్చట జాగీరు లరసికొనుచుఁ
గొన్న దానితో మఱికొంత గూర్చుకొనుచుఁ,
బలుకుబడి రాచకొల్వులో వెలుఁగఁజేసి,
చెలఁగె బల్మినిఁ గల్మి షాజీవిభుండు॥ 119

ప॥ శివనేరుర్గ బునహాపురంబు, సహజశ్రీ మించు సహ్యావనీ
సవిధారణ్యతరంగిణీ గిరి గుహా సౌభాగ్యముల్ వొంది, తృ
ప్తివడ న్నేర్చిన భావుకుండు శివుఁ డీబీజాపురీ పాజ్యవై
భవముల్ మెచ్చక, ధీర వీర విఖ్యాతి ప్రాగల్భ్యముల్ గైకొనెన్॥

ఉ॥ పందెములొడ్డి ధూర్త హయ వారణ శిక్షయు, విల్లు నమ్ములన్
బొందిక, వాలు డాలు గొని పోరు, తుపాకుల కాల్పు, మల్లవి
ద్యం దిట, వన్నిటన్ విజయమంది, శివుం డట సాటివారిలో
నందియ వేసి, వాసి యెనయన్ "బులిపిల్ల" యనంగ వర్ధిలెన్॥ 121

తే॥ కనెడు నాసక్తి, దానిఁగైకొనెడు రక్తిఁ,
దగ విమర్శించు యుక్తిఁ, దత్స్వప్రసక్తి,
నిగ్రహానుగ్రహాభాన నిపుణ శక్తిఁ
దరిచి; కనుచుండె రాజ్యతంత్రముల నతఁడు॥ 122

సీ॥ అలవోక రాజకార్యాలయంబుల కేగి
నడుచురాజ్యాంగ తంత్రములఁ దెలియుఁ,
జతురంగ బల నివేశ స్థానములఁజొచ్చి,
కలబలంబుల బలంబుల నెఱుంగు,
మొగినాయుధాగారముల కేగి, బహువిధ
శస్త్రాస్త్ర సంధాన సరణిఁ గఱచు,
సైనిక శిక్షావసరముల మెట్టి, వ్యూ
హ విధాన భేదనోపాయ మరయు,

తే॥ మఱపు వెఱపును వెనుఁబాటు దరియనీక
చుఱుకుఁదనమున నన్నింటిఁ దఱచి, శివుఁడు
తల్లిచేఁ దండ్రిచే గురూత్తమునిచేతఁ
బడయఁగా రాని యాత్మానుభవముఁ బడసె॥ 123

తే॥ ధీరహృదయంబు, హృదయముల్ దెఱచుచూపు,
పలుకు పొందిక, పొందిక పఱచు తెలివి,
ధర్మ భంగాసహిష్ణు వర్తనము బెరయ,
విరిసి, మెల్లరమదులఁ బుష్పించె శివుఁడు॥ 124

తే॥ హైందవమతంబు పడు నమర్యాదయొకట,
నఖిల సంసేవ్య గోమాతృ హత్య యొకట,
నలుసువలెఁ గంటఁ బడుచు నీ రొలుకఁజేసి
బాలశివు లేఁతమది గాసిపఱచుచుండె॥ 125

తండ్రికోరికపై శివాజి సుల్తానుదర్బారు కేగుట.

మ॥ తన సర్దారుకుమారుఁడౌ శివు నుదాత్తక్షాత్ర సంపన్న వ
ర్తనమెల్లన్ వినుచున్ బిజాపురపుసుల్తానాతనిన్ జూడఁ గో
రిన, షాజీవిభుఁడున్ నవాబుమదిఁ గోర్కెన్ దెల్పి, "నావెంటఁ గొ
ల్వునకున్ రా" మ్మని పల్కఁగా, శివుఁడు మోమున్వంగలుతో నిట్లనెన్॥

మ॥ "నిగమాలాపము వోలె నీపలుకు తండ్రీ! నాకు సంభావ్యః మ
ట్లగుటన్ నీచిటివ్రేలఁ జూపఁ దలతో నద్దానిఁ గైకొందు; వే
ఱుగ భావింపకు నన్ను; నేఁటి ధరణీంద్రుల్ వారిమర్యాద లం
తగ నాయిచ్చకు నచ్చు; వేమనుచు నంతస్సాక్షి జోకొట్టెదున్?

మ॥ కులధర్మంబుల కార్యవృత్తముల కెగ్గు ల్వాపి ప్రాపుంట, దు
ర్బలులన్ దాఁగయికొంట, ధూర్తజనులన్ బంధించి న్యాయమ్ము నా
ర్తులకున్ బంచుట, నొప్పుదప్పులకుఁ గ్రిందున్ మీఁదు గాకుంట, రా
జులకున్ ధర్మము; లిన్నిటిన్ విడు మహీశున్ గొల్వ మేలున్నదే?॥

మ॥ వనితారత్నము లన్న లోకము సృజింపన్ బెంపఁ దూలింపఁ జా
లిన మూర్తిత్రియశక్తు; లేకులముతల్లిన్ గాని పూజించు టే
ఘన; మందున్ బతిదేవతా చరితముల్ గావడ, నీ భారతా
వని మేల్కొన్నది; రాజు దీని గమనింపన్ బోలదే సుంతయున్? 129

మ॥ అమృతాసారముఁ జేపి చన్నవిసి, బ్రహ్మాండంబు సంతానక
ల్పముగా నోము పురంధ్రి, హైందవధరా భాగ్యంబు గోమాతఁ బు
ష్పములన్ బూజ యొనర్పరే యనుము, స్వేచ్ఛావృత్తి నాయేట నీ
రము లీబీటఁ దృణమ్ము లానిఁ నెమరూరన్ బండఁగా నీయరే! 130

మ॥ జనకా! నామతమున్ వచించెద, - హరిశ్చంద్రాది రాజన్యు లే
లిన యీభారతభూమి గోహనన మాలిన్యంబునన్ బాసి, ప్రా
క్తన జాతీయత నందగింపవలె; సుల్తానైన నీనాఁటి పా
లనసూత్రమ్ములు మార్చివేయవలెఁ; గల్యాణంబు మ్రోయన్వలెన్॥

మ॥ యవనుల్ హైందవు లన్న భిన్నత నసూయన్ జూపఁగా లేదు; తా
మె వ రీరాజ్యము నేలినన్ దగవు లేనేలేదు; 'నీ' 'నా' యటం
చవకాశమ్మును బట్టి యొక్కతెగ కన్యాయంబు గావింప, 'నా
నవు' నంచూరక 'వంతుపాటుపని' సేయుంజాల ముమ్మాటికిన్॥ 133

తే॥ తండ్రి కెదురాడు మూర్ఖపుత్రకుఁడ నంచుఁ
దలఁపకుము, తండ్రి! నామాట తప్పగొనకు;
మనసు రెండుగావిఱిచి నీ కనులయెదుటఁ
బట్టితిని; దీసికొనుము నీవలచినట్లు"॥ 133

తే॥ అనెడు తనయుని పలుకులు వినకొలంది
మనసు పారాడి పలుచనై మరులుగొలుప,
నరులు గొనుచిక్కు సడలించు సరణిఁ, జలువ
పులకరింపఁగా షాజీవిభుండు పలికె॥ 134

శా॥ "అన్నా! నీపలు కెంతయేఁదగు; నసత్యం బేదియుఁ లేద; వి
చ్ఛిన్నంబై చెడు దేశగౌరవ ముపేక్షింపంగ నే సత్త్వసం
పన్నుం డోర్చు? నసత్కుమారుఁడవు నీవా? కాదు; ధీరచి
త్తౌన్నత్యంబు పురాణ వీర చరితోదాహార్యమై యొప్పెడిన్॥ 135

మ॥ పలుమాఱున్ గమనించి పొంచి, వివిధోపాయమ్ములన్ సర్వశ
క్తులఁ బోరాడితి నేనుఁగూడ మనహక్కుల్ నిల్పి జాతీయతన్
వెలయింపన్; వితయయ్యె నాజతన; ముర్విన్ నిండెఁ దొరుష్క రా
జుల సామ్రాజ్యము; లెవ్వఁ డీజలధియంచుల్ ముట్టి నిఁతా డెదుర్॥

తే. భాగ్యరమ వారి కిట్లొడంబడిన దేమొ!
కుటిలదైవమే యొక లంచగొండి యేమొ!
కాలచక్రమునడక యీకరణి యేమొ!
వంతుపై వంతు మాఱు ఏర్పడిన దేమొ! 137

౹॥ అలఁతం జెందకు, తొందరం బడకు; పుత్రా! చీఁకటుల్ వోయి వెఁ
న్నెల రాదా? కసుగాయ పండవలెఁగానీ బల్మిఁ బండింతువా?
యిలకుం గంగనుదెచ్చు క్రొచ్చెయుఁగవా? యీయేటిలో నెన్నిమ
న్కలతోనో నెఱియాఁతకాఁడగుట; యన్నా! యోపికన్ జూపుమీ!

ఉ॥ ఇంతట మించిపోయినది యేమియు లేదు; నయమ్ముఁజూపి యా
రింతము పాలుఁగూడ, బెదరించి జలమ్ము గ్రహింపలేము; నీ
వింతయు నేఁడు రే పనునయింపుము నాపలు; కేనుఁగూడ భా
వింతు; భవాని యెట్లునడిపించు నటుల్ పయనింత మోపికన్"॥ 139

చ॥ అని షహాజీవిభుం డనునయంబునఁ బుత్రుకు వీడుకొల్పి, యా
తనిమన సెట్టులైనఁ దనదారిఁబడన్ బురెకొల్ప మిత్రులన్
బనుపుచు, జీజియా హితమువల్కఁగఁజేసి, మురారిపంతుచే
వినిచి, నయమ్ము సూపి తనవెంట సుతుం డరుదేరఁ గైకొనెన్॥ 140

ఉ॥ ఆదిలుషానవాబు సుగుణాతిశయంబులు ముచ్చటించి, య
త్యాదర మొప్పఁగాఁ గొలువునందు 'సలా' మొనరించుటాది మ
ర్యాదల నుగ్గడించి, వినయంబు విధేయత నూలుకొల్పి, షా
జీ దనపుత్రుతోఁ గొలువుఁజేరె, భటాళి బరాబరుల్ గొనన్॥ 141

తే॥ కొలువుగద్దె కొకింత ముంగలిగ నిలిచి,
నేల యొరయఁగా నెడమమోకాలు వంచి,
శిరముసోఁక సలాము మువ్వురుసఁ జేసి,
వెనుక కొదిఁగి షాజీ తనపీఠమెక్కె॥ 142

ఉ॥ వీరశిండు తండ్రివెనువెంట సరాసరి ముందుకేగి, ద
ర్బా రటు పారఁజూచి, తలవంపకయే యొకకేవిమై నమ
స్కారముఁ జేసి, తండ్రికెడగా నుచితాసన మెక్కె; ధీరతో
డారుఁ గుమారుఁజూచి సభయంతయు విస్మయముద్రఁ గైకొనెన్॥

మ॥ "ఇతఁడేనా షహాజీసుతుం?" డని నవా బీక్షింపఁగాఁ జూచి, త
న్మతి గుర్తించి, మురారిపం తనుమహామాత్యుండు "షాజీసుతుం
డితఁడే; బాల్యము పల్లెలన్ గడచిపోయెన్ గాన, నాస్థాన సం
గతమర్యాదల రాచకొల్వుల నెఱుంగం" డంచు వాక్రుచ్చెన్॥ 144

చ॥ తనమది నవ్వుకొంచు సులతాను శివప్రభు హెచ్చరించి "నీ
జనకునికన్న నమ్మకముచాలిన సైన్యవిభుండవౌచు, నా
తనివలె మమ్ము గౌరవపదంబున నిల్పుచు, శక్తి భక్తి మ
న్ననఁగొను టొప్పఁగాదె?" యనినఁ, శివజీ యవికంపితాత్ముఁడై॥

మ॥ తన పీఠంబుననుండిలేచి కడు నుత్సాహంబు దీపింప ని
ట్లనె, "బీజాపురనాయకా! తమకు నాయం దేదియో వేఱు తోఁ
చినటుల్ గన్పడుచున్న; దిట్టియెడ మీచిత్తంబొ నాదొ ప్రవ
ర్తనమో మాఱికయుండ; దెందును గొఱంతల్ పెద్దలందుండునే?॥

చ॥ నడిచితినేమొ మీకొలువునన్ గల తీరుకు వేఱు! దాన వే
ర్పడు తెఱఁ గౌనె? యీప్రజలు రాజులబిడ్డలు గారె? కొన్న బి
డ్డఁడయినఁ గన్నబిడ్డని కెడన్ గనుతల్లికి మాతృభావ మే
ర్పడునె? విభుత్వముల్ మదిదొఱంగని యంత్రములౌట యొప్పదే?

తే॥ తండ్రియటు రాజు మిగుల వత్సలతఁ జూప,
సుతులవోలె ప్రజల్ గొల్తు రతులభక్తిఁ;
దండ్రికటు సల్పినాఁడ వందనము; లిట్లు
తగదె? యింతకన్నను గోరఁదగునె మీకు?॥ 148

ఉ॥ శక్తియు భక్తియన్న విలఁ జాఁగిలి సేయుసలాములందు సం
సక్తత నున్నదే? మనసుజాడ లెఱుంగఁగ నద్ద మున్నదే?
యుక్తి రహింపఁగాఁ బెదవియూఁచినతేనె విసమ్ము గాదొ? పే
ర్మాక్తములౌచు రెండుమదు లచ్చపునమ్మిక హెచ్చఁగావలెన్॥ 149

ఉ॥ ఇంతటి రాజ్యమెల్లఁ దగవెంచి సుఖంబులఁ దేర్చురాజ, వీ
సుంత యెఱుంగజాల వనుచున్ వివరించుట గాదు; లోచన
ప్రాంతము లల్లమూసి యొకరంగునఁ గన్గొను టేల? మేనిపై
గంతులు వేయుదాఁకఁ జెఱుగాలిదిసంతులు నూడనేర్తువే? 150

తే॥ యవన సామ్రాజ్య కనకసింహాసనమునఁ
గొలువుదీరుచు నీ వేలుకొనెడు నాఁడు
నేను సరదారుఁడనుగ నీయాన మోయు
నట్టికాలము వచ్చుఁగా, కది య శుభము"॥

చ॥ అనఁగ శివాజిపల్కులయథార్థముఁ గైకొనినాఁడొ లేదొ! యా
తని సమయోచితప్రతిభ, ధైర్యము, పల్కులనేర్పు లెంచి న
మ్మన మలరన్, దుకూల బహుమానము లిచ్చి నవాబుమెచ్చి, "నీ
వనుదిన మిందు రావలయు" నంచుఁ బ్రియమ్మున వీడుకొల్పినన్॥ 152

మ॥ శివుఁ డా సత్కృతులంది గీమునకు రా, జీజాంబయున్ లోచనో
త్సవమున్ బొంది కవుంగలింపఁజన, నాతం డాఁగి, † "నామేను మై
ల వడెన్ గొల్వులరాకపోకల, సచేలస్నానమున్ జేసి హైం
దవ మర్యాదల మిమ్ముఁ గొల్చెద; ననున్మన్నింపుమీ!" యం చనెన్॥

తే॥ తనయుని పురాణ వీర హైందవులు మెచ్చు
సత్య నైష్ఠిక శ్రోత్రియాచార పరత
జీజియా మెచ్చెఁ, గాని షాజీ భుజింప
ననువుపడదయ్యె నుడుకుపాయసమువోలె। 154

శివాజి ప్రథమగోరక్షణ విజయము.

చ॥ మఱియొకనాఁటి మాపునఁ గుమారశివుండు విహారమేగు సం
బరమున రాచబాటఁ గనుపట్టు వినోదములెల్ల వింతగా
నరయుచుఁ బోవుచుండి, యొకయంగడిదాపున బట్టబైల న
ల్గురు గుడిగట్టి నేలఁబడఁగొట్టఁ గలంగెడు గోవుఁ గన్గొనెన్॥ 155

† "ఇంటికిఁ బోవునపుడు బాలశివాజికి నవాబు వస్త్రాభరణాలంకారము లిప్పించి పంపెను. తాన యింటికిఁ బోయినతోడనే యావస్త్రములు తీసివేసి సచేలస్నానము చేసెను."
పుట 23 'శ్రీ శివాజీచరిత్రము' క. వి. లక్ష్మణరావు

సీ॥ యమకింకరులు వోలె నడిమి పైఁబడి కూఁత
కోయి నొక్కెడు ఘాతుకులను జూచి,
బలిపెట్టఁగా నొడ్డి జళిపించుచోఁ దళ
త్తళలీను వారికత్తులను జూచి,
యూపిరి బిగఁబట్ట నుబికికడుపు డొ
క్కలుఁ దన్నుకొను గుదికాళ్ళఁ జూచి,
ప్రాణభయంబునన్ బదరు నెమ్మను నీ
రొలయించు తేలకన్నులను జూచి,

తే॥ అదుకు లమకులుగాఁగ 'నంబా' యటంచు
సుడిసికొను కూయితో మోముచొక్కఁ జూచి,
చుట్టు ముసరుచుఁ బ్రేవులు సుక్కిపోవ
నఱచు లేఁగను జూచి, మైమఱచె శివుఁడు॥ 156

మ॥ "ఎవ రాపాపము లుక్కళించు నరు? లిస్సీ! సాధుగోమాత హైం
దవదైవం బనియైన నెంచ, కిటు లన్యాయంబుఁ గావింతురే?
యివి సైపందగు పాటివే?" యనుచు నల్లె బాణమ్మల్లెగి, ధే
నువుపై వ్రాలు కటారి కడ్డముగ ముందుర్ దూఁకి, తా నిట్లనెన్॥

మ॥ "ఇదియే ధర్మపథంబు? మానవులుగారే? జాలి లేదయ్యె నే
మది? మీ కొండొకముల్లు గ్రుచ్చుకొన 'నమ్మా' యంచు వాపోదురే
గద? మీబిడ్డల నెవ్వఁడైనఁ జెనకంగా వాదుకుం బోదురే
గద? యేదిక్కును లేని జంతువనియేగా కత్తులన్ దూయుటల్?॥ 158

ఉ॥ మీవలెఁ గాలకింకరులు మేకొని, మీ యసిధారకంఠముల్
జేవగలట్టి శస్త్రములఁ జేకొనుచున్, యమలోకవీధి నీ
[illegible]పుసుబోలె మిమ్ము నుడియన్ బడ నేలనుగొట్టి కుత్తుకల్
[illegible]నరగ రారె? నరకమ్ములతో నిటు నవ్వులాటయే?॥

చ॥ అటు గనుఁడయ్య! పేద మొగమై కనుగోపుల నీరువాఱ ను
త్కటముగ నార్చుచున్ గుములుతల్లియుఁ, దల్లినిఁ జుట్టుముట్టి సం
కటపడు దూడ, మీకులముకై యొకశాపము వోయ, గన్నదో
యిట జలమెత్తెఁడున్, బ్రతుకనెంచిన నీవిస పూరగింతురే?॥ 160

ఉ॥ ఈ బలవంతపుం మరణ, మిట్టి కులమ్ములపోక, దీనికిన్
లోఁబడు రాజుకున్ గలుగులోఁకువ, యిన్ని సహింపఁగూడ; దే
యే బెడిదమ్ములైన నెలయించి ననున్ సొలయించుఁగాక; నా
చేఁ బడిఁయావు దూడయు నశింపఁగరాదు; భరించి తీరెదన్॥ 161

ఉ॥ నన్నెడచేసి గోతనువునన్ ములు మోయఁగరాదు; బుద్ధిసం
పన్నుల కింతకంటె నుడువన్ బనిలే; దొకవేళ మీకు ని
ష్పన్నము గాకపోయిన నవాబునకున్ వినిపించుఁ; డింతకున్
గన్నులు రేఁగి డెందములు క్రాఁగెడునంతకుఁ బోమి యొప్పకున్"॥

చ॥ అని యొకధర్మమున్ నయభయమ్ములు ముట్టఁగఁ బల్కి, ధేనుపా
లన దృఢనిశ్చయంబున నిలంబడి యుండె శివాజి; వార లా
తనియెదిరించుకోవి, యెడఁదన్ గలతెంపు, షహాజిరాజు పెం
పు నెఱిఁగి, నోటికండ పడిపోయినటుల్ వెతఁగూరి, మెల్లనన్॥ 163

మ॥ "మము మన్నింపుము; పొట్టకూటి కిదియేమార్గమ్ముగా నమ్మియుం
టిమి; పాపమ్ములఁ జేసియుంటిమి; కడు నీచమ్ముగా నిందు విం
టిమి; మీయాన భరింపనుంటి" మనుచున్ డెందమ్ములన్ విప్పి దీ
నముగా వేఁడ, శివుండు వారిమది నాంతర్యంబు మన్నించుచున్॥ 164

ఉ॥ "మీకు శుభమ్ములౌత, గడిమించు నఘమ్ము లడంగుఁగాత" మం
చా కరుణామయుండు తగవౌ ప్రతికారముగాఁగ దోయిటన్
రూకలు వోసి పంచి, యెడరుంగొను ధేనువు బంధ మూడ్చి య
త్యాకల లేవనెత్తి, మోయినంటు దుమారము వాయ దువ్వుచున్॥

తే॥ "బలము తేజంబు జీవన భాగ్యమిచ్చు
సాధు గోమాత భరతభూ శ్వాసకోశ;
మరియ నద్దాని బంధింప, నడికిపోదె
వట దళమ్మునఁ గనుమూయువాని కడుపు!॥ 166

తే॥ పదరకుము తల్లి! నీ కేమిభయము గలదు?
బాలకృష్ణుఁడు నిన్నుఁ గాపాడఁగలఁడు;
తల్లిగండానఁ బాయుఁ నీతలపితోడ
నాడుకొనవమ్మ పసరుబయళ్ళయందు!॥" 167

చ॥ అని కదలింప, నల్ల నడయాడుచు ధేనువు పోవ, లేఁగ దా
నిని వెనుకాడ, నాయడుగునీడల బాలశివుండు వోవుచుఁ,
దన యదలింపు, ఘాతుకులు తాలిమిదేటి మనమ్మమాటి చూ
పిన వినయంబు, పౌరుల నవీన గుణాదరణంబు నెంచుచుఁ॥ 168

తే॥ తలఁపులోనున్న గోదేశ ధర్మ రక్ష
పలుకుతోడన చేసేతఁ గలుగఁజేసి
ప్రథమ విజయంబు గూర్చు శాంభవికి మొ్రొక్కి,
యావు నడిపించుకొని, యింటికరిగె శివుఁడు॥ 169

ఉ॥ ఆఆని చెమ్మరింత యుడుకాటియు నాఆని మేనఁదోఁప వి
ప్పారిన కంటితో నడుగులంటిన పుత్రికు నెత్తి, జీజియా
యూఆట్లలేని యాతురత నొగ్గి, శివుండు వచింపఁగా సమా
చార మెటింగి, విస్మయ రసంబునఁ దోఁగుచు నిట్లు వాకొనెఁ॥ 170

మ॥ "కొమరారుఁ దగుధర్మమాచుఁ దనయా! గోదేవతా ప్రాణదా
నము; కౌలీన ముదాత్తలక్షణము నూత్నస్ఫూర్తి నీయందు రూ
పమురెఁ; ధూర్వహు లెందరో ధరణి లేరా! నీకుఁగా నిల్పి రు
క్తి ప్ప పుణ్యంబిదు; సంతరించితివి పెద్దల్ చిన్నలుఁ మెచ్చఁగఁ॥171

తే॥ ధర్మదేవత గోరూప ధారి గాఁగఁ,
జెనకు కలిరాజుఁ బట్టి శిక్షించినాఁడు
మును పరీక్షితుఁ; డాతని వెనుక నీకు
దక్కినది తండ్రి! గోసతీ ధర్మ రక్ష॥                    172

మ॥ నునుఁబ్రాయమ్ములవెన్నెలల్ గురియుచంద్రుఁ జూచి, సంతోషముఁ
జనులెల్లఁ గనుచుందు రంట తగ దన్నా! యేడ్చువా రెందఱో
యనుకొ; మిమ్మ ఘనకార్యముల్ తెగువఁజేయఁ బోవుచోఁ గుట్టుతే
లును రాకొట్టెడు భూతముఁ గనుట పోలున్; దెంపు అంపోఁజుమీ!
తే॥ కొండవలె నీకుఁ బెనుప్రాపుఁ గూర్చువాఁడు
తండ్రి గలఁ; డాయనయెడంద తడవి చూచి
నడుచుకొమ్ము; కుమార! దుందుడుకు మాను,
మడవి త్రోవలు రాజకార్యములు గాన"॥                    174

చ॥ అని తగవాడి, పుత్రుహృదయమ్మున నుద్ధతిఁ బాయఁజొపి, యా
యన నుచితాభిషేక సరసాన్నములన్ దనియించె జీజియా
జనని, షహాజి యేదియనఁజాలక యూరకయుండెఁ; బట్టణం
బెనసె ఫిరంగిమ్రోఁతవలె నీకథః యావనులెల్ల నొవ్వఁగన్॥       175

చ॥ ముదుఁగనిభక్తి నాత్మమతమున్ గొను యావనపౌరులెల్ల రా
గడ మొకరీతిగా నొడియఁగట్టి, నవాబున కందఁజేసి రీ
దుడుకుఁదనంబు; శాంతగుణధూర్వహుఁ డాతఁడు మంచిమాటలన్
దడుపుచు, వారలన్ సరిది, ధర్మవిచారణ సల్పెఁ గొల్వునన్।       176

ఆ॥ వె॥ సమయవేదియైనషాజీ కుమారుని
తెలుఁగు వలుకనోడి, చిర హితుండు
మేటిమంత్రియైన 'మీరు జుమ్లాఖాను'
తో వచింపఁ నతఁడు తొడరి పలికె॥                    177

చ॥ "ఇది యొకతప్పుగా గణనకెక్కఁగ రాదు; మతప్రసక్తి నో
ప్పిదముగ వారివారి నడిపించుట మంచిది; యీ విభుత్వ మం
దదనపుసంఖ్యవారును సహాయులు హైందవులౌటఁ, దత్ప్రజా
హృదయము వెచ్చ సేయఁ బనియేమి? సమానత యొప్పరాని దే?॥178

చ॥ మన మతమందు 'భూతదయ మంచిదిగా' దని వ్రాసిపెట్టిరే?
'యనదల ముంచివేయుఁ' డని యాడిరె? వీధులవెంటఁ గొల్వదా
పునను, మసీదుపజ్జ, నెటువోయిన నచ్చట నిట్లు జంతుహిం
సనములు రోఁత గొల్పవొకో? సాటివిభుత్వము లేవగింపవో?॥ 179

మ॥ మన పాజీతనయుండుఁగూడ నటులే మన్నింపఁ డీ సేఁత, కొ
ల్వునకున్ రాఁ"డనఁగా, నవాబు విని "యొప్పన్ నీదువాక్యంబు, లా
తనికే గా దిది యెట్టివారికిని రోఁతల్ పుట్టఁగాఁ జేయు; మె
చ్చనిదీనిన్ దొలఁగింపఁగా నిపుడ యాజ్ఞాపింతు నీరీతిగన్॥ 180

తే॥ † మన బిజాపురమందు నేమనుజుఁడైనఁ
దులువతనమున గోహత్య సలుపరాదు,
అంగళులువెట్టి మాంసంబు లమ్మరాదు,
త్రోవవెంటఁ గన్నంటఁ గొంపోవరాదు॥ 181

శా॥ "నా యాజ్ఞన్ వెలివైచి పోవునెవఁడైనన్ గాని శిక్షార్హుఁడౌ;
నీయంగళ్ళు పురీ బహిస్థలమునందే నిల్పుఁ" డంచాడె; నా
రా! యెవ్వా రెటులాడుకొన్నను, గుణగ్రాహిత్వమున్ జూపుచున్
న్యాయస్థాపనఁ జేయు యావన నృపాధ్యక్షుండు సామాన్యుఁడే!॥

---

† "The Sultan disallowed forth with the slaughter and sale of the Kine'" — as a consequence of Mir Jumla's gentle remonstrance with him against the loathsome spectacles of the sales of beef, cooked-flesh and cow-slaughter.

For the above facts please refer to Chapter III.

"The Life of Sivaji Maharaja by *N. S. Takakhav*

తే॥ "ముండ్లపొదలఁ బాములఁగూడ మురియఁజేసి,
పరువుమేర గుబాళించు పరిమళమ్ము
నెగచి, సరసాళులకుఁ బంచు మొగలిపువ్వ!
మురియుమిా! నీవు నీ పూలదొరతనమున"॥ 183

చ॥ అని కవు లామతించు సుగుణాళిఁ గుణావళి ప్రోత్సహించి గై
కొను మది, నెమ్మదిన్ గుబులుకొన్న యభిన్నత, యిన్నియొప్ప యా
వనపతి సచ్చరిత్రము ప్రబంధములందు సువర్ణ ముద్రణం
బెనయుచు, భావి భారతమహిన్ గననొప్పదె నిల్వ్వటద్దమై!॥ 184

మ॥ ఘనులౌ పూర్వులు పెక్కురిందనుకఁ జక్కన్ జేయలేనట్టి గో
హననంబున్ సులతానుమెప్పుఁగొని మాన్పన్ జేయు బాలుండు, బా
లుని సాగ్గుణ్యము నెల్లరం దనుపు మేలున్ మెచ్చునున్ ధర్మవ
ర్తనము న్నిల్పు నవాబు, నిర్వురను సర్వశ్లాఘ్యధర్మాత్మికుల్!॥ 185

చ॥ "శివుఁ డవమాన మెంచె" నను చింత క్రమమ్ముగ నీసు రోసమై
రవులఁగఁ బక్షపాత మొనరన్ గనె నంచు నవాబు నెన్నుచున్
యవనులు గుంపులై, గుములై, గుదులై, తలపోయసాగి; రీ
యవినయ మంతయున్ గని, షహాజి విచార పరీత చిత్తుఁడై॥ 186

ఉ॥ ఈయుడు కిట్టులున్న నెదియే నొక ముప్పగు నంచు నెంచి, షా
జీ యొకనాఁడు భావి హితచింతనము న్నడిపింపఁగా, జిజా
బాయిని రాజకార్యము నెపమ్మున వచ్చిన ఖాండదేవు మే
ధాయుతుఁ జేరఁబిల్చి, విహిత మ్ముచితమ్ముగ నిట్లు వాకొనెన్॥ 187

చ॥ "సహజ మతాభిమానమున సానలుదీఱె శివుండు; యావనుల్
సహనము లేక లేనియపచారములన్ దలమోపి, యేదియే
నహితముఁజేయనుండి; రిది యాఁగఁగరా దవునేమొ! పూర్వమా
యహమదుపట్టణంపు వ్యవహారము లన్నియు మిా రెఱుంగరే!॥ 188

చ॥ ఒకరిని దప్పువట్టఁ బనియుండదు; చోటెఱుఁగైనవేళఁ గొం
కక తన కాలుసేతు లాడుఁగఁ జవరించుట సాధురీతి; యం
తకు వెగటైనచో నచటు దాఁటుట మంచిది; లేనిపోని వా
దుకు దిగరాదు; స్థానబల దుస్సహముల్ గదమత్త చిత్తముల్!"॥

చ॥ అనుటయు జీజియా విని "యదంతయుఁ బుత్రునకొక్కనాఁడు నే
వినిచితి; నాతఁడుం 'స్వమతవిప్లవముం సయిరింపఁజాల, వీ
రినిఁ గొలువంగఁజాల, నెదిరించినచోఁ దమకెల్లఁ జిక్కు; న
న్ననుపుఁడు దూరదేశమున' కంచను, నయ్యది పోలదో" యనెన్॥

శా॥ షాజీదంపతు లాడుపల్కుల మనస్తత్వంబు గుర్తించి, దా
దోజీ, "యింతవిచారమేల? శివుఁ డిందుం నిల్వఁగా నేల? పూ
నా జాగీరున నాకు సాయముగ నుండన్ వచ్చుఁ గొన్నాళ్ళు, లా
పై జాడల్ మఱి చూడవచ్చు, నిది సర్వశ్రేయ" మంచాడినన్॥ 191

చ॥ అది సమయోచితం బని మహాజి శివాజినిఁ బిల్వఁ బంచి, సా
హ్లాదమున నండఁజేర్చుకొని, "యీ మనజాగిరు చక్కబెట్టి నె
మ్మదిఁ గలిగింప వృద్ధుఁడగు మంత్రికి సాయముఁజేయఁ బొమ్ము; నీ
వెదిగివాఁడ, వియ్యది భరించుట మీఁదట మేలు చేకురున్॥ 192

ఉ॥ నీ వెనువెంట నుండు సుమి నీజనయిత్రియు ఖాండదేవుఁ; డా
యా వివరమ్ము లాతఁడు నయమ్మున నీ కుపదేశ మిచ్చు; దు
ర్భావులతోడఁ బోక, సమభావమునన్ బ్రజ నాదరించి, రాఁ
బోవు శుభమ్ములందు ఁగనుమూయక, యాచితి నిర్వహింపుమీ!"॥

మ॥ అని దాదోజినిఁ జూచి, "యీతని కుపాధ్యాయుండవై, తండ్రివై
మనుపం జూడఁగదయ్య! నేఁడు మొదలై మావంశ మర్యాద లీ
తనిపై నీవయి నిల్చియుండు" నని యుత్సాహముఁ జూపించి, యొ
య్యన జీజా మొగ మయ్యె; నామె తదభిప్రాయంబు నూహింపుచున్॥

తే॥ కనుల మెఱయించు ప్రణయభోగములకంటెఁ
దలఁపు సాగియించు భావ బంధమును మెచ్చు
శీలవతి గాన, నొక తపస్సిద్ధి కొఱకుఁ
దనయు వెన్నంటఁ దలఁచి, యిట్లనుచుఁ బలికె॥ 195

మ॥ "తమ తాత్పర్యము భక్తిమైఁ గొనుట నాథా! నాకు సిద్ధాంత; మీ
కొమరున్ గైకొని, మీ యనుగ్రహము నెక్కొనోఁచి, తానున్న భా
గ్యముఁ గాంక్షింతుఁ; గుమార రక్షణ: మనర్ఘంబైన భర్త్రాజ్ఞ: దే
శము మే: లిన్ని ఘటింపఁ గల్గునఁట, యిచ్చల్లోవ నా కేటికిన్!"॥ 196

మ॥ అను జీజా సముదార భావమున నర్ధాంగిత్వముం జూచి, వి
చ్చిన డెందమ్మున మెప్పులం దనిసి షాజీ కార్యమూహించి, "ప్రా
ర్థనఁ బోవం బయనంబుఁ జూడు" మని దాదోజీని వీడ్కొల్పి, యం
గనతోఁ బుత్రునితోడ విశ్రమ సుఖాగారంబుఁ జేరం జనెన్॥ 197

సీ॥ కలకలమ్రోయు పక్షుల మంగళస్వర
ములు, స్వరమ్ములవెంట మలయగాలి,
గాలితుక్కలఁ దలల్ గదలించు తరువులు,
తరుల నీరాడించు నరుణకాంతి,
యరుణకాంతుల మెఱుఁగారు శస్త్రాస్త్రంబు,
లస్త్రముల్ గయిసేయు నాశ్విక తతి,
యాశ్విక తతివెంట సంగరక్షకబల,
మ్మంగరక్షకులతో నందలంబు,
తే॥ అందలము దాపుగా జీజియా వధూటి,
జీజియావెంట శివుఁడు షాజీవిభుండు,
నండగాచుచు దాదోజి యనుసరింపఁ,
యాత్ర రారంభమునఁ బురప్రాంత మలరె॥ 198

13

తే॥ అత్తగోడండు) షాజీ పదాంబుజముల
కెఱఁగి సెలవంది యందల మెక్కి; రంత
నడుగులంటిన శివునిఁ గేలంటి యెత్తి
నెనరుఁదొలఁకులు పలుకు లిట్లనియె నతఁడు॥ 199

చ॥ "ఇఁకఁ బయనింపు మీవు; వచియించిన నాహితమెల్ల విస్మరిం
పకు; మట నేనుబోలె మనుపన్ గురుదేవుని ఖాండదేవుఁ బా
యక గయికొమ్ము; నీజననియానతి యన్నిట మేలుబంతి; తా
వక హృదయాధివాసిని భవాని శుభమ్ముల నీ కొసంగుతన్!"॥ 200

మ॥ అను మాటల్ శిరసావహించి వినతుండై తండ్రి వీడ్కొంచు, డా
సిన భద్రాశ్వముఁ దట్టి పైకొనె శివాజీ; ఖాండదేవుండు హే
చ్చినపేర్మిన్ నడిపించెఁ బైనము; షహాజీ స్నిగ్ధ నిష్పంద లో
చనముల్వ్రాలఁగఁ జూచుచు న్నిలిచె, నిష్టబ్ధాంతరంగంబునన్॥ 201

సీ॥ ఉత్సాహమున మేను లొరయంగఁ దమభటుల్
నగుమొగమ్ముల ముందు నడచుచుండఁ,
జెదరని చూపులో నొదిగించి రాజ్యమ్ము
లదకు దాదోజి వెన్నాడుచుండ,
మదికిఁ జేవలువోయు మాత జీజాబాయి
దాపుగాఁ బల్లకిఁ దరలుచుండ,
సమయమారుతమట్లు షాజీ మనోవృత్తి
వెన్నుబలంబుగా వీచుచుండ,
తే॥ నన్నియును భావికార్య దోహదముగాఁగ
నన్వయింపుచు, శివుఁ డున్నతాశ్వ మెక్కి
కఱకుకొండలోఁ గార్మబ్బు తెరల నడచి
నెమ్మదిని మెట్టె పునహాపురమ్ముఁ జేరె॥ 202

శివాజీ పునహానివాసము - రాజ్యాంగశిక్షణము.

ఉ॥ రాజుల కర్హమౌనటు పురాతనరీతుల సంస్కరించి, దా
దోజి యనూన శిల్పులతో నెసకొల్పిన నవ్యసృష్టి యౌ
'రాజమహల్' మహాభవనరాజమున న్నివసించుచుండె భా
ర్యా జననీ యుతుండు, యువరాజశివుండు సుఖస్థులన్ గనన్॥ 203

చ॥ తెలుఁగని వత్సలత్వమునఁ దండ్రియొసంగు హితోపదేశముల్
దలచి, శివుండు మీఁదటి హితమ్మొనరింపుచు, గాలికంకులన్
దరఁగలుపోలెఁ బూర్వచరితమ్ములు నెమ్మదిఁ దారసిల్లఁ, దొం
దర విడనాడి తల్లికడఁ దత్త్వసమీక్ష యొనర్చె నీగతిన్॥ 204

మ॥ "మనతోడున్నడుపంగ నెంచియొగదా మాతండ్రి బీజాపుర
మ్మునకున్ గైకొనిపోయె నిన్ను నను? అంపుల్ గుంపులై యింతలోఁ
బునహాపట్టణ మంపె; 'నానడక తప్పుందారిమైఁ బోయెనా!'
యనుకొందున్; జనకుండు వేఱువడ, నేలా యట్లు తెంపాడితిన్!॥

శా॥ పూనాజాగిరు చక్కఁ జేయు మని పంపున్ గాక మాయయ్య: నా
లో నేనెంతు, 'మతానుబంధమగు కల్లోలంబు వారింప నా
కీ నిక్షేపముఁ జూపె' నంచు; నిది యిట్లేకానిచోఁ, గూర్మి లే
దా నాపై? మఱి నీవు నేను మనరాదా తండ్రి మైనీడలన్?॥ 206

తే॥ దైవ శాసనమగు సత్య ధర్మ రక్ష,
దైవ సముఁడగు తండ్రియుత్తరువు చేఁత,
యాత్మగలవారి కెయ్యది యర్హతరము?
రెంటి సవరించుకొనుచు వర్తించు టెట్లు?"॥ 207

మ॥ అను మాటల్ విని జీజియాసతి, "కుమారా! నేఁటి నీయూహ నా
మనసున్ ముట్టినదయ్యె; నీకుఁదగు సేమం బెంచి మాతండ్రి ని
న్ననిపెన్ నిక్కము; నీమసంశయము వాయన్ జేసి, యుక్తమ్ము వా
కొన దాదోజిహితమ్ము గా - మ్మతనిపల్కుల్ నీతి సిద్ధాంతముల్। 208

సీ॥ రాజ్యాంగనీతి, పురాణ శాస్త్రాధీతి
యెుదిఁగించుకొన్న విప్రోత్తముండు,
మన పునహాప్రాంత మెనయు 'మాల్తాను' జ
న్మగ్రామమహా నభిమానధనుఁడు,
గ్రామాధిపత్యమ్ముఁ గడపుచుఁ, 'గొండనా
గడము' సుబేదారి వడసినాఁడు,
వరశక్తి నెఱపి 'జున్నరు' సుభాలోన 'ము
జుందారు' గా యశ మందినాఁడు
తే॥ పిదప మీతండ్రికొల్వులోఁ బేరుచెంది
మన కుటుంబము తనదిగా మనిపినాఁడు,
సంగరము లేచి శిథిలమా జాగిరెల్ల
జీవకళవోసి దాదోజి చేవఁగొలిపె॥ 209

సీ॥ బహుమానములు పంచి పందెముల్ వెట్టి, దొం
గలబాధ మృగబాధ తొలఁగఁజేసి,
యుంబళిగా నిండ్ల నొసఁగి భూములనిచ్చి
క్రొత్తకాఁపురములు గుదురుపఱచి,
బావులు త్రవ్వించి ఫలవృక్షములఁ బెంచి
పడిపోవు దుర్గముల్ భద్రపఱచి,
గుత్తలు పన్ను తక్కువచేసి, వెలినేలఁ
గలుము లీనెడు పంటపొలముఁ జేసి.
తే॥ న్యాయముఁ దలంచి, భూపాలనము గణించి
యాయమును బెంచి, సేనల నలవరించి
నీతి చతురత సకలంబు నిర్వహించెఁ,
దాత దాదోజి మన కష్టలతాగ్రిత గ్యాఁడె!"॥ 210

చ॥ అని వినిపించుచున్న సమయంబున నాతఁడువచ్చి నిల్చినన్
గనుఁగొని, జీజియా తనయుకార్యగతుల్ వివరించి, యుక్తవ
ర్తన మెఱఁగింపుఁడంచన, నతం డిటులాడె, "నిజంబు నీవచిం
చినది; మనీషివౌట శివజీ! గమనించెద వీ రహస్యముల్॥ 211

చ॥ అనుపమ రాజనీతి సమయజ్ఞుఁడు నీజనకుండు దూరపుం
గనులిడి నిన్నుఁ బంపె - నెఱఁగాంచఁ డతం, డటు నీవు భేదము
ల్గనుము:- రేఖ రెండుకొనలున్ బెడగాఁజను నేని మండలం
బెనయునె? చుట్టునున్ బొదివి యేకమతిన్ గుఱి ముట్టఁగావలెన్॥

ఉ॥ ఆ వివరంబులన్ వినుతు" నంచని, నాఁటనుగోలె - రాజవి
ద్యా విదురుం - డతండు సవయస్కులతో శివబాలు వెంటఁ గొం
పోవుచు, జాగిరున్ మనుచుపోఁడిమి, యప్పటి రాజకీయ సం
భావన, తండ్రియూహ, తనపద్ధతి, నేర్పుచునుండె నెమ్మదిన్॥ 213

సీ॥ ప్రజలను బ్రకృతివర్గము సంతరించుట,
రాజ్యాంగ సప్తక రక్షణంబు,
షాడ్గుణ్య సముచిత స్థాన వివేకంబు,
పంచేంద్రియావేగ బంధనంబు,
చతురుపాయ ప్రౌఢ సమ్యక్ప్రయోగంబు,
శక్తిత్రయారూఢ చతుర సరణి,
ద్వంద్వోపతాప నిష్పందభావ స్థితి,
ధర్మమార్గైక సంధాన నిరతి,

తే॥ వ్యూహవిరచన, సమరసన్నాహ పటుత,
యాయుధవిశేష నైపుణ — మాదిగాఁగ
నఱువదియునాల్గు విద్యల యంతు దెలిపి,
శివుని దాదోజి రాజ్యాంగధర్మునిఁ జేసె॥ 214

సీ॥ 'పూనా, సుపా, యిందపూరు, బారామతి'
యనెడు జాగీరుల యవధిఁ జూపి,
తమ యేలుబడిఁ గ్రామాంతర పట్టములఁ గొన్న
గ్రామాధికారి వర్గములఁ జూపి,
యాయ వ్యయ వ్యవహారముల్ నేలకొ
ల్తలు పన్ను దెలుపుపాత్రములఁ జూపి,
భటు లాయుధమ్ములు వాహనమ్ములు మొద
ల్గాఁగ సేనాంగ సంగతులఁ జూపిఁ
తే॥ చేరి పంచాయతులఁ దీర్పఁజేయఁ దెలిపి,
వెదకి యపరాధులకు శిక్షవేయఁ దెలిపి,
యన్ని కార్యముల్ తనవెంట నరయఁ జొనిపి,
శివుని దాదోజి రాజ్యాంగధవునిఁ జేసె॥ 215

సీ॥ ప్రత్యూష పవనముల్ పారాడఁ జలువలూ
రిన వాలుకా వితర్దికలయందు,
ఫలి తోపవన వాటికల శీతలచ్ఛాయ
లలమిన హరిత శాద్వలములందుఁ,
బరువంపువెన్నెలల్ వాటి చుక్కలుదేలు.
పఱపైన మేడయుప్పరిగలందుఁ,
బొగఁజోపి చిఱువత్తు లెగఁద్రోసి చమురుదీ
పా లిడ్డ వీధిసోపాలయందు,
తే॥ శిష్యగణముతో శివరాజుఁ జేర్చికొనుచు,
భారతాదుల భావసంపదలఁ దెలిపి,
ఘనుఁడు దాదోజి తన విమర్శనము లిచ్చి,
నవ్యసాహిత్య బోధసంతతుల నేసె॥ 216

సీ॥ ఆవులించినమాత్రఁ బ్రేవులెంచఁగ నేర్చి,
నీటిలో జాడలు నెమకనేర్చి,
పాలు నీరును వేఱుపఱచు నాణెము నేర్చి,
కనుపాపనీడలఁ గాంచ నేర్చి,
బాలెంతబెబ్బులిపాలు పిండఁగ నేర్చి,
దళము లంటక తేనెఁ ద్రావనేర్చి,
యొండసోఁకుల దప్పి నెడలింపఁగా నేర్చి,
శిలలకు గిలిగింతఁ గొలుపనేర్చి,
తే॥ పాత్రమునఁగాక ప్రకృతిలోఁ బుటలు విప్పి,
పదములనుగాక భావముల్ పట్టి తరిచి,
యన్వయ వ్యతిరేక దృష్టాంత గతుల.
నరసి, భావుకపండితుం డయ్యె శివుఁడు। 217

సీ॥ మొనలుగట్టుచు, గుఱ్ఱములఁ గాల్బలంబులఁ
జొనిపించు 'చబ్బాజిసోనదేవు'
మదపుటేనుఁగునైనఁ గుదియించు 'రఘునాథ
బల్లాలు' శస్త్రాస్త్ర పండితుండు
సమయోచితోపాయ సరణిఁ దంత్రములొడ్డు
నోజఁ దెంపరి 'శ్యామరాజపంతు'
బలశాలి ధీశాలి పటుదుర్గనిర్మాణ
విదుఁడు 'మోరోపంతుపింగళుండు'
తే॥ ఉక్కుఁబిండము 'తానాజి' యుద్ధతుండు
'బాజి' 'యేసాజి' మొదలుగాఁ బ్రాణమిత్రు
లన్నివిద్యలఁ దనకు దీక్షైనవార
లనుసరింపఁగ శివుఁడు విద్యలను నేర్చె॥ 281

### దాదోజీ శివాజీల - రాజనీతిధర్మములు.

మ॥ తనశిష్యుల్ గొలువంగ నొక్కదిన మాదాదోజి యుద్యానముం
జని, యా యా ఫల పుష్ప పల్లవ లతాసౌభాగ్యముల్ వేడుకన్
గనుచో, నయ్యెడఁ బక్వచూతఫల మొక్కం డింపుగాన్పింప, దా
నినిఁ గోసెన్ మదియూరి, గాని యది యొంతేఁ దప్పుగా నెంచుచున్॥

మ॥ "శివజీ! యీకర మొక్కనేర మొనరించెన్, దీని మన్నింపరా
దవు, నీవాలునఁ ద్రుంచు" మన్న, నతఁ"డయ్యా! దీనఁ దప్పేమి? యీ
యవనీజమ్మును నాటి పెంచి, ననలేయన్ గాయ పండంగ బ్రా
పవువాఁ డొక్కఫలమ్ముఁ గోసికొనరాదా? ధర్మ మిట్లుండునే?"॥220

మ॥ అనఁ దాదోజి వచించె, "ధర్మగతు లన్నా! చాల సూక్ష్మంబు; లీ
మనకెల్లన్ మహాజీవిభుండు పతి; యీతోటసీమలో సర్వ మా
యన; దేసుంతయు వారియుత్తరువులే కంటంగరా, దంటఁగా
ననుకోరా, దనరాదు; పాలకత పాల్యత్వంబు గుర్తింపవే?॥ 221

సీ॥ బాహుదాతటమున బ్రాహ్మణు లన్నద
మ్ములు శంఖలిఖితులు గలరు మునులు,
లిఖితుండు తన యన్న లేనప్పు డట భూరు
హములపండులు గోసి యారగించె,
నన్న యెఱింగి "యీయపరాధమును భూమి
పతిదండనమ్మునఁ బాయు" మనియె,
నతఁడేగి సుద్యుమ్నుఁ డనురాజు నొడఁబడఁ
జేసి, కరచ్ఛేదశిక్ష వడసె;

తే॥ నిరయమును బాసి బాహుదనీట మునుఁగ
మొలచెఁ గరము లాఘునునకు మున్నువోలె,
నది కతమ్ముగఁ బాహుద యయ్యె దఁటినీ;
యరయుమీ! దీన ధర్మరహస్య [illegible] 222

తే॥ అనెడు దాదోజిపల్కుల నాలకించి
శివుఁ డనియె, "ధర్మ మింతభీష్మించి యున్నె?
లేఁతకన్నులు చూడఁగాలేవొ దాని?
జాలిగుండియ దానివాసనలు చొరవొ?॥ 223

శా॥ దాదా! ధర్మపథమ్ము హద్దులిడి గీఁతల్ గీచి బంధించు మ
ర్యాదల్ - ప్రాభవశక్తిఁ బైకొలిపి సౌహార్దంబు వంచించుటే
గాదా! భావవిశుద్ధిఁగాక పయి రేకల్ చూచి, చూపించుటే
లా దోషమ్ములు? మేడిపండువలెనే యంజూరముల్ జూతురే?॥

ఉ॥ * ఈ కఠినవ్రతం బపనయింపుము; మామిడులు, మాసులెత్తఁగా
నాకర మీకరంబు దునియన్ గొనరా, దిట ధర్మహానియున్
మేకొన" దన్న శ్రీశివుని మెచ్చి, కరంబు క్షమించియున్, స్వదో
షాకృతి గుర్తుసూపె నతఁ, డంగరకా కుడిచేయిఁ బాపుచున్॥ 225

ఉ॥ అంతటఁబోక బాలశివుఁ, "డార్య! యఘమ్ములు రాజశిక్షచే
నంతమునొందు నంటి, రదియట్లనె? నృపుండన నెట్టివాఁడు? తా
నింత మహత్త్వమందఁ గతమేది? వచింపుఁ" డటన్న, నీతిసి
ద్ధాంతవిదుం డతండు శివుతత్పరతన్ గమనించి; యిట్లనెన్॥ 226

మ॥ "తనయా! లోకుల పాపపుణ్యములకై దండింప రక్షింపఁ బు
ట్టిన విష్ణ్వంశము రాజు; రాజు సమదృష్టిన్ జూచి శిక్షింప, భూ
జనపాపమ్ము లడంగు నంచుఁ దెలుపున్ శాస్త్రంబు; లట్లౌట, రా
జును దత్ప్రాభవమున్ దదాజ్ఞ నసదంచున్, జూడరా దెవ్వఁడున్॥

---

* When he was tempted to pluck without leave a ripe mango .... he ordered .... to cut off his right hand by way of self-inflicted punishment. .... .... the hand was spared, but he ceased to wear the sleeve on the right side as a token of the conscious wrong he had done," (Page 65)

*"Rise of the Maratha Power"* by *M. G. Ranade.*

చ॥ అరయుము వత్స! రాజు ప్రజ కాత్మ; మహామహుఁ డాతఁ డొట్టిలు
త్తరు విడెనేని, దాని జవదాఁటఁగ రా; దొకవేళ దుష్టుఁడై
పఱచిన దుర్గతిన్ బొరయుఁ; బన్నులఁ గైకొని పాపముల్ గ్రహిం
పరె నృపు? లిట్టుపోక తెగఁబట్టు జనమ్ములు మేలు గాంతురే?॥ 228

చ॥ పవనుఁడు సూర్యుఁ డీజగతిఁ బాఱుచు, మంచియుఁ జెడ్డ సర్వమున్
దవులుదు; రందునందు మలినత్వము తప్పదు; చూచి వేచి నీ
కవుగతి వాడుకొమ్ము; వెరవందక, వానివిభుత్వ మూఁగఁగా
నవునె? కుమార! యీ జగమునంతయు శుద్ధముఁజేయ శక్యమే!”

చ॥ అనుపలు కాలకించి, వినయమ్ము వివేకము తోడుసూప ని
ట్లనె శివజీ, “గురూ! తమ యుదార నయానున యానుయోగ బో
ధనము సుధా సధర్మము; కృతజ్ఞతతోఁ గయికొంటి; నైన నా
మనమున నొక్క-సంశయము మానదు; మన్నన సేయఁగావలెన్॥230

ఉ॥ ఈనయశాస్త్రరీతి నిజమే యగు; నైనను, దేశ కాల పా
త్రానుగుణమ్ముగా జగతియంతయు నవ్య శరవ్యమై, యను
స్థానమునందు వేర్వడుట సాజము; భూజను లొక్క-త్రోవ, భూ
జానులు వేఱుత్రోవఁ బెలుచన్ జనుచో, నిఁక శాంతి దక్కు-నే?॥

ఉ॥ నీతిపథమ్ము మెట్టి యవనీపతు లందఱు నేగుచో, జగ
త్త్రాతకు లేనిపోని యవతారము లెత్తఁ బనేమి? దుష్టసం
ఘాతము రాజులన్ బ్రజలఁ గల్గుట నిక్క-ము నాఁడు నేఁడు; భూ
నేత యటన్నమాత్ర నవినీతుని శాసన మేల మోయఁగన్?॥ 232

శా॥ “హిత మహితమ్ములన్ దెలిసి, యెప్పటికప్పుడు వేచి, గర్భిణీ
సతిని బలెన్ బ్రజావల్లిని సాకఁదగున్ బతియందు రార్యు; ల
య్యతివను గర్భమున్ బలె నిరంకుశుఁడై ప్రజనేచ, నన్నఁడో
[illegible] సౌఖ్యము విషమసాధగు వాని నమేత సేతురే?॥ 222

ఉ॥ కా దిది రాచబాట; కొలిగాములు గూర్చు జనమ్ము నోమఁగా
రాదు; పరోపతాపన పరమ్మగు రాచఱికమ్ము మేపఁగా
రాదు; బలాధికత్వము నిరంకుశమైన, బలోన దీన ప
క్షాదరణమ్ముఁ బెంచుట హితార్థుల ధర్మముగాఁ దలంచెదన్॥ 243

తే॥ పవన సూర్యులువోలె జీవనము వోయు
దొరలు గలరేనిఁ బ్రజ కేలుదోయి మోడ్చు;
నురక విషమించి వడగాలి చెరిగి రేనిఁ
బ్రకృతిమాత యొండొకమార్పు పన్నుకున్నె?"॥ 235

చ॥ అను శివరాజు ధీరహృదయమ్మున నంకురమూ నవీన భా
వనఁ గని, ఖాండదేవుఁ "డిది వర్ధిలుచో నిఁక నెట్టిపంపు పం
డునొ? మునివ్రేళ్ళతో నిపుడ నొక్కుట యుక్త" మటంచు నెంచి, యా
తనిపలు కాదరించినవిధ మ్మొనయన్ బురికొల్పి, యిట్లనెన్॥ 236

మ॥ "మనజాగీరు క్రమమ్ముగాఁ బెరిఁగి, సామంతాధిపత్యంబు లోఁ
గొని, విస్తీర్ణత నందెడున్; నలుఁగెలంకుల్ ముట్టి లోపమ్ములన్
గని వారించి, స్వయమ్ముగాఁ బ్రజల యోగక్షేమముల్ దీర్పఁగాఁ
జనుటెల్లన్ యువరాజధర్మము: భవిష్య ద్భాగ్యమున్ గూర్చెడున్॥

తే॥ మనసుఁ గన్నులు విచ్చి, దర్శనము గోరి,
యర్ఘ్యమునిఁబోలె నిను వేచినది జగమ్ము;
చనుము జాగిరుఁ జూడ నీసఖులఁగూడి,
విశ్రమించెద నేను నీయాశ్రయమున"॥ 238

జాతీయోద్యమ పూర్వరంగము.

చ॥ అను గురుదేవు వాక్యనిచితామృత 'మున్నతభాగ్య' మంచుఁ జై
కొని, యువరాజు మిత్రులనుగూడి భటావళి వెంటనంటఁగా
మునుకొని పల్లెలున్ నగరముల్ గిరి దుర్గ నిషాదభూము లె
ల్లనుజని, వారివారి వెతలన్ గని, కూరిమి నాదరించుచున్॥ 239

సీ॥ కుల మతాచార సంకులత మాయఁగఁజేసి
పప్రబల జాతీయత పాదుకొలిపి,
అధికారి దౌర్జన్య మంతరింపఁగఁజేసి
గ్రామ వైషమ్యముల్ కట్టుగట్టి,
వ్యవసాయమునకుఁ గావలయు సాయ మొనర్చి
నీటిసౌకర్యముల్ నెగడఁజేసి,
రాకపోకల కించు రాచబాటలఁ గూర్చి
పేదసాదుల మొఱల్ పెద్దచేసి,
తే॥ మనసుఁ గరఁగించి, నిలువెల్ల నెనరు గురిసి,
యన్నిటికిఁ దానుగా వారి కభయ మిచ్చి,
తలఁపుజాడలఁ గను నుపాధ్యాయునట్లు,
శివుఁడు ప్రజలలో నాత్మబాంధవము నెఱపె॥ 240

శా॥ ఆ జాగీరుజనంబులెల్ల శివు సౌహార్దంబునన్ దేలి, మా
లోజీనాఁడు షహాజినాఁడు తుద కీలోకజ్ఞుఁడౌ మంత్రి దా
దోజీనాఁడును లేని క్రొవ్విరిపసందుల్ శీతవాతమ్ము లిం
పౌ జాబిల్లివెలుంగులం దనిసి, రూహాస్విన్న చిత్తంబులన్॥ 141

మ॥ 'మనదేశమ్ము మతమ్మునున్ మనుప నాత్మత్యాగమున్ జేయువాఁ
డని, 'సుల్తానులఁ గొల్వఁబోఁ' డని, 'యభిప్రాయంబు భేదింప నా
య్యనఁ దండ్రిన్ విడిపోవనయ్యె' నని, 'గోహత్యామలన్ మాన్పినా
డని, విశ్వాసము పెద్దచేసి శివుసాయం బంది రాభూజనుల్॥ 242

మ॥ పర భూపాలక పాలనంబు విసిగింపన్, దండయాత్రల్ పౌరం
బౌరిఁ జీకాకొనరింప, జాతిమతముల్ భుగ్నంబులై పోవఁ, ద
త్పరిహారంబున కొక్కనాయకునకై పారాడు దేశీయు లె
ల్లరుఁ జేకొండ్రి శివాజి, కుత్స్యనము సల్పన్ ధర్మసంస్థాపనమ్॥ 243

తే॥ ఉదధి యూర్ములఁ దేలు పాయువులఁ బోలె
జనులపలుకుల హృదయకోశమ్ము బలియ,
దిటవుఁ బెంచి స్వతంత్ర జాతీయ రాష్ట్ర
నిర్మితిఁ బునాదివేయ యత్నించె శివుఁడు॥ 244

చ॥ అనుచరు లాప్తులున్ బ్రియతులై తనయుద్యమ ముత్సహించి వెం
ట నడువఁ, గుంటుపోవని దృఢవ్రతుఁ డాతఁడు భద్రచిహ్న శో
భన జవనాశ్వ మెక్కి, యెడఁబాయక భీమరథీ తటంబునన్
జనిచని, ముందటన్ గనియె సానువిశాలము సహ్యశైలమున్॥ 245

సీ॥ అమర దొంతులుదీర్చినటు గోపురములట్లు
కదిసి మిన్నంటు శృంగములు వెలయఁ,
గడు పక్కళించినగతి నావులించిన
తెఱఁ గొప్పకొలుసు దరులు వెలుఁగఁ,
బైనుండ నిలువు అంపపుఁగోతఁబలెఁ బాయ
-తొచు లోతైనలోయలు రహింప,
బలిసి యంతట నిలిపసరులఁ దొలఁకాడు
కదలినా వివిధవృక్షములు గవియ,
తే॥ నడుమనడుమ లోయలవెంట నాగుఁబాము
కరణి దిగఁబాఱు సెలయేళ్ళు పరుపులిడఁగఁ,
బ్రకృతి గంభీరమగు సహ్యపర్వతంబుఁ
గనుచు హర్షించి ముందుకుఁ జనియె శివుఁడు॥ 246

శివాజీ మావళేవీరులఁ గలిసికొనుట.

శా॥ ఆజిస్ఫీతుఁడు మావళాధిపతి సహ్యారణ్య సింహంబు 'తానా
నాజీమాలసురే' శివప్రభునియందున్ గల్మియున్ బట్టి య
య్యాజానేయముద్రిప్పచున్ గుహలు లోయల్ నెత్తముల్ పేటు లా
యా జాడల్ నడిపించుచున్ జనియె నైజావాసమున్ జేరఁగన్॥

చ॥ అదియు 'సుమారధం' బను మహాచలసానువు; దానిపై ముదం
బొదవ శివుండువోలె శివుఁ డున్నతపీఠము నెక్కఁ, మావళుల్
త్రిదశ గణంబువోలె యువతీ శిశు వృద్ధ పురస్సరంబుగాఁ
గదిసిరి చుట్టనుం బొదివి, కన్నుల యేఁకటవాయఁ జూచుచున్॥ 248

సీ॥ కరఁగిపోసిన యుక్కుఁగంబమ్ములటు బలి
ష్ఠములైన శ్యామలాంగములు మెఱయఁ,
జలి గాలి నెండఁ గాఁకలుదీఱి బలుపారు
మేన మానార్థ కౌపీన మమర,
మాయ మర్మములేని మనసున కద్దమా
మొఱకు మోమునఁ జూపు మెఱపులాడ,
మెలికలుదీఱి, బుగ్గల కెక్కి, వలుదలౌ
జవ కోర కుచ్చు మీసములు వెలయ,
తే॥ సహజ గంభీర ధీర నిష్కపటవృత్తి
యెదుట సాక్షాత్కరించిన ట్లింపు గదురఁ
జుట్టుముట్టిన మావళే శూరవరులఁ
గనియె, విస్మయ స్తిమిత లోచనుఁడు శివుఁడు॥ 249

ఉ॥ ఏనుఁగుదంతపుం జికిలి యెత్తిన గాజులు, గవ్వగుత్తులన్
దూనిఁగలైన పెన్ జడలు, తోరములౌ గురివెంద దండలున్
మానిత శీలరక్షకయి మాసిన యల్లిక బొంతపావడల్
పూనిన మావళేసతుల పోఁడిమి యూరె శివాజి కన్నులన్॥ 250

ఆ॥ తల్లిపాల బలుపుఁ ద్రావి నున్నారుచు,
నేన్గుగున్న లట్టు లిందు నందు
మలసి; గంతు వేయు మావళేబిడ్డల
పటిమ పరసి, యెడఁద మురిసె శివుఁడు॥ 251

చ॥ కపటములేని వృత్తిమెయిఁ గన్నుల కందని దైవతత్త్వముఁ
దపమునఁ గాంచు యోగులవిధమ్మునఁ గొండలనమ్మి జీవికా
శపథముఁ దీర్చు మావళులచర్యల జాలి వహించి, ధర్మలో
లుపుఁడు శివుండు తాత్త్విక విలోకనముల్ దనుకంగ నిట్లనెన్॥ 252

శా॥ "ఉన్నాఁడా భగవంతుఁ డొందయినఁ? దా నొక్కింత సంసారియై
గన్నాఁడా ప్రజ? తండ్రివోలె సమసౌఖ్యం బందఁగా బిడ్డలన్
గన్నాఁడా? యనుకొందుఁ: గానియెడఁ నీ కాంతారముల్ కొండ ల
న్నన్నా! మీకు నివాసమై మనఁగనేలా జంతువుల్ తోడుగన్?॥ 253

మ॥ జనసామాన్యమువోలె మీరు ధరణీసంజాత సౌఖ్యంబులన్
గనరాదో? సరిసాటి గౌరవములన్ గాంక్షింపఁగా రాదో? సౌ
ధ ౦వాసమ్ముల మెట్టి, నాగరక రథ్యా శీతల చ్ఛాయలన్
జనరాదో? మనఁగూడదో యుదర భిక్షా దైన్య శూన్యంబుగన్?॥

మ॥ తెరలో నందముఁ జూడఁగాఁ, బ్రకృతిసందేశంబు వాకు్రివ్వఁ, ద
త్త్వరతిన్ జింతనసేయ సాధనము - విద్యావ్యాప్తి లేదయ్యె; నం
బరమో భూషణమో గృహంబొ ధనమో ప్రాపింప; దేలా మిమున్
దిరుగం జాలిన తాయిగాఁ దరువుగా నిర్మించినాఁడో గదే!॥ 255

చ॥ యువతులు 'భాగ్యమూర్తు' లనియున్, 'సుకుమారశరీర' లంచు గౌ
రవమిడి, నాథువెంబడి నరణ్యము లేగిన తొంటి సాధ్వులన్
బువులను బూజసేయు మనభూమి సదా వనవాస ఖిన్నలై
చివికెడు మావళాసతులఁ జెట్టుల గుట్టలఁ దోలు టొప్పునే?॥ 256

చ॥ పిడికిటఁ గొండలన్ బొడిచి పిండియొనర్చు బలమ్ము, సింగపుం
దడముల జూలువట్టుకొను ధైర్యము వీర్యము గల్గు మావళా
బుడుతలు కార్యఖడ్గములఁ బూని స్వదేశము నోమఁగాక, కా
ఱడవులఁ బత్తులై మృగములై కడుపోముఁ జరించు టొప్పునే?॥ 257

చ॥ మతమున కోర్వరాని యవమానము, జాతికి శిక్ష, దేశసు
స్థితికిఁ దుపాను, నీతి కవధీరణ, యిట్టి విపర్యయంబు శా
శ్వతముగ నిల్చునేమి? బలవంతులు కొందఱు దైవ సత్కృపా
మృతనది నానఁగట్టి, బలిమిన్ దమనేలలు వార్చుటేటికిన్?॥ 258

ఉ॥ దీనిని సైఁపరాదు; జగతీజన జాతి మతోపకార సం
ధానము నిర్వహించుట ప్రధానముగా, జగదంబ తోడుగా
నే నిపు డుద్యమింతు; నిది నెగ్గిన మ్రగ్గిన దైవనిర్ణయా
ధీనము; సత్యదీక్ష వెనుదీయక ధర్మరక్షంబు లాగెదన్॥ 259

తే॥ దారల మనుపేరి పొడుగుచేతులకుఁ గాక
యసద దోయిళ్ళకుఁ బ్రసాద మందవలయు;
మా ప్రయత్నము దైవసమ్మతమ యేనిఁ
జీమ దోమయు సాయంబుఁ జేయుఁగాక"॥ 260

మ॥ అనుమాటల్ విని సైగగుర్వ వినతుండై వల్కెఁ దానాజి, "స
జ్జనబంధూ! తమచిత్త మింత యమృతాసారంబు వర్షించునే!
యనదన్ జూచినఁ గంటనీరొడియు దైవాంశంబు సాక్షాత్కరిం
చినదయ్యెన్; గొదవేమియున్నది ప్రభూ! సిద్ధార్థులౌ మీకికన్?॥

ఉ॥ లోకము లోమఁగాఁ దమ విలోకనముల్ వఱఁగింతురేని, న
స్తోఁకల నడ్డువారు గలరా, యిది యేమిటిమాట? దేవతా
నీక మెదుర్చుఁగాక గమనింపఁజుమీ? జయలక్ష్మి మీపద
శ్రీకడఁ దారసిల్లవలెఁ జెప్పెడుమాటకుఁ జేఁత ముందుగాన్॥ 262

శా॥ ఢిల్లీపాదుషహాలు దక్కనువిభుల్ ఢీకొంచుఁ బోరాడియున్
ముల్లున్ మోపినయంత సందుగొని యెప్డున్ గాని మా మావళా
యల్లెన్ ముట్టఁగలేద యిందనుక; దేవా! సహ్యాభూభాగమం
దెల్లన్ వీరికి ముక్కుఁజూపఁ దరమౌనే మేము మాఱొడ్డినన్?॥ 263

శా॥ ఈ సహ్యావని యెల్ల మాకొఱకుఁగాదే ముందు సృష్టించినాఁ
డా సర్వేశుఁడు? రాజరాజుకయినన్ హక్కున్నదే యుందు? దే
వా! సామ్రాజ్యము స్వర్గలోకమన నీడా దీనికిన్? నీవు మా
యీ సింహాసన మెక్కు; మీయడుగుదోయిన్ బూన్తు ఢిల్లీశ్వరున్॥

సీ॥ అదరుపాటెఱుఁగని మదినిండి తొనఁకాడు
పరిపక్వమగు స్వామిభక్తితోడ,
నొకకార్యమందు ముందుకునిడ్డ చరణంబుఁ
ద్రిప్పనోపని గుండెదిటవుతోడఁ,
జెనకెనా నాగుఁబామును బోలి పగఁబూని
కసిదీర్చి విడుచు నక్కసముతోడ,
నగ్ని నాహారించి, హాలాహలముఁ ద్రావి
యైనఁ బూనికమెట్టు నలవుతోడఁ,
ఆ॥ బిల్లివోలెఁ బ్రాఁకి, బెబ్బులివలె దూఁకి,
చెలఁగి మలఁగి పగఱఁ జీల్చివేయు
మావళాబలంబు నీవెంట నడిపించి,
జయముఁ గూర్తు నీదు చరణమాన॥ 265

మ॥ శివరాజా! ననువంటి మేటిమగ, లీ సింగంబు, ‘లేసాజి’ ‘బా
జి’ ‘విఠోజీ’ మన మావళాదొరలు నీసేవార్థమై వేచి, సై
న్య వితానంబు ‘భివండి’ ‘నాగపురి’ ‘కల్యాణంబు’ ‘చంపావతీ’
సవిధస్థానములందుఁ జేర్తురు, యథేచ్ఛన్ రాముసైన్యంబుగన్॥ 266

మ॥ ఇఁక సుంతేనిఁ గొఱంతయుండదు ప్రభూ! యీకార్యమున్ దీర్ప; మా
మక సర్వస్వము మీది: మిమ్మనుసరింపన్ వాలునన్ డాలు సే
వకుఁడున్ వార్వము వర్మమై నిలుతు: నాప్రాణంబు లర్పింతుఁ; గొం
కక సాగింపుము జాతి నీతి మత రక్షా జైత్ర యాత్రావళిన్”॥ 267

మ॥ అనుచోఁ దక్కినమావళేదొరలు, "రాజా! నీక మీమాట; యీ
మన సహ్యావని నొక్కపిట్టయయినన్ మాటాడ; దజ్ఞాని 'జే'
యని యీధర్మరథంబు లాగ సుముఖంబై యుండు; నుత్సాహ వ
ర్ధన తా ఘూర్ణవహ దుందుభిధ్వనులు పర్వన్ జేయు" మం చాడినన్॥
తే॥ "తండ్రి తాతలకంటె మాతత్త్వమెఱుఁగు
దొడ్డసామివి! మొన్నటిబిడ్డవైనఁ:
గార్యమును దీర్చి విజయమ్ముఁ గాంచు" మనుచు
వృద్ధమావళుల్ శివుని దీవించి రపుడు॥ 269
మ॥ శివజీ - వారి సహానుభూతి సహనశ్రీ మెచ్చి యుత్సాహముల్
మిఫులన్ జూపుచు, నందఱన్ గలిపి నెమ్మిన్ మంతనం బాడి, కా
ర్యవిధానం బిటు ముచ్చటించె, "హితులారా! ధర్మరక్షార్థ మీ
వ్యవసాయంబున దూఁకుచుంటి మొకదైవాంశంబు ప్రేరేపఁగన్॥
మ॥ మనకా కోటలు లేవు: సైన్యబల సామ్రాజ్యంబులా లేవు: 'నే'
నని సాయం బొనరించి తోడుపడువాఁడా లేఁడు: ధర్మంబు యీ
వన ముద్రాంకిత మయ్యె; దీని సవరింపన్ బూనుచోఁ, గంధిమం
థనముల్ దప్పవ; యెండలో నుడుకకున్నన్ వాన లింపారునే!॥ 271
ఉ॥ రాఁగల కార్యమందు బవరమ్ములు పెక్కు; లుదీర్ణ సైనికో
ద్యోగముగల్గు శత్రువులతో నెదురొడ్డఁగ వట్టిబైలఁ బ
న్నాగము లాఁగలేవు; జతనంబున నీటిమొసళ్ళవోలె స
హ్యాగము నాశ్రయించి దిటవంది, మగంటిమిఁ జూపఁగావలెన్॥ 272
తే॥ దరులు లోయలు, కొండనెత్తములు, గుహలు
దుర్గములు, మాఱుమూలల త్రోవ లెల్ల
నమరుకొనవలె సమయ నిర్గమముకొఱకుఁ,
దల్లిగర్భమువలె సహ్యాధరణి మనకు॥

ఉ॥ ఓలము నైలు నాక, మనయుద్యమ గాంగఝురంబు సన్మతో
త్తాలముగా భగీరథరథంబును వెన్నడి, స్వర్గ మర్త్య పా
తాళము లాక్రమింపవలె, ధన్యత ముట్టి యనాథు లున్నత
శ్రీల సుపర్వులై తనియ, జీవనసౌఖ్యము నిండిపోవలెన్!"॥ 274

మ॥ అని మేధావి శివుండు వారి కుచితవ్యాహారముల్ సెప్పి, సే
నను గూర్పంగల కొందఱన్ బనిచి, తానాజీమొదల్ గొందఱన్
దనవెంటన్ గొని, రేబవల్ నడిచి, నిద్రా క్షుత్పిపాసాదు లో
ల్లని పూన్కిన్ జని, సహ్యభూ తటములెల్లన్ మెట్టె నిశ్శంకతన్॥

తే॥ 'కోయనా' లోయ, 'లిందార్రిణి' డాయునేల,
'భీమరథి' పుట్టినిలు 'కృష్ణవేణి' దరులు,
కాలిత్రోవలు, శృంగాటకముల గుములు
విడక తిరుగాడెఁ, గార్యశూరుఁడు శివుండు॥ 276

సీ॥ చిగురాకు పసరాకు చిటిమొగ్గ నగుపువ్వు
కసుగాయ పండునై యెసఁగు వనులఁ
నిలువెల్ల బెరసి యాచుల ముత్తియపుఁగ్రోవ
యెనయించు నడియాడుఁ జినుకులందుఁ,
దొలుకారు కారుమబ్బుల నీలితెరల దూ
బూఁచులాడు మెఱుఁగు లేచు నిశలఁ,
దొగరు లేఁజాయలఁ జిగిరించి, తొలికొండ
పురుటిల్లు నగు ప్రొద్దుపొడుపులందు,

తే॥ వేయిరంగుల మిసమిసల్ వెల్లివిరియు
సహ్య సహజ సౌభాగ్యంబు చవులఁ గొనుచు,
ననుచరులతోడ మంచెల నధివసించి
యరసి ముదమందుఁ బ్రకృతితత్పరుఁడు శివుఁడు॥ 277

మ॥ ఇటు సహ్యాచల సాంగయాత్ర కడగా నేతెంచి, యా మావళా
భటులన్ జేరిచి, సైన్యశిక్షణము లొప్పం దీర్చి, నానాయుధో
త్కటసామగ్రినిం జేర్చి, వారికగు కాన్కల్ సైనికోద్యోగముల్
చటులాశ్వంబుల నిచ్చి, సిద్ధపఱచెన్ సన్నాహ మేపారఁగన్॥ 278

దాదోజీ మందలింపు - శివాజీ దృఢనిశ్చయము.

ఉ॥ అచ్చట ఖాండదేవుఁడు నిజానుచరుల్ వివరింపఁగా, శివుం
డిచ్చటఁ జేయుచున్న పనులెల్ల నెఱింగి, - వినాయకార్థమై
యచ్చునఁ బోయఁగా హనుమయాటకుఁ జింతిలి, - రాజకార్యపుం
గ్రిచ్చనుజూపి, 'సత్వరమ ర' మ్మని కమ్మయొకండుపంపినన్॥ 279

చ॥ గురువరు నుత్తరమ్ముఁ గయికొంచు శివుండు హయమ్ము నెక్కి, యు
ద్ధురమగు మావళాబలముతోడ నెకాయికి వచ్చి, జీజియా
చరణములంటి, మంత్రికడ సాఁగిలి కర్జ మెఱుంగఁగోర, ధీ
పరిణతుఁ డాతఁ డాదరణపక్వముగా నెసకొల్పి యిట్లనెన్॥ 280

మ॥ "యువరాజా! మనజాగిరుల్ మనుచు నీయుద్యోగ ముత్సాహ మె
ల్ల విశేషంబుగ వింటి; నీ చతుర వాల్లభ్యంబుఁ జేపట్టి తృ
ప్తి వడెన్ లోకము; పిన్నవాఁడవయినన్ దేజంబుఁ జేకూర్చినాఁ
డవు మా కెల్లఁ; గుమార! నీహితుఁడనై తన్ సుంత వాకుచ్చెదన్॥

మ॥ మన మీ యాదిలుశాహిరాజ్యమున సామంతాధికారమ్ముఁ గై
కొనియున్నారము, గాన వారిమనసున్ గుర్తించి, ధిక్కార వ
ర్తనము ల్మాని, తదంచితాదరణమున్ రాఁబట్టి, యీరాజ్యపా
లనమున్ జూచుట యొప్పు; వేఱు తెఱఁగుల్ దప్పాట మువ్పాఁజుమీ!॥

శా॥ అన్నా! రాజ్యముఁ జక్కఁ బెట్టుకొనుటీరా - మంచిదే; కాని నీ
కన్నుల్ క్రొత్తలుసూచు, నీమనసుపోకల్ వేఱుగాఁ దోఁచు; న
న్నన్నా! సైన్యము లేల? శిక్షణము లేలా? కొండలన్ గోటలన్
సన్నాహంబు లివేల? యెందుకొఱకీ శస్త్రాస్త్ర సంధానముల్?॥ 283

ఉ॥ గాలియు నెండయున్ - జెవులు కన్నులుగా, జగమేలుచున్న భూ
పాలురు నీమనమ్ము నడిపట్టరె? కచ్చెరుఁ గాలుద్రవ్వి తం
టా లిడువార లోర్మిఁ గుముటన్ బడి నిద్దురవోదురే? కుటుం
బాలకుఁ జేటుఁదెచ్చు విషవాయువుకోర్వికి మూఁతఁదీతువే?॥ 284

మ॥ పలుపాట్లంబడి నిన్న మొన్నఁగద సంపాదించె మీతండ్రి యం
దలియుద్యోగము నిందురాజ్య: మెపుడైనన్ మీఱినాఁడే నవా
బుల యాజ్ఞావిధి? యట్టివాని కదలింపుల్ దానికిన్ మించి యాఁ
దలవంపుల్ గలిగించి, లేనియపనిందల్ మోయ నీకేటికిన్?॥ 285

మ॥ ఒకలాడంబడి చిక్కఁగాక, పయి నెంతో తక్కసామగ్రి, ఘో
టకమున్ జిక్కిన స్వారిచేయనగు; గుట్టన్ జెట్టునన్ బుట్టు సై
నికులన్ గొందఱఁగూర్ప నేమియగుఁ? దండ్రీ! వల్వ దీయాట, యా
రక సింగంబుల రేఁచి, పైపరువుఁ బాఱన్ దూఱ మేలున్నదే?॥ 286

శా॥ నీ మేధావిత, యస్త్రశస్త్రముల పాండిత్యంబు, రాజ్యాంగ గో
ష్ఠీ మర్మజ్ఞత, యిన్నియున్ వెలువడన్, డిల్లీప్రభుత్వంబుఁగా
నీ, మీతండ్రియటుల్ బిజాపురముఁగానీ, లేక గోల్కొండఁగా
నీ మెప్పించుము; గొప్పవాఁడవయి మంత్రిత్వంబు రాఁబట్టుమీ!॥

తే॥ ఇంత యొప్పవయేని నీ విందయుండి,
రాజ్య మేలుము సకలానురంజకముగ"
ననెడు దాదోజినుడుల సమన్వయించి,
వెలిపొరలు దీసి శివరాజు పలికెనిట్లు॥ 288

మ॥ "గురుజీ! నిండుమనంబునన్ దొడరి, నాకున్ మేలుచింతించు త
త్పరతన్, దండ్రియెకాదు దైవమవుకాదా నీవు! నీ వాక్కులన్
సరిగా నర్థముఁజేసికో నెఱుఁగకున్నన్ నన్ను మన్నింపు, మా
దరమున్ వీడకు; మేనునన్ దరిచి తత్త్వవ్యాఖ్యఁ గావించితిన్॥ 289

ఉ॥ నాకును మీకు నన్నిటఁ గనంబడు లక్ష్యసమత్వ: మైన ను
ద్రేకము వీడి, 'దైవము విధించెడుఁగా' కని వేచి, ప్రాభవాం
ధీకృతులైన రాజుల కధీరత దోయిలివట్టి, యెన్నఁడో
పాకముఁజేయు మీ తెరువుఁ బట్టక, నామది వేఱుపోయెడున్॥ 290

ఉ॥ నిక్కినవారు, ప్రోద్బలము నిండినవారును, రాచగద్దెపై
నెక్కినవారు 'పాప' మని యిత్తురె యూరక నిల్వఁజోటు? లా
వెక్కిన పోటరుల్ బలిమినీడ్వఁగ దూఁకురథంబు, తెడ్డులన్
గ్రుక్కిన నడ్డుకున్న, నెడగాఁబడి కొంపలు గూల్పకుండునే?॥ 291

ఉ॥ వేయితరమ్ము లిట్లొదిఁగి వేఁగిన లోఁగిసఁ, గొల్వుకాండ్రపై
దోయిలివట్టినన్, గరుణతోడ నవాబులు తుల్య గౌరవ
శ్రీ యిడఁబోరు; వారి నెదిరించుటగా దిది దేశరక్షణా
ధ్యాయము; దీనఁ దప్పుగలదా? కలదా పెరదారి ముక్తికిన్?॥ 292

మ॥ ఒక సింహాసనమెక్కి భోగములతో నుయ్యేలలూఁగంగఁ గో
రిక లే, దన్యులవైభవంబుఁ గని యార్తిం బొందుటా లేదు; కూ
టికినిన్ గుడ్డకు లేని దీనపరిపాటిన్ గుందుదేశం, బనా
మకమై వీఁగు మతమ్ముఁజూచి, నిజధర్మం బిట్లు సాగించితిన్॥ 293

శా॥ నేనేకా, దొకదేశబంధు వెవఁడున్ నేఁడైన రేపైన ని
ట్లే నిర్ధారణ సేయఁగావలయు, నిట్లే పోరు సాగించి దీ
నానాథావళి నోమఁగావలయుఁ; గాదా, హైందవంబే పరా
ధీనంబై, మన జాతి నీతి మతముల్ దిక్కేది స్రుక్కన్ వలెన్॥ 29

మ॥ ఎవఁడో కన్నులుమూసి, 'గ్రుడ్డిశబళంబే చాలు' నంచున్న, హైం
దవలోకంబు సమస్త మట్లు పడియుండన్ జాల, దాత్మీయ ధ
ర్మ వినాశంబును సైఁపఁ జాల; దొకనిర్మాణంబో, విధ్వంసమో
యగుఁగా: కేను స్వధర్మరక్షకయి ప్రాణాయామమున్ జేసితిన్॥ 295

చ॥ ఎవరికివారు వారిహితమేనిఁ దలంపక యుందు రేమి? ప్రా
భవము బలమ్ములున్ గలుగువారు పరోన్నతి నాక్రమింపఁగాఁ
దివురక యుందురేమి? వెనుదీయరు వారుచువారు; ధర్మమెం
దు విజయమందుఁ దప్ప; దకుతోభయ సుస్థిరతన్ జరించెదన్॥ 296

ఉ॥ నే నొకరుండనే యని, వనేచరులే భటవర్గమంచు, సు
ల్తానులతోడ వైరమని, తాళిమిమాలి తలంకనేల? దా
దా! నిముసంబులో జగమునంతయు మాఱుచు దైవశక్తిముం
దీ నలుసెంత? వామన బలీంద్రకథానక మాలకింపవే?॥ 297

చ॥ అనుభవ మింతగాఁగల మహామతిమంతుఁడ - నీవుఁగూడ నే
నొనరుచు పూన్కిఁ దండ్రికెదియో తలవంపు ఘటిల్లు నంచు: వే
మని తలపోసితో యెఱుఁగ! నట్లగునే, నిఁక నెవ్వఁడున్ - దపో
ధన! తనదేశమున్ మతముఁ దల్లినిఁ దండ్రినిఁ గొల్చుటొప్పదే?॥

ఉ॥ కావర మెక్కువై కనులుగానని రాజులచేతులం దసం
భావితులా స్వదేశ మత మాతృ పితృ స్వజనంబు లూఱటన్
బోవఁగ నుద్యమమ్ము పరిభూతియె? యందున నాకుఁగాక స
ద్భావము గల్గుతండ్రికొకతప్పు ఘటింతురె? ముప్పుఁ గూర్తురే?॥

ఉ॥ నీచత కొగ్గుచున్ బహామనీసులతాను లిఁకేమి సేతురో
చూచెదఁ: దండ్రిపైనఁ బగచూపినచో నెదురొడ్డి మర్మముల్
దోఁచెద: వారిగౌరముతో మనహైందవలక్ష్మి మ్రొగ్గఁగాఁ
దూఁచెద: నెల్లెడన్ జలువఁదోఁగిన తెమ్మెర లారవీచెదన్॥ 300

చ॥ ఒకనిపదమ్ములంటి, సమయోచితరీతి మతమ్ము మార్చి, గొం
కకయ సలాము లిచ్చి, యధికారపుఁబెంటలు మోసి, పాపజీ
వికఁ నడుపంగఁజాలఁ; బితృ విత్తమె యైనఁ బరాధికార వా
చకమగు జాగిరున్ మనుపఁజాల; స్వతంత్రత నూఁది నిల్చెదన్॥

ఉ॥ ఇందఱు మావళాజనము లీగిరి కానన కుంజ వాటికా
కందర భూములన్నిలిచి, కష్టములన్ బడుచుండ, నేను రా
జ్యేందిరఁ గౌఁగిలింత రమియింతునె? వారికి నేను; నాకు వా,
రందఱు నొక్కఁడై కలిసియాడెద మిందు స్వరాజ్య నాటికన్॥ 302

మ॥ గురుజీ! నే నిటు నిశ్చయించితిఁ;. బరాకుం బొందలే, దింత తొం
దరయున్ లే; దిది నిన్న మొన్న మొలకెత్తన్ లేదు, వేఱొక్కనాఁ
డరుగంబోఁ; దవిధేయుఁ డీతఁ డనుకోఁ; కాత్మీయతా భావ బం
ధురతన్ దీవనలిచ్చి నన్ననుపు; నాదోసమ్ము మన్నింపుమీ!"॥ 303

తే॥ అనెడు యువరాజు దృఢనిశ్చయంబుఁ దెలిసి,
ప్రాఁత పలుకుల మరలింపరామిఁ దలఁచి,
యప్రయత్నముగాఁ 'దథా' స్తనెడు రీతి
నోరగిలుకంట దాదోజి యూరకుండె॥ 304

ఉ॥ అంతట ఖాండదేవు సెలవంది, శివప్రభుఁ డప్డె జీజియా
యంతిక మేగి తత్పదములంటి, మదిన్ గయికొన్న నిర్ణయం
బంతయు విన్నవింప, వెఱగందుచు నామెయు నిర్నిమేష నే
త్రాంతర నగ్న మాతృహృదయమ్మునఁ బుత్రకుఁ జూచి యిట్లనెన్॥

మ॥ "తనయా! బాల్యమునుండి నీమతము నీతత్త్వమ్ము వేఱొండుగాఁ
గనుపట్టున్, దృఢనిశ్చయుండ 'విపు డీకార్యమ్మునన్ నీవు తృ
ప్తిని సాధించెడు నంతకంటె ఘనమై వేయంతలై, యాపదల్
నిను ముట్టన్ దమకించుచున్న' వని తండ్రీ! నాకుఁ గాన్పించెడిన్॥ 306

మ॥ 'ఒక సాధ్వీమణిబిడ్డఁ డున్నత మహోద్యోగంబునన్ మాతృభూ
మికిఁ గల్యాణముఁ గూర్చినాఁ' డనుచు నెమ్మిన్ లోకులగ్గింపఁ గా
తుకమున్ బొందఁగవచ్చుఁ: గాని మనసున్ దూలించి గాలించి, దా
నికినై గర్భముకోసి పంచెడు పురంధ్రిన్' దల్లు లేమందురో!॥ 307

ఉ॥ "నే నదియంతయున్ మఱచి, నీమతమే యురరీకరింతు; మే
ధానిధి ఖాండదేవుని హితమ్మనకంటె విశేష మేమియున్
నే నుడువంగఁజాల; గమనింపుము నీవె శుభాశుభమ్ము: లె
క్కైనను 'బాలనాయక' మటంచు నవప్రథ రామిఁ జూడుమీ!॥ 308

ఉ॥ "కొండలతోడ డీకొనెడు కుఱ్ఱఁడ వైతివి; యావనప్రభూ
ద్దండత మాఱుమ్రోఁగ బెడిదంబగు నీ సమయంబునందు, 'మూ
ర్ఖుం డెవరీఁడుచుండె' ననుకోక సహాయ మెవండు సేయు? ని
ట్లుండియు నేఁడు ధర్మపథ మోమఁగ నీమది వోక మెప్పగున్॥ 309

ఉ॥ "ఎంచియుఁబంచి యిట్లు వచియించుట నీజతనంబు నాఁగ య
త్నించుట గాదు, 'చాల' వని నిన్నదలించుట గాదు; కర్జమా
ర్జించెడుపట్లఁ జీమ యెదిరించినఁ - గొండలు కూలనున్న, భీ
ష్మించక బేలగాక సమసించి జయింపఁగ హెచ్చరించితిన్॥ 310

చ॥ "కడచిన గ్రంథమున్ దడవఁగాఁ బనిలేదు; స్వధర్మ రక్షకై
నడుమును గట్టినాఁడ; విది న్యాయ్యము లోకహితంబయేనిఁ దో
డ్పడు సకలంబు; నీమది భవానిఁ దిరమ్ముగ నమ్మి, నేర్పుమై
నడుపుము శాలివాహనుఁ డొనర్చిన పోకల సేకరింపుచున్॥ 311

తే॥ "అక్షరమ్ముల సర్వార్థ మమరినట్లు
ప్రకృతిలో సర్వశక్తిసంపదలు గలవు;
అనువుగా నేర్చి కూర్చి, కావ్యమునుబోలెఁ
గార్యమునుదీర్చి, యొక సృష్టికర్త వగుము!॥ 312

ఉ॥ "పట్టినదెల్ల బంగరువు - పల్కినదెల్లను వేదవాక్యమై,
గుట్టలు పట్టణంబులయి, కొండలఁ గోటల నిండుసైన్యమై,
పట్టినపంతమున్ గెలిచి భద్రముగూర్చి, స్వరాజ్యలక్ష్మికిన్
బట్టముఁ గట్టుమయ్య! యెడఁబాయని ధర్మబలంబు పెంపునన్॥ 313

చ॥ దిటవును దెంపుఁ గూర్చి, కులదేవతయైన భవాని నీకు ను
త్కట కరవాలమై, కవచ కార్ముక కాండములై, రణంబునం
తట నినుఁ గాచుఁగాక! గుణతత్పరతన్ జయలక్ష్మి నిందుకోఁ
గిటఁ గొనుఁగాక! సేమ మెదిగించెడుఁగావుత నాదుదీవనల్!"॥ 314

మ॥ అను జిజాపలు కంది, యుత్సుకత డాయన్ మావళాపీరు లే
చినపేర్మిన్ గరయుగ్మ మెత్తుచు, 'శివాజీరాజుకుఁ భోఁసలే
శునకున్ జే! మన రాజమాతకును జే! శూరుండు షాజీనృపా
లునకుఁ జే!' యని దీవనల్ వలికి, రెబ్బల్ మింట రాపాడఁగన్॥ 315

ఉ॥ ఆ నినదమ్ము లాని పులకాంచితుఁడై శివుఁ డంబఁజూచి, "మా
తా! నెనరంటి నీవిడుహితమ్ము శిరమ్మునఁ బూలదండగాఁ
బూనితి; శ్రీభవాని పరిపూర్ణకటాక్షము సర్వరక్షకం
బౌనఁట తక్కువున్నదె? సురాసురు లొడ్డిన లెక్కసేతునే!॥ 316

చ॥ అడలకు నన్నుఁ గూర్చి, మనసంటిన యాసున నెవ్వఁ డేదియే
నుడివిన నమ్మఁబోకుము; నినుఁ గనుపెట్టుచు నండ నుండి మే
నడిపెద సర్వకార్యములు; నావిజయమ్ము శుభమ్ము నెమ్మదిఁ
దడవుచు నుండు మిందుఁ, గరుణన్ సెలవి; మ్మికఁ బోయివచ్చెదన్"॥

చ॥ అనుచు శివుండు తల్లిచరణాబ్జము లౌఁదలఁ దాల్చి, కన్నులం
ట నదిమి, పాదధూళి నుదుటం ఘటియించి శిరమ్ము వాల్చి యొ
య్యన సెలవంది, మేటివినయమ్మున ముందుకుసాగి, వెంట నం
టిన తనసేవతోడఁ బయనించె నిజోద్యమ దత్తదృష్టియై॥ 318

ద్వితీయాశ్వాసము - సంపూర్ణము.

శ్రీ మత్పరదేవతాయైనమః

# శ్రీ శివ భారతము

## (శివాజీ ప్రబంధము.)

---

### తృతీయాశ్వాసము.

---

ఉ॥ శ్రీయుతుఁడౌ శివప్రభుఁడు చేకొను నుద్యమమున్ ఘటించువాఁ
డై యొకనాఁడు సహ్యావనమందు విశాలరసాల భూరుహ
చ్ఛాయ వసించి; కావలయు సన్నహనంబులఁ బూని చుట్టునున్
డాయు నిజానురాయి సుభటప్రతతిన్ గని యిట్లు వాకొనెన్॥

తోరణామర్గ విజయము.

మ॥ "హితులారా! మన మొక్క-ధర్మపథ మెల్లేఁ బట్టి సాధింపఁ బూ
నితి; మిందున్ బ్రతికూలమై నిలిచియుండెన్ నేటి రాజ్యాంగ; ము
న్నతమౌ తత్ప్రభుశక్తితో నెదిరి, కొండల్ పిండిసేయంగ దూఁ
కితిమన్నన్ గొఱగాదు; నేర్పుమెయి వాకిం డ్లూడఁదీయన్ దగున్॥

చ॥ కలరు, మతమ్ము దేశమనఁగా నభిమానముఁజూపువారు - రా
జులుఁ బ్రజ లందునం; దయిన, శూరతఁదక్కి- మహమ్మదీయరా
జులదయ కొగ్గు వీరిమనసుల్ మనవంకకు రావు; గాన, నీ
యిల సకలమ్ముఁగూడ ధ్వజమెత్తుఁజుమీ మనపైకి రేఁగుచున్॥ 3

చ॥ 'ఇందఱ కిచ్చలేనిపని యేల ఘటింపఁగ: లేనిపోని యీ
తొందర లేటి' కంచు వెనుదొక్కి-నచో, నిఁక దక్షిణక్షితిన్
హైందవజాతియే కటకటా! కఱవై యడుగంటిపోదె! యీ
చందము భావ్యమౌనె రవిచంద్రుల సంతతి యుండునంతకున్!॥ 4

ఉ॥ కావున, నెవ్వరేన్ని తిరుగన్బలుకుచున్న సహించి, ధర్మమున్
దైవము నమ్మి దూఁకుట యుదాత్త మహాపురుషోచితంబు; రాఁ
బోవు జయంబొ యొండొకఁడొ పూర్వులదండలుగాఁగ భారత
శ్రీ వహియించుఁగాక: సవరించుత దుర్గను దుష్పథంబులన్॥ 5

చ॥ 'అగు' నని, 'కా' దటంచు వెనుకాడుట మందులరీతి; మానవుం
డగునఁట తాను, ధర్మయుతమౌనఁట కార్యము - కాకపోవు నో,
జగములు నిల్చునే? నియతిశాసన మన్నిటి గెల్చునే? మదిన్
దెగువయుఁ దెల్వియున్ గలుగ, దేవతలన్ గబళింపరాదొకో!॥ 6

చ॥ అటు లగుటన్, దురుద్ధరములైనను మానవశక్తి కెందు లోఁ
గుట మది నుత్సహించి, ములుకుల్ మలకల్ గమనించి, పొంచి పో
రుట తగు; సహ్యశైలము విరోధులకున్ జొరరానిచోట నూ
ఱటఁగొని, దీనిప్రాపునఁ బర ప్రతియోగము లాఁగఁగావలెన్॥ 7

మ॥ మనకార్యం బొకరీతిఁజూడ సుఖ సంపాద్యంబ యౌనంచు నా
మన మూహించు; బిజాపురప్రభువుతో మాఱొడ్డి పోరాట త
ప్పనిదయ్యెన్, సులతా నొకింత తగవున్ బాటించువాఁడౌట - యుం
డినసర్దారుల కొండొకళ్ళకును 'బోటీ' యుంటయున్ దోడగున్॥ 8

చ॥ మఱియును, నిన్నమొన్న నహమత్పుర రాజ్యము కొంత చేరె నీ
దొరలకు; వీరు దానిఁ దగుత్రోవలఁ జక్కనొనర్ప; రింత కీ
ధర మన తండ్రితాతల యుదారత మెచ్చినచోటఁ జారులె
ల్లరు మనమాట దాఁటరు; తలంపరు వారికి మేలుసేయఁగన్॥ 9

ఉ॥ అంతియగాక, యీ మహమదాదిలుశాహినవాబు రోగసం
క్రాంతశరీరుఁడై యతనిరాణియె రాజ్యము నేలుచుంట — సా
మంతులు దుర్గనాథు లెదమాఱి యులక్ష్యముఁజేయుచుండి; రీ
ప్రాంతములెల్లనున్ శిథిలబంధములై యిటు డొక్కిచూపెడున్॥ 10

ఉ॥ ఇన్నిటికంటె మాజనకుఁ డిచ్చటలేమిపరిధాన; మాయనన్
గన్నడరాజ్యమున్ గెలువఁగా నొగిఁ బంపె నవాబు; వారితో
నెన్నికఁ గన్నవీరభటు లెల్లరుఁబో నిట నిల్చె సున్న; లీ
చిన్నెల సన్నలెత్తె మనచేఁతలు చేతుల కందుపాటులన్ 11

చ॥ మన మిపు డొక్కసారి యరిమండలమెల్లఁ బరాక్రమించి, ద
క్కను సకలమ్ము నున్ గెలువఁగాఁ దమకించుట లగ్గుగాదు; నా
జనకునిజాగి రంటి నలుచక్కియలన్ గల శైలదుర్గము
ల్గొని బలమంది, తక్కినవి గూర్చుట యొప్పుఁ గ్రమక్రమంబుగన్॥ 12

మ॥ అటు మొగల్బల - మీ బిజాపురపుసైన్యం బిట్లు రాఁ బోవ, న
న్నిటికిన్ గూడలియైన దీనెలవు; దీనిన్ బట్టి లోఁగొన్నచోఁ
గుటిల ప్రాంత దరీ ఝరీ గిరితటీ కుంరీభవన్మార్గమై
దిటవేదన్, మనవైపు గన్గొన దరాతివ్రాత మేరీతిగన్॥ 13

తే॥ స్థానబలమునుబట్టి, యిచ్చటి గడంబు
లందు ముఖ్యముల్ నాల్గు, 'పురందరంబు'
'కొండనగడంబు' 'చాకణుకోట' 'తోర
ణాఖ్యదుర్గము' - నివి యభేద్యంబు లెందు॥ 14

ఉ॥ దుర్గములన్నిటన్ మిగుల దుర్భిద, మున్నతిమించుఁ దోరణా
దుర్గము; వైరివర్గములు దూఱి పెనంగిననైన లోఁజొరన్
మార్గము లేదు; దీని నొకమచ్చునఁ బట్టితిమేని, దానిపై
భర్గుఁడు వచ్చెనే నెదురవచ్చు, జయింపఁగవచ్చు నొక్కటన్॥ 15

మ॥ మన తానాజి వచింపఁగాఁ దెలిసెఁజుమ్మ - తోరణాదుర్గనా
థు నుదాసీనత; సేనతో నెదిరి, కత్తుల్ దూసి, పోరాడఁగాఁ
బనిలే కించుక చెమ్మరింపకయ గెల్వన్ వచ్చు దుర్గంబు; నే
పనులైనన్ సమయోచితంబుగ లగింపన్ వచ్చు నామీఁదటన్॥ 16

మ॥ ఇది యెంతే ననుకూలకాలము: తటాయింపంగ లాభమ్ము లే:
దిదిగో పోదము లెం" డటంచు శివరా జెల్గెత్త, 'జే! జే!' యటం
చుదితోత్సాహముతో నుదాయుధ సహాయుల్ మావళావీరు లు
న్మద మాతంగములై, శివప్రభుని వెంటన్ దూఁకి రొక్కుమ్మడిన్॥ 17

తే॥ పదియుఁ దొమ్మిదియేండ్ల జవ్వనపుఁ దిమురు
కార్య ఖడ్గాభిమాన కర్కశతఁ బెరుప,
దంటతనమున శివరాజు - గెంటులేని
బంటు లరుదేర - నడవులవెంట నడిచె॥ 18

చ॥ ముసిముసిచీఁకటుల్ విరియు మున్నుగ, మున్నుగ మావళాబలం
బసి ముస లోరుతోమర శరాసన బాణ ధురీణ పాణులన్
ముసర, హయంబు నెక్కి శివభూపతి తోరణ దాసి, మేటిసా
హసమున లోనికిన్ జనియె - నచ్చటి కావలివారు డీల్పడన్॥ 19

క॥ సోమరితన, మేమఱుపా,
టామును, దండింపులేమి యమరిన దుర్గ
స్వామి పరాకుపడన్, శివ
భూమీశుని భటులు చుట్టుముట్టిరి నగరున్॥ 20

ఉ॥ ఒంటరిపాటుతోడఁ, గను లూడియునూడని మంపుతోడఁ, గే
లంటియు నంటఁబోని నిశితాసిలతాగ్రముతోడ, బిచ్చ పా
టంటిన దుర్గనాథుఁడు నిజాగమనంబు నెఱింగి బైట రా
కుంట శివప్రభుం డరసి, యుద్ధతి లోనికిఁజొచ్చి యిట్లనెన్॥ 21

శా॥ "అయ్యా! మే మొక గొప్పయుద్యమముఁ జేయంబూని, యీమర్గ మి
ట్లొయ్యన్ గైకొనుచుంటి, మింద సమరోద్యోగంబు నూల్కొల్పుచున్
డయ్యంబోకు; నవాబుతోఁ దగినమాటన్ జేసు గైకొందు; నా
నెయ్యం బూనుచు దుర్గమున్ విడుము [illegible] నీ కేటికిన్?॥ 2[illegible]

ఉ॥ 'కా' దని 'కూడ' దంచుఁ బెనఁగన్ బడఁ - బెద్దలనాఁటి స్వత్వమా -
కాదిది; జీవనమ్మొకొ యకా - గుణవంతున కెందు లేదు సం
పాదన? కాని కూడని వివాదములన్ దలకెత్తికోకు; నీ
కేదయినన్ దలంపు గలదేని వచింపుము; దానిఁ దీర్చెదన్"॥ 23

చ॥ ¶ అని సమయోచితంపుఁ బలుకాడి, శివప్రభుఁ - డించుకైనఁ దా
ననవసరమ్ముగాఁ బెనఁగులాడుచు నెత్తురు లోడఁ జేయ నొ
ల్లని తత రాజనీతి కుశలక్రముఁ డౌటను - గొన్ని మూక లా
తని పెనుదోయిటన్ నినిచెఁ; దత్పరుఁడై యతఁ డిట్లు చింతిలెన్॥ 24

చ॥ "బలఁగము లేదు నాకుఁ; బరివారముతోడ మహాత్ముగా నితం
డలముకొనెన్; బెనంగిన జయమ్మును గాంచుట కల్ల; యూరకే
తొలఁగుట మే" లటం చపుడ దుర్గము నప్పనసేసి, నెమ్మదిన్
జల ముడివోవ, కాతఁడు బిజాపుర మేగె నవాబుఁ గర్గొనన్॥ 25

చ॥ తమ ప్రథమప్రయత్న మిటు దైవమునన్ విజయమ్ము నందఁ, జి
త్తము చిగిరింపఁగా, శివుఁ డుదాత్తగతిన్ గులదేవతా పదా
బ్జములు భజించి, కానుకలఁ బంచి, చిరంతన తోరణాఖ్యదు
ర్గమున స్వరాజ్య తోరణముఁ గట్టె రసాల కిసాలయమ్ములన్॥ 26

చ॥ పదపడి కర్జముఁగొని శివప్రభుఁడున్ "సులతాను దీనిచే
మదిసెడి మాఱుకొన్నఁ జిఱుమంటలు రేఁగకపోవు; వల్వ దీ
తొందర; యిది యిప్పుడే యణఁగఁద్రొక్కుట మే"లనుచుం దలంచి, నె
మ్మది గలిగింప, నుత్తరము మానితవైఖరి వ్రాసె నీగతిన్॥ 27

ఉ॥ "మా సులతానుగారు గుణమండను లాదిలుశాహిగారికిన్
మీ సరదారుబిడ్డ ప్రణమిల్లి కుమారశివుం డవశ్యమై
చేసెడు విన్నపంబు - తమచిత్తము రాఁగలదంచు నమ్ముచున్
జేసితి నొక్కకార్య మిట, స్వీయవిధి న్నెరవేర్చుచాడ్పునన్॥ 28

¶ "In 1646 Shivaji struck the first blow. He persuaded

ఉ॥ ఇచ్చటి తోరణాగడము నేలెడు మీసరదారు కన్నులన్
విచ్చి చరింపఁబోని యవివేకియు సోమరిపోతు: వీనిచే
నిచ్చటి ప్రాంతమెల్లఁ జెడియెన్: జెడె రాబడి: లేని యల్లరుల్
సొచ్చెలెఁ; గాన, వీని దిగఁజోపుచు, నేఁ గయికొంటి దుర్గమున్॥ 29

చ॥ $ ఇదియునుగాక, శత్రువుల కియ్యది వచ్చెడుదారి; దీన బ
ల్లిమఁడును స్వామిభక్తిని జలింపని మాదృశుఁ డేలుచుంట యొ
ప్పిద; మిటుపైన రాబడినిఁ బెంచి క్రమమ్ముగ మీకుఁ బంపుచుం
డెద; మిది సమ్మతించి, తమ నిక్కపుటుత్తరు వీయఁగోరెదన్॥ 20

తే॥ ఆతఁడు మిమ్మును దర్శించి, యనువుమీఱ
నిచటి యాగాములను వచియింపవచ్చు;
నైన, సావధానముగ సత్యమ్ము నరయు
విభులగుట యెంచి, మీయాజ్ఞ వేచియుంటి"॥ 31

చ॥ అని లిఖియించి ముద్రయిడి, యప్పుడ వేగరియైన దూతచేఁ
బనిచిన, దానిఁ గైకొని నవాబు శివుం డొనరించు కార్యమం
దునఁగల తత్త్వ మారసికనుంగొన వేచె నొకింత; యాతఁ డే
మన కిటు లూరకుండుట నిజాభిమతోచిత మంచు నెంచుచున్॥ 32

---

or bribed the governor of the fort of Torna to throw open the gates of his stronghold which he occupied and repaired."
*Chapter III. - Rawlinson's "Shivaji."*

$ "Skivaji represented that the taking over of the fort of Torna was entirely in the interest of the government, that a loyal servant like him had to be in charge .... .... that he would be able to compel the deshmukhs to render true accounts of revenue to the state, thus saving immense sums of money annually to the government .... .... he undertook to pay over to the government a far larger revenue."
**Page 96. 'The Life of Sivaji Maharaja' by *N. S. Takakhav.***

మ॥ శివరా జూఅట వొంది యందలి ప్రజాక్షేమంబు భావించి గా
రవముం జూపుచు, వారిదారి కనువారల్ నూత్న సౌకర్యముల్
మిపులన్ గూరిచి, యేల్బడిన్ బెనిచి, నెమ్మిన్ నూతనోద్యోగి పుం
గవులన్ జేరిచి, తోరణాగడము చక్కంజేసె నల్మూలలన్॥ 33

చ॥ * శిథిలము దుర్గమెల్లఁ బరిశీలన చేసెడుపట్ల నొక్కచోఁ
బృథుల సువర్ణ రత్న సముపేత మహానిధి చిక్కె; దాన సు
ప్రథితుఁడు సుస్థిరుఁడయి శివప్రభుఁ డాదృత కార్యసిద్ధికిన్
ప్రథమబలంబు దైవబలపాకముగాఁ దలపోసి పొంగుచున్॥ 34

మ॥ ఒకరాజ్యాంగము నిల్పఁగాఁ దలఁచి, యుద్యోగంబులన్ - మంత్రి సే
వకుఁ డిట్లందఱ నిల్పి, కాల్బలము వార్వంపుంబలం బాది సై
నికులన్ జేరిచి, యస్త్ర శస్త్ర వితతిన్ నిండించి, భూపాలనా
దికమున్ గూరిచి, రాజధాని కనువౌ దేశంబు పాటించుచున్॥ 35

తే॥ గీ॥ సహజ తుంగ శృంగత్రియీ స్తంభి తాభ్ర
పథము * 'మోర్బడు' నా గిరిభాగ మొకఁడు
తోరణకు దాపుగాఁ గ్రోశదూరమందుఁ
జెలఁగ, నద్దాని నొకదుర్గసీమఁ జేసి॥ 36

తే॥ గీ॥ శృంగములకు మూఁటికిని 'సంజీవని' యు 'సు
వేల' 'పద్మావతి' యనంగఁ బేరుపెట్టి,
యన్నిటికి మధ్య రాజగృహంబు గట్టి
'రాజగడ' మను దానఁ గార్యములు నడిపె॥ 37

---

* "In course of these operations Shivaji had the good luck to unearth a quantity of buried treasure among the debris of the fort ....Shivaji devoted the treasure to the purchase of arms and ammunition and the erection of a new fort of his own," "(which was originally) known as Morbad; but he changed its name to Raigad or the King's Fort."

*P. 96. N. S. Takakhav - P. 134. Kincaid,* C. V. O., I. C. S.

### దాదోజీ చరమదశ - శివాజీ కృతజ్ఞత.

చ॥ ఇటు శివరాజ యత్నముల నెల్ల నెఱుంగుచు, ఖాండదేవుఁ డొ
క్కట సులతా నొకంట వడిగా షహజీ కెఱిఁగించి; రాతఁడున్
జటుల రణమ్ములన్ దెఱపిచాలక కన్నడమందునుండి, ‘య
చ్చట శివు మందలింపు’ మని సత్వర ముత్తర మంపె మాత్రికిన్॥ 38

చ॥ పరువము వచ్చుటాది నరపాల సభావిరతక్రియా ధురం
ధరత వహించి, మోము ముడుతల్ వడ నీల శిరోజబంధముల్
నరసినపండు, తొంబది తొనంకిన వృద్ధుఁడు, ఖాండదేవుఁ డీ
యఱగొఱలెల్లఁ జూచి, హృదయంబున దూయుచు నిట్లు చింతిలెన్॥

చ॥ “ముదుసలినౌటఁ గార్యభరమున్ దలమోయఁగఁ జాలఁ; బ్రాయపుం
బదటున మీఱుచున్ శివకుమారుఁడు నా పలు కాదరింపఁ; డి
య్యది సవరింపనంచు నొగులాడు షహాజి; నవాబు సూచుఁ ద
ప్పిదముగ; దేనికై పరితపింతు, భరింతు దురంత వేదనల్!॥ 40

చ॥ † పడుచుఁదనమ్మునన్ దుమికిపారుట గాదు, శివాజి చేఁతలన్
గడకు మహత్తరాశయము గర్భితమైనటు దోఁచుచుండెఁ; దో
డ్పడఁ దొడఁగెన్ జగ మ్మతనిపట్టయి; నే నెదురాడి మాట చే
డ్పడఁ జను టెట్లు? స్వార్థపరవా ద్యపవాదము లెట్లు మోయఁగన్!”

చ॥ అను పెనుచింతతోఁ గుమిలి, యప్పటికప్పటి కాటుపోటులన్
దనికి రుజాభిభూతుఁడయి, తాఱిన ధార్మికవృద్ధు ఖాండదే
వునిఁగని, జీజియా యడలి పుత్రికవోలె సపర్యఁ జేయుచున్
దనయునిఁ బిల్వఁబంపఁగ, నతం డరుదెంచి విషణ్ణ చిత్తుఁడై॥ 42

---

† “When, however, he was satisfied that his young charge had the capacity to realise this wild dream (of common liberation from the Moslem yoke) the old man yielded and blessed him.” Page 66. *M.G.Ranade.*
“Jijabai and Shivaji attended him with assiduity ....Shivaji was always by his bed side.” P. 80 & 81. *N. S. Takakhav.*

చ॥ మరణపు మంచమ్మే, తెలుఁగుమాటిన మోమును దేలకన్నులా
గురువరుఁజూచినంతఁ గనుగొల్కుల 'గిఱ్ఱు' న నీరువాఱఁ, ద
చ్చరణము లంటఁగా నిలిచి, సవ్వడి కుత్తుక నొత్తిగిల్ల, వా
తెఱ వణఁకించు వేదనుడి దీనముగా వెడలించి యిట్లనెన్॥ 43

శా॥ "దాదాజీ! శరతల్ప శాంతనవు చందం బైతివే! ప్రాణయే
లేదే! యెదయినన్ జికిత్సఁ గొనఁగా లేవైతివే! తెల్పఁగా
రాదే నా కొకవార్త! నీకుమదికిన్ రా నైతినే! తండ్రి మ
ర్యాదన్ గూరిమి గుర్తుమ్మరించితివి కాదా! నేటి కిట్లైతివే॥ 44

సీ॥ బలమఱు నవయవంబుల సుర్కిక్కి పోలు నీ
ముదిమి రాజ్యభరంబు మోయలేక,
మనసొగ్గి మీమాట మన్నింపలేని నా
కొఱకుఁ గూరిన వేఁడిఁ గుడువలేక,
తెరచాటునుండి తొందరసేయు తండ్రి యు
త్తరువు సమాధాన పఱుపలేక,
చెమ్మటల్ వోసి పెంచినమొక్క - పురుగాడి
చెడకుండు తెఱఁగు లార్జింపలేక,
తే॥ గీ॥ తలఁపుసెగ లంటి యుడికి, రక్తస్రవంతి
బిందుబిందువు నిమికి యావిరిగఁబోవఁ,
జివికి జీర్ణించి శల్యావశిష్ట మూర్తిఁ
జెను తపసివైతె! ప్రాయోపవేశ దీక్ష॥ 45

ఉ॥ కన్నగురుత్వ మొక్కటియుగా మహాజీవిభుఁడందెఁ; 'దండ్రిగా'
రన్న గురుత్వముల్ విలిచినట్టి మహాత్ముఁడ వీవ గాదె! నా
యున్నతిఁ గోరి జీవకళయొడ్డిన నీ హృదయానుభూతి కే
మున్నది మారుతూఁచఁగ గురూ! యొక యశ్రుకణంబు దక్కఁగన్॥

సీ॥ చిరకీర్తి వెలయింపఁ జిననాఁడె నాపేరఁ
దిరముచేసిన 'శివాపురముఁ' జూచి,
నీచేత ననుఁబెట్టి, నిశ్చింత దూరదే
శము లేగు తండ్రి నిశ్చయముఁ జూచి,
నెనరూరి దరిఁజేరి నినుఁజూచి ననుఁజూచు
తల్లి కందోయి చిత్తడినిఁ జూచి,
ననుఁ జూచినంతమాత్రాన విన్ను కనుజోతి
పొదువఁగాఁ బదరు నీపెదవిఁ జూచి,

తే॥ గీ॥ యిందుఁ జారాడు చీమయే నెఱుఁగలేదె
నిబిడ వాత్సల్య కల్యమా నీ యెడంద!
మనసు సుడిసిల్లఁ బెరదారిఁ జనితినేమొ!
తప్పుగొనకుము తండ్రి! యాదరము విడకు!॥ 47

చ॥ ఇపుడుగదయ్య కంటి నిటు లీకృశియించిన నిన్ను - నిన్నశ
క్యపు వెతకీడ్చు నీదు హృదయవ్యథ: యింతకు వచ్చుదాఁక నె
య్యపువిస మిట్లు మ్రింగి, వెలయందని జీవిత మొగ్గఁబట్టి, పా
పపుబరు వెత్తుపూనిక- తగవా, యపుడే నను మార్పఁగూడదా?॥

మ॥ గురుజీ! మన్ననఁజూడు మిప్పుడయినన్, గొండంత నాదోస మే
పఱి గోరంత యనుగ్రహింపు; ముదయ ద్వాత్సల్య పీయూష శీ
కరము ల్వోయుచుఁ బెంచు నీపెరటిమొక్కన్ ముందుగా వాడకో;
మ్మురగాధీశ ఫణాగ్ర జీవమణి డాయున్ నీవు కాంక్షించినన్॥ 49

చ॥ నవయకు తండ్రి! నా హృదయనాడుల సత్వము నప్పగింతు; నైం
దవ కళవోలె నీ మొగమునన్ వెలుఁగాడిన నంతెచాలు; నా
యవినయమున్ క్షమింపు" మనియాడుచు దోయిటఁ బాదమంటు నా
శివు దరిఁజేరఁగాఁ దిగిచి, చేఁపినకన్నుల నాతఁ డిట్లనెన్॥ 50

మ॥ "శివజీ! యూఱకుము; మేల యిట్టి సెగలన్ జిత్తోపతాపంబుఁ గం
దువు? నీచేసిన నేర మున్నదె? జరన్ దూపిల్లి, నానాఁటి కి
ట్లవసన్నం బగుచున్న దీతనువు: హెచ్చౌచున్న దీరాజ్య: మీ
యవకాశంబున నండ లేవయితివం చాసాస నల్లాడితిన్॥ 51

ఉ॥ ఇప్పటి రాజకీయముల నేఁదలపోయుచు, నీను కర్జమున్
దప్పఁదలంచియుంటి; వితత స్థిర చిత్తుఁడ వీవు కాలమున్
గప్పుచు, నాత్మశక్తి మెదుగం బొదిగించితి వుద్యమంబు; నీ
గొప్పకడంక దైవమునకున్ మనసంటెనదాట కన్పడున్॥ 52

మ॥ కుల శీలంబులు జాతి నీతి మతముల్ గో దేవ భూదేవతల్
కలఁగంబాఱఁగ, నార్యధర్మములు బ్రుంగన్ దూలుదేశమ్ము - ముం
దల మూపున్ మొగియించి పూనఁగల స్వార్థత్యాగులౌ దేశబం
ధుల నాహ్వానము సేయుచుండఁగ, సమర్థుం డెట్లు కాలాఁగెడిన్!॥ 53

ఉ॥ మంచిది, నాయనా! యుచితమార్గమునన్ గొని దేశలక్ష్మి లా
లించుట మంచి; దైనఁ, గదలించిన తేనియ తెట్టెఁ బూర్తిగా
వంచినదాఁక, నేమరక పాయక ప్రాపుఁ దొలంగిపోక సా
ధించుము; లేనిచో నదవదించుఁజుమీ మధుపాళి రేఁగినన్!॥ 54

ఉ॥ నీ నెఱవాదితీరు గమనించిన, నిప్పటి రాజకీయపుం
దోనియ నేర్పుమై దరికిఁద్రోయఁగఁ జాలినదిట్టవంచు నా
మానస మూఱటన్ గొనియె; మన్నుము దక్షిణ హైందవోర్విఁ, బ్రా
చీన పరిష్కృతిన్ బొరుగుచేతులు దాఁకినమచ్చ వాయఁగన్॥ 55

ఉ॥ ఒక్కటిమాత్ర మేమఱకు - మూఁదరఁగొల్పు పరాశ్రయంబునన్
గుక్కిలుమ్రింగి, దేశరమఁగోరి తపించెడు నీకుతండ్రి; నీ
మొక్కలమెంచి, యీ యవనభూపులు పైకొనిరన్న నెప్పు డే
చిక్కులు మూఁడునో! కనులు చేడ్వడఁ గాటుక దిద్దు టొప్పునే!॥ 56

చ॥ మొలపని దంట్వై యెడరు మ్రింగుచు, నంతటఁ గన్ను వెట్టి నీ
తలఁపు జయింపు; మిందనుకఁ దాల్చిన నాబరు విప్పు నీపయిన్
నిలిపితిఁ; దండ్రికిన్ బ్రజకు నీకును నుత్తరవాది వౌచు, దో
యిలిసరి విత్తులన్ గొలిపి, యిండ్లను బండ్లను బంటఁ గొల్వుమీ!॥ 57

మ॥ శివజీ! నాతుదికోర్కి,— నీవు వితత శ్రీశాలివై ప్రాజ్య హైం
దవసామ్రాజ్యము నేలుఁనాడు నవరత్న స్వర్ణ సింహాసనో
త్సవమున్ దీరిచి, దీవనల్ గురిసి మోదం బందులే: నాటివై
భవ మీకన్నులు నోఁచెనే! యిపుడ సంభావింతు నాకోరికన్!”॥ 58

తే॥ గీ॥ అనుచు దాదోజి శివరాజు నంకపీఠిఁ
జేర్చి, వంచిన శిరముపైఁ జేయి సేర్చి,
చిత్తమున నిండి కన్నులఁ జిందు హర్ష
శీకరమ్ములఁ బట్టాభిషిక్తుఁ జేసి॥ 59

సీ॥ బహువిధోపాయన పాణులై తమయాజ్ఞ
వలచు సామంతమండలముఁ జూపి,
సేవకుఁ డాదిగా సేనాధిపతిదాఁకఁ
గలుగు నుద్యోగివర్గములఁ జూపి,
హస్త్యశ్వ రథ పదాత్యాదిక చతురంగ
భరిత రాజ్యాంగ సప్తకముఁజూపి,
నాగర పౌర జానప దాటవికు లాది
తనయేలుబడిఁ బ్రజాతతినిఁ జూపి,
తే॥ గీ॥ “ఇదియు శివరాజ! నీదు పైతృక ధనంబు
నీవు మనుపఁగా బలుపొంది, నిన్నుఁ గొలువ
వేచియున్నది: ధర్మోపవీత దీక్ష
నరయుమీ!” యంచు సర్వస్వ మప్పగించె॥ 60

ఉ॥ పండిన తెల్వితోఁ గమియఁబండిన స్వానుభ వాత్మశక్తులన్
నిండిన చూపులన్ - గనులనిండు ముదశ్రులు నిగ్గుదేరి యీ
రెండలుగాయ, ఱెప్ప సాగియించి శివున్ మొగమంటఁజూచి, పూ
జ్యుండగు ఖాండదేవు మదియోడిగిలన్ దుదిపల్కు లిట్లనెన్॥ 61

తే॥ గీ॥ "నిజము, శివజీ! భవాని విన్పించుపలుకు
నిజము; తనకుఁదా నవి తోఁచు నేఁడో రేపొ!
అఱగొఱలు దీరినవి నాకు: హైందవోర్వి
నుదయశోణిమ వెలుఁగుచున్నది కుమార!॥ 62

శా॥ నాకై చేయఁగ నేమియున్ వలవ, దన్నా! భారతక్షోణి - కా
ఱాకుల్ డుల్లఁగ లేఁజివుళ్ళ రమణీయంబైన కల్పాగమం
బై కల్యాణము లందగించవలె: నీ యాదాత్త్య మొందున్ వసం
తాకల్పమ్మునఁ గప్పఁగావలెఁ, గుమారా! యింతకాంక్షించితిన్॥ 63

చ॥ 'ఒకపరి ఖాండదేవుఁడు గుహూత్తముఁ డీశివరాజు' కంచు, మా
మకచరితంబు నీ విజయమంగళ నాటక పూర్వరంగ మా
టకుఁ దగె; నాయకుండు ప్రకటంబుగ రంగమునెక్క సూత్రధా
రకుబలె భూమికాంతర పురస్కృతికై తెరచాటు కేగెదన్॥ 64

మ॥ శివజీ! నా కరణీయమెల్ల సమసించెన్: మేను జీర్ణించె: నీ
యవతారమ్ము ముగింతు; నీహితము (జేయం - జేతనామాత్ర జం
తువనై నీవెనువెంట నుండెద: గురుండున్ మంత్రియై నీకుఁ గా
ర్య విధానం బెరిగింతు: బ్రాహ్మణుఁడనై యాశీస్సులన్ బోసెదన్॥

ఉ॥ † ఏమఱఁబోకుమీ! సుర మహీసుర గో మత దేశ రక్ష: సుం
తేమఱఁబోకుమీ! హితము నెంచి తపించెడు మాతృదైవ: మెం
దేమఱఁబోకుమీ! మదిలయించిన నీ కులదైవతమ్ము: వ
త్సా! మఱపించు పెట్టితెఱఁగైననూ నేమఱఁబోకుమీ విన్మన్॥ 66

† "He (Dadoji) exhorted Shivaji to look after his family and

తే॥ గీ॥ అదరు బెదరును లేని నెమ్మదులఁ బొదలి
హైందవజగమ్ము నీకుఁ దోడౌనుగాక!
భరతమాత దీవనపూలు గురియుఁగాక!
గెలుపుమీ వత్స! నే నింక సెలవు గొందు!"॥ 67

చ॥ అను తుదిమాట లొం డొకటియై, కనుఁగొల్కుల నీటిబుగ్గతో
మునుకొని జాఱుచుండ, శివు మో మెడఁబాయని నిల్వుచూపుతోఁ
గనుఁగవ మూసె నస్తమయకాల రవింబలె ఖాండదేవుఁ; డా
ఘనుఁ దలపోసి రెల్లరును, గన్గవదోయిట నర్ఘ్య మెత్తుచున్॥ 68

చ॥ కవిసిన చిమ్మచీఁకటి జగమ్మునెఱుంగని తత్కుటుంబమున్
దవిలిన నెవ్వగన్ బనవు తల్లినిఁ దక్కినవారి నూఱడిం
చి, వగ నడంగి సొమ్మసిలు చిత్తముఁ దేఁకువ నూలుకొల్పుచున్
శివపతి నిర్వహించె గురు శిష్యవిధిన్ బరలోక సత్క్రియల్॥ 69

శివాజీ చాకణు, సుపా, సింహగడము, పురందరు లోఁగొనుట.

ఉ॥ కొన్నిదినంబు లిట్లు లొనఁగూడిన కాఱియఁ బాయఁ జోపి, సై
కొన్న విభుత్వమం దదనుగొన్న పనుల్ దగనిర్వహించి, యా
సన్న హితానుయాయి జనసమ్మతి మంతనమాడి, చేయఁగా
నున్న సముద్యమంబుఁ దలయొడ్డుచు ముందుకుఁద్రోయ నున్నెడన్॥ 70

ఉ॥ "జాగిరురాబడిన్ నిలువసల్పిన రొక్కముఁ బంపు" మంచు, షా
జీ గురు ఖాండదేవునకు సేవకులన్ మునుపోలెఁ బంపె; న
వ్యాగమ రాజ్యకార్య ఘటనాతురుఁడై శివరాజు ముందు బా
గోగుల నాకళించి, సమయోచిత ముత్తరమిచ్చె నీగతిన్॥ 71

---

dependents and expressed a cordial wish for his happiness and glory and the fulfilment of his noble vow to inaugurate a new state for the protection of cows and Brahmans and [illegible] glory of his religion." [illegible] *Talakhav*

మ॥ "మన దాదోజి గతించె; జాగిరుపనుల్ మా కెందుకున్ గ్రొత్త; లీ
మన సామంతులకీతి యెట్లవునొ! సమ్యగ్భాండమూ లేదు; మా
పని సేనా చతురంగసంపదలఁ గూర్పన్ దీర్పనై యుండెఁ; గా
వున మీరే యొకకొంత పైకమును బంపుం డేము కాలూఁదఁగన్"॥

చ॥ అని బదులిచ్చి సేవకులనంపి, నిజోద్యమ సాధనైక దీ
క్షను దనయేల్బడిన్ గలుగు జాగిరుదారుల దుర్గనాథులన్
దన యధికారముద్రికఁ గొనన్ - దన యుద్యమ మామతించి కై
కొనఁ బిలిపించె; నందఱును గూడి భజించిరి స్వామిభక్తులై॥ 73

సీ॥ ప్రాంత 'చాకణు' దుర్గ పతి, 'ఫిరంగోజి న
ర్సాళా' యనెడు మహాసత్త్వశాలి,
దాదోజి శివునకుఁ దండ్రి జాగిరు లప్ప
గించినవిధ మాలకించి, తాను
సముచి తోపాయనోత్తమ లాంఛనములొప్పఁ
జనుదెంచి రాజ దర్శనము సేసి,
తండ్రికాలమునుండి తమచేతనున్న దు
ర్గాధిపత్యము భక్తి నప్పగించె;
తే॥ గీ॥ స్వామిభక్తికి ధార్మిక స్థైర్యమునకు
గుఱుతుగానున్న యతని సద్గుణము మెచ్చి,
గారవమునిచ్చి, పూర్వాధికార మిచ్చి,
చనవుఁ బెనయుంచి శివవిభుం డనిపె నిల్లు॥ 74

ఉ॥ "చాకణు దుర్గనేత నరసాళ్వకులుండు 'ఫిరంగజీ' - పరా
నీకము లొడ్డనేనియు గణింపని శూరుఁడు, స్వామిభక్తియుక్
దేఁకువ తెంపునున్ గలుగు ధీరవరుం" డని. ఖాండ దేవుఁడే
మా కెఱిఁగింప వింటిమిస్తుమా! భవదున్నత వర్తనంబులన్॥ 75

మ॥ ఒక దుర్గాధిపతిత్వ మిచ్చుటయ గా, దో వీరశార్దూల! మా
మక రాజ్యంబున నాల్గుమూలలఁ జరింపన్ - బెంపు సాధింపఁ బూ
నిక మీపైఁ గల; దేను హైందవధరా నిర్ద్వంద్వ సామ్రాజ్యమా
లిక యర్పింతు భవానికి; కచ్ఛమణు లోలిన్ మీరు గూర్పన్ వలెన్॥
తే॥ గీ॥ చిర తపోభూమి శివనేరుశిఖర మెక్కి-
యాడు 'మొగలు బావుటా' నూడఁదీయు;
మిదియనుమ్ము - నీకునునాకు మొదటికాన్క-;
శూరుఁడా! పొమ్ము, జయముతోఁ జూడరమ్ము!"॥ 77
చ॥ అని సరదారులెల్ల 'రిదియౌనని మెచ్చఁగ ముచ్చటించి, యా
తని నుచితాంబరాభరణ దానములన్ దనివొందఁజేసి యొ
య్యన సెలవిచ్చి పంపి, తదనంతర కార్యవిధాన ధోరణీ
సునిశితుఁడౌచుఁ, దన్గొలువఁ జూడని వారల జాడలన్ గనెన్॥ 78
సీ॥ సవతితల్లికి నన్న, పాజీమఱంది, 'బా
జీమోహితే' సుపాత్రీతివిభుండు,
తనయాన కొగ్గఁజాలని రీతి - సతనివ
ర్తనముచే నెఱిఁగియుఁ గినుకమాని,
తగినమర్యాదఁ 'బందుగువిందు గుడువఁగా
విచ్చేయు' మని వానిఁబిలువనంపి,
యప్పటి రాజకీయములెల్ల వినిపించి
మన్నించి బోధించి మందలించి,
తే॥ గీ॥ యెంతసెప్పిన విన కుడాయించు నతని
సర్వధనముల ముహ్నూరు వార్వములను
గోశమునఁ జేర్చి, తగు సేవకులను దోడు
పనిచి, 'చావను జూడఁజా' వన్నమాట [illegible]

ఉ॥ ఈవిధిఁ దోరణాగడము నేలెఁ గాని, చాకణుఁ జేతఁబట్టి, సూ
పా విభుఁ దోలుచుణ్, శివనృపాలుఁడు సింహగడమ్ము లోఁగొనణ్
భావముఁ గొల్పి, తాఁ జతురుపాయములణ్ నడిపించు దంట యౌఁ
గావున దుర్గనాథుమదిఁ గైకొనె, రొక్కము లాసఁగొల్పుచుణ్॥ 80

తే॥ అచటి యావనసేనానియై - నవాబు
పనుపుఁ గొనియున్నవాఁడు ద్రవ్యమున లొంగి;
యనువుగా సింహగడదుర్గ మప్పగించి,
తనకుటుంబముతోఁగూడఁ దరలి చనియె॥ 81

సీ॥ ఘన పురందరదుర్గమును 'నీలకంఠహై
బతరావు' పాలించు: నతఁడు ప్రజలఁ
గరుణింపఁడని, యొకకారణంబునఁ దన
నెలఁతనే త్రుంచెన న్నింద గలదు;
మరణించె నతఁడు - కుమారులుముగ్గు రా
గడము నేల్బడిఁ బెనంబడుచు నుండి:
రం దగ్రసుతుఁడు పురందరదుర్గాధి
పతియౌచుఁ దమ్ములఁ బారనడఁచె:

తే॥ ననదలై వారు శివునిసాయంబుఁ గోర
నచటి విధమెల్ల శివవిభుం డరసె నిట్లు
"తండ్రివలె వీరు వ్యర్థు, లాదరము లేదు
ప్రజకు వీరిపై: నదిలేని ప్రభుత యుఱవె!॥ 82

ఉ॥ వీఱిఁడి యన్నగాని, వెఱవీఁగిన తమ్ములుగాని - చల్లఁగాఁ
దీరుపఁజాల రేల్బడి: మదిణ్ గమనించు నవాబు మెల్లఁగాఁ
దూఱకపోఁడు దీన: నిటు దూరమునణ్ గల చిక్కు - ప్రక్కలోఁ
జేరిన వీరికిణ్ మనకుఁ జేటగు - నిట్టిది మాన్పు టొప్పదే!॥ 83

మ॥ మనజాగీరులఁ దూర్పుమండలము లోమర్ సైన్యముల్ నిల్పఁజా
లిన దుర్గంబులు లేవు: శత్రువులఁ దూలింపంగ దుర్గాశ్రయం
బనురూపంబు: పురందరం బొకయసాధ్యంబైన దుర్గంబు: దీ
నిని వీరిఁ మనవైపు చేర్చుకొని సంధింతుఁ నిజోద్యోగముఁ"॥ 84

చ॥ అని తలపోసి, వారికొఱకై పయనంబును వెల్లడించి, న
మ్మిన సుభటాళి త న్ననుగమింపఁ బురందర దుర్గమేగి, య
య్యనుజుల నగ్రజుఁ గలిపి యందఱకుఁ దగుమాటలాడి, నె
మ్మనము కలంకఁబాప సుకుమారముగా శివభూపుఁ డిట్లనెఁ॥ 85

శా॥ "అన్నా! దుర్గవిభుత్వ మేమి సుఖమా? యద్దానికై మీరు మీ
కన్నుల్ గ్రుచ్చుకొనంగనేల? పెరపోకల్ పోయి - ప్రేమామృత
స్విన్నంబౌ నొకమాతృగర్భమును విచ్ఛేదించి, దోయిళ్ల న
న్నన్నా! నెత్తురుద్రావనేల? మనలోనా యిట్టి పోరాటముల్!॥ 86

చ॥ సమయముఁజూడుఁ - డొక్కపిడుచఁ గబళింపఁగ వేచియుండె దే
శము సకలమ్ము యా వనవిశాంపతికేతన; మీ కుటుంబవై
రము లిటునైపు రేఁగినఁ - బరస్పర విశ్లథ సంధిబంధమై
సమయుదె జాతి నీతి మత సర్వధనమ్ముల హైందవం బిఁకఁ?॥ 87

ఉ॥ ఈ విపరీతమెల్ల మదినెంచి తెగింపుచు, నే స్వదేశల
క్ష్మి విజయోద్యమంబుఁ బరికించితి నీగతి; నొక్కఁ డెవ్వఁడే
మోవఁగరాని భారమిది; ముందల యొడ్డుచు, మీరు మేమునుఁ
బ్రోవులు ద్రొళుతొచు, బలుపుఁ గెలుపుఁగొనఁ దోడ్పడఁ వలెఁ॥

మ॥ 'ఇది యేదో కఠుదుర్ఘటంబు - తరమానే దీనిసాధింప' నం
చెదమాఱఁ బనిలేద; యన్నిటికి నేనే ముందుగానుండు: నా
యదుపుంగూడ ఘటింతు దుర్గమున సైన్యంబింత కాపుంచి: యే
తొడజే కేలుఁడు మీకు మీయాధరణి; కందుఁ గొందు మీసాయమును॥

ఉ॥ ఇంనువసించి ప్రాంతముల నేలెడుఁగా కితఁ డగ్రిజుండు; మీ
కుం దగుజాగి రిత్తుఁ గయికొండు; మనుద్యమమును మేలుచే
యంది, పురందరమ్ముగడమందలి నా బలఁగమ్ముతో స్వరా
జ్యాంచిర పెంపుసేయుఁ; డిదియే మనకుం గరణీయమై తగుం"॥ 90

చ॥ † అనివచియించి, వారు హితులై భజియింపఁగ - నంనుఁ దమ్ములం
దనకొలువంనుఁ జేర్చి యుచితమ్ముగు జాగిరులందఁజేసి, య
న్న నచటి ప్రాంతభూములకు నాయకుఁ జేసి, పురందరమ్ముపైఁ
దనమపతాక నిల్పి, సుహితక్రముఁడై శివుఁ డేగ వీటికిన్॥ 91

సీ। పూనా సుపా యిందపూరు బారామతి
నాఁ నొప్పు నాల్గుమండలములైన
తండ్రిజాగిరులందుఁ దనయేలుబడి నిల్పి
ప్రాంతదుర్గములు లోఁబడఁగఁ జేసి
యాదిలుషాహిరాజ్యమునంటు దొలఁగించి
సర్వాధికారమ్ము సాగఁజేసి,
కాల్బలంబును దురంగబలంబు నెసకొల్పి
యాయుధసామగ్రి నలవరించి,
తే॥ యైకమత్యంబు ప్రభుభక్తి యమరఁ - బ్రజలు
తనకుఁ దోడ్పడునుత్సాహ మెనయఁజేసి,
భట సుహృత్కోశ దుర్గాది బలము వెలయఁ
బ్రథితుఁడై స్వోద్యమము శివప్రభుఁడు నడిపె॥ 92

---

† The Naick's retainers, "all faithless and disorderly men," were expelled and a Mavle garrison was placed there by Shivaji. Page 40. *J. N. Sarkar.*

† The three Naik brothers got the hereditary watan (the eldest brother Nilo Nilkanth had the senior rights) of Naickship and Inam villages. It was settled that they should remain below the hill and serve the king.

Page 167. "Shiva Digvijayam" *Sabhasad.*

శివాజీ మతభక్తి - తుకారాముని యుపదేశము.

ఉ॥ దైవము సాయమై యమృతధారలు వోయఁగ, రాజ్యలక్ష్మికిన్
జేవలు గూర్చినట్లె మతసిద్ధికిఁ ద్రోవలు దీసి, పాదులన్
దీవలఁ బెంచు మాలకరితీరున నాత్మమతంబుఁ బెంచె మే
ధావి శివుండు, సాధువులు తన్మతబీజము లెందు నాటఁగన్॥ 93

సీ॥ పాండురంగని సేవ భవబంధ మూడ్చు పా
వనుఁడు తుకారాము భక్తవరుఁడు,
విజ్ఞానకిరణ వివేచిత సదసత్ప
దార్థతత్త్వుఁడు రామదాసయోగి,
భారతామ్నాయంబు వ్రాసి, ధర్మపథంబు
నెసకొల్పు భక్తముక్తీశ్వరుండు,
ప్రజలలో భక్తితత్పరత జాతీయభా
వముఁ గూర్చు వామనపండితుండు,
తే॥ మొదలుగా సాధువులు శివుపూన్కి నెఱిఁగి,
యల మహారాష్ట్ర మన్నిమూలలను దిరిగి,
స్వమతసందేశ మెల్లెడఁ జాటుచుండి,
రమృతములు వాఱ - భక్తిగేయములు మీఱ॥ 94

చ॥ తనదు మహౌదార్యమంబు సుహితక్రమతన్ వెలయించి, భక్తిబో
ధనముల సంఘశక్తి వితతం బొనరించు మహాత్ములా తపో
ధనులను బిల్వఁబంచి, సముదార సపర్యల సత్కరింపుచున్
ఘనుఁడు శివప్రభుండు సమకట్టె నఖండ మతప్రచారముల్॥ 95

తే॥ ఒకపరి, మహానుభావుఁ డనూనభక్తి
పరిణతుండు తుకారాము - తెరువువెంటఁ
బ్రాంత 'లోహాదుర్గముఁ' జేరవచ్చు టెఱిఁగి,
భక్తి గదురఁగా శివుఁ డిట్లు వార్తనంపె॥ 96

సీ॥ "మా 'పునా' ప్రాంత 'దేహూ' పట్టణము నీకుఁ
　　బురుడుదీర్చుటఁ బుణ్యభూమి యయ్యె,
సాంద్రోదపూర మీ 'యింద్రాణి' యలలలో
　　నీభవ్యకవిత ధ్వనించుచుండె,
నాబాల గోపాల మన్నినోళ్ళుల నీ 'య
　　భంగ' గేయము లూటఁబాఱు చుండెఁ,
బాండెమ్మఁజఱచి మా పాండురంగస్వామి
　　నీగీయుగీటుల నిలిచియుండెఁ,
తే॥ దొంటి ధ్రువుభక్తి ప్రహ్లాదు దొడతనము
　　నీదుసేడల నిజముఁ గాన్పించుచుండెఁ.
　　బరమపురుషా! శివాజి మీపాదసేవ
　　వేచియున్నాఁడు - మిముఁ దొంగిచూచు కనుల"॥　　97

తే॥ అనుచు లిఖియించి, బహువి ధోపాయనముల
　　రాజ లాంఛనమ్ములఁ దుకారాముఁజేర్చె;
　　భక్తి భాండారమున లోటువడని యతఁడు
　　కాన్కలంటక యిటు లొక్కకమ్మవ్రాసె!　　98

మ॥ "శివరాజా! భవదీయ భక్తివినయశ్రీ మోదముం గూర్చె నా
కు; విధేయుండవు మాతృభూమిఁ గొలువన్; గో దేవ భూదేవతో
త్సవ సంధాతవు; దర్శన మ్మడుగు నీ తాత్పర్యముల్ ద్రోయరా;
దవ్వైనన్ మఱియొండు వల్కెదఁ, గుమారా! వేఱు గాఁబోకుమీ!॥

చ॥ కాలము చేరువై, గహనకల్పము సంసృతి దూరమై, దయా
శీల శమాది మానసికసిద్ధుల సర్వము విస్మరించి, శ్రీ
లోలుని దివ్యమూర్తి యవలోకన సేయఁగనున్న నాకు భూ
పాలుర కొల్వులేల? వటుభాగ్యము భోగ మదేల పుత్రకా!॥　　100

ఉ॥ బూటకమాడి రంగులను బూయుచుఁ దీయుచు, రాజకీయపు
న్నాటకరంగ మెక్కుటలు నాకు రుచింపవు తొల్తనుండి; బా
హాటముగా మురారి చరణాబ్జ మరందము లాను తేటినై
పాటలు పాడుకొంచుఁ, జొరఁబాఱుదుఁ బుణ్య సరిద్వనంబులన్॥

ఉ॥ కావున నాయనా! బయలుగాలికి వేచిననన్నుఁ గొల్వకుం
దే వల; దెందు నేఁ జనిన నీకును నీప్రజ కాయురున్నతి
శ్రీ విభవంబులన్ దలఁతుఁ; జేరుము నీ విఁక రామదాసు; మే
ధావి యతండు కృష్ణపరతత్త్వము పార్థునకట్లు నీ కగున్॥ 102

ఉ॥ మా వలె నీవు నిశ్చలసమాధుల దైవ పదద్వయీ రహ
స్సేవలఁ గాలమున్ గడపఁజెల్లదు: బల్లిదులైనవారిచే
నావిల మౌ జగంబు నరయన్ రవివంశమునన్ జనించు ల
క్ష్మీవిభు నంశ మీవు; తెలిసెన్ జుమి మా కిది సాధుబోధలన్!॥ 103

ఉ॥ క్షత్త్రియమౌళి వౌట నయశాస్త్రము శస్త్రముఁ గేలఁ బూనుచున్
బాత్రు లపాత్రులౌ జనులఁ బాలనసేయఁగఁ బారఁదోలఁగా
సూత్రము నీకుఁ జెల్లినది; చూడుము శక్తులు మూఁడుఁగల్వి; తౌ
ర్య త్రిక మేళనం బగుఁగదా పరిపాలన సంగతశ్రుతిన్!॥ 104

ఉ॥ హైందవధర్మ మిప్పుడు నిరాశ్రయమౌచుఁ, బరాధికార వి
స్పందితమయ్యె; సాధు బలసంహతి చాలదు; క్షత్త్రియోచిత
స్యందన మెక్కి లావు వెరవంది కడిందిగ మోహరించి, దా
నిం దిటవందఁ జేయు, మిది నీవిధి; తక్కినవెల్ల వేఁడుకల్॥ 105

తే॥ గీ॥ కనులు మొగిడించు ధర్మచింతనముతోడఁ
గడఁగు కార్యమం దేమఱుపడఁగ వలదు;
వలదు ననుగూర్చి తలఁపు, నే నెలవుఁగొందు;
శివపతీ! నీ కభీష్టార్థసిద్ధి యగుఁగాత!"॥ 106

చ॥ అని లిఖియించి యుత్తరము నంపుచు, నాదరమార దేవతా
ర్చనమునఁ బూలు కుంకుమ లసక్తులసీదళమాల కమ్మతో
ననిచె; శివుండు భక్తిమెయి నన్నిటిఁ గన్నుల నొత్తికొంచు, మౌ
ళి నుదుటఁ జేరెద న్నిలిపి, లేఖఁబఠించి సముత్సుకాత్ముఁడై॥ 107

ఉ॥ "ఆయును గామముల్ తొలఁచికట్టి మహాత్ములు గాంకో తుకా
రాములు! నేఁడు నాయెడకు రా రననేటికి - వారు సచ్చిదా
రాములు! తన్నిదేశము తెలుంగున ధీనిధి రామదాసు నా
స్వామిగఁ గొల్తుఁ: గొల్తు నిరపాయ పథమ్ముల దేశభాగ్యముల్॥ 108

చ॥ ఇది యొకదైవశాసనము: యిప్పటి పెద్దలకెల్ల సమ్మతం
బిది యగు తీర్పు డెల్: స్వజనులెల్లరుఁ దోడ్పడుచుండి రింకు: న
భ్యుదయము దోఁప దుర్గచయ మొండొకఁడై మనచేతఁ జిక్కు: నీ
యద నుడివోని తెంపు తిరమై, పరమండల మాక్రమించెదన్"॥ 109

శివాజీ సైన్యసన్నాహము - ప్రథమ దండయాత్రా విజయము.

చ॥ అని తలపోసి, దైవపరమారతి దేశపరమ్ముగాఁగఁ జే
కొని, గురుపాలు డెందమునకున్ దలమీఱెడు పొంగు మ్రింగుచున్
ఘనతర కార్య నిర్వహణ కర్కశుఁడై, శివరాజు సర్వసా
ధన చతురంగ సైన్యసముదాయములన్ సమకూర్చె నత్తఱిన్॥ 110

ఉ॥ ఆదర మింతచూపని పరాశ్రయణమ్ము దలంచి, తండ్రిమ
ర్యాద హితమ్ముఁజూపు శివరాజుపరామరికన్ గ్రహించి, ని
త్యోదయ మందుచున్న స్వమతోద్యమమున్ దలపోసి చేరి, రా
యా దెసనుండి పెక్కురు సహాయులునై శివరాజుకొల్వునన్॥ 111

ఉ॥ చేరినవారి ధీబలము శీలము సాహస విక్రమ క్రమో
దారత సత్కులీనత మత స్థిరరక్తియు దేశభక్తియున్
గారవ మాది యోగ్యతలు గన్గొని, యర్హపదంబు లిచ్చి స
త్కారము లిచ్చి, యంద అవధానమునన్ దనుఁగొల్వఁ జైకొనెన్॥

సీ॥ బ్రాహ్మణోత్తములు, - నీరాజి దత్తాజి య
ణ్ణాజి రావ్‌జీ రఘునాథపంతు;
ప్రభువంశభవులు, - మురారిబాజీప్రభుం
డాజిమస్సహుఁడు బాలాజియవజి;
మావళాజాతిసంభవులు, - నేతాజి యే
సాజి సూర్యాజి సాంభాజికవజి;
స్వకులబంధువులు, - నింబళుకరు, మోహితే,
మోరేలు, యాదవ, ఘోరపటులు,
తే॥ గీ॥ నాదిగా వీరయోధు లేకైకశూరు
లనుపమ త్యాగశీలు రేకాంతహితులు,
దేశకల్యాణ సిద్ధ్యంత దీక్షఁ బూని,
శివపతినిఁ గొల్చి రార్త్విజ్య మవధరించి॥ 113

సీ॥ ఆబాల్య పరమాప్తుఁడగు 'శ్యామరాజపం
తును' మహామాత్యుగా నొనరఁ జేసి
దీపితోత్సాహు 'మోరోపంతుపింగళే'
నఖిలసేనాధినాయకునిఁ జేసి,
'బాజీఫసల్కా' 'రఘ్నాజిసోణ్‌దేవుల'
బహిరాక్రమ చ్చమూపతులఁ జేసి,
'నేతాజి' 'నేసాజి' నాతత మావళా
తురగ పాదాత నాథులను జేసి,
తే॥ 'సూర్యజీ' 'తానజీ' యను శూరవరుల
జంటఁబాయని యంగరక్షకులఁ జేసి,
యనఘు 'దత్తాజి' రాజగృహాధికారి—
నాంతరంగికు 'బాలాజియవజిఁ' జేసె॥ 114

తే॥ గీ॥ దక్షిణోత్తర కొంకణ ధరణియుందుఁ
బ్రాంతభూముల నికట దుర్గములయందు
నల బిజాపురరాజ్యమం దన్నిమొదల
వేగ నడిపించి; యచటి బాగోగు లరసె। 115

చ॥ ఇటు శివరాజు సన్నహనమెల్లను బూర్తియొనర్చి, కార్యలం
పటుఁడయి యొక్కనాఁడు హితవర్గముతో సచివాళితో సము
ద్భట నిజ వీరయోధ సముదాయముతోఁ బెనుకొల్వుదీర్చి, మీఁ
దటిజతనమ్ము వారిమెడఁదన్ బురికొల్పుచునిట్లు వాకొనెన్॥ 116

చ॥ గరువపు దేశభక్తిఁ దుదికాఁకలఁదీరిన యోధులార! దు
ర్ధరమగు నొక్కకార్యమున దైవము పూనిచె మిమ్ములమ్ముల; న
ధ్వరములకన్న దుశ్చర తపంబులకన్నఁ బవిత్రి మిట్టిసం
గర: మిట దాస్యమోక్ష ఫలకాంక్షులమై, తెగి పోరఁగావలెన్॥ 117

చ॥ మత మొక దొడ్డసాధనము - మర్త్యులిహమ్ముఁ బరమ్ము నొంద: సు
స్థితిఁ గలిగించు దానికి స్వదేశవిభుత్వము: దానిప్రాపగున్
మత: మిటు రెండు నొండొకటి మన్నెడు; నిష్ఠు పరాధికార దు
ర్గతము మతమ్ము నోమఁదగుఁగాదె ప్రభుత్వముఁ జేతఁబట్టుచున్!॥118

చ॥ ఒకసులతానునో ప్రభుపునో పదమంటి విభుత్వ మందు కో
రిక తగ: దట్లు రాజ్యముభరించుట - బిచ్చపుఁగూడు స్వార్థపా
త్రిక నిడుకొంటగాదె? బెదరింపులఁ బోని స్వత స్స్వతంత్ర జీ
వికి మనసైన నింద్రపదవిన్ గొనుకంటె సుమాళమే యగున్॥ 119

ఉ॥ 'ఈ యవనాధిరాజ బలమే యిల నేలఁగఁబోలు' నంచు దీ
ర్ఘాయువుఁబోసి ముద్రయిడిరా? యదిగాదు; బలోద్యమైక పా
థేయులచేతిసొమ్మది: విధేయములై మనభాగధేయముల్
డాయక పోవునే పెనుకడంక మెయిన్ మొనకట్టినిల్చినన్?॥ 120

ఉ॥ కావునఁ గార్యసిద్ధిఁ గొనఁగాఁ దలఁకక బనిలేదు; సాహస
శ్రీ వెలివోని యుందఱము చేరితి మీఘనకార్యమందు; స
ర్వావయ వాభిరామ చతురంగ బలమ్ములు నిండియున్న; వీ
యావనరాజ్యమెల్ల నుడియఁ గయికొందము దండయాత్రలన్॥ 121

మ॥ మన జాగీరులచుట్టు నీయవన సామ్రాజ్యంబులే ముట్టి పై
కొని యుంటన్ రిపుమధ్య మొప్ప, దొకదిక్కున్ మెట్టి లోఁగొంద మె
ట్లన: నీపశ్చిమవార్ధి హద్దుగొని, సహ్యాక్షోణి సర్వంబు లోఁ
గొనుచో వెన్నుబలంబు గల్గుఁ, బయి మాకోవచ్చుఁ బార్శ్వంబులన్॥

సీ॥ మన కుత్తరంపుదిక్కున మొగలు విభుత్వ
మది బలిష్ఠము, దాని నంటరాదు,
ప్రాగ్దక్షిణముల దూరపుమేర బయలొట
నట బిజాపురరాజ్య మనువుగాదు,
నైరృతిమూల నర్ణవపుటంచుల నున్న
'సిద్దీల' రాజ్యంబుఁ జెనకఁగూడ,
దటువైపు 'కల్యాణి' - యిటు 'తాళ' 'గోశాల'
లదిమి, పశ్చిమమెల్ల నాక్రమింత:
తే॥ మందుఁ గల్యాణి క్రొత్తగా నమరుకతనఁ
జక్కఁబఱుపరు దాని బిజాపురీశు:
లచటి యధికారియును రోగియగు నవాబు
నరసికొను చుండు - నట బిజాపురమునందె॥ 123

చ॥ ఉరియుచునున్న దీకరణి నుత్తర కొంకణభూమి; దక్షిణ
స్థిర 'యబిసీనియా' యవన శిక్షితమాచు, మతాభిమాన ము
మ్మరమగు వారియేల్బడిఁ గకావికలయ్యె: మతావమానపుం
దఱుటుల ప్రమ్గు వారియెడఁదల్ మనప్రాపును దాపుఁ గోరెడున్॥

తే॥ 'మీయ దండెత్తివచ్చిన మేముకూడఁ
దోడుపడెద, మర్పింతుము దుర్గనిచయ'
మనుచుఁ, బంపుచున్నారు రహస్యవార్త
లచటి మనమహారాష్ట్ర దుర్గాధిపతులు॥ 125

ఉ॥ కావున దీనిగెల్చుటనఁగాఁ గడుఁజుల్కన: తజ్జయంబుతో
యావనసేన లీవలకునావలకున్ జనుదారి బద్ధమౌఁ:
ద్రోవలులేని యీ నెలవుఁ ద్రొక్కినచో - మనచేతి బొమ్మలే
కావలెవారు, 'త్రాహి' యనఁగావలె, నీగతి లోఁగొనన్ వలెన్॥ 126

ఉ॥ లెండిఁక శూరులార! కదలింపుఁడు సేనల: నష్టమౌచు బ్ర
హ్మాండము లొడ్డుఁగాక వెఱఁగందకుఁ: డంతటఁ గన్నువెట్టి నే
నుండెద నండగాచి, పయినున్నది మాత భవాని; మీర లు
ద్దండులు - మీవడిన్ బగఱదండులు బెండులుగాక నిల్చునే!॥ 127

తే॥ శూరపుంగవుఁ 'డబ్బాజిసోనదేవు'
'బాజి' మొదలుగా సేనాధిపతులు గొలువ
వెడలుఁగాక మోరోపంతుపింగళుండు!
విందు లిడుఁగాక మనసిచ్చి విజయలక్ష్మి!॥ 128

చ॥ మఱియొకమాట, - మీ రహితమర్దనులై చనునప్డు డెచ్చటన్
ద్వరపడి పేదసాదులకుఁ బైరులకున్ బతిదేవతా జనో
త్కరమున కాలమందలకు దైవత భూసురకోటి కెట్టి దు
శ్చరితము సల్పరా, దొరలుసల్పిన సైనికులరాదు చూచుచున్!॥ 129

తే॥ ఇదిసుమీ దైవశాసనం, బిదియచూవె
రాజశాసన: మిది దాఁటరా దెవండు
ధీరచరిత మహారాష్ట్రదేశమాత
దొడ్డకానుపుల - గజసైన దోషమైన!"॥ 130

చ॥ అను శివరాజునుద్ధురపుటానతి వార్షికమేఘ నిస్వనం
బున వెడలంగ, నుత్సుకత ముట్టి చమూపతులందఱుం జయ
ధ్వనులు ప్రతిధ్వనింపఁ గరవాలములఁ బట్టి జోహారువెట్టి, యొ
య్యన సెలవందుచుం వెడలి రాహవదోహల సాహసంబులం॥

తే॥ బహుళ శస్త్రాస్త్ర సాధనోద్భటత మెఱయఁ
దరలి చతురంగబలము దొంతరలు గొనఁగ,
బారులను దీర్చి సేనాధిపతులు నడువ,
దండు నడిపె మోరోపంతు గండుమిగిలి॥ 132

ఉ॥ ఆ నిరపాయసైన్యము లనంతములై యుపనద్యుపేత గం
గానదివోలెఁ బొంగి, గిరి కానన పత్తన దుర్గవర్గ శా
ఖానగరాదులెల్ల మునుఁగం గొనుచుం జనుచుండ, నందు నెం
దే నొకయడ్డులేక భజియించె జగమ్ము శివప్రభుత్వముం॥ 133

తే॥ 'రోహిడ' 'తికోన' 'కాంగొరి' 'లోహగడము'
'రాజమచి' మున్నుగాఁగ దుర్గముల పతులు
ధన కనక రత్న వస్తు వాహనము లాది
కానుకలిడి కొల్చి రాత్మ దుర్గముల నిచ్చి॥ 134

ఉ॥ కానుకవెట్టి నెయ్యమెసఁగం దమదుర్గము లిచ్చువారి స
మ్మానము మెచ్చి, రోసమున మార్కొనువారి నడంచి దుర్గసం
తానముఁగొంచు సహ్యగిరి దక్కొని, గొంకణభూమి మధ్యమ
స్థానము నాక్రమించె శివుసైన్యము లన్య దురాసదమ్ములై॥ 135

శా॥ ఆరంభోరి జయంబుఁగొన్న నిజ సేనాధీశ వర్గంబుతో
మోరోపంతు వచించె, "నేఁటి విజయంబుల్ శ్రీమహారాష్ట్ర రా
జ్యారంభంబున స్వస్తివాచనములౌ; లా యాదుర్గముల్ పట్టుచో
మీ రంకించిన తెంపు తేఁకువయు నెమ్మిం గూర్చు నా కెంతయుం॥

ఉ॥ వాలుమగంటిమిన్ జికిలివాటిన యీబలఁగంబునెల్లఁ బైఁ
దోలుచు మీరు మే మొకట దూఁకినచో నెమరొప్ప నిల్వఁగాఁ
జాలునె యేకమైనను బిజాపురరాజ్యము? లేనిపోని గ
గ్గోలిదియేల, యేలగజకోటి శశమ్ముల వేఁట లాడఁగన్?॥ 137

సీ॥ 'బాజీఫసల్క' 'రేసాజియుఁ' దోడుగా
'నబ్బాజిసోన్‌దేవుఁ' డరుల ముట్టి
'కల్యాణి' 'మాహులి' గయికొంచు, సర్వమ్ముఁ
గొనవలె నుత్తర కొంకణంబు;
నబిసీనియనుల శౌర్య మడంప - 'రఘునాథ
బల్లాలు' 'నేతాజి' పట్టుగాఁగఁ
జని, నేను 'తాళ' 'గోశాల' లాది జయించి
కొనియెద దక్షిణ కొంకణంబు;

తే॥ చనుఁడు మీ" రనఁ, గల్యాణిజయము గొనఁగ
నడిచె నబ్బాజి బహుళ సైన్యములఁ గొనుచు:
'బోరు' కనుమలోయలు దాఁటి, 'పారు' కనుమ
దరులు వెడల మోరోపంతు దండునడిపె॥ 138

చ॥ మలయుచు సేన 'పారు'కనుమన్ వెడలన్ జన నొక్కచారుఁ డ
త్యలఘు జవంబునన్ దఱిసి, "ఆర్య! బిజాపుర మేగెడున్ నవా
బుల ధనసంచయం బదిగో! ముంగలిగా నటః దానివెంట నే
బలఁగము లేదు, కొంత పరివారముమాత్రము కాపుపోయెడున్॥

తే॥ గీ॥ అధికృతుండు 'మౌలానాయహామ్మ' దనెడు
వాఁడు కల్యాణినుండియుఁ బంపె దీని"
ననివచింప, మోరోపంతు వినియు వినక
మునుపె రఘునాథబల్లాలుఁ డనియె నిట్లు॥ 140

చ॥ "తడయఁగ రాదు: దీనిఁగొనఁ దప్పనుగా: దొకరైతు దీనఁ జే
డ్పడుటయు లేదు: దీని విడువన్ బనిలే" దని విన్నవింపఁ, 'బైఁ
బడు' మనె పింగళుం: డెలుకపైఁబడఁ బొంచిన పిల్లివోలె న
ప్పుడ బలఁగమ్ముతో నతఁడు ముట్టి పయింబడె నార్భటించుచున్॥

చ॥ పెనఁకువ ఘోరమై, యవనవీరులు ప్రాణములొడ్డి పోరి; రా
మున శివసేన కొట్టికదుపున్ గొనెఁ; దద్బలధాటి కోడి యా
వనబల మల్పమై శరణువట్టెఁ బడెన్ జెడెఁ బాఱె; నిట్లు పె
ల్చన ధనలక్ష్మియున్ - విజయలక్ష్మియుఁ గైవసమయ్యె వారికిన్॥

మ॥ రుధిర స్నానము లాడి జీవబలి కోరుం బెట్టుచున్ - గుప్తవా
నిధి సాధించిన యాత్మసైనికుల నెంతే మెచ్చి మన్నించి, వి
శ్లథమౌ దక్షిణకొంకణక్షితిని గెల్వన్ దండు సాగించె, శ
త్రు ధరాపాల విగాహ దోహలుఁడు మోరోపంతు పంతంబునన్॥

చ॥ విజయముఁగొన్న పేర్మి శివక్షీరచమూపతు లేపునన్ జయ
ధ్వజముల నెత్తి కొంకణముదక్షిణమెల్లఁ జరించి, పత్తన
వ్రజములు దుర్గవర్గములు పల్లెలు సర్వము లోఁగొనంగఁ, ద
త్ప్రజలును దుర్గనాథు లతిభక్తి భజించిరి కానుకలిచ్చుచున్॥ 144

చ॥ కలుకు మతాభి మానమునఁ గక్కుఱితిన్ గుడిపించు యావనో
త్కర - మబిసీనియా నృపవితానము మాన్పఁగన, వారిఁ గోత్తలన్
దఱుముచు, నందు హైందవమతమ్ము తిర మ్మొనరించి, దక్షిణ
స్థిరఁ దమరాజ్యసీమలకుఁ జేరిచి రా శివరాట్చమూపతుల్॥ 145

తే॥ గీ॥ సురగడము — తాల — గోశాల — శుద్ధగడము
రైరి — భిర్వాడి — మొదలు దుర్గముల పతులు
స్వమత మోము శివాజి యుద్యమముఁ దలఁచి,
యొప్పగించిరి కోట లత్యుత్సవమున॥ 146

చ॥ శివపతియానతిన్ నిరవశేషముగా నిటు నిర్వహించి, హైం
దవ మత గౌరవమ్ము వితతస్థిరతన్ వెలయంగఁ జేసి, శా
త్రవుల నడంచి దుర్గ నికరమ్ముల లోఁగొని, సర్వవాహినీ
ధవుఁ డతఁ డేగె సైన్యసముదాయముతో శివరాజుఁ జూడఁగన్॥147

ఉ॥ వచ్చిన సైన్యనాథుల సపారముదమ్మున నాదరింపుచున్
దెచ్చిన కానుకల్ ఘనమణి ప్రముఖంబులు చిత్తగింపుచున్
జొచ్చిన కార్యమందుఁగల చోద్యములన్ విని నుత్సహింపుచున్
జెచ్చెర హెచ్చరించు శివజీఁ గని, పింగళుఁ డిట్లు వాకొనెన్॥ 148

మ॥ "తమయాజ్ఞన్ శిరసావహించి, జయయాత్రా సంభృతోత్సాహ దు
ర్దమ సైన్యంబులు వెంటరా - నికట దుర్గశ్రేణి లోఁగొంచు, స
హ్యా మహీభృ త్కటకంబు లెక్కితిమి; పై నబ్బాజి సోన్దేవు సై
న్యముతోఁ బంపితి నుత్తరమ్మునకుఁ గల్యాణీ జిగీషారతిన్॥ 149

ఆ॥ తక్కిన సేనతోఁ గదలి దక్షిణ కొంకణ భూమిఁ ద్రొక్కి చో
నొక్కటఁ గంటఁ బార్కనుమయొద్ద బిజాపురమేగు రొక్కపుం
బొక్కస; మింతలో మనచమూపతు లా ధనరత్నకావళిన్
గ్రక్కునఁ దోలి, కైకొని రఖండ బిజాపుర రాజ విత్తమున్॥ 150

మ॥ అటుపై దండుఁగదల్చి యుద్ధురత నాయాప్రాంతముల్ గొంచు, న
చ్చట నేపా 'నబిసీనియా' యవన రాజశ్రేణి దండించి, త్రో
క్కటవాయన్ మత జాతి గౌరవముఁ జక్కన్నిల్పి, యందందు ను
త్కట దుర్గమ్ములఁ గొంచు వచ్చితిమి వేడ్కన్ మిమ్ముదర్శింపఁగన్.

తే॥ గీ॥ అచటి ప్రజలెల్లఁ దమయాజ్ఞ నామతించి,
రివియు వారువా రందంద నిచ్చు కాన్క"
లనుచు వేర్వేఱఁ జూపించి యప్పగించి,
వినయమూర మోరోపంతు వినిచె మరల॥ 152

శా॥ "దేవా! దేవరయాన మీఱ, మొచట్ దీంద్రించుచున్ గో వధూ
దేవ బ్రాహ్మణ హానిసేయుము, ప్రజార్తిం గూర్చు; మిట్లైనఁగా
ర్యావాప్తిన్ దుది రక్తపాత మనివార్యంబయ్యె నీబాకసం
బావర్జింపఁగ: ఖడ్గధారలకు సాహాయ్యంబు సేకూరునే!॥ 153

తే॥ గీ॥ కోశ మొకవైపు - చతురంగకోటి యొకటఁ
బెరిఁగి, మనయుద్యమంబును బెంపవలయు
ననుతలంపున నీ శత్రుధనముఁ గొంటి:
మవసరోచిత నిర్ణయ మవధరింపు"॥ 154

క॥ అని మనవిసేయ, శివపతి
విని "మీ విక్రమమునెల్ల వింటిమి మీరల్
వినిపింప: మేమ స్వయముగఁ
గనుఁగొంటిమి కొన్ని యెడలఁ గనుచా టగుచున్॥ 155

చ॥ అనుచిత మొందు లేద, యదనానొకచో ననివార్యమే యగున్
సునిశిత ఖడ్గపాత: మిది శోణితధారల సాధులోక జీ
వన మెదిగించునేనిఁ గడుఁబావనమౌ హాయమేధతుల్య; మీ
వానరుచు సేత నేఁడు సముచితమై కడుఁ జేవగూర్చెడున్"॥ 156

మ॥ అనుచో నుత్తరసహ్యభూ విజయమై యబ్బాజిసోన్ దేవుఁ డా
య్యన నేతెంచి సఖడ్గపాణి వినతుండై "దేవ! మీయానతిఁ
దునఁ గల్యాణి జయించి దానిసరదారున్ బట్టి బంధించి, యా
తనిసర్వస్వము రాణివాసమును దోడ్తన్ దెచ్చినా" నం చనన్॥ 157

శా॥ "ఆ - యేమీ? యొక రాణివాసమును బుణ్యావాసమున్ దెచ్చినా
వా? యేహైందవుఁడైన నీగతి నమర్యాదన్ బ్రవర్తించునే?
మా యాజ్ఞన్ గమనింపవో? జయ మదోన్మాదంబునన్ రేఁగి, నీ
యాయుస్స్తోత్రము లీవత్రుంచుకొనవో? యాధృత్య మోర్వన్ జుమీ!

మ॥ అనుచున్ జేవులుమీఱు కన్నుఁగవతో నాస్పంది తోష్ఠంబుతో
ఘన హుంకారముతో సటద్భ్రుకుటితో గర్జిల్లు నా భోన్సలే
శునిఁజూడన్ బుయిలోడెఁగొల్వ; శివుఁ డీసున్ గుత్తుకన్ మ్రింగి,బో
రన నవ్వారల బంధమూడ్చి గొనితేరన్, బాచె సోన్ దేవునిన్॥ 159

మ॥ త్వరితుండై యతఁ డట్టులేసలిపి "దేవా! నన్ను మన్నింపు: మీ
సరదారున్ గొని తెచ్చుచో సరభసోత్సాహంబు కగ్గప్పె: దు
శ్చరితాలోచన లేదు, లేదు భవదాజ్ఞా లంఘనోద్వృత్తి: మీ
చరణద్వంద్వమునాన" యంచు వినిపించన్, సుంత శాంతించుచున్॥

మ॥ శివరా జంతట మేల్ముసుంగుఁదెరలో - స్నిగ్ధాంబుద చ్ఛాయలో
నవ సౌదామినిఁబోలు నా యవనకాంతా రత్నమున్ భక్తి గౌ
రవముల్ వాఱఁగఁ జూచి పల్కె- "వనితారత్నంబు లీ భవ్యహైం
దవభూ జంగమ పుణ్యదేవతలు; మాతా! తప్పు సైరింపుమీ!॥ 161

సీ॥ హరి హర బ్రహ్మలఁ బురుటిబిడ్డలఁ జేసి
జోలఁబాడిన పురంధ్రి లలామ,
యమధర్మరాజుపాశముఁ ద్రుంచి యదలించి
పతిభిక్ష గొన్న పావనచరిత్రి
ధగధగ ద్దహనమధ్యము పూలరాసిగా
విహరించియున్న సాధ్వీమతల్లి,
పతినిమిత్తము సూర్యభగవానునుదయంబు
నరికట్టి నిలుపు పుణ్యములపంట,
తే॥ అట్టి యెందఱో భరతాంబయాఁడుబిడ్డ
లమల పతిదేవతాత్వ భాగ్యములుపోసి
పుట్టినిలు మెట్టినిలుఁ బెంచు పుణ్యసతులు
గలరు, భారతావని భాగ్య కల్పలతలు॥ 162

మ॥ అనలజ్యోతుల నీ పతివ్రతలఁ బాపాచారులై డాయు భూ
జనులెల్లన్ నిజసంపదల్ దొఱఁగి యస్తధ్వస్తులై పోరె? వి
త్తనమే నిల్చునె? ముస్నెఱుంగమె పులస్త్యబ్రహ్మసంతాన? మో
జననీ! హైందవభూమి నీపగిది దుశ్చారిత్రముల్ సాగునే? 163

తే॥ * యవన పుణ్యాంగనామణి వగుదుగాక
హైందవులపూజ తల్లియ ట్లందరాదె?
నీసురూపము నాయందు లేద యైనఁ
గనని తల్లివిగా నిన్ను గారవింతు। 164

శా॥ * మా సర్దారుఁడు తొందరన్ బడి యసన్మార్గంబునన్ బోయె; నీ
దోసంబున్ గని నొచ్చుకోకు; నినుఁ జేర్తున్ నీగృహం బిప్పుడే,
నాసైన్యంబును దోడుగాఁ బనిచెదన్, నాతల్లిగాఁ దోడుగా
దోసిళ్ళన్ నడిపింతు; నీ కనులయందున్ దాల్మి సారింపుమీ!"॥ 165

మ॥ అని కొండాడి, పతివ్రతా హిత సపర్యా ధుర్యుఁ డాతండు యా
వన కాంతామణి కర్హసత్కృతు లొసర్పన్ జేసి, చేచేతఁ జి
క్కినసర్దారుని గారవించి హితసూక్తిన్ బల్కి, బీజాపురం
బునకున్ బోవిడె - వారితోఁ దనబలంబుల్ గొన్ని తోడంపుచున్॥

మ॥ శివరా జంతట సోనదేవు మొగమై "స్త్రీలెంతయున్ బూజ్య, లే
యవమానంబు ఘటింపరా, దిది మదీయాదర్శ: మస్మచ్ఛమూ
ధవు లీయాజ్ఞ నవశ్య మోమవలె; నీతాత్పర్యమున్ జూచి, లోఁ
కువ చేకూరమి నెంచి, నీయెడ దోసంగు ల్లేమి భావించితిన్॥ 167

* "Then the fort of Kalian was captured ....Abaji had captured a handsome girl (the daughter-in-law of Maulana Ahmed, the Governor of Kalian) in his raid and presented her to Shivaji. Shivaji said, "If my mother had had your beauty how happy it would have been! I too should have looked handsome." He treated the girl as his own daughter, gave her clothes and sent her .... to her home in Bijapur.

*Page 362. The Modern Review. Vol. I. 1907*

తే॥ మొగలుల దండు రాయిడి ముడుఁగఁజేయ
నుత్తరమునఁ 'గల్యాణి' 'మాహుళి' యుఁ జేరి,
ప్రజలసౌఖ్యము మాప్రభుత్వమును బెనుప
నట సుబేదారుఁడవుగఁ గార్యమ్ము గొమ్ము"॥

మ॥ అని వాక్రుచ్చి, నవీనసంగతము రాజ్యంబెల్లఁ బాలించుతీ
రున నాబా దొనరింపఁగాఁ దలఁచి మోరోపంతు నీక్షించి యి
ట్లనె "నీ వీ గయికొన్న కొంకణము సహ్యాక్షోణి సర్వంబు నే
ర్పున నల్మాలలు మెట్టి పాలనముతీరున్ దీరుసేయన్ దగున్॥ 169

సీ॥ బాజీఫసల్కా- రేసాజియు - శాత్రవుల్
చొరకుండఁ బ్రాంతముల్ చుట్టవలయు;
శిథిల దుర్గముల సుస్థితిఁ గూర్చి, వీరయో
ధుల దుర్గపతులుగా నిలుపవలయు;
'బయలు - బీ' డనక యేల్బడినున్న ధరయెల్ల
నెఱ పంటపొలముగా నెఱపవలయు;
నమరపుఁబన్ను - సుంకము - గుత్త - కప్పము
మొదలుగా రాబడి యెనుగవలయు;
తే॥ కుల మతాచార నీతి సంకులతఁ బాపి
వసతు లెసఁగించి ప్రజ సౌఖ్యపఱుపవలయు;
నన్నిపనులను దీర్ప సమర్థులైన
యంచితోద్యోగులను నియమించవలయు॥ 170

తే॥ అరిగణము చొచ్చిరాకుండ నడుపుగొలుప
రాయరీ ప్రాంతమున 'లింగణా' యటన్న
గడము, గోశాలకడ 'బిరవడి' గడమ్ము
మించుదిటవున వెలయ నిర్మించవలయు॥ 171

ఉ॥ ఈ పనులందుఁ గావలయు నెల్లసహాయముఁ దీసికొంచు, దీ
క్షా పరిపాటి నన్నిటినిఁ జక్కనొనర్పు; మవశ్యమైనచో
నా పిలు పెప్పుడందిన క్షణమ్మునఁ జేరఁగర" మ్మటంచు నా
యా పడవాళ్ళఁ దోడ్కొలుప, నందఱు లేచి సముత్సుకాత్ము లై॥

చ॥ "జయ శివరాజ! దర్పజిత సహ్యాధర ణ్యాధిరాజ! హైందవో
దయ దినరాజ! శ్రీ భృశబలాన్వయ వార్ధ్యుడురాజ!" యంచు న
ధ్యయ జయనాదముల్ వెలయ నప్పుడ జోతలువెట్టి, సాహసో
న్నయ తత రాజకార్య ఘటనాపటులై చని రుత్సవంబునన్॥ 173

రామదాసు దర్శనము - ధర్మోపదేశము.

మ॥ శివరా జీగతిఁ గొంకణక్షితి జయశ్రీ వొంది తత్త్వాలన
వ్యవహారంబులు దీర్పఁగాఁ బనిచి, సేవాకాంక్షియై రామదా
సు విలోకింపఁగ నెంచి, వారియునికిన్ జూపెట్టఁగా నాత్మ భృ
త్య వితానంబును బంచి, యొక్కతఱి వేఁటాడన్ మదిన్ గోరుచున్॥

ఉ॥ $ సేనలతోడ సహ్యా వనసీమలఁ జొచ్చి దురంత జంతు సం
తానముఁ దుంచు నప్పు - డట దాపునఁ దీవల యాకులందు ము
క్తా నిచయంబుఁ గూర్చినవిధంబగు నిద్దపువ్రాలఁ జూచి, య
వ్వానిఁ బఠించె నీగతి శివప్రభుఁ డుత్సుకి తాంతరంగుఁడై॥ 175

తే॥ గీ॥ "అదరుపోయిన హైందవ హృదయములకు
జీవబలములఁ బోసి ప్రాచీన ధర్మ
పాలనము సేయ నినుఁగోరి, భరతభూమి
వేచియున్నది; శివపతీ! వెడలుమింక॥ 176

$ ఒకదినము శివాజి వేఁటమార్గమునకై యరణ్యములోనికిఁ బోఁగా నచ్చట వృక్షముల మీఁది యాకులపై దేశాభిమానమును బుట్టించు కొన్నిశ్లోకములు వ్రాయబడి యుండెను. వానినిజూచి యట్టి ప్రాసాది శ్లోకములు వ్రాసిన కవిపుంగవుఁ డెక్కడ నున్నాఁడాయని శివాజీ వెదకి చూచెను. పుట 78 "శ్రీశివాజీ చరిత్రము" కె. వి. లక్ష్మణరావు.

తే॥ గీ॥ తు్రిళ్ళు కెరటాల నురుఁగుకరుళ్ళు దేల,
'భోరు' మనుమ్రోఁత జగమెల్లఁ బుక్కిలింప
దాఁటు కడలితుపానులో 'ధర్మనౌక'
సుడియుచున్నది: దరిఁజేర్పు నడువు మింక॥ 177

తే॥ గీ॥ చెదరిపోయిన యంగముల్ కుదురుపఱచి,
సడలువాఱిన తంతువుల్ చక్కఁదీర్చి,
యనుగతశ్రుతి భువన మోహనముగాఁగ
హాయిఁ బలికింప లెమ్ము జాతీయవీణ॥ 178

తే॥ గీ॥ దేవ ముని ధేను విప్ర సాధ్వీ పదాబ్జ
పావన పరాగ పరిపూత భరతభూమి,
కలిపురుష దుర్విహార కశ్మలముగాఁగఁ
జూడఁజాలక శివపతీ! చూతు నిన్ను॥ 179

సీ॥ ఆసురబల పరాహత మూర్ఛితాత్మీయ
చేతనాధర్మ సంజీవకరణి,
పరమతాశుగ శల్యపాతోపతాపిత
స్వమతాపవేధ విశల్యకరణి,
భగ్నావయవ సంధిబంధ స్వజాతీయ
తా యథాకరణ సంధానకరణి,
యిన కులాపాయ దుర్దిన తాంత సుభట జీ
వన నవోత్సాహ సావర్ణ్యకరణి,
తే॥ అయిన తత్ప్రిన్వ యౌషధీ శాంకురంబు
నంచిత తదాప్తి సహ్యా శైలాంతరమున
నరయుచున్నాఁడుసుమి - సుమిత్రాపచార
పరిహృతి పరాయణుఁడు రామభక్తుఁ డిపుడు"॥ 180

చ॥ అనిమొదు పద్య పఙ్క్తి హృదయంగమమై విశదాక్షరంబులై
కనుపడఁ బల్మరున్ జదివి, గాఢ నిగూఢ తదీయ భావ భా
వనమున మేనుపొంగ - గరుపాటిన డెంద మమంద విస్మయ
ధ్వనితముగాగ, నచ్చటి విధమ్మునకున్ దలయూఁచె నీగతిన్॥ 181

చ॥ “ఇది పరమాప్తభూతంబు పరమేశ నిదేశము; సహ్యపర్వతం
బిది చిగిరించెనేమొ యిపు డీగతి నెందును దేశభక్తి – సా
భ్యుదయ మతప్రసక్తి - సమయోచిత ధర్మపథానురక్తి; యు
చ్చ దశకుఁ బోవు హైందవము సర్వము నేఁ డిటు మేలుకొన్నదో

ఉ॥ కా దిది తానుదామొలచి కన్పడు భౌతికసృష్టి, యోగవి
ద్యా దయితుం డలౌకిక మహాపురుషుం డొనరించు శాంబరీ
వాదము: రామదాసమునివర్యుల పాదుక లంటుగొన్న యీ
మేదిని నిర్వహింపదె యమేయము లిట్టివి పెక్కుచిత్రముల్!॥ 183

ఉ॥ ఎన్నిదినంబులయ్యెఁ గనులెత్తి గురూత్తము దర్శనమ్ముకై
జన్నియవట్టి! యీ యడుగు జాడలు నేఁటికిఁ జిక్కవయ్యె: నా
వెన్నునఁ జేయిదట్టి నడిపించెడు దైవముఁ జూడ వీఁపునన్
గన్నులు నాకుఁ దోఁచవలెఁ, గా కతఁడే యెదురైనఁ గావలెన్॥

ఉ॥ పౌరుష మెందు దైవబల పక్వము, దైవము సాధు సజ్జనా
కారము: సాధుపుంగవుఁ డకారణబంధువు రామదాసుఁడే
భారత భావి భాగ్యరమ పట్టయి నన్నడిపించుచుండ, నా
ధోరణ ధూత గంధగజ ధోరణి నింకఁ బరాక్రమించెదన్॥ 185

చ॥ ఒక పరమాణువుం బొదివి యూర్జిత సృష్టిసమన్వయంబుఁ గొం
కక యొనరించు పండితునిఁ గానక నా కొకరూపు నిల్చునే?
యిఁక సకలంబు నాకడఁక యేకముఖం బొనరించి, నాదు దే
శికుఁ గనుఁబాఁకని ట్లొనఁగు పసింతుఁ జూపా పూర యోగజీవికన్!”॥ 186

చ॥ అని తలపోయుచుఁ, శివమహాప్రభుఁ డవ్వనసీమ నందు నం
దును వెదకెన్ భటవ్రజముతోడుగ సాధు సమర్థరామదా
సుని మునివర్యు; నిట్లలఁతఁజూపక చెట్టునుగుట్ట లోయలున్
గనుమలు నెత్తముల్ గుహలుగా వెడఁగ్రుమ్మరుచుండ, నొక్కచోన్॥

మ॥ దళసంతాన నితాన శీతల వటాధశ్ఛాయఁ - గుంజోదర
స్థలి - దర్భాస్తరణస్థుఁడై - గతికపోఁచల్ రెండు మూఁ డంది, పొ
త్తిలిసెజ్జన్ బొరలాడు లేడి నిసుఁగున్ దిన్పించుచున్, దానిచేఁ
తల కుప్పొంగెడు రామదాసు - భవబంధగ్రాసు నీక్షించుచున్॥ 188

ఉ॥ కన్నులఁ దొంగలించు కుతుకంబున మోము దుఱంగలింపఁ, బై
కొన్న సముత్సుకత్వమునకున్ గుఱియై మది చెంగలింప, న
భ్యున్నత పాణులెత్తి శిరమున్ గదియన్‌గొని దోయిలించి, "సం
విన్నిధయే నమోస్తు గురవే!" యని తత్పదపీఠి వ్రాలినన్॥ 189

చ॥ బెదరెడు లేడికూన మఱపించుచు నక్కునఁ జేర్చి, కన్నులన్
బ్రిదిలెడు తేనె తెప్పలను బ్రింగి, దయా మృదులాక్షరంబులన్
బెదవి గదల్చి దీవనలఁ బెట్టిన వల్పలికేలు చెమ్మటల్
చిదుమఁగఁ దాఁకి, "లెమ్ము శివజీ" యని యల్లన లేవనెత్తుచున్॥

ఉ॥ ఆదరమారఁ జెంత నుచితాసన మందఁగఁజేసి, తంత్రిమ
ర్యాద హితంబుసూపి శివరాజున కిట్లనె రామదాసు, "వ
త్సా! దురతిక్రమంబులు ప్రజాహితకార్యములందు రేఁబవ
ల్సేఁదుచునున్న నీకుఁ గలదే యొకతీరిక మమ్ముఁజూడఁగన్!॥ 191

ఉ॥ కొన్నిదినంబులౌచు మదిఁ గోరికయున్నది నిన్నుఁజూడ: నై
న న్నిలుచున్నచో నిలక నల్గడఁ గార్యమువెంట దూఁకు నీ
సన్నిధి చిక్కదయ్యెఁ; గడసారికి నేఁటికిఁ జూడఁగంటి నో
యన్న! నినున్ గలంపవుగదా పగదారుల మాయమర్మముల్?॥ 182

ఉ॥ అండనయుండి కార్యగతు లారయఁ జేయఁగఁ దండ్రి దూరమై
యుండెః గురుండుఁ దండ్రియగు నుత్తమవిప్రుఁడు ఖాండదేవు వే
ఱొండుజగంబుఁ జేరెః నిపు డొక్కఁడవున్ దరుణుండవౌచు, ను
ద్దండము లీప్రభుత్వముల దండడి నేగతి నాఁగి నీఁగెదో!॥ 193

ఉ॥ పాయనికూర్మి నీకు నిరపాయపథమ్మును జూపఁగా నుపా
ధ్యాయ తపస్సహాయ భవదంబ దయాజగదంబ జీజియా
బాయికి సేమమే? సుగుణబంధుర బాంధవసింధువౌ సయీ
బాయికి నీ వధూమణికి భద్రమె? నీప్రజ కెల్ల శ్రేయమే?"॥ 194

చ॥ అను గురువర్యునాదరణ మందుచు, సాంద్ర సుధారసాభిషే
చనమునఁ బోలె నెమ్మనము చల్లనగా శివరాజు వల్కె, "మీ
ఘన కరుణావలంబనము గల్గిననాఁడె శుభోదయంబు మా
కౌనరినదయ్యెః నేకొఱఁతయున్ గలదే సురధేను సన్నిధిన్!॥ 195

మ॥ గురుజీ! మీ రనినట్లు కార్యములచిక్కుల్ పెక్కులై యున్న, నీ
శ్వరచింతా పరతంత్రమౌచు మది నిచ్చల్ సాధుసేవా సమా
దరమున్ గోరెడు; వేచియుంటి మిముఁ జెందన్ బెద్దయున్ బ్రొద్దు; నె
త్తురుపొత్తుం గుడిపించు రాచఱికమెంతున్ విందు చేకూర్చునే!॥ 196

చ॥ జనకుఁడు దూరమౌచుఁ, బితృసమ్మితుఁడౌ గురుఖాండదేవుఁ జే
గినకొఱ దోఁపకుండ నుడిగించితి రాచఱికంపుఁజిక్కు; లై
నను మఱికొన్నియూహలు పెనంబడుచుండె మనంబునందు; నా
కనువగు ధర్మనిర్ణయము నందుటకై మిము నాశ్రయించితిన్॥ 197

ఉ॥ రాచఱికంబునన్ గలదు, - ఱాఁగఁదనంబు కసాయిచేత మా
యా చరణంబు; ధర్మపథ మైనను దప్ప దొకప్పు డాత్మసం
కోచము; రాజనీతి యనుకొన్నను నోదముపైని పైరుగాఁ
దోఁచుఁ; బ్రభుత్వముల్ నరకదుర్గము లంచని పెద్ద లాడరే!॥ 198

ఉ॥ కొందఱఁ జెఱఁబట్టి, మఱికొందఱనుర్విఁ దలక్రిందుసేసి, రా
జ్యేందిరపేర రక్తబలి యిచ్చుట యెవ్వరికోస? మీశ్వరుం
డందఱఁ గావఁడే? ప్రకృతియంతయుఁ బాడదె జీవభుక్తిదై
నందిన? మోమ రే యిన ఘన శ్వసనాదులు పూఁటకాఁపులై?॥ 199

ఉ॥ నామది నింతవట్టు మననం బగుచుండు; మతమ్ము దేశమున్
బ్రామిన చీఁకటిన్ దలఁచుపట్టునఁ బట్టఁగరాని తెంపు పెం
పై మెఱపాడు; దానికొఱ కాయుధమెత్తినఁ 'గ్రూరకర్మమా
నే మొ' యటంచు, 'శాంతి - బలహీనతయా' ననియున్ దలంపగున్॥

మ॥ 'మన కిం తే' లని యూరకుంట విబుధుల్ మన్నింప; 'రన్నింటి కే'
ననుచున్ దూఁకిన లోకమే పెడమొగం బౌనట్టులౌ; నీయెడన్
మనుజుం డెట్లు చరింపఁగావలె? మహా మాయామయుం బీజగం
బనుచున్ మానులువట్టుదారియ ఘనంబై గమ్యమై యుండునో?॥

చ॥ అది యగునేని రాచఱికమం చొకబంధ మిదేల? యెవ్వరే
నొదుఁగుచు రాజకల్పిత నియోగములన్ జనులేల? యిట్టిసం
పద యెటుగల్గె రాజునకుఁ? బాపము లాతని కంటవో? బలో
న్మదమున రేఁగి పైకొనెడు మానవులెల్లరు రాజు లౌదురో?॥ 202

ఉ॥ ఈమెయిఁ దారసిల్లెడు ననేకతరంగములెత్తి సంకులం
బౌమది నిర్ణయంబుకొఱ కాఁకలి గొన్నది; పూజ్యుఁడో తుకా
రాముఁడు 'ధర్మసంగరము రాజుల కర్త్వ' మటంచుఁ దెల్పె, వి
ద్యామయు నిన్నుఁ జేరుమనె; నంకిలివో మది నూలుకొల్పవే!"॥ 203

చ॥ అను శివరాజుచిత్తమున హత్తిన యొత్తిడిఁ జూచి విస్మితా
ననుఁడయి రామదాసమునినాథుఁడు పల్కెఁ "గుమార! నీ వచిం
చిన దుచితంబు; ధర్మపరిశీలన సేయుచుఁ బాపపుణ్యముల్
గని, నిరపాయవృత్తి మెలఁగన్ దలఁపొందిన - నింత యొప్పదే!॥ 204

ఉ॥ మానవ జీవితంబు సుకుమారము: స్వార్థ - పరార్థ సౌఖ్యసం
ధానముతో మదిన్ దనుపు తత్పరమార్థము; స్వార్థవృత్తియం
దైనను గేవ లైహిక సమాహృతి రాజస తామసాంక: మా
మానులు ముక్తికై నడచుమార్గము స్వార్థము, సాత్త్వికం బగున్॥

చ॥ తగులము లేక, యాసలకు దాసులుగాక, తమంత పండి పై
రగు ఫల మూల శాకముల నంది, బహిర్గత పంచభూత శ
క్తిఁ గొనుచు నాత్మముక్తి పరికించుట యొక్క తెఱఁగు; దీని మే
లు గొనరు గొంద - ఆత్మసుఖలోభ మభూతహితత్వ మెన్నుచున్॥

తే॥ గుడిసెలోఁ గన్నుమూసి, పైఁదొడరు భూత
ములకు మేనిచ్చి, లోని శత్రులనె యడఁచి
జగము నంటని ముని తపశ్చర్య స్వార్థ;
మట్లుపోని రాజర్షి పరార్థపరుఁడు॥ 207

తే॥ తన్నుఁబోలిన సకలభూతములు దనియఁ
దాను మురియుటె - మానవత్వంపుగుఱుతు;
దాని సాధించుటే - పరార్థమగు: నందుఁ
దెరువులివి, రాజసంబు - సాత్త్విక మనంగ॥ 208

మ॥ తన కేమేలు దలంప, కన్యహితచింతన్ బ్రాభవం బంది, శా
సనశక్తిన్ జగమోహ రాజసమగుణ: సామ ప్రబోధంబునన్
దను బొందించుట సాత్త్వికం; బిటులముక్తప్రాయులౌ జ్ఞానియున్
జననాథుండు పరార్థమున్ గొనుదు - రంతశ్శాంతి దైవారినన్॥ 209

చ॥ ఒదవిన రెండుమార్గముల యోగ్యము సాత్త్వికమైన, మూఢ మూ
ర్ఖ దశల గండరించిన జగంబున మేలు ఘటింప - రాజసం
బదికినయట్లుగా ఫలసమగ్రిదశన్ నియమించి నిల్పఁజా
లు; దవుట శాంత రాజసకళా పరిపాకము సాధనం బగున్॥ 210

తే॥ దాన స్వార్థముఁగోరు భూధవులకంటె
మునులు మేలు; వారలకంటె మొగిఁ బరార్థ
సాధకులు మేలు; వారిలో జ్ఞానధనుని
కంటె రాజర్షి శాంతిరక్షకుఁడు మేలు॥ 211

తే॥ వినుము శివజీ! పరార్థమున్ బెరుచునపుడు
జ్ఞానధనుకంటె శాంతిరక్షకున కన్ని
గతుల నొఱపును గల, దన్నిగతుల విఱుపుఁ
గల; దది పరులరంజించు కత్తిసాము॥ 212

ఉ॥ రాజతపస్వియై భువనరంజకతన్ వెలయించుటే సుధా
భాజన ముద్ధరించుట; యపారపయోధి మథించునాఁటి వి
ద్యా జటిలత్వ మబ్బినఁగదా - సకలమ్ము దమింపుచున్ బయో
భోజన మిచ్చుఁ! బెత్తనముఁ బొందు టనన్ బయిపైన నున్న దే!॥213

ఉ॥ వేఁడిమి సూపరా, దొరుల వేఁడినచో బలహీనవృత్తి, బొం
కాడుట కానికార్యము, యధార్థత లోకవిరోధి; మేలునన్
గీడునఁబోలెఁ గీడు పరికించు జగంబున - నెల్లవారు 'మా
వాఁ' డన - రాజనీతి నడుపన్ దరమే యొకపాటివానికిన్!॥ 214

మ॥ ప్రతికూలంబు లడంచి మేలు గలిగింపన్ బూని, గాఢాభిమా
న తరంగోద్ధతి రేఁగి దూఁకునెడ విఘ్నవ్రాతముల్ లేచి ప
ర్వతముల్వోలె నెదుర్చు: వాని నొదిఁగింపన్ దీరు లేనప్డు, దు
ర్ధతుఁడౌ రాజసయోగి కుంగి యడఁగున్ దైవంబు సాధించుచున్॥

ఉ॥ లాఁతుల కిట్లడంగుటయు లాఘవమై కనుపట్టుఁ; బోరఁగాఁ .
జేతులురాని రాజముని సేగి దమింపఁగనోపఁ; డట్టి యా
కూత మెఱుంగువారు దొసఁగున్ దగ వెంచక స్వార్థసిద్ధి కు
ద్భూతులు వోద్రు; రీ జగ మయోమయమై కనులుండి లేవగున్॥ 216

తే॥ ఇంతయురవడి కెవరీఁడి, యింతకంత
కులికివడక, యెడంద కాయువునుబోసి,
పరహితముఁ జెంపవలెఁగాక బమ్మరింపఁ
దగదు; తగవెల్ల సృష్టితత్త్వమునఁ గలదు॥ 217

ఉ॥ సృష్టి - పరస్పరాశ్రియ పరీతమ యయ్యు, స్వత స్స్వతంత్రతా
పుష్టము: భిన్నమార్గములఁ బోకడ - నైజము న్యాయ్యమయ్యు, ను
త్కృష్టము తన్నికృష్ట మడఁగించెడి: ధర్మపదార్థ మిట్లు సం
సృష్టము సంకరం బగుటఁజేసి సమన్వయశక్తి కావలెన్॥ 218

తే॥ ఆ సమన్వయ మకరంద మందుకొఱకు
మధుకరము పూవుఁబొదరిండ్ల మలయునట్లు
ప్రకృతియంతట సృష్టిమర్మముల నెమకి
తరిచి పొరలెత్తి - చవులంటువెరవు వలయు॥ 219

ఉ॥ అట్టి సమన్వయంబు ఘనులైన మహాత్ములకైనఁ బూర్తిగాఁ
బట్టదు - దైవశక్తి బిగఁబట్టినవారికిఁ గాక: వారి కీ
చుట్టఱికంబు గిట్టదు - విశుద్ధ సమాధిలయంబు గాక; యి
ప్పట్టున లోకసుస్థితి కెవండు సమర్థుఁడు తోడుసూపెడున్?॥ 220

మ॥ తనముక్తిన్ దలపోయు సంయమి; పరార్థం బెంచువిజ్ఞానియున్
వినినన్ మేలువచించు; ధర్మగతు లన్వేషించురాజర్షి పూ
నినచోఁగాక సమాధినిష్ఠుఁడయినన్ - నిర్భీకమై లోక మె
వ్వనికిన్ వాఁడుగఁ దాండవించు; నిటు విధ్వస్తంబు ధర్మం బగున్॥ 221

ఉ॥ ఉన్నది దైవరక్ష: సకలోపకృతుల్ ప్రకృతిన్ ఫలించియే
యున్నవి: భూతశక్తి జగమోహముచునున్నది: కాని, లోక మా
యున్నతికోసమై పెనఁగి యొం డొకటిన్ గబళించుచున్న - దీ
చెన్నటి చీఁకటిన్ బొదుగుచేతులు పైకొని విక్రమించెడున్॥ 222

తే॥ దొరలమని యస్త్ర శస్త్ర బాధురత నెఱపి,
తెలివిగలమని పెను కుయుక్తులను జొనిపి
జగముఁ గబళించు బలియురఁ జక్కఁబఱుప
కున్నఁ దెరువున్నె? వా దూర కొదుఁగఁగలరె? 223

ఉ॥ అట్టి ప్రజాపకారము బయల్పడ ధీరుఁడు సైఁపఁగూడ; ద
ప్పట్టున సామదానములు పాఱనియప్పుడు భేదదండముల్
ముట్టకతీఱ: దండు రణముల్ మరణంబులు నోర్చి, కత్తులన్
గట్టుచు నెత్తురుల్ గురిసిగాక - తొలంగునె దుర్వ్యహారముల్?॥ 224

ఉ॥ ఇంతలు సేయకున్న ఫలియింప దొకప్పుడు లోకమంగళం:
బింతలు సేత హింస యగునేమొ యటం చొకజంతు దోఁచు; నా
స్వాంతమునందు లోకహిత యజ్ఞముగా నిది యెంతు: వేదసి
ద్ధాంతము - యజ్ఞ ముత్తమ మటం: చదియున్ బరులంద్రు హింసగన్॥

చ॥ ఇది దరిలేనిసాగర - మహింసయు హింసయు నిర్ణయింప; నె
య్యదనునఁ బ్రాణికోటి కహితాచరణం బది హింస; యైన స్వా
భ్యుదయముఁగోరిగాక జగదున్నతికై యొనరించు కార్యమం
దొదవిన హింసయున్, ఫలశతోన్నతమౌచు నహింస నాఁబడున్॥

క॥ ఇటు లగుట లోకరక్షా
ఘటన యవశ్యంబు చేయఁగాఁదగు: దానన్
జటులత కుటిలత హింసా
పటుతయుఁ గానరాదు - స్వార్థపరత యెసఁగమిన్॥ 227

తే॥ స్వార్థమునఁగూడఁ దారతమ్యంబు గలదు:
తొలుతఁ దాను, గుటుంబము, కులము, జాతి -
యిందు స్వార్థము క్రమముగా డింది, కడ క
ధర్మమే ధర్మమగుఁ - బరార్థమునఁ దవిలి॥ 228

క॥ 'నా' యనునది లేని జగ
చ్ఛ్రీయంబ పరార్థ: మది భరించుటయుం దే
నాయకుఁ డాకఁడు సమస్తో
పాయవిదుఁడు వలయు: నతఁడె ప్రభువన నొప్పన్॥ 229

ఉ॥ ఆ చతురుం డొనర్చు జగదాద్భృతి రాచఱికంబు నాఁబడున్;
'రాచఱికంబునన్ గలదు - ఱాఁగఁదనంబు, కసాయిచేఁత, మా
యాచరణంబు' నంటివిగదా - యది స్వార్థముగొన్న దృష్టి; ధ
ర్మాచరణంబునం దతని కంటవు తద్గత పాపపంకముల్॥ 230

ఉ॥ పాపము లంటఁబోని గుణపంబునఁ బువ్వులతోఁటఁ బెంచి, న
ల్వైపుల విచ్చు పూల పొలపంబునకున్ దలయూఁచి, కన్నునన్
జేఁపిన తోఁటకాఁపువలెఁ, జేకొను ధన్యత: దేవపూజకున్
బ్రాపగు: లోకనిర్వృతికిఁ బట్టగు - నాతఁడు ధర్మకర్తయై॥ 231

క॥ ఈగతి, లోకోద్ధరణ
శ్రీ గురుభారమును దలధరించిన స్వార్థ
త్యాగి విధించెడు శిక్షా
భాగం బది - రాజనీతిపథము, కుమారా!॥ 232

ఉ॥ సీమము లేనిచోఁ దగవుసేర్వదు లోకము తానుదా - నహం
తా మమతా పురస్కృతపథం బది; కావున ధర్మబద్ధుఁడై
సేమముఁ గూర్పఁగా నడరుసేగినిఁ దీర్పఁగఁ జాలు ప్రాభవో
ద్దాముఁడు రాజు, కావలె; నతంద్రము, కావలె రాజనీతియున్॥ 233

ఉ॥ రాజన మర్త్యమాత్రుఁ డనరాదు - జనార్దనమూర్తి: యష్ట ది
గ్రాజుల యంశ మంది, మునిరాజ తపంబుల షష్ఠభాగమున్
బూజితవృత్తిఁ గొంచు జగమున్ నడిపించు నియంత: వాని శి
క్షా జటిలాతపం బఘము గ్రాఁచుఁ, బదంపడి కాయు వెన్నలన్॥ 234

చ॥ బలితపుఁబెండలన్ దెవులువాసిగమొక్కలు - చల్వవెన్నెలల్
వాలసిన సేదదేఱి, తనువున్ బెనుపున్ గొని పూచుఁ గాచు; నీ
లలి నరపాల శిక్షణబలంబున సంస్కృతమౌ జగంబు - సా
ధుల వచనంబులన్ దెలివిఁ దోఁగి, పరాపరసిద్ధిఁ బొల్చెడిన్॥ 235

తే॥ నా వచించిన యర్థమంతయును నేఁటి
హైందవజగంబునకు - నీకు నన్వయించి,
ధర్మదండము నభయహస్తమునఁ బూన్చి
పంచినదిసూవె నిన్ను భవానిమాత!॥ 236

ఉ॥ కావున భూపతీ! ప్రజలఁ గాచుట నీవిధి; నేల దున్నుచో -
నావులఁ గాచుచోఁ - బ్రజల నారయుచోఁ - బ్రతికూలశిక్ష హిం
సావిధి గా, దుపేక్ష బలశాలికిఁ బాపముఁగూర్చు; నీకు నే
లా వెనుదీయ - నీశ్వరవిలాసము నీకరమందుఁ బండెడున్॥ 237

మ॥ మతమున్ దేశముఁ బ్రాణతుల్యముగ సంభావించు నీతీరు, సం
తతమున్ నీ వొనరించు తద్బహుళ సన్నాహంబు రాఁబోవు ను
న్నతికిన్ గుర్తులు; భూత భావి చరితాంతర్యంబుఁ 'గన్నారఁ జూ
చితి' మన్నన్ గొఱలేదు; నీవలన సుశ్రీ భారతం బందెడున్॥ 238

చ॥ అఱమది మాని ధర్మవిజయధ్వజ మెత్తి, పరాధికార జ
ర్ఘరితము దేశమున్ మతముఁ జక్కనొనర్పుము: భారమెల్ల నీ
యఱకడఁ బూనుచో - సమయమారసి నీవెనువెంటఁ దామ వ
త్తురు మనహైందవప్రజలు: తోడ్పడెడున్ మముబోంట్ల దీవనల్॥ 230

ఉ॥ ఆవును లేఁగయున్ బరుల యాఁకటి కమ్ముడువోవఁ, దీవలున్
బూవులువోని స్త్రీచరితముల్ కడునాఱడిఁ బొంద, దేవుఁడున్
గోవెల రూపుమాసి వెడకోఁతల రోఁతల బుగ్గిఁదేల వ
త్తా! వెనుదీసి పోవిడుతువా భరతావని భాగ్యసంపదన్!॥ 240

ఉ॥ ఆ రవినుండి నేఁటివఱ కానికఁబూని బుజమ్ములొగ్గి, భూ
భారము మోయు వంగడముపాదునఁ బుట్టినమొక్క - తత్ప్రభన్
మీఱకయున్నె? పంచిన యమిత్రకులంబులు దానిపెంపునన్
దీఱకపోవునే? శివపతీ! తెరదీయుము వీరలక్ష్మికిన్! 241

తే॥ వేసముల మాఱు ధర్మజిజ్ఞాస నీకు
వలదు - వలవదు పుణ్య పాపములగొడవ:
రాచబిడ్డవు - ధర్మశస్త్రమున దున్ని
పంట గొలుపుమీ యిహ పర భాగ్యలక్ష్మి!॥ 242

ఉ॥ కాపరిలేని గోగణముకైవడి - భారతభూమి ధర్మర
క్షాపరులైన క్షత్త్రియులఁ గానక, ముష్కర తస్కరాళిచే
నేపఱి, నీపయిన్ బరువులెత్తెడు నాసల వేచియుండె; బా
హా పరిణాహ ధూర్వహుఁడవై శివరాజ! భరింపు మీధరన్!॥ 243

మ॥ చివురుంజెక్కులు చెమ్మరింప విజయశ్రీ నీవు సాధించుచోఁ
గవియున్ జిక్కులువెక్క: లొక్కమొగి లోకంబెల్ల లోఁగొన్న యీ
యవనాధీశు లెదుర్తు, రబ్ధిమథనం బౌ; నేఁటి పోరాటలో
శివజీ! యంగిటఁ జేఁదునాఁపి, యమృతశ్రీ యిమ్ము నీవారికిన్!॥ 244

చ॥ 'మునుకలువెట్టు దేశ మతముల్ దరిజేర్పఁగ ధీరుఁ డెవ్వఁడా'
యని నినుఁ గంటిఁ, గంటి భవదాశయ; మీ నినుఁబ్రోత్సహింపఁగాఁ
బనిగొని ధర్మగీతములు వ్రాసితి; నాతలఁపున్ వచించి నె
మ్మనమున నూఱడిల్లితిఁ; గుమార! సమీహిత మీవ చూడుమీ!"॥

చ॥ అను మునిరామదాసు వచనామృతమున్ మనసారఁ గ్రోలి, త
న్నున నిలువెల్లఁ బొంగి శివభూపతి యిట్లనె, "నోమహాత్మ! నా
మనసు కలంకవాసెఁ జిఱుమబ్బులు మాసె, సుమస్సమాధి పే
లోఁగని యరుణుండు దూసె మునికోటిఁ జరింతు జగద్ధితార్థినై॥ 246

మ॥ తమమూర్ధన్ శిరసావహింపుచు నుదాత్త క్షాత్రధర్మంబు కృ
త్యముగాఁ దీర్చెదఁ - బాపపుణ్య విచికిత్సల్ వోవ నాకేల! రా
జ్యమునెల్లన్ గురుదక్షిణాత్మకముగా నర్పించితిన్ మీకుఁ, బూ
జ్యముగా నేలుఁడు; గైకొనుండు నను హస్తాలంబ దండంబుగన్॥ 247

మ॥ * గురుజీ! సుందర కందర ద్రుమ తటీ కుంజాపగా రమ్య మీ
పరశ్రీ పర్వతదుర్గ - మిందు వసతిం బాటింపుఁ; డేఁ బల్మరుల్
దరిసింతున్ మిము; నేఁటినుండియు భవద్రాజ్యంబుగాఁ జాటు - భా
స్వర కాషాయపతాక యెత్తి 'భగవాజండాఁ' బ్రతిష్ఠించెదన్"॥ 248

చ॥ అను పలుకాలకించి పులకాంచితుఁడై ముని రామదాసుఁ డి
ట్లనె "శివజీ! త్వదీప్సితము యయ్యెడుఁగాక! విరక్తి సన్న్యసిం
చిన నను బోఁటి కీ భువన శిక్షణ రక్షణ లేల? నీవ నా
యనుమతి నేలు మీయిల సమస్త - మపాస్త రజ స్తమంబుగన్॥

చ॥ వెరవును లావు గూర్చి నడిపింపఁగ నేర్తువు రాజనీతి: నీ
కొరు లుపదేశమీయఁ బనియుండదు: నే దరిలేనియప్పు — డ
క్కఱగలచోఁ - బఠించెదవుగాక మదీయము దాసబోధ: భూ
వర! హిత సర్వధర్మ పరిపాకము నీ కలదానఁ జేకుఱున్॥ 250

చ॥ నలుగడఁ జిక్కులంటుచు మనంబునఁ ద్రొక్కులాట మీఱుచో ననా
కుల మతిశాలివై శరణుఁగోరుము నీ కులదైవతమ్ము; ని
ర్మల ముకురంబునందువలె మానసమందు భవాని తోఁచి నీ
యులు కెడలించుఁ: బూఁటపడియున్నదిగా భవదన్వయర్ద్ధికై!॥ 251

---

* "Bhagwan Zenda or orange brown (was the) standard of Shivaji The tradition is that Shivaji's standard assumed this particular colour from the orange coloured robes worn by the great sage (Ramdas)"

Page 532. "The Life of Sivaji Maharaja", by *N. S. Takakhav. M. A.*

ఉ॥ కూరిమి వోయుచున్ నుదుటఁ గుంకుము వెట్టి, సఖడ్గపాణికిన్
దోరముగట్టి, వెన్నొరయు తూణమునన్ జయలక్ష్మి వెట్టి, హ్రా
స్నీరజమందుఁ దా నిలిచి నిన్ నడిపించు భవాని: యెందుఁ బో
స్వారికి - నీ పటాణిగొరిజన్ దడి యంటఁగనీక త్రిప్పెదున్॥ 252

మ॥ శివజీ! లెః మ్మిది దాసబోధ-మిదియే శ్రీచక్రి పూజాస్రజం
బివి నాదీవన - లిన్నిటిన్ గర శిరో హృత్సీమల న్నిల్పి, యు
త్సవ ముత్సాహము దోహలింప, భరత స్వాతంత్ర్య దీక్షాంతమా
సవనంబున్ జరిగింపు: మా భువనరక్షాకర్త్రి ని న్నేమెదున్!॥ 253

చ॥ చనుము కుమార! నీవు సువిశాల మహీవలయమ్ము నెల్లఁ బ
చ్చనిపయి రిచ్చగించు వ్యవసాయఘనుండవు; నాల్గుమూలలన్
బనులు - మఱెన్నియో పెనఁకువల్ నిను ముట్టఁగనుండు; నన్నిటన్
గనఁగవ గల్గియుండు: మవుఁగావుత నీకు జయమ్ముఁ గీర్తియున్"॥

మ॥ అని యర్పింప శివప్రభుండు వినతుండై వానిఁ గొంచున్, బ్రియం
బునఁ "దండ్రీ! సెలవిచ్చినాఁడ, విఁక నేఁ బోవచ్చునే! పోదునే!"
యనుచోఁ - గుత్తుక డిందఁ, గన్ను పదనై యత్తాఁడ, మోమోట ను
న్నొన్ననూల్పొంచుఁ, బునఃప్రణామమున వీడ్కోలందఁగా -నాతఁడున్॥

తే॥ "ఎదఁ - బెదవిఁ - గాలుఁ గదలించు నదనులందు
నెంత మెలఁకువ యున్నదోయీ కుమార!
గురులయెడ లేఁత - యరులపైఁ గులిశధార
నీమమది, వారి వీరి బంధింపకున్న!॥ 256

ఉ॥ నా యెడఁబాటునన్ దలఁకు మానుము, నీ మయినీడ జాడలన్
బాయక యుందు; నీ వదనుఁబట్టుచుఁ బట్టిన దైవకార్యమున్
జేయుము, కీర్తిగా" మ్మని వచింప, శివప్రభుఁడున్ ద దాదరా
ప్యాయిత భావుఁడై చనె రయమ్మున రాజగడమ్ముఁ జేరఁగన్॥ 157

మ॥ తనకై వేచిన మాతృదైవతము - నంతర్వర్తిని యా పత్నినిన్
గని, సహ్యావని రామదాసముని సాక్షాత్కార భాగ్యంబు - నా
తని సందేశము ముచ్చటించి, తన వాగ్దానంబుఁ దీర్పంగ వే
యనిచెన్ భృత్యుల "రామదాసముని రాజ్యం" బంచుఁ జాటింపఁగన్॥
చ॥ పదపడి కర్జమున్ గొని శివప్రభుఁడున్ జతురంగసైన్య సం
పద యెదిగించి, సాధన సమగ్రతఁ బెంచుచుఁ, గోటలెల్ల దు
ర్భిదములు సేసి, వేగు నడిపించి, బిజాపుర రాజ్యసీమలన్
బొదివి జయింపఁగా జతనమున్ వెలయించె నుదార ధీరతన్। 259

శివాజి చర్యలపై బిజాపురపుఁ గొలువులోఁ జర్చ.

ఉ॥ ఇట్టి శివప్రభూల్లసితమెల్ల బిజాపురి రాచకొలువులో
నెట్టన మ్రోసె "దుర్గముల నెట్టిరి, పట్టిరి బొక్కసంబు, చే
పట్టిరి దేశమెల్లఁ, జెఱఁబట్టిరి కామినులన్, మతంబు చీ
కొట్టిరి - షాహజీతనయు గొంటరిబంటు" లటన్న వార్తలన్॥ 260
ఉ॥ తోరణఁ బట్టుటాది పెడత్రోవలఁ బోవు శివప్రభూద్యమం
బారయుచుండి, నేటి కిటు 'లాదరబాదర' గాఁ బ్రతీపమున్
జేరు టెఱింగి, త త్ప్రతినిషేధము లారయఁగా నవాబు స
ర్దారులు మంత్రు లాప్తు లొనరన్ గొలువై యిటువల్కె వారితోన్॥
ఉ॥ "చిన్నటనాఁటి చేతలయి చేటును బాటు నెఱుంగఁడంచుఁ బై
నున్న షహాజి వాని సరియొత్తకపోఁడని, మున్నుఁ దోరణన్
గొన్నపు డంపు నుత్తరము కొంత విధేయతఁ జూపెనంచు, మా
క న్నటు ద్రిప్పమైతి - మదిగా కుమరయ్యె శివాజిచేఁతకున్॥ 262
శా॥ అయ్యారే! మొనమొన్న బాలకుఁడు గాదా! యెంతలో నెంతవాఁ
డయ్యెన్ - గొండల నూఁపి లేపఁగలవాఁ డానాఁడు మా కొల్వునన్
దియ్యం బాడఁగఁ 'దేటతేనె' యనుకొంటిన్ - నేఁడు లోఁ బుర్వులే
క్రయ్యన్ దోఁగెడు మూఁగెడున్ బయిన నీఁగల్ గూయుచున్ గుట్టుచున్

ఉ॥ ఇంతటి తెంపు బాలకున కేగతిఁ జేకుఱు - లోన నెవ్వరో
కొంతకుఁ గొంత సాయమును గూర్పక తీర్పక? విప్పిచూచుచో
నంతయుఁ దానమై మనషహాజియె యాడఁడొ బొమ్మలాట? లే
నంతట వానిజాగిరుల యంచులనే యితఁ డేల పైకొనున్?॥ 264

శా॥ లావున్ జూపి జయంబుగొన్న 'రణదుల్లాఖాను' కర్ణాటల
క్ష్మీ వాల్లభ్యము వెంటనుండిన షహాజీ కిచ్చి, యేతెంచె మా
సేవల్సేయఁగ: నాఁటినుండి యట షాజీ రాజ్యమున్ గొంచు, దు
ర్భావున్ బుత్రకుఁ దోలె మాపయికిఁ బైపైఁ దాను గాపుండుచున్॥

ఉ॥ ఆ సరదారు లిట్లు మరియాదల మీఱుచు, నస్మదీయ వి
శ్వాసము వమ్ముసేసి మనపైఁ బగయొత్తుట సైఁపరాదు; సం
త్రాసము నొంద దూఁకి శివరాజు నడంచుట మేలొ? షాహజీ
వేసము బైటవేసి నడిపించుట మేలొ? వచింపుఁడీ" యనన్॥ 266

శా॥ ఆ మాటల్విని షోలపూర్విభుఁడు ముఖ్యామాత్యుఁ 'డబ్దుల్ రహీం'
సామర్షంబుగ లేచి "యిట్టి విపరీతాచారముల్ గొ్రిత్తలే
యీమన్నీలకు? సైఁపఁగూడ దికఁ, బ్రత్యేకంబుగా నివ్వరన్
స్వామిద్రోహులఁ బట్టఁగావలె నవశ్యం" బంచు వాక్రుచ్చినన్॥ 267

మ॥ సరదార్లందఱిలోన మేటియు, బలిష్ఠ ప్రౌఢ బాహామదా
కరుఁడున్, ఱొమ్మునఁజిమ్ము గండఁ 'డఫజుల్ ఖాన్' లేచి యిట్లాడె, "దే
వరవా రిట్లభిమాన మీవఱకుఁ జూపన్ వారు చెర్లాడుచుం
డిరి - లేదేఁ దలయొగ్గి మీచరణపీఠిన్ గొల్చి కూర్చుండరే?॥ 268

ఉ॥ కన్నులుమూసి తంత్రిములు గట్టెడువాఁడు షహాజి: యాతఁడే
మన్ననఁ జూపుచున్న - నహామత్పురరాజ్యము చేయిచేతులన్
సున్నముఁ జేసె; నేఁ డిచటఁ జొచ్చె; బిజాపురరాజ్య మెట్టు ల
క్ష్యమ్మితిఁ గొంచు - నీపురుగు లూడలు వేరులు తు్రించుచుండినన్?॥

వ॥ ఎఱుఁగనియట్టులుండి - యొళవిచ్చి - బలమ్ములనిచ్చి - పుత్రకుౝ
బురికొలిపెౝ షహాజి, పయిఁబొంచె నొకించుక దూరముండి; ము
ష్కరుఁడు సుతుం డొనర్చు కొఱగామి వచింపఁగరాదు - దుర్గముల్
పొరిగొనె, స్త్రీలఁబట్టె, మతముౝ బొలియించెఁ, గలంచె దేశముౝ!॥

ఉ॥ ఇంకను గన్నువిచ్చి తమ రీ చలిచీమల తాచకుండినన్
గొంకు కళంకు రాజ్యమునకుౝ మతకర్తలకుౝ ఘటిల్లు; మీ
కింకరు నాజ్ఞ సేయు; డొదిఁగించెద _ దంచెద - వాని పీనినిౝ
బింకమడంచి మీయెదుటఁ బెట్టెదఁ - బట్టెద వానిదేశముౝ!"॥ 271

చ॥ అనునెడఁ, దోరణాధిపతి "యంతటిగండఁడు దుండగీఁడు లేఁ
డని మును విన్నవించితిఁగదా - యిప్పుడైనను జిత్తగింపుఁ" డం
చనె; "మన దుర్గనాథులకు నందు జనాళికి నిల్వ వీలు లే"
దని యనెఁ గొండనాథిపతి; "యౌను, నిజ" మ్మని పల్కి రందఱుౝ॥

సీ॥ అంతఁ గల్యాణినాయకుఁడు 'మౌలానాయ
హమ్మదు' వినతుఁడై యనియె నిట్లు;
"లీమాట లిటు నిజంబేయగుఁ - దచ్చమూ
పతులఁ గొందఱు సేయు పనులఁబట్టి;
షాహాజీతనయు దుశ్చరిత మింతలుగాఁగ
భావింప నా యనుభవమువలన;
సతులైన శత్రు సంహతులైనఁ జేఁజిక్క
మన్నించి విడుమహామహుఁ డతండు;"

తే॥ అనెడునంతలో నొకదూత యరుగుదెంచి
"కన్నడమునుండి ముస్తఫాఖానుగారి
మనవి" యన, నవా 'బాజాబుఁగొని పఠింపు'
మనుటయు, మురారిజగదేవుఁ డంది చదివె॥

మ॥ “తమయాజ్ఞన్ గొని కన్నడంపుజయయాత్రన్ గొంత సాగించియుం
టిమి; లోఁగొంటిమి ఘోర ధీరపరిపాటిన్ గొన్ని సామంతరా
జ్యము; లాంధ్రావనిపోరుతీరు బలితంబైయుండె; ‘జింజీ’ జయం
బమితాయాసముఁ గూర్చె, నేఁటికి నసాధ్యం బంచుఁ గాన్పించెడిన్॥

మ॥ మన షాజీసరదారు వర్తనమునన్ మార్పెంతయున్ దోఁచె; ర
మ్మనినన్ రాఁడు, బలంబు లంపఁ, డనిసేయన్ దెంపుఁ జూపింపఁ; డా
తని పేర్వాసికి మాఱులే దిచటఁ; దంత్రాలేవియో చేయుఁ; జే
సినకార్యమ్ములఁ ద్రోయుఁ దోడ్పడఁడు ‘జింజీ’ కోట సాధింపఁగన్॥

ఉ॥ † నాలుగుమాసముల్ చనె ఘనమ్ముగఁ గోటను ముట్టడించి; తా
నాలముసేఁత మాని, సెలవంది స్వదేశము నేగ గోరెఁ; “గ
య్యా లిటులుండఁ బోక తగవా - సులతానులఁ గోరు” మంటి; “సై
న్యాలకుఁ దిండిలే” దనుచు నప్పుడ యేగె ననాదరింపుచున్॥ 276

తే॥ గీ॥ అతనిఁగూర్చి విచారణ యవధరింపుఁ,
డంపుఁ డొకకొంతసేన సాయముగ మాకుఁ;
దమ యనారోగ్య మిట్టిదొందరలఁ గదుప
వలదు; స్వామివంచకుల సైఁపంగవలదు!”॥ 277

చ॥ అని పఠియించునప్పు డరుణాననుఁడై సులతాను విప్పుక
న్గొనల మిణుంగురుల్ గురియఁ “గూళఁ గృతఘ్ను సహింపఁగూడ, దా
తని యపరాధ మిట్లు విదితంబ, విచారణ లేలయింక? నే
మనెదరు మీ?” రటన్న, వినయానతుఁడౌచు మురారి యిట్లనెన్॥ 278

† “When the siege of Jinji was protracted and fighting continued long, the cunnig Shahji sent an agent to the Nawab Mustafa Khan .... to say that grain was very dear in the camp, that the soldiers could not bear the privation, any longer, and that he would retire to his own country without waiting for permission.” Page 44. - *J. N. Sarkar*

మ॥ "నను మన్నించు జహాఁపనా! యొక కృతఘ్నవ్యక్తి-దా నెంత హె
చ్చినవాఁడైన క్షమింపఁగూడదు; షహాజీనేరముల్ పెక్కులై
గనుపించున్, దమరన్నయట్లు లతఁడున్ గావచ్చు విద్రోహి: యె
వ్వని నాడింపవు తాఱుమాఱుగ స్వలాభభ్రాంతిన్ రాజ్యాంగముల్!॥

ఉ॥ మంచియుఁ జెడ్డయున్ దెలియు మాన్యులు శాంతులుగాన,మిమ్ముఁ బ్రా
ర్థించెద; షాహజీ నడకతీ రొకమాదిరి తొల్తనుండి గు
ర్తించితి; మింతలో నిటు మదించి కృతమ్మును విస్మరించి వం
చించునె! సింగమున్ జెనకి చేష్నడునంత వివేకదూరుఁడే!॥ 280

చ॥ అహమదురాజ్యమున్ నిలుప నంతలు సేసినవాఁడు - మోగలుల్
బహుతరధాటిఁ బైకొనఁగఁ, బట్టి పోకార్చి బిజాపురీ యశో
మహిమము నిల్పువాఁడు-రిపుమండల మోర్చుచుఁ గన్నడమ్ము మీ
మహిత విభుత్వముద్రికకు మార్చినవాఁ-డిటు ధిక్కరించునే!॥ 281

మ॥ శివజీ చిన్నటనాఁడె సుంతమదుడై చిట్టాడ- మీ నెమ్మదిన్
జివుకన్ జేయఁగఁజాల కంపెఁ బునహాఁ జేరంగ: శిక్షించె భూ
ధవమర్యాదలు-ఖాండదేవుగురుచెంతన్: దోరణాఁ బట్టుకొం
ట విగర్హించె షహాజి: యాతఁ డిపు డొడ్డారించి యొడ్డాడునే!॥ 282

చ॥ తనయుని యెత్తికోలున కతండు నిదానమ యానో! కన్నడ
మ్మునఁగల రాజకార్యముల పోకడ లెవ్వరి వెట్టివానో! యే
యనువుననైన నన్నిట యథార్థ మెఱుంగుచు, సామ దాన భే
దనములఁ దీరుసేయఁదగుఁ: దప్పదు దండవిధాన మావలన్॥ 283

తే॥ గీ॥ షాహజీ సాయపడునట్లు సరదుకొనియొ -
యతని విడదీసిఁయో- శివు నణఁపవలయు;
నిరువు రొకటైనఁ గార్యమ్ము బరువుగాదె?
ప్రథమ ముచితంబు రాజ్యాంగ పథమునందు"॥ 284

చ॥ అని వినిపింపఁగా సుముఖుఁడై సులతా "నిదియొప్పు, షాహజీ
యన నసదంచుఁ జూడఁదగఁడాహవ పండితుఁ- డాత్మగౌరవం
బెనసిన మేటి; కార్యగతులెల్ల నెఱుంగుచు యుక్తవర్తన
మ్మునఁ జనుటొప్పు; దీని కతిముఖ్యుల యోగ్యులఁ బంపఁగావలెన్॥

శా॥ * 'బాజీఘోరపడే' ముధోళపతి, 'జస్వంతుండు' సేనానియున్
షాజీ కాప్తులు చుట్టముల్: గనుక విశ్వాసంబుఁ జూపించుచున్
'రాజీ' మాటల వాని యుద్యమముసారంబెల్ల గుర్తించి, యా
యూ జాడల్ గమనించి, నాఁటి కుచితోపాయంబుఁ జేయన్ దగున్॥"

చ॥ అని వచియించి వారిమొగమై "చనుఁడిప్పుడ మీరు: నే వచిం
చినగతి సంచరించి షహాజీనడకల్ గనిపట్టి, కన్నడం
బున మన 'ముస్తఫా' చెయిదముల్ గమనింపుఁడు: షాహజీప్రవ
ర్తనము దురాకృతంబయిన దర్పమునన్ జెఱఁబట్టుఁ డాతనిన్॥ 287

తే॥ అట్టితెగువ యవశ్యమా నపుడు గూడ
నోడుపుదప్పిన నడఁగు తుందుడుకు తగదు,
చేటు నిందయు మిగులు చెర్లాట తగదు,
'నిరపరాధినిఁ గాని' రన్న నింద తగదు॥ 288

ఉ॥ * మానసమందు మాహితము మానక, మాకును మీకుఁ గీర్తిసం
ధానముగాఁగఁ, దోడిసరదారులకున్ గుణపాఠమట్లుగాఁ
బూనిక నిర్వహించి జయమున్ గొనిరం: డధికాధికార స
మ్మాన మమూల్యవస్తు బహుమానము నందుఁడు, పోయిరం"డనన్॥

---

* "The Raja is a general of high rank and it is not proper to dishonour him. You are all well-wishers of the Raja.

.... ...If you can bring the Raja a prisoner your fame will increase and you shall be promoted."

Page 174. Sabhasad.

## షాజీనిర్బంధము.

ఉ॥ వారసహాయశూరులు నవాబునుదిశ్ దఱుపాడఁ బల్కి, స
త్కారము లంది సైన్య సముదాయముతోఁ జని కన్నడంబునన్
జేరుచు, దూతనంపి షహజీనడకల్ గమనించి ముస్తఫా
తీరు నెఱింగి, చేయఁగల తీరుపులన్ దలపోసి కిగతిన్॥ 290

ఉ॥ "కంటిమి వింటి మిందఁగల కార్యములన్ గథలెల్ల; నేఁడు ని
ష్కంటకవృత్తిలోఁబడియెఁ గన్నడదేశము కొంత షాహజీ
దంటతనమ్ముచేఁ; నతనిదర్పము ధైర్యము సద్గుణంబు వా
కొంటయగాని- యెవ్వరినిఁగోరినఁ గీడు వచింప రింతయున్॥ 291

తే॥ మన నవాబును వంచించు మనసుగాని -
కొడుకు నుసికొల్పి దండెత్తు గుఱుతుగాని -
షాహజీయెడఁ గనుపట్టఁ; వాహవమును
దొలఁగిపోవుట కుచిత హేతువులు గలవు॥ 292

మ॥ 'అలఁతన్ దూలినసేన యాని యనిసేయన్ జాల, దాహార వ
స్తులు లే, విప్పుడ కోట లోఁబడ' దటంచున్ షాహజీ యుద్ధమున్
దొలఁగెన్; దోహముసేయు టెం పతనియందున్ జూడఁగాన్పింపఁ దీ
జులుముం జేఁతలు ముస్తఫా గదిపెనంచున్ దోఁచుసాసూయతన్॥293

చ॥ ఇటులని షాహజీఁ గొనక యేగిన 'జాత్యభిమాని' మంచు న
చ్చటి సరదారు లాగడము సల్పకపోరుః నవాబు దీనఁ దొ్రి
క్కటపడుఁ; బైనఁ బొంచి కసిగత్తులు నూఱెడు తాఁగ ముస్తఫా
కుటిలతఁజూపు—నిన్ని యొనఁగూడినచో మనదారి యేమగున్!॥ 294

చ॥ ఇది యొకయూహ; యొండొకటి యేమన, నిష్టు షహజి చాల బ
ల్లిమఁడయి కొల్వులోన నదలింపుచు నెవ్వని మోయనీఁడు; పై
నెదుగుచునుండెఁ గన్నడమునేల్బడిః యీగతినిక్క- వీని కే
మొదఁగుచు విన్నవోయి పడియుండుటె-దివ్వటికింది దివ్వెలె!॥295

మ॥ అదిగా: దభ్యుదయైకసిద్ధి వివృతద్వారమ్మొగాఁ దానుగా
నెదురై కన్పడ- నూరకుండఁగలఁడే యెట్టైనఁ గార్యజ్ఞుఁ, డా
యదనుల్ లోఁగొనుఁగాక! లోకమిది న్యాయాన్యాయముల్ గప్పి సం
పదఁ గొండాడునుగాని- దానిఁగొను త్రోవల్ నొక్కి- నోనాడునే!॥

ఉ॥ కావున షాహజీఁగొనుట కర్జము: దీన నవాబుగూర్చు సం
భావన, కొల్వులో బలిమి, ప్రాభవవైభవముల్ ఘటిల్లు; మా
పై వికటింపవచ్చుఁ గులబంధులు కొంద ఱసూయఁజూపి - యే
త్రోవలఁ బోయినన్ దొలఁగద్రోయఁగ నౌను స్వజాతివైరముల్!॥

ఉ॥ ఇప్పటి నిర్ణయంబు సరియే: షహాజీఁ జెఱఁబట్టు కార్యమో
డెప్పరమైన, దాతఁడు కడిందిమగం - డెదురొడ్డి పోరుచోఁ
దప్పునొ! తాకునో! యదనుతప్పక చెల్మినటించి, నమ్మకం
బొప్పఁగ జేరఁబిల్చికొని, యొంటిమెయిన్ జెఱపట్టఁగావలెన్"॥ 298

చ॥ అని మది నిర్ణయించి, కుటిలాశయు లా సరదార్లు సైన్యముల్
గొని చని, షాహజీనెలవుకుం దరిగా విడియించి, పల్మ ఱా
తనిఁ గనుచున్, దదీయ బలదర్పములున్ సులతానుఁడిచ్చు మ
న్ననఁ గొనియాడుచున్ మిపుల నమ్మికఁజూపిరి రాకపోకలన్॥ 299

మ॥ ¶ ఒకనాఁ డొండొక విందుపేరున దురుద్యోగంబు నూహించి, యం
దుకు సన్నాహములెల్ల గుప్తముగఁ దోడ్తోఁదీర్చి, షాజీ చకూ
పకు లాయాపనివెంటఁ బోయినతఱిన్ బాటించి, "యీనాఁడు వేఁ
డుకవిందున్ గుడువంగ ర"మ్మన - నతండున్ జెల్మి మన్నించుచున్॥

---

¶ "Ghorpade never dreamt of achieving such a feat (to defeat Shahji in the open field and to take him prisoner.) He resorted to stratagem. He invited Shahji to an entertainment and had him arrested as an unsuspecting guest."

Page 47. "The Life of Sivaji Maharaja", by

*N. S. Takakhav, M. A.*

చ॥ అఱమది లేనివాఁడయి షహాజి భటుం డొకరుండు వెరటరా
నరిగెఁ; బ్రియమ్ముఁజూపి కుటిలాత్ముఁడు ఘోరపటుండు షాహజీ
కరమును బట్టి లోపలి యగారముచున్ దరియంగ నేగె; మం
దిరమున విందుకుందగిన తీరులు గానమి సంశయించుచున్॥ 301

శా॥ షాజీ - "యేమిది? చేరరెవ్వరును? జస్వంతుండు లేఁడే?" యనన్
బాజీ - నవ్వుచు "నందఱున్‌గలరు, సన్నాహంబుమై నుండి, రిం
కేజాగున్ బనిలేదు లెం" డనుటతోనే - భీకరాకారు లా
బాజీభృత్యులు శస్త్రపాణులయి పైపైముట్టి రుగ్రాకృతిన్॥ 302

మ॥ లయకాలాంతకుఁడై షహాజి కరవాలక్రీడ నా ఘాతుకో
చ్చయమున్ దోలుచుఁ దేలుచున్ గినిసి, "నీచా! కప్పవైకూసి షా
మయి మాపైఁ బడగెత్తి యాడెదవె? మాయా వాగురాబంధ దు
ర్జయతా గ్రంథిలుఁ ద్రుంతు నిన్నిపుడ సాహూ ద్వీరభద్రాకృతిన్"॥

చ॥ అని యదలించి పైఁబడఁగ - నందఱుఁ గ్రందుగ ముట్టి, సాహస
మ్మునఁ దెమలించియున్ బాదివి, మూర్ఛితుఁ బాశనిబద్ధుఁజేసి: రా
తని శిబిరంబు సొచ్చి వితతమ్మగు తద్ధనమున్ షహాజినిన్
గొని, నడిపించె సైన్యముల ఘోరపటుండు నవాబుఁ జూడఁగన్॥ 304

ఉ॥ ఘోరపడే - నవాబుకడకుం జని సంగతి విన్నవించె; "ద
ర్బారున షాహజీ నిరపరాధత దేలెడుదాఁక బంధనా
గారముఁ జేర్చి రక్షకులఁ గట్టడసేయు" మనె న్నవాబు; వి
స్తారములై షహాజి చెఱసాలకతల్ వినవచ్చె నల్లడన్॥ 305

తృతీయాశ్వాసము - సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివభారతము

## (శివాజీప్రబంధము.)

---

### చతుర్థాశ్వాసము.

---

చ॥ తిరమగు రామదాసునుపదేశమునన్ బలుపొందు పూనికన్
బరికర బద్ధుఁడై శివనృపాలుఁడు కొల్వున భావికార్యవై
ఖరి వివరించుచుండ, వడిగా నొకవేగరి వచ్చి యూరుపుల్
చెరుగుచు విన్నవించె షహాజీఁ జెఱఁబెట్టి నుదంతమంతయున్॥ 1

షాజీ నిర్బంధము విన్నతరువాత శివాజీ ప్రయత్నము.

చ॥ బెడిదముగాఁగఁ దండ్రిఁ జెఱఁబెట్టినవార్త హఠాత్తుగాఁ జెవిన్
బడి కుదురొనెడందఁ గలఁపన్, గలుచన్ గనుచున్ శివప్రభుం
డుడుకును గ్రింగికొంచుఁ దలయూఁచి, మొగమ్మొగభీరముద్ర ము
ట్టడిఁగొన, ధీరభావ నిబిడమ్ముగఁ గొల్వును జూచి యిట్లనెన్॥ 2

శా॥ "విన్నారే? సులతానుగారి దురుసుంబీరంబు; లీనాఁడు మే
లొక్కన్నారో యఱుగన్నులన్ దెఱచి? యుక్కుం జూపి యీరీతిఁ బై
కొన్నన్ 'లోఁబడిపోదు' రంచు బయలన్ గోరాడిరో? యెందు కీ
పన్నాగంబులు? సింగపుంగొదమ నాఁపన్ ద్రాడులున్ దల్గులా?॥ 3

మ॥ తమ రాజ్యంబును జక్కఁబెట్టుకొను పంతం బొప్పియాఁగాక - యు
త్తముఁడౌ తండ్రినిఁ బట్టనేల? బలవ ద్దర్పంబునన్ మేముగా
తమరాజ్యంబును గొంటి - మందుకతనన్ దండెత్తి రాఁగూడదో
మము సాధింప? నవాబులై పెరటిగుమ్మం బేల దూఱన్ జనన్?॥ 4

మ॥ పరమోదాత్తత వీరిరాజ్యమునకై ప్రాణమ్ము మాజీ(?) నొస్తి, నె
త్తురుఁ గండల్ దెగఁగోసి పోసె రణమందుం ముందు మాతండ్రి, దూఁ
బఱవో నన్నియు - వారిఁబట్టు తెగుదెంపా? యప్పుడైనం సరా
సరి పోరం జెయిచేయి గల్పికొని తూఁచం గూడదో బీరముం?॥ 5

మ॥ 'ఒకషాజీ చెఱపోయె' నంట తగ దీయుద్యోగముం జూడ: సే
వకవృత్తిం దలఁదాల్చి, భారతముసర్వం బిట్లు విశ్వాసఘా
తుకులౌ రాజులక్రిందఁ గుందెడు: నరేంద్రుల్ నేఁడు కన్మూసి, యూ
రక యీ కప్పమెలుంగుఁబాములకుఁ జేరంబోయి పాల్వోతు రే?॥ 6

చ॥ కుదిరిక లేని భారతముఁ గ్రుక్కి, పదంబునఁ ద్రొక్కి, నల్లడం
గదుముచు, నేల్బడిం నడుపఁగా మొదలై చనె మూఁడువంద లేం
డ్లదనముగాఁగ: నూరకిపు డాయలవాటులు వోవునే - పదిం
బదిగఁ బయింబయింబడక, పట్టక, యాయువుపట్టు ముట్టకం?॥ 7

చ॥ తన బలఁగమ్ము పైకొలిపి తా నరిగాపుగ నుండుఁబోండెఁ - బై
కొను బలఁగమ్ము చెద్దముములకుం దలయూఁపుచు నుండునొండె - మె
ల్పున సులతానుఁ డిట్లు పోరివృచ్ఛుఁజుమీ దరిలేని భారతం:
బనువునఁ బట్టి యీ బెడిద మార్పక తీర్ప కెడంద కూర్కునే?"॥ 8

తే॥ అని వచింపుచోఁ గంచుకి యరుగుదెంచి
"యల బిజాపురి సులతాను లంపు లేఖ"
లనుచు నర్పింప, శివరాజునాజ్ఞఁ గొనుచు,
శ్యామరాజపం తవ్వానిఁ జదివె నిట్లు॥ 9

మ॥ "శివరాజా! చిననాఁటి నీ నడకవాసిం జూచి 'మా రాజ్యగా
రవముల్ పెంపొనరింప వాఁడిగల సర్దారుండవై, కీర్తి వై
భవముల్ తండ్రికి మాకుఁ దెత్తు' వనుచుం భావించితిన్ నాఁడు; నేఁ
డవురా! యల్లరిమూఁకలం గలిసి, యన్యాయ్యంబులం జొత్తువే?॥ 10

ఉ॥ కొండికవాఁడవౌటఁ జెడుగుల్ పొడిగింతువు: దీన లాభ మే
ముండెఁ నటం చెఱుంగ; వెదరొడ్డి పరిభుత్వము ధిక్కరించి యె
వ్వండు సుఖంబు నొందెఁ? బలవంతుఁడు తండ్రివిధంబుఁ జూడు; ధీ
వరుండగు నట్టివాని కొమరుం డనఁగాఁ జరియించు టొప్పదే?॥ 11

చ॥ Ψ జరిగిన దంతయుఁ మఱచి సమ్మతి మాకొలు వంద రమ్ము; నీ
పరుసములెల్ల సైఁచెదము: పట్టిన దుర్గములెల్ల నీకు జా
గిరుగ ననుగ్రహింతు: మొదిగింతుము మా సరదార్లలోన నీ
పరువుఁ బ్రతిష్ఠ: నీ తరముపట్టున మ మ్మొడసేఁత మానుమీ!॥ 12

ఉ॥ అంచిత రాజభక్తి వెలయన్ మముఁగొల్చిన నీదుతండ్రికిన్
బెంచిన మాకు నీవలన భేదములేర్పడె; నాతఁ డిట్లు ప్రా
ప్తించిన సేగి కెంతయుఁ దపించి, హితమ్ము దలంచి, నీకు వ్రా
యించిన కమ్మఁజూడు; మెడయొత్తుల సందియ మందఁబోకుమీ!॥ 13

తే॥ చల్లఁగా మను ప్రజలు రాపిల్ల నదుర్వఁ,
బరిణతుఁడు తండ్రి లేనితొందరలఁ గుదుప,
నరుల కెడమిచ్చి, గగ్గోలు పఱుపనేల?
రమ్ము, శివరాజ! నీ యభీష్టమ్ము దీర్తు"॥ 14

చ॥ † అను సులతానుగారి సనయమ్మగు కమ్మఁ బఠించి, చూపు మా
ఱిన శివరాజు మోముఁ గని, రెండవ యుత్తరమంది శ్యామురా
వనుగత మీఁగతిన్ జదివె, "నభ్యుదయంబుఁ జిరాయు వందుమీ
తనయ! హితంబుగోరు సులతానుల యుత్తరువంది వ్రాసెదన్"॥ 15

---

Ψ There was Badshahi letter (also) (to the following effect) "Your misdeeds will be pardoned and the provinces will be confirmed. Come to the presence"

Page 174. *Sabhasad.*

† "Shahji sent a letter to Shivaji under the Sultan's permission to go to Bijapur," Ch. VIII. *N. S. Takakhav,*

క॥ అని చదువుచుండ, ధర్మా
సనమును డిగి శివవిభుండు చయ్యనఁ జేతుల్
పెనఁచి - తలవంచి - నిలిచెన్
వినయంబునఁ; శ్యామరాజు వినిపించె నిటుల్॥ 16

చ॥ "వినఁబడియుండు నన్నుఁ జెఱఁబెట్టినవార్త: నవాబుగారు నీ
వొనరుచు సేఁతలన్ గినుకనొందుచు, నిన్ బురికొల్పినాఁడ నం
చనియు - మదీయముక్తికొఱకైనను నీ విఁక మీఁద మంచిత్రో
వ నడుతువంచు - నన్నుఁ జెఱఁబట్టిరి: కూడ దనంగ వచ్చునే?॥ 17

ఉ॥ పెక్కు తెఱంగులన్ మనసువిప్పి వచించితి - నీకడంక నా
కెక్కనిదంచు, నాపలుకు లెంచవు నీ వని, దండనంబునన్
దక్కనుఁడంచు: నాపలుకు నమ్మక నీకొఱ కిట్టు లీచెఱన్
గ్రుక్కిరి నన్నుఁ - గాయకయి కొమ్మకుఁ దప్పనె ఱాలరువ్వుటల్!॥

చ॥ ఉసురులపోకకై తలఁకు నొందుట లే: దొకనింద వొంది, య
క్కసుఁ గుడిపించు వీరి కొఱగాములకున్ దలయొగ్గి, శాత్రవ
గ్రసన విహార ధీరను పరాక్రమ మాఱడిఁబో - దివమ్ములన్
గొసరుచుఁ జీకటింటిబ్రతుకున్ గడపన్ గడు భారమయ్యెడిన్!॥ 19

ఉ॥ పిన్నటనాఁటఁగోలె వినిపించితిఁ 'దొందర మాను' మంచు: నీ
యున్నతి యెట్టిదో తలఁపనోపవు నాపలు కాదరింప; నేఁ
డిన్నగు లేగుదెంచె, సడియెత్తకపోదు జగంబు నీకు; నే
నన్నది వేఱుసూడ, కిపుడైనను మీఁదటిమే లెఱుంగుమీ!॥ 20

చ, తరములనుండి యీ దొరలదాపున నింతటివారమైతి: మే
తెఱఁగున నైననే - మొకటఁ దింటిమి వారలయుప్పు కొంత: తొం
దరపడి నేఁడు వారి కహితమ్ముగ మాఱుకొనంగవచ్చునే?
యెఱకలు వచ్చెనే నెగిరి యేగుము - కూల్చెదవే కులాయమున్!॥

ఉ॥ ఉన్న రవంతప్రాపు గొని, యర్జితశక్తియు రక్తిసూపుచున్
గన్నడమందు నిం దెనయఁగల్గితి రాజ్యము - రాచకొల్వులో
నున్నతి: యింత యెంచుకొఱకో గమనింపుము; దీనిప్రాపునన్
జిన్నది పెద్దగాదొ? విడిచేతుల సందియము లేఁదనేస్తవో?॥ 22

ఉ॥ తోఁచిన యూహ విన్ము - సరితూఁచుము దానిని: నీకుఁ దండ్రిగా
నోఁచిన నన్ను - నాబలమునోఁచిన రాజ్యముఁ గోరికొందువే
నా చనుదారితీరు మననం బొనరింపుము; లేనిపోని సం
కోచములేల యొండు తెఱఁగుం గొని కార్యముఁబట్టనున్నదే?॥ 23

ఉ॥ చీఁకటిమాపు చూడకుము: చేతులకందని పండుఁగోయ న
ట్లాఁకలఁ దూలిపోకుము: యథార్థ మెఱుంగుము జీజియా మనః
పాకము వేచి: నీవు బలవంతుఁడవున్ మతిశాలి; వన్నిటన్
దేఁకువఁ బట్టుమీ! తలుపుఁదీయకుమీ సుడిగాలి ధూళికిన్!॥ 24

ఉ॥ ఏవెతలైన - మమ్ము భరియించుట నీవిధిగాఁ దలంపు: మీ
యావనరాజసేవ తగ దం చనుటొందుకు - రాజనీతి వి
ద్యావిదు లిట్టిచో నడుచుదారులఁ బట్టుము: నన్నుఁ జూడఁగా
నీ వొకసారి రమ్ము: గమనింపుము నీ హితవాదివర్గమున్!॥ 24

తే॥ అభ్యుదయమందు నీభాగ్య మరసి, మేము
దీవనలఁబోసి, హర్షించు తెరువుఁ జూడు:
మిదియ నాకోర్కి; సులతానుఁ డిదియ కోరె
నని తలంపుము తనయ! భంగ్యంతరమున"॥ 26

చ॥ అని పఠియించి, యుత్తరము లాతనిముంగల నున్న తాసనం
బున విడె శ్యామరాజు; శివభూపతి తండ్రియొసంగు పత్రికన్
గనుఁగవ నొత్తుచున్ గొలువు గన్గొనిఁ తొన్కని పాలవెల్లిపైఁ
[illegible] 27

ఉ॥ "కూడలి యంతయున్ దెలిసికొంటిమి నేఁడు; నవాబు జాబులో
జాడలు దేఱిచూచు నెడఁ - జక్కరపూఁతవిసమ్ము చందమై
యూడెడుఁ; దండ్రిగా రిడిన యుత్తరమో - చిగురాకునీడలన్
వేఁడిమివోని యెండవలె వెక్కస ముమ్మరి మురక్కలించెడున్!॥ 28

ఉ॥ ఇంతకుఁ దేలు సారమిది, యే మొనరించు మహాహవాద్యమంబునన్
అంతులువోయి, తండ్రినిఁ జెఱంగొని - రంపును మోసగించి; మా
పంత మడంపఁగా నెడమువట్టిరి - తండ్రినిఁ గొందరించి; యీ
తంతువుఁ జుట్టి నన్నుఁ దమదాసునిఁ జేయుట వారి తీరగున్॥ 29

చ॥ ఇది యొనఁగూడునే - ప్రళయమే యగుఁగా; కధికార మత్తులై
యెదిరెడువారు లేక బిరుసెక్కుచు హైందవభూమి నేఁచు బ
ల్లిదుల నడంచి, దీని - కనిలింప చమూ పరిముక్త దేవతా
సదనమువాసిఁ దేక, కుఱుచల్గొని యే నొకవానిఁ గొల్తునే?॥ 30

ఉ॥ ఇతయుఁ దీర్పఁగా వెలితి యెందు నొకింతయు లేదు; గాని, య
భ్యంతరమౌచుఁ దండ్రిచెఱయున్నది నేఁ డెదురయ్యె; వీరు దు
శ్చింతులు, మా వడిన్ బడి కసిన్ గొని పాపమొకంటెఁ దండ్రిఁ దూ
లింతురో! యట్టులైన విదళించి జయించియు నేద దీఱునే?॥ 31

చ॥ కొఱపడియున్న యప్పు డనఁగూడదు గాని - కుమారుఁ డిట్లు దు
ర్ధర నిజధర్మ నిర్వహణ తత్పరతన్ జెరలాడుచుండఁ, దా
నొరులకు దోయిబొగ్గఁ బనియున్నదె? యుక్తమె? రాచబాటకున్
దెఱఁగులు దిద్దువాఁ డిది మదిన్ గమనింపఁ డనంగ వచ్చునే!॥ 32

చ॥ గతజల సేతుబంధనము కార్యము గాదు; దెగించి దూఁకు ధూ
ర్తత సరిగాదు; కాదని వెతంబడి, లోకహితంబు జాఱు భీ
రుత కొఱగాదు; ధీరుఁడు నరుం డెదిరించువిపత్తు లోర్చుచున్
గుతిలపడంగఁబోక, యెదకుం గుదురిచ్చి కడంక యొప్పగున్॥ 33

ఉ॥ కొందఱి కుందుగోరములకున్ గుఱియైనది నేఁటికార్య: మా
కొందఱుఁ బ్రాణమోల్లు విడఁగూడనివా రగునప్పు డూరకే
తొందరపాటు మేలె? సరితూఁచి కడంగుడ మొక్కదారి: మీ
రందఱుఁగూడ నిందలి శుభాశుభముల్ పరికించి పల్కుఁడీ!”॥ 34

తే॥ అనఁగ సభలోని జనులెల్ల ‘కాను, గా’ ద
టంచు గుసగుసవోవంగ నాలకించి,
యుద్ధతుఁడు తానజీ వారి నోసరించి
పలికె - నిజరాజభక్తి దర్పమున మెదిపి॥ 35

మ॥ “అనువుల్ పెక్కులు సూపి మీనుడికి మాటాడంగ నోరాడ, దై
నను ‘సుల్తానుల సైఁపఁగూడ’ దనుటే నామాట: ‘షాజీప్రభున్
గొని’ రన్నప్పుడు పేదపన్నగతిఁ జేరోర్కనేల? మావంటివా
రనుగుల్ గల్గియు మిమ్మువంటిప్రభు లీ యన్యాయముల్ సైఁతురే?॥

మ॥ తమ రీరాజగడమ్ము కోటగవఁకున్ దాఁటం బనే - మాజ్ఞ యిం:
డమితోత్సాహులు మావళాభటులు తోడైరాఁగఁ బైఁ దూఁకి, య
డ్డముగా నెవ్వఁడువచ్చినన్ దఱిగి తుంటల్ సేసి, కారా కవా
టము భేదించెదఁ - దండ్రిగారిఁ దమ యండన్ జేర్తు నిశ్శంకతన్॥ 37

ఉ॥ దీనికిఁ దప్పెనేనిఁ దెగఁదీయుఁడు నాతల; లేనిపోని సం
ధానము లేల - యేల వ్యవధానము? దేవరవారిచిత్త మా
పై” నన, శ్యామరా జనె “నపాయము లేని యుపాయ మూనుటే
పూనిక; ముల్లు ముల్లుగొనిపుచ్చక కొట్టినఁ గ్రుమ్మివైతురే!॥ 37

మ॥ మన సన్నాహము లెన్నియున్న, మనపై మాఱొడ్డి పోరాడఁగా
ననుమానింప - రఖండ చండ పటుసైన్యాటోపు లవ్వారు; హె
చ్చినచో శేఁగెదు - రింత లొచ్చునెడలన్ ‘జేనున్న షాజీప్రభున్
గొని, యేపాపము సేతురో’ యనుట నాకున్ దోఁచు [illegible]

చ॥ మఱియును 'మీరు రావలయు మాకడ' కంచను మాట 'వంచనా
పర' మని తోఁచు; నమ్మకముఁ బట్టుచుఁ దండ్రినిఁగోరి పోయినన్
జరచుర నందఱున్ బొదువుచో - షహాజీవిభు నట్లుసేయు పో
టరు లెదిసేయఁజాల? రెదుటన్‌బడి యొంటిఁ బెనంగ నేటికిన్?॥ 40

చ॥ తమపయిఁ గూర్మిఁ గాక - సులతానులయొత్తిడి నందు రమ్మనెన్
మిము షహాజీవిభుం డనుట మిక్కిలిమాట; లిఖించు కమ్మలో
నిమిడిన భావ మున్న - నెదురేగుట మాని యుపాయ మూని కా
ర్యముఁ గొను టెచ్చరించు: నది యన్యపథమ్మని నాకుఁ దోఁచెడిన్॥

చ॥ ఒక బలవంతుఁ బైకొలిపి యొండె, నవాంతరమౌ కలంత లొం
డొకరికిఁగూర్చియొండెఁ, దగు నొక్కని గాసలుగొల్పియుండెఁ, బూ
నికఁ గొను నొక్కతీ రగుట - నేఁటివిభుత్వములన్ బలీయమౌ
నొకటిఁ దలంచి, దాని నుచితోపచితిన్ మొగియింపఁ బోలదో!"॥ 42

చ॥ పర హృదయమ్మునీడలను బట్టెడు యంత్రము మీ మనీష నే
ర్పరితన మిచ్చిదానికిఁ దిరమ్మగు రూపము వోయఁజాలు మీ
వెర వొకతీరుసేసి నడిపింపుఁడు కార్యము; మీ విధించు వై
ఖరి మనుమెత్తికూర్తు - మదిగాక కొలందులు కొల్వ నేర్తుమే!"॥ 43

చ॥ అని వచియింప, నంద ఱిది యౌనని; రంత శివప్రభుండు "మీ
మనసు మథించి చూడుఁ డొకమార్గము; నేనును నాకుఁ బెద్దలౌ
ఘనుల యెడంద మట్టి, మొనకట్టెద నొక్కతెఱం" గటంచుఁ గొ
ల్వును విడి, జీజియాఁ గనఁగఁబోయె విధేయ పథానుగామియై॥ 44

డాయఁగఁబోయి భక్తినిబిడమ్ముగ మ్రొక్కినఁ, బుత్రు నెత్తి దీ
ర్ఘాయు రనామయంబుల శుభాశిషముల్ గురియించి, జీజియా
బాయి కుమారు నెమ్మొగమువట్టిన విన్నఁదనంబుఁ - గావిశం
దోయునిఁ జూచి, జాఱునెదతోడ నిమిత్త మెఱుంగఁ గోరినన్॥ 45

—— షాజీవిడుదలకై శివాజీ పర్యాలోచన - జీజియా నిర్ణయము ——

చ॥ కొతుకు నెడందతోడ నతుకుల్‌గొను కుత్తుకతో శివుండు సం
గతి వినిపింపఁగా - విప దకంపిత వీరవధూటి జీజియా
చితుకు నెదన్ గుదించి, పగచేఁతల కూర్చుచుఁ బల్కె, "నంతలా
జతనము లింతలయ్యె: బలశాలులకున్ జెఱసాల లయ్యెనే!॥ 46

ఉ॥ పోసరమార నిట్లు కపుంబలె హైందవమెల్లఁ దోలుచున్,
మోసము లెంచుచున్, గదనముల్ నడిపించుచు, మృత్యుదేవతా
హాసముల న్నటించు యవనాధిపులన్ గననోడి, దైవమే
వీసరపోయి యోసరిలె; వే రొకరుం డిపు డేమిసేసెడున్"॥ 47

చ॥ అనునెడ నామెనెమ్మొగము నంటిన జేగుఱుఁగప్పు, చూపులన్
దనుఁగుమిణుంగుఱుల్, పలుకుదూఁటిన వాఁడియు, లోని వేఁడియున్
గని, తెగుదెంపు ముమ్మరముగా మొనకట్టియు నిర్వికారతన్
గొని, శివరాజు తల్లియుడుకున్ దడిచేతుల నంటి యిట్లనెన్॥ 48

చ॥ "కనలకు తల్లి! నీమది నొకంటఁ దిరం బొనరింపకున్న మా
మనసులు ప్రీలిపోవె? యది మాన్పఁగవచ్చునె? దైవ మెప్డు క
న్గొన లఱమోడ్చునే? మెఱుఁగుఁగోఱలు డుల్లఁగ మృత్యుదేవతా
నన మఱకాలఁ దన్ని, భువనమ్ముల నోమ శివుండు చాలఁడే?॥ 49

ఉ॥ అత్యమలంబు ధర్మపథ, మందు జయంబు ధ్రువంబు, దానితో
నిత్యము లాపదల్, మనసునిండిన యోర్మి కడంక తెంపు సాం
గత్యమువొంది పండు, నటుగావున సాత్త్విక వీర భూమికా
నృత్యముల న్నటింతు; జననీ! నడిపింపుము కార్యరంగముల్!॥ 50

ఉ॥ అంతటి షాహజీనృపున కర్మిలిబిడ్డఁడనై, యుదాత్త శు
ద్ధాంతర జీజియా యమృతహస్తములన్ జెనుపొంది, ఖాండదే
వంతటి దేశికున్ గొలిచి, యాప్తుల నందఱ నేలఁగల్గి - యీ
క్రంతలు కాఱియల్ దుడువఁగావక, యే నిఁక రిత్తపోదునే?॥ 51

ఉ॥ మానుము చింత, చేయఁగల మార్గమునన్ దగవుల్ దలంచి నీ
యాన నొసంగు; మిష్గు యవనాధిపుఁడున్ జనకుండు కొల్వుకున్
రా నొక కమ్మఁ బంపిరి; తిరస్కృతిఁ జూపిన నొక్కముప్పు, లే
దే నిరువైపు ముప్పు - మొదలెత్తిన కార్యముతప్పు దోఁచెడిన్॥ 52

ఉ॥ 'రమ్మనినాఁడు తండ్రి' యనరా దనకుండఁగరాదు; 'నాదు క
ర్జమ్మును మెచ్చినాఁ' డనఁగరా దనకుండఁగరాదు; 'నాకుఁ గా
ర్యమ్మును జూపినాఁ' డనఁగరా దనకుండఁగరాదు; వారి బం
ధమ్మునఁ దక్కి వ్రాసెనిటు - తా నెదకోఁతలఁ గ్రుంగిపోవుచున్॥

చ॥ ఒకయెడ భారతోదయసముద్ధరణైక మహోద్యమంబు, వే
ఱొక యెడఁ దండ్రికై జతన - మొం డొకఁ డిట్లు పరస్పరోపరో
ధకముగ నడ్డుతాఁకె; నొకదానినిఁ బెంచితి నేను - బెంచెన
న్నొకఁ, డివిప్రాణమట్టి; వెదియోముకు? రెండు భరించు టెట్లగున్?॥

ఉ॥ కేవల రాజనీతిఁ బరికింపఁగరా - దిది ప్రేమతత్త్వ వి
ద్యావిదు లార్చి తీర్చఁగల యంశ మగున్; ప్రణయ ప్రబుద్ధమా
దేవత - వన్నిటం దనుకు తేజమునన్ గనువిచ్చి చూడు, మా
జ్ఞా వచనమ్ము నిమ్ము! సడిసవ్వడికిన్ నను బాయఁద్రోయుమీ!॥ 55

ఉ॥ ఉన్నది చేతశస్త్ర - మదియున్ బదనైనది; లోనఁ బౌరుషం
బున్నది మొక్కవోక - యదియున్ బదనైనది; వెంట మార్బలం
బున్నది మున్నుదూఁక - నదియున్ బదనైనది; ప్రాణశక్తి నీ
వన్నిటఁబోసి యొక్క తెరువాడుము తల్లి! జయింతు విశ్వమున్”॥

చ॥ అను శివరాజువిన్నపము నందుచుఁ గన్నుల మోమునన్ మనం
బున వడఁదేఱి, తేఱుకొను పూనిక మీఁదటితీరు సేయఁగాఁ
బెనఁగు తలంపులన్ జదివి, ప్రేమపరీక్షల నిల్చి, జీజియా
ననుపున వాకొనెన్ - హృదయనాడుల దాఁపటికమ్ము విప్పుచున్॥

చ॥ "అవును కుమార! నీ వనినయట్టులు కార్యవిధాన శక్తి పా
టవములు నీయెడన్ గడుదిటమ్ముగ నున్నవి; చెప్పినంత చే
యువెరవు పెద్ద; పెద్దల హితోదితముల్ గొని ధర్మమార్గమున్
దవులుడు - వీతెఱంగు లుచితమ్ములు శ్రేయము గోరువారికిన్। 58

ఉ॥ పెద్దల చాటుఁబాసి, బడిపెద్దఱికమ్ము గడించి, తీఱముల్
దిద్దఁగ నేర్చినప్పు - డొకతెంపును దేఁకువ లేక యుండ; వా
పద్దశ లడ్డమైన - బిగఁబట్టిన తాలిమికేలఁ గొండలన్
బ్రద్దలుసేసి కార్యములఁ బట్టెడు ధీరులజాడఁ జూడవో?। 59

ఉ॥ ఉండఁగవచ్చు భక్తిరతియున్ దలిదండ్రులపైన: ధర్మశూ
రుండవుగాన, వారి యెడరున్ వెడలింపఁగవచ్చుఁ: గార్యశూ
యండనఁ జిక్కుఁ-బాపఁ జతురుండవు గావలదయ్య? నిన్ను బ్ర
హ్మాండము లాఁపఁజాల - విటు లానయిడన్ బనియేమి నాపయిన్?॥

ఉ। నీమది కొందలంబు గమనించితి - 'లోకహితమ్ముపొంటె ను
ద్దామత శేఁగఁ దండ్రి కహితమ్మగునో యని, దాన దుర్వ్యథల్
నామది ముట్టునంచు, నిటు నచ్చిన యుద్యమ మాఁపరామియున్
బ్రేమసమాధికిన్ జలదరింపులు వోయఁగలేమి కన్పడున్। 61

ఉ॥ ఉన్నతిఁ గోరి, హైందవ సమున్నతిఁ గోరియు, నంతలంతలా
బన్నము లంది, యన్యులకుఁ బ్రాణము లొడ్డి గడించెఁ బ్రాపు - నీ
కన్నగురుండు నీహితముఁగన్న విభుండగు తండ్రి నీకు, నా
కన్నిట దైవ - మయ్యనఘుఁ డాపదవో నెటు తాల్మి నిల్చెదున్?॥

ఉ॥ అంచితరీతి హైందవ మహాభ్యుదయంబును గన్నులారఁ బ్రే
మించితి: దానికై యధిగమించిన నిన్ను మనంబునిండఁ బ్రే
మించితి: నీవుగాఁ బరిణమించిన మూలమహాస్సు నేల ప్రే
మించినమాట - యిట్లుపరమించెఁజామీ ప్రణయ ప్రబంధముల్!॥

చ॥ బుడిబుడి చెమ్మటల్ మునుఁగఁబోయుచుఁ బెంచఁగఁ బూలుపూచు నీ
వడి యుడిగింతునా? యఱుతబంటి సెగన్ దగవోవు తండ్రి నా
అడి విడుమందునా? కఱకు అక్కసతాలిమిఁ బూని వారిచేఁ
బడ నినుఁ బుత్తునా? తనయ! ప్రాణములే బరువై కలంగెదన్!॥ 64

చ॥ అడుగకునన్ను: వట్టిబయలై పెనుగాలికిఁ దూలిపోవు నా
యెడఁదకు నిల్వ లే; దయిన నిప్పటి కప్పటి కొక్కనమ్మకం
బడగొనియుంటి: నీ వభయహస్తములన్ గొని పూరి పోఁ చయే
విడు - మది వజ్రమై యమృత వీరుధమై ఫలసిద్ధిఁ గొల్పెదన్!॥ 65

ఉ॥ ఇంతట నిల్చియుందుఁ; దగ వెంచుచు నీ వెదియైనఁ జేయు - మా
పంతమునన్ ఫలించెడు శుభ మ్మశుభమ్మను 'దైవ నిర్ణయా
గంతుక' మంచు మొగ్గవడుకన్నుల గన్గొనుచుందుఁ, గందు ని
శ్చింతత: లేదు నీకు సడి - సేగియు రాదనియున్ గడంగుమీ!॥ 66

ఉ॥ తక్కినమాట లట్లునిచి, తండ్రియొసంగిన యుత్తరమ్ములో
దక్కిన తెల్విఁ బట్టు - మది తాకునఁ దప్పునఁ దాటిపోక పై
కెక్కు తెఱంగునన్ జొనుపు; మింపునఁ - దప్పను తండ్రికోసమై
యక్కఱఁగొన్న కీర్తి: యదియై జయమబ్బిన - రెంట మేలగున్॥ 67

చ॥ అకపడు రెంటిలో నొకటియైనను దక్కొను టొక్కదారి: కొం
చక తనమేలుఁ జూచికొని చల్లఁగ జాఱు టధీరవృత్తి: యెం
డుకు వెనువోక దూఁకి, తఱితోఁ దలలెక్కుట సాహసంబు: యీ
సకలము దాఁటి, మేటి యొకచక్కటి సర్వముఁ దీర్పఁజాలఁడో!॥ 68

ఉ॥ డాఁపక తల్లిదండ్రులయెడన్ గల యప్పును, భారతా వనీ
తాపముఁ బాపఁగా నదనుదప్పిన తప్పును, మచ్చరించువా
రోపుచు నీ కొనర్పఁగల యుప్పలికప్పును దూఁచికొమ్ము, నీ
యేపునఁ దూఁగుదాని విరియింపుము: తీర్పరు లెవ్వ రిందునన్!॥ 69

తే॥ గీ॥ అన్నివైపుల శుభము జయమ్ముఁ గూర్చి
యేగుదెంచెడు నీరాక కెమరుచూతు:
నలఁతమైఁగాక — ముమ్మరమైన తనివిఁ
జెమ్మటలఁ దోఁగు నిన్ను నాశీర్వదింతు"॥ 70

చ॥ అని తగవాడి, పుత్రిహృదయమ్మును మోమునఁజూచి జీజియా
తనుపునఁ బొంగి, "పుత్రి! కులదైవతమైన భవాని నీమరూ
పున సకలమ్ము దీర్చు, శుభముల్ జయముల్ సమకూర్చుఁ, దత్పదం
బును శరణందు" మన్న, శివభూపతి "భాగ్య" మటంచుఁబల్కుచున్॥

ఉ॥ పొంగెడుమేనఁ దల్లిసెలవున్ గొని యాత్మగృహంబు సొచ్చి, చే
యంగల సాంధ్యకృత్యముల నాదటఁదీర్చి, యనేకభావనా
సంగతిఁ బోవు చిత్తమున సాపడి, నెయ్యమువోసి తోడుసూ
పం గల మేడకుం జనియె భావికథా రచనాభిలాషియై॥ 72

సయీాబాయిసలహా - భవానీప్రార్థనము.

మ॥ నవమాసంబుల నిండుగర్భమున మందస్పంద యానంబునన్
నవకంబుల్ దులకించునిల్వున నలంతలోన్ సయీాభాయి త
న్నవలోకించి యెదుర్కొనంగ, శివరా జాచెల్వచెల్వంబు క
న్గవకున్ జల్వలువోయ 'నిల్వు' మనుజోక్తన్ డాసి కేలందుచున్॥ 73

ఉ॥ ఆదరవీచికా నిచులితాంతురుఁడై మృదులోకుధాన త
ల్లోదరసీమఁ జేరఁ, బతియోర మెలంగుచు నామె తన్ముఖ
శ్రీ దిగువాఱు నీడలును రీతులుమాఱిన చేఁత లెంచి, త
ద్భేద మెఱుంగ విన్నపముఁబెట్టె శివప్రభుఁ డండఁ జేర్చుచున్॥ 74

ఉ॥ సంగతి యంతయున్ దెలిపి, "చాన! విధానము దోఁప, దిప్పు డే
భంగిఁ జనంగ నేదొసఁగు పట్టునొ! చూడుము నీవుఁగూడ: 'రా
జ్యాంగములందు మాకుఁ జొరవా' యనెదో యదిగాదు - నాకు న
ర్ధాంగివి: తెల్పు కొక్కనెలవన్నది యున్నదె? తోడుసూపుమీ!"॥ 75

చ॥ అని వినిపింపఁ, బెన్నెఱఁగులొ తలపోఁతల నూర్పువుచ్చి, నా
ధుని యనునీతిరీతిఁ గొని, తొంగలిఱెప్పలఁబోలె నెమ్మనం
బునఁ దెరమంచుఁ బోఁదుడిచి, పుట్టిన వంగడపుంగొనంబు మె
ట్టిన యిలువావి రాచసురఁటిన్ గదలింపుచు నామె యిట్లనెన్॥ 76

మ॥ "నను మన్నింపుము నాథ; యిట్టిపనులన్ నాబోఁటు లేమన్నఁ జా
లినదానే 'యొక యాఁడుకూ' యనుచుఁ దూలింపంగ నొఁగాక: నే
ర్చిన మీతీరులు దిద్దనౌనె, యది యౌచిత్యంబె? యేమైననే
మనెదన్ మీ చనువంది - పొందుగొనఁదోడైయున్న మేలయ్యెడిన్॥

ఉ॥ తీఱమి యింతవట్టు కడతేఱిన దిప్పటి కీగతిన్; దునే
దారితనంబులేక, పెరదారుల వైరులు పుట్టునట్ల ఫూ
త్కారము సేయుచుండిరి: తెగంబడ కిప్పుడు వారుఁబోయుచున్
దోరమువెట్టి మ్రొక్కబడి నోఁచుట యావను లిచ్చు మెత్తురే!॥ 78

చ॥ మనసున మాట రెంటఁ బురిమార్చుచు, ముప్పిరితీరు చేతఁ బెం
చిన పగతాళ్ళు ద్రెంపఁ దడిచేతులు చాలునె — వాఁడికత్తులన్
దునియలు సేతగాక? పెరత్రోవ లవెన్నియు వారిమంచికై
పనుపడనేర్చునే - యడుగుఁ బట్టినఁగా? కిది శూరుఁ డోర్చునే? 79

చ॥ ఇరుదరు లంటఁజూచి మొదలెత్తుట మే; లొకకొంత యీఁది ద
గ్గఱిదరి వీడుచో - నవలిగట్టును మెట్టుట గట్టిపూనిక; సా
గరమున దూఁకునప్పు తరఁగల్ నురుఁగుల్ సురగాలిసుళ్ళు పైఁ
దెరలఁ - దలంకుగుండియలు ధీవరులన్ దనియింప నేర్చునే?॥ 80

ఉ॥ ఉత్తముఁడైన మామ పగయొత్తుల గత్తరవోవుచుండ నే
జిత్తులతోఁ బనేమి? యెగఁజిమ్ము మగంటిమి కావి రేఁగఁ, బై
కెత్తిన కేల విచ్చిపరువెత్తఁగ దాయలఁ దోలి, కార్యముల్
బొత్తిటఁ జేర్చుదాఁకఁ దఱిపుత్తురె డాఁగురుమూఁత లాడుచున్?॥

ఉ॥ ఇంతగ లోఁతు పాఁతరయనేటికి - వైరులు మామగారికిన్
బంతమువట్టి యేదయినఁ బాపము సేతు రటంచుఁగాదె? యీ
వంతు తొలంగుఁగా - కది యవశ్యమ యానెడ దాఁగనౌనె? వి
భ్రాంతియగాక పట్టుగొని ప్రాణము లెవ్వఁడు గాదెఁబోసెడున్!॥ 82

ఉ॥ అత్తకు మామకున్ గుఱుచలాడిన పాపము సేయ - వారు నా
యుత్తమదైవ దైవతము: లూర్జితశక్తిఁ గడంగి వారి యా
పత్తులు దీర్చు టాద్యమ యవశ్యమ - కాదనదానిఁ గాని, యీ
పొత్తున మీకడంక గతివోవకవిచ్చుట లామతించెదన్॥ 83

ఉ॥ తల్లిమొగంబుఁ జూచి, పగదారుల దక్కిన తండ్రిఁ జూచి, మీ
యుల్లము సళ్ళుపోనునికి యొప్పునె? హైందవ రాజ్యలక్ష్మికిన్
బల్లవతోరణంబు నిలుపంగల యీకర మిట్లు చెక్కిటన్
జెల్లువడంగ - నేభువనజేత శతారము చేతఁబట్టెడున్!॥ 8

ఉ॥ పున్నము నోఁచి, కొత్తసరిపువ్వులు వోసి భవానిపూజలన్
గన్నది జీజియా - భరతఖండము గొన్నది మిమ్ముఁ; దత్తప
శ్ఛిన్నములౌచు విఘ్నములు చేడ్పడుఁ; దత్సమనోరథామృత
స్విన్నము మీకడంక వికసించుఁజుమీ నిలువెల్లఁ బూచుచున్!॥ 85

చ॥ గడుసరివాయి మీఁగడలుగట్ట వచింపఁగ నేరనయ్య, నా
విడిచిన తెంపు నైఁపుఁ; డదవీయసమా నిజ కార్యసిద్ధికిన్
దొడిమెలు నొక్కువారివడి దోఁచి, స్వతంత్రత నిగ్గుదేఱ, న
ల్గడ జయ మంగళధ్వను లెలర్చెడు హైందవలక్ష్మిఁ జూడుఁడీ!॥ 86

తే॥ తలఁప సలుపఁగా మనము కర్తలమె యైనఁ
గనులకందని బ్రహ్మాండ గర్భగోళ
మొనసి యుఁగొట్టు సర్వభోక్తను దలంపుఁ,
డతని మే లంద భావికార్యమునఁ జనుఁడు"॥ 87

చ॥ అనెడు వధూమణిన్ బులకితాశయుఁడై తుదికంట విచ్చు మె
చ్చునఁ గని, ముంగురుల్ పుణుకుచున్ శివభూపతి వల్కె- "నీ వచిం
చిన తెఱఁ గింతయొప్పునొకొ! చిత్తము గొంజిగురాకులెత్తె మా
నిని! సరిక్రొత్తపోకడల నేర్చితి - మబ్బులలో మెఱుంగులన్॥ 88

ఉ॥ నాదము లెన్నియేనియు వినంబడి గింగురుమ్రోసె: నీ శ్రవో
భేదమునన్ శ్రుతిన్ గలిపి వీణియతంత్రులు మీటఁజాలఁ: జిం
తా దమనంబు శాంతి సదనంబు వివిక్తమునౌ సమాధి నే
నాదటనోదు; నీవు బరువౌ కనుఱెప్పల సేదఁ దేర్చుమీ!"॥ 89

తే॥ అనుచు నిల్లాలి మృదుల తల్పాంతరమున
విడిచి, యేకాంత మాధురీ విహృతిఁ గోరి,
పాలపొంగుల వెన్నెల ల్వాఱు మేడ
బయలఁ జల్వరాచప్పటఁ బవ్వళించె। 90

ఉ॥ దొంతరలై తలంపు లెడదోఁపక చుక్కలువోలెఁ బొంగి, భా
వాంతరవీధి నాడి, నయనాంతములన్ దిగువాఱి, యిందుపా
దాంతరితంబులై చనఁగ, నన్నిటికిన్ దరువాయి సర్వవి
శ్రాంతి నికేతనంబు కడసారి భవానిపదంబు దోఁచినన్॥ 91

ఉ॥ ఆఁకటఁ దూలు తేఁటి యొకఁడై వికచోత్పలపాళి నిల్చి, య
ట్టాఁకల ఱెక్కలార్చుకొని యాడుచుఁ దేనియ లానియాని, యం
గీకృత గీతికారతి సుఖించినరీతి భవానియంఘ్రులన్
జేకొని, ఱెప్పవ్రాలుపురుచిన్ శివరాజు తలంచె నీగతిన్॥ 92

తే॥ "గగన ఫలకము - వెన్నెల జిగురుఁబూఁత,
తారకాపఙ్క్తి నీ మహత్త్వంపు వ్రాఁత,
కనులు మలపక నిలువెల్లఁ గలయఁజూచి
చదివితినిఁ - దల్లి! తాత్పర్య మొదుఁగదేమొ!॥ 93

తే॥ అరసితిని వారివారి భావాంతరముల,
ననుసరించితి నురక విద్యార్థివోలెఁ,
దనుపు దొరకదు - తగినయుత్తరము రాదు:
గురువు దరిలేనిచదు వెంతబరువు తల్లి!॥ 94

తే॥ తఱపిపాఁడిలోఁ గొసరు తత్త్వరము తరిచి;
ధర్మజిజ్ఞాసలో నిరుత్తరతఁ గఱచి,
యాత్మశక్తిని మఱచి యిట్లైతినేమొ -
దారిచూపుము తల్లి! చిత్తమున వెలిఁగి॥ 95

తే॥ కౌతుకమదితోడఁ గార్యమ్ముఁ గొనుటలేదు,
కొను కడుకలో ద్రోహచింతనము లేదు,
చింతితము చేతిమోపైనఁ జెదరలేదు,
చెదరఁబోమి పరీక్షసేయుదువొ తల్లి!॥ 96

తే॥ అఱుతనిడు తమ్మెలపుటాకు నఱకునపుడు
తూఁగు త్రాసులో ధర్మంబుఁ దూఁచునపుడు
వణఁకులాడని కరము - నిల్వఁగల కన్ను -
తగవు - మెలఁకువ - చొరవ నీ ధర్మభిక్ష!॥ 97

తే॥ రేఁబవలు వెల్గుకంట గుర్తింతు వనుచు
పాఁగఁదోలితి ధర్మరథసారథంబుఁ,
గనులు మలపకు - మిరు లరుల్ క్రమ్ముకొన్నఁ
జీకటిజగంబులో నేమిసేతువమ్మ!॥ 98

తే॥ ఇంత నిక్కచ్చి - సిరులు నిల్వోల్ల నములి
కొలుపుగద్దెపై నొఱగి కులుకుటకుఁగాదు:
'దొడ్డతల్లివి - గుంపెఁడుబిడ్డ' లనుచుఁ
గొదవఁ దూలింపఁ 'బ్రాఁతపల్కులకుఁ' బోతి॥ 99

తే॥ అయిన నేమాయె - నిప్పటికైనఁగాని
నన్ను నడిపించుకొనుము నీ కన్నయట్లు:
తలఁపుఁ దిరుగ కే నొల్లెనఁ దక్షిమినడిచి
దుడుకుబిడ్డల తల్లిప్రేముడి గడింతు॥ 100

తే॥ ఇంతకును నన్ను మీఱి కల్పాంతకమగు
వాన గాలియు నగ్నిపర్వతము లేవు,
'ప్రేమ' మని 'ధర్మ' మని తూఁచి పెనఁగు మనసుఁ
ద్రెంప లేనైతిఁ: దగవుఁ జూపింపవమ్మ!॥ 101

తే॥ చెఱయు సంకెల తలిదండ్రు లురియుచుండ -
యందు నిందును సమను: నీ వవతరించి,
తలుపు దీయించి యమునలో దారియిమ్మ:
కలఁడు శ్రీకృష్ణుఁ డీవలఁ - గంసుఁ డవల॥ 102

తే॥ రావణుని లంక గ్రమ్మంగ భారతతపస్సు;
నడ్డు పడె వార్ధి; భేదింప నగునొ హింస!
ధర్మలక్ష్మికిఁ జెఱఁబాపఁ దలఁచు నాకుఁ
దెరు వొసంగదో? శరము సంధింపు మనెదొ!॥ 103

తే॥ అణువు మొదలుగా సర్వ సర్వాంతరములఁ
గార్య కారణ కర్తృ తాఖండమూర్తి,
వెలుఁగుచున్న తేజోమయ విశ్వశక్తి,
మేలుకొలుపుము! నాయందు మేలుకొనుము!"॥ 104

తే॥ అనెడు తలపోఁత గాఢసమాధి మునిఁగి
కన్నుమూసెనో - తెలిసెనో కన్న దెవఁడు!
సృష్టిశాంతితో జరుగు సంసృష్టి యేదో!
కోడి మెలుఁగెత్తెఁ 'గొక్కొ-రోకో!' యటంచు॥ 105

చ॥ మలయుచు నిందునందు సుకుమార సమీరము లోఁగఁబాఱి మే
ల్కొలుప, శివప్రభుండు పురికొన్న మదిన్ గనుదోయి విచ్చి, ఱె
క్కలు విదిలించి లేచు విహగమ్ములవెంటన కాల్యకృత్యముల్
సలిపి, దివాకరుం డుదయసానువు నెక్కుటఁ గొల్వుదీర్చుచున్॥ 106

చ॥ పరిణత సత్త్వులైన సచివప్రవరుల్ హితులున్ జమూపతుల్
దొరసినకొల్వుఁ జూచి సరితూఁచి శివప్రభుఁ డిట్లు వల్కె, "ము
ష్కరమగు నేఁటిచిక్కు నలుచక్కియలన్ గదలించి యోర్పునై
నరసితి - నెట్లువోఁ జివర కడ్డమగున్ జెఱలోని చీఁకటుల్॥ 107

చ॥ అడఁకువయున్ బెనంకువయు నంకిలివో మొనకట్టఁ జాల వీ
గడుసరిమూఁకపట్లఁ; దునుఁగన్ బడ లాగిన లగ్గులేని యీ
పడి కడుసున్నితంబు; యిరువైపుల మ్రొగ్గతిలంగఁ బోని కా
వడిఁ గొని, తొటుర్వో కడుగుపట్టును బైలివ చూపఁగాఁదగున్॥

తే॥ అడఁగి పోవుచో - సులతానుఁ డణఁచు మనల,
నెదిరి మార్కొన్నఁ - దండ్రి కేమెడరు గలదొ!
యిరుదెఱంగుల మేలు లే, దిపుడు బలియు
నొకని వానిపై కనుపుసేయుటయ తగవు॥ 109

ఉ॥ మొగలుపాదుషా బలఁగమున్ దలపోయుచు లోఁగి, వారి వై
రాగమ మెన్నుచున్ బడగయాడక యుండె బిజాపురీశుఁ; డా
మొగలుపాదుషాహి తఱిముట్టుచు దక్షిణభూమియెల్ల స్వా
హా గొన వేచియుండె - స్వసహాయుల బంగరుకేల దువ్వుచున్॥ 110

చ॥ ఇది తగువేళ: మొగలుల కేదియొలాభముఁ జూపి, సాయమున్
బదిలముఁజేసి, తండ్రిఁ జెఱఁబాపఁగ వచ్చు; బిజాపురంబుతో
నెదిరెడుమాకు సాయపడ నింతయు లోఁగఁడు పాదుషాహి: యీ
యదుపునఁ జిక్కవాపి, సమయానుగుణంబుగఁ జూత మవ్వలన్॥

ఉ॥ ఇప్పటిదాఁక మొగలుల కెగ్గొనరింపక యుంటగూడఁ దా
నొప్పిదమయ్యె: రెంటఁ బగయూఁది నిలంబడునే బిజాపురం -
బప్పులఁబోయె మొగలుల కగ్గమ దైన: దొకంట వారికిన్
దప్పఁదలంచి - తాను మనదాపునఁ జేరుటదైనఁ గాఁదగున్॥ 112

తే॥ అనువుమెయి నిప్డు షాహజహానుసాయ
మందు టుర" వని తననిశ్చయంబుఁ దెలిపి,
యంద 'ఱిది యుక్త' దని మెచ్చి యాడ, నపుడ
కమ్మ వ్రాయించెఁ బాదుషాగారి కిట్లు॥ 113

పాదుషా కుత్తరము - షాజీ విడుదల.

సీ॥ "శ్రీమదుద్దామ డిల్లీ మహాసామ్రాజ్య
సార్వభౌములవారి చరణపీఠి
వినతుఁడౌ శివరాజు విన్నపమ్ములు, - మేము
తమనిమొగుల మొక్కతరమునుండి,
భారతభూ సార్వభౌములౌ మీప్రభు
త్వము నండఁగొనఁ బెద్దతలఁపు గలము,
దక్షిణభూమియంతయు గెల్వఁదలఁచు మీ
జతనమందునఁ దోడు సలుపఁగలము,
తే॥ మా మనవిఁ జిత్తగించి, సామంతులందు
మమ్ముఁ జేరిచి, మాతోడు సమ్మతింపుఁ :
డిందు వంశక్రమాన మే మందుచున్న
'దేశముఖి' హక్కులను మాకుఁ దీర్పఁగనుఁడు!॥ 114

చ॥ మఱియొక విన్నపంబు; తను మాకొకన్నఁగా నను రేఁపెనంచుఁ దీ
వరపడి, నాదుతండ్రిఁ జెఱఁబట్టె బిజాపురపున్నవాబు; మీ
రెఱుఁగని దున్నదే! యెవరికే నొకయెగ్గుఁ దలంప, నడ్డుగాఁ
దిరిగినవారిఁ గొందఱ నెదిర్చితి - వారికి మాకు మేలుగన్॥ 115

చ॥ వివరములెల్ల మీకు వినిపించెడు మా రఘునాథపంతు; మీ
చెవినిడ కెట్టిసాహసముఁ జేయఁగరా; దిపు డేము తీర్పఁగా
నవుతెరు వానతిం; డుచితమౌనెడ వారల కాజ్ఞసేసి తం
డ్రి విడుపుసేయుఁ - డిట్టులఘటించిన నిందుఁ గలంత దీఱెడున్॥ 116

ఉ॥ * 'గోటన తీఱుకార్యమున గొడ్డలి యే' లని, మీ కలమ్ముతో
డ్పాటునఁ దండ్రికిన్ జెఱకవాటముఁ దీసితిరేని, మేటి యా
రాటమువోఁ గృతజ్ఞత దిరమ్ముగ మాతల మోసియుండుఁ; బో
రాటములేని దక్షిణధరన్ దమయేల్బడి తీవసాఁగెడున్!! 117

తే॥ భరతఖండముఁ గొనఁగోరఁ బట్టి యేలు
తమయెదుటఁ దద్దవల్కు పెత్తనము దగునె!
నెరసు నెఱుఁగమిఁ గన్న మన్నింపవలయు!
వేచియున్నాఁడఁ దమయాజ్ఞ వెడలుదారి!"॥ 118

మ॥ అనుచున్ గమ్మ ముగించి ముద్రయిడి, న్యాయాధీశవర్యుండు నా
త్తనయుండౌ రఘునాథపంతుకిడి కర్తవ్యంబు బోధించి, యీ
పని 'దారా' యువరాజుమూలమునఁ దీర్పన్ గట్టడన్ జేసి, యా
తనికిన్ గాన్క లొసంగి వీడ్కొలిపె - భృత్యశ్రేణిఁ దోడంపుచున్॥

చ॥ పదపడి తండ్రిగారికి నవాబునకున్ బదు లీయఁగోరి, బ
ల్లిదముగ వారిచిత్త మగలించుసెగల్ పయిఁ బ్రాఁకకుండఁ, దాఁ
బొదు పొనగూర్చుపూన్కి వెడపొంగులఁ బ్రొయ్యనిబ్రుంగకుండ, యు
క్తి దనర నుత్తరమ్ముల లిఖించె నతం డిటు వేఱువేఱుగన్॥ 120

---

* Shivaji petitioned to the Padsha invoking his patronage and instant aid .... and urged that in saving the life of such a distinguished general the emperor would strengthen the foundations of the Mughal power in the Deccan and could count upon the grateful assistance of Shahji and himself.

*Ch. VIII. N. S. Takakhav.*

తే॥ "శ్రీ బిజాపురపట్టణ సింహపీఠి
భామినీరాజ్య ధవళాతపత్రసీమఁ
బ్రభుత నెఱపు నాదిలుషానవాబుగారి
చెంత వినతుఁడై శివరాజు సేయుమనవి॥ 121

మ॥ తమ యాహ్వానముఁ గొంటిఁ; బెద్దలగుటన్ దా మింతగైకొంట యు
త్తమ: మీ నాఁడును. నన్నుఁ రాఁబిలుచు మీతాత్పర్య మెంతేని యో
గ్య మనన్ జెల్లదె! తప్పుఁగల్గునెడఁ జక్కంజేయు దండం బవ
శ్యము కాదందురె - కన్నులన్ జెవు లొకంటై దారి చూపించిరన్!॥

చ॥ ఒక కొఱగామియే కలిగియున్న దనుం డది నాకృతంబు; దా
నికి గుఱియైన న న్విడిచి, నిర్మలుఁ దండ్రినిఁ గొంటి; రిట్లు గొం
చక తమరాజనీతి కలుషం బగునో యని లోఁ దలంతు: నిం
తకు నుచితజ్ఞులైన తమదాపుగ దాయని యూఱడిల్లెదన్॥ 123

శా॥ నా కార్యంబులయందు నెం దెవరికైనన్ గుందు పొందించు నూ
హా కాలుష్యము లేదు, పట్టుగొని రాజ్యాకాంక్షయున్ లేదు: ధ
ర్మైకాంతంబు మతంబు నోముటిది న్యాయ్యంబుచుఁ గైకొంటి; శి
క్షా కల్పంబున దీనఁ దప్పుఁగొను రేకల్ మీరు భావింతురే!॥ 124

ఉ॥ మోసముఁజేయువారడఁగ మొట్టుచు, దుర్గపదంబునన్ విప
ర్యాసముఁ జూపువారి దిగఱాచుచు, మ మ్మెదిరించువారికిన్
ద్రాసముఁగొల్పి - యిట్లు తమరాజ్యము మామత మోము పూనికన్
జేసితి నాజ్ఞవేచి; పెడసేఁతల కిందున దారిఁజూతురే!॥ 125

ఉ॥ శాంతపథమ్మునన్ దరిచి సాగిన సర్వముఁ జూడుఁ: డెందుఁ బ
క్షాంతర దీక్ష లేని తమయానతి కొప్పమి లేదు: తండ్రి వి
శ్రాంతికిఁ దోడుసూపెడు తెఱంగున నెమ్మదిమెట్టి మిమ్ము ద
ర్శింతుఁ, బొసంగుతీరు వివరింతుఁ, ద్వరంబడఁబోమి కోరెదన్!"॥ 126

తే॥ అనుచుఁ గమ్మ ముగించి, యనంతరంబ
తండ్రినిగుఱించి యెడఁదలోఁ దరఁగలెత్తు
వెడతలంపులఁ బొడము సవ్వడి నడంచి,
తడవికొను కేల వ్రాసె నుత్తరము నిట్లు॥ 127

చ॥ "అదరు నెడందతో వణఁకు హస్తముతో వెనుకాడు పూన్కితో
'నిది' యని తేల్చలేని యెదియే లిఖయింపఁగనైతిఁ దండ్రి! శ్రీ
మొదలిడి, పైన మీకుశలముల్ మఱి మాకుశలంబునైన వ్రా
యఁ దెరువులేనికమ్మ హితవమానె - నమస్కృతి వ్రాసిపెట్టినన్!॥ 128

చ॥ అటఁ జెఱసాల, గుండె లవియంబడు చీఁకటికొట్టు, వాఁకిటన్
భటుల తళత్తళించు కరవాలుమెఱుంగులు, తీవ్ర వేదనా
కుటిలము మీ మొగం - బిటులుగోచరమై యెదఁ గ్రుమ్మివైచు నా
రట మొకకేల నొత్తికొని, వ్రాసెద రెండవకేలి తూలికన్॥ 129

చ॥ తెగువన కొంటి మీ రనుమతింపని యుద్యమ మొండు; దీనిపై
దిగినవి నేఁటిబన్నములు - తీఱకపో వవి వచ్చినట్లె; యీ
తగవున నేనొ - మీరొ - సులతానొ నిమిత్త మనంగవచ్చునే!
జగదుదయంబునన్ జిగురుఁజాఱలు పోరులు సూడకుంటిమే!॥ 130

ఉ॥ ఏమని తప్పుగాఁదలఁతు రియ్యది వారును మీరుఁగూడ? నా
సేమముఁ గోరిగా, కెదుటిసేగిఁ దలంచియుఁగాక, నా మతం
బోమఁగ - నాదు హైందవము నోమఁగ - నే నిటు చేయఁగూడదో?
తాము దలంపరో తమహితం - బది మీరును సమ్మతింపరో?॥ 131

చ॥ దొరలమటంచు దీమసపుఁదుర్విళ్ళున వా రిటు రేఁగిరైన నన్
జెఱఁగొనరాదొ? తండ్రివని చేతికిలోఁబడు మిమ్ము శిక్షకున్
గుఱికొను టేమి? మీరు నిదికూడదటం చలవారిఁ బల్కఁగా
నలిగొను టేమి? మీకుఁ బ్రభులైరనుచున్ నన్నుఁ దప్పుఁజూతురో?॥

చ॥ † కొడుకని తండ్రియంచు నొనగూడిన బంధమకాక, నాయొన
ర్చెడుకృతులందు మంచికిని జెడ్డకు - మీకును బొత్తులేదు, వా
రడుగిడ హక్కులే - దెవరియత్నము వారుగ నుండవచ్చు; ధీ
రుఁడు సుతుఁడైనఁ దండ్రియెడరుణ్ దొలఁగించు నిజోద్యమంబునన్॥

ఉ॥ † వారల యుప్పుఁ దింటిమని వాకొనరాదని నాతలంపు; నే
నేరనినాఁడు మీయొడిని నిల్చిననాఁ డది యుండవచ్చు: నే
నీరతి రెండునుంబదియునేఁడుల ప్రాయమునుండియున్ స్వతం
త్రారభటిన్ జరించితి-సహాయులు పెక్కురు తోడుసూపఁగన్॥ 134

ఉ॥ † పట్టితి వారిదుర్గములుఁ బ్రాంతము - లట్టులె మీవికూడఁ జే
పట్టితి: నిర్వ్య రేకమయి బల్మిని నన్నరికట్టి పోరునన్
నెట్టఁగవచ్చు - నిల్వఁగల నేరిమిగల్గిన నిల్తు: నట్లుపో
కిట్టటు ప్రేలుచూపి, వెడయెత్తుల నెత్తు టుదాత్త రీతియే?॥ 135

చ॥ † నిజము వచింప నింతే; గమనించెద నీపయి సాధురీతి నీ
గజిబిజియంతయున్ దులుపఁ - గాఁగలయంతయుఁ గాకమాన; దా
త్మజుఁడగువాఁడు చూపఁదగు ధర్మమునంతయుఁ జూపెదన్; మనో
రుజ లెడఁబాసి నిశ్చయపరుండవు గమ్ము, తలంకుఁబాయుమీ!॥

ఉ॥ మీ యుపదేశ మే ననుగమించితి సర్వము, తల్లిభావమున్
దోయిటఁగొంటి, నిండుమదితోడ భవానిహితమ్ముఁ గంటి, నా
ధేయము రాజనీతి గణుతించితి, నెందుఁ గొఱంతలేని సం
ధేయము తీరుఁబొందఁగ - విధేయుఁడనై మిముఁ జూడ వచ్చెదన్॥

---

† I owe my birth to you but not my deeds. ....You may argue that till to-day I have eaten their bread .... but up to the twelfth year one is accounted a child and up to that age I lived upon your bread,....As I have taken forts and strongholds belonging to others, so are yours in my possession..... About them you should decide as is fit.... I shall in this way acquit myself of the duties of a son. Page 174. *Sabhasad.*

తే॥ కల యథార్థము సులతానుగారి కేను
దెలియఁబఱచితి నొక్కింత వెలితిలేక:
నా ప్రయత్నము వారిడెందము నిజంబ
సరళమైన - భవానియే సరదుఁగాక"॥ 138

తే॥ అనుచు వ్రాఁత ముగించి ముద్రాంకనమున
భద్ర మొనరించి, యుత్తరద్వయము భటుల
చేత ననిపి, కొల్వునువీడి శివవిభుండు
చనె - ననంతర కరణీయ సజ్జుఁడగుచు॥ 139

చ॥ దినములు కొన్నిపోయెఁ; జనుదెంచె వడిన్ రఘునాథపంతుఁ; డ
య్యనఘుఁడు, - పాదుషా యనునయంబునఁ గార్యము సమ్మతింపఁ గై
కొని, షహాజీవిభున్ విడువఁగోరి, నవాబున కాజ్ఞచేసి పం
చిన వివరంబులెల్ల - వినిచెన్ శివభూపతి సంతసింపఁగన్॥ 140

సీ॥ సార్వభౌముండైన షాజహా నంపిన
యాజ్ఞ యనుల్లంఘ్య మగుటవలనఁ,
దగు శివరాజునుత్తరముల షాహాజీ
యనపరాధత వ్యక్తమగుటవలనఁ,
దన మంత్రులందుఁ గొందఱు సేయువిన్నపం
బవలఁ దోయఁగరాని దగుటవలనఁ,
గ్రమముగాఁ బ్రజలలోఁ గలుగు నసంతృప్తి
యణఁప కుండఁగరాని దగుటవలన,

తే॥ సర్వమెఱిఁగిన యాదిలుషానవాబు
షాహాజీప్రభు విడిపించి సత్కరించి
తనకొలువుఁ జేర్చి మన్నించెఁ; దద్విధంబు
పౌరులు కుతూహలమై పాడించె శివవిభుండు॥ 141

బిజాపూరువారి పన్నుగడలు - శివాజీ ప్రతిక్రియలు.

చ॥ ఒకవెుడ భోసలేకుల శుభోదయవరా సుతజన్మవార్త, వే
ఱొకయెడఁ దండ్రిగారు చెఱనుండి తొలంగుట, భావిభాగ్య సూ
చకముగ రెండు దండగొని సంపతిలన్ - శివరా జొనర్చెఁ గౌ
తుకమున దైవతార్చనలు తోరపువేడుక లన్నదానముల్॥ 142

శా॥ కారాగారముఁ బాసియున్ జనకుఁ డాకర్ణాటమున్ జేర కా
యూరన్ గొన్నిదినంబు లుంటఁ గని, యేయుద్యోగమున్ జేయ నే
యారాటం బొనగూడునో యని, శివుం డుండాఁక రాజ్యాంగ సం
స్కారంబుల్ గనుచుండె వారి మదిపోకల్ పైన గుర్తింపుచున్॥

చ॥ చనె మూఁడేం; డ్లటుపైనఁ గన్నడపుదేశం బేగుచున్ షాహాజీ -
"నను మోసంబునఁబట్టి కట్టి చెఱలోనన్ బెట్టు 'బాజీ' ముధోళ్
జననాథున్ గసిదీఱ కక్కసమునన్ జక్కాడి, నాపుత్రకుం
డనుటన్ నిల్పు" మటంచు వ్రాసి చనె, నీర్ష్యా తప్త చిత్తంబునన్॥

చ॥ జనకుని యానఁ దీర్పఁగలచందములన్ దఱివేచి, యుద్యమం
బనువునఁ గూర్పఁగాఁ దెరువులారసి, నల్గడ వేగువారలన్
బనిచి రహస్యమందుచు, శివప్రభుఁ డెప్పటియట్ల రామదా
సునిఁ గననేగెఁ దోడుగొనుచున్ - 'బరళీ' గిరిదుర్గ సీమకున్॥ 145

చ॥ గురుఁడగు రామదాసమునిఁ గొల్చి శివప్రభుఁ డంతఁ బూర్వపుం
జరితముఁ దెల్పఁగా - నతఁడు సంగతముల్ వివరించుచుండె: నీ
మురువున రెండు మూఁడు దినముల్ గడవన్ మును పంపియున్న వే
గరి యొకఁ డేగుదెంచి, యటఁ గన్నయుదంతము వల్కె నీగతిన్॥ 146

తే॥ "షాహజీరాజుగారు బిజాపురమున
నుండుతఱి - వారిక్రింది యుద్యోగులెల్ల
గెరలి కర్ణాటసీమలోఁ దిరుగఁబడిరి,
కనకగిరి దుర్గమునఁ బెద్ద కలహమయ్యె॥ 147

శా॥ † ఆ జంజాట మడంపఁగాఁ జనిరి సైన్యాటోప మేపార సాం
భాజీగా - రట ముస్తఫా బలియుఁడై మాఱొడ్డె: దుస్తంత్ర రిం
ఖా జంఘాలుఁడు దూరమున్న యఫజుల్ ఖాన్ ముస్తఫా ఱేపి, సాం
భాజీగారిని... ...పల్కనోడెదను, దేవా! వారు లే రీధరన్"॥ 148

చ॥ అనునెడ బల్లెమున్ జొనిపినట్లగుచున్ శివరాజు వేఁటునా
టిన పులివోలె రేఁగి, "వికటించిన వీరి దురంత మొంతకున్
జన వెనుదీయదో! బ్రతుకుసావుల నేమగు - నిందుపై లయం
బానరుచు టొండుగా" కనుచునుండఁగ, నొండొకదూత డాయుచున్॥

శా॥ "దేవా! నేను బిజాపురంబరిగి నిర్దేశంబుఁ గైకొంటి: మా
యూవుల్ వా రెటులైన మీ కొకయపాయం బీయఁగాఁ దంత్రపుం
జేవాటంబున నుండి, రాపనికి 'బాజీ శ్యామరా' వన్న దు
ర్భావుం బంపి, రతండు కాచుకొనెఁ ద్రోవల్ - మిమ్ము సాధింపఁగన్॥

చ॥ తతిఁగొని పల్మ ఱిచ్చటికిఁ దా మరుదెంచుటఁ గాంచి, త్రోవలో
నతఁడు 'మహాడ్పురంబు' దరియంచుల దాఁకొనియుండె: జావళీ
పతియగు చంద్రరావతనిపట్టయి దారియొసంగి సాయ మీ
జతగొనియుండె, సైన్యము లసంఖ్యము - లింతయుఁ జూచివచ్చితిన్"॥

చ॥ అని వినిపింపఁగా శివమహాప్రభుఁ డా సులతానుగారి వం
చనములఁ గ్రించుసేఁతల నెసంగు మిడుంగుఱు లప్పళించుచున్
గనుల గభీరముద్ర వెలుఁగన్ దలయూఁపుచు, భావికార్యమున్
గనుబొమసుళ్ళు ముళ్ళుగొనఁగాఁ జెనవైచుచు నిట్లు వాకొనెన్॥ 152

† Instigated, if not actually aided, by .... Afzal Khan, Mustafa Khan overpowered Shahji's garrison and occupied Kanakgiri. .... .... Mustafa Khan treacherously ordered his artillery-men to hit, if they could, Sambhaji and the knot of officers about him. The batteries killed him instantly.

Page 147. *Kincaid*, C. V. O., I. C. S

చ॥ "సరి! యింక జాగు దీక్షిత! సజ్జనతల్ కొఱగానివాచు నే
ర్పిరి సులతానుగా - రిటుల విగ్రహముల్ మొనలెత్తె: యింక నె
వ్వరి చెయిమించు వారు తెగఁబట్టఁగవచ్చు నైనైన - నీసునన్
గొఱవినిఁ జూపఁ గుంతమునఁ గ్రుచ్చక, పుచ్చిలఁ బూజసేతురే?॥

మ॥ తడయంగాఁ బనిలేదు, పాండిపుత్ర, మా తానాజితోఁ బల్కి - స
వ్వడిలేకుండ నఖండసేనఁ గొని త్రోవల్ మార్చి రాఁగా నొన
ర్పుఁడు; నే నైదవనాఁడు పార్కనుములోఁ బొంచుండు: మీలోన నొ
క్కఁడు వీరిన్ గనుచుండుఁ - డీపనులు జెక్కల్ గట్టి తీర్పందగున్"॥

మ॥ అని వారిన్ వెడలించి, తాను గురు డాయంబోయి సుల్తానువ
ర్తనమున్ దెల్పుచు నిట్లువల్కె, "మునినాథా! రాజకార్యమ్ము లిం
త నిరాఘాటములౌనె! పాపమని పుణ్యంబంచు లేదౌనె! యే
ఘనుఁడైనన్ దన మానవత్వ మిటఁ జక్కఁగా నిల్ప వీలున్నదే!॥ 155

ఉ॥ ప నలు సంటరా, దనృత మెన్నఁడుఁ గూడదు, మోసగింపరా,
దే నోరుఁ గొల్వఁగూడ దనియే తలపోయుదుఁగాని - తండ్రికై
యా నియమంబు తేలగొను టయ్యెనొ! నేఁ డొనరించు కార్యసం
ధానము లొప్పునో! మనసు తత్తఱమందు నెఱుంగఁ బల్కవే!"॥

చ॥ అన విని రామదాసముని యాడెఁ, "గుమార! యుదారమైన నీ
మనసున కీమెలంకువ సమంజస: మిప్పుడ రాజ్యతంత్రముల్
గను మెఱపించుచున్న, వటుగానఁ దలంకెద: వొక్కనిల్వనన్
గనుఁగొన నౌనె ధర్మ - మధికారి విభిన్నత రూపుమాఱెడున్॥ 157

ఉ॥ తాను జగమ్ము మేల్వడఁగ ధర్మము కావలె - ధర్మబద్ధుఁడై
తాను జగమ్ము నోమవలె; ధర్మము దైవ మొకండ - దానికిన్
దాను జగమ్ము గూర్పఁగల తారక మేది? జగమ్ము తాను లే
రే నలధర్మ మేరి? కిది యెన్నుచు ధర్మము వాడుకోఁదగున్॥ 158

ఉ॥ మానవధర్మమున్న నొకమచ్చున నచ్చగునయ్య? దైవమే
మానుషరూపతన్ నడుపు మంచియుఁ జెడ్డయు; నిట్లు సర్వసం
ధానము దైవమూఁసవిధా సదసద్గుణశీల; మాటఁచేఁ
దేనియవోలె మానవవిధిన్ గొనుమీ మలినాంశమూడ్చుచున్!॥ 159

ఉ॥ 'లోకులు కాకు' లన్న నుడిలో నిజమున్నది: వారి నోటిలోఁ
బాకముదీఱి, పున్నెమును బాపమునున్ జవి మాఱు, రంగునున్
రేకయుఁ దేఱు; నేలవివరింపఁగ - 'నా' కనిగాక, లోక ర
క్షాకృతికై యొనర్చునది సర్వము పున్నెముగాఁ దలంచుమీ! 160

ఉ॥ అందును రాజనీతి కడు నబ్బురమైనది: యెత్తుకెత్తు వే
యం దగువాఁడ కార్య సమయజ్ఞుఁడు: పంటలు పండివచ్చునే
కందును గుందులేక - వెలికంచెలు వేయక! వజ్రవర్మమున్
బొందనిమేన శాతశరముల్ చొరఁబాఱుచుఁ జీల్చివేయవే!॥ 161

ఉ॥ కావున నీవు సేయఁగల కార్యము సర్వము యుక్త; మొక్క ధ
ర్మావసరంబుఁ బట్టి తగవాడుట దబ్బఱగొంట గాదు; మా
యావుల మోసగించుట యనర్థము గాదు; జగద్ధితంబుకై
సేవయు సేవగాదు; వగఁజెందకు - నీమది మార్పఁబోకుమీ!"॥ 162

చ॥ అనఁ దెలివొంది వారి సెలవంది, కడంగిన కార్యసిద్ధికై
పనిఁగొని యుత్సహింపుచు శివప్రభుఁడున్ సుభటాళి వెంటరాఁ
జని, మునుముందు త్రోవ నలుచక్కియలన్ దుదిగన్ను వెట్టి, పా
ర్కనుమకు దాపుగా నిలిచి కన్గొనె నచ్చటి యంగమచ్చముల్॥ 163

మ॥ తన యాజ్ఞన్ గొని యంతలో బలముతోఁ దానాజియున్ వచ్చె; నా
తని కాసర్వముఁ జూపిఁ చేయఁగల సంధానంబు వాక్రుచ్చి, న
చ్చిన సైన్యంబునఁ గొంతగైకొని శివాజీరాజు తాఁ బొంచి, న
మ్మిని వా రేమఱియున్న వైపుఁగొని దొమ్మిన్ దూఁకె నొక్కుమ్మడిన్-

మ॥ అటఁ దానాజి మఱొక్కవైపు తత సైన్యాటోపుఁడై దూఁకి, యె
చ్చటఁ దానై రిపుసైన్యముం బొదువ, నస్త్రవ్యస్త సన్నాహ లం
పటతన్ డీల్పడి వారు - నగ్గిశ దవ జ్వాలావళీశంబులై
యెటువోఁ జాలని లేడిగుంపులటు - లెంతేఁ గుంది రాదందడిన్॥ 165

మ॥ ఒకకేలన్ గరవాల మన్యమున డాలొప్పారఁ, గళ్ళెంబు మా
టి కుడాయించి, శివప్రభుండు హయమున్ డీకొల్పుచున్ వైరి మ
స్తకముల్ గోయుచుఁ గుప్పవోయ, శివరాజ క్షాత్రమున్ బేర్చుపో
లికఁ దానాజియుఁ గోల్తలన్ నెఱపి చీల్చెన్ శత్రు గాత్రంబులన్॥

మ॥ అమితోత్సాహముతో శివప్రభుని సైన్యం బేచి భంజింపఁగాఁ
దమ పన్నాగము లిట్లు నేఁడు విపరీతంబౌటకున్ గుంది, యొ
చ్చెముఁ దీర్పం దెయవేసి పేదవడి, బాజీశ్యామరా వే నికుం
జములోనో తలఁదాఁచె; సైన్యములు విచ్చెన్ బాఱ నల్మూలలన్॥167

పాఱెడువైరులన్ దఱిమి పట్టు నిజానుగులన్ మరల్చి, దు
ర్వారుఁడు శ్యామరావు దిగజాఱు నెడల్ వెదకించి, జావ
శూరుఁడు చంద్రరావు తలచూపమికిన్ దలయూఁచి, భోసలే
వీరుఁడు సేనతోఁ జనియెఁ బెంపున రాజగడమ్ముఁ జేరఁగన్॥ 168

ప్రతిపక్షుఁడగు చంద్రరావుమోరేను శివాజీ శిక్షించుట.

శా॥ ఆపైనన్ శివభూపుఁ డొక్కతఱి మంత్రాలోచ నైకాంతిక
వ్యాపారంబున నాంతరంగికుల నాప్తామాత్యులన్ జీరి, మా
యోపాయంబులఁ బన్ను వైరుల దురుద్యోగంబు విన్పించి, మ
ర్మాపాతంబుగఁ దత్ప్రతిక్రియలు సేయన్ గోరి తా నిట్లనెన్॥ 169

ఉ॥ "త్రోవలు పాదుషాచెలిమితో వికటింప, బిజాపురీంద్రు దు
ర్భావము హెచ్చెఁ; దండ్రిఁ జెఱఁబాపుటనుండియు రాజకీయ వా
తావరణంబు గుల్లవడి, యందముచందము మాఱె; సాహస
శ్రీ వెలివో నవాబు లొనరించెద రీ తెరచాటు బీరముల్॥ 170

చ॥ తమ కొలువందునున్న సరదారుల హైందవులైన కొందఱిన్
గమిగొని, యాసఁజూపి, బయకారములన్ బచరించి, మాపయిన్
దుముకఁగ రేపుచుండెఁ దజితోడ నవాబిట నెవ్వ రీగ్గినన్
దమకొకలాభమం; చిది యెఱన్ గమనింపర వారమాయికుల్॥ 171

చ॥ ఇరువురు శత్రులే యయిన, నించుక పైచెలిమి న్నటించి కీ
డ్పఱుపఁగ లోఁ దలంచు కులబంధులు వీ రనుకూలశత్రు; లే
యొరిమలు లేక మాకుఁ బగయొత్తెద రాబహిరంగశత్రులా
దార; లిపు డేర్పై రథముఁదోలుటకై మొదలెత్తఁగావలెన్!॥ 172

చ॥ ¶ బయిటికి రాకతప్పదు నవాబెపుడైనను - నాఁడె తత్ప్రతి
క్రియఁ గొనవచ్చు: నేఁ డనుసరింపని యీ కులబంధువర్గమున్
నయమునఁ జేరఁదీసి యొకనమ్మిక లోఁగొన నైనచో ననా
మయమగు నాత్మపక్ష; మటు మాఱనివారలఁ జూత మవ్వలన్॥173

సీ॥ జావళీధవుఁడు, మోరే వంశజుండైన
'కృష్ణాజిబాజీ' ప్రకృష్టబలుఁడు
బలవంతులైన తమ్ములు సుతుల్ గలవాఁడు,
పదివేల మావళాభటులు గలరు,
తనపెద్ద లెవరొ యుద్ధమున బిజాపురీ
పతిమెచ్చఁ బోరఁగా, నతఁ డొసంగు
'జావళీ' జాగిరు - 'చంద్రరావ్' బిరుదంబు
తరము లెన్మిదినుండి దక్కె- వాని;

¶ "The times dictated a policy of union and mutual trust for a common purpose. .... .... Shivaji tried to interlace to men's interests or ambitions in a way to make them feel pride in common success and shame in common defeat."
Page 54. "Rise of the Maratha Power" by
*M. G. Ranade.*

తే॥ గీ॥ కట్టెనూరుఁడు మనపక్ష మయ్యెనేని
తమకుఁగని బలమ్ము, దాన నుద్యమము పెరుఁగు;
మనము పశ్చిమదక్షిణ మధ్య మేరు
దారి సుగమమై - తజ్జయశ్రీ రహించు। 174

ఉ॥ కావునఁ జంద్రరావు నొడికమ్ముగ లోఁగొను టొప్పు; నైన ను
ర్వాభువుఁ డతండు, తంత్రపుఁ దెఱంగులఁగాక మతాభిమానపుం
ద్రోవలఁ బోఁడు, ధర్మము నెఱుంగఁడు, చుట్టఱికమ్ము చూడఁ - డీ
యావనసేవ మెచ్చి, మఱియాదలు వోఁ గులహాని కొగ్గెడున్॥. 175

చ॥ పనివడి రాయబారములఁ బంపితి, "వారలపేషి, మా కడం
కనుగొని నైనువేల బలఁగమ్మునఁ దోడ్పడుచున్ స్వతంత్రతన్
గను, మఱుగాక వారికిఁ గప్పము మాకిడి, మా స్వతంత్రతన్
జను" మని; 'యూనుగా' దనక చాటుమఱుంగుల జాఱిపోయెడున్॥

ఉ॥ అంతటఁబోక 'చుట్టఱిక మంటినఁ గూడిక హెచ్చు' నంచుఁ, బ
ఢాంతరమైన నోర్చి మను వంపితిఁ - గన్యక నిమ్మటంచు; దా
నింతయు సమ్మతించి బదులీ కొకపోఁడిమి నుండె; నింక సి
ద్ధాంతము సేసి వాని విహితాహితరీతులఁ దేల్చు టొప్పగున్"॥ 177

తే॥ గీ॥ అనుచు వివరించి శివవిభుం డచటనున్న
ధీరు రఘునాథబల్లాలుకోరదేవు -
నాజి దుర్జయుఁడైన సాంభాజికవజి
నాదరమ్మునఁ జూచి యిట్లనుచుఁ బలికె॥ 178

ఉ॥ "వింటిరి జావలీవిభుని వింతచరిత్రము: లిప్త వాని లోఁ
గొంటకు రీతులెల్లఁ గనుఁగొంటిరి: నేర్పన నందు మీకు మే
లంటినరీతి వాని మనయుండకుఁ జేర్చుట చూడుఁ - డింతకుం
గుంటుచు గంటులేక పనిగొంచు మెలంకువతో మెలంగుఁడీ! 179

తే॥ గీ॥ పరువుఁ గార్యమ్ము సెడకుండు తెరువు ముట్టి
యతని లోఁగొను తెఱఁగైన నది హితంబు;
బిరుసుతల గానఁ బెనఁకువ దొరయునేని -
మీ కపాయము లేకుండ మెలఁగుఁ డచట॥ 180

ఉ॥ నే నిపు డేగనుంటి జననీసహితంబు మహాబలేశ్వర
స్థానముఁ జూడఁ, గొన్ని దివసంబులు మేమట నుందుమేమొ! యే
దైనను ముఖ్యమైన సలహా గొను పొందిక పుట్టునేని మీ
లో నొక రేగుదెండు, మనలోపము లేదనఁ దీరుసేయుఁడీ!"॥ 181

చ॥ అని శివరాజు వల్క వినయానతులై సెలవంది వార లే
చిన బలఁగంబు వెంటఁ గయిసేయ నెకాయకి జావళీపురం
బున కరుదెంచి సేవకునిఁ బుచ్చి నిజాగమనంబుఁ దెల్ప, వా
రిని విడియింపఁజేసి, యొనరించె నతండు యథార్హ సత్కృతుల్॥ 182

మ॥ తమ యేతెంచిన రాయబారమును సూత్రప్రాయతం దెల్పి "చూ
తములెం డిప్పుడు విశ్రమింపుఁ" డని యాతం డాడ వీడ్కొంచు, దు
ర్గము నల్మూలలు సంచరించి - యట మర్మస్థాన సేనా రహ
స్యములెల్లన్ గమనింపుచుండిరి శివక్ష్మాపాల సేనాపతుల్॥ 183

మ॥ ఒక సాయంతనవేళఁ దన్నగర బాహ్యోద్యాన సౌధంబునం
దొకఁడై కొల్వయి, చంద్రరావు శివరాజోద్యోగులన్ ద్వారపా
లకుతోఁ బిల్వఁగఁబంపి సంగతులు తెల్పంగోర, ద్రాక్షాసవో
త్సుకితాత్ముండగు వానితోడ రఘునాథుం డాడె నీరీతిగన్॥ 184

శా॥ "రాజా! మా శివరాజమౌళి తమధైర్య ప్రాభ వోదారతా
తేజంబుల్ గని చెల్మిఁగోరి మముఁ బుత్తెంచెన్; మహాభాగుఁ డా
షాజీపుత్రుఁడు జాతి నీతి మతరక్షా దీక్షఁ గైకొంచు, ని
ర్వ్యాజంబౌ స్వకులీన బంధుల సహాయం బివ్వ దర్శించెడున్!॥ 185

చ॥ తమకడఁ బెక్కులేల విశదంబులు సేయఁగ! జూడఁ డిగ్గు దే
శము పడుచున్న కష్టములు! సమ్మతి నందఱు మీరు గూడి యు
ద్యమమును నిర్వహింపవలదా! యిటు దాయలఁగూడి యాత్మ ప
క్షముఁ దెగఁజూతురా! యడవికట్టియ గొడ్డటఁదూఱుతీరునన్॥ 186

చ॥ ఇదియునుగాక, మా శివమహీపతి చుట్టఱికంపు మేర మీ
యదు కొనరింపఁగాఁ దలఁచె; నంతటియుత్తముఁ డల్లుఁడౌట య
భ్యుదయము కాదె! యీసనుయ మొచ్చెము సేయక భావికార్య దో
హదముగ సమ్మతించి, యుభయాన్వయముల్ వెలుఁగొందఁజేయుమీ!॥

ఉ॥ అన్యుల నమ్మి జాతి కహితాచరణం బగు రీతి నేల! సౌ
జన్యము శీలమున్ బలము చాతురియున్ గల వీరలోక మూ
ర్ధన్యుని మాశివప్రభుని - రాజనియున్ హితుఁ డల్లుఁడంచు, మీ
కన్యక నిచ్చి, సర్వసహకారము లిచ్చియుఁ, దోడ్పడన్ దగున్!" 188

చ॥ అని వివరింప, మున్న మనసంటిన యీసు రగుల్కొ నట్టులై
యినుమడి కావిరేఁగఁ, గయిపెక్కు తలంపుల వేఁడియూరుపుల్
పెనఁగొనఁ జంద్రిరావు తనపీఁటఁ జివాలున డిగ్గఁ బాఱి యి
ట్లనెఁ - వడగంట్లువోని పరుషాక్షరముల్ వలకేలఁ జల్లుచున్॥ 189

చ॥ "బళిబళి! రాయబారము సెబాసుగ నున్నది! కొంటెగాండ్రకున్
దలముడిమైన వాఁడు సరదారుల కిప్పుడు మేలుబంతియై
వెలసెనె? దొమ్మిపోటు దలపెట్టుచు మమ్ములఁ గొల్వఁ జేరఁగాఁ
బిలిచెనె? వార్వమెక్కు తన వెంబడి మేము సవారిదీయుటో?॥ 190

చ॥ ఎఱుఁగఁడొ మమ్ము? మాబలము నేమనుచున్ దలపోసెనో? బిజా
పురిసులతానుగూడఁ దన పోటుఁదనమ్మున కాఁగఁడో? సరా
సరి జగమెల్లఁ దాన పిడుచన్ గొని మ్రింగునొ? నేఁటిదాఁకనున్
దిరిపెపుఁ గూటికిన్ గొలువుదీఱెడు తండ్రి తెఱంగెఱుంగఁడో?॥ 191

చ॥ $ పలువ యతండు మాకొలమువాఁడని పల్కినసైన సిగ్గుచే
టలమెడు - నల్లుఁ జేసి తనయన్ ముడివెట్టెదు వెఱ్ఱు లుంకురే?
తల బిరుసయ్యెనే - కులముతక్కువకున్ సుత నిమ్మనంగ? మీ
కొలఁదులఁ బోక - యెక్కువలకుం దలటెక్కుట లోర్వవచ్చునే?"॥

చ॥ అనియెడు పల్కులన్ గినుకనంటియు వచ్చినకార్య మొట్టులై
నను సవరింపఁబూని, తమనాయకు నానతి మేరముట్టి. యా
తని మధుపానరీతి యని యారసి, పే రభిమాన మోర్మి లోఁ
గొని, రఘునాథుఁ డాడె - ననుకూల వచో రచనా ధురీణతన్॥ 193

చ॥ "ఘనుఁడవు చంద్రరాయ! తమకమ్మునఁ బోవఁగఁ బాడియౌనె! నె
మ్మనమును జిక్కఁబట్టు: మభిమానమె యున్నను - దేశకాలముల్
గని యనుకూలవృత్తి మెలఁగన్ దలపోయుట మేలు: మా వచిం
చిన దొసఁగున్నదయ్య! నిరసించుట పెద్దలుమెచ్చు దారియే!॥ 194

చ॥ తమమది మాటిపోకకుఁ గతంబు నిజుంగము గాని - మాప్రభూ
త్తమునెడ లోటు లేదనక తప్పదు: మీరును వారుఁగూడి యు
ద్యమమును దీరుసేయఁ దగునంటిమి, వంతును వాదు లే, దవ
శ్య మనఁగలేము, శాంతమతులై బదులిం - డిపు డింతయేటికిన్!"॥

చ॥ అనుటయు, నేయిపోయు సెగలంటిన పావకునట్లు లిన్మడిన్
గనలుచుఁ జంద్రరా వనియెఁ, "గాని కువాదము లేల మాటికిన్
వినిచెదరోయి? మాకుఁ దెలివిన్ గఱపంగల బంటులైతిరో?
చనుఁ, డధికప్రసంగములు చాలు - నిఁకన్ బెడనోరు మూయుఁడీ?॥

---

$ Balaji More, who regarded the Bhonsles as inferior to his own ancient house, declined the offer (marriage.)

Page 147. *Kincaid*, C. V. O., I. C. S.

ఉ॥ పెద్దఱికమ్ము వేసికొని పిల్వనిపేరఁట మేలరాఁగ? మా
స్నద్దులతోఁ బనేమి? గడుసుండన మంటు గరాసు నొక్కనిన్
బెద్ద యొనర్చి వేడబఫుఁ బెండ్లికి వత్తురె? యంచకానకున్
గ్రద్దకు జోడె? వియ్యమునఁ గయ్యమునన్ మముఁదేఱిఁజూతురే?"॥

చ॥ అని కనులెఱ్ఱఁజేసి తెగనాడు నుడుల్ మదిఁ గుచ్చిమ్రుచ్చవ, రేఁ
గిన కనుఱెప్పవిప్పి మలఁగింప కెగాదిగ నిల్వసూచి యి
ట్లనె రఘునాథుఁ, "డాఁగు, మధికాధికముల్ తెగఁగోయనేల? యె
వ్వని బలగౌరవంబు లలవాని - వారుల్ తడవంగ నేటికిన్?॥ 198

ఉ॥ మా కిది యుక్తమంచుఁ దగుమాటలు పల్కితి: మిష్టమైన 'నాఁ
గా' కను - మల్లి కానియెడఁ 'గా' దను మింతియ, లేనిపోని వా
చా కుటిలత్వమేల? బలసంపద తూఁచుకొనం దలంతువా -
వాకులతోఁ బనేమి? మధుపాన మొకింతయు గుట్టుఁ బోవదే?॥ 199

ఉ॥ వీరుఁడ వాదుగాక, పదివేల తరమ్ములకైన భోన్సలే
ధీరునిఁ దేఱిఁజూడఁగల తెంపరివే? పయికన్ను శూలమున్
దూరముపెట్టి యొక్కజడ దూయ జనించిన వీరభద్ర ఖ
డ్గారభటిన్ భరింపగలవా? శివుపైఁ జను దక్షు లుందురే?"॥ 200

మ॥ అనఁ, దీండ్రింపుచుఁ జంద్రరావు పటు రోషావేశ దుర్దాంత వ
ర్తనుఁడై, ఖడ్గము 'జట్టువన్' దిగిచి యుగ్రస్ఫూర్తిఁ బైఁదూఁకె: నా
తని కీడై రఘునాథుఁ డేమఱని పంతం బొప్పవాఁడౌట, నె
త్తిన కౌక్షేయముఁ బాయఁజిమ్మి, తనకత్తిన్ నాటె వక్షంబునన్॥

ఉ॥ వ్రేటున రేఁగి, మైఁదొరఁగు నెచ్చని నెత్తుటఁ దోఁగి, చంద్రరా
వోటఁ దొలంగి పైఁబడఁగ-'హుమ్మ'ని యార్చికుఠారమున్ మెయిన్
నాటి గతాసుఁ జేసె రఘునాథుఁడు; కావలివారు గొంద అ
చ్చోటున సందడిన్ దెలిసి, చుట్టును ముట్టిరి శస్త్రపాణులై॥ 202

శా॥ దంభోళి ప్రతిమాన ఖడ్గమును హ స్తంబందుఁ గీలింపుచున్
సాంభాజీకవజీ యెదుర్కొను విపక్షవ్రాతమున్ దోలెః ది
క్కుంభి ద్వంద్వముఁబోలు నాయిరువు రుక్కుంజూపి, యచ్చోసనవ
ష్టంభంబున్ దొలఁగించుకొం చరిగి బైటన్ సేనలన్ జేరుచున్॥ 203

చ॥ జరిగిన కార్యమందుఁ జెయిజాఁచినతొందర, దాన నచ్చటన్
దుర మొనగూడినన్ గలుగుతొందరయున్, శివరాజుఁ జూడ కే
తెఱఁగొనరింపరామి గణుతింపుచు, వారు వెసన్ మహాబలే
శ్వరమున కేగి రాజుఁగని పల్కిరి నాఁటి యుదంత మంతయున్॥ 204

చ॥ వినయముతోడ వారు వినిపించెడు సంగతు లొం డొకండుగా
వినుతఱిఁ - 'జంద్రరా వుసురు హీడె' నటంచు వినంబడన్ మనం
బునఁ గడు నొల్లఁబోయి, శివభూపతి నివ్వెఱపాటు నెవ్వగల్
మునుకొన నూర్పుపుచ్చి, తలపోఁతలకున్ దలయూఁచి యిట్లనెన్॥

చ॥ † "అనుకొనురీతి యేమి - కడ కైనదియే! మొక బాంధవంబు మె
ల్పున నయినన్ స్వజాతి బలమున్ నిలఁబెట్టెడుపూనిక- యిట్టు ల
య్యెనె! యనుతాపమే నిలిచెనే తుద! కింతకుఁ బోక తీఱద
య్యెనె కులబాంధవం! బతనియేపున కింతలు రాక యొప్పునే!॥ 206

తే॥ † శత్రుపక్షమై యహితమే సలిపె, పైనఁ
దలఁపుమాఱిన నెప్పుడైన ధర్మరథముఁ
బ్రా పొసఁగి లాగు నొకమహారాష్ట్రవీరుఁ
డంతరించిన కొఱఁతవో నసువు గలదె!॥ 207

† "From the recently discovered Mahabaleswar account, it is clear that Shivaji repeatedly strove to win More to his side, that More as often tried treacherously to take Shivaji prisoner and that he eventually fell in a quarrel between him and Ragho Ballal Atre, while the latter was delivering

శా॥ † ఆమోన్బోయె ననంగ రాదు, రఘునాథా! యెంతలో నెంతకీ
డోయీ! నీకరవాలుకంటె మది కెంతో వాఁడి యున్నట్లుగాఁ
బోయెన్ గార్యము; చంద్రరాయఁ డొకఁడే పోలేదు-మీభక్తియున్
మా యౌదార్యముగూడఁ బోయె, నపనిందారేఖ నిల్చెన్ దుదిన్!।

చ॥ † కలిగినదీనిలో నిజము కన్నడసేసి, యసూయఁజూపి, నిం
దలు తలకెత్తదే జగము నాకును వారికి మీకుఁగూడ? నీ
మెలఁకువఁజూపి మీమది దమించినచో మనకీర్తి యెంత రం
జిలు! బహిరంగ యుద్ధములఁ జేతికటారికి విల్వ హెచ్చదే!। 209

ఉ॥ † సంగతి యిట్టులుండఁ, దెఱచాటునఁ బోయిన దీనికిన్ బ్రధా
నాంగము నేనుగాఁ దలఁచి, యాత్మకులీనుల హత్యచేఁతగా
రంగులు పూయునేమొ వివరంబులు మాసిన భావికాల! మీ
యింగితమెంచి, యిందు నిజ మిట్టిదిగాఁ గనువాఁడు గల్గునో!"॥ 210

చ॥ అను శివరాజమౌళి హృదయంబు నెఱుఁగుచు శ్యామరాజపం
తనియె, "మహాప్రభూ! వెలితియయ్యెనన్ బనిలేదు; ద్రోహచిం
తనుఁ బొలియించి ధర్మము నొనర్చిన యీ రఘునాథు మన్ననన్
గనఁదగు - దోస మెంచెడు జగమ్మున కీశ్వరుఁడైనఁ దప్పునే!॥ 211

---

him an ultimatum. Shivaji was thus clearly innocent of More's death!" Page 272. *Kincaid,* C. V. O., I. C. S.

† This active hostility of Chandrarao More could not be safely put up with any longer, and Shivaji's agents, Ragho Ballal and Sambhaji Kawji resolved on their own account to punish the Mores. P. 93 *M. G. Ranade.*

† "చంద్రరావు ఘాతవృత్తాంతమంతయు శివాజిచరిత్రలో నొక గొప్ప కలంకమనియు, నతఁడు నీతివిహీనుఁడని చూపుటకు గొప్పనిదర్శనమనియుఁ గొందఱు ... చరిత్రకారుల యభిప్రాయమైయున్నది ... ... తన్నుమోసపుచ్చిన వానిని, మోసపుచ్చనున్నవానిని మోసపుచ్చిన నెంతదోషముండునో అంతకంటె నధికదోషము శివాజిపై నారోపింపరాదనుటకు సందేహము లేదు." పుట 55. 'శ్రీశివాజిచరిత్రము.' - కె. వి. లక్ష్మణరావు.

చ॥ కడచినదానికంటె జరుగంగల దానినిఁ జిత్తగింపుఁ - డీ
యుడుకున జావళీవిజయ ముద్దవిడిన్ గొననొప్పు : నింత సం
దడివడి యెల్లఁబోక తగునా! యొకధర్మము నిర్ణయింపుచున్
దడయుట మేలె! దాన నమృతమ్ము విసమ్ముగ మాఱఁగూడదో!"॥

చ॥ అనుటయుఁ గార్యమెంచి, సమయానుగుణంబగు తత్ప్రబోధమున్
బనిగొని, యష్ట సేననపుడున్ రఘునాథున కాజ్ఞసేసి, యే
చిన బలఁగమ్ముతో మసకచీఁకటి వాయకమున్న తత్పురం
బును దరిఁజేరి, కోట నలుమూలల ముట్టడివెట్టె నేపున॥ 213

ఉ॥ "ఇప్పటికైన వారు తగవెంచి చలమ్మునువీడి, కూడి రా
నొప్పెదరేమొ" యం చనునయోక్తులతో నొకదూతఁ బంపెఁ గీ
డొప్పక షాహజీతనయుఁ; డుక్కివులై పగరేఁగి యాసురన్
గొప్పరమెక్కి, వారు కసికోఁతలకున్ దిగి రక్కసింపుచున్॥ 214

ఉ॥ గండు మగంటిమిన్ బిరుదుగట్టిన వీరులు - చంద్రరావుత
మ్ముండగు సూర్యరాయఁడు, చమూపతియాహనుమంతరాయఁ, డు
ద్దండులు పుత్రులున్ దెగువ దండడిలన్ బదివేల మావళా
దండు వెలార్చుచున్ గవనుదాఁటి పయింబడి రంజవేయుచున్॥ 215

ఉ॥ పంతము మాతువాఱఁ దెగఁబట్టి పెనంగెడు రెండువైపులన్
దంతురమయ్యె మొండెముల తండము, నెత్తురుటేఱు పాఱెఁ; గా
లాంతకుఁడౌచుఁ దెంపు మెఱయన్ రఘునాథుఁడు సూర్యరావుపైఁ
గుంతము దూసి, వక్షమునఁ గ్రుచ్చి ధరన్ బడఁదోసె నార్చుచున్॥

తే॥ దానఁ జెలరేఁగి సేనలఁ దఱిమి నఱకె
మారి మసఁగినయటు హనుమంతరావు :
వాని కెనరెక్కి యుఱిమి సాంభాజికవజి
శాతశరమున వానిమస్తకముఁ దునిమెఁ॥ 217

ఉ॥ ఈ జడి యిట్టులుండ, మునుమెత్తుచు మూఁకల గ్రమ్ముగఁదోలి తా
నాజికిరాజె ఖడ్గవలనంబులఁ బీనుఁగుఁబెంటఁ జేసె: నా
తేజున శత్రుసైన్యములు చిక్కుఱ నల్గడఁ బాఱిపోగ: నీ
యోజను జంద్రరావుసుతు లొంటిఁ బెనంగుచుఁ జిక్కి రచ్చటన్॥ 218

ఉ॥ చిక్కిన వైరిపుత్రకులఁ జేకొని, సేన మరల్చి, జావళీ
దక్కొని, యందు పాఁతజలదాఁచిన పెద్దలనాఁటి కొక్కపుం
బొక్కస మెగ్గులున్ దురగముల్ గొని, స్వీయపతాక దానిపై
నెక్కొనఁజేసి, తజ్జయము నించె శివప్రభుఁ డుత్సవమ్ములన్॥ 219

చ॥ తలఁచిన యంతకంటె వితతమ్మనఁగా నెఱవైన కార్యమున్
గెలిచి, శివప్రభుం డచటి కీడును మేలును దీర్చిదిద్దఁగాఁ
గొలువొకఁడానతిచ్చి - యనుగుల్ సచివుల్ హితులున్ జమూపతుల్
వలగొని కొల్చుచుండ నలవారలఁ గన్గొని పల్కె నీగతిన్॥ 220

చ॥ "బలియుఁడు చంద్రరావు మనపక్షముఁ జేరిన మే లటంచు మా
కొలిచిన కార్య మిట్లు తలకోఁతలతో ముగియంగనయ్యె: నిం
తలు ముడివెట్టఁగాఁ దలఁచు దైవము కారణమయ్యెఁగాక - దా
యలవలె మేము పోరఁదగవా పగవారికిఁ జో టొసంగుచున్!॥ 221

ఉ॥ § మాయలు వన్ని, వైరులకు మంతనమున్ బలమిచ్చె నాతఁ: డ
న్యాయము గూడదంచు రఘునాథునిఁ బంపితి సంధి; కైననున్
మాయక పోయెఁ దద్దురభిమానము! మా తగ వోర్మియున్ వృథా
పోయెఁ! గుటుంబమెల్లఁ జెడిపోయె! సహాయము పోయె జాతికిన్!॥

§ "At the suggestion of the Bijapur government, More now allowed Baji Shamraj to use his fief as a base from which to surprise and kill Shivaji.

Page 147. *Kinoaid.*

తే: ఏ మనంగనేమి! కడచనె నెల్లతగవు -
నిలిచె వారికి మన కొక్క వెలితిమాత్ర :
మంతయును దైవనిర్ణయం బగుట నిజము
దైన, మనవైపు కొఱలేమి యరయవలదె!॥ 223

ఉ॥ పోయినదానితోడం బగంబుచ్చక, తత్సుతు లిర్వు రింత లేం
బ్రాయమువారుగానం దెగరాంజెద : రందున సత్ప్రవర్తనన్
బోయెడుదాంక వీరి మనపొత్తున నేమఱకుండి యోగ్యులన్
జేయుంగు - రక్షకాళి పరిశీలిత రాజగృహాంబుం జేర్చుచున్ !॥ 224

తే॥ గీ॥ పతినిం బాసిన నెవ్వగం బరితపించు
తత్కుటుంబమునెడ సమాదరముం జూపి,
యుచిత సౌకర్యములం గూర్చి యుపచరింప
నంచితోద్యోగులను నియమించుం డిచట। 225

ఉ॥ తక్కిన రాజ్యపాలన విధానము లొంచితి యెంచి శ్యామరా
విక్కడం దీర్పంగావలయు; నీవిజయమ్మున దేశలక్ష్మికై
యుక్కునం బ్రాణవాయువుల నొప్పరికించిన వీరయోధులన్
మక్కువ నాదరించి, తగు మన్నన లీవలె వారివారికిన్"॥ 226

తే॥ గీ॥ అనుచు రఘునాథువైపున - నతనిపజ్జం
గవగొని వసించు సాంభాజికవజిపైనం
జూపు వెలయించి యాదర సూచకముగం
దనకడకుం బిల్చి వారితో ననియె నిట్లు॥ 227

చ॥ "పొరపడియుంటి మీ జతనముల్ వినిపించినయప్డు మీరు తొం
దరపడినా రటం, చది కతమ్ముగ రాంగల కోపతాపముల్
విరసతం జూపకుండం గనువిచ్చె దయాళు భవాని; వారి ము
ష్కరతను గంటి నే స్వయముగా నిట - మీ నెఱిలే మెఱింగితిన్॥

ఉ॥ ఈ విజయమ్ములందు మొదలెత్తుటనుండియు మీరుచూపు స
ద్భావము - ప్రాణమైనఁ దెగఁబట్టిన తెం - పెడవోని యోర్పు - బా
హా విభవంబుఁగూడి సమయానుగుణంబయి మెప్పుఁ గూర్చె; మీ
పోవు తెఱంగు తక్కిన చమూపతు లందఱు నేర్వఁగాఁదగన్॥ 229

ఉ॥ శక్తియు రక్తియున్ బలము సాహసమున్ వెలయించి, దేశమున్
భక్తి భజించు మీకు బహుమానముగా నిదు సీకటూరు లా
సక్తినిఁ గొంచు, మా కుడిభుజమ్మునెడన్ గొలువుండుఁ, డాహవో
ద్రిక్తుల వైరులన్ దఱిమి తేజముఁ గూర్పుఁడు దేశలక్ష్మికిన్!"॥ 230

తే॥ గీ॥ అనుచు మన్ననఁ జూపి యుదగ్రభూష
ణాంబరమ్ములఁ దనియించి, యర్హకీర్తిఁ
దక్కుయోధుల మన్నించి, దండనున్న
వినయవంతు మోరోపంతుఁ గనుచుఁ బలికె॥ 231

శివాజీ రెండవసారి దండయాత్రలు - విజయములు.

ఉ॥ "ఏ నిటు దండయాత్ర మునుమెత్తెదఁ బశ్చిమవార్ధియంచు ల
త్త్రానెడుదాఁక; నేఁటి విజయమ్ము వెలుంగ, మహాబలేశ్వర
స్థానమునొద్దఁ 'బా' ర్తనుమదాపున దుర్గముఁ గట్టుమీవు - కృ
ష్ణాపది కియ్యెడన్ బురుటిసుంతన దీరుటఁ బావనంబగున్॥ 232

సీ॥ నాల్గువైపులఁ గొంకణము సహ్యాధరణి యం
తట రాను బో, ముఖద్వార మిచటఁ,
దొలుత బిజాపురీశుల మహాధనరాశి
యుడివోక మనచేతఁ బడియె నిచటఁ,
జెడుతలంపున మమ్ముఁ జెనకి బాజీశ్యామ
రాయఁ డేపఱి, దాఁగిపోయె నిచటఁ,
బగఁబూని సకుటుంబముగఁ జంద్రరావు రూ
పఱివోవ, 'జావళీ' దొరకె నిచట,

తే॥ మన ప్రతాపోదయము దినదినముఁ బెంచు
క్షేత్ర మిదియౌట నిట దుర్గసీమఁ గట్టి,
యట భవానికి దేవాలయము ఘటించి,
దానికిఁ 'బ్రతాపగడ' మభిధాన మిమ్ము!"॥ 233

తే॥ అనుచు నిర్ణయించి, తక్కిన పనులు దీర్ప
వారివారినిఁ బంపి, తత్ప్రాంత దుర్గ
ముల 'వసోటా' ముఖ్యంబుల గెలిచి, 'హీర
దాస' మను ప్రాంతమును గెల్వఁ దరలె శివుఁడు॥ 234

మ॥ అట 'బండా' లను 'రోహిడా' పతి యవార్యాటోపుఁడై పోరి, త
త్పటుధాటిన్ దెగి మ్రగ్గెఁ; దత్సచివుఁడౌ బాజీప్రభుం డాహవో
ద్భటుఁడై మార్కొని, యల్పసైన్యములతో దర్పించి పోరాడె; నే
మిట నేపో శివరాజసైన్యములు దొమ్మిన్ బట్టె నా దుర్గమున్॥ 235

ఉ॥ అప్రతిమాన విక్రమ విహారములన్ బ్రభుభక్తిఁ జూపు బా
జీప్రభు మెచ్చికొంచు శివజీ యట దుర్గపతిత్వ మిచ్చి, సై
న్యప్రభుఁగా నొనర్చి, తన యాన మెలంగుచు నాల్గువైపులన్
స్వప్రతిపక్షమున్ దఱుముచాడ్పునఁ గట్టడచేసి యేల్కొనెన్॥ 236

ఉ॥ వారక 'హీరదాస' మను ప్రాంతము గెల్చి, శివప్రభుండు శృం
గారపురమ్మునున్ గెలువఁగాఁ జనె; నీకథ లాలకింపుమన్
వీరుఁడెయయ్యె 'రామదళవీ' యను తత్పతి పాఱిపోయె - శృం
గారపుర ప్రభుత్వమును గానుకవెట్టెఁ దదీయమంత్రియున్॥ 237

ఉ॥ అంత శివప్రభుండు ముదమందుచు, 'వాడి' ధరాధినేత శా
వంతుని గెల్వఁబోయె; బలవంతుఁ డతం డెదిరింప నుండ, సా
మంతులు వానిమంత్రు లతిమానుషమౌ శివరాజు విక్రమం
బింత యెఱుంగఁజేసి, యొలయించిరి లోఁబడ శాంతిదూతలై॥ 238

మ॥ † అలసావంతుఁడు భోఁసలేకులమువాఁడై యుంటఁ - బూర్వప్రభుల్
నిలయంబందున నిల్పి కొల్చెడు 'భవానీఖడ్గ' మర్పించి కా
న్కలతోఁ లోఁబడ సమ్మతించుట - శివక్ష్మాపాలుఁ డవ్వానితోఁ
జెలికారంబున కిచ్చగించి, మది మెచ్చెన్ వాని సౌజన్యమున్॥ **239**

తే॥ † మూఁడువందల మొహరీల మోపు గలిగి
కలిత నవరత్న ధగధగత్కాంతు లీను
నా భవానీమహాఖడ్గ మందికొనుచు
శివపతి జగత్త్రయంబు గెల్చినటు లలరె॥ **240**

ఉ॥ ఆపయి దండయాత్ర నపరాంబుధిమేరకుఁ బోవుచుండ, "బీ
జాపురిలో నవాబొకరుజన్ మరణించె" నటంచుఁ, "దత్సుతుం
డేపునఁ దండ్రిగద్దెపయి నెక్కె" నటం, "చవురంగజేబు బీ
జాపురి గెల్వఁబోయె" నని చారులచే శివరా జెఱుంగుచున్॥ **241**

చ॥ అనుకొనియున్న దిగ్విజయ మాఁపి, జయించిన రాజ్యమెల్లఁ బా
లనమునఁ దీరుసేయునటులన్ దగువారల కాజ్ఞసేసి, చే
సిన పనికంటెఁ జేయఁగల చేఁతలకున్ మది నుత్సహింపుచున్
జనె శివరాజు సేనఁగొని చయ్యన రాజగడంబుఁ జేరఁగన్॥ **242**

ఉ॥ అంతట దూతలన్ బనిచి యచ్చటి సంగతులన్ గ్రహించి, సా
మంతుల మంత్రులన్ గలిసి మంతనముల్ శివరాజు వల్కె, "స
ప్పాంతన మొక్కమేలునకుఁ బుట్టెనొ! కీడున కయ్యెనేమొ! సి
ద్ధాంతము సేయరాదయినఁ - దప్పదు మార్పొకఁ డించుఁదోఁచెడిన్॥

---

† There was a famous long sword worth 300 huns (pagodas) with a chief, Gowalkar Sawant by name. .... .... The Sawant .... seeking an interview with Shivaji presented him with the sword. He (Shivaji) gave it the name of his tutelary deity Bhavani.

Page 116. *N. S. Takakhav, M. A.*

ఉ॥ బాలకుఁ డీనవాబు; బలవంతులు సైన్యపతుల్ వజీరులున్
దాలిమిఁదూలి లోనికలతల్ పెనవైతుర కాని తెంపునన్
మేలు దలంప; రి య్యదనుమెట్టినవాఁ డవురంగజేబు తా
నాలమునెత్తివచ్చె - సమయజ్ఞున కందనిత్రోవ లున్నవే!॥ 244

ఉ॥ షాహజహానువోలె నొకచక్కటివాఁ డనరా డితండు - దు
స్సాహసముల్గొనంత్రికుఁ, డహోహాలకున్ గుడు, రెంతకేనియున్
సాహసమూను తెంపరి: బిజాపుర మీతనిచేతియందుఁ బూ
ర్ణాహుతి గాకపో - దెవరియంతకువారయి కన్నుమూసినన్॥ 245

చ॥ పయిఁబడి రాకయుండఁ దొలివంతున లోఁగొనె గోలకొండ, న
ష్టయముగ వారిపొత్తు జరుగన్ దనపుత్త్రిన కానవాబుక
న్నియఁ గొనె, వారు తోడుపడ నేఁడిటుపైకొనె - స్వీయసమ్మతిన్
గయికొన కేల్బడిన్గొనుట కప్పములీమి నెపంబు పెట్టుచున్॥. 246

ఉ॥ ఇంతయుఁ బానుషానికృతి, యింక బిజాపుర మంతరించు తీ
రెంతయుఁ దోఁచు: 'నైవ మన కే' మనియున్, 'బలవద్విరోధ' మం
చంతరమెంచి కన్మలఁపు టర్హమె! నేఁ డిది మ్రింగి బల్పునన్
గంతులు వేసి, రేపు కడఁకన్ మనపై కతఁ డెత్తిరాఁడొకో!॥ 247

చ॥ మనము బిజాపురీశుఁడు సమానముగాఁ దెగి పోరవచ్చు, నా
తని మన - మాతఁడున్ మనల దక్కొనవచ్చు, మఱొక్కఁడిందుఁబై
కొనఁ దగ : దట్టులైనఁ గలుగున్ జెడు గిర్వర కోట, నేఁడు ము
న్నొకని యవురంగజేబు నుఱుగొట్టి, బిజాపురి కూఁత యీఁదగున్॥

ఉ॥ ఆ పెర వొప్పునైనన, మనమైె మునుదూఁకుచు సాయ మీయఁగాఁ
బోవుట మేలుగాదు, నయమున్ బ్రియమున్ గలిగింప, దొక్కచోఁ
ద్రోవలుమాఱి యిర్వురపు ద్రోహముగానయి రెంటఁ గీడగున్
గావునఁ, దేలిపోని మొసకంబున వేఱొకదారి తీరగున్॥ 249

చ॥ ఒకట బిజాపురంబు బలమూఁదుచు నుక్కునఁ బోరుచుండ, వే
ఱొకటఁ బరాక్రమించి మన యుద్ధవిధిన్ మొగలాయిరాజ్యమున్
వికలముఁజేసి కొల్లగొని వేయలయింతము - దీన వాని పూ
నిక యిరుపాయలౌచు, నెవనిన్ గెలువన్ దరిలేక చిక్కుఁడున్॥ 250

ఉ॥ ఇప్పటి కీకడంక సరియే - 'యొకచో యవనద్వయంబు తా
మొప్పుగ సంధిఁగూర్చికొనియున్ మనపై కరుదెంచు' నన్ దలం
పొప్పరికింపరాని, దపుడో? - యపుడో యననేటి కావిధం
బెప్పటికైన నున్న, దది యెంచి తలంకిన నింత యేటికిన్!॥ 251

తే॥ మఱ్ఱివిత్తులో నెంతటి మహిమ గలదొ -
దెసలఁ గబళించు కొమ్మల నెసఁగునాఁడె
తెలియఁదగు; దాని మొలపించుదేవుఁ డెఱుఁగుఁ
బెంచువిధ - మూఁడవాఱ బల్పించు విధము!”॥ 252

చ॥ అని వివరంబులాడి, తగునంచని యందఱు వల్కఁగా నసీ
కిని వెడలించి, ముందు పరికించినత్రోవ నెకాయకిన్ బలం
బును నడిపించి, యందుఁ దొలిముద్దగ జున్నరుపట్టణంబుఁ గై
కొన మదినెంచి కోటగవఁకుల్ వడిదాఁటుచు లోనికిన్ జనెన్॥ 253

ఉ॥ జున్నరు నాయకుం డెడముసూపక వచ్చు శివాజిసైన్యమున్
గన్నులఁ జూచి, వారి నరికట్టుటకున్ బలఁగంబులేమి నా
పన్నత నొందియున్ బెనఁకువన్ గొన మేలిమిలేమి నెంచి, మే
లొక్కన్న తెఱంగునన్ భటులఁగూడి చనెన్ శివరాజుఁ జూడఁగన్॥

ఉ॥ ఆ సరదారు భక్తివినయంబులకున్ శివరాజు మెచ్చి, “నీ
దోసము లేదు, మాకుఁ బగతోఁ బనిలే, దిట మా ప్రభుత్వమున్
వాసియొనర్పఁగాఁ దలఁచి వచ్చితి, మీవును మాపతాకకున్
దాసుఁడవౌచు బొక్కసమునన్ ధనమెల్ల నొసంగు” మంచనన్॥ 255

తే॥ * దానికి విధేయుఁడై సుబేదారుఁ డపుడ
తలుపు తెఱచె భాండాగారములకు నెల్ల:
మూఁడులక్షల మొహరీ, లమూల్య మణులు,
సమితధనము, నిన్నూఱు వార్వములు దొరకె॥ 256

ఉ॥ ఆ వసుసంచయంబుఁ గొని యందుఁ బతాక ప్రతిష్ఠచేసి, సై
న్యావళి వెంటనంటఁగ నహమ్మదునపట్టణ మేగె శ్రీశివుం:
డీవిధమెల్ల మున్నవిని హెచ్చరికంగొని తత్పురీశుఁ డెం
దే వెడలించె బొక్కసము; నింతటిలో నరికట్టె సైన్యముల్॥ 257

తే॥ పురము లోఁబడె మున్ను జున్నరునుబోలి,
యేడువందల గుఱ్ఱంబు లీడులేని
కరులు నాలుగుమాత్రి మాపురిని మిగిలె:
వానిఁ గొని శివభూపుఁ డవ్వలకుఁ జనియె॥ 258

చ॥ తనుపరి శ్రీశివుండు సరదారులఁగొందఱఁ గొంతసైన్యసం
పదయిడి వేఱువేఱ పనుపన్, మొగలాయిచమూపతుల్ బలో
న్మదులయి వారలన్ దఱిమి మందటిలన్ గొనుచుండి - రొక్కచో
నొదుఁగుచునుండి, రందు గెలుపోటము లేఁతముఁద్రొక్కుచైతగన్॥

మ॥ * శివరాజీగతిఁ బ్రాంతపట్టణములన్ జేపట్టి, యందందు వ
స్తువితానంబు ధనంబు వాజులు కరుల్ తోరంబుగాఁ గొంచు ని
ష్ట విహారంబులు సల్పి మొగలుల రాజ్యంబెల్ల గారించె; ని
య్యవి యిట్లుండ, బిజాపురంబున రణం బవ్యాహతంబై చనెన్॥ 260

---

* They carried devastation and alarm to the very gates of Ahmadnagar. .... He (Shivaji) carried off 300,000 hun in cash. 200 horses and much costly clothing and jewellery (from Junnar)....The success of the Maratha raiders was due to the negligence of the Mughal officers and probably also to their military weakness. Page 60. - *J. N, Sarkar*

ఉ॥ మొగలు సైన్యధాటి కెదిఁబోయె బిజాపురిసేన, వారికి
లోఁగె వజీరు; సైన్యపతులున్ దమలోఁ గలహించుచుండి: కి
యాగడమెల్లఁ జూచి భయమందుచుఁ గొండికయా నవాబు రా
జేఁగొనఁగాఁ దలంచి పనిచెన్ వడిగా నిటు రాయబారముల్॥ 261

తే॥ "పైక మొకలక్ష యిచ్చి, కావలయుగడము
లప్పనముసేసి, మిముఁ గొల్తు" ననె నవాబు;
రాజ్యమును మ్రింగ నెంచు నౌరంగజేబు
పట్టువిడ కాహవముఁ గట్టిపఱచుచుండె॥ 263

తే॥ అంతలోన, శివప్రభుం డధికుఁడగుచుఁ
దనదురాజ్యంబు గారించి తారసిల్లు
వార్త వినుచు నౌరంగజే బార్తిఁబొంది
యిచటి యుద్ధము సడలించి యచటు చూచె॥ 263

ఉ॥ కొంతబలంబు వేర్పఱచి, కోరిన సాధనముల్ ఘటించి, లా
వంతుల సైన్యనాథుల శివప్రభు నొంపఁగఁ బంపుసేసె; నీ
యంతరమందుఁ దండ్రి మరణాంతరుజాపరిభూతుఁడైన వృ
త్తాంతము రాఁగ, దానఁ గలఁతంబడె నా యవురంగజే బటన్॥ 264

తే॥ "ఏ నిచటనున్నచో రాజ్యమెల్లఁ గొందు
రన్నదమ్ము" లటంచుఁ దా నచటికేగఁ
దలఁచి, యౌరంగజేబు సుల్తానొసంగు
ధనముతోఁ దృప్తివడి సంధి యనుమతించె॥ 265

చ॥ కుదిరిన సంధిమాట విని కోల్కొనుచున్ శివరాజు "నేఁటి యం
గద నవురంగజేబు మొనకట్టి పయిన్ బడునేని లేని యా
పదలగు - వీని నిప్పు డెడఁబాపి, నవాబును గెల్చి, యాపయిన
గడియుట మే" లటంచు నొడికమ్మ్ముగ నుత్తర మంపె నీగతిన్॥ 266

సీ॥ § "తమ బిజాపురిజయోదంతము విని చాల
సంతసించితిని, మీ చనవుఁబట్టి
తమరాజ్యమందుఁ బెద్దలనుండి మేమందు
కొను 'దేశముఖి' పన్నుఁ గొంటి, నిదియు
మును పాదుషాహిగారినిఁ గోరియుంటి, నా
యన సమ్మతించియు నాజ్ఞ సుంత
తడవయ్యెనైన మీదయ రాకపోదని
మునుకొంటి, నీసేఁత యనుమతింపుఁ;
తే॥ డైదునూర్ల గుఱ్ఱపుదళం బనువుపఱచి
తమకుఁ దోడ్పడుచుందు, మీదక్షిణమున
నేము గెల్చినవెల్ల మాయేలుబడిగ
సమ్మతింపుచు, నిందు దేశముఖిహక్కు"॥ 267
తే॥ అనెడుకమ్మ నౌరంగజేబునకుఁ బంప,
నతఁడు సమ్మతించినయటు లభినయించి,
"యాజ్ఞగొన నీదు ప్రతినిధి నంపు" మనుచు
మచ్చుపొడిఁ జల్లి 'ఢిల్లీ' కి మఱలి చనియె॥ 268
చ॥ ఇటు లవురంగజేబు చనుటెల్ల నెఱింగి శివప్రభుండు ము
న్నటివలె దిగ్జయంబు నడుపన్ దలఁపొంది బలంబుపెంచి, మి
క్కుటముగ దేశదేశముల గుఱ్ఱములన్ గొనితెచ్చి, వానితోఁ
జటులతరాశ్వసైన్యముల - సాహిణులన్ వెలయించె నేర్పులన్॥ 269

---

§ Ch. IX. "Relations with the Mughals," by
*N. S. Takakhav, M. A.*

§ Page 102. "Rise of the Maratha Power," by
*M. G. Ranade*

శా॥ $ ఓజస్స్వాంతము వాజిసైన్యమునకున్ యోధావతంసంబు నే
తాజీపాల్కరు నాథుఁ జేసె; నపుడే తగ్గించె సైన్యంబులన్
బీజాపూర్విభుఁ; డేడునూర్ల యవనుల్ బీజాపురీసైనికుల్
షాజీపుత్రునిఁ జేరి వేఁడికొని రాసన్ గొల్వులోఁ జేరఁగన్॥ 270

తే॥ శత్రుపక్షమువారైన, శరణమనఁగ
వారి లాలించి, నమ్మికఁ జేరఁదీసి,
చెంత, రఘునాథబల్లాలుచేతిక్రింద
శిక్షణము లిచ్చి, కొల్విచ్చి శివవిభుండు॥ 271

చ॥ ఇటు బలఁగమ్ముఁ గూర్చి, మునుమెత్తిన దిగ్విజయంబు పూర్తిసే
యుట కెద నిశ్చయించి, సచివోత్తముఁడై తగు శ్యామరాజు ను
ద్భట చతురంగ సైన్యముల దండడితో వెడలించె; నాతఁ డొ
క్కొటొకటి దుర్గముల్ గెలిచికొంచుఁ జనెన్ జరమాబ్ధిముట్టఁగన్॥

సీ॥ అట 'జీంజిరా' యను నబ్ధిదుర్గ మొకండు
దనరుఁ, బత్తేఖాను దాని నేత;
యతఁడు 'నీగ్రో' జాతి నధికుండు, వానిరా
జ్యము సముద్రప్రాంత మలమియుండె;
సామంతుఁ డగుచు బిజాపురీశులకుఁ, ద
క్కినవారిధరఁ గొల్లగొను నతండు;
బలిత మాతని యోడబలఁగమ్ముఁ దలఁచి, యె
వ్వరుగాని వారితో నొరయ వెఱతు;

---

$ About 700 disbanded Pathans from Bijapur came to Poona and enlisted themselves under Shivaji .... .... Ragho Ballal Atre was placed in command of this Pathan division Chapter X. "The Life of Shivaji Maharaja," by *N. S. Takakhav, M. A.*

తే॥ రతఁడు మునుమున్న శ్యామరా జరుగుదెంచు
వార్త విని, సైన్య సన్నాహ ధూర్తుఁడగుచు
వీఁక నెదిరించి తఱిమి చీకాకుపఱుప,
వెనుదిరిగిపోయె శ్యామరా జనువులేక॥ 273

ఉ॥ ఓడుమొగంబు సూపి తనయొద్ద నిలంబడి శ్యామరాజు మా
ఱాడకయుండ, నా యపజయమ్మునకున్ మదిఁ గిన్కవొంది నో
నాడుచుఁ, 'బేషవా' పదవి కర్హతచాలమి వెట్టి, శ్రీశివుం
డోడక పింగళేసచివు నొప్పుగఁ దత్పదమందు నిల్పుచున్॥ 274

తే॥ "జయముఁ గొని ర" మ్మటంచు నుత్సాహపఱచి,
బహుళ సైన్యముల్ - నేతాజిపాలకరుని -
ధూర్త రఘునాథబల్లాలుఁ దోడొసంగ,
వెడలె నపుడ మోరోపంతుపింగళుండు॥ 275

ఉ॥ అంతటి పేషవాపదవి యబ్బుటకున్ మదిఁ బొంగి, పింగళే
పంతుఁ డజయ్య కార్యమును బట్టుదలన్ గెలువన్ దలంచి, త
త్ప్రాంతములెల్లఁ గైకొనుచుఁ, బశ్చిమవార్ధి తటంబుఁ జేరి, దు
రాంతుఁడు జంజిరాధిపతి రాజ్యమునన్ నడిపించె సేనలన్॥ 276

ఉ॥ తెక్కిన సైన్యనాయకు లుదగ్రముగా బలఁగంబుఁ గొంచు, న
ల్దిక్కుల నాక్రమించి, యదలించి బిజాపుర రాజ్యభాగముల్
దక్కొనుచుండ, నప్రతిహత ప్రభుతన్ వెలిఁగెన్ శివప్రభుం;
డక్కజ మీసు రోస ముడుమై కనలెన్ సులతానుఁ డాత్మలోన్॥ 277

చతుర్థాశ్వాసము - సమాప్తము

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివభారతము

## (శివాజీ ప్రబంధము.)

### పంచమాశ్వాసము.

చ॥ ఇటు శివరాజువిక్రమమునెల్ల నెఱింగి బిజాపురీంద్రుఁ డు
త్కటముగ నీసుఁ బెంచి, ప్రతికారమునర్థి దనరాజ్యలక్ష్మి కూ
ఱట యొదవింపఁగా నవసరంబగు నోలగ మానతిచ్చి, ముం
దటి చరితమ్ము లెంచి సరదారుల మంత్రులఁజూచి యిట్లనెన్॥ 1

**శివాజీ నణఁచుటకై బిజాపురికొల్వులోఁ బ్రయత్నము.**

ఉ॥ "నాఁటికినాఁటి కుద్యమమునన్ బలుపొంది శివప్రభుండు పో
రాటము పెద్దసేసి, మనరాజ్యమునన్ నలుమూలలందు బా
హాటముగాఁ జరించి, యెదురాడినవారి నధఃకరింపుచున్
గోటలు దుర్గము ల్గొనియెఁ, గొల్లగొనెన్ మనదేశ మెల్లెడన్!॥ 2

తే॥ సహ్య పర్వత ప్రాంత రాజ్య మదియెల్ల
దక్షిణోత్తర కొంకణధరణి యెల్లఁ
గైవసముఁ జేసికొని, బలఁగంబుఁ బెంచి
మ్రింగుచున్నాఁడు మన ధరిత్రీతలంబు॥ 3

ఉ॥ ఏఁబదివేల కాల్బలము, లేచినగుఱ్ఱము లేడువేలు, బా
హాబలగణ్య సైన్యపతు లర్ధసహస్రము వెంటనంటి రాఁ
గాఁ బులివోలెఁ దా నని మొగమ్మున దూఁకుచు, దండయాత్రలన్
రేఁబవ లెత్తిరా నిలువరింపఁగఁజాలర వాని నెవ్వరున్!॥ 4

ఉ॥ తేఱిన కీబలంబు - గడిదేఱిన బాహుబలంబు - కాఁకలన్
దీఱిన మార్బలంబుగల తెంపరియై, యటువైపు పాదుషా
గారిని సాగనంపి, మన గట్టిపెనంకువఁ జిమ్మి, యప్రతీ
కార విహారముల్ వెలయఁగా శివరా జిటు విక్రమించెనున్॥ 5

ఉ॥ కట్టిన మొగ్గరంబు కడు గట్టిగనున్నది; క్రొత్త దుర్గముల్
గట్టఁగఁ జేసెఁ; బ్రాఁతయువి గట్టియొనర్చె; నపార సైన్యముల్
దిట్టముచేసె; మాఱుకొను తెంపునఁ దండ్రిహితంబుఁగూడఁ జే
పట్టఁడు; వానిపట్టు మనపట్టణమున్ గదలింప నుండెడున్॥ 6

చ॥ తగునని సల్పియుంటిమిగదా! వెడతంత్రము లప్పుడప్పు; డా
తెగువరి వానినెల్ల నొకతెంపున వమ్మొనరించె; దానితో
మగుడక మాఱుకొన్న పులిమాదిరిఁ బైఁబడ దూఁకుచుండె; నీ
మొగి నరికట్టి, యెట్లు మనపోఁడిమి నిల్పుకొనన్ దరంబగున్!॥ 7

మ॥ 'కలనే నేఁడు బిజాపురీశ్వరుకడన్ ఖడ్గంబు నంకించు వీ
రులు సర్దారు' లటంచు నాడికొను కాఱుల్ సైఁపఁగావచ్చునే!
కలఁగంబాఱెడు దేశమున్ మత ముపేక్షన్ జూడఁగావచ్చునే!
నలుసై ముల్లయి బాకు బల్లెమగు దంటన్ గెంట కిట్లోర్తురే!॥ 8

శా॥ మీలో నొక్కఁడుగాని, పల్వు రొకటన్ మొండొడ్డియేగాని, దు
శ్శీలుండౌ శివరాజు నొంపవలయున్; జీవమ్ముతోఁ బట్టు తెం.
తే లెస్సై తగుఁ, గానిచో నుసురు మాయింపన్ దగున్; శూరులా
రా! తెం, డెవ్వరు పట్టితేఁగలరో సహ్యారణ్య శార్దూలమున్!"॥ 9

చ॥ అనుటయు రాజమాత యిటులాడె "నిజప్రభుభక్తిఁ గీర్తిఁ బెం
చిన సరదారు లింద అవిజేయులు గల్గి, బిజాపురీ యశో
ధనమును గొల్లగొట్టు నొకతస్కరు నొంపఁగఁ జాలరో? గతిం
చిన సులతానుతోడన నశించెనొ మీ భుజసార సంపదల్?॥ 10

ఉ॥ 'ఈఁటెల నెత్తి సైనికు లనేకులు వెంబడిరా శివాజి పెన్
ఘోటక మెక్కి సహ్యగిరి కూటములన్ దిగివచ్చె' నన్నఁ, ద
ద్ధాటి బిజాపురిన్ గవఁకుతల్పులు గిఱ్ఱున మ్రోయుఁ, దద్ధ్వనిన్
బీఁటలువోవు మా హృదయభిత్తిక, లింతలు రాక యొప్పునే!॥ 11

ఉ॥ అన్నిటి కాఢ్యతా మహమదాదిలుశాహినవాబు లూఱటన్
గన్నులు మూసి; రీతఁడు పగన్ దెగఁదీయు తలంపెగాని, యా
సన్న లెఱుంగఁ; డాట బలశాలులు మీ రొక తెంపుసేసి, యా
మన్నెమరాట యాగడము మాన్పకపోయినఁ గీర్తి దక్కునే!"॥ 12

## అపజుల్ ఖానుప్రతిజ్ఞ - రాజమాతప్రోత్సాహము.

తే॥ అనెడు పల్కులఁ జిటచిటలాడుమనసు
గడుసుదేఱఁగ, వెడమోము గంటువాఱఁ
గండబలుపున నపజులుఖాను లేచి
కొలువుఁ గలయఁ గనుంగొని పలికె నిట్లు॥ 13

చ॥ "వలదు జహాపనా! వెఱఁగుపాటున నెమ్మది నొచ్చుకోలు; బె
బ్బులి మిడికోఱలే నొడిసి పుచ్చెడు మేల్ సరదారు లిందఱన్
గొలువున నేలు మీ రడవికోఁతుల చేఁతల కొల్లఁబోదురే!
చలమున సానదేఱిన బిజాపురికుంతము మొక్కవోవునే!॥ 14

మ॥ అతఁ డే మిందఱ మమ్ము మీఱు మొనగాఁడా? కొంతగూడెంబులన్
మెతుకుల్ చల్లుచు గుంపుగట్టికొని దొమ్మిన్ దోఁపిడిన్ జేయు కు
చ్చితుఁ; డేనాఁ డెదిరించి మా యెదుట నిల్చెన్? దండ్రికై పాదుషా
బ్రతిమాలన్ జనెఁగాని, బీరమున మాపై కత్తి రాఁగల్గెనే?॥ 15

చ॥ అఱమదిలేని మా మహమదాదిలుశాహినవాబుగారు ము
మ్మరమునఁ బోక, వానిపయి మంచితనంబును జూపి: రంతఁ బో
సర మెగమేసి మాఱుకొనసాగె; నిఁకన్ దమ రిట్లు మాఱ్కొనన్
దరమగునే బిజాపురపు దండు మొనన్ మొనకట్ట వానికిన్!॥ 16

ఉ॥ ఈ సరదారు లీబలఁగ మిందఱు కావలెనే, నిరర్థకా
యాసమగాక? యీభటున కబ్జులుఖానున కాజ్ఞయిండు, సం
త్రాసము దోఁప దూఁకి శివరాజును బ్రాణముతోడఁ బట్టి మీ
దాసునిఁ జేతు, లేక పెరదారిఁ బెనంగినఁ గ్రుమ్మివైచెదన్!॥ 17

తే॥ బాఱెయదాపునఁ దల నిక్కవాడిచి యెగురు
'కొండయెలుక' కై తమ కింత కుదిలి కేల?
యుక్కుబోనుగా నాబాహువు లొడ్డి వానిఁ
బొదివి మెసపుచు, నేలపై నుదికి విడనె!॥ 18

ఉ॥ చూడుఁడు నాబలంబు, మలచుట్టును సేనలఁ దోలి కొట్టి గో
రాడెదఁ, గొండలందు గుహలం దెట దాఁగిన వేఁటనంటి వేఁ
టాడెద, మీ పదాబ్జములనైన - యమాలయమైనఁ జేర్తు; బొం
కాడఁగ నేర్తునే! కొలఁదు లాడక నన్నిపు డాజ్ఞసేయుఁడీ!"॥ 19

చ॥ అని యభిమాన ముట్టిపడ నబ్జులుఖాను వచింప, నంద ఆ
తని బల శౌర్య ధైర్య భుజదర్పములన్ గొనియాడి; రాఅట్ల
గొని సులతానుఁ డాబలియుఁ గొల్వునఁ బెద్దయొనర్చి పేర్చు మ
న్ననలిడి, ప్రోత్సహించు వచనంబుల నాతనితోడ నిట్లనెన్॥ 20

చ॥ "అపజులుఖానుజీ! యెఱుఁగమా భవ దద్భుత వీరకర్మముల్!
కుపితుఁడవైన ని న్నెదిరి కోల్కొను వీరులు గల్గిరే! కుతం
త్రపు మిడిమేల మెత్తుచు మరాటులు నేఁ డొకబంటులైరి; నీ
విపుల భుజాబలమ్ము పొదివించి విపక్షుల శిక్షచేయుమీ!॥ 21

చ॥ బలగముతోడఁ గావలయుభంగి పిరంగులు మందు గుండ్లు క
త్తులు కరు లశ్వముల్ ధనము తోఁచినటుల్ గయికొమ్ము; సర్వ శ
క్తులు వెలయించి యెట్లయిన దుర్జయుఁడౌ శివరాజు గెల్వు; మా
మొలకరితోడి పోరగుట మిక్కిలిగా నిటు హెచ్చరించెదన్"॥ 22

చ॥ అనుటయు రాజమాత సమయమ్మును గార్యము హెచ్చరించి యి
ట్లనె "సరదారుఁడా! యుచితమంతయు నీవ యెఱుఁగ నేర్తు; మా
మనసు కలంతవాయ పరిమర్దన దుర్దమ శక్తివై జయం
బును గొనిరమ్ము: శత్రుబలముల్ నినుఁదాఁకి భరింప నేర్చునే!॥ 23

చ॥ 'బలితములౌ తల ల్పదియు బాహువు లిర్వది లేవుగాని, యీ
కలియుగ రావణుం' డనియెగా నిను హైందవయోధు లెంత్రు; నీ
పలికినయంత చేయఁగల బంటవు; నీవలనన్ బిజాపురీ
కళ విలసిల్లు, ఖానుకుల గణ్యతయున్ దిరమై వెలింగెడిన్॥ 24

ఉ॥ అన్నిటిపైన నొక్కటెఱుఁగారయు; మాతఁడు కార్య ఖడ్గ సం
పన్నుఁడు, నీవు రోసమునఁ బైపడుచోఁ గడు జాగరూకతన్
బన్నుము; కొండయెల్క కెరఁబెట్టుచు బోనుకుఁ దీయఁగల్గుచో
నన్నిట మేలు; శత్రువిజయంబునఁ దంత్రము లీ వెఱుఁగవే?॥ 25

తే॥ ☬ సంగరారంభ మొకవైపు జరిపికొనుచుఁ
దంత్ర మనఁబోని మామంచితనము నడిపి
యతనిఁ జెఱఁబట్టు; మట్టిట్టు లయ్యెనేని
విడక తెగఁబట్టు - మదను గోల్పడకు మెపుడు॥ 26

ఉ॥ దేహబలంబుకంటెఁ గడుఁ దీవ్రము బుద్ధిబలంబు; ధర్మసం
దేహముఁ బొందువానిఁ దెగఁదీయు నొకప్పుడు కార్యవాది; వి
ద్రోహము కూడనైనఁ బగతుర్ బరిమార్చుట రాజనీతి; యు
త్సాహము లక్ష్మి;యింత మదిఁదప్పకు, మేగుము, గెల్పుఁగాంచుమీ"

---

☬ The dowager queen had beside instructed him to effect the capture or murder of Shivaji by 'pretending friendship' and rousing hopes of the Sultan's pardon.

Page 152. *N. S. Takakhav, M. A.*

ఖానుని యుద్ధయాత్ర - శివాజీకడకు రాయబారము.

చ॥ అనుడు 'మహాప్రసాద' మని యప్పుడ యబ్జులుఖానుఁ డాజ్ఞఁగై
కొని, పదివేల కాల్బలము - గుఱ్ఱపుదం డొకమైమువేలు - న
మ్మిన సరదారు లేఁబదికి మిక్కిలిగా మొగకట్టి, సర్వసా
ధన సముపేత సైన్య సముదాయములన్ నడిపించె నత్తఱిన్॥ 28

ఉ॥ బారులుదీరి ఫౌఁజు నడువన్, రణదుందుభు లొక్కపెట్టునన్
బోరుకొనంగ, శస్త్రములఁ బూనుచు నగ్గడ నంగరక్షకుల్
వాఱఁగ, వార్వ మెక్కి పటువైభవ మొప్పఁగ ఖాను తత్పుర
ద్వారము దాఁటి, దీటుకొని దండు హుటాహుటిఁ దోలెఁ దెంపునన్॥

ఉ॥ † గుంపులుగట్టి యొండొకరు గూడుచుఁ బాయుచుఁ ద్రోపులాడుచున్
దెంపున గంతువైచి వెనుదీయక సేనలు పర్వఁ, ద్రోవలో
అంపులుపోయెఁ బల్లెలు పురంబులు పంటపొలంబు; లింత దం
డింపులులేని సైనికుల నిష్ఠురవృత్తికి మేర యున్నదే!॥ 30

ఉ॥ † దండి మతాభిమానమున దర్పమునన్ జెలరేఁగి, సైన్య నా
థుండగు ఖాను తాను జనుత్రోవల నూళులు గొట్టి, సాధు గో
తండము రూపుమాపి, వనితాజనమున్ జెఱపట్టి, దేవతా
మండప విగ్రహాదుల క్రమం బడఁగించి కలంచె దేశమున్॥ 31

ఉ॥ † ఆమున ఖానుఁ డేఁచెడు నపాయములన్ బడి, 'పండరీ' పుర
స్వామి యదృశ్యుఁడయ్యెఁ, 'దులజాపురి' లోని భవాని విగ్రహ
శ్రీ మురిపెంబు వాసె, నవశిల్పకళా కమనీయ దేవతా
ధామములెల్లఁ జేష్ట చెడె, వెతంబడెఁ దైర్థిక సాధులోకముల్॥ 32

తే॥ † అల బిజాపురి మొదలుగాఁ దులజదాఁక
నడిచిన ధరిత్రి గగ్గోలు నడిపి, ఖాను -
శివపతి ప్రతాపగడమును జేరు టెఱిఁగి
దండు మరలించి తద్దిశాధ్వమునఁ జనియె॥ 33

† Page 70. J. N. SARKAR. † Page 152. N. S. TAKAKHAV.

మ॥ ఇటు లుద్దండత నేగి మార్గమున 'వాయీ' క్షేత్రముఁ జేరి, య
చ్చటి దేవాలయ గోపురాదికము లస్త్రధ్వస్తముల్ సేసి, ప
ల్లటముం బొందఁగఁ దత్పురంబు నిలువెల్లన్ గొల్లగొట్టించి, యం
తట ఖానుండు శివప్రభున్ బొదవు తంత్రం బెంచె నేకాగన్॥ 34

ఉ॥ "ఇంతలు ఱాతుసేసి మన మీఁగతి వచ్చు బెడంగి; వంచనా
దంతురుఁ డాతఁ డొయ్యనఁ బ్రతాపగడమ్మును జేరె; దుర్గమో
పాంత వనాంతమా నచట వాని జయింపఁ బెనంగుకంటె, నే
వంతునవైన నమ్మకము వల్కుచు బైటికిఁ దీయుటొప్పదే!॥ 35

ఉ॥ మంచితనంబుఁ జూపి, యభిమానము గన్పడ సంధి పేరఁ బి
ల్పించిన రాకపోఁ డడుగు వెట్టిన వాఁ డొకలాభ మాసఁ జూ
పించిన జాఱిపోఁడు, మనపెంపున కొగ్గకపోఁడు: కాక వ
క్రించిన నెందుఁబోవు - నెదిరించి ముఖాముఖి నిగ్రహించెదన్"॥ 36

తే॥ అనుచుఁ దలపోసి, ప్రియవాది - తనదు రాయ
బారియైన గోపీనాథపంతుఁ బిలిచి,
కార్యమును జూపి తగిన వాక్యములు గఱపి
నికృతి వెలయ శివాజిసన్నిధికిఁ బంపె॥ 37

ఉ॥ ఖానునిరాక చారులముఖంబున మున్నె యెఱింగి, వైరి సం
ధానము నాఁప నోపిన ప్రతాపగడంబును జేరి, దుర్భిదం
బౌ నటు కోట కేర్పఱచి, యచ్చటనచ్చటనున్న సైన్యసం
తానముఁ బిల్వఁగాఁ బనిచి, తత్పరుఁడై శివభూపుఁ డంతటన్॥ 38

ఉ॥ * సాఁగిన పట్టులన్ విడిదిసల్పిన పట్టుల శత్రుసేనలో
మూఁగుచు, గూఢచారుఁడయి పోకడలారయ నొక్కభృత్యు బై
రాగి విధానఁ బంపి, శివరాజు విరోధి రహస్యముల్ - తమ
ద్యోగము - తద్బలంబు నరయన్ బ్రతికారము లాచరింపఁగన్॥ 39

---

* Viswasa Rao in the guise of a fakir informed the

చ॥ అవసర మెంచి వారికి భయంపడినట్టులువార్త లంపుచున్,
దవులునఁ దత్క్రియా ప్రతివిధానములన్ నడిపింపఁ గొల్వులో
శివపతి వేచియుండ, నొకసేవకుఁ డప్పుడ యేగుదెంచి, యా
యవనుల రాయబారి తనయుండకు వచ్చుట విన్నవించినన్॥ 40

తే॥ తగినమర్యాద నతని నాస్థానసీమఁ
జేర్చి, యుచితపీఠము నిచ్చి శివవిభుండు
"కార్యమునుదెల్పుఁ" డని పల్కఁగా, నతండు
వినతుఁడై ఖానువాక్యంబు లనియె నిట్లు॥ 41

మ॥ "శివరాజా! హితకాంక్షినై వినుతు నీ శ్రేయంబు నాలింపు; మా
యవనాధీశుఁడు మాకు మీకును విభుండై యేలుచున్నాఁడు; గౌ
రవమున్ జూపుచు వారి యుత్తరవుమేరన్ బోక ధర్మంబు; నై
శవముందున్ బలె నాటలాడెదవు, రాజా! దీని సైరింతురే?॥ 42

మ॥ ప్రతికూలంబులు పెక్కు సల్పితివి; నీ పారుష్యమున్ దీర్ప ను
ద్ధతుఁడౌచున్ సులతాను నన్ననిపె, బద్ధస్పర్ధనై నేను వ
చ్చితిఁ; బోరా నెడ మేలుఁగీడు మది యోజింపన్ దగున్; సైన్య సం
హతిఁ బోరన్ బలివెట్టనేల, యొకతీరౌ దారి లేదయ్యెనే? 43

మ॥ ¶ నెరసుల్ దోఁపని చెల్మికల్మి నొకటన్ నీతండ్రియు న్నేను సో
దరులన్నట్లు మెలంగియుంటి మగుటన్, దత్పుత్రుపై నట్టి యా
దరమే యున్నది; వానికంటె నినుఁ బెద్దన్ జేయఁ గొండంత సం
బరమే యున్నది; యిందు నన్గలియరమ్మా నీకు మేలయ్యెడిన్!॥ 44

---

movements of the Khan to Shivaji

Chapter IX - *N. S. Takakhav, M. A.*

¶ Your father has long been a great friend of mine and you are, therefore, no stranger to me. Come and see me and I shall use my influence to make Adil Shah confirm your

తే॥ రాజనీతిలోఁ గల యంతరంగమెల్ల
నంతరంగములోని సౌహార్దమెల్ల
నొరులతోఁ జెప్ప నగువానె! యుచితమానె!
హెచ్చు కుం దాడ కిందాఁక వచ్చిపొమ్ము!॥ 45

చ॥ మనసులు గల్పి యాడుకొను మాటలతో నొకచెల్మి గల్గుఁ: జే
సిన యపరాధముల్ తొలఁగఁజేతు నవాబున కెక్కఁబల్కి, గె
ల్చిన ధరయెల్ల నీ కొసఁగఁజేసెద జాగిరుపేరఁ బెట్టి, కొ
ల్వున నినుఁ బెద్దసేతు, నెడఁబోవక నీ విటు వచ్చి పోఁదగున్!"॥ 46

చ॥ 'ఇవి మనఖానుగారు వచియించిన మాటలు; వారు మిమ్ములన్
మిత్రుల ననుగ్రహించిరని మేము వచింపఁగనేల! కార్య గౌ
రవమున మీకుఁ బోలిన తెఱంగున సమ్మతిఁ జూపుఁ; డిందుఁ బొం
దవు తెరువైన నయ్యది ముదావహమే యగు నెల్లవారికిన్'॥ 47

ఆ॥ వె॥ అనుచు రాయబారి వినిపింప, శివరాజు
సాదరముగ సకల మాకళించి,
మనసుకొతుకు మ్రింగికొని, తెచ్చికోలు సం
బరము కనుల విరియఁ, బలికె నిట్లు॥ 48

చ॥ "అపజులుఖానుగా రన మహామతిమంతులు; వారు మాపయిన్
గృప గలవారు; మా కహిత మెన్నఁడు సేయ రటంచు గట్టిగా
శపథము సేయవచ్చు; నిటు సాయము వా రొనరింతురేని, నే
నిపుడ మదుద్యమంబు విడి యేలినవారినిఁ జేరకుందునే?॥ 49

చ॥ జరిగినదాని కేమి, కడు సంబరమే యొనగూడె నేఁటి; కం
దఱమును రేపు గూడి యుచితంబగు సంధి ఘటింత, మేల తొం
దరపడ, విశ్రమించి గమనశ్రమమున్ దొలఁగింపుఁ డిప్డు" డం
చరుసము పుట్టఁగాఁ బలికి, యప్పుడ కొల్వును వీడుకొల్పుచున్॥ 50

---

possession of Konkan and the forts you now hold.

Page 71. - *J. N. Sarkar.*

తే॥ తన దివాణము డాపుగాఁ దగిన వసతు
లడరు మేడ గోపీనాథు విడియఁజేసి,
యతని యనుచరులకుఁ గొంతయవల విడిది
యిచ్చి. యందఱ కుచిత సత్కృతు లొనర్చె॥ 51

ఉ॥ వెన్నెల పొత్తిటన్ బొరలి, విచ్చిన తెక్కల గాలిసోఁకులన్
గన్నులు మూసి, మైమఱచి గాఢసమాధి మునింగె లోక; మి
ట్లున్న, నసాధ్య కార్యమున కూఁది శివప్రభుఁ డాదగొన్న లోఁ
గన్నన రాయబారినుడిఁ గల్గిన మంతన మొంచె నీగతిన్॥ 52

ఉ॥ “ఖానుని తొంటిచేఁతల నికారముగాని కృపాగుణంబు లే;
దే నటు విన్నయంత కొకయెత్తున ద్రోహముసేయు మోసపుం
బూనికగాని సంధిగొను పోకడ లే, దిటు రాయబారపుం
దేనియపూఁత పూసినను దీన హాలాహల ముండకుండునే!॥

చ॥ పగ మదియెత్తి, కీడుపఱుపన్ జనుదెంచినవాఁడు మోసపుం
దెగువన పోవుఁగాక వెనుదీయఁడు; నేరిమి గల్గి, వానికిన్
దగు వెరవంది, ముప్పునకుఁ దప్పుట - ముప్పొనరింపఁగల్గు టొ
ప్పగు; నెఱవాది కియ్యదనులందు మెలంకువ తెంపు గావలెన్॥ 54

ఉ॥ వచ్చిన రాయబారి తన వచ్చినకార్యముఁ బల్కె : దీన నే
కుచ్చిత మున్నదో తెలిసికొంట యసభ్యము గాదు: మర్మముల్
విచ్చి వచించునే యనుట వే; ఱతఁ డేదియొ పల్కె మానెఁ గా
కచ్చటి వన్నె చిన్నె మొగమందున రంగులు దేఱ కుండునే?”॥ 55

చ॥ * అని మదినెంచి, శాంతమగు నానడు రేయి నొకండ ‘భాస్కరుం’
డను తనరాయబారిఁ గొని, యప్పుడ ఖానువకీలు మేడకున్
జని, బహుమాన మానిత వచఃపరిపాటినిఁ ద న్మనఃప్రసా
దన మొనరించి, కార్యగతి తత్పరుఁడై శివభూపుఁ డిట్లనెన్॥ 56

* “At night (Shivaji) met him in secrecy and solemnly

శా॥ * "పంతోజీ! తమ దివ్యచిత్తమున విశ్వాసంబు మైకొల్పి యీ
చింతన్ బాపుఁడు; ఖానుగారిమదిలో స్నేహంబు తా నెట్టిదం
చెంతున్; మాపయిఁ గత్తికట్టుకొని తానే వచ్చువాఁ డింతలో
నాంతర్యంబున సంధికిన్ దిగుట యేనా? కూర్మి యిందున్నదే?॥ 57

ఉ॥ * ఎన్నఁడు లేని యీవినయ - మీయుపలాలన - మిట్టి నెయ్యపుం
జిన్నెలు వింతలేక వికసింపవు నేఁ; డతఁ డెట్టివాఁడుగా
నున్నను, మీరువచ్చి తగవొందవచించెద రాటఁ బల్కరా
కున్నది కీడుమాట; తనుమొద్ద మఱుంగు తెఱంగు లేటికిన్?॥ 58

తే॥ * దైవతంత్రము జ్ఞాన నేత్రమునఁ జూచి
శాంతి విధులచే జగదరిష్టము లడంచు
బ్రాహ్మణాన్వయుఁడవు, నీకుఁ బాడిఁ గఱప
నేమియున్నది? తెలియని దేమిగలదు? 59

ఉ॥ * ఇంతగ నేను మిమ్ము నసత్యులని యెంచకుఁడయ్య; నేఁడు దు
ర్దాంతులచేత హైందవమతంబు నిరాకృతమై, స్వధర్మ సి
ద్ధాంతములెల్ల రూపుసెడి, దైవత భూసుర ధేను మానిని
సంతతి భంగమందఁ, గనఁజాలక యుద్యమ మిట్లు సేసితిన్॥ 60

ఉ॥ * కావున నేఁడు హైందవజగంబు సమస్తము నాకుఁ దోడ్పడం
గా వలె; మీరు బ్రాహ్మణు లఖండ మహామతిశాలు లౌట స
ద్భావముతోడ సాయపడి, తాఁకును దప్పును జూపుఁ; డింతయున్
మీవిధి - ఖడ్గముఁ గొనఁగ మే, మిటులైన మత మోమఁగావలెన్॥ 61

---

appealed to him as a Hindu and a priest to tell him of the Khan's real intentions. Krishnaji (Gopinath - according to Rawlinson) yielded so far as to hint that the Khan seemed to harbour some plan of mischief."

Page 74. *Prof. J. N, Sarkar.*

తే॥ ఖానుమదిలోని కపట రంగమును దెలిపి,
చేయఁగలయంత నీవంతు సాయపడుము:
నేఁటినుండియు మావాఁడవౌటఁ, దరత
ర మ్మనుభవింప 'హిందవరే' పురమ్ముఁ గొనుము"॥ 62

చ॥ అని శివరాజు భక్తి వినయాదరణమ్ములు మీఱఁ బల్కఁగా
విని, తమదార సాహస వివేక ధురంధరతా గభీర వ
ర్తనముల కుబ్బు చిత్తముఁ దిరమ్ముగ నిల్పుచు, గోపినాథుఁ డి
ట్లనె - నిజ ధర్మదీక్ష యుభయానుగతిన్ గొఱవోని యట్లుగన్॥ 63

ఉ॥ "అబ్బురమయ్యె మీకృతి, కుశాగ్రమతీ! శివభూపతీ! కడు
న్నిబ్బరమైన పూన్కి గమనింతువు లోఁతును బాఁతు; నీకడన్
దబ్బఱ లాడఁగాఁ - దగవుఁదప్పి చరింపఁగ నౌనె? యిందు నా
కబ్బను రాయబార, మదిగా కగునే మన మొందు వల్కఁగన్?॥ 64

చ॥ అవనిపు లిట్టి తాంత్రికరహస్యములన్ దమ యాంతరంగిక
స్థవిరులతోడ మంతనము సల్పుదు; రంతియగాక దూతకున్
జెవిఁబడ నిత్తురే? తమకుఁ జెప్పినపాఠము 'ఔను; గాదు' నా
క వినుచుఁగాక దూత, పలుకన్ జనునే యధికప్రసంగముల్?॥ 65

తే॥ చతుర మతిశాలి విటు లొక్కసన్న వైచి
నాదు బ్రాహ్మణత్వంబు - హైందవత గూడ
నడిఁ బరీక్షించెదవుగాక, చారదృష్టి
నెఱుఁగవే మబ్బులో నీర - ముఱుము - మెఱుము?॥ 66

చ॥ ఎఱుఁగనివానియట్లు వచియించిన 'నేమి యెఱుంగ' వంచు, న
న్నరయుతలంపుతో నడిగినంతన 'నే నొకపెద్ద' నంచుఁ, దొం
దరపడ నౌనె? నాదు వచనమ్ముల నిర్వర మొక్కనిందకున్
గుఱియగు బానె? నిక్కమునకున్ నను - ఖానుని నీ వెఱుంగవే?॥

తే॥ పట్టనదు లేయి మేషలో నన్ను నిన్ను
జగ మెఱుఁగకున్న, నెఱుఁగుఁజూ సర్వసాక్షి!
కలియఁజూడని నాకంటె, ఖానుహృదయ
మెఱుఁగు పాజీకుటుంబ; మిం తరమునేల?। 68

చ॥ అడుగకు నన్నుఁ, జెప్పఁడని మైనను దప్పుఁగఁ జూడఁబోకు; నీ
కడఁక సమస్త హైందవజగ త్సుఖదం బగునేని, దోడ్పడన్
గడఁగు జగంబె; బ్రాహ్మణుఁడఁగావున దీవన లిత్తుఁ గొమ్ము - కా
ఱడవులు కమ్మఁదోఁట లగునట్లు భవాని యనుగ్రహించుతన్"॥ 69

చ॥ అనియెడు గోపినాథు హృదయమ్మును మెచ్చి శివప్రభుండు వా
కొనెఁ, "దమ ధర్మనిశ్చలతకున్ ముదమయ్యె; నుదార ధీర వ
ర్తనమున హైందవత్వమును బ్రాహ్మణతన్ వెలిఁగించినాఁడ; వి
చ్చిన హివరేపురమ్ముఁ గయిసేయుము దొడ్డతనంపుఁ గానుకన్॥ 70

తే॥ మనసునిండఁగ నిడిన దీవన యొకండ
చాలు - సకలార్థములఁ గార్యసరణి గెలువ,
రాయబారమ్మునకు నుత్తరంబు వినుతుఁ
గొలువునకు రం" డటంచు వీడ్కొనియె నతని॥ 71

చ॥ మఱునిన మాప్తులన్ గలిసి మంతన మాడి, రహఃప్రవృత్తులన్
గుఱికొని, రాయబారులను గొల్వునకుం, బిలిపించి మన్ననల్
జరిపి, శివప్రభుం డనియె "సాధుముఖంబున ఖానుగారు మ
మ్మరసెడు నెయ్యపుంగలిమి యద్భుతమై మది విందుఁగొల్పెడిన్॥ 72

ఉ॥ అంతటివాఁడు, దిగ్గజము నైన బలంబున నిగ్రహించువాఁ,
డంతకునైనఁ గిట్టి రణమాడువడిన్ బుజ మప్పళించువాఁ,
డింతలు కూర్మి పేర్మి వెలయించుట భాగ్యము గాదె? వారి సా
మంతులమై చరించుటయు మా కొకవున్నన గాక యల్పమే?॥ 73

ఉ॥ కూరిమి ఖానుగారికడకుఁ జని సంగతి విన్నవింపఁగాఁ
గోరిక యున్న, దైన నొకకొంకును జంకును బాయకున్న; దా
వీరు బలంబు సైన్యబల విస్ఫురణంబుఁ దలంచి, యందు రా
నేరమి మాయమాత్యులు గణింతు రపాయ మపాయభీతులై॥ 74

ఉ॥ కావున నింతదూర మిటు కాల్గదలించినఖాను కూర్మి య
ట్లే వికసింపఁ గోటకడ కిచ్చటికిన్ జనుదెంచు నేని, స
ద్భావముతోఁ దదీయ హితపద్ధతులన్ శిరసావహింతు; నీ
త్రోవను వారు వచ్చుటయు దొడ్డతనం బగు మాకు వారికిన్॥ 75

తే॥ ఇంతయును ఖానుగారికి నెఱుకపఱచి,
కపటతంత్రము లిరువైపుఁ గదురకుండఁ
దీరుసేయుఁడు; మా రాయబారిఁ గూడ
ననుపుసేతు మీవెంటఁ గార్యమును నడుప"॥ 76

చ॥ అని శివరాజు వాకొని, ప్రియంబునఁ గొన్కల రాయబారులన్
దనుపుచు వీడుకొల్పి, నిభృతంబుగ మంత్రులతోడ మంతనం
బెనసి, భవిష్యదర్థమున నెందును గుందు పొసంగనట్లు - చే
సినపని ధర్మదూర మనుసేగికి లోఁగనియట్లు లెంచుచున్॥ 77

తే॥ ప్రతిభగలవాఁడు తన రాయబారియైన
భాస్కరునిఁ బిల్చి సంధిలోఁ బట్టు విడుపు
వినిచి, ప్రతినిధిగా వారివెంటఁ బనిచెఁ :
జనిరి వారలు ఖానుదర్శనముఁ జేయ॥ 78

ఉ॥ వచ్చిన రాయబారుల కవశ్యపు గౌరవ మిచ్చి, భాస్కరున్
నచ్చిన యొక్కమండపమునన్ విడియన్ వెడలించి, ఖానుఁ డా
తెచ్చిన వార్తలోఁ బొసఁగుతీరు వినన్ మదిఁగోరి, "సంగతుల్
పొచ్చెములేక తెల్పు" మనఁ బొంగుచు ఖానువకీలు తా ననెన్॥ 79

ఉ॥ "కోరిన కార్యమేమొ సమకూరెను: దా శివరాజు మీ మహో
దారత కిచ్చమెచ్చి తమ దర్శనభాగ్యము వేచియుండె; వి
స్తారములైన సైన్యముల - సాటి యొకింతయు లేని మీ భుజా
సారము నెంచి గుండె దిగజాఱ, నతం డిటు రాఁ దలంకెను౯॥ 80

తే॥ 'కార్యగౌరవమున నాత్మ గౌరవంబు
తడవ, కచ్ఛవమాచెల్మిఁ బ్రతాపగడము
క్రిందు కరుదేర, మిమ్ము దర్శించి హితము
వినియెద' నటంచు శివరాజు విన్నవించె॥ 81

ఉ॥ కొండికయాటఁ - దుంటరులు కొందఱు చేరుటఁ - బెద్దవారిదా
దండనలేమి దుండగముఁ దార్కొనెఁ గాక, శివాజి కింతటా
గుండెలు లేవు; దండుఁగొని ఘోరముగాఁ దమ రాత్రి రాఁగ, నీ
గండము దాఁటు కెట్లనువగన్ దిగఁబాఱి, వితాకు వొందెను౯॥ 82

ఆ॥ ఖానుమహాప్రభూ! తమ మగంటిమి కాశివభూపుఁ డెంత? యా
జాను మహాభుజుండవ, వతిసత్త్వ ఘనుండవు: నిన్నుఁజూచెనే
నేనుఁగులైన భీతిఁ బరువెత్తెను, వామనుఁ డీతఁ డేమగున్
బోనము నాసఁజేసి పెనుబోనుఁ జొరంబడుఁగాక మీకడ౯!॥ 83

చ॥ మిముఁ గదిలింపలే, రెవరు మేకొనియున్: శివరాజు భీతుఁ: డీ
సమయమునందు మీ రతనిజాడన పోవుచుఁ గొంత నమ్మకం
బమర నటించు టొప్పు: మనయల్లెకుఁ జేరినమీఁదనో - సమ
స్తము సుకరంబు; గోటఁ దెగుదానికి గొడ్డలి యెత్త నేటికిన్?॥ 84

తే॥ ఇదియ నా చేయువిన్నపం, బింకపైన
శివవిభుఁడు రాయబారితోఁ జెప్పి పంపు
పొత్తుమాటలు స్వాయముగాఁ జిత్తగింపుఁ"
డనినఁ, గృష్ణాజిభాస్కరు నటతుఁ బిలిచి॥ 85

చ॥ "శివపతిపల్కులన్ మనవిసేయు" మనన్, నతుఁడై యతండు గౌ
రవమునఁ బల్కె– "మా ప్రభుఁడు రక్తిమెయిన్ దమచెల్మిఁ గోరె; నేఁ
డవసరమయ్యె, మీబలఁగమంతయుఁ గ్గొని సంశయంబునన్
సవిధముఁ జేరఁగా వెఱచి, సన్నిధి నీగతి విన్నవించెడున్॥ 86

ఉ। 'మీరు తలంచుమేలునకు మేము కృతజ్ఞుల; మిట్లు మాహితం
బారసి తండ్రివోలె నుచితానుచితమ్ము లెవండు దెల్పెడున్?
సూరిమివోసి పిల్చుటయె గొప్పగ నే నటువత్తు నైన, మీ
తీరున రాజనీతి గడిదేఱని చిత్తము తత్తఱించెడున్॥ 87

చ॥ తమమది నవ్య మెంచక, ప్రతాపగడమ్మను కోటక్రింద నూ
త్నముగ రచించు మండపమునన్ గలియన్ జనుదెందు; వెంట సై
న్యము లితరాయుధమ్ము లెవ్వరైనను దేఁదగ, దొక్కబంటు ఖ
డ్గముఁగొని వెంటవచ్చుఁ, గపటమ్మును వీడి చరింపఁగావలెన్॥ 88

తే॥ అచట నియమంబులెల్ల మాటాడుపిదప
మదియు మది గూడి మనపొందు కుదిరెనేని
నన్నదమ్ములమై పేర్మి నందవచ్చు'
ననియె శివరాజు; మీచిత్త మానతిండు"॥ 89

చ॥ అనుటయు ఖానుఁ "డింతసుళువై జతనంబు ఫలించె" నంచుఁ, "బ
న్నిన వలలో శివప్రభుఁడు నేరిమిలేక తనంతఁ దాఁ దగు
లొ్కనియె" నటంచుఁ, "గోటకడకున్ జనుచో నతఁ డేమిసేయు లె"
మ్మని, "దరిఁజేరువాని నెటులైనను బట్టెద" నంచు నుబ్బుచున్॥ 90

చ॥ తనుబలమున్ మనోబలము తద్దయుఁ బెద్దగఁ బోతరించి, వం
చనమెయిఁ గార్యసిద్ధిఁ గొనఁ జాతురి మించియుఁ, గీడుసేయ నెం
చిన విధినిర్ణయంబు నెడసేయక యాఁదలవంచి, ఖానుఁ డి
ట్లనె – శివరాజుపద్ధతి నిజాభిమతంబని వెల్లడించుచున్॥ 91

చ॥ భయపడ నేల? మా కతని పైఁ గడుఁ గూర్మి; యతండు కోరిన
ట్లయిదవనాఁడు కోటకడ నందఱముఁ బనిగొంద; మెట్టిసం
శయమును గూడ" దంచుఁ దనసమ్మతిఁ గాన్కల నిచ్చె; రాయబా
రియుఁ జనెఁ; ఖాను ఫౌజు నడరించెఁ బ్రతాపగడమ్ము త్రోవలన్॥ 92

### ఖానుని సంధించుటకై శివాజీ సన్నాహము.

చ॥ $ అట శివరాజు వేచి, సమయాగతుఁడౌ తన రాయబారి యి
చ్చటి చరితంబులన్ దెలుప సమ్మతిఁ జూపుచు, ఖానురాకకై
కుటిలపుమార్గముల్ చదునుగొల్పి, తదశ్వ గజాదిసేన కూ
ఊటు మొదవించె - మేల్విడిదిరచ్చలఁ బచ్చిక నీరముల్ దగన్॥ 93

సీ॥ కోటకు దిగువగాఁ 'గోయనా' లోయ తీ
రమున నీరంధ్రవృక్షముల నఱికి,
సమ చతురస్రమై చదునైన యానేల
రమ్యమౌ నొక గుడారంబు గట్టి,
చలువ చాందిని - ముత్తెముల జాలరులు - వ్రేలు
రతనాల గుత్తులు రాణగొలిపి,
పరువముకొలఁది నందముఁ గూరుచుండఁ బీ
ఠములఁ దివాసీలఁ గొమరుగూర్చి,
తే॥ నడుమ నాస్థానవేదిక నవ్య రాజ
లాంఛనమ్ములు వెలయ నలంకరించి,
యతుల సామ్రాజ్య వైభవోన్నతులు దొరయ
సంధిభవనము నచ్చోట సంతరించె॥ 94

$ By Shivaji's orders a path was cut through the dense forest all the way from Wai to Pratapgarh and food and drink were kept ready for the Bijapur army at various points of it.

Page 75. *Prof. J. N. Sarkar*

తే॥ ఖానుసేనలు వచ్చు మార్గమ్ము దప్పఁ
దక్కినవి యెల్ల బంధించి, దాఁగి వారి
జాడ లరయఁగాఁ దనయనుచరులఁ బంపి,
యన్నివైపులఁ గార్యంబు లనువుపఱచె॥ 95

సీ॥ అబిసీనియనుల శౌర్య మడంప నేగిన
ప్రౌఢ మోరోపంతు ముఖ్యమంత్రి,
నతనికి సాయమై యరిగిన నేతాజి
పాల్కరుఁ దారంగ బలము నేతఁ,
గల్యాణిప్రాంతంబుఁ గాచు సుబేదారు
నబ్బాజిసోన్‌దేవు నహితదావుఁ
బ్రాంతరక్షకులైన, బాజీఫసల్కరు -
శౌర్యనిశ్శంకు నేసాజి కంకు,
తే॥ మఱియు దూరమేగిన యోధవరుల నెల్లఁ
బిలువఁగాఁ బంచి, యొకనాఁడు కొలువు దీర్చి,
యందు ముందు ఘటించు కార్యక్రమంబు
శివమహారాజమౌళి వచించె నిట్లు॥ 96

చ॥ మనల జయింపఁగా నహిత మర్దన దుర్దమ సైన్యసంపద
ల్గొని చనుదెంచినాఁడు కుటిలుండగు నబ్జులుఖానుఁ; డాతఁ డె
త్తినపగ మీఱఁ బోర మొనదీర్పక దర్పము డాఁగురించి, వం
చనమెయి రాయబారములు సల్పుచు, నల్పములన్ దలంచెడిన్॥ 97

తే॥ వేగువారలు వచియించు విధము వేఱు,
రాయబారులు వల్కు మర్మములు వేఱు,
విహితుఁడని కౌఁగిలించుటో! యహితుఁడంచుఁ
గత్తి దూయుటో! యొకతీరు గాకయుండె॥ 98

మ॥ అతఁ డట్లుండుట నేముఁగూడ నొక మాయావ్యూహముల్ బన్ని మా
ఋతుఁ జేరన్ దలకొంటి; మీ తెలుఁగు శూరుల్ మెచ్చ రంచున్ గ్రుధా
యతి నంబేదల సేనలన్ నఱుకనేలా? ఖానుఁడు న్నే వెను
చ్చితపుంబోరున దారసిల్లెద; మనోచిత్యంబె నీల్గున్ దుదిన్!॥ 99

చ॥ ఇది చదరంగమాడు తెఱఁగు; గిఁమున రాజును మంత్రి సైన్యసం
పద గల; వెత్తుకెత్తు నడుపంగల చాతురితోడి తెంపు పెం
పొదవఁగఁ జేయు; నైనఁ బగయెత్తిడి హత్తు సజీవ సాధనం
బిది విపదాకరం బగుట నే నుసురోసున జూద మాడెదన్!॥ 100

ఉ॥ జూద మటంచుఁ బైచలువ సోఁక వచించితిఁ గాని, లోనఁ జి
చ్చై దరికొల్పుచున్నది దురాత్ముఁడు ఖానుఁడు వచ్చుదారిలో
నూఁదిన దుండగంబు; 'వెఱ యుక్తులనైనను వైరిగర్వ ని
ర్భేదము చేసిగాక మది వేఁడిమివో' దనునట్టు లయ్యెడిన్॥ 101

ఉ॥ కావున సంధిబంధమున ఖానునిఁ జేరఁగ నుంటి: నైన బా
హా విభవంబు సైన్యబల మగ్గల మాతని కొటఁ గార్యముల్
ద్రోవకుఁ దీయు మెల్లనియుఁ దోఁచెడు; నింకు భవాని గూర్మి సం
భావనఁ జేసి, చేయఁగల పద్ధతి నీగతి నిర్వహించెదన్॥ 102

మ॥ ☞ అమృతోత్పాదనఁ జేసి పెంచితిమిగాదా యీ మహారాష్ట్ర రా
జ్యము! నే నొక్కఁడ నెట్టులైన నిది పూజ్యప్రాజ్య సామ్రాజ్య క
ల్పముగాఁ గావలె; నా యనంతరము సాంభాజిన్ మహారాజుగా
నమరన్ జేయుచు, మీర లేకమతిఁ బ్రోవై దీని రక్షింపుఁడీ!॥ 103

ఉ॥ ☞ ఏ యొకఁడైన మీరు జగ మేలఁగఁ జాలుదు, రైన జీజియా
బాయినిఁ బెద్దసేసి పరిపాలన దీర్పుఁడు; దైవ భూసు రా
మ్నాయ మతాభివృద్ధికయి నాయొనరించిన ధర్మశాసనం
బీయెడ నున్న; దిందుఁ గ్రమమే నడిపించి హితంబు సేయుఁడీ!॥ 104

---

☞ He (Shivaji) left minute instructions for carrying

ఉ॥ ఇంతకు దైవనిర్ణయము నీ వెడగన్నులఁ జూడరామిఁ, గా
లాంతరమందుఁగూడ దిటమైన మనుద్యమ మేపులేక రూ
పాంతర మందఁగూడదని, యర్థవిధిన్ నియమించి యిట్లు ని
శ్చింతుఁడ నైతి: నింకఁ జెయిచేత నదృష్టము పెల్లగించెదన్॥ 105

ఉ॥ ఖానుఁడు చెల్మిఁగొన్న సరి: కాదని దుండగమెన్న, జావళీ
కానన మల్లెఁదొక్కి- చనఁగా నెడమిత్తునె? పొంచియున్న పం
చానన మట్లు దూఁకి, నిశితాసి లతాగ్రమునన్ దదున్నతా
పీన శిరోధిఁ గోసి బలివెట్టక నెట్టన జాఱనిత్తునే?॥ 106

ఉ॥ * ఈజతనంబు రంగమున నెట్లగునో కనుః డంగరక్షుఁ దా
నాజి యొకండ వాలుగొని నావెనుకన్ జనుదెంచుఁగాక, యే
సాజి మొదల్ చమూపతులు సైన్యములన్ గొని దుర్గరక్షణ
వ్యాజమువెంట వేచి సమయానుగుణంబుగఁ బైకొనన్ వలెన్॥ 107

సీ॥ మన దుర్గమునకుఁ దూర్పున గుట్టలను డాఁగి
నేతాజి సేనతో నిలువవలయు;
బలముతో జావళివైపు కానలఁ బొంచి
పొలసి, మోరోపంతు మెలఁగవలయు,
ఖానుతోఁ గలియు మాకడఁక దుర్గమునుండి
కనిపెట్టి, యబ్బాజి కదఁగవలయుఁ,
† ఘోరితమైన యప్పుడ శృంగరవము పి
రంగులై దిచట మ్రోయంగవలయు,

---

on the government in the event of his being killed,
Page 73. - *Prof. J. N. Sarkar.*

* Attended only by Tanaji, Shivaji slowly descended from the gateway of the castle.

† 'When you see me strike', Shivaji ordered him (the

తే॥ † శృంగరవముతో నేతాజి చెలఁగి రిపుల
భంగపఱుపంగవలయుఁ, బిరంగిమ్రోఁత
విన్నవెంట మోరోపంతు వెడలి, యరుల
నఱిమి తఱిమి వెన్నంటి వేఁటాడవలయు। 108

చ॥ ఇఁక మన మాలసింపఁదగ; దింతకు నే పుదయంబునందు ఖా
నుకడకుఁ బోవలెన్, దను మనోబలముల్ వెలయించి ప్రోద్దవ్రా
లక మును కార్యసిద్ధి పొదలన్ జనుదేవలెఁ గాన లెండు; పా
యక మన మీయెడన్ గలియునట్లు భవాని యనుగ్రహించుతన్!”॥

చ॥ అని బలఁగంబు వీడ్కొలిపి, యన్నిశి పుచ్చి యుషస్సమాధి మే
ల్కాని, కరణీయముల్ నెఱపి, గోకుల దైవత విప్ర వందనా
ర్చనములు దానధర్మములు సల్పి, భవానిప్రసాదమున్ శిరం
బునఁ గొని, వీరయోధు నుడుపుల్ గయిసేసె నుదాత్తమూర్తియై!॥

సీ॥ శిరమునిండుగ నుక్కుఁదెర శిరస్త్రాణంబుఁ
గట్టి, పైఁ బట్టుపాగా ధరించి
మైనిండుగా నయోమయమైన కవచంబు
నూని, పై నిల్వుటంగీనిఁదొడిగి
యెడమచేఁ బులిగోళ్లఁ గుడిచేతఁ బిడిబాకు
నంగీమఱుంగులో నమరఁ జొనిపి
నిడుపైన కరవాలు నడుముపట్టికనంటి
యొరసి ప్రేలాడ బంధురముఁ జేసి

---

sentry), 'Don't think of me; sound the charge, whether I stand or fall.' The signal was to be passed on to Moro Trimal by firing five guns at the same moment.

*Chapter IV. Rawlison.*

తే॥ భావ గంభీర సువిశాల ఫాలమందు
సర్వరక్షఁ గుంకుమరేఖ సంతరించి
యుబుకు నెమ్మది - యొప్పారు నొడలు దోఁపఁ
దల్లికడ కేగి పాదవందనము సలిపె॥ 111

జీజియాబాయి దీవన.

ఉ॥ ఆయతభక్తిఁ బాదముల నంటు కుమారకు నెత్తి జీజియా
బాయి తదీయమస్తకముఁ బాణితలంబునఁ బుణికి; విచ్చు కం
దోయిఁ దొనంకు బాష్పములతో గళభుగ్న రవంబుతో జయ
శ్రీ యొదవించు దీవనలఁ జేసిన పేర్మివచస్సు లిట్లనెన్॥ 112

తే॥ "తనయ! సమకట్టినాఁడవు ధర్మదీక్ష
ఖడ్గ మొకచేత - నొకచేతఁ గార్యవృత్తి;
మెడఁద ధైర్యంబు నంకించి, యీతలంపుఁ
బెంచిన భవాని నిన్ను గెల్పించుఁగాత!॥ 113

ఉ॥ కాదనరాదు నీ తెగువ; ఖానుబలంబుఁ దలంచి యందుఁ బో
రాదనరాదు; లో మరులుఱంపిలు ప్రేవులపొత్తు తాల్మి రా
నీకు; కుమార! హైందవమహీ శుభముల్ తలమోసిపట్టి నీ
వీఁడెద వొంటిచేత - సుడిమొత్తుల కందని రేవుఁ జూడుమీ!॥ 114

చ॥ మొదలుచునున్న వీ మనసు మీఱి - నినున్ గనుటాది పుట్టెఁ డా
పద, లవి దీర్ప నాపడినపాట్లు; శుభమ్ములు గూడె నేఁటి క
న్నది యిటులయ్యె; నాతపము లట్టివి; లోకముగన్న బిడ్డవై
యెదుగుము, తండ్రి! ఖానుని జయింపుము హైందవ భూతపంబులన్॥

ఉ॥ వచ్చినవాఁడు ఖానుఁ: డొకవైపునఁ గుత్తుక లుత్తరించు నా
పచ్చి కసాయి నీ వెఱుఁగవా? భవదగ్రజు నట్లుసేసె; నా
చిచ్చెదఁ బాయ కింతలు కృశించితి; నీ తరళాగ్రసుపూర మీ
వెచ్చని యూర్పు నీకనులఁ ద్రేల మెలంగుము ఖానుపొత్తునన్"॥ 116

ఉ॥ నాకును నీకుఁ జిచ్చు మడినాఁటియుఁ దీఱక, హైందవ ప్రజా
లోకము నాఁచి వేఁచు కుటిలుర్ దఱియర్ జనుచుంటి; వో కుమా
రా! కసిగాటు నేమఱకు; మన్న కొనర్చిన సూడు దీర్పు; మా
చీఁకటికోవలో నెవనిచేతులు మించునొ! కన్ను విచ్చుమిా!॥ 117

చ॥ అడుగడుగుర్ బ్రిమాదకరమౌ నొక యుగ్రమందుఁ జొచ్చి, వే
పడగల పాముతోఁ జెలిమివట్టఁగ నెట్టన దూఁకుచుంటి; వీ
యెడ నినుఁ - గాళియాహి శిరమెక్కుచుఁ దాండవమాడు బాలకృ
ష్ణుఁడ - వనుకొందు; నాకును యశోదతపంబు ఫలించుఁ గావుతర్!॥

ఉ॥ బాలుఁడ వౌచు గోహనన పాపము నాఁపిననాఁడు - సాహసో
త్తాలుఁడ వౌచుఁ దోరణము మొదల్ గడముల్ గొనునాఁడు - ప్రౌఢ వా
చాలుఁడ వౌచుఁ దండ్రిఁ జెఱసాలకుఁ బాపిననాఁడు - నీకుఁ దాం
బూలములో సుధాంశమయి పొల్పు నదృష్టము నేఁడు తోడగుర్॥

మ॥ అరిసేనా హృదయాంతరాళములు ప్రమోయర్ దార హుంకార భీ
కరమౌ సింగము నెక్కి, యష్టభుజముల్ ఖడ్గాది శస్త్రంబులర్
దరళింపర్, రణమందు నీ మునుము వెంటర్ గొల్తులర్ జేయు శాం
కరి యవ్యాజ కటాక్షముల్ కవచరక్షా దీక్ష ని న్నోముతర్!॥ 120

మ॥ తనయా! పచ్చని పైరు, లందు శిశుసంతానంబుతో నాడు పా
వన గోమాతలు, వానిసేవ ఘనులౌ బ్రాహ్మణ్యు, లవ్వారు నే
ర్చిన మంత్రంబులు, వానిదైవతములుర్ జేయెత్తి నిల్పొత్తు దీ
వనపూలర్ గురియింత్రుగాక తమకుం బ్రాపైన నీ యాఁదలర్!॥ 121

మ॥ అసిధారా వ్రత మూని, తెంపు కుదురౌ నాత్మోపహారంబునర్
బసుపుం గుంకుముఁ గాన్కవెట్టి ప్రణయబ్రహ్మం బుపాసించుచుర్
బసిపాపర్ నినుఁ బెంచి, నీవలన విశ్వశ్రేయముర్ గోరు తా
పసి నే నైతినయేని నాతలఁపుఁ జేవల్ తండ్రి! ని న్నోముతర్!॥ 122

తే॥ కలదు నా యంగరక్ష నీ నిలువునిండి
భయములే - దింక నీయన్నపగ నడంచి
మరలిరమ్ము; కుమార! యీ మన లలాట
కుంకుమాంకము నీ గెల్పుఁగుదువ యాత!"॥ 123

చ॥ అని నిభృతాత్మయై యభయహస్తములన్ దనమస్తమంటి దీ
వన లిడు జీజియాఁ గని శివప్రభుఁ డున్నమి తాననాబ్జుఁడై
"జనని! మహాప్రసాద మిది; సర్వజగద్విజయంబుఁ గందు నీ
యనుమతి; నెమ్మినుండు" మనియాడి, నతుండయి తల్లి వీడ్కొనెన్॥

మ॥ తరవారిన్ గొని యంగరక్షకుఁడుగాఁ దానాజి యేతేర, ని
బ్బరమౌ పూన్కి నగళ్ళు దాఁటుచు బహిర్ద్వారంబునన్ డాసి, "మీ
రరుదెం, డే మిదె వచ్చుచుంటి" మని యాహ్వానంబుఁ బుత్తెంచె స
త్వరభంగిన్ శివరాజు ఖానునకు; నాతం డుబ్బి మిన్నందుచున్॥ 125

మ॥ పదునేనూఱులు సాహిణుల్ గొలువఁగాఁ బైనంబు సాగించె; న
య్యదనన్ దగ్గఱి గోపినాథుఁ డిటు కార్యాకార్యముల్ వల్కె "నో
ప్పిదమే ఖానుమహాప్రభూ! తమ రిటుల్ వేంచేయ? నీసైన్యసం
పద లీదందడిఁ జూచి యాతఁడు వెలన్ బాటించి రా నేర్చునే?॥ 126

చ॥ వల, దతఁ డెట్లుకోరె నటు వైపునఁ గార్యము దీర్చికొంద; మీ
బలఁగము నింద నిల్పి, యొకపల్లకితోఁ బయనంబు గందు; బో
యలు మనయండ నుందురు; మహాబలుఁ డొక్కఁడు వెంటనుండు; మీ
బలము పదాఱువేల బలవంతులకుం దర - మింత చాలదే?"॥ 127

చ॥ అనఁ విని ఖానుఁ డుబ్బి, యిదియౌనని తా నరమైలుదూరమం
దునఁ దనసేన నిల్పి, పటుదోర్బల గర్వితుఁ డొట నెట్టి సా
ధనముల నెట్టి రక్షణవిధంబులనైనఁ దలంప, కొక్క తె
ల్లని యుడుపుం ధరించి పదిలంబగు పల్లకిపైన నెక్కెనన్॥ 128

ఉ॥ 'సయ్యానుబంద' నాఁగఁ బటుసత్త్వుఁడు ఖానుని యంగరక్షకుం
డొయ్యెఁ గటారిజుంటఁ గొని యుక్కున వెన్కొనె; గోపినాథుఁడున్
నెయ్యముఁ జూపి వెంటఁబడె; నేరని గుట్టల నెక్కిబోయలున్
డయ్యెచు మండపంబునికటంబునఁ బల్లకి నిల్పి మార్చుచున్॥  129

చ॥ అనుచరు లండ రా నడిచి యబ్జులుఖాను సపేవ మండపం
బును గని, దాని వైభవసమున్నతికిన్ గమనీయ శిల్ప శో
భనతకు విస్మయంపడి, శివప్రభుఁ డచ్చట చామికిన్ మనం
బున వెఱఁగంది, యావివరముల్ వినఁ బంతును బల్కరించినన్॥ 130

శా॥ గోపీనాథుఁడు ఖానుగారిమది సంకోచంబు నాయంగ నా
యా పల్కుల్ పచరించి, కోట దిగువాఁడై బంటువెన్నంట పా
జీపుత్తుం డరుదెంచుచుండ "నదె వచ్చెన్ జూడుఁ" డంచన్నఁ, ద
ద్రూపంబున్ గని ఖాను లేడిఁగను శార్దూలంబుగా నుబ్బుచున్॥ 131

చ॥ తనుఁ గని భీతిచెందిన విధంబు నటించు శివప్రభున్ గనుం
గొని పయిమాటగా "నితఁడు కోపము తాపములేని మంచివాఁ"
డని, "యొక మన్నెజేఁడయిన నద్భుత వైభవమార మండపం"
బని, "యెటుగూర్చె నీవిభవ" మంచని నాలుకతీపు నూపుచున్॥ 132

చ॥ "భయపడినాఁడు పాప! మిటువచ్చిన నేమగునో యటంచు సం
శయపడినాఁడు; గుండె దిగజాఱు నితం డెటు దేశ మెల్లెడన్
బయికొనినాఁడొ! నీ వరిగి నమ్మక మిచ్చుచు నిందుఁజేరఁగాఁ
గయికొనిరమ్ము చూత" మనఁగా మది నవ్వుచు గోపినాథుఁడున్॥

చ॥ "అవును, మహాప్రభూ! యతని కంతటిసంపద లున్న, నైన నే
మవుఁ? దమచేతిలోఁ బడుఁగదా యవి యిప్పుడ? మీరు మెల్లఁగా
శివపతి యిందురా ననువుసేయుఁడు; మీభటు మిమ్ముఁ జూచి ని
క్కువముగ భీతుఁడయ్యెఁ; జెనుకొంకున నియ్యెడ రాఁ దలంకెడున్॥

తే॥ అంగరక్షకు నెడముగా నంపి, మీరు
శస్త్రపాణులై యుండుఁ డిచ్చట; నతండు
నట్ల రాఁ గూర్తు" నన, ఖానుఁ డనుమతించె;
శివుని వినిచి, గోపీనాథుఁ డవలఁ జనియె॥ 135

ఉ॥ పాసు వచించినట్ల తన పార్శ్వచరుల్ విడి, ఖాను మండపా.
భ్యంతరమందు నుండె; శివుఁ డవ్విధమే తన యంగరక్షకుల్
బాంతముకంమనల్ నిలిపి ద్వారము డాయఁగబోయె; ఖానుఁడుల్
వింతగఁ బేర్మి యొార్మిఁ గనిపించి, యెదుర్కొని కేలుమున్నొచుల్॥

మ॥ "శివరాజా! దయసేయు, మేల జడుపుం జింతింపఁగాఁ? గ్రొత్తవా
రెవరున్నా, రొకయింటివారముగదా? యెన్నాళ్లకుల్ గల్గె ని
ట్టి విశేషం!" బని కౌఁగిలించె; శివుఁ డట్లే మారు గావించె; నా
కవుఁగింటల్ జని రొండు రెండడుగు లేకగీవులై యిద్దరుల్॥ 137

తే॥ "అదను దప్పిన విడిపోవు" నంచు నొకఁడుఁ,
"డనువు దప్పినఁ జెడిపోవు" నంచునొకఁడు,
నమ్మికలు లేని బాహుబంధములఁ దవిలి
నడిచి - రెవఁడు ముం దెట్లు పైఁబడునొ యనుచు॥ 138

మ॥ $ బిగువా సందిట నొక్కి, గొంతు నెడచే బిట్టూఁది, ఖానుం డదా
టుగ వాలుల్ గొని వ్రేయఁగా, శివవిభుండుల్ మోస మూహించి, బ
ల్పగు పూనికల్ జెమకించి పట్టుబిగి వాయల్ దూసి, డాకేలునల్
మొగచాటా పులిగోళ్ళ ఖానునుదరంబుల్ జీల్చె నుగ్రాకృతిల్॥ 139

---

$ Suddenly Afzal tightened his clasp and held Shivaji's neck in his left arm with an iron grip, while with his right hand he drew his long straight-bladed dagger and struck at the side of Shiva.

Page 78. - *J. N. Sarkar*

ఉ॥ 'మోసము మోస' మం చఱచి ముట్టుచు, వ్రేలెడు వ్రేవు లొక్కచే
నోసర నొత్తి, వాలుగొని యుద్ధతి ఖాను శివాజిమూఁదలన్
వ్రేసె; శిరస్త్ర మంట నొదవెన్ నఱు కించుక గోదుమంత; పే
కీసున హుంకరించి శివుఁ డీవడిలోఁ బిడిబాకు నెత్తుచున్॥ 140

శా॥ "ఓయీ! పాపనరాధమా! కుటిల మాయోపాయముల్పన్ని, మై
త్రీయోగంబున మృత్యువున్ బిలిచి రక్తిన్ నాట్యమాడింతువో?
నీయాటల్ మొనకట్టునే యిచట? గుండెల్ గండలున్ రాల్చి నీ
యాయుర్దీపము నార్తు: నీకెవఁడు తోడై వచ్చినన్ వచ్చెదన్॥ 141

శా॥ † హిందూద్వేషముఁ ద్రావి త్రోవనెచటన్ హింసింతువో గో సతీ
బృందం? బీశ్వర విగ్రహాలయము లుర్విన్ గూల్తువో? వ్రేల్తువో?
పందా! దైవము దిక్కులేనిదనుచున్ - పాషాణముల్ పల్క వం
చుం దీంద్రింతొ? శివుండు నిన్నుఁ గడతేర్చున్ గాక సోఁ -కోర్చునే?॥

శా॥ షాజీరాజున కెగ్గుసేసి చెఱలో గ్రస్గించి, మాయన్న సాం
భాజీరాజును దొంగపోటున నణిన్ మర్దించి, గర్వించి నేఁ
డాజిన్ నా కెదురైతి; వింక నడుగే నట్టిట్టుఁ బోనీయ, మూ
ర్ఖా! జాల్మా! నిలు" మం చదల్చి, పిడిబా కంకించి జంకింపుచున్॥

ఉ॥ జందెపువ్రేటునన్ జొనిపి, సవ్యభుజంబుననుండి కుక్షికిన్
గ్రిందుగ దూయఁగాఁ దిగిచి, వ్రేవులు నెత్తురుఁ బాఱఁ జీల్చి శ
త్రుందునిమెన్ శివప్రభుఁడు; రోఁజుచు ఖాను గతాసుఁడయ్యె; నీ
సందడి నింతలో నెఱిఁగి సయ్యదుబండు కృపాణపాణియై॥ 144

---

† A brave exploit was it (indeed) to destroy stone buildings and to break mute images that could not offer thee any resistance! Dost thou know that if thou hadst not committed these barbarities, I would never resolve to seek thee....thou wilst pay with thy life for what thou hast done .P. 17. "Life of the celebrated Sevagy" by *Cosme-da-Guarda*

మ॥ శివరాజున్ వడిఁ దాఁకె; నాతఁడును గౌక్షేయంబు సారించి యు
ద్ధవిధిన్ వానినదల్చె; నీతెఱపిలోఁ దానాజి యేతెంచి ఖ
డ్గ విహారంబుల వానిపై కుఱికె, యుగ్ర స్ఫోటనాటోపుఁడై
యవియంగా నెదఁగ్రుమ్మెదొమ్మిఁగొని సయ్యద్బందుఁగూల్చెన్ధరన్॥

ఉ॥ ఈ నడుమంతరంబు గొని యేపునఁ బల్లకిమోయుబోయ లా
ఖానుశవంబు నెత్తి, శిబికన్గొని పోవుచునుండ, మార్గర
క్షా నియతుల్ శివప్రభునిసైనికు లా చనువారి నొంపుచున్
ఖానుశిరంబుఁ గోసికొని గ్రక్కున నేగిరి కోటమీఁదికిన్॥ 146

మ॥ పటు దర్పోద్ధతు ఖానుఁ దాఁకి శివభూపాలుండు పోరాడు పెం
పట దుర్గమ్ముననుండి కన్గొని ఘనుం డబ్బాజిసోన్ దేవుఁ డం
తటిలో శృంగములన్ బిరంగుల జయధ్వానంబు మ్రోయించె; ను
ద్భటులై శత్రుబలంబుపైఁ బడిరి నేతాజీముఖుల్ యూథపుల్॥ 147

ఉ॥ కొండలు లోయలున్ గుహలు గుట్టలు పుట్టలు చెట్టు లీ చమూ
తండము నీనెనో యనువిధంబునఁ - జీమలపుట్ట ప్రీలిన
ట్లుండినచోటునుండియె రయోల్బణమై శివరాజసైన్య ము
ద్దండత రేఁగి. శాత్రవ వితానముఁగూలిచెఁ గుప్పకూరగన్॥ 148

ఉ॥ సంధి ఘటిల్లెనంచుఁ దమ సాధన వాహన శస్త్రపాళికిన్
బంధములూడ్చి, నిబ్బరమువట్టిన యావనసేన సర్వతో
బంధముగాఁ బయిఁబడు శివప్రభుసేనకు లోఁగి, కార్య మూ
కాంధత వీఁగి, రావడి భయంపడి చేడ్పడెఁ దాఱుమాఱుగన్॥ 149

తే॥ నడుమనున్న పదేనువందల తురంగ
బలముపైఁ బడి నేతాజిపాలకరుఁడు
కత్తి కెమ్మరైన ముక్కముక్కలుగ నఱికి
పలుచఁబడఁ జేసె నాహవతలమునెల్ల॥ 150

చ॥ * శివపతి యింతయుఁ దెలిసి సేనల కీగతి నాజ్ఞ చేసె "నా
హవమునఁ బాఱువాని, శరణాగతు, శస్త్రమువీడువాని వె
న్దవిలి వధింపరా, దకరుణంబుగ నెత్తురు వాఱరాదు; వా
రి వివిధ సాధనంబుల హరింపుచు, నూరక సాగనంపుఁడీ!"॥ 151

ఉ॥ యావనసేన లా శివమహాప్రభు నాజ్ఞ నెఱింగి, పోరఁగాఁ
జేవ యొకింతలేక, యనిసేసిన లాభములే దటంచు, నా
నావిధ వస్తు వాహన ధనంబుల నప్పనసేసి, వీటికిన్
బోవ ననుజ్ఞవేడ శివభూపతి వారి ననుగ్రహించుచున్॥ 152

తే॥ * "ఇష్ట ముండిన మముఁ జేరుఁ డెవ్వరైన"
నని పిలిచి యొప్పుకొనువారి కభయ మిచ్చి,
తరలువారికి జావళి దాఁటు దాఁకఁ
ద్రోవఁ జూపింప భటులను దోడుపనిచె॥ 153

ఉ॥ ఆలము దీఱెఁ, జేరె జయ; మర్వదియేన్గులు వేయియొంటెలున్
నాలుగువేల గుఱ్ఱము లనంతములైన పిరంగు లెక్కబం
డ్లోలి నమేయవిత్తము రణోచితవస్తువు లిట్లు లాభ ము
ద్వేలము గొంచు రా జరుగుదెంచెఁ బ్రతాపగడమ్ముఁ జేరఁగన్॥ 154

విజయోత్సవము - తృతీయదండయాత్రా ప్రయాణము

మ॥ పురవీథుల్ విజయోత్సవధ్వనులతోఁ బొంగార నూరేగి, త
త్పరుఁడై దేవి భవాని పూజ లొనరింపన్ జేసి, రక్తంపు జా
లరుదా ఖానుశిరం బుదాత్త బలిగా నర్పించి, భక్త్యున్నతాం
తరుఁడై తల్లినిఁ జూడనేగి చరణద్వంద్వంబుపై వ్రాలినన్॥ 155

* "శస్త్రంబులు మనకప్పగించి శరణుచొచ్చిన శత్రుసైనికులఁ జంపక రక్షింపవలయును; అనావశ్యముగా రక్తపాతము చేయవలదు" అని శివాజి వార్తనంపి......వారికి నభయదానమిచ్చి...తనయొద్ద నుండుట కొప్పుకొనిన వాండ్రకుఁ దగిన పనులనిచ్చి యితరులను వారివారి దేశంబులకుఁ బంపెను. పుట 102. కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.

తే॥ నెమ్మదినిఁ బొంగు నానంద నిర్ఝరంబు
కనుల నిండారి ఱెప్పలఁ దొనఁకులాడ
జీజయా పుత్రుఁ గౌఁగిటఁ జేర్చుకొనుచు
సహజ వాత్సల్య శీతలాక్షరము లుటిసె॥ 156

ఉ॥ "గండము దాఁటి నేఁటికి సుఖంబున వచ్చితివే కుమార! పూ
జ్యాండగు నన్నుఁ జంపు ననయున్ గొనుచున్ బగఁదీర్చికొంటి! నీ
యండన యుండి యేల్కొ నెఁగదయ్య భవాని! మదీయ పుణ్యముల్
పండెఁ! జిరాయు రున్నతుల వర్ధిలు మెందు జయంబుగాంచుచున్!"॥

మ॥ అని దీవింపుచు, దృష్టిదోష పరిహారాచారముల్ దైవతా
ర్చనముల్ దానము లెన్నియే సలిపె జీజాబాయి; కర్తవ్యతా
ఘనుఁడౌచున్ శివరాజు తల్లిసెలవున్ గైకొంచు నాస్థానమం
దునఁ గొల్వై విజయోత్సవంబు నెఱపెన్ దోరంబుతో కాన్కలన్॥

సీ॥ రణమునం దమితశౌర్యముఁ జూపినట్టి యో
ధులకు భూషాంబరాదుల నొసంగి,
గండపెండేరముల్ కంకణ గ్రైవేయ
కవచ ఖడ్గాదులఁ గాన్కలిచ్చి,
బవరంబులో గాయపడినవారల నౌష
ధోపచారంబుల నూర్చి తేర్చి,
మృతులైన యోధుల సుతుల కుద్యోగంబు
సతుల కన్నాశనభృతి నొసంగి,

తే॥ † సత్యపరత గోపీనాథు సత్కరించి
నెమ్మి 'హివరే' పురమ్ము దాన మ్మొసంగి;
యాజి దుర్జయుఁడైన తానాజిగళము
లలిత మౌక్తికమాల నలంకరించె॥ 159

---

† On Pantoji Gopinath he bestowed the village of Hivare. Page 162. *Kincaid,* C. V. O., I. C. S.

మ॥ * ఏవ నెమ్మిన్ గొని రంద; అస్తోకభటుం డేతెంచి, "సుల్తాను సే
న దవీయంబుగ దాఁటిపోయె; మన సేనానేత ఖాండోజి యి
య్యెదనన్ లంచముఁ గొంచు వంచనకు లోనై చోరమార్గంబునన్
గదియన్ ఖానకుటుంబముఁ గొని తొలంగన్ దీసెఁ గర్హాడకున్"॥

చ॥ అని వినిపింపఁగా శివమహాప్రభుఁ డాగ్రహమంది "వింటిరే
మన సరదారువర్తనము! మా కొకమోస మగౌరవంబునున్ -
దన కొకలాభమున్ దలఁచి, 'దక్షిణ శత్రుకుటుంబమైన మ
న్ననఁ గని పంపెనాఁ' డను ఘనమ్మగు కీర్తికిఁ బాపె మమ్ములన్॥

చ॥ అతని క్షమింపఁగూడదు; దురాత్ముఁ డతండును సేవ్యసేవక
స్థితి కొకదారి చూపవలెఁ; జేయఁగలట్టి మనుద్యమంబునం
దతుకులు వోవు నిట్టి కుటిలాశయు లుండఁగరాదు; శస్త్రస
మ్మితమగు రాజనీతి యరిమిత్ర భిదన్ గొన దిట్టిపట్టులన్॥ 162

ఉ॥ * కావున వాని నొందయిసఁ గాని యవశ్యము పట్టి క్రూరశి
క్షా విధిఁ జంపుఁ; డీగెలుపుసంబర మూరక తీఱఁగూడ; దు
చ్చావచ సైన్యముల్ గొని బిజాపురరాజ్యము నెల్ల లోఁగొనన్
గా వలె; లొంగినప్పుడె తెగం గొనఁగావలె శత్రువర్గమున్॥ 163

ఉ॥ రేపుదయంబునన్ వెలువరింపుఁడు సేనల; దుర్గరక్షణ
వ్యాపృతిఁ గొంద ఱిందె నిలువై, సరదారులు గొంద ఱావహా
ద్దీపితు లేగుదెండు; వెనుదీయక పశ్చిమవార్ధినుండి బీ
జాపురిదాఁక రాజ్యము విశాలము సేయఁగఁ బైకొనన్ వలెన్"॥ 164

---

* ఖండోజీ కాకడేయను నొక మరాటి సరదారుఁడు ద్రవ్యలోభముచేత శత్రువులకు వశుఁడై, శివాజీకిఁ దెలియకుండ అఫజుల్ ఖానుని భార్యా పుత్రాదులను దొంగ త్రోవలఁ దీసుకొనిపోయి సురక్షితముగా కర్హాడలోఁ జేర్చెను. ఈసమాచారము శివాజీకిఁ దెలిసినతోడనే వానినిఁ బిలిపించి శిరశ్ఛేదము చేయించెను.

పుట 103. "శ్రీశివాజిచరిత్రము." క. వి. లక్ష్మణరావు.

మ॥ అని శాసింపుచుఁ గొల్వువీడి శివరాజా వేఁకువన్ సర్వసా
ధనముల్ తోడుగ సైన్యముల్ నడిపి, తొల్తన్ జింజిరా గెల్వఁగా
ననుచున్ బైనముదీర్చి, మార్గమునఁ 'బన్హాళా' మహాదుర్గమున్
గని, దానిన్ గొనఁగాఁ దలంచి నలుప్రక్కల్ ముట్టె నాదుర్గమున్॥

తే॥ భీతుఁ డగుచు 'రుస్తుంజమన్' పేరి దుర్గ
నాథుఁ డర్పించె దాని; ధనమ్ముఁ గొంత
బహుమతి యొసంగి యవ్వానిఁ బంపి, శివుఁడు
నాయకునిఁ జేసె నచటనణ్ణాజిదత్తు॥ 166

సీ॥ పదపడి శివరాజు ప్రాంతమందలి 'పావ
నగడంబు' మఱి 'వసంతగడ' మాది
బహుదుర్గముల గెల్చి, ప్రాభవంబున నందుఁ
గప్పముల్ గొప్ప కానుకలను గొనుచుఁ,
గ్రిందుమీఁదును సహ్యగిరి నంటుకొన్న 'రాం
గణ' 'ఖేలనాది' దుర్గముల గెలిచి
ఖేలనాగడము 'విశాలగడం' బన
వెలయించి దానిపై బలఁగ ముంచె॥

తే॥ నింత మెఱిఁగి 'కొలానూరు' ప్రాంత రక్ష
కుండు 'రుస్తుముఖానుఁ' డుద్దండధాటి
మాఱుకొన, వానిబలముఁ దార్మాఱుసేసి
తఱిమెఁ గృష్ణాతరంగిణి దాఁటిపోవ। 167

ఉ॥ తఱుముచు నిట్లు బీజపురి దాపుగొనన్ జెను దండయాత్రలన్
బఱచి, మరల్చి సైన్యములఁ బశ్చిమవార్ధి తటంబుదాఁక వె
న్నఱిమి, 'దభోళు' 'రాజపుర' మాది జయించి, యఖండలక్ష్మి కా
ప్పెరలకొలందిగాఁ బనిచెఁ బెంపున రాజగడంబు సేరఁగన్॥ 168

**శివాజీ పైకి బిజాపురివారి మూఁడవపైపుల మొగ్గరము.**

చ॥ శివపతి దండయాత్ర సవిశేషముగా వినుచున్ బిజాపురీ
ధవుఁడు వితాకుఁ జెంది, పరితాపముతోడి పరాభవ క్రోధా
దవదహనంబునన్ మఱఁగె, తత్పరిహారము సేసిగాక పో
దవు కసిఁ బెంచి నిండుకొలువై సరదారులఁ జూచి యిట్లనెన్॥ 169

మ॥ "వినుచున్నారుగదా! శివాజి మనపై విక్రాంతుఁడై దుర్గముల్
గొనుచున్నాఁడని; వానియేపు సణఁపన్ గొండంత సర్దారు న
ట్లనుపన్ గాలికిఁ దూలిపోయె, నప్జలా ఖానుఁ డట్లౌనె! నే
మన నేమున్నది - సింగమున్ దునిమెఁగాదా నేఁడు సారంగముల్॥

తే॥ రాచకొలు వొక్కటియె గాదు రాజ్యమెల్లఁ -
జంటిబిడ్డయు - రాణివాసంబుగూడ
ఖానుమరణంబువిని, పరాధీనహృదయ
దీనముఖముల నివ్వెఱఁ దేలిపోయె!॥ 171

చ॥ ఇది సమయంబుగాఁ దలఁచి యేత్తెఱఁ బైకొనుచుండె నాతఁ; డి
య్యదనున ఱిచ్చవోయి మన మట్టిటు చూచినచో నితోధికా
భ్యుదిత బలంబునన్ బలిసి యుప్పెన మీఱు నతండు; నేఁటికిన్
గొదుకని భామినీప్రభుతకున్ మనపట్టున సేగి యొప్పునే?॥ 172

ఉ॥ కావున నెట్టి దుష్కరముగాఁని ఘటించు తలంపుతో నహం
భావము కన్నుగప్పిన శివప్రభు నొంపక తప్ప; దిందుకై
లా వొనగూర్ప నాదగు బలమ్ము ధనమ్ము సమస్తమున్ బ్రతి
జ్ఞా విధి నొడ్డికొందు; బలశాలులు మీ రొక తెంపు సేయుఁడీ!॥ 173

ఉ॥ పట్టినపట్టు మించి బలవంతముగాఁ దెగి పోరునప్డు వాఁ
డట్టిటు జాఱఁగూడ, దడియాసల నేమఱఁగూడ; దింతలోఁ
గుట్టిన తేలుగా జడిఁగి గోడల కెక్కెనఁగూడ దివ్వటీఁ
బట్టి సడించిగాక విడువన్ జన - దీగతి ముట్టఁగావలెన్॥ 174

తే॥ దీని కుఱవైన వెరవు సంధింపుఁ, డెవడు
ప్రతిన గొండురో లెం"డని పలుక, నంద
ఱొండొరులమొగంబులఁ గనుచుండి; రంత
ననువున ముఠారిజగదేవుఁ డనియె నిట్లు॥ 175

మ॥ "తమ రన్న ట్లితఁ డొక్కమెత్తుగడపై దండెత్తుచున్నాఁడు; దు
ర్దమ సైన్యంబులు పెక్కు లున్న; వెచటన్ ధైర్యంబు తంత్రంబు వి
క్రమమున్ జూపుచు నోహటింపని కడంకన్ దూఁకు నవ్వానిపైఁ
దమి నొక్కం డెవఁడైన మార్కొను టనర్థం బంచు భావించెదన్॥

తే॥ అంత నెఱజోదు మనఖానుఁ డట్టులవుట
నంతకంతకు నతఁడు దుర్దాంతుఁడగుట
నొంటిమొగమున నతని మార్కొంట దగమిఁ
దలఁచుచున్నారు మన సరదారులెల్ల॥ 177

ఉ॥ నాలుగుమూలలన్ గవిసి, నల్గురుగా మొనకట్టి, మత్తశుం
డాలములట్లు దాఁకి, కపటంబున బెబ్బులులట్లు దూఁకి, తం
త్రాలకుఁ జొచ్చి, తాఁకు నసిధారులకున్ దలలిచ్చి, పెచ్చు గ
గ్గోలొనరింపకున్నఁ గుసిగుంపులఱుపుల కాతఁ డొగ్గునే?॥ 178

సీ॥ అనుకూల మిపు డొండు వినుఁడు; ఢిల్లీసేన
లరుదెంచె నతనిపై కనుట వింటి;
మొకట నయ్యావి పోరు, నొకవైపు కవియింత
మబిసీనియా జింజిరాధిపతినిఁ;
బగఁ గొన్నవాఁడు భావంతు 'వాడీ' నేత
యతని రేఁపుద మొక్కయొండఁ దవుల;
మనము స్వయమ్ముగా మార్కొని బలముతోఁ
దఱుములాడుద మొక్కదండఁగొనుచు;

తే॥ నంపఁ 'గర్నాల్' సుబెదారుఁడగు 'జౌహరు'
సేన కధినాథుఁగాఁ బంపు సేయునెడలఁ
జుట్టుకొన్న దవాగ్నిలో స్రుక్కిపోవు
హరిణ యూథమై శివబలం బణఁగిపోవు"॥ 179

చ॥ అనుచు మురారి వల్క, నిది యౌ నని రచ్చటి కొల్వువార; లా
తనివెర విచ్చమెచ్చి సులతా నల వారలఁ బిల్పించి, యెం
చిన తననిర్ణయంబును వచించి, జయించినమీఁదఁ గల్గు మే
ళ్లనువునఁ జూపి, కావలయునట్లు ధనంబు బలం బొసంగుచున్॥ 180

తే॥ వేలువేలు మార్కొని శివవిభుని గెల్వ
బలియు శ్హావంతు జింజిరాపతినిఁగూడ
నంపకమువెట్టి, సిద్దీజౌహరుఁ డనెడు
పీరుఁ గర్నూల్ సుబేదారుఁ బిలువనంపె॥ 181

మ॥ పదియున్నాలుగువేల కాల్బలము, చేవల్ మీఱు తౌరంగికుల్
పదివే, లేనుఁగు లుష్ట్రముల్ శకటముల్ శస్త్రాస్త్రముల్ పెక్కు లే
చి దిటంబౌ నొక సేనఁ గూర్చి, పతిగా సిద్దీజౌహరున్ బొన
ర్చి, "దురాధర్షు శివప్రభున్ గెలిచి వాసిన్ గూర్పు" మంచాడుచున్॥

తే॥ అతనిబలమును దొంటి కార్యములఁ బొగడి,
తగ 'సలాబతుఖాన్' బిరుదంబు నిచ్చి,
ధూర్తు నబ్జులుఖాన్‌పుత్రుఁ దో డొసంగి,
సత్కరింపుచు నందఱ సాగనంపె॥ 183

ఉ॥ పంతముఁబట్టి ముట్టి, తమప్రాంతములన్ బలఁగంబుఁ దోలి, శ్హా
వంతుఁడు జింజిరాపతియు వైరుల మార్కొని; రా బిజాపురీ
కాంతుని సేనలున్ జనె నెకాయకి; నబ్జులుఖాన్‌సుతుండు దా
నెంతయు రేఁగి తండ్రిపగ నీఁగుటకై చనె వానివెంబడిన్॥ 184

◆ శివాజీ సన్నాహము - పన్హాళాగడమునుండి బయలుద్రొక్కుట. ◆

చ॥ కడు దిటమైన మొగ్గరముగట్టి నవాబిటు మూఁడుచోట్ల ము
ట్టడి యొనరింపఁగాఁ దివురుటన్ దనచారులచే నెఱింగి, ధీ
రుఁడు శివరాజు విక్రమహారుండు వివేకయుగంధరుండు నై
పుడిసిటఁ గార్యముల్ బిడుచుపోఁడిమి యోధులఁ జూచి యిట్లనెన్॥

చ॥ "అనుకొనినంతకంటె నరమై భరమై దుర మేగుదెంచెఁ; దెం
పునఁ దన సర్వసార మొకపుక్కిట నూఁదె బిజాపురీంద్రుఁడు; డీ
పెనఁకువ బొబ్బరించి జడిపించినఁ బోదు, పరాక్రమించి పం
బిన బలమూఁది పట్టుదలఁ బెంచి తెగించి జయింపఁగావలెన్॥ 186

చ॥ ఇది కడసారియెత్తుగడ, యిప్వర కొక్కపరీక్ష; యిందునన్
గొదుకని లావునై గెలుపుఁగొంటిమయేని నిఁకమీఁదఁ నెన్నఁడున్
బదరి బిజాపురంబు మనవైపునకున్ దలయెత్తఁజాల; దీ
కదన మమూల్యమంచు మొనకట్టిన నేల జయంబు తక్కెడున్!॥187

ఉ॥ ఉండినయట్టులుండి పగయెత్తుమదిన్ మనపైకి నిప్పుడే
దండు గదల్చినాఁ డదనుదప్పనివాఁ డవురంగజేబు; వాఁ
డండకువచ్చి ప్రాంతముల నాఁగిన నాఁగెడుఁగాక, తొల్త ను
ద్దండము నీ బిజాపురపుదండు నడంచుట మొక్కయెత్తునన్॥ 188

సీ॥ అబిసీనియా జంజిరాధిపు నెదిరి గె
ల్వఁగ రఘునాథబల్లాలువంతు,
'వాడీ' నియంత శావంతుఁ బంతమడంచి
తఱుమ బాజీఫసల్కరునివంతు,
మొగలుదండు నాఁపుచుఁ గొంకణమునెల్లఁ
గావ నబ్బాజిసోన్దేవువంతు,
రాజధానియును దత్ప్రాంత దుర్గములెల్లఁ
బాలింపఁ బింగళేపంతువంతు,

తే॥ తగినబలఁగమ్ముఁ గొని మీరు తరలుఁ డిపుడ,
యరుల కెడమీక పోరి జయంబు గొనుఁడు,
స్వయముగా నేను దొడరి బిజాపుకీను
సేనల విజృంభణంబు భంజించివైతు"॥ 189

మ॥ అని శాసింపుచు నందఱన్ బనిచి, యుద్ధాయత్త సైన్యంబుఁ దె
మ్మని నేతాజిచమూపతిన్ బనిచి, పన్హాళాగడంబందు వా
ని నిరీక్షించె శివప్రభుం; డతనియున్కిన్ బోల్చి బీజాపురిం
ద్రమనిసేనాని హఠాత్తుగా నుడిగొనెన్ దుర్గంబు నల్దొవులన్॥ 190

ఉ॥ కావలిపెట్టి, నాలుగుమొగంబులఁ దల్పులు ముట్టి, యందు రాఁ
బోవఁగ దారిగట్టి, తగు భోజనవస్తులు బైటినుండి రాఁ
గా వెలిఁబెట్టి, దుర్గమున గల్గుజనంబులఁ జిక్కువెట్టి, సే
నా విభుఁ డింక నెట్టులయినన్ నడికోటఁ బగుల్పనుండినన్॥ 191

సీ॥ ఇంతలో సైన్యసమేతుఁడై నేతాజి
యరుదెంచి యరుల వెన్నంటి తాఁకె,
బహిరంగముగఁ బోరె, గుహలు గుట్టలు చాటు
గొని పులివోలె గగ్గోలుపఱచె,
సంకులంబుగ దొమ్మిచేఱచె, దూరమునుండి
పలుశరంబులు పిరంగులును గురిసె,
వెఱచినట్లుండి యేమఱచి పైఁబడె, రేల
నిద్దురమబ్బులోఁ నిగిడిదూఁకె,

తే॥ యవనసేనల కందు ధాన్యములు గడ్డి
నీరము లభింపకుండఁ గంగారుగొలిపె,
నెంతపోరినఁ జెదరిపోకీసువెంచి
యవనసేనాని ముట్టడి నడఁచిపట్టె॥ 192

ఉ॥ కోటకులోపలన్ దిటవుగొల్పి శివప్రభుఁ డన్యు లెత్తు పో
రాట మడంపఁగా బురుజులంటిన సోరణగండ్లనుండియున్
మాటికిఁ గ్రాఁగునూనియలు మందుపిరంగులగుండ్లు బాణముల్
పోటున గుప్పి, శత్రుబలమున్ దఱిమెన్ దరిఁ జేరకుండఁగన్॥ 193

తే॥ ఎంతపోరినఁ జెదరక యేపుసూపె
యవనసేనాని; శివభూపుఁ డద నెఱింగి
యాజి భరమాటఁ దలఁచి, యన్నాజిపత్తు -
శూరమౌళి బాజీప్రభుఁ జూచి పలికె। 194

సీ॥ † "పిఱువోక పోరుసల్పితి మింతదనుక, నే
టాజియు వెలుపలఁ దఱుముచుండె;
నైన లాభము లేదు, యవనసేనాని ము
ట్టడి గట్టిపఱచి కోట గొన నుండె;
మనబలంబులు దూరముననుంట నీయల్ప
సేనతో రిపుల భంజించు టరిది;
యిదిగాక దుర్గమియ్యది మొన్న లోఁబడి
దిటవొనర్పమియు సందియముఁ గూర్చు;
తే॥ మఱియు దుర్గరహస్యముల్ మనల మించి
వారె యెఱుఁగుదురౌట నపాయ; మింత
నిలువ నరయక నే నిందు నిలుచుటయును
దప్పిదమ యయ్యెననుచు లోఁ దడవికొందు॥ 195

॥ కడచినదానికై వగచి కార్యము లే, దొకచిక్కు నేర్పనన్
గడపుట నీతి; దుర్గమిది గైకొనుఁగా కతఁ డిప్డు, రేపు మా
ర్పడ నిది గెల్వలేమి? పొరపాటు వెలార్పఁగ నేఁడు రాంగణా
గడమును జేరనెంతు; మొనకట్టుచు వీరి జయింత మవ్వలన్॥ 196

---

† To sally out and give battle was impossible, for the

ఉ॥ చీమయు జాఱకుండఁ బరిశీలనసేయుచునున్న వీరిఁ గ.
న్బ్రామి తొలంగరా దప్పుటు, వారికి లోఁబడి దుర్గమిచ్చిన
ట్లేమియునైన సంధి వెలయింపుచు సమ్మిక పుట్టఁబల్కి, వా
రేమఱియుండువేఁ నెలయించి తొలంగుట నేఁటి కొప్పగున్॥ 197

చ॥ మన మిటు తప్పికొన్న ననుమానముఁ జెందఁగవచ్చు - లంచముల్
గొని వెడలించెనేమొ యనుకొంచుఁ - జమూపతిపై నవాబు; దీ
నినె జనులాడుకొన్న గమనించు నిజంబని; యిట్లు భేదముల్
పెనఁచిన శత్రుపక్ష మది వీఁగిచనున్, మన తెంపు పెంపగున్"॥198

సీ॥ † అని పల్కి, యుదయంబునందున సంధికిఁబోలు
తెఱఁగెల్ల బోధించి, వెరవుసూపి
పనిచె నన్నాజదత్తు; నతండు వోయి జో
హారుతో సంధి మాటాడ, నతఁడు.
"సమ్మతించితి సంధి, స్వయముగా శివరాజు
రావలె, మాయమర్త్యములు కూడ"
వని చెప్పె; శివ్రుఁడు నమ్మినయట్ల నటియించి,
తన జాగరూకతల్ ఘనముసేసి,
తే॥ తగినసైన్యముతోఁ గోటదిగువ కేగి,
యవనసేనానితో సంధి యనువదించి,
"యొదవెఁ జీఁకటి యిపుడు, రే పుదయమందు
కోట యర్పింతు" నని తనకొలువుసేరె। 199

---

enemy far outnumbered the garrison. He had therefore, to contrive his escape by daring and stratagem. With this view he opened communications with the Sidi.....First he consented to surrender the fort .......By this time it was very dark and adjourned the conference for the night to be resumed the following morning. Page 185. *N. S. Takakhav.*

Rawlinson says, it was only an "apparent truce."

చ॥ § కొఱఁతలు దీఱెనంచుఁ, దమకున్ శివభూపతి లోఁగెనంచు, నే
పటు నితఁ డింకఁ బోరఁగలఁడా యని, సంధి ఘటిల్లఁగా బిజా
పురపతిసేన వేఁడుకలు పొంపిరివో నిశఁ గొంతవుచ్చి, యా
తురతలు దీఱ మైమఱచి, తూఁగెఁ దమస్విని కౌఁగిలింతలన్॥ 200

సీ॥ § నిశ్శబ్ద మా యర్ధనిశ లేచి శివరాజు
నలువైపుఁ గోటపైఁ గలియఁదిరిగి,
గాఢ నిద్రాముద్రఁ గదలిక ల్లేక పం
డిన సేనలున్న వైపునకుఁ జేరి,
కొంత సైన్యంబుతోఁ గోటఁ గాపాడఁగా
నణ్ణాజిదత్తున కాజ్ఞ వెట్టి,
బాజీప్రభుం డైదువందల సేనతోఁ
దన్ను వెన్నాడ నుత్తరువు సేసి,
తే॥ త్రాళ్ళు దిగవైచి, సైన్యముల్ దానుగూడ
వాని వెంటన చప్పుడుగానియట్లు
కోట దిగివచ్చి, రాంగణాకోటవైపు
బలము నడిపించె సాహసోల్బణుఁడు శివుఁడు॥ 2ⁿ1

చ॥ ఇది యెటులో యెఱింగి శివుఁడేగినయంతటిలో నెలంకువన్
గదిసి నవాబుసేన; తమకన్నులఁ బ్రామి శివాజి యేగుటన్
బదరుచు, నెట్టులే నతని, బట్టకపోయిన మాట దక్కదం,
చద నిది యంచుఁ గొందఱు రయంబున నేగిరి శస్త్రపాణులై॥ 202

---

§ The sentinels relaxed their watch and for the first time after a long period of tension gave themselves to mirth and frolic .... .... .... With the flower of his bravest Mavalis, Shivaji slipped down the fort walls and marched through the enemy's sentinel outposts. Page 183. *N. S. Takakhav*,

§ About midnight Shivaji and a body of chosen troops ....descended .... .... by a different path known as "Shivaji's Window."

తే॥ జవన తురగము లెక్కి - గజంబు లెక్కి-
పరువులిడువారు - కాల్నడఁ బఱచువారు
ముందు వెనుకగా గుంపులై సందడించి
చనిరి, సులతానుసైనికుల్ సైన్యపతులు॥ 203

చ॥ కడు వడిగా శివప్రభుఁడు గాఢతమంబునఁ గొండత్రోవ నె
క్కుడు దిగు డీఁదుచుండఁ దొలికొండపయిన్ రవి దోఁచె; రాంగణా
గడ మిఁక మూఁడుకోసు లనుగట్టునకున్ శివుఁ డేగి చూడఁ, గ
న్పడె వెనువైపు దగ్గఱగఁ బర్వులువాఱుచు వచ్చు సైన్యముల్॥ 204

తే॥ అంత శివరాజు సమయజ్ఞుఁడౌచు, నింక
నాలసించిన నొక యపాయంబ యనుచుఁ,
జెంతనున్న బాజీప్రభుఁ జేరఁబిలిచి
యవనసైన్యముఁ జూపి యిట్లనుచుఁ బలికె॥ 205

ఉ॥ "అల్లవిగో! బిజాపురపు యావనసేనలు గుంపుగుంపులై
పెల్లుగ వచ్చుచున్న - వొకపెట్టునఁ బైపడ; నిష్ఠ సైన్యముల్
గుల్లవడంగఁ గొండలును గుట్టలు నెక్కఁగ నేల? వైరులే
తల్లడమంద నియ్యెడన తాఁకుద మొక్కట మోహరింపుచున్॥ 206

మ॥ నునుపై నిల్వునఁ బొల్చు పార్శ్వములు రెండున్ గోటలట్లుండ, మ
ధ్య నెడం బించుకగల్గు లోయ యిది; యీద్వారంబు బంధించి ని
ల్చినచో యావనసేన లేవయిపునన్ జేరంగ రాఁజాల; వీ
మొనకున్ డాసినఁ గోసివైతము తలల్ పూబంతులై రాలఁగన్"॥

మ॥ అన బాజీప్రభుఁ డుత్సహించి యనె, "దేవా! నిక్క, మీ లోయదా
పునఁ దీండ్రింపుచు నిల్చి శాత్రవబలంబున్ జీల్పఁగావచ్చు; నీ
పనికై న న్నియమింపుఁ; డింతచనవున్ బ్రాపించినన్ వీఁడు తీ
ర్పని దేమున్నది? * రాంగణాగడముఁ జేరన్ బొందు నిశ్చింతులై॥

---

* N. S. Takakhav and J. N. Sarkar say that Shivaji reached 'Vishalgad.'

చ॥ ఒకె శివరాజమౌళి యిట నుండకపోయిన నేము లేమె? త
త్ప్రకట మనోబలంబును బరాక్రమ మన్నిట వజ్రవర్మమై
సకలముఁ గావదే? యతఁడు సాఁకినయోధులు చిచ్చుమేసి క
చ్చెకు మునుదూఁకుచున్ రిపులఁ జీల్చక వ్రేల్చక ఱిచ్చవోదురే?॥

మ॥ భవదాజ్ఞా పటుముష్టిబంధ నిపతద్బ్రహ్మాస్త్రమో వజ్రమో
యన బాజీ చనుదెంచునే యురక? నృత్యన్మృత్యు జిహ్వాకరా
ళ వలక్షగ్న విదారితారి తను కీలాలాభిషేకోదయ
ద్రవిబింబంబయి, రాంగణాగడముఁ జేరన్ వచ్చు మీవెంబడిన్॥ 210

తే॥ పావనం బిది ‘పాండురపాణి’ లోయ,
శూలపాణివై యిచటఁ గాచుకొనియుండి
వైరిశిరముల సోపానపంక్తిఁ గూర్తు;
నడువుఁ డింక మహాప్రభూ! యడుగులెత్తి”॥ 211

చ॥ అనుటయు, విస్మయ స్ఫురదపాంగకుఁడై మది యారవిప్పు మె
ప్పున శివరాజు వానిశిరమున్ గరముద్రిక నంటి “యోధుఁడా!
వినిచితి వాక్య యద్భుతనివేదిక; తెంపునమించు తేఁకువన్
దనరిన స్వామిభక్తి సదుదాహరణంబు గడించె నీయెడన్॥ 212

ఉ॥ హైహయరాజ వంశజున కగ్గముగా వచియించినాఁడ; వు
త్సాహముతోడి నీనుడి యుదారమ మైన, నొకండవైన ని
న్నాహవమందు శాత్రవుల కగ్గముసేసి తొలంగుచెట్లు, దు
ర్వ్యూహమునుండి తప్పికొనకుండుటయెట్లని యెంతు - నైనన్॥

ఉ॥ అంచిత వీరవిక్రమ విహార మహాక్రతుదీక్ష నిన్ను నే
మించితి; సర్వసాధన సమీకృత సుస్థిర సుప్రయోగతో
దంచిత సిద్ధివై యవభృథంబున ర; మ్మిపు డేను † గోటఁ బ్రా
పించినవార్త నీకు వినిపింతుఁ బిరంగిమెలుంగు లైదిటన్॥ 214

† “సేమ (శివాజీ) కోటమీఁదికిఁ జేరఁ గానే గుర్తుకొఱకు ఫిరంగిశబ్దము, అయిదుసారులు

తే॥ † రాంగణాగడ మేను జేరఁగనె తగిన
సైన్యముల నీకుఁ బంపుదు సాయపడఁగ,
ననువు గలుగుచో రిపుల వేఁటాడి రమ్ము -
కానిచోఁ గొండలెక్కి - నన్ గలిసికొమ్ము"॥ 215

తే॥ అనుచు నియమించి, యున్న సైన్యముల నిచ్చి
పరిమిత సహాయుఁడై శివప్రభుఁడు చనియె;
విచ్చుకత్తుల మిసమిసల్ వెల్లివిరియ
యవనరాజ తురంగసైన్యములు డాసె॥ 216

— పదునైదువేల బిజాపూరుసేనతో బాజీప్రభుఁడు పోరుట. —

ఉ॥ వేలకువేలుగా యవనవీరులు పైకొని బాకు బల్లెముల్
వాలును డాలుఁ గేలఁగొని వాద్యములన్ బఱపించి, విక్రమా
భీలతరాట్టహాసముల బిట్టుగఁ బైపడి - రభ్ర విభ్రమ
తాకల ఘనాఘనంబు లనఁగా, నుఱుముల్ మెఱుపుల్ సెలంగఁగన్॥

ఉ॥ $ అప్రతిరోధమై యడరు యావనసైన్యము బిట్టదల్చి బా
జీప్రభుఁ డాత్మసేనలకుఁ జేవిసరంగ, నుదాయుధాళుగ
క్షిప్రతర ప్రహారములఁ జిమ్ముచుఁ గ్రమ్ముచు వార లేచి, ఘో
ర ప్రథనాబ్ధి నుంధర ధరాధరమట్లు గలంచి రీసునన్॥ 218

ఉ॥ అందఱు కన్నిరూపులయి, యంతటఁ దా నగుచున్ బ్రభుండు మ
ధ్యందిన భానుఁడాచు నిశితాసి తళత్తళ లీన వైరులన్
గొందఱికాళ్ళుల న్నఱికి, కొందఱికుత్తుక లుత్తరించి, చే
యందనిచోట నీఁటె యలుఁ గవ్వలికిన్ దెగఁగ్రుమ్మి నిమ్ములన్॥ 219

---

చేయనగును. ఆశబ్దములు వినినతోడనే నీవు సైనికులతో గుట్టలచాటునఁ గోటమీఁదికి రావలసినది." పుట. 113. "శ్రీశివాజీచరిత్రము." క. వి. లక్ష్మణరావు.

$ The action at the Rangana Ghat has been compared ........to the battle of Thermopylae. *Rawlinson.*

శా॥ బాజీ శాతకృపాణ పాతిత శిరః పాదోయ వక్షస్కతిన్
వాజుల్ యోధులు చాపకట్లుగ ధరాభాగంబునన్ వ్రాల, న
య్యాజిన్ రక్తనదుల్ కబంధగిరు లేపై నిండె; నవ్వానిలో
బీజాపూర్విభు సైన్యముల్ సుడివడెన్ బెంపేది కంపించుచున్॥ 220

చ॥ అరి కరవాల శూల వివిధాహతులన్ నెఱిగంట్లు నిండి, నైఁ
బురపురఁబొంగురక్తములఁ బూచినకింశుకమై ప్రభుండు తెం
పొరయుచు హుంకరించి రిపుయూథము నావులమందచాడ్పునన్
దఱుముచు వెంటనంటఁగ, యథాయథలై చనె శత్రుసైన్యముల్॥

చ॥ మొన మొగవిచ్చి శత్రుబలముల్ వెనుదీయ, మరాటవీరు లే
చిన కసి వారివెంటఁబడి చిందఱవందఱలాడి; రింతలోఁ
గనుకని నా బిజాపురపుఁ గాల్బలముల్ చనుదెంచె; నయ్యెడన్
జెనఁకువ ఘోరమయ్యెఁ బ్రతివీర పరస్పర ఖడ్గఘట్టనన్॥ 221

ఉ॥ గుంపులుగుంపులై కదియఁగూడిన యావనసేన లొక్కెడాఁ
టింపున దూఁకుచున్ బ్రతిఘటించి కటారుల నొంచుచో, ననా
కంపిత ధైర్యసార మెదుగన్ శివసైనికు లేచి, మేను లా
సింపక ముందుకాలు వెనుసేయక పోరి రఖండచండిమన్॥ 223

చ॥ అడరిన దొమ్మిపోరున సహస్రములౌ యవనేంద్రుసేనలు
క్కడరఁ బరాక్రమించి వివిధాయుధముల్ పరఁగించి నొంచు సం
దడిఁబడి, బీరువోక రణతాండవ మాడుచు నల్పమాటఁ జే
ప్పడి, శివరాజసేన సగపాలుగఁ జేకొనె వీరతల్పమున్॥ 2

మ॥ పలుచంబాఱుచు ఱిచ్చవోవు టలముల్ పాటించి, కందోయిచా
ఱలలో నిప్పులువాఱ మేను గరుపాఱన్ దూఱి బాజీప్రభుం
డలుకన్ వాలును డాలుఁ బూని పటు వీరావేశ దుర్దాంతుఁడై
కలనన్ గోల్తలవెట్టి బిట్టడరె పా[illegible]॥ 224

సీ॥ కొఱవిదిప్పినయట్లు మెఱుఁగు లేచినయట్లు
కరవాలు మిసమిసల్ గ్రమ్ముకొనఁగ,
మునుమెత్తి రిపుమధ్యమును జీల్చి చొరఁబాఱి
నలువైపు సేనల నఱకులాడి -
పెనుగాలి తాటిపండ్లను రాల్చుచందానఁ,
గొడవండ్లఁ బైరులు గోసినట్లు,
చెఱుకుగడల్ నిల్వ నఱికి వైచెడురీతిఁ
జిగురాకు దూసిపోసిన విధానఁ -
తే॥ దలలు మొండెముల్ పాణి పాదములు కండ
లింతలింతలు తునియలై, యిందునందుఁ
బ్రోవులై, రాసులై, రణభూమి మిత్తి
వంటయిల్లనఁ బీనుఁగుపెంట చేసె॥ 226

ఉ॥ ఆతనివెంటఁ బార్శ్వచరులై చెలరేఁగి తదీయసైనికుల్
శాత కృపాణ పాళిఁ బెలుచన్ బరఁగించి తెగించి శాత్రవ
వ్రాతముఁ గూల్చి; రిట్లు బవరంబునఁ జిందఱ రేఁగు వారి పెన్
కోఁతల కోహటించి యడుగుల్ మగిడించె నరాతిసైన్యముల్॥ 227

తే॥ మూఁడువందల సేనతో మోహరించి.
దశ సహస్ర పతాకినీ దర్ప మడఁచి,
కనుమవాఁకిటఁ జొరనీక కాలుగట్టె
సింహవిక్రముఁడైన బాజీప్రభుండు॥ 228

ఉ॥ అక్కసు దీర్పఁగా నడరి యబ్దులుఖానుకుమారుఁ డంతలో
నక్కన సానఁదేఱు భటు లొక్కసహస్రము వెంటనంటిరా
నక్కడఁ జేరె; వానికి సహాయతఁ జూపిరి సైన్యనాథు; లా
దిక్కున గట్టిమొగ్గరము దీర్చి పయింబడి రంద ఱొక్కటన్॥ 229

ఉ॥ అప్రతిమ ప్రతాపమున నందఱకున్ దలమీఱి పోరి, బా
జీప్రభుఁ డాకటన్ దనివిఁజెందని సింగమువోలె రేఁగుచున్
స్వప్రతిపక్ష సైన్యము లపారములై చనుదేర, ముందు తీ
వ్ర ప్రధనంబు నెంచి పరివారముఁ గాంచి వచించె నీగతిన్॥ 230

ఉ॥ "వీరవరేణ్యులార! యరివీర విదారణ దారుణార్భటిన్
బారమునుట్టఁగా నదనువచ్చె; నిదే యెదు రేగుదెంచుచు
న్నారరు; లిందు వీరశయనంబుననుండియు వాలు దూయుచు
న్నారు స్వకీయు; లింతటి రణం బెదురయ్యును జాగు సేతురే?॥ 231

ఉ॥ రెండు, పరాక్రమించి విదళింపుఁడు వైరుల; మృత్యు తాండవో
ద్దండతఁ జిందులాడి, మిముఁ దాఁకినవాఁ డెవఁడైన వానిపైన్
గండలు రాల్పుఁ; డింతబలఁగం బిది గొఱ్ఱెలమందగాదొ? మీ
యండన రెండుమూర్లు దిటవానక పర్విడి యిప్పు డాఁగునే?॥ 232

చ॥ గడుసరియై శివప్రభుఁడు కట్టలుకన్ గుఱివెట్టి, రాంగణా
గడముననుండి శాత్రవులఁ గాల్చు పిరంగులగుండ్లు ప్రేలెనో -
పిడుగులు రాలెనో యనఁగ బెబ్బులిదాఁటున దూఁకి, మూఁకలన్
బడలువడంగ ముట్టి తెగఁబట్టుఁడు; నే నిదె ముందు దూఁకెదన్"॥

చ॥ అని కరవాలమెత్తి విలయాంబుధరార్భటి హుంకరించి చెం
గున రిపుసేనపై దుమికెఁ; గొల్లివులులట్లు తదీయసైనికుల్
మునుమున వాని ముందుఁబడి మూఁకఁ గకావికసల్పి; రిట్లు తాఁ
కిన యిరువాఁగు రేఁగి కలఁగెన్ బ్రతికూల తరంగ భంగిమన్॥ 234

మ॥ యవనాధీశ్వరు వీరయోధు లభితో వ్యామర్ద దుర్దాంతులై
కవియన్ గ్రమ్మి, కుఠార తోమర గదా ఖడ్గాదులన్ గ్రుమ్ముచున్
శివరాట్సేవల నొక్కనిన్ బముగురై చెండాడి; రయ్యాహవం
బవశీర్ణాంగ సముద్వసా రుధిర పూయంబయ్యె నొక్కుమ్మడిన్॥ 235

చ॥ తఱిమినఁ దాఁకిపోక, నిశితప్రదరంబుల నెత్తి యంగముల్
తఱిగిన భీమువోక, తమదాపునఁ దోడిభటాళి నేలపై
నొఱిగినఁ దూలిపోక, యుసురొగ్గఁచుఁ బోరు నిజానుయాయులన్
బురికొనఁజేసె డాసి శివభూప చమూపతి దాఁకె వైరులన్॥ 236

మ॥ కుటిలారాతి చమూ విపాటనవిధా కూలంకషాటోపుఁడై
పటు బాహాయుగమందు ఖడ్గయుగమున్ బ్రాపించి, బాజీప్రభుం
డటు లంఘించి, తటిల్లతాశతము వోయన్ వాలు సారించుచున్
విటతాటంబుగఁ గూల్చివైచె సమరోర్విన్ శత్రు గాత్రంబులన్॥237

సీ॥ ద్వంద్వ యుద్ధప్రౌఢిఁ దారసిల్లినవారి
నెదిరించి కుత్తుకల్ చిదిమివైచి,
యనువుమైఁ బొంచి పైకొని చుట్టుకొనువారి
విదిలించి కాళ్సేతు లొదుఁగనఱికి,
గుంపుగా నడరి దూఁకుచుఁ బోరువారిఁ బె
ల్చనఁ జాపకట్టుగాఁ జదియమోఁది,
వెఱచినట్లుండి వెన్నొరయు మూఁకలవెంట
నుఱికి తూలించి యుబ్బూఁతలూఁచి,
తే॥ రాహుదంష్ట్రాకరాళ శాత్రవకృపాణ
పంజరముఁ బాయఁదట్టి యవ్వలకు నెగసి,
మొగులుఁబాయు దినేశ్వరుపగిది నధిక
దీప్రకిరణుఁడై తఱిమె బాజీప్రభుండు॥ 238

చ॥ పలుచని కూనవెండ తనపైఁ బడు జేపటిప్రొద్దునుండి ని
ప్పులు గురియించు వేఁడికరముల్ మెయి గంటులు సూఁడుదాఁకఁ గా
ల్నిలుపక పోరి, బిట్టలము నీరసతన్ నిజరాజభక్తిమై
కొలిపి, యవార్యధైర్యమునఁ గొల్పొనుచున్ బ్రభుఁడాఁగె వైరులన్!॥

ఉ॥ అంతకుఁ గంత కేఁచి దిటమై తనుఁదాఁకు నరాతిసేనఁ గా
లాంతకుఁడై యదల్చి, మెయిసంతతట జల్లెడవోని గాయపుం
గ్రొంతలఁ బొంగి నెత్తురులు గాఱఁ, గొలందికిమీఱి యూరుపుల్
వంతులువాఱఁ, జేవచెడి వ్రాలుచు - సోలుచు - విక్రమింపుచున్॥

చ॥ పయిఁబడు నాజ్యధారలకుఁ బొల్పడుచున్ బొగరాఁజి, యంతలో
నెయిది ఛటచ్ఛటధ్వనుల నేచి ధగద్ధగమండు పావకుం
డయి ప్రభుఁ డప్డు తన్బొదువ నాఁగుచు లోఁగుచునున్న విద్విష
చ్ఛయము నదల్చి ధిక్కరణసల్పుచు రోసమువోసి యిట్లనెన్॥ 241

తే॥ "రండు, రండోయి! యవన శూరవరులార!
చెదరి చూచెద రేమి? బాజీప్రభుండు
చిక్కినాఁడుగదోయి మీ చేతులందుఁ?
దెంపుఁ జూపించి యిపుడ బంధింపరాదె?॥ 242

తే॥ ఔను, మీ పెద్దసేనాని యండలేఁడు -
తలకు బరువైనపని మీకు వలదులెండు!
కోరమీసంబు మునివ్రేళ్ళఁ గొసరిదువ్వ
నీ యెడమచేతి నైనఁ దీయింపరాదె?॥ 243

తే॥ చెవులపోతుల వేఁటగాఁ గవిసినారొ?
వచ్చినది పెద్దపులి, మిమ్ము వ్రచ్చివైచు;
శివవిభుని సైన్యపతులలోఁ జిన్నవానిఁ
తెవిలఁజాలరో? యిది యెంత సిగ్గుచేటు?॥ 244

తే॥ రండు, రండోయి! యవన శూరవరులార!
శనుమఁ ద్రొక్కుఁడు మీకాలు గట్టివైతు"
ననుచుఁ దెగనాడి, రౌద్ర రసానుభూతి
నొనసి దూఁకుచుఁ, [illegible] బలికె॥ 245

తే॥ "వెడలిరండు మహారాష్ట్ర వీరులార!
తఱిగిపోయెడు రిపులమస్త్రముల గములు!
మనకు రణరంగములు పెండ్లిమంటపములు -
వీరలక్ష్మితో జయలక్ష్మి వియ్యమాడు!॥ 246

తే॥ పడిన మనవారి యీ కళేబరము - లొకటి
యొకటి నిచ్చెనమెట్లుగా నూఁది, ప్రభువు
నడుచుచున్నాఁడు రాంగణాగడము నెక్కఁ,
జివర సోపానమైన మీా రవుట తగదొ?

తే॥ ఖడ్గధారల మునిఁగి రక్తనదు లీఁది
నవ్వుమోముల నరుగుచున్నారు వీరు;
లదిగొ! మందారకుసుమ మాల్యములతావి
మలయుచున్నది సూర్యమండలముఁ దెఱచి॥ 248

తే॥ వెడలిరండు మహారాష్ట్ర వీరులార!
చేతఁ గరవాలుఁబట్టి బాజీప్రభుండు
ముందుగా దూఁకుచున్నాఁడు - మునుము వెట్టి
నఱుకుచున్నాఁడు రిపు కంఠనాళ తతులు॥ 249

తే॥ ఇదిగొ! యొక్కటి - రెండు - మూఁ డెగిరిపోయె
నరులకంఠము, లింక నైదాఱు గడవ
శివమహారాజు కోటలోఁ జేరు వార్త
వచ్చుఁ; దడవులే, దరిసేన వచ్చుఁ డిపుడ!॥ 250

తే॥ స్వామిభక్తిలో నిలువెల్ల జలకమాడి
ధైర్యసారము నమలి, యుద్ధమునఁ విరుగు
వీరుఁ డలయునే? బహుళాజ్యధార నెసఁగు
ననలుఁడై జ్వాల లంతంత కాల్చుఁగాక!॥ 251

ఉ॥ దారులుగట్టి యీ కనుమదాపునఁ బోరుఁడు; నేఁటికీ ముఖ
ద్వారము గర్వఘూర్ణిత విపక్ష వరూథినిపాలికిన్ యమ
ద్వారము - వీరయోధజన వల్లభ కీర్తిరమా సమాగమ
ద్వారము; స్వామిభక్తి పణబంధమునన్ జొరఁబారుఁ డిందునన్"॥

చ॥ అని యెలుఁగెత్తి యార్చి, రభసాహవ దోహలుఁడై ప్రభుండు జా
ఱిన యుడు గూఁడికొంచుఁ, జెమరింపులచేఁ జెయిజాఱు వాలు బ
ల్మిని జళిపించుకొంచు, సుతిమించిన సొమ్మను సోలి తెంపు పెం
పున మెయికొంచు, శత్రుబలముల్ దఱిమెన్ దరిఁజేరకుండఁగన్॥ 253

ఉ॥ ఆఱని రక్తధార యరుణారుణమై మెయి జాలువాఱఁ, గో
పారుణమైన మోము నెఱయన్ గచబంధము వీడఁబాఱఁ, ర
క్తారుణ ఖడ్గజిహ్వ చెరలాడఁగ నార్చుచు, హుంకరింపుచున్
జాఱల జెబ్బులిన్ దెగడి క్షాత్రవులన్ నుఱుమాడె నేపునన్॥ 254

తే॥ గళిత శోణిత దుర్నిరీక్ష ప్రకారుఁ
డగుచు బాజీప్రభుండు పెన్దగ వగర్చి
సోలి తెఱుగుచున్నను, వానిజోలిఁ బోవఁ
దెగువఁజూపరె యొకరైన దిటవుమాలి!॥ 255

బాజీప్రభు మరణము - శివాజీ సానుభూతి

ఉ॥ అఱఁగనున్న విక్రమరసాంచితమౌ నొకపెద్దవెల్గు దు
ర్వార శిఖాసహస్రములఁ బైకొని మండుచునుండ, నింతలో
వారక రాంగణాగడము పైపుననుండి పిరంగి మ్రోఁత లే
పారె - క్రమోద్వయంబు నులియున్ బడు సవ్వడిఁ బంచవారముల్॥

ఉ॥ ఆ నినదంబు కర్ణయుగళామృతమై చనుదేర, స్వామి సం
ధాన కృతార్థతన్ దనిసి ధన్యత పుట్టి, దురంత వేదనా
దూనతఁ గంతవాళములఁ [illegible] ప్రాణము [illegible]పలేక, ని
ధ్యానపరాత్ముఁడై [illegible] యిట్లనెన్॥ 257

తే॥ "మనప్రభుఁడు - భారతీయ ధర్మ ప్రభుండు -
శ్రీ శివప్రభుఁ డదె కోటఁ జేరినాఁడు!
ధన్య మీపోరు, మీరెల్ల ధన్యతరులు,
తనువుఁ దొఱఁగిన వీరెల్ల ధన్యతములు! 258

ఉ॥ చాలు, నరాతిమస్తములచాలునఁ బువ్వులబంతులాడు నీ
యాలము; కోటఁజేరె నిరపాయగతిన్ మననాథుఁ, డింతయే
చాలు; రయంబునన్ దొడరి శత్రులకున్ దరిగాని త్రోవలన్
జీలిచి రాంగణాగడముఁ జేరి, భజింపుఁడు శ్రీ శివప్రభున్॥ 259

చ॥ $ ప్రతిన యొనర్చినట్టులె శివప్రభు నెమ్మదిఁ గోటఁ జేర్చి నా
బ్రతుకు కృతార్థమయ్యె; ననిఁ బాఱిన యొక్కొకరక్తబిందువున్
క్షితిఁ జరితార్థమయ్యెఁ; గడచేసిన మేను భరింపఁజాల; మీ
జత నెడఁబాయఁగా నెలవొసంగుఁడు, తెల్పుఁడు స్వామి కీనుడుల్!॥

సీ॥ 'తమయాజ్ఞ పుష్పదామమువోలెఁ దలఁదాల్చి
యరుల భంజించి వేఁటాడె' ననుఁడు,
'కడదాఁక రిపుల నొక్కండైనఁ గనుమలో
నడుగేయ నెడమీయఁ డయ్యె' ననుఁడు,
'వ్రణితాంగకంబుల వచ్చి, మీ కీవార్త
యర్పింపఁగా నోఁచఁడయ్యె' ననుఁడు,
'తమ సేవ సేయు భాగ్యములేమిదప్పు, నే
కొదలేక తుదిఁ గన్నుగూర్కె' ననుఁడు,
తే॥ 'స్వామిసేవా కృతార్థ మీ చంద్రహాస
మపయశః కశ్మలము గానిదయ్యె' ననుఁడు,
'పూలదండలోఁ దిరుగు పిపీలికయును
శివునిపద మంటె ననుచు హర్షించె, ననుఁడు!"॥ 261

---

$ Baji Prabhu expired with a sigh of satisfaction at having accomplished his task. *Rawlinson.*

చ॥ అనిమెడు పల్కు లొం డొకఁడు నంతకునంత కణంగుచున్న యె
ల్గున డిగజాఱి, నీరసతఁగూలి కరంబున వాలు జాఱఁ, దే
లిన కనుదోయి ఱెప్పకబళింతల మూఁతలువాఱ, నిట్ట ని
ల్చిన నిలువైన మేన వివశీకృతుఁడై యొఱఁగెన్ బ్రభుం డిలన్॥ 262

తే॥ అప్రతీప ప్రతాప మార్తాండమూర్తి
యస్తమించు నకాల సంధ్యాగమమున
నుభయసేనల వేఁడి నిట్టూర్పుగముల
వాడుమోముల నులివెచ్చఁ బడియెఁ బ్రకృతి॥ 263

చ॥ అలమెడు మబ్బులో మెఱుఁగులానఁగ నేర్చు శివాజిసైనికుల్
మెలఁకువ ముట్టుచున్, గడియమించినఁ గీడగునంచు, వైరు లొ
త్తిలిగొని పూజ్యమా ప్రభుని దేహము ముట్టి కలంపఁగూడ దన్
తలఁపునఁ దచ్ఛవంబుఁ గొని తత్పరులై చని రద్రులెక్కుచున్॥ 264

ఉ॥ చారులచే శివప్రభుఁడు సంగతియెల్ల నెఱుంగుచున్, బహి
ర్ద్వారము చెంతనున్న సరదారు నచేతనమూర్తిఁ జూచి, త
ద్వీర విహారముల్ విని తదీయనివేదిక చిత్తగించి, నిం
డారు సహానుభూతి యొనయన్ దనడెందము విప్పె నీగతిన్॥ 265

తే॥ "ఎంతలో నెంతలయిపోయె! నిపుడగాదె
సెలవుఁగొంటివి - మరల దర్శింపలేని
సెలవు! బాజీప్రభూ! కనుల్ సెదర మెఱసి,
మెఱుఁగులో ఱెప్పమఱుఁగులో సురిఁగిపోతె!॥ 266

తే॥ ప్రాణములు మ్రింగు మృత్యువక్త్రమున కెదిరి
నన్నుఁ దొలఁగింప బలియిచ్చినాఁడ వుసురు;
లట్టినినుఁ జేతులారఁ బోఁగొట్టికొంటి!
నెందు వెదకుదు - వెల్లువ లేచి చనఁగ! 26[illegible]

తే॥ అరులఁ దఱుము నీ వీరవిహారములను
సాహసము స్వామిభక్తి నిశ్చలత నెంచి,
నీ నివేదిక స్మరియించి నిల్వ కరుగు
మనసులో స్వప్నదృశ్య సంభ్రమము మిగిలె!॥ 268

తే॥ లేనిచో నీవు - శివరాజులేని నేఁడు
నీవు లేనల్లె శివరాజు నిలుపు విశ్వ
వీరుఁడా! చీమగానైన వెలసినట్లు
తనిసితో! యెంత నిష్కామ ధన్యతపము!॥ 269

తే॥ ధన్యమూర్తి! బాజీప్రభూ! ధన్యకీర్తి!
విలిచికొంటి వనర్ఘ జీవితముఁ బోసి
నన్నుమాత్రము గాదు - హైందవజగంబు,
నర్కమండల మధ్య సింహాసనంబు!॥ 270

తే॥ హైందవోదయ నాటకాభ్యంతరమున
రంగ మొకఁ డెక్కితివి, తెర వ్రాలె నపుడె!
భరతవాక్యము నీనోటఁ బలుకనైన
నెంత బాగుండు! నాభాగ్య మేది మాకు!॥ 271

తే॥ స్వామిభక్తితో శౌర్యాగ్ని సంస్కరించి,
రణ మహాయజ్ఞవేది స్వార్థమును వ్రేల్చి,
యవభృథమ్మున నమృతోపహార మంది,
వెలుఁగుచున్నాఁడ వో ధర్మవీర మూర్తి!॥ 272

తే॥ అదిగో! తావకాత్మజ్యోతి యంబరమున
వెలుఁగుచున్న; దీ దీప్తిమండలమునుండి
యెన్నికిరణముల్ హైందవం బెనయఁగలవొ!
యంతయును నీ వొనర్చు నేకాంతతపము!॥ 273

తే॥ పచ్చినెత్తురు కాల్వలఁ బాఱఁగట్టి
సంగరక్షోణి శౌర్యబీజములఁ జల్లి
స్వామిభక్తి పండించి విశ్వమునఁ బంచు
త్యాగధన! శాశ్వతామృతస్థాయి వగుము!”॥ 274

చ॥ అరుచు సహానుభూతి హృదయంబునఁ గన్నుల నూరనాడి, త
త్తనువున కగ్నిసంస్కృతి విధానముఁ దీర్పఁగఁ బంపె; నింతలో
వెనుకొని శత్రుసైన్యములు వేచనుదెంచెడువార్త వచ్చినన్
ఘనతర యుద్ధసన్నహన కర్కశుఁడై శివుఁ డేగెఁ గోటకున్॥ 275

ఉ॥ లేఁజని యూసునన్ బయలుదేఱిన యావనసేన లాహవో
దారత రాంగణాగడముఁ దన్నుచు నల్దెస ముట్టడించె; యు
ద్ధారభటీ పటీయసము లయ్యిరువైపున సేన లుక్కునన్
బోరెఁ బరస్పరంబు జయమున్ గొను తెంపున నంపులాడుచున్॥ 276

తే॥ † గ్రీష్మ మార్తాండ కనకన త్కిరణపూర
మీఁది, నెత్తురుఁ గండల నేటి పోరు
వారిఁ గనలేనిదయ్యెనో ప్రకృతి యనఁగ
వానకారు కార్మబ్బు లభ్రమునఁ గప్పె॥ 277

చ॥ పెళపెళ దార్భటిన్ గగనవీథిఁ బగిల్చి, తళత్తళ త్తటి
ద్జ్వలనము లార్చి, నీలితెఱ వైచి, వడిన్ జెరలాడు గాలిత్రో
వుల విడఁబాఱి, కార్మొగులు ముమ్మరమై వడగండ్లవానలన్
దళకొని, కుండపోఁతలవు ధారలతో జడివట్టె నెల్లెడన్॥ 278

ఉ॥ ఊటలువాఱె నెత్తములనుండియుఁ బేటులనుండియున్ రయో
ద్ఘాటితమైన వర్షకణికల్ గుములై, చఱులందు లోయలన్
దాఁటుచుఁ గాల్వ లేఱులయి, తోరముగా నలతెత్తి, రాంగణా
కోటను జుట్టి పాఱె, నలుఁగుల్ దెగి పర్విడు చెర్వులోయనన్॥ 279

† అప్పుడు వర్షాకాలమైనందునఁ బురుషులు కొంత [illegible]

చ। విసువనివాఁడలై పటఱుమ వెల్లువలన్ బఱచున్ గుడారముల్
నొఁకఁగులుఁనోలెఁ దేలిచనఁ, గూడునుగుస్తియు నిల్వఁపీడయున్
జెడి పిసునొత్తి యావనుల సేనలు ముట్టడి నాఁపి, రాంగణా
గడమును పీడిపోయె వడిగాఁ దమనాయకుఁ డున్న చోటికిన్॥ 230

చ। జరిగినదంతయున్ విని బిజాపురనాయకుఁ - డిట్లు చేతికిన్
దొరకి శివప్రభుండు తటితోఁ గనుఁబ్రామఁచుఁబోకరున్ మనం
బెరియఁగఁ, జేయుసన్న హనమెల్ల నిరర్థకమాటగాక చే
కురె నవమాన మంచు - మదిఁగోపము తాపము పెద్దసేయుచున్॥

ఉ। † "లంచముఁగొంచుఁ గోటబయలన్ బడఁగా శివరాజుఁ బంపె నీ
వంచకుఁ" డంచు సైన్యపతిపై ననుమానముఁ బెంచి, వారువా
రెంచక పల్కు పల్కుల నిదే నిజమంచుఁ దలంచి, వాని క
ర్పించిన సైన్యనాథపదవిన్ దొలఁగించి, స్వయమ్ముగాఁ జనెన్॥ 282

తే। † సైన్యనాయకుఁడొంచు బిజాపురీంద్రుఁ
డురక నడిమోపి యవమానపఱచె నంచు
నాలమును జేయమాని, కర్నూలుఁ జేరఁ
దిరిగి చనియె సేనాని సిద్దీజోహారు. 283

శా॥ క్ష్వేళాభీల చలచ్చమూ సహితుఁడై బీజాపురీనాయకుం
'డాలీయాదిలుషా' శివప్రభుని సైన్యవ్యూహమున్ దోలి, 'ప
న్హాళా' దుర్గముఁ బట్టి, పావనగడం బార్జించి, సహ్యాంతిక
స్థా లోత్తాల విశాల దుర్గతతిఁ గొంచున్ మించె దుర్వారుఁడై॥ 284

---

దుర్గమునకుఁ బోయిరి ...... శివాజి యొద్దనుండి లంచము పుచ్చుకొని తన సైన్యాధిపతియైన సిద్దీ జోహారుఁడే పోనిచ్చెనని యాతనికి సంశయము కలిగెను.......ఇట్లు నవాబు తను నవమానించినందున సిద్దీ జోహారుఁడు కోపగించి తన జాగీరు అయిన కర్నూలుకు వెడలిపోయెను. పుట. 115-116 క. వి. లక్ష్మణరావు.

సీ॥ ఇది యిటులుండ, నయ్యెడ శివరాజు యా
వనులు దుర్గమువీడి చనినవెనుక,
బాజీప్రభుకుమారు బాలాజిఁ దనతండ్రి
యుద్యోగమందు నియుక్తుఁ జేసి,
తక్కినసుతులకుఁ దగువృత్తిఁ గల్పించి
యా కుటుంబమునెల్ల నాదరించి,
యవనులతోడఁ బన్హాళాగడంబునఁ
బెనఁగు నేతాజీనిఁ బిలువనంపి,
తే॥ సైన్యములఁ గూర్చికొనుచు 'రాజాపురమ్ము'
పైన దండెత్తి దాని లోఁబఱచుకొనుచు,
నచటి యాంగ్లేయువర్తకు లహితపక్ష.
మునకుఁ జెందినవారుగా వినుచుఁ గినిసె॥ 285

ఉ॥ * "యావన సైన్యనాయకున కప్పటిపోరున మందు గుండ్లు నా
నావిధ సాహ్యముల్ జలిపినా" రని వారలఁబట్టి శైల కా
రావసథంబునం దునిచి, యత్యధికంబు లమూల్యముల్ తను
ర్చావచ సర్వసంపదలు చయ్యనఁ గైకొని నిల్వదోఁపుగన్॥ 286

ఉ॥ అంతటఁబోక తత్పురము నందునఁ దన్నెదిరించుచున్న శ్రీ
మంతులఁ బట్టి, వారి పెనుమందసముల్ దెఱపించి, తద్గృహా
భ్యంతరభూమిఁ ద్రవ్వి, వివిధార్థములున్ బహుళోరువస్తు ల
త్యంతము నష్ట్రదంతి శకటాదులపై నడిపించెఁ గోటకున్॥ 287

---

* The company incurred heavy losses during this invasion. Four British merchants, including the agent Henry Revington were taken prisoners .... on the allegation of having helped Sidi Johar with ammunition.

*Chapter XIII. N. S. Takakhav*

మ॥ కేరళ ముట్టి సహ్యాతట దేశములెల్ల జయించి మించి, శృం
గారపురీశుఁ దోలెఁ జెరుకావల; కే సమయంబునందె వి
స్తారబలంబుతోడ సులతాను స్వయమ్ముగ వచ్చి ప్రాంతముల్
వారక ముట్టి దుర్గములఁ బట్టుచునున్న యుదంతముల్ వినెన్॥ 288

మ॥ అటు మోగల్ బలఁగంబు లుత్తరమునం దవ్యాహతస్ఫూర్తి వ
చ్చుటయున్ వించు శివుండు రెండుబలముల్ పోరాడఁగా నెంచి, యు
ద్భట సైన్యంబులతోడ నావయిపు నేతాజీనిఁ బుత్తెంచి, తా
నిటు సుల్తాను జయింపఁగా స్వయముగా నేగెన్ బలోపేతుఁడై॥ 289

తే॥ ఘోర సంగ్రామమున బిజాపూరువిభుఁడు
శ్రీశివప్రభుఁడును దారసిల్లనుండ,
నింతలో వార్త లొకకొన్ని యేగుదెంచెఁ
గన్నడమునుండి సులతానుగారి కిట్లు॥ 290

సీ॥ "ఇచటి దుర్గాధీశు లెల్లసామంతులు
నెదిరించి, రల్లరుల్ హెచ్చె నిచట,
స్వయముగాఁ దా మిందుఁ జనుదేరవలయు, లే
దైన నరాజకం బౌ" నటంచు;
నిదివిని సులతానుఁ డిందుండలే కందుఁ
బోలేక యోజనా ముగ్ధుఁడయ్యెఁ;
నింతలో శావంతుఁ "డే జయింతు శివాజి,
నింత సాయంబిచ్చి యేగుఁ" డనియెఁ;
తే॥ నదియ తగునని కొంత సైన్యమును - సైన్య
పతులలోన బాజీఘోరపటుని - ధీరుఁ
డైన బహిలోలుఖాను సాయముగ నిచ్చి,
తరలె సులతాను కర్ణాట దండయాత్ర॥ 291

చ॥ ఘనుఁడు బిజాపురీశ్వరుఁడు కన్నడసీమకుఁ బోయినంత, నా
తనిసరదార్లు - ఘోరపటతాంత్రికుఁడుఁ బహిలోలుఖానుఁ - దు
ష్కరనఁ జనుదెంచి; రం దొకఁడు ఘోరపటుండు బలంబుఁగూర్పఁగా
నని పయనించె నుత్సుకితుఁడై నిజపత్తనమౌ ముధోళకున్॥ 292

## బాజీఘోరపటుని శివాజీ వధించుట.

శా॥ [*] షాజీ యింత యెఱింగి పుత్రున కిటుల్ జాబంపె "నీ వ్నొంపఁగా
'బాజీ ఘోరపడే' ముధోళపురముం బ్రాపించి యున్నాఁడు; దు
ర్బీజం డాతఁ డొనర్చు తత్పరిభవాభీలవ్యథల్ నేఁటికిన్
లోఁ జిచ్చై సెగలార్చుచున్న, వివి యెట్లుం సైఁపరాదయ్యెడున్!॥
తే॥ అన్యసేవా నిబద్ధుఁడనైన నాకుఁ
దీర్పరాని - దీహృదయాగ్ని యార్పరాని :
దాత్మజుఁడవైననీవె చల్లార్చ" మనుచు;
నుత్తరము నంది శివవిభుం డుక్కుమిగిలి॥ 293

చ॥ జనక పరాభవజ్వలన జర్ఝరితాంతరుఁడైన జామద
గ్న్యునివలె మండి, వైరియగు ఘోరపటుండు ముధోళపత్తనం
బున బలఁగంబుఁగూర్చుకొనుపోఁడిమినుంట యెఱింగి, సైన్యముం
గొని శివరాజు వోయె - మిడికోఅలఁ బైపడు సింగమోయనన్॥ 295

మ॥ అమితాటోపముతో ముధోళ్పురము డాయంబోయి, బాజీ నివా
సము నత్యుగ్రపుల వీరయోధ నిబిడచ్ఛన్నంబుగా ముట్టి, దు
ర్దముఁడై నిల్చె శివాజి; ఘోరపటుఁడుం ద్వైపాయనాంతః కృతో
ద్యమ దుర్యోధనుఁ డయ్యె; నంత శివుఁ డుద్యద్భీమగర్జార్భటిన్॥296

[*] "You will not fail to be courteous always to Baji Ghorpade for you know the great obligations under which he has laid me." "Baji Ghorpade has gone ahead to Mudhol with his men." He (Shivaji) grasped the real meaning of the sentence.

Page 148 & 178. *Kincaid*

తే॥ మాసిపోయుచుఁ, గజిబాకు తొడిమ మొగ్గ
పూప్రపింపె పండును రాసిఁబోసినట్లు,
లక్ష్మగించితి నాసేయు నభము శుభము;
తెలుఁగువడఁ దండ్రి! నీవ యేర్పఱచుకొనుము"॥ 344

చ॥ అనుటయు, నాదరోదవచి శాంతియుఁడై షహాజీ వచించె, "నీ
మనమునఁ జింతవాయుము కుమార! భవానియనుగ్రహంబునన్
మన కనుకూలమైనది సమస్తము; చేసెదకార్యమందుఁ జే
యనిపనియందు నీనుసమయజ్ఞత పెద్దలమెప్పుఁ గైకొనెన్। 345

ఉ॥ * నీ విటు మేల్మిఁగందువని నే మును సాధులచేత వింటి : శ్రీ
దేవి భవాని స్వప్నమునఁ దెల్పె భవద్భవితవ్య రేఖ : తా
నై వెలుఁ గొందుదాఁక నిదియంతయు నే మది గ్రుంగికొంటి ; వ
త్సా! విడిపోయె నాకొఱఁత లవ్వయవర్ధను నిన్నుఁ గాంచుటన్॥ 346

ఉ॥ మతమున్ దేశము గో మహీసురుల నోమన్ వాలు గేలంది భా
రతకల్యాణము నుద్ధరింపుచు, మహారాష్ట్రప్రభుత్వంబు శా.
శ్వతమై వెల్గఁ బునాది వేసితివి: వత్సా! నీ మహామాత్స్యహ సం
భృతమై భోన్సలరాజ కీర్తిరమ పర్వెన్ బార్వణజ్యోత్స్నలన్॥ 347

తే॥ ఆలముకొను పండువెన్నెల యందు నణఁగు
మచ్చవలె నాదుచెఱసాల మాసిపోయెఁ,
కలువలు చకోరకములై జగంబు తనిసెఁ,
దనయ! నాడెంద ముదధియై తరఁగలించె"॥ 348

చ॥ అను షహజీనుడు ల్విని మహాముదమంది, శివప్రభుండు త
మ్ముని బినతల్లినిన్ బ్రణయపూర్వకభంగి బహూకరించి, యొ
య్యనఁ దనతండ్రియాజ్ఞఁ గొని యప్పుడ పైనముదీర్చి, తూర్యని
స్వనములు పెచ్చుప్రెమాయఁ బరివారములన్ నడిపించెఁ గోటకున్।

* Please see foot-notes in page 33.

తే॥ పాదచారియై జనకునిపాదుకలను
శిరముపైఁ బెట్టి పల్లకి చేతఁబట్టి,
శ్రీశివాజీప్రభుండు తండ్రివెనువెంట
సంగరక్షకుఁడై త్రోవ ననుగమించె॥ 350

తే॥ బహుళ మంగళతూర్యారావములు మొఱయ
సాంద్ర సమ్మోద వైభవోపేంద్రుఁ డగుచు,
ఘనుఁడు షాజీవిభుఁడు రాజగడమునందు
రాజభవనముఁ జేరి విశ్రాంతుఁడయ్యె॥ 351

మ॥ ప్రణయస్వాదు రహస్తపఃఫల పరీపాకంబు సాక్షాత్కరిం
చినయట్లై చనుదెంచియున్న దయితున్ సేవించి పూజించి మిం
చినతృప్తిం గని జీజియాసతి; శివాజీరాజు దేవోపచా
ర నిరూఢిన్ దలిదండ్రులన్ గొలిచెఁ బుత్రత్వంబు ధన్యంబుగన్॥ 352

శా॥ తా నార్జించిన రాజ్యముల్ ధనము లుద్యద్దుర్గవర్గంబులున్
దానాజీముఖ వీరయోధగణముల్ దండోపతండంబులౌ
సేనావారము లాయుధోపకరణశ్రీ సర్వమున్ జూపి య
త్యానందం బొదఁగూర్చెఁ దండ్రికి శివుం డాయా ప్రదేశంబులన్॥

సీ॥ ఇది రాజగడము - దుర్భిదవప్ర సూత్నని
ర్మాణ రమ్యము, నేఁటిరాజధాని;
యిది తోరణాదుర్గ - మిందు. జాతీయోద్య
మారంభమున నసంఖ్య ధన మబ్బె;
నిది ప్రతాపగడంబు - మదమత్తుఁ డబ్జులు
ఖాను గోరాడు రంగస్థలంబు;
ఖానునితలఁ బాఁద్రొచ్చి కట్టినబురుజిది;
కులదేవత భవాని కోవెల యిది;

మ॥ అని తీండ్రించుమఁ దండ్రి యుత్తరము సద్యస్స్మిత కోపాగ్ని కిం
ధనమై కేఁపఁగ వాలుదూసి పగతున్ దట్టించె, నా యిర్వురున్
ఘనకోపారుణ రేఖ మోమున వెలుంగన్ దార హుంకార ని
స్వనముల్ మీఱ నియుద్ధకౌశలము దోఁపన్ బోరి రత్యుగ్రులై॥ 308

ఉ॥ సాముస సానదేఱి, జవసత్త్వములన్ దిటవాఱి, ఖడ్గసం
గ్రామములందుఁ జేర్పడిన గండరగండఁడు శ్రీ శివప్రభుం
డామున శత్రు లేయు వివిధాయుధముల్ కరలాఘవక్రమో
ద్దామత వమ్ముసేసి జెడిదంబుగఁ బైకొని నొవ్వనేయుచున్॥ 309

ఉ॥ పొంచి పరాక్రమించి, మొడుపుం జెడుపుం బొడుపుం జెలంగఁ దూ
లించి, మొకంటఁజూపి యవలీల మఱొక్కటఁ గ్రుమ్మి వైచి, యా
కుంచిత సత్త్వుఁడై సొలయు ఘోరపటున్ - బులి జింకఁబోలె - నా
డించి, తదీయ బాహువు వడిన్ నఱకెన్ శివుఁడక్కసించుచున్॥ 310

ఉ॥ విస్ఫురిత విక్రమక్రముఁడు వీరవరుం డతఁ డొంటిచేతి భూ
రిశ్రీపుఁడయ్యు డయ్యు కెదిరించుచు, దాపలి కేలి వాలుతో
నశ్రమఘాటిఁ బైపడె; దురాగ్రహుఁడై శివరాజు శాతఖ
డ్గాశ్రిఁ దదీయమస్తకము నంబరవీథికిఁ జిమ్మి నార్చుచున్॥ 311

ఉ॥ చుట్టునుముట్టి రాబలియు చుట్టములున్ వెలు లంగరక్షకుల్
చిట్టుగ; హుంకరించి శివవీరచమూపతు లేచి వారి ని
ట్టట్టు తొలంగనీక నులియన్ గలియన్ బడఁ జావమోఁది; రా
పట్టున నిల్చె శాత్రవ కబంధశతంబులు పర్వఁజాలమిన్॥ 312

చ॥ అని బయలయ్యె, నయ్యె విజయుం; బటుపై నొగి వానిజాగియల్
ధనములనెల్లఁ గైకొనుచుఁ, దండ్రియభీష్టముఁ బూర్తి చేసి, చే
సినపని తండ్రికిన్ [illegible] నవ్వాడ యాత్మభృత్యులన్
బనుపుచు, శ్రీశివప్రభుఁడు వచ్చె విశాలగఢంబుఁ జేరఁగన్॥ 313

### వాడీ జింజిరా విజయము - సముద్రాధిపత్యము.

సీ॥ బలవంతుఁడా ఘోరపటుఁ డిట్లు తెగిపోవు
టను విని సులతాను వనటఁ గూరి,
ఘనుఁడు 'కావఖానుఁ' డనువానిఁ బంపె; వాఁ
డును జహిలోఖానుఁడును గడంగి,
పెనుదుర్గములు గొన్ని గొనిరి సహ్యాద్ర్యుపాంత
ధరణిలో నందందుఁ బారసిలుచు;
నంతఁ గర్ణాటమం దాలము భరమూచు
సులతాను వారలఁ బిలిచికొనియె;
తే॥ నిటు నవాబు శివాజిపై కెత్తినట్టి
మొగ్గరంబుల నొక్కండు ముగిసిపోయె;
మఱియొకంట బాజీఘసల్కరుఁ డనంగ
శివునిదళవాయి ఖావంతుఁ జేరిపొదవె॥ 314

ఉ॥ పంతము లుల్లసిల్ల బలవంతులు వారు - ఘసల్కరుండు ఖా
వంతుఁడుఁ - బోరి; రెండు నిరువైపు జయంబు లుయేలలూగుచున్
వంతులువాఱె; నొక్కపరి పైకొని దూఁకి ఘసల్కరుండు ఖా
వంతునిఁ ద్రోల, నడ్డుపడె వానిసహోదరుఁ డుగ్రమూర్తియై॥ 315

చ॥ బిరుసుగఁ దాఁకి వారు కసిఁబెంచి పెనంగుచు, ద్వంద్వయుద్ధని
ష్ఠురులయి, కుప్పిమ్ముచున్ దెరలుచున్ దెరలించుచు, నిర్వురున్ బర
స్పర శరవాలఘాత వినిపాతితులై ధరఁ గూలి; రీవిధం
బెఱిఁగి శివప్రభుం డచటికేగి యరాతుల నొంచె నేపునన్॥ 316

తే॥ ఒంటి నిలిచియు ఖావంతుఁ డోపినంత
పెనఁగె - శృంగారపురనాథు వెంటఁగొనుచు;
శివవిభుని సేవ యువ్వారిఁ జదిమి తఱుము
శరణుసొచ్చిరి పోర్చుగీసువారలు [illegible] 317

ఉ॥ ఇంతకుమున్నె శ్రీశివమహీపతి వారికి వార్తఁబంపె "శా
వంతుఁడఁ జేరఁడీయునెడ వైరము మీకును మాకుఁ గల్గు" నం;
చంతటఁ బోర్చుగీసువారలా నృపులన్ దమసీమఁ బాపి; కీ
వంతుల వారు పెక్కునరపాలుర సాయముఁ గోరి రాస్తులై॥ 318

ఉ॥ వ్రేసిన రాముబాణమున వీఁగి జగత్త్రయిఁ బర్వులెత్తు కా
కాసురునట్లు వారు జగమంతయుఁ గుమ్మరి, దాఁపులేక సం
త్రాసము నొంది కుంది శివరాజుపదద్వయి ముట్టి భక్తివి
న్యాసముఁ జూపి; రాతఁడు దయామయుఁడై శరణం బొసంగుచున్

సీ॥ ఎవరిరాజ్యము వారికిచ్చి, యవ్వారిరా
బడిలో సగంబు కప్పమిడునట్లు,
మూఁడువేల తురంగముల సేనతో యుద్ధ
ములఁ దోడుపడి తన్నుఁ గొలుచునట్లు
సలిపి, తద్రాజ్యమందలి 'రాయరీ' 'మాల
వణ' దుర్గముల భద్రపఱచి, యందు
స్వబలంబులను నిల్పి, 'ప్రబలకాయులు' నాఁగ
నచటియోధుల స్వసైన్యమునఁ జేర్చె;

తే॥ నిటుల రెండవముట్టడి యే పడంచి,
జింజిరాధిపు యవను భంజింపఁ జనిన
బలియు రఘునాథుఁ నరయఁగా బలమునడిపెఁ
జరమ సింధూర్మి శిశిర భూస్థలుల శివుఁడు॥ 320

చ॥ అట రఘునాథుఁ గేచి యవనాధిపుసేనలఁ దాఁకె; సంద్రపుం
దటమున కెక్కుకుండఁ జలుదారులఁ దూలఁగఁదోలె; వారి హృ
త్పుటమగు 'దండరాజపురి' దుర్గముఁ గైకొనె; నిట్లు నొంచుటన్
దిటవఱి వాఁడు నిల్చె బుధకీర్తిఁగల జింజిరదుర్గమందునన్॥ 321

సీ॥ † ఇంతలో శివపతి యేతెంచి, దాఁగిన
యరుల నేమఱఁగూడ దని తలంచి,
పెనుపిరంగుల గుఱివెట్టి యొడ్డుననుండి
(1) జింజిరాపై నుక్కుఁజిచ్చుఁ గురిసె;
నద్దాని కులికి, సాయము లేమిఁ దలఁచి, ప
త్తేఖానుఁ డపుడ సంధిని ఘటించెఁ;
దనకులోఁబడి సముద్రముఁ దాఁటిరాకుండు
నటుసల్పి, శ్రీశివుం డతని విడిచె;
తే॥ నబ్ధిపైఁగూడ నధికార మాక్రమింపఁ
బంచశత యుద్ధనౌకలఁ బదిలపఱచి,
'స్వర్ణదుర్గ' 'విజయదుర్గ' సంజ్ఞ లొప్పు
నోడరేవుల రెంటి నయ్యుదధిఁ గట్టె॥ 322

శా॥ † పారావారతటంబునందలి 'కొలాబా' ముఖ్యమౌ రేవుగా
శూరుల్ సైనికులైదువేలెపుడు నచ్చో నుండఁగాఁజేసి, నౌ
కారంభంబును దీర్ప నాయకుని (2) 'దర్యాసాగరున్' జేసి, (3) 'బం
డారీమైనకు' తోడుగా నడిపె నోడల్ వార్ధి నల్దెసలన్॥ 323

చ॥ * జలనిధిపై స్వతంత్రముగ సాగుచు, నన్యుల నాఁగుచున్, నిర
ర్గళుఁడగు శ్రీశివున్ బ్రబలరాజునుగాఁ దలమోసి, పోర్చుగీ
సులు నబిసీనియావ్వయులు సుంకము వెట్టుచు మందు గుండ్లు కా
వలయుపిరంగు లిచ్చునటు పల్కుచు సంధి ఘటించి రత్తఱిన్॥ 324

---

† Shivaji first organized his fleet and made himself master of all the Konkan sea-forts. *M. G. Ranade.*

* The Portuguese agreed to furnish every year to Shivaji a certain amount of guns and ammunition and other war material. Page 215, *N. S. Takakhav.*

(1) Maritime Fortress (2) Sea Captain (3) Water Leader.

చ॥ ఇటు సులతానుమువ్వయిపుశెత్తుల లోఁగొని, యుత్తరంబునన్
బటుతరధాటితో మొగలుపాదుషహాబలఁగంబు లెత్తివ
చ్చుట విని, తద్విజృంభణముఁ జూఁజఁగొనన్ శివరాజు సాహసో
ద్భట భటరాజితోఁ జనియె వైరమ రాజగడంబుఁ జేరఁగన్॥ 325

బిజాపూరునవాబు సంధికై పాజెనిఁ బంపుట.

సీ॥ ఇంతలో బీజాపురీశుఁడు కర్ణాట
కమునుండి తనపట్టణమును జేరి -
బలియుఁడై శివరాజు పలుమర్గభూము లా
త్మీయసీమల నాక్రమించుటయును,
ఘోరపడేఁ ద్రుంచి, పీరు శృంగారపు
రాధీశు శావంతు నణఁచుటయును,
నంబుధీశ్వరులైన యబిసీనియా పోర్చు
గీసు నాయకులను గెల్చుటయును,
తే॥ అందఱు విధేయులౌచుఁ దన్ననుసరింప
బహుళ గిరి వన భూ జల ప్రభుత మెఱసి
యసమవిక్రాంతిఁ గొనుటయు - నరసి, యలసి
యున్న స్వబలంబుఁ దలఁచి యిట్లుమ్మలించె॥ 326

ఉ॥ “కానిమహాప్రయత్నమిది; గంతులువేయుచు దేశమెల్ల స్వా
ధీనముఁ జేసికొంచుఁ, గడుఁదెంపరియై శివరాజు మించె; దు
ర్మానము వీడలేకతని మార్కొన లాభము దోఁప; దింతకున్
న్యూనముగానియట్లు మనయున్నతి నిల్పుట నేఁటి కొప్పగున్॥ 327

ఉ॥ అల్లరిసేయువాఁడో యధికాధికుఁడో యననేల, ప్రక్కలో
బల్లెము వీఁడు; వీనిఁ దెగఁబట్టిన లాభము గల్గదోర్మి సం
ధిల్లక; సంధికైనఁ దెగఁదీయునుగా కన్యులుఁడౌనె! యీ
యొల్లని పొత్తుమాట పరిపొత్తఁగ నేఁటి కెవండు చాలెడిన్!॥ 328

చ॥ నయమున మాటనేర్పరితనంబున దుర్ఘట కార్యసిద్ధి ని
శ్చయమున గెంటరాని భుజసారమునన్ దొరయూలెగాక, ప్ర
త్యయమున వానికిన్ గురుపదంబగునాతఁడ నేఁటిసంధి కా
శ్రయమగు; † నట్టివాఁడు బలశాలి షహాజి యొకండె కన్పడున్"॥

తే॥ † అనుచుఁ దలపోసి సులతానుఁ డా షహాజి
నపుడ పిలిపించి యలరించి యనియె నిట్లు,
"షాహాజీరాజ! తొంటి విశ్వాసబలము
దిరముకొలుపుచు, మామేలు నరయు మిపుడు॥ 330

తే॥ శివపతికి మాకుఁ బోరయ్యెఁ; జేరఁదీసి
తగవుగఱప కన్యులరీతిఁ దలఁగు టురవె?.
యాతఁడు సుతుండు – మేము మీ కాశ్రయులము,
రెండుకన్నుల మేలు సారింపవలదె? 331

ఉ॥ సంధిఘటింపు మిర్వురకు సమ్మతిగా; నిటుసల్పు మంచు ని
ర్బంధము లేదు, నీ వుభయపక్షహితుండవు; రాజ్యలోభ పా
శాంధముఁడైన వీరుఁ డతనిన్ దనియింపుము మేలుచేత; ప్రా
ద్బంధులువోలె మేము విడఁబాయనిచెల్మి మనంగఁ జూడుమీ!"॥

చ॥ అన షహాజీవిభుం డనియె, "నంతయు మీరు వచించినట్లు వం
చనవిడి యిందు నే సలుపఁజాలిన దోడక నిర్వహింతు; § నై
న నతఁడు తొల్లి నావనుపునన్ జనలేదనుమాట మీ యెఱుం
గనియది గాదు; గాని తమకై వెనుదీయక పోయివచ్చెదన్"॥ 333

† "A convenient mediator was at hand in Shahji." "The good offices of Shahji were again utilized by them (Bijapur Government.) *P. 174 Kincaid & P. 100 Ranade.*

§ "నాకుమారుఁడు నేను చెప్పినట్లు వినఁడని సంగతి మీకు దెలిసినదే. అయినను వాని బోధచేసి చూచెద" నని చెప్పి శివాజీనిఁ గూడ (పూనా) పంపెను.

సీ॥ అచటయు సులతానుఁ, "దగుఁగాక పోయిర"
మ్మని సంధిలోఁ దనయాంతుఁ దెలిపి,
ప్రత్యేకముగ నిర్వురకుఁ గానుకలువెట్టి
సత్కారములనిచ్చి సాగనంపెఁ;
దనయునిఁజూడఁగాఁ దగునవకాశ మి
ట్లొడఁగూడ షాహజీ యుత్సహించి,
యతివ తుకాబాయి, సుతుఁడు వెంకోజియుఁ
దనవెంటఁ బయనింప ననుమతించి,
తే॥ తాను జనుదెంచుచున్న వృత్తాంతమెల్లఁ
దెలియ శివరాజునకు వేగరులను బంపి,
యొక్క శుభముహూర్తమున మహోత్సవమున
ననుచరులఁ గూడి షాజీ ప్రయాణమయ్యె॥ 334

మ॥ బలముల్ వెంబడిరా షహాజి 'తులజం' బ్రాపించి, యాక్షేత్రమం
దిలువేల్పైన భవాని మ్రొక్కి, యటుపై నేతెంచుచున్ బావన
స్థలమౌ 'సింగనపూరు' నందు హరు విశ్వత్రాత సేవించి, య
ర్మిలి 'శ్రీపండరి' నాయకున్ గొలిచి చేరెన్ 'జేజురీ' గ్రామమున్॥

షాజీ శివాజీల పునస్సమాగమము.

ఉ॥ అంతకుమున్న శ్రీశివమహాప్రభుఁడున్ జనకుండువచ్చు వృ
త్తాంత మెఱింగి, పట్టణము సర్వవిధిన్ గయిసేయఁబంపి, సా
మంత హితానుయాయి జనమండలితో బహు తూర్యరాజితో
దంతుర రాజవైభవ వితానముతో షహజీ నెదుర్కొనెన్॥ 336
తే॥ మూఁడుకోసులదూరంబు ముందు కరిగి,
జేజురీ దేవతాలయ సీమయందు
విడియుతండ్రినిగని, భక్తి వినతఫాల
ఫలితపాణియై తత్పదాబ్జముల వ్రాలె॥ 337

మ॥ చరణద్వంద్వము నంటియున్న తనయుం బాజీవిభుం డెత్తి, ని
ర్భర సమ్మోద నిరూఢ గాఢ పులక ప్రత్యగ్ర వక్షస్స్థలం
బౌరయం గౌఁగిటఁజేర్చి, నేత్రయుగ నిష్ఠ్యూతాశ్రు ముక్తావళీ
పరితస్స్విన్న శిరంబు మూర్కొని రసాద్వైతస్థితిం గైకొనెన్॥ 338

చ॥ పరవశతా శ్లథంబయిన బాహుయుగంబునఁ బాసి, భక్తబం
ధురుఁడు శివప్రభుండు కరతోయజముల్ శిరమందుఁ జేర్చి, త
చ్చరణసమీపభూమిఁ దనజానుయుగంబున మోఁకరించి, వా
తెఱ డిగజాఱు లోనితరితీపున నిట్లనె ధన్యవాదముల్॥ 339

మ॥ "జనకా! నేటికి ధన్యతం గనియె నాజన్మంబు; నే ముందుఁ జే
సిన దోసంబులు దూలిపోయె; భవదాశీఃప్రాప్తి రాఁబోవు మే
లునకుం బాత్రమనైతిఁ; దండ్రియెదఁ గల్లోలించు నిర్వ్యాజపు
న్ననరుం దేనియలోని క్రొంజవులఁ గంటిం గొంటి నిన్నాళ్లకున్॥ 340

చ॥ తెలియమి ముష్కప్రాయమునఁ దెంపొనరించితిఁ గొంత; దాన మీ
కలయిక లేకపోదని జగం బనుమానముసూపె; నీ నవా
బు లిది నిజంబుగాఁ దలఁచి పూజ్యుల మిమ్ముఁ బరాభవించి; రిం
తలు దలపోసియుం నెనరుదప్పమి దైవముగూడ నేర్చెనే!॥ 341

మ॥ ఘన సంగ్రామ కిరీటినై పటువిపక్షవ్రాతముం దోలి, పం
బిన విఖ్యాతినిఁ గొన్నవీరుఁడవు, నీ పెంపేద నావంటి పు
త్రుఁడవశ్యై యల్పులచేతఁజిక్కి చెఱయందుం గ్రాఁగితే! వేఁగితే!
నిను దాయల్ దెరలింప, నే మునియుఁ దండ్రీ! లేనియట్లయ్యెనే!॥

మ॥ ఒకదుర్వ్యూహముఁ జీల్చుచున్న వక్షిమున్యం ధుగ్రుఁడై సింహళా
బకమై ప్రాణము కోడువెట్టి విమతవ్రాతంబుఁ జెండాడె; వా
నికి నా కొక్కఁడి సాటి! యేమనుచుఁ దండ్రీ! నిన్ను దర్శింతు! నా
దు కృతఘ్నత్వము సైఁచి [illegible] చో టీయవే!॥

శా॥ "ఓయీ! ద్రోహపరాయణా! కుటిల మాయోపాయ సజ్జీవ మీ
యాయుక్షేమము నేల పెంచెదవు? దాయల్ ద్వారముల్ దాఁకి 'ర
మ్మా యుద్ధమ్మున' కన్న, వీరవరుఁ డిస్సీ! తల్పు బంధించునే?
నాయందర్ బడి యొంటఁబోయెదవు, కృతఘ్నా! మిత్రి కన్యాయుచున్॥

ఉ॥ § 'ఘోరపడే' కులోద్భవులకున్ మఱిఁబూనెడు సందన్నై, గృహ
ద్వారము మూసితే? యెఱుఁగవా తొలి నీకులవృద్ధుఁ డేపునన్
బోరుచుఁ, ద్రాడుగట్టి యుడుమున్ విడి కోటకుఁ బ్రాఁకి గెల్చుచున్
'ఘోరపడే' ప్రతిష్ఠ గయికొంట? తదన్వయుఁ డిట్లొనర్చునే?॥ 298

ఉ॥ జేనెఁడు పొట్టకై పరులసేవ గడించెడు కూటికై పరా
ధీనుఁడవై, స్వజాతి మత దేశ మహత్త్వము మంటఁగల్పియున్
మానక, మాపయిన్ దురభిమానముతోఁ దలమీఱి వచ్చినా
వో? నెఱబంటవై నిలువు, మొక్కట్రుటన్ నినుఁజక్కఁబెట్టెదన్॥ 299

ఉ॥ వింధ్యకుఁ బిల్చి యొంటితఱివేచి మహామహు షాహజీనృపున్
బందిగొనన్ దెగించు కులపాంసన! పందెమువైచి తత్ఫలం
బందఁగఁజేతు - నీ బలఁగమంతయుఁ దోడుగ లేచిరమ్ము; నాఁ
డందని వింధ్యకై సమయమారసి వచ్చితిఁ దక్కమారుఁడన్॥ 300

ఉ॥ అన్న కసాయముల్ జలుపు నబ్బులుఖాను కసాయిగుండియల్
గొన్న కటారు తండ్రిఁ జెఱఁగొన్న నిమన్ బలిగోరి కేలఁ బై
కొన్నది; మిత్త్రియున్ నిరయకుండకవాటము దీసి మ్రింగఁగా
నున్నది నోరువిచ్చి; శివుఁ డూరక నిన్నిఁక జాఱనిచ్చునే?॥ 301

---

§ The Ghorepurays were originally named Bhonslay, and their ancestor acquired the present surname........during the Bhamini dynasty from having been the first to scale a fort in the Concan .... by fastening a cord round the body of a ghorepur or guana.

**Page 67.** ***James Grant Duff.***

తే॥ పండి కోఁతలకెదిగె నీపాపఫలము :
చావు తప్పదు నీ వెట్లుచనఁగనున్న :
బ్రతుకుతువ్వినైన నొక మహారాష్ట్రవీరుఁ
డనఁగ మెలఁగుము; తెరఁబాసి మొనకురమ్ము॥ 302

తే॥ గడు వొసంగితి నీ కొక్కగడియకాల,
మింతలోఁ దెంపుగొంట యెంతేని లెస్స :
కానిచో దొమ్మిదూఁకి, నీగర్భగృహము
దెఱచి వేఁటాడి మృత్యుమందిరముఁ జేర్తు"॥ 303

చ॥ అనుటయు, వ్రేటుగొన్న పులివై భుజగేంద్రుఁడునై కృపాణికన్
గొని, ఘనరోష విహ్వలుఁడు ఘోరపటుండు కవాటభేదనం
బున శివరాజుపై దుమికెఁ; బొంచిన తద్భటులెల్లఁ బెల్లుపై
కొని; రుభయానుయోధులకు ఘూర్ణిత సంగరమయ్యె నయ్యెడన్॥

మ॥ తత హుంకారముతోఁ గటారుగొనుచున్ దానాజి లంఘించి, యు
ద్ధతుఁడై ఘోరపడే నెదుర్కొని నిశాత స్ఫీత కౌక్షేయ వి
క్షతగాత్రుం బొనరించె; నాతఁడును ఖడ్గ క్షేపణాటోప సం
గతిఁ దానాజికటారు కేడెముల వ్రక్కల్ సేసె నొక్కుమ్మడిన్॥ 305

ఉ॥ అంతట గండురేఁగి సెగలార్చుచుఁ దానజితుండు గాటపుం
గుంతము నెత్తి మిత్తివలె ఘోరపటున్ బొలియింప దూఁకె; దు
ర్దాంతుని వానిఁ జూచి శివరా జనె "శూరుఁడ! నిల్వుమింక; నా
వంతుకు వచ్చువానిఁ దెగవైచెద, వియ్యది వీరధర్మమే?॥ 306

ఉ॥ పాపము! నాదుతండ్రిఁ జెఱఁబట్టుచు ఘోరతపం బొనర్చి, మ
తోత్కపవిధూత ఖడ్గమునకున్ దలయొడ్డఁగ నెంచినాఁడు - రం
భా పరిరంభణార్థ మిటు వైసితొలంగెనొ! వీనికోర్కి దు
ష్ప్రాపము నాక తీర్చెద, మఱల్పని నీయడుగట్టె నిల్వుమా!"॥ 307

తే. ఇదియె 'రాయగి', 'పన్హాళ' యిది యటంచు
వేఱువేఱుగా నవ్వాని వివరములను
విన్నవింపుచు, నందందు విందుగొలిపి,
శివవిభుఁడు తండ్రితోడ వచించె నిట్లు. 354

చ. "జరిగినదంతయుఁ దమ ప్రసాదము; నేఁటికి సాటివారు మీ
చరణము లంటుచుఁ గొలువసాగిరి, లోఁగిరి వైరు; లిట్లు ని
ర్భరముగుచున్న రాజ్యవిభవంబుల కెల్లఁ బ్రభుండవౌచు; నీ
జనుఁడ సహర్గణంబులఁ బ్రశాంతముగాఁ గడపఁ దలంపుమీ!॥ 355

తే. చరణదాసుఁడ నౌచు, మీ సలుపునాజ్ఞ
శిరమున వహించి, సకలసంసిద్ధి మెఱయ
యుభయలోకసమృద్ధిఁ బెంపొందఁ గాంచు"
ననిన, షహాజీవిభుండు తా ననియె నిట్లు॥ 356

చే. "అవును, కుమార! నీ వనినదంతయు నిక్కము; నేనుగూడ ని
ట్లవగత శాంతి నిశ్చలుఁడనై మనసెంచెద: నైన నొక్క లా
ఘవ మగునంచుఁ దోఁచు; నను గైకొన కోపవటంచు నిన్ను, నిఁ
దవులక నిల్వలేననుచు నన్ను జగం బొకలేఁత సూడదే?॥ 357

ఉ. ఉండినయట్లు యిర్వురము నొండొకచోటున వేఱువేఱుగా
నుండి, స్వతంత్రరీతిఁ జనుచుందము; నే నటు కన్నడంబునం
దుండుటకూడ నొక్కగతి యుక్తము లాభమటంచు నెంతు; నెం
దుండిననేమి, నీవు తనయుండవు నే జనకుండఁ గామెకో!॥ 358

ఉ. కావున భేదబుద్ధి గనఁగాఁబనిలే, దది యుండనిమ్ము; నా
కీవటి కింత యాశ్రయము నిచ్చినవాఁడు బిజాపురీంద్రుఁ: డా
యావన నేతపై సమరమాఁగుము నే మనియుండుదాఁక; స
ద్భావముఁ జూపు నాపలుకుపై, నుపకారి బిజాపురీంద్రుపై! 359

చ॥ సమయము గుర్తెఱింగి గుణశాలి యతండె వరించె నీసహా
యము, నను సంధికై పనిచె; నాతనితో నియమంబులెల్ల న
ర్హామనఁగ సంప్రతించితిఁ; గొఱంతలు తోఁచినఁ దోఁచుఁగాక, నా
దు మతము నీ వొడంబడుము; డొడ్డతనంబునఁ జెల్మిసేయుమీ!॥ 360

$ సీ॥ ఈవు గెల్చిన రాజ్యమెల్లఁ బర్వతమర్గ
విశతంబుగా నీకె విడుచునట్లు,
వరుసఁ 'గల్యాణి' 'గోవా' 'కొలాపురి' మధ్య
నిను స్వతంత్రునిగ మన్నించునట్లు,
లల బిజాపురికొల్వునందు నీప్రతినిధి
నుంచి, వా రతని భరించునట్లు,
ఏడులక్షల 'హొను' లేటేటఁ గప్ప మ
ర్పించి, నీసాయ మార్జించునట్లు,
తే॥ లెవరిరాజ్యము వారుగా నేలికొనుచుఁ
బనివడిన నొండొరులకుఁ దోడ్పడెడునట్లు
సంతరించితి సంధి: యిష్టపడు మింత;
యధికుఁ డిటు లొంగివచ్చు టత్యంతహితము॥ 361

$ Being discomfited on all sides the Bijapur Government sued for peace. The chief conditions were:—

(1) that the conquests hitherto made by Shivaji should be allowed to remain in his hands and the Adil Shahi Durbar should make no further attempt at their recovery. (2) The Durbar was to recognise Shivaji as an independent sovereign cede him certain defined districts and stipulate to pay him an annual tribute of 7 lakhs of hons. (3) There was to be a defensive alliance between the two powers, and Shivaji's ambassador Shamji Naik Pande was permitted to reside at Bijapur and represent him at the Adil Shahi Durbor.

*Chapter XIII.—N. S. Takakhav*

ఉ॥ ఈ నియమంబులెల్ల లిఖియింపఁగఁజేసి నవాబుముద్రతో
మూకక నీకుఁ బుత్తు, ననుమానములేల; ఇఁక రాజధాని కా
స్థానము 'రాయగీగడము' సల్పుము; తక్కిన రాజకార్య సం
ధానము జాగరూకత నొనర్పుము; నేనిఁకఁ బోయివచ్చెదన్"॥ 362

చ॥ అనుచు హితానులాపముల నాడి, కుమారకుపజ్జ నిల్వఁ పం
డిన లతవోలె నెమ్మొగమునిండిన తన్పునఁ బొల్చు జీజియాఁ
గని, నిబిడాదరోదర నఖంపచ లోచనరోచి రూర్మికల్
ముసుకొనుచూడ్కి డెందమునుముట్టి, షహాజి వచించె నీగతిన్॥ 363

ఉ॥ "ధన్యవు! జీజియా! యవితథంబుగ భారత వీరమాతృ మూ
ర్ధన్యవు; నీ యుదారచరితంబున భోన్సలవంశకీర్తి స
మ్మాన్యతఁ గాంచె; నీచనినమార్గము భారత భాగ్యసాధనా
ధన్యులు తల్లులెల్లె నడువన్ దగి మించు పరిమళించెడున్॥ 364

సీ॥ తనయవాత్సల్యంబు ధవుప్రేమ దేశభ
క్తియుఁ దూఁచి, సమత సాధించినావు,
వానిలో నొక్కఁడైన వాడిపోవనియట్లు
లెవిగించి, దోహద మిచ్చినావు,
దవకీలవోలె పెన్దవులునాపద లాఁపు
వెరవుమై దేహ మర్పించినావు,
కోఱవోవకుండ రూపఱివోవకుండ న
న్నిట నిండుఫలము పండించినావు,
తే॥ మనసు మాట చేఁతయుఁ దొనంకనివిధానఁ
గఠినదీక్షఁ దపస్సిద్ధిఁ గాంచినావు,
నిజము! జీజియా! భరతోర్వి నీదుసేవ
కప్పువడినది సకలభాగ్యములలోన॥ 365

తే॥ వీరపత్నివై నెఱపిన విందుకంటె
వీరమాతవై హృదయంబు విలిచికొంటె,
పతివ! యర్ధాంగివేమి పూర్ణాంగివౌచుఁ
బెంచితివి కల్పతరువు నీపెరటియందె!॥ 366

తే॥ నేను గన్నడంబునఁబోలె నీవు శివుని
యండ నుండుట విధినిర్ణయముగఁ దలఁతు;
నిది యవశ్యము, సూచితాభ్యుదయ మగుట
ననుసరింతము శాశ్వతాధ్యయనదీక్ష"॥ 367

చ॥ అనుటయు, జీజియా విభునియాజ్ఞ కనువ్రతయౌచు నిల్చి, వి
చ్చినహృదయంబు నిండి వికసించినకన్నులఁ దేలు సంతసం
బునఁ దనసమ్మతిన్ దెలిపెఁ; బుత్రు సతీమణి నుగ్గడించి దీ
వనలిడియున్ షహాజి పరివారముతోఁ బయనించె వీటికిన్॥

తే. తండ్రికిని దమ్మునకుఁ బినతల్లిగారి
కర్హ భూషాంబరాదుల నప్పగించి,
యల్లె సులతానునకుఁగూడ నందఁజేసి
జనకుని శివప్రభుఁడు పేర్మి సాగనంపె॥ 369

ఉ॥ అంత బిజాపురంబున షహాజివిభుండు నవాబుగారితో
మంతనమాడి, సంధినియమంబుల సమ్మతిగొల్పి, వానిఁ బ
త్రాంతర రాజముద్ర ధ్రువమౌనటు సల్పి శివాజికంపుచున్
సంతసమందితాఁ జనియెఁ జయ్యనఁ గన్నడసీమఁ జేరఁగన్॥ 370

తే॥ తండ్రి దయసేయుట - నవాబు తనకుఁదానె
సంధిగోరుట - మిగుల నుత్సాహపఱుప,
శివమహీపతి రాజ్యవిస్తృతికిఁ దగిన
పెం పెనయ రాజధాని నిర్మింపఁదలఁచె॥ 371

ఉ॥ † అప్పటి రాజ్యభాగముల కన్నిటికిన్ నడిబోటునుండి, పై
కుప్పరమంటు శైలశిఖరోపరిపీఠిక రాయగిడం
బొప్పటఁ, దండ్రిగారు మనసొప్పి వచించుట నెంచి శ్రీశివుం
డప్పుడ రాజధాని కనువౌనటు దాని రచించె నేర్పునన్॥ 372

సీ॥ ‡ నలువైపుఁ గోటయోఁదల నెక్కరానియే
పున నిల్వుచెక్కించి నునుపు గొలిపి,
"వెలినుండి కోటలోపలి కెవ్వఁ డెక్కివ
చ్చిన గొప్పబహుమాన" మనుచుఁ జాటి,
యొకఁడుమాత్రము రాఁగ నోగి వానిమెచ్చి, యా
తఁడువచ్చు దారి భద్రముగ నలిపి,
రాజ్యాంగభవనముల్ రాచనగళ్ళు అ
చ్చలు రాచబాటలు వెలయఁజేసి,
తే॥ 'రాయగడ' మనుపేరున రాజధాని
నలిపి, రాజ్యాంగవిభవ మచ్చటను గొలిపి,
యొక్క శుభముహూర్తమున మహోత్సవమున
శ్రీ శివప్రభుఁ డద్దానఁ జేరికొనియె॥ 373

---

† "Raigad was made capital at this time, because it was in the centre of the Konkan and close to Janjira and Surat."
*Chapter V. Rawlinson.*

‡ "The precipices on the four sides looked as if scraped perpendicular and were one and a half ganvs in height. .... The Raja said that this fort should be made the seat of his throne .... .... He built palaces, state-rooms .... .... a separate mansion for the eighteen departments. the seraglio for the queens .... .... . *Page 99 Sabhasad.*

సీ॥ § అటులుండ నొక్కనాఁ డాకోటలో 'హీర
ఖని' పేరి గోపికాంగన యొకర్తు
నెఱసంజపొద్దుపునుండియుఁ బాలు పెరుఁ గమ్ము
కొనుచుండ రేయి జామునకు మించెఁ,
జెంగటితనపల్లెఁ జేరఁగావెడల న
ప్పుడె కోటతల్పులు మూయఁబడియె,
నొక మాఱుదారి నేర్పొదవఁ గోటనుదాఁటి
యాకాంత తనకాంతు నండఁ జేరె,
తే॥ నదియెఱిఁగి శ్రీశివప్రభుఁ డట్టియెడలు
మూయఁగట్టించి, తగిన కాపుగడఁ బెంచి,
యప్రమత్తుఁడై తనదు రాజ్యాంగ మరసి
యేలుకొనుచుండె నన్నింట మేలుకొనుచు॥ 374

పంచమాశ్వాసము - సమాప్తము.

---

§ When the building was over Shivaji offered a purse of gold to any one who would scale the walls without ladder and plant a flag on the summit. A certain hill-man found a pathway up and won the reward; whereupon Shivaji presented it to him and closed the path with a bastion. (Another path was discovered by a milk-woman.)

Chapter *V. Rawlinson.*

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివభారతము

## (శివాజీప్రబంధము.)

---

### షష్ఠాశ్వాసము.

---

ఉ॥ శ్రీ శివరాజు తండ్రివివరించినయట్లు బిజాపురీంద్ర పూ
ర్ణాశయదత్త సంధినియమావళి కొప్పుచుఁ జెల్మిఁగూర్చి, యా
వేశముతో స్వరాజ్యమున వెంపరలాడుచు విక్రమించు ఢి
ల్లీశుని సైన్యనాయకుల యే పడఁపన్ జతనంబు గైకొనెన్॥ 1

శివాజిపై మొగలుదండయాత్ర - శివాజీసన్నాహము.

చ। మొదట బిజాపురీంద్రుఁడు సమున్నతి మార్కొనినట్టి పాదుషా
గదియఁగఁబంపె సైన్యములఖండములిచ్చి సయిస్తఖాను: ను
న్మదగతి నాతఁ డుత్తరమునన్ బలుభూములు గెల్చుకొం, చవా
మ్మనగరంబుత్రోవఁ జని మార్కొనుచున్ 'బునహా' న్గైకొనెన్॥

మ। పునహాజున్నరుత్రోవనుండియు బలంబుల్ యుద్ధసామగ్రి భో
జనవస్తుల్ దమ కందునట్లు నడుమన్ 'జాకణ్' గడంబందు శ
త్రునిరోధం బగుచుండ దానినడఁపన్ రూపించి, సైన్యంబుతోఁ
జని సేనాని సయిస్తఖాను నలువంచల్ ముట్టె నా దుర్గమున్॥ 3

చ॥ చాకణుదుర్గనేత నరసాళ్వకులుండు ఫిరంగజీ పరా
నీకమునడ్డగింపుచు, గణింపక యేఁబదినాల్గునాళ్ళు పె
న్వీఁక రణంబుసేసి యరివీరులనొంపుచు, నింక నాఁపఁగా
రాక సహాయమంప శివరాజునకున్ వినిపించెవార్తలన్॥

సీ॥ అపుడు శివాజి పన్హాళాగడంబున
బీజపూర్ సేనతోఁ బెనగుచుండి,
"నీచేతనైనంత నెగ్గింపు, మటు కాని
యెడ దుర్గమును వారి కిచ్చివేయు"
మని వార్తనంపె; నయ్యాదన నయిస్తుఖా
నాకోట యీశాన్యమందుఁ గంద
కముఁద్రవ్వి, పెనుమందుఁగట్టించి యంటించెఁ:
గోటగోడయు నందుఁ గూలిపడియె;
తే॥ నట మహారాష్ట్రవీరభటాళి దూఁకి
యరులమార్కొనఁ దుములసంగరము జరిగె,
వేయిమొగలువీరుల విరియ నతికి
తతమహారాష్ట్రభట శతద్వయము సమసె॥ 5

ఉ॥ * ఏఁబదిరెండువాసరము లిట్లు పెనంగి ఫిరంగజీ, భరం
బై బవరంబు, సాయ మిసుమంతయురాక, విరోధిసేన సం
ఖ్యా బహుళంబుగాఁ దొడరుటారసి దుర్గము నప్పగించెః బా
హాబలశాలియౌ నతనిత్యాగముఁ దేఁకువ మెచ్చి రెల్లరున్॥ 6

తే॥ * మొగలుసేనాని బహుమానముల నొసంగి
తన్నుఁజేరఁగా నతనితోఁ దడవిసెప్పె;
మనసుతిరుగని యాత్మాభిమానశాలి
యతఁడు శివరాజు దర్శింప నపుడ చనియె॥ 7

---

* For nearly two months Firangji had defended his post with tireless energy .... had disputed every inch of the ground (and) capitulated with honour. .... .... Shaista Khan greatly admired the gallant qiladar and pressed him to enter the imperial service on high pay. But Firangji refused to prove false to his salt and was allowed to go back to Shivaji with his army. ... ... Page 95. *J. N. Sarkar.*

ఉ॥ చాలినయంతవట్టు పెలుచన్ రణతాండవమాడి, యోరువన్
జాలనియప్డుఁగూడఁ బ్రిభుసమ్మతి దుర్గమువీడి, శాత్రవుల్
మేలిమిఁ జూపుచున్నను జలింపక వచ్చినదుర్గనాథు "భూ
పాలగడంబు నేలు" మని పంపె శివప్రభుఁ డాదరింపుచున్॥ 8

సీ॥ అట సయిస్తాఖానుఁ డా చాకణుగడంబు
నరికట్టి తనబలం బందు నిలిపి,
యొకదుర్గమును బట్టుటకు వేయిమందిశూ
రుల బలియిచ్చినందులకుఁ దలఁకి,
"యలఁతిగా దీ మరాటులదుర్గములఁ బట్టు,
టధికసైన్యముల - సైన్యాధిపతుల
బలియురఁ బంపుఁ" డం చలపాదుషాగారి
కంపె విన్నప: మతఁ డది యెఱింగి
తే॥ విపులసైన్యము లిచ్చి, యోఘపురనాథు
బలియు జస్వంతసింగును బనుపువెట్టి,
"యీమరాటులఁ దలలెత్తనీక యణఁపుఁ"
డనుచు శాసింప జస్వంతుఁ డపుడ వచ్చె॥ 9

శా॥ ఆజిప్రక్రమ దుష్ప్రిధర్షమగు సైన్యాటోప మేపారువాఁ
డై జస్వంతుఁడు తన్నెదుర్చు శివసైన్యవ్యూహమున్ దోలి, నే
తాజీపాల్కరు నోడఁగొట్టుచు, సయిస్తాఖానుఁడున్నట్టి పూ
నాఁ జేరంజని వానితోఁగలిసి సన్నాహంబుఁ బెంచెన్ వడిన్॥ 10

చ॥ మొగలుసైన్య మిట్లు చలమున్ గొని దేశముఁ బట్టుచుండఁ, బూ
ర్వాగతమౌ బిజాపురమహాహవమున్ ముగియించుదాఁకఁ గా
లాఁగి, శివప్రభుం డిపు డుపాగతసంధిబలీయుఁడై తదు
ద్యోగ మడంప నాప్తతతితోఁ గరణీయము వల్కె నీగతిన్॥ 11

సీ॥ § "ముదు తండ్రిచేతఁ బాపునవుడ షాజిహా
నునిచెల్మిఁ గోరఁగా ననుమతించి,
యంతలో నస్వస్థుఁడయ్యె నాతం: డంత
నౌరంగజేబున కల్లె వార్త
నంపితి: 'నాఁగాక' యని యప్పటికి నొప్పు
కొని, సార్వభౌముఁడౌ వెనుక నతఁడు
మే మీబిజాపురం బీమెయిఁబోరుచోఁ
దఱివేచి మాపైకి దండుఁబంపె;
తే॥ నతఁడె మాటనుదప్పినాఁ డనెడుదాఁకఁ
దలఁగియుండఁగా మనప్రాంతములను బట్టెఁ
దానుదానుగాఁ బైపడి తఱుమునప్పు
డెంతవఱకని సైరింతు మిట్లు మనము!॥ 12

మ॥ బలవంతుండగువానితోఁ బగ యసంభావ్యంబుగా నెంచి సం
ధిల నే నుంటయుఁ జేతగానితనమా తీరయ్యె: నీరీతి నా
కలఘుశ్రేయము గూర్ప నెంచి విధియో యౌరంగజేబో నను
బలవంతంబుగఁ బోర లాఁగిరనియే భావింతు నిప్పట్టున॥ 13

శా॥ ఊరుంబేరును లేనినాటఁ బ్రబల ప్రోద్య న్మహారాష్ట్ర రా
జ్యారంభంబును జేసి పెంచు జగదేకారాధ్య శ్రీదేవి హుం
కారధ్వస్త సమస్త శాత్రవ మదోగ్రవ్యగ్రత న్బేర్చి తా
నై రక్షారతినుండ, నా కొకయసాధ్యంబంచు రానేర్చునే!॥ 14

ఉ॥ కావున దైవశాసనముగా నిజధర్మముగా విపన్న లో
కావనదీక్షగాఁ దలఁచి, హైందవభూమి నుదూఢ కంటకా
భావముఁ జేయ నెంచితి; నభంగతరంగవిహార వీరపూ
జావిధి నిందు నాకుఁగల సర్వబలంబుల ధారవోసెద న్॥ 15

---

§ Pages 102 & 103. *M. G. Ranade.*

ఉ॥ చేయఁగరాని సాహసముఁ జేయుచు మోయఁగలేని భారముల్
మోయుట కూడదైన, నిటుపూన్చి భవానియె మమ్ము ముందుకుల్
ద్రోయుచునుండ మాకుఁగొలఁదుల్ గొలువఙ్బని యేమి? యిందుకుల్
నాయకభూమికల్ గొనుట నావిధి: రాఁగలయంత వచ్చెడిఙ్॥ 16

ఉ॥ వచ్చెడుదానిలో గెలుపువచ్చుట దైవముకార్య: మోటమిల్
ద్రచ్చుటొ విచ్చుటో వెలికిఁదార్చుటొ మార్చుటొ నాప్రయత్న: మీ
వచ్చెడువైరులల్ దఱిమి ద్రచ్చుచు, బచ్చెనబొమ్మలై వెతల్
ఱిచ్చవడల్ గలంప కదరింపక యూరక తీఱిపోదురే?॥ 17

చ॥ మన కెదురెక్కి యడ్డుపడి మార్కొనువాఁ డొకసార్వభౌముఁ, డే
పున భరతోర్వియెల్ల నొకపుక్కిట మ్రింగఁదలంచువాఁడు, వం
చనయు బలంబు తెంపు పెనుసాధనము ల్వలఁగించి కార్యమున్
గొను హఠవాది: వానిమఱుఁగుల్ గొనఁజాలునె సాధుమార్గముల్॥

చ॥ కషచినపోరులన్ దొడరుకై వడి గా దవురంగజేబుపై
కడరుట: యైంద్రజాలికునుపాయములన్ గొని వానియెత్తులన్
బఙలువడంగ నెట్టి, కనుపాపలఁదీసెదు నేర్పు నోర్పుఁ దెం
పుడుగక మించి, యీకరుల నోదమునన్ గుదియింపఁగావలెన్॥ 19

చ॥ విమతులతీరు లిట్లు వినిపించితినైన జయంబుగాంచు ట
శ్రమ: మవురంగజేబు సడిసన్నల గద్దియమీఁదనుండి తం
త్రముఁగొనుఁగాని, వానిసరదారుఁడు వార్వము కత్తిగూడ రొ
క్కమునకు దక్కుఁ: దక్కినను గా కవి ప్రాణము కోరువెట్టునే?॥ 20

ఉ॥ చేవలుదీఱి వైరులను జీల్చుబలంబులు పెక్కులుండ, నే
నై వెడలింపకున్నఁ దమకై రణతాండవమాడు వీరసే
నావిభు లిందఱుండఁ, గలనన్ గెలిపింప భవానియుండ నీ
యావను లెంత! నిర్భయులమై వెడలింతము దండయాత్రలన్"॥ 21

చ॥ అని శివరాజు మొగలులయొగడమున్ బల ముగ్గడించి, దా
ని నడఁపకున్న రాఁగలుగు నేఁటివిపర్యయమున్ వచించి, మా
ర్గానునెడఁ జేయనైన తెఱఁగుల్ మఱుఁగుల్ వివరించి, ధరిత్రన్
జనెఁ బరివారముల్ గొలువఁ జయ్యన సింహగడంబుఁ జేరఁగన్॥ 22

సయిస్తాఖానుపై శివాజీ విజృంభణము.

ఉ॥ అచ్చటఁ గొంతయాఁగి, పునహాపురమందు సయిస్తఖానుతీ
రచ్చముగా నెఱుంగుటకునై తగుచారులఁ బంపి, మొనసువోఁ
బుచ్చిన వీరయోధులఁ జమూపతులన్ బిలిపించి, యందఱన్
వచ్చినమీఁదఁ జేయఁగలవైఖరి శ్రీశివుఁ డిట్లు వాకొనెన్॥ 23

మ॥ "మనపైకిన్ బలమెత్తి వచ్చిన మహామాయావి యౌరంగజే
బునకున్ నెయ్యపుమేనమామ, బలితంపుందొడ్డసేనాని, ద
క్కనుకున్ నేత సయిస్తఖానుఁ: డతఁ డుగ్రస్ఫూర్తిఁ బోరాడ కా
పునహాపట్టణ 'దత్తపుత్రుఁ' డయి, కాఁపున్ మేపుఁ గైసేసెడిన్॥ 24

తే॥ లక్షబలఁగంబు దన కంగరక్షగాఁగ
వెడలిన సయిస్తఖా నొక్కయడుగు దాఁట
కంతిపురి దాఁగికొనియుండె: నతనితీరు
కడువిచిత్రమై హృదయగద్గదికఁ దెలుపు। 25

సీ॥ సర్వతోభద్ర రక్షాదీక్షఁ బురములో
నన్యులు చొరకుండ నాజ్ఞవెట్టి,
'ప్రజల నెవ్వండైన బయటికిఁ బోఁగూడ,
దాయుధం బంటరా' దనుచుఁ జాటి,
తన లక్షసేన చుట్టును గాచియుండఁగ
వెలి గుడారమ్ముల విడియఁజేసి,
పదివేలబలము తోడ్పడ శివాపురికోట
జస్వంతసింగు రక్షకుఁ జేసి,

తే॥ ఖానుఁ డిటు వానకాలంబుఁ గడపుకొనుచు
నుండెఁ బునహాపురంబున : నులికి యిట్లు
కాపుగడఁబెట్టు నవ్వానికడుపులోనఁ
దెరలుచున్నది కొండంత పిఱికితనము॥ 26

చ॥ ఇది యిటులుండ, వాని కెదురెక్కుచు నాలము సేఁతకంటె నా
బెదరినవాని నొక్కజడిపింపున డీల్పడఁజేయు టొప్పు; నీ
కుదిరిక సేయరాని దనుకోఁ బనిలేదు : నిసర్గధీరతా
స్పద హృదయంబు లందుకొనఁజాలని భౌతికసిద్ధి యున్నదే!॥ 27

ఉ॥ అర్ధమరేయిఁ జొచ్చి, పునహాపురి ఖానుని మేడతల్పులన్
బ్రద్దలుసేసి, మైమఱపువట్టిన యాతని వెన్నుదట్టుచున్
నిద్దురలేపి, వీరగణనీయ పథంబున మాఱుకొంద : మీ
సద్దున లక్షసైన్యములఁ జంపక యంతటిసిద్ధి చేకుఱున్; 28

ఉ॥ ఔ - నిది యొక్కసాహసమ్మైనను, గొందఱుమెచ్చుతీరు కా
దైన, భవానియాజ్ఞ యిటులైనది : ఖానుని సర్వశక్తిసం
ధానముగూడ నొక్కయడిదంబునఁ గోసి యపూర్వసాహస
శ్రీ నెసఁగింత : మిట్టు లొనరింతము చేయఁగలట్టికార్యమున్॥ 29

క॥ మన కొకయామడదూరము
పునహాపుర — మందుఁ జేరఁబోవఁగఁ 'గాత్రజ్'
కనుమలదారి, శివాపుర
మునఁ జనుదారియును రెండుముఖ్యము; లందున్॥ 30

ఉ॥ పూని శివాపురమ్ముపయిఁ బోవుపథంబున నొక్కరాత్రియం
దే నటు తానజీప్రభృతు లిర్వదియేవురఁ గొంచునేగి, యా
ఖానుని మేడలెక్కి యొసకంబున నాతని నిద్రలేపి సం
ధానముఁ దీర్తు : నప్డు పయిదారుల మీ రిటు తోడ్పడన్ వలెన్! 31

సీ॥ § కాత్రజుకనుమమార్గమున నేతాజి సే
నలతోడఁ గొండగుట్టలను డాఁగి,
కొమ్మల కాఁబోతుకొమ్మల కందంపు
మెలపుమై నూనెగుడ్డలను జుట్టి,
యటఁ బొంచియుండి, యిచ్చటఁ 'బునాపురి' నేము
వినుచు శృంగరవంబు విన్నవెంట,
నన్నిగుడ్డల కొక్క-యదన నిప్పంటించి
పెనుతూర్యములుమ్రోయ వెడలవలయు :
తే॥ మ మ్మనుసరింపుచు, శివాపురమ్ముత్రోవ
నొక్క-మైలుదూరంబునందుండి పొంచి,
పింగళేపంతు మాజాడ వేగుదెలిసి
సమయహితభంగిఁ దోడ్పాటు సలుపవలయు॥ 32

చ॥ తక్కి-న నాటకాంగముల దండడియెల్లను మేను ఖానుతో
నక్క-డఁ జూచికొందు" మనియాడుచుఁ, దత్పునహాపురంబునం
దొక్క-ని కాప్తమిత్రున కెదోయొకరీతి రహస్యమంపుచున్
రొక్క-ములిచ్చి, కార్య మనురూపముసేయఁగ వానిలోఁగొనెన్॥

ఉ॥ § వాఁడును బెండ్లికార్యమునెపమ్మున బంధులఁగూడి మెర్వడిన్
వాడలవెంటఁబోవు నలవాటున కుత్తరుపీయ ఖానునిన్
వేఁడుచు సమ్మతిన్గొనుచు, వేగ రహస్యములంపె "నిట్టు లీ
నాఁ డగుఁగార్య" మంచు శివనాథున : కంత నతండు పొంగుచున్॥

ఉ॥ మున్ను వచించినట్లు వెలుపోఁదగువారల నట్టులంపి, తా
నన్నిట జాగరూకుఁడయి, యర్హవిధంబున మారువేసముల్
గొన్న నిజానుబోధులను గొంచు నెశాయుకివచ్చి, చీఁకటుల్
కన్నులుగుట్టువేళ సరిగాఁ దటిసీమ [illegible] 35

§ [illegible] 182 "శ్రీ [illegible]" [illegible]

తే॥ భటులు దానును మోగలుభటులయట్లు
వేసములుమార్చి, జంకును వెఱపులేక
వైరినంకేత మెఱిఁగినవాఁడువోలె
నడిచెఁ ద న్ని వేశములవెంబడి శివుండు॥ 36

ఉ॥ 'మీ రెవ' రన్న - 'మీరెవరో మే మలవారమె'యంచు, 'నెందు కీ
దారుల వత్తు' రన్న - 'సరదారుల యుత్తరు' వంచు, నిర్దరన్
గూరినవారిఁ దట్టి 'యిటుకూడునె మేల్కొనుఁ' డంచు, ధీరుఁడై
వైరుల హెచ్చరింపుచు శివప్రభుఁ డేగెఁ బురమ్ములోనికిన్॥ 37

ఉ॥ చిన్నతనంబునుండి పరిశీలనసేసినయూర సందులున్
గన్నపుదారులున్ దెలియుఁగాన శివప్రభుఁడున్ భటాళితో
నన్నియు దాఁటి, యొక్కట మహావిభవంబున సాగు మెర్వడిన్
బన్నుగఁ జొచ్చి, యచ్చముగబందుగుఁడై' చనె వారివెంబడిన్॥ 38

సీ॥ వివిధవాద్యముల బాటవముఁ జూపెడివారి
'సా - సెబా' సని మెచ్చులాడియాడి,
చతుర నాట్యకళా ప్రసక్తి వాల్చెడుచోట
నుప్పొంగినటు తలయూఁచియూఁచి,
పనివాంఛ్ర గదిమి 'యీపని - యాపని' యటంచుఁ
దనపెత్తనమువెంటఁ జొనిపిదొనిపి,
యిరువైపుచుట్టంబు లెవరైన వారితో
ననువుగా మేలంబు లాడియాడి,

తే॥ వారిచుట్టముగా వీరు - వీరిచుట్ట.
మనుచు వారును దగినమర్యాద సలుప,
నన్నికార్యముల్ దనవిగా నరసికొనుచు
నడిచె మెఱవడి శివుఁడు ఘంటాపథమ్ముల॥

ఉ॥ ఇంతటిలో ఘనాఘనము తేచి వర్షిం బెనువాన మూసె; ను
ద్భ్రాంతి జనంబు లెవ్వరికివారుగఁ బోయిరి; దీపపంక్తి వో
ధ్వాంతము నిండె; ద్వారపరిపాలకు లాజడి నిల్వలేక స్థా
నాంతర మేగి; రంత ముదమంది శివాజి భటాళిఁ గూడుచున్॥ 40

సీ॥ * తన తొంటిభవనమందున ఖాను వసియించు
టరసి, తన్నిర్మాణ మెఱుఁగుఁగాన
వెనువైపు పెడదారిఁ జనియడ్డగోడ
నెక్కి-దూఁకుచు వంటయిల్లు సేరె;
నపుడు 'రంజాన్' పండుగాట నానడురేయి
వండుచు బానసీం డ్రుండి రచట,
నొకని కిర్వురుగాఁగ నొడిసి యవ్వారలఁ
గిక్కు-రుమనకుండఁ గ్రుక్కి- చంపి,
తే॥ ఖానుమేడకుఁబోవు మార్గమున కడ్డు
గోడ యిటుకలు మెల్లఁగా నూడఁదీసి,
లోని పటకుడ్యములఁ జీల్చి, ఖానుపడక
గదిని భటులతో శివుఁడు సాక్షాత్క-రించె॥ 41

ఉ॥ "ఖానుమహాప్రభూ! యెదియొగట్టిగఁ జప్పుడు, దొంగలేమొ మీ
యాన" యటంచు నొక్క-భటుఁ డాడఁగ, ఖానుఁడు కోపగించి, "పో
రా! నెఱనిద్దురం జెఱచి అచ్చయొనర్పకు" మన్న, నింతలో
ఖానునిరాణివాసము గకావిక లేచి శివాజిఁ గన్గొనెన్॥ 42

* It was Ramzan. .... Some cooks .... were despatched by the Marathas without the least noise being made. The wall dividing the outer kitchen had a small door in it, but the opening had been closed with brick and mud. ........The Marathas began to take out the bricks and make an opening there. ... Hacking a way through them (screen-wall after screen-wall in the harem) Shivaji reached the very bedroom of the Khan. Page 100. *J. N. Sarkar.*

చ॥ “ఇఁకఁ దడఁబాటు కూడ”దని యెంచి, శివాజి భవానిఖడ్గ మిం
చుక జళిపించి “లెమ్ము, కనుసోగల విప్పుము, ఖానుజీ! భయా
నకమగు రాత్రి - దొమ్మిగ రణమ్మగు రంగము - మేడలెక్క - హం
తకు లిదెవచ్చి, రింకనయినన్ నయనమ్ముల విప్పఁగూడదో?॥ 43

చ॥ ఘనుఁ డవురంగజేబు మొనగాఁడవటంచు దలమ్మలిచ్చి ని
న్ననిపె శివాజి నొంపఁ: బునహాపురిమేడల నాఁడువాండ్రతోఁ
బెనఁగుచుఁ బ్రొద్దుపుత్తువు, వివేకమొకో యిది? యిట్టివానికిన్
బనుపడునే శివప్రభునిఁబట్టఁగఁ బ్రాణముఁబట్టి నిల్వఁగన్॥ 44

ఉ॥ వ్రాసితి వుత్తరంబును శివప్రభుఁ ‘గోఁతియుఁ’ ‘గొండయెల్క’ గాఁ
జేసి, ప్రగల్భముల్వదరి చేతనువాతనుగాని కోఁతలన్
గోసితి; వన్నిటిన్ దడవి, గుత్తపుటుత్తర మీయ నిందు వేం
చేసితి; రోసమున్న దయసేయు, మొకొక్కటి యప్పగించెదన్॥ 45

ఉ॥ ఓ యవివేకుఁడా! యెఱుఁగవో? యిది కొంకణపీఠభూమి - స
హ్యాయత కూట కానన గుహా సుదురాసద; మిందు మావళే
బోయ - మరాట సింగములపొత్తున శూరతమేసి; రిట్టి సే
నాయుతుఁడౌ శివప్రభుఁ గొనన్ జన గుత్తుక గాలమంటదే?॥ 46

కూటికి గుడ్డకై పరులకొల్వునఁ బ్రాణములమ్మి నీ చమూ
కోటుల శత్రుఖడ్గములకున్ బలివెట్టుచు, మీరు మేడలన్
బోటుల ప్రక్కలంటి గెలుపుంగొన నెంచెద; రిట్లనాథ హృ
త్కోటర రక్తపూరములఁ గొల్చు విభుత్వము నోర్వవచ్చునే?॥ 47

బుడుగుబలంబు నాపదకుఁ బాపుచు, బన్నసరంబుకొల్కి గుం
[illegible]డపిదభంగి నిన్నుఁ బొలియింపఁగ నీనిశి నిట్లువచ్చి పైఁ
[illegible]డితి; నిజాంగసాహసముఁ బాసి, కటారును గేలఁబట్టి, వె
[illegible] హాయిగ నిద్రవోయెదున్॥ 48

శా॥ ఇప్పటినిన్ను - నన్ను - రణ - మింతయుఁ బాదుషహా యెఱింగి, తా
నెప్పటికైన మాపయికి నీదృశుఁ బంపకయుండుఁగాక; లే
కప్పటి కంపెఁబో కదియునాతఁడె మమ్ము నెఱుంగుఁగాక, రా
వప్ప! భవానిపేరఁ బునహాపురికిన్ బొలిఁజల్లిపో యెదన్"॥ 49

చ॥ అను శివరాజు వేఁడి నుడులట్లు తళత్తళలీను కత్తులన్
గని భయమంది † ఖానుకులకాంతలు చప్పున దీప మార్చి; రం
గనలమఱుంగునన్ జణిఁగె ఖానుఁడు; కార్యము దప్పెనంచుఁ బై
కొని, శివయోధు లా శయనకూటమునెల్ల నడించి రేపునన్॥ 50

ఉ॥ చీఁకటికొట్టులోఁ, బదరుచేతులఁ గాళులఁ గీలగొంతులన్
గేకలువెట్టి మూఁగుచుఁ దెగించి పెనంగెడు నాఁడువాండ్రలో
నాకులచాటుపండు తెఱఁగా మనఖానుని వెల్వరింపఁ, బె
ల్లాకులమయ్యె మేడగదియంతయుఁ దేనియఁదీయు చందమై॥ 51

చ॥ "అతివలజోలిఁ బోకుఁ, డెటులైనను ఖానునిఁ బట్టుఁ డంచు భూ
పతి యనఁ దద్భటుల్ గదియఁబట్టిరి; 'డాఁగురుమూఁతలాడినన్
గతి చెడు' నంచుఁ దెంపుఁగొని, ఖాను గవాక్షము సెక్కి-దూఁకె; వాఁ
డు తొలఁగునంతలోనె † శివుఁడున్ గరవాలమువైచె వానిపైన్॥

ఉ॥ ఆ కరవాలువ్రేటు పడునంతకె ఖాను గవాక్షమున్ దిగన్
దూఁకుటఁ † జేతివ్రేళ్ళు తెగి తున్కలుగాఁ బడె; నంతఁ బాఱెనర
తాకృతి నేడనో సురిఁగె ఖానుఁడు; వాని నడింప నల్గడన్
ప్రాఁకిరి శైవయోధులుఁ, వినున్నత గొల్లున నేడ్చి రంగనల్॥ 53

---

† The Nawab utterly panic-stricken put out the candles and lights and remained concealed among the women....The Raja (Shivaji) dealt a blow....three fingers were struck off.

Page 42. Sabhasad

సీ॥ ఖానుకుమారుఁ డక్కడఁ బ్రక్కగదినుండి
దిగ్భ్రాంతిచే నేగుదెంచె నటకు;
నతఁ డడ్డమాట గార్యవిఘాతమని రేఁగి
తానాజి వానిమస్తకము దునిమెఁ;
ద్రాటిపై దిగెడుసర్దారునొక్కని ఖానుఁ
డంచు నేసాజి ఖండించివైచె;
వారు వీ రక్కవలివారు సర్దారులు
గుంపులై, పెను గంద్రగోళమయ్యెఁ;
తే॥ † నంత శివభూపుఁ డుచితకార్యజ్ఞుఁ డౌచు,
నాపదనుదెల్పు యుద్ధవాద్యములగదికి
నేగి భటులచే వాని మ్రోయింపఁ జేయఁ,
గిట్టునఁ బురంబు బహుజనాకీర్ణమయ్యె॥ 54

ఉ॥ ‡ "దొంగలు! శాత్రవుల్! నగరుదోఁపిడి! హత్యలు! వారె! వీరె! యీ
భంగినిఁ బోయి" రం చఱచి పర్విడువారలఁ గూడి, తామునున్
"దొంగలు! శాత్రవుల్! నగరుదోఁపిడి! హత్యలు! రండు! పట్టుఁ! డీ
భంగినిఁ జూతురే?" మనుచుఁ బర్విడి రా శివుఁడున్ శివానుగుల్॥

మ॥ తన సంకేతమురీతిగా శివుఁడు తద్దన్ గొమ్ము లూఁదింపుచున్,
దనకై వేచిన పింగళేసచివుతోఁ దా సింహమార్గమ్మునన్
జనె; నేతాజియు నూనెగుడ్డలను డీన్ జాల్చివ్వటీ లెత్తి, బో
రన వాద్యమ్ములఁ గొల్పి, శ్రీశివుని డాయన్ బోయె సైన్యమ్ముతోన్॥

---

† They (the Marathas) entered the bandroom and ordered the bandsmen, as if from the Khan, to play.
Page 101. *J. N. Sarkar.*

‡ The guardsmen cried enquiring, "Where is the enemy?," With them he (Shivaji) also ran forth shouting like them, "Where is the enemy?." Page 42. *Sabhasad.*

సీ॥ కాత్రజుకనుమమార్గమున వెళ్లెడు దివ్వ
టీల - ప్రోఁగెడు నగారాలఁ గాంచి,
వైరు లం దేగుచున్నారని తలఁచి, మో
గలుసైన్యనాథు లఖండబలముఁ
గొని వారి వెన్నాడి, కొండగుట్టలఁ జిమ్మ
చీఁకటి బిట్టు చీకాకుఁ గఱచి,
యది పెద్దమోసమౌటరసి, చప్పిడి మొగ
ము్మల సయిస్తాఖానుఁ గలిసి; రంత
తే॥ నతఁడు రెట్టింపుటలుకచిచ్చులముకొనఁగ
"శివపతిని బాగ్గు బూదిగాఁ జేసిగాక
విడువరా" దం చపుడ సింహగడముపైకిఁ
బ్రబల చతురంగవాహినిఁ బనుపుసేసె॥ 59

చ॥ 'ఇది యిటు లౌ' నటంచు మును పే తలపోసి, రణావ్యవస్తుసం
పద సకలమ్ము కోటపయి భద్రముగానిడి, మొగ్గరమ్ములన్
బదిలముసేసి డీకొని శివప్రభుఁ డుండె; మొగల్బలంబు లే
పుదనర దూఁకి, సింహగడముం దరియంచులఁ దాఁకి పైకొనన్॥ 58

ఉ॥ మచ్చరమెక్కి కాపుగడమార్గములెంచక వైరు లండకున్
వచ్చెడుదాఁకఁ బొంచియు, శివప్రభుఁ డున్నటులే మహాత్ముగా
నచ్చటికోటలెక్కి, నిశితాంబకవృష్టి పిరంగిగుండ్లకా
ర్చిచ్చును గ్రాఁగునూనిమలచిత్తడియున్ గురియించె వారిపై॥ 59

శా॥ చక్కన్ దూయుచు బాణముల్ మెయి సహస్రచ్ఛిద్రముల్ సేయ, నం
దుక్కై సీసపుగుండ్లు చిచ్చుమిసి యాయుర్వాయువుల్ దీయ, నే
ప్రక్కన్ నూనియమంటలన్ గమలి బొబ్బల్ బుగ్గలై యంగముల్
స్రుక్కన్, మొగలుసేన లిట్లుచెడి యవ్వోలిచ్చె నల్లెఁపులన్॥ 60

శా॥ అంతఃక్రాంతములందుఁ బొంచుకొని సైన్యాధీశ్వరుల్, పింగళే
పంతుం డొక్కటఁ - బాల్కరుం డొకట నిర్వైపుం బలంబెత్తి, యు
ద్ధ్యాక్రాంతశ్రాంతుల వైరులం దఱిమి నొంపన్ జంప దిక్కేది, ప్రా
ణాంతాపత్పరిభూతమై, మొగలుసైన్యం బేగెఁ బూనాఁ జొరన్॥ 61

మ॥ తనసైన్యంబు పరాస్తమై, తనప్రయత్నం బిట్లు విధ్వస్తమై,
తనయుండున్ బనికత్తెలున్ సతులు సర్దారుండునుం గూలి, కూ
లినవ్రేళ్ళన్ దలకూలిన ట్లుపగతక్లేశుండునౌ ఖాను దా
పునఁ గొల్వై యుపచారముల్ వలికి రాప్తుల్ బంధు లుద్యోగులున్॥

తే॥ అంద ఁజేతెంచి యుచితవాక్యముల నూఱ
డించుచున్నను, జస్వంతుఁ డించుకంత
యాలసించుటఁ దలఁచి, మున్నంటియున్న
యీసు ముడివైచె నిటుల సయిస్తఖాను॥ 63

సీ॥ 'తఱివేచి కొలిచి యందఱు విచారింప నా
తఁడు కొంతతడ వేలతడసె' ననుచు,
'శివరాజుఁ దఱిమి శిక్షింపఁ దానేగక
తనబలంబే యేలపనిచె' ననుచుఁ,
'బదివేలబలముతోఁ బొదవి తానుండుత్రో
వనె వైరి యెటు దాఁటివచ్చె' ననుచుఁ,
'దమ హైందవాభిమానముఁ జూపి యెళవిచ్చి
శివు రేఁపి మనల భంజించె' ననుచు,

తే॥ సాటిసరదారుఁడైన జస్వంతసింగుఁ
దప్పుఁదలఁచి, యాతనిపైనఁ దప్పుమోపి,
యెల్లసంగతు లపుడ సయిస్తఖాను
పాదుషాగారి కలు విన్నపముచు బంపె॥ 64

ఉ॥ "ఈ పునహాపురిన్ నిలుతుమే నీకమీఁద శివప్రభుండు ప్రా
ణాపద సేయకే విడువఁ" డంచడలెత్తి, సయిస్తఖాను పూ
నాపురినిల్చి కార్యముగొనన్ జసవంతు వచించి, యాత్మర
క్షాపరుఁడౌచు నేగెఁ దనసైన్యముతో నవురంగబాదుకున్॥ 65

చ॥ జరిగినకార్యమందు శివు సాహస నిర్భరధైర్య శౌర్య ధీ
పరిణతిఁ గాంచి, "దైవబలపాకముతో నవతీర్ణుఁడౌ మహా
పురుషుఁ డితం" డటంచు జనముల్ హృదయమ్ములు విచ్చి; రొంటిపా
టరసి ప్రతిక్రియారహితుఁడై జసవంతుఁడు నిల్చె నచ్చటన్॥ 66

సూ ర తు ము ట్ట డి.

చ॥ † తన యదలింపునన్ మొగలుదండులునున్ సరదార్లు భీతులై
మినుకుట - లోకమెల్లఁ దను మెచ్చుటఁ జూచి, శివప్రభుండు చే
సినపనికంటె నొండొకవిచిత్రము సాహసముం బొనర్చి లోఁ
గినయరులన్ మఱింతయణఁగింపఁ దలంచి, హితాళిఁ గూడుచున్॥ 67

మ॥ † కొలువై యిట్లువచించె, "శత్రులిపుడే కోల్కొంచురాఁజాల రిం
దుల, కేతెంచినఁగూడఁ దొంటివలెఁ జిందుల్ద్రొక్కలేఁ; రింతలో
బలమున్ దెంపు వెలుంగ నొండొక రసాభాసంబుఁ గావింత; మీ
మెలపుంజూపి బలాఢ్యులౌరిపులకల్మిన్ గొంత కొన్నట్లగున్॥ 68

తే॥ ఎదురెదురుయుద్ధముల మాని, యిందునందు
నింద్రజిత్తుపోరాటలే యెత్తవలయు;
దీన మనపైనఁ బ్రజ లభిమాన మెంచి
యరులతర మెంచి వారిపైఁ దిరుగవలయు॥ 69

---

† He had gained an immense moral advantage by his nocturnal assault on Shaistakhan's residence .... .... and he intended to pursue it with unrelenting resolution. ........ The financial prospects of such an enterprise. no doubt, proved a great inducement, but money was not the only incentive under which Shivaji acted. He wanted to strike terror into the hearts of the enemy subjects P. 32. *Cosme-do-Guarda*

ఉ॥ దక్షిణపీఠభూమి మనతావు, జనుల్ మనవారు; వీరి ని
ష్పాక్షికసానుభూతి మనపై సహజమ్ముగ నుండు; 'బీజపూర్'
దక్షత నాఁగియున్న మనదర్పము దేశహితానురక్తి ప్ర
త్యక్షము వారి కౌట మనయత్నముఁ దప్పఁదలంపరే జనుల్॥ 70

చ॥ ప్రజలకునై ప్రజాబలముపట్టుగ సాగువిభుత్వ మెప్పుడున్
విజయముఁ గాంచు; స్వార్థపరవృత్తిఁ జలంబు బలంబు చూపు భూ
భుజుఁ డతిచారదుష్ఫలితముల్ గను; నేఁ డవురంగజేబుది
గ్విజయము లట్టివై యుడుకుఁబెంచి, ప్రజాహృదయమ్ము నేర్చెడున్॥

ఉ॥ నొచ్చియు దక్షిణావనిజనుల్ బలవత్ప్రభ నాఁగలేక, తో
డిచ్చెడువాఁడు లేకఁ గ్రుంగి యీగతినుండిరి: వారి రేఁపుచున్
జిచ్చు గవల్చి శాత్రవులఁ జెండితిమేని జనుల్ దమంతఁ బై
పెచ్చు పరాక్రమింతు; రిటు వీఁగి యరాతిబలంబు పెంపఁడున్॥ 72

ఉ॥ మోగలురాజ్య మింక నడిమట్టి కలంచుచు, నస్మదుద్యమం
బాఁగెడువైరులన్ దఱుములాడి యదల్చుద: మిట్టి మా మహో
ద్యోగ మెదుర్పలేని - తమునోమఁగఁజాలని పాదుషాహిపై
నోగు మదిన్ దలంచి, మనయున్నతి కోఁదలవంతు రీప్రజల్॥ 73

చ॥ ఇటు బలహీనుఁడౌచు యవనేంద్రుఁడు నివ్వెఱ నిల్చెఁ; గాని యు
ద్భటుఁడగువీనికై ప్రజల దండడిగొల్పుట తప్పు; దిట్లు చే
యుట యొకరాజనీతి: యిదియున్ యవనేంద్రులు నేర్పి; రైనఁ బై
కటుతయు లోనిమార్దవముగా జళిపింతము చంద్రహాసముల్॥ 74

ఉ॥ ఇంతకుఁ గంటిలోనలుసు నీఁగఁదలంచినఁ దప్ప వొత్తిడుల్
గొంతకుఁగొంతయైనఁ గనుగ్రుడ్డున; కూరకయున్న నోర్మి ని
దింతుమె? శస్త్రముల్ జొనిపితీసిన - నూఁదిన - నెట్టులైనఁ గా
ర్యాంతమునందు నిండుకనులౌ నగుమోములఁ గన్నఁ జాలదే!॥ 75

ఉ॥ కావున దండయాత్ర లెసఁగన్ దొలి సూరతుఁ గొల్లకొట్టి యా
పై వెడలింత; మాపుర మపారధనమ్ముల కాటపట్టు : ఢి
ల్లీవిభు రాజ్యలక్ష్మికిఁ జలింపని యాయువుపట్టు : దూరపుం
దీవులవారు నావికవిదేశవణిక్కుల అచ్చప ట్టగున్॥ 76

ఉ॥ పూనికమీఱ మొగలువిభుత్వపురక్షణ యున్న దుర్బలం
బైనది; వర్తకుల్ పలువురై - యెవరంతకువార లాత్మర
క్షా నిరతిన్ మెలంగుదురుగాన సుసాధము కార్య; మందు సు
శ్రీ నరిగొంచు, మించినయరిప్రభుతన్ జడిపించిన ట్లగున్”॥ 77

చ॥ అనుటయుఁ బింగళేసచివుఁ “డౌ, నిదియున్ దతరాజనీతి; హె
చ్చినరిపుకోటి కోపణఁగఁజేయఁగ వేఱొకదారి లేదు; లే
దని వెనుకాడుచో బ్రిదికినంతకు బంధవిముక్తి లేదు : కా
వున మనధర్మ మేమఱక పోరుట మే” లన, సంతసించుచున్॥ 78

తే॥ అల పరాసుల - నబిసీనియనుల గెల్వ
ననుచు నిరువైపు సేనల ననుపుసేసి,
సురథపట్టణమర్మమ్ము లరయ, నాప్త
వరు “బహిస్సాయకుం” డనువానిఁ బంపి॥ 79

చ॥ శివపతి కొంతసైన్యమును సింహగడమ్మునుగావ నిల్పి, శా
త్రవులను వేచియుండ సరదారులఁ గొందఱ కాజ్ఞవెట్టి, యు
క్కివులు చమూపతుల్ - యమునిగెల్చిన నాలుగువేలసేన వెం
దవులఁగ క్షేత్రిరాజమగు ‘నాసికఁ’ జూచు నెపమ్మునన్ జనెన్॥ 80

చ॥ దినములు రెండుమూఁ డచట దేవునిఁ గొల్చినయట్లు - కార్యమున్
గొనినటు లుండి, ము న్ననుపుగూఢచరుం డరుదెంచి సంగతుల్
వినిచిన సంతసించి, యతివేలజవంబునఁ బోయె సైన్యముల్
గొని శివరాజు తత్పురము క్రోశయుగ మ్మనుమేర డాయఁగన్॥ 81

చ॥ సురథపురమ్మునన్ జనులు సూచనగా శివరాజువచ్చుటే
రరసి భయమ్మునన్ బదరి, యచ్చట రక్షణలేమి నెంచి, కొం
దఱు ఘనవస్తువాహనవితానము లబ్బినయంతఁ గొంచు, వే
పఱచిరి వేఱువేఱుగ; శివప్రభుఁ డంతన డాసెఁ దత్పురిన్॥ 82

తే॥ 'దక్షిణాపురమ్ము' త్రోవన వచ్చి, యూరి
బయల నొండొక యుద్యానవనమునందుఁ
బటగృహమ్మున విడిసి, తత్పట్టణంబు
నాల్గుగవంకులఁ దనదుసైన్యముల నిలిపె॥ 83

ఉ॥ * అంత శివప్రభుండు పురమందలి కొందఱుపెద్దలన్ - యశ
స్స్వాంతుల - దాంతులన్ — ద్రవిణవంతుల నండకుఁ బిల్వఁబంచి, యే
కాంత మృదు ప్రియోచిత హితానునయోక్తుల భూతభావి సి
ద్ధాంతము దేశకాలవిహితమ్ముగఁ జూపుచు నిట్లు వాక్రొనెన్॥ 84

ఉ॥ "సోదరులార! నేఁడు పరిశుద్ధము భారతభూమి ధర్మర
క్షాదరశూన్యులున్ బలియురౌ పరరాజులపాలనమ్మునన్
జేఁదును మేసి, లేవడిఁ గృశించి, యతంత్రత కట్టుసాఁచి, మ
ర్యాదకు దూరమై, పెనుచెఱంబడి వ్రేలుట మీ రెఱుంగరే!॥ 85

ఉ॥ ఓర్చితి మంతకాల, మిదియున్ బలహీనత యయ్యె; నీవెతల్
దీర్పుట కెవ్వఁడైన నొక తెంపరి ముందుకు రాఁడు; వచ్చెఁబో
కూర్చియుఁ దేర్చియున్ బలముకొల్పను లోకము - ప్రక్క-పోటులన్
మాన్పుటకాని; యిట్టి కసుమాలమదెంతని యోర్వనయ్యెడున్॥ 86

---

* Shivaji had publicly announced that he had not come to do any personal harm to any of the native or foreign merchants in the city (Surat) ........ He had invited ........ the foremost citizens to attend his camp outside the city gates and settle the ranson there. Page 241. *N. S. Takakhav.*

ఉ॥ కావున నేఁ దెగించి బలఁగంబులఁ జొచ్చి యెదుర్చుచుంటిఁ బల్
త్రోవల; బీజపూర్విభుల తుందుడు కేపడెఁ దత్సహాయులున్
జేవఁదొఱంగి, రిప్పు డబిసీనియనుల్ - మఱి పోర్చుగీసులున్
లావఱిపోయి; రొక్క - మొగలాయివిభుత్వము హుంకరించెడున్॥ 87

చ॥ ప్రబలతరంబు మొగలుల ప్రాభవ మిప్పుడు; దాని నాఁగ న
ల్పబలము చాల, దాఁగక తొలంగిన శ్రేయము లేదు: గాన ని
ష్ఠు బహుళసైన్యముల్ విపులముల్ ధనముల్ పటు సాధనంబులున్
నిబిడము సేయుచుంటి; గమనింపుచు మీరును దోడ్పడన్ వలెన్॥ 88

చ॥ కలదు బలంబు మిక్కుటముగా - రిపులన్ బులి వేఁటలాడుచున్
గెలుపుఁగొనంగ; నెట్టిపనికిన్ ధనలక్ష్మి ప్రధానశక్తి; మీ
రలు సమయమ్ము నెంచి, బవరమ్మునఁ గత్తినిఁబట్టకున్న దో
యిలిమునిఁగించి కల్మిఁగురియించిన సర్వముఁ జేసినట్లగున్॥ 89

ఉ॥ మీ రిడునాణె మొక్కొ - కఁడ మేయబలమ్మగు విష్ణుచక్రమై
వైరుల రూపుమాపు, మనపక్షమునం దమృతమ్మువోయుఁ; గే
దారమునందుఁ జల్లు బలితమ్మగు విత్తనమ ట్లొకొక్కఁడున్
నూఱులు వేలు పండు; నిది నూల్కొన నే హలికుండ నయ్యెదన్॥

ఉ॥ దున్నెదఁ, బాపనంబు వడిఁ దోలెద, విత్తెదఁ, గల్పుఁబాపెదన్.
బన్నెదఁ గంచె, ముచ్చుపసిఁ బట్టెదఁ బైరుల మేయకుండఁగాఁ,
దన్నెదఁ జోరులన్, ఫలముఁ దప్పక కోసెద; నింపుఁ బాపమున్
బున్ని మదేదియైన నెడవోవక పూనిక నిర్వహించెదన్॥ 91

తే॥ నా ప్రయత్నము సర్వహైందవ హితమ్ము
గా నెఱిఁగి తోడుపడువారిఁ గలిసికొందుఁ:
గానివారల నెట్టులైనఁ గలిపికొందు -
నయభయమ్ములు కార్యవ్రతములు గావె!॥ 92

ఉ॥ కావున మీరు సేయఁగలకార్యమునన్ హృదయమ్ములట్ల భాం
డావసథమ్ములన్ దెఱచి, యట్టులె మీపలు కాదరించు స
ద్భావులఁ బ్రోత్సహింపుఁ; డటుతప్పినవారలఁ దీర్చిదిద్ద సై
న్యావళి యున్న : దాకొలిమియం దొగి సాగెడు నెట్టిలోహముల్"॥

సీ। * అనుచు, దీక్షోద్ధతులైన సైన్యాధీశు
లను బిల్చి శివవిభుం డనియె నిట్లు,
"చనుఁడు మీ రీసాధుజనులవెంబడి, వీర
లిప్పించుధనముల నిందుఁ జేర్పుఁ;
డటు పోనివారి కియ్యుదనుఁ గార్యముఁ దెల్పి
నయభయసరణి ధనమ్ము గొనుఁడు;
ప్రతిఘటించెడు నెట్టిబలవంతు విడువకుఁ,
డతిలోభి దుర్నీలు నడఁచివేయుఁ;

తే॥ డనదలను బీదలను సాధుజనుల బహుకు
టుంబులను ధర్మపరుల దండుగకుఁ బాపుఁ;
డన్నిజాతుల పూలు కాయలును బండ్లు
పత్త్రిరియుఁ గోయుఁ; డిది మాతృభాగ్యపూజ!"॥ 94

మ॥ అని యవ్వారలఁ బంపి, మొగలువిభుత్వాజ్ఞన్ బురాధ్యక్షుఁడౌ
'వినయత్ఖాను' న కంపె వార్తలిటు "లోయీ! మేము నిన్ జూడవ
చ్చిన నీ వించుక తొంగిచూడఁ జనదో? † చీఁకట్లు గోరాడు కొ
ట్టునఁ గూర్చుంటివి కోటమూసికొని, తిట్టుం గొట్టు దూరమ్ముగన్॥

* "The richest plunder never made him deviate from the rules he had laid down for its appropriation."

Page 238. *James Grant Duff.*

† "The Governor .... .... retired into the fort with what he had of the greatest value."

P. 178, 'Life of the celebrated Sevagy." *Cosme-da-Guarda.*

మ॥ ¶ హయసైన్యంబులఁ బాదుషాకొలఁకు మే మార్జించియున్నాము; త
ద్వ్యయముల్ దానె భరింప మున్నతఁడు వాగ్దానంబుఁగావించె; నుం
తయు దానిన్ వినిపించుకోఁడిపుడు, నీదాక్షిణ్య మిట్లుండె; ని
ట్టిమొడన్ మాపని మేనుచూచుకొనుకంటెన్ మార్గ మొండున్నదే?॥

ఉ॥ కావున నిట్లు వచ్చితిమి, 'కా' దన కీ విపుడైన మాకు రాఁ
బోవుధనమ్ము గుప్తముగ మోయుచు నప్పనసేయు; మట్లుకా
దా! విడఁదీసి నీపురమునంతయు దండుగుఁబట్టుకొందు, సై
న్యావళిఁ బంపి కోశగృహమంతయుఁ జెల్లుగఁ గొల్లగొట్టెదన్॥ 97

తే॥ § అయిదువందలభటుల నీ కప్పగింపఁ,
దక్షిమి వారల వారిజీతములఁ దినుచు,
వారినోటను - బాదుషాగారికంట
దుమ్ముఁగొట్టితి; విపు డెందుఁ దూఱెద నెదు?!॥ 98

చ॥ దొరలమటంచు మాధరణిఁ ద్రొక్కి, యకార్యము లిట్లుసేయ మీ
పరువము నిల్వ: దీపరిజలు పాదుషహా నెదిరింతు: రేము కా
పరివలె వెంటనంటి తెగఁబట్టుచు దక్షిణపీఠభూమి మీ
చరణము మోయనీ: మిది నిజమ్మని తెల్పుము పాదుషాహికిన్"॥ 99

చ॥ అని తగుదూతలన్ బనిచి, యంతకుమున్న పురమ్ములోనికిన్
జనినభటాళి సేయఁగల చక్కటులన్ గనుచుండె, నింతలో
ధన కనకాంబరాదులు నుదారిమణీ రమణీయభూషలున్
గొని చనుదెంచి రాభటులు గుంపులుగట్టుచు వేఱు వేఱుగన్॥ 100

---

¶ The Mughal Emperor had forced him (Shivaji) to keep a large army and he would force the Emperor to become its pay-master. Page 241. *N. S. Takakhav.*

§ He used to draw from the Treasury the pay of 500 soldiers, but had so long appropriated the money without maintaining a proper force. Page 107. *J. N. Sarkar.*

సీ॥ తాముదెచ్చిన వస్తుతతి యొండొకండుగా
నర్పించి వివరమ్ములాడునప్డు -
"మముఁజూచి మిగుల సమ్మానించి యీ యమూ
ల్యధనంబు లర్పించి" రనుచుఁ గొంద,
"ఇలుదూఱి బెదరించి బలవంతపఱచి, యీ
ధనము రాఁబట్టినా" మనుచుఁ గొంద,
"ఇటునటుపాఱిపో యెడువారిఁ బట్టి, క
ట్టినమూటలను గొంటి" మనుచుఁ గొంద,
తే॥ ఒకట వాగ్వాద, మొకట నాయుధముఁగొనుట,
పాఁతఱలఁ బెల్లగించుట, బందిగొనుట,
యాదిగా నందుజరుగు కార్యక్రమంబు
వేఱువేఱ కొందఱుభటుల్ వినిచి రంత॥ 101

మ॥ "పరదేశీయ వణిగ్వ్యారాలయము లీప్రాంతాన లేకున్కిఁ, నె
వ్వరు వారున్ మన కడ్డురాకునికి, స్వస్వస్థానముల్ గాచుచున్
బరివారమ్ముల నిల్పుకొంటఁ గని తద్వైరంబునన్ బోక, మి
మ్మరయన్ వచ్చితి నాజ్ఞవేచి" యని సైన్యాధీశుఁడొక్కఁ డనెన్॥
మ॥ "ఇనయత్ఖానుఁడు కోటలోఁ జణిఁగె, నెంతేఁ గోట దుస్సాధ; మం
దున దానిన్ వెకలింపఁబోక, పురమందున్ రాజకార్యాలయం
బని యెందున్నను దాని లోఁగొనుచు, నానానూన సామగ్రులున్
ధనముల్ దెచ్చితి" మంచుఁ బల్కె నొకసర్దారుండు సన్నాహియై॥
మ॥ "జనులెల్లన్ గుములొచు ఖానునినివేశస్థానమున్ జేరి 'యో
యినయత్ఖానుఁడ! రమ్ము; మాకు దరిలేదే! పాదుషాగారిపా
లన మిట్లున్నదె! మిమ్మునమ్మికొని గొల్లంబోతిమే!' యంచు నా
తని నోనాడి" రటంచుఁ బల్కె నొకసర్దారుండు సంతోషియై॥ 104

తే॥ "యవనులమసీదు - లచటి క్రైస్తవులమంది
రములు - హైందవ దేవాలయములు చొరక,
పేదసాదుల నంటక వెడలునట్లు
నడిపితి బలంబు" లనె సైన్యనాధుఁ డొకఁడు॥ 105

చ॥ జరిగినకార్యమంతుఁ దనసైన్యపతుల్ నడిపించుతీరు ని
బ్బరముగ నాలకింపుచు, శివప్రభుఁ డర్వావిధంబుసేత కా
దర ముఖముదగ్రి సూపి, బెడిదమ్ములుసేతకు ధిక్కరింపుచున్
సురథపురంబు పాగ్రిభవశూన్యముగా ముగియించె ముట్టడిన్॥ 106

చ॥ అయిమదినమ్ము లిట్లు పురమంతయు దండుగుఁజట్టి, కోట్లకుం
బయిగ ధనమ్ముఁగొట్టి, యరిపక్షములోఁకువ నారఁబట్టి, ని
ర్భయముగ సంచరించి శివరాజు బలమ్ము మరల్చి పీటికిన్
బయనముఁదీర్చె -నా ధనము బండ్లు కరుల్ హరు లెన్న మోయఁగన్॥

ఉ॥ "ఇంతటఁ దీఱిపోయెనని యెంచకుఁ, డీ మొగలాయిపొత్తు మీ
కెంతకుఁబాయ దంతవఱ కీయడియొత్తులు తప్పవాట, వి
క్రాంతినిఁజూపి పీరియధికారముఁ బాపుఁ" డటంచు నూరిలో
నంతటఁ జాటఁబంచి, చనె నాతఁడు రాయగడమ్ముఁ జేరఁగన్॥ 108

తే॥ మనసుచిన్నవోయి మఱుఁగుచు, నవురంగ
బాసులోన నులికిపడు సయిస్త
ఖానుఁ డింతయెఱిఁగి సేనలఁ బంపె, శా
త్రవులు తెఱచియున్నతలుపుమాయ॥ 109

ఉ॥ చారులుదెల్పఁగా జరుగుసంగతులెల్ల నెఱింగి, పాదుషా
గారు § "సయిస్తఖానుఁ డధికారముచాలనివాఁ" డటంచు ని
ర్ధారణసేసి, ధీరు యువరాజుఁ గుమారు 'ముజప్రభున్' సుబే
దారునిఁజేసి పంపెఁ ద్వరితమ్ముగ దక్షిణపీఠభూమికిన్॥ 110

§ The Emperor heard of the disaster .... and ascribed it to the

తే॥ ప్రబలతరుఁడౌ శివాజిధూర్తత నడంపఁ
జాలని సయిస్తఖాను బెంగాలుసీమఁ
జేరఁగాఁ బంపి, జస్వంతసింగు నందె
నిలిపె, యువరాజునకుఁ దోడుసలుపుకొఱకు॥ 111

ఉ॥ "దక్కనురాజ్యముల్ మనకు దక్కఁగనీని శివాజి నెట్టులేఁ
ద్రొక్క" మటంచుఁ దండ్రి తనతో ననియుండ, ముజంప్రభుండు దా
నక్కడఁజేరి వేడుకల నాటలఁ బాటల వేటలన్ గడున్
జొక్కుచునుండె; భోగవివశుల్ నిజధర్మము నిర్వహింతురే!॥ 112

షాజీ మరణము - శివాజీ విచారము.

చ॥ సురథపురంబు కొల్లగొని శూరుఁడు శ్రీశివరాజు వేగ 'రా
యరిగడ' మందుఁజేరుసమయమ్మున కొండొకవార్తవచ్చె - "భూ
వరుఁడు షహాజి వేఁటనడుపన్ జని వచ్చుచుఁ, ద్రోవఁ 'బేదనూర్'
పురికడఁ దేజినుండిపడిపోయి గతించె" నటంచుఁ దీవ్రమై॥ 113

చ॥ పిడుగునుబోని యీనుడి చెవిన్ బడఁగా శివరాజు ఖిన్నుఁడై
తొడిఁబడుమేన నెవ్వగలఁదూలుమనంబున వాడుమోమునన్
నడిచి, విషాదవిక్లబ జనమ్ములమోము గనంగలేక, చె
ల్వ్వడిగినమేడకున్ జనె నయోమయ గాఢతమో విలీనుఁడై॥ 114

సీ॥ తనుఁ గనుటాది చూపినవత్సలత తలం
పులఁ బాఱఁ గరఁగుఱెప్పలను దుడిచి,
తనకోసమయి భరించిన తీవ్రవేదనల్
తలపోయు గుండెతత్తఱముఁ గుడిచి,
తన దేశ మత జాతి ధర్మరక్షణ గోరి
పడినపాటున గాఢభక్తిఁ గఱచి,
కడసారి తనుఁజేరి కనుఁజేఁపి యమృతంబు
గురియుమాటలఁ జల్వహారలు తెఱచి,

Viceroy's negligence and incapacity. P. 104, *J. N. Sarkar*.

తే॥ యాకసముపోలెఁ దన్నెందు నావరించి
యున్న పెనుప్రాపు విరియఁ - దా నొంటిపాట
నిలిచి నల్లెంచి, మనసంటి తెలియరాని
మరులుపొంగున శివరాజు కరఁగిపోయె॥ 115

చ॥ కదలినగాలి తండ్రి దరిగా సగపాలగు తల్లివై పురన్
గదియఁగ, నామెయూపు తడికన్నులతో, విడఁబాఱువేణితోఁ,
గుదిలినబుగ్గతోఁ బసుపుఁగుంకుముఁబాసిన ఫాలరేఖతో
మదిఁ గనిపింప నెవ్వగలమ్రగ్గి శివప్రభుఁ డొల్లఁబోవుచున్॥ 116

ఉ॥ "ఇంతలు సేయునే విధి! యొకింత కొఱంతయులేక శాంతియున్
దాంతియు దైవభక్తి జననవ్రతమై మను పుణ్యమూర్తి కీ
వంతలు రాక యొప్పునె! తపంబు పతివ్రత కిట్టిదంచు దృ
ష్టాంతముసేయు సాధ్వి కిది యగ్నిపరీక్షకుఁ దక్కిపోవునే!॥ 117

సీ॥ ఏ నీడచల్వలో నెద నూఱడించి, నా
తలిరుఁ బ్రాయపు వసంతములు గడపె,
నే ప్రేమపాత్రులో నింతసాపడి, మను
ద్యమ బీజకృతి వానతఱులు గడపె,
నే ప్రాపుమంచియ లెక్కి, నేఁజెంచుపై
రులకాపుగడ శరత్తులను గడపె,
నే ధర్మపీఠిఁ జోఁజెనసి, పండినపంట
చవిఁగొంచు శిశిరఘస్రములు గడిపె,
తే॥ ఆ మహాభాగ్య మొకఁడులే - కన్నియుండి
యన్నియును లేనిదై, మరణైకశరణ
మెంచి శోకసమాధి సాధించు తల్లి
మొగము నెటుసూతుఁ! జూడ కేపగిది నిలుతు!"॥ 118

చ॥ అను తలపోఁతలన్ శయనమందె శివప్రభుఁ డా విషణ్ణమూ
ర్తినిఁ గననోడి, యోడినమదిన్ బరమెల్లఁ దపించె; నంత నా
య్యనఁ జని పింగళేసచివుఁ డౌచితియుక్ దగ వోర్మి గూర్చి, నే
ర్చిన హితసూక్తు లీగతి వచించె శివప్రభు నూఱడించుచున్॥ 119

చ॥ “అవును, మహాప్రభూ! విధినియంత్రణ యట్టిది; యెట్టివారికిన్
భువనములందు నిట్టివిధముల్ మఱి క్రొత్తలె? తీరమాఁగుపం
డవు షహాజీవిభుండు సుకృతాత్ముఁడు: ధూర్వహు మిమ్ముఁగాంచుటే
యవిరళ తత్తపఃఫలము: లంతటివారికిఁ జింత సేతురే!॥ 120

చ॥ జరిగినదెల్ల లోకసహజమ్ము; నిజమ్మున కాయదృష్టముల్
జరిగినవారు లేరు; మనచక్కటి దిద్దఁగ నెల్లకాలమున్
గురువులు నిల్తురయ్య! తమకున్ వినిపించెడుపాటివార లె
వ్వ! రిదియటుండ - నొండొకటి వచ్చుటఁ గూడఁ దలంపుఁ డియ్యెడన్॥

చ॥ మునిఁగిన జీవయాత్రఁ గడముట్ట ముగింపఁ దెగించు జీజియా
జననిఁ దలంపుఁ; డాపరమసాధ్వి మతంబు మఱల్ప మాకు మా
కనువగునే - త్వదీయ వినయానునయ ప్రణయానురోధముల్
దనిపిన ప్రార్థనాంజలికిఁ దప్పఁ? ప్రభూ! యిపు డొల్లఁ బోదురే!॥ 122

చ॥ ఎదిగెడు రాజ్యలక్ష్మి నొకయెత్తు - నిరాశకుఁ బ్రాణవృంతముల్
చిదిమెడు మాతృదైవతముసేవ యొకెత్తుగ నుద్ధరింప, నీ
యెద నొకతప్పపాటయిన నాఁగఁగ రానిది; దైవమిట్లు మీ
హృదయపరీక్ష సేయునని యెంతుఁ, బ్రభూ! కనుఁ డుత్తరక్రియన్”॥

చ॥ అని వినిపించుపల్కులఁ గృతాదరుఁడై, శివరాజు మంచువా
సిన విరిదమ్మి - మబ్బు తెరజిమ్మిన చందురునట్లు తెల్విఁ బొం
దిన మొగమెత్తి, ముందు గమనించి విధేయములన్ విధింప నూ
ల్కొనియె; వివేకవిశ్రుతులకున్ క్షణికమ్ములు మోహమూర్ఛనల్!॥

చ॥ తరఁగలు దారసిల్లు రుదితమ్ములఁ జుమ్మలువాఱు తల్లి డ
గ్గఱి; శివరాజు శాంతిచులుకమ్మున లోమరులంటుపల్కులన్
దరికొనువేఁడి నార్చి, యెడఁదన్ నెనరూర్చు కడిందిపూనికన్
మరణవినిశ్చయం బుడిపి, మైకొలిపెన్ మమతానుబంధముల్॥ 125

చ॥ చలచలఁ గ్రాఁగుపాలు - నలుచక్కియసాగిన గాలిసోఁకులన్
గలఁకలుదేఱి మీఁగడలు గట్టుచునుండఁగఁ - గన్నబిడ్డకోఁ
గిలియగు చేమిరిన్ గొని సుఖింపుచుఁ, బ్రాగ్గుణ నామ రూప వృ
త్తుల విడి తన్మయంబయగుఁ; దోరములోఁ జుమి కన్నకూరుముల్!॥

తే॥ పతిమరణ శోకవహ్ని తప్తమగుమనసు
పుత్రవాత్సల్య పీయూషమున శమింపఁ
గనుచు, జీజియా జీవితకాళరాత్రిఁ
గలుగు హైందవోదయరక్తిఁ గనులుదెఱచె। 127

ఉ॥ తీఱినతండ్రికై ఋణముదీఱఁగ నుత్తరలోక సత్క్రియల్
దీఱిచి, శాశ్వతంపుసుగతిన్ గన నుత్తమ దానధర్మముల్
గూరిచి, తద్వియోగమునకున్ మదిఁ గుందెడువారి కూఱటల్
గూరిచి, రాజకార్యములకున్ గొలువిచ్చె శివప్రభుండొగిన్॥ 128

తే॥ పితృధనముపేరుగా రాజబిరుద మూని,
నాఁడుమొదలుగాఁ దనపేర నాణెములను
వెలయఁగాఁజేసి, మొగలు విభుతపైనఁ
దొంటివలె దండయాత్రలఁ దోలనెంచి॥ 129

## దండయాత్రా విజయములు - సముద్రప్రయాణము

మ॥ తనసర్దారులతో వచించె, "మనపై దండెత్తి రాకుండె లోఁ
గిన యీమొగలుసేన; ఖానుఁ డిపు డేగెన్ దూరదేశమ్ముఁ; వ
చ్చినవాఁ డాయువరాజు బాలుఁ - డతులశ్రీ లాలనోన్మత్తుఁ: డా
తనిజస్వాంతుఁడు వానిమీఁఱఁ, డగుటన్ దర్పంబు చూపందగున్॥ 130

సీ॥ గుఱ్ఱపుదళముఁ బైకొలిపి, నేతాజి మో
గలురాజ్య మొకవైపు గలఁచవలయుఁ,
గడఁగిమోరోపంతు కాల్బలమ్ములఁ గ్రిమ్మ
కొని వేఱొకటఁ గొల్లగొట్టవలయుఁ,
గడతాజి సేనతోఁ గదలి, మక్కాయాత్రి
కులనుండి పన్ను గైకొనఁగవలయు,
నౌరంగబాదుతో నహమదునగరు ప్రాం
తమునెల్ల నే దండు తఱుమవలయు,
తే॥ సింహగడమాది మనదుర్గసీమ లేలు
చున్నవారికి మీార లొక్కొక్కఁడుఁగూడ
నెపుడువలసిన నపుడు తోడుపడవలయుఁ;
జనుఁడు మీారు, మీాపనులందు జయముఁగొనుఁడు!" ॥131

మ॥ అని యవ్వీరుల నందఱం బనిచి, సైన్యాటోప మేపారఁగాఁ
జని, యౌరంగపురమ్ముదాఁక రిపురాజ్యంబెల్లఁ గారించె నెం
దును దానై శివరాజు; సైన్యపతులున్ దుర్వారులై గెల్చి రా
త్మ నిదేశంబులఁ; దద్విజృంభణము తద్దన్ మించె నయ్యెవ్వులన్॥ 132

మ॥ జనవంతుం డొకసారి సింహగడమున్ సాధింపఁగా నెంచి, సై
న్య సమూహమ్ములఁ గోటఁజుట్టుకొని సన్నాహంబునన్ బోరె; సై
న్య సమేతంబుగ నింతలో శివవిభుం డచ్చోటికే తెంచి, వె
క్కసపుంబోరున వానిఁదోలె నవురంగాబాదుల్లోఁ దూఱఁగన్॥ 133

ఉ॥ ఈగతి రేఁబవళ్ళు చరియించి, శివప్రభుఁ డొక్కమెత్తునన్
మోగలుసేనలన్ దఱిమి పోరుచునుండ, బిజాపురీంద్రుఁ డ
ట్టాఁగుచుఁ దొంటిసంధి విడనాడి, శివాజి కొసంగియున్న భూ
భాగము లోఁగొనందలఁచి పైకొని, కైకొనెఁ గొన్నిదుర్గముల్॥ 134

చ॥ జరిగినకార్యముల్ విని వెసన్ శివరాజు బలమ్ముతో బిజా
పురపతిసేనఁ దాఁకి, పులివోలెఁ బయింబడి ఖడ్గధారలన్
నఱకుచుఁ దాఱుమాఱొక్కలిపి నల్గడఁ బాఱఁగఁ దోలె; నాఁటి సం
గరమున నాఱువేలబలఁగంబు బిజాపురివైపు రూపఱెన్॥ 135

ఆ॥ వె॥ అంతఁబోక వారిప్రాంతరాజ్యము గొల్ల
గొని బిజాపురంబుకోటదాఁక,
నతనిధాటి కోడి యణఁగి, బిజాపురీ
శ్వరుఁడు తొంటిపొత్తు సవదరించె॥ 136

చ॥ ఇటుల బిజాపురంపుమడు కేపఱఁజేసి, శివప్రభుండు - ము
న్నటివలెరాక మోగలు లణఁగుట నెన్నుచు - వారినాఁగ న
చ్చట బల మింతవెట్టి, పెలుచన్ 'బసనూరు' పురమ్ముఁ గన్నుకొ
ట్టుట కెదనెంచి యేగె సుభటుల్ దనుఁగొల్వఁగ నోడలెక్కుచున్॥

చ॥ † సురథపురంబువోలె బహుశో ధనశోభి యశో వశంబుఁ ద
త్పురమును ముట్టి, యందుఁ బరిపూర్ణధనంబులఁ బట్టి, 'కారువార్'
పురమునుగూడఁ గొట్టి ఘనముల్ ధనముల్ గొనె; నందు నెమ్మదిన్
గఱచిన యాంగ్లవర్తకులు కానుకవెట్టిరి వేయిరూప్యముల్॥ 138

ఉ॥ † పూర్ణజయంబుతోడ గుణపూర్ణుఁ డతండు బలమ్ముఁద్రిప్పి 'గో
కర్ణముఁ' జేరి శర్వుఁ బురఘస్మరుఁ గొల్చుచు దానధర్మముల్
కర్ణుఁడువోలె సల్పి, బలఁగమ్ములఁ గాల్నడఁ బోవఁబంచి, తా
నర్ణవయాత్ర సేయ మనసై చనెఁ దోడిభటాళిఁ గూడుచున్॥ 139

† (శివాజి) బసనూర్ పట్టణముపైఁ బడెను. సురథ్ పట్టణమువలెనే యాపట్టణమును కొల్లగొట్టి యసంఖ్యాధనము సంపాదించి శివాజి గోకర్ణమునకుఁ బోయెను ... కారువార్ పట్టణమువారును కప్ప మీయవలసినవారైరి. ఇంగ్లీషువారు శివాజికి వేయిరూపాయ లప్పనమిచ్చిరి అక్కడనుండి భూమార్గమున సైన్యమునుబంపి తాను జలమార్గమున రాయగడమునకు బయలుదేరెను. పుట. 138 కె. వి. లక్ష్మణరావు.

### ఔరంగజేబు శివాజిపైకి జయసింగును బంపుట.

చ॥ శివపతి దండయాత్ర లిటు సేయుచు దక్షిణవీరభూమిలో
నెవనిని మోయనీక బలు వెక్కుటయుణ్, జసవంతుఁడాది యో
ధవరులు తాళఁజాలక యథాయథలౌట యెఱింగి పాదుషా
రవులుచు, నెట్టిలైన శివరాజు నడంప మదిణ్ దలంచుచుణ్॥ 140

సీ॥ తన రెండువేల సర్దారుల మేల్బంతి,
ఘన రణ శతము గెల్చిన వలంతి,
మును జహంగీరుకొల్వైనయు మేధావి, బా
ల్యమునుండి కఠిన శస్త్రైకజీవి,
రాజపుత్రకులాంబరజ్యోతి, 'కచ్వహా'
క్షత్రియ వీరవంశ ప్రభూతి,
మానసింహుని మన్మఁడౌ నీతివేది, 'యం
బరు' దేశ రాజ్యరమా వినోది,

తే॥ యైన జయసింహు సర్వసేనాధినాథు
సలిపి, యేఁబది వేల సేనల - దిలేరు
ఖానుఁడాది సర్దార్లఁ బెక్కండ్ర నిచ్చి
కొలువులోఁ బెద్దసేయుచుఁ బలికె నిట్లు॥ 141

ఉ॥ "ఓ యసమాన పౌరుషగుణోజ్జ్వలుఁడా! శివరాజు దక్షిణా
శా యజమానుఁడై ప్రబలి సర్వము లోఁగొనుచుంటగాక, య
త్యాయతమైన మా ప్రభుత నాఁచికొనణ్ జెలరేఁగియుండె; నా
మాయమరాటవీరువడి మాన్పనిచోఁ బరువంబు నిల్చునే!॥ 142

ఉ॥ పంపినయోధులా కుఱుచపాటిమరాటకు నోహటింపుచుణ్
గంపితులై యడంగిరి; మగంటిమిఁ గాఁకలుదీఱి, వైరిఁ బా
టింపనిమేటి వీవయిన డీకొని వాని నడంగఁద్రొక్కి : మా
తెంపరియింద్రజాలము మదిణ్ గమనించి పరాక్రమించుమీ!॥ 143

తే॥ నీబలము నీతిచాతురి నెగడఁజేసి,
యతఁడు గతిలేక 'మీఁచిత్త' మనెడుదాఁక
నడుగు మఱలింపకుము, విజయమ్ముగొ" మ్మ
టంచుఁ బాదుషా జయసింహు ననుపుసేసె॥ 144

ఉ॥ అంతటికొల్వులోఁ బెనుగురాప్తులలో మనసిచ్చి పాదుషా
యంతటివాఁడు మెచ్చుకొని యాజ్ఞయిడన్ జయసింగు పొంగి, "దు
ర్దాంతు శివాజి నెట్లయిన దర్పమడంచి జయింతు; నెట్టి వి
క్రాంతినిఁ జూపెనైనఁ దొలఁగన్ జననీ" నని పంతమాడుచున్॥ 145

చ॥ సెలవునుబొంది, సొంతమగుసేనల నిర్వదివేలఁ, బాదుషా
సెలవున వెంటవచ్చు పటుసేనల నేఁబదివేలఁ, దోడుగా
నలము దిలేరుఖానుమొదలౌ సరదారులఁ, జెక్కులౌ పిరం
గుల రణసాధనమ్ములను గొంచు వడిన్ నడిపించెఁ సైన్యమున్॥ 146

సీ॥ చతురంగబలము లుత్సవమొప్ప నడిపించి,
ప్రాంతసీమల నొక్కగంతువైచి,
వింధ్యాటవీ కూటవీథుల డిగఁబాఱి,
నర్మదా పులినసంతతుల దాఁటి,
యౌరంగబాదు డాయఁగబోయి, యువరాజు
నకుఁ బాదుషాహియానతి వచించి,
పునహాపురమ్ముదాపున కేగి, యటనున్న
జసవంతు డిల్లీకి సాగనంపి,
తే॥ అల శివప్రభుఁ డతనిసైన్యాధిపతులు,
దండయాత్రలకేగి రాకుండు టెఱిఁగి,
ఘనుఁడు జయసింగు తనబలఁగములఁ దోలి
యన్నివైపుల శివురాజ్య మాక్రమించె॥ 147

సీ॥ 'కుతుబుదీన్' సైన్యసంతతు లేఁడువేలతో
'జున్నరు' ప్రాంతముల్ చుట్టుకొనఁగ,
నాలుగువేలసైన్యముతోడ 'నితిహాము
ఖాన్' 'పునా' ప్రాంతముల్ గాచికొనఁగ,
మువ్వేల బలము రేఁపుచు 'సయ్యదబ్దులు'
'షిర్వాలు' ప్రాంతముల్ చేకొనంగ,
'దావూదుఖానుఁడు' దళ మైదువేలతో
'రాయరీ' ప్రాంతముల్ అచ్చగొలుప
తే॥ గుఱ్ఱములదండు - పెనుతుపాకులబలంబు
కడఁగి యందందు శృంగాటకములు గావ,
నాజ్ఞయిడి, కార్యశూరుఁ డయ్యంబరీశుఁ
డన్నివైపుల శివురాజ్య మాక్రమించె॥ 148

సీ॥ తమకు సాయముఁజేయఁదగు నంచు బీజపూర్
ప్రభునితో రాయబారములు సలిపి,
శివరాజునకు శత్రులవువారి దరిఁజేర్చి
బలమిచ్చి తమకుఁ దోడ్పడఁగఁజేసి,
కులబంధులకు సైనికుల కసూయ రగిల్చి
కుద్ధులై శివుని మార్కొనఁగ రేఁపి,
యాంగ్లేయులను - జంజిరాధిపులను - బోర్చు
గీసుల నుసికొల్పి యీసుఁబెంచి,
తే॥ ప్రబలతర దుర్గములనెల్లఁ బట్టుకొనుచుఁ,
దక్కినవి డక్కినట్లు విధ్వంసపఱచి,
యంబరీశ్వరుఁ డెందుఁ దానై తెగించి,
యన్నివైపుల శివురాజ్య మాక్రమించె॥ 149

మ॥ పటుసైన్యంబులతోడఁ జన్న శివభూపాలుండు రాఁడయ్యె: ని
క్కటి 'నేతాజి' బలంబుతోడఁ బరరాజ్యప్రాంతముల్ గొల్లగొ
ట్టుట కేఁగెన్: 'గడతాజి' యొక్కఁడు పరాటోపమ్మునన్ దూలె: ని
ల్లటమైనట్లు మొగల్బలంబు నలుమూలల్ ముట్టె నా రాజ్యమున్॥

మ॥ జయసింహుండు స్వకార్య మింతసులువై సాధింపఁగా నాటకు
త్స్మయమున్ బొంది, పురందరమ్మును జయింపన్ మేటిసైన్యంబుతో
జయశీలుండు దిలేరుఖాను మొదలౌ సర్దారులన్ బంపి, ని
ర్భయుఁడై తా సరికట్టె సింహగడమున్ బాహాబలోత్సాహియై। 151

ఉ॥ నాలుగువైపులన్ గిరిగణమ్ములతో బలుపెక్కి, యాకసం
బేలఁగ నాల్గువేలడుగులెత్తున శృంగముపైఁ జెలంగుచున్,
నాలుగుమైళ్ళ వర్తులమునన్ దిగువన్ బెనుకోట - పైన ను
ద్వేలపు దుర్గరాజమయి, వెల్గుఁ బురందర మప్రధృష్యమై। 152

ఉ॥ అన్యులు చేరరా కొరసి యన్నకుఁ దమ్ముఁడువోలెఁ జెంత నై
శాన్యమునన్ 'వజీర' గడ మసాధ్యము తోడయి నిల్వఁగా, నసా
మాన్యమెయారా పురందర మమందజవమ్మున లగ్గవట్టఁగా
సైన్యములెల్ల డీకొలిపి, చయ్యనఁ దాఁకె దిలేరుఖానుఁడున్॥ 153

ఉ॥ కోటకుఁబై శివాజియనుగుల్ - దిగువన్ మొగలాయిసేన బా
హాటముగా నెదిర్చి రణమాడుచునుండఁగ రెండుమాసముల్
దాఁటెఁ; దెగించి కందకముఁదప్పిచు మందురగిల్చి, మొగలుల్
కోట నొకంట సందువడఁగూల్చి చొరంబడి రక్కసింపుచున్। 154

చ॥ యవనవిజృంభణమ్ము నెఱుపారినతెప్పల నప్పళించి, రెం
డవ యభిమన్యుఁడోయనఁ గటారి తటాలునదూసి, వాహినీ
ధవుఁడు 'మురారి' దుర్గపతి దర్పమునన్ బులివోలెదూఁకి, య
య్యవనులఁ దాఁకెఁ, దాఁకి రసమార మరాటులు మావళాభటుల్॥

చ॥ తుముల మహాహవమ్మున గుముల్గుమునై పడ వైరి కంఠనా
ళములను ద్రుంచి, క్రోవికొనసలన్ వెలిజిమ్మ కవోష్ణ రక్తపూ
రముల వసంతమాడి శివరాజచమూపతియున్ భటాళియున్
గమిగొని శత్రుసైన్యముఁ గకావికఁ దోలిరి కోటవెల్వడన్॥ 156

ఉ॥ పర్వతపంక్తినుండి దిగువన్ బడ దూఁకు మహాప్రవాహమ
ట్లోర్వివిధాటిఁ జొచ్చుకొనియున్ గవియన్ బఱతెంచు వైరులన్
బర్వతమట్లు నిల్చి తెగఁబట్టుచు వెక్కసునెట్టుచున్, సమి
ద్ధూర్వహుఁడౌ మురారి తనతోయమువారల నిట్లుపేర్కొనెన్॥ 157

ఉ॥ "పోరులఁ బచ్చినెత్తురులబుగ్గలు కన్నులఁజూచి, మావళే
వీరులునున్ మరాటు లెదఁబేర్చినచిచ్చున మచ్చరింపుచున్
గోఱలఁ గండలన్ జిదిమి కుప్పలుపోయక, నజ్జుగుజ్జుగా
వైరులయంగముల్ దఱిగివైవ కలంతులఁ గాలుమాత్తురే?॥ 158

చ॥ రభసపుదండయాత్ర శివరాజొనరించినవార్తమును వా
గ్విభవమువోసి చారణులు గేయములన్ బచరించువేళ, మా
ప్రభుకుల వీరయోధులును వారియనుంగులు చంద్రతారలై
నభమునఁ దేజరిల్లఁ, బ్రధనంబున మీవడిఁజూపి గెల్వుఁడీ!॥ 159

చ॥ కదలినకాలు త్రిప్పకుఁడు, కట్టలుకన్ బయికెత్తు ఖడ్గమున్
జెదరఁగనీకుఁ, డెవ్వఁ డెడసేసిన దూసిన జాఱనీకుఁ, డీ
పొదివిన శత్రుసైన్యములఁ బుల్మ్రుచు 'హు' ధ్వని యూఁదుదాఁక మీ
పద నుడివోవనీకుఁ, డెడఁబాయ కపాయముఁ బాయఁదట్టుఁడీ!॥ 169

ఉ॥ మించెడు దేనినైన సుతిమించఁగనీ కడఁగించి, ఱొమ్మునన్
దించెడు నీఁటెనైన నలఁతిన్ దొలఁగించి, రణోర్వి నెందు న
ర్తించి, సమగ్రరక్షణ విధించి, మదించిన వైరిగాత్రముల్
చించి కలంచ నేఁగల నజేయుఁడ; లెం డరిసేనఁ గూల్చుఁడీ!"॥ 161

చ॥ అనుచు మురారి సైనికహృదంతరముల్ పులకింప నాడి. పై
కొను నరవీరహుంకృతులకున్ గనలంటి కటారిదూసి, చెం
గున రిపుసేనపైఁ గవిసె; గొబ్బునఁ దద్భటులెల్లఁ బెల్లు మా
ర్కొని: రటు రెండుపక్షములకున్ బెనుసంగరమయ్యె నయ్యెడన్॥

ఉ॥ క్రిందనుమీఁదుఁ జూడక తెగించి పయింబడి, యీఁటెపోటులన్
గొందులుద్రవ్వి, బల్లెములఁగ్రుచ్చి, కటారులవ్రచ్చి, బాకులన్
జందెపువ్రేటునన్ దిగిచి, శౌర్యధనుల్ శివరాజసైనికుల్
చిందులుద్రొక్కి రౌద్రవివశీకృతులై విహరించి రయ్యెడన్॥ 163

చ॥ బిరుసుమగంటిమిన్ మొగలువీరులు బారులుదీరి వైరులన్
దఱుముచు, వారు పైఁబడినఁ ద్రచ్చుచు, లోఁగినవారియంగముల్
నఱుకుచుఁ దారసిల్లి; రయివన్ దెగిపోరు మురారి కోల్తలన్
భరపడి, మూఁడుమార్లొదిఁగి, పైకొని రెప్పటికప్పుడీసునన్॥ 164

చ॥ * భరపడియున్ జమూపతులబట్టున ముందుకుసాగి, శాత్రవుల్
దఱిమినఁ బర్వులెత్తు మొగలాయిబలంబున రెండువేలపో
టరులు గతాసులౌచు నిబిడమ్మగు స్వామిహితమ్ముఁ జూపి; రి
త్తఱిఁ దనదండుఁ బైకొలిపి తాఁకె మురారి యరాతివీరులన్॥ 165

చ॥ * ఒదిఁగెడు నాత్మసైనికుల - నుద్దవిడిన్ బయికొన్న శాత్రవా
భ్యుదయము - నద్వితీయుఁడయి పోరు మురారి భుజామహత్త్వమున్
మదగజమెక్కి దూరమగుమాటునఁ జూచి, దిలేరుఖానుఁ డి
య్యదనున సుంతయేనిఁ దడవైనఁ గడున్ జెడు నంచు నెంచుచున్॥

---

* వాండుగ్రి (మొగలులు) పారిపోవునప్పుడు వారివెంటఁదగిలి దుర్గాధీశుఁడు రెండువేల మొగలుసైనికుల నఱకెను. ... దిలేరుఖానుఁడు ఏనుఁగుమీఁదఁ గూర్చుండి యుద్ధమంతయుఁ జూచుచుండెను. తన సైనికులు పాఱిపోవుట చూచి ... ... నూటిగా బాణమువేసి దుర్గాధిపుఁడైన మురార్ బాజీని పడవైచెను.

పుట. 141. క. వి. లక్ష్మణరావు.

చ॥ పరులకుఁ జూడరాని యొకపట్టున నెట్టన నిల్చి, సూటిగా
గుఱిఁగొని వింట సాయకముఁగూర్చి, పరమ్మున వైరిసేనలన్
దఱుము మురారిపై విడువఁ దత్క్షణ మాతఁడు కృత్తకంఠుఁడై
ధరఁబడె, స్వామికార్య సుకృతమ్మున కాయువు నప్పగించుచున్॥ 167

చ॥ పడినమురారిఁ జూచి చలపట్టుచు మోగలుసేన బిట్టు పైఁ
బడి వివిధాస్త్రశస్త్రములఁ బ్రబ్బికొనన్ శివరాజసేన చే
డ్పడి, కడునల్పమౌటఁ దెగఁబట్టఁగఁజాలమిఁ గోటలోనికిన్
బడి, పయికోటకెక్కి, శితబాణ శిలాతల వృష్టి మార్కొనెన్॥ 168

ఉ॥ మోగలుసేన శత్రుబలమున్ వెనుముట్టి పురందరమ్ముపై
భాగపుఁగోటకెక్క నెగఁబ్రాఁకఁగ, వారు శతఘ్నిగోళముల్
గ్రాఁగెడునూనియల్ పలుశరమ్ములు గండశిలల్ జడిన్గొనం
గాఁగురియించి, శాత్రవనికాయము నెట్టిరి విచ్చిపాఱఁగన్॥ 169

ఉ॥ ఇంతలు సేయు వారి నలయింపఁగఁ జాలక, కోటఁగూల్ప నా
వంతయుఁ దీరులేక, బహుళానలవర్షము సైఁపలేక, వి
భ్రాంతమనస్కులై మొగలుపాళెమువారు పురందరమ్ముపా
యాంతరమెంచి పట్టఁదగునం, చపు డాజతనమ్ము మానుచున్॥ 170

ఆ॥ "మొదట వజీర్గడమ్మురియముట్టి జయింపుచు, దానిపైనఁ బెం
పొదవు పిరంగులెత్తి, యటనుండి పురందరదుర్గ సాలముల్
గుదుపునఁ దూలికూలఁ బడఁగొట్టుద" మంచుఁ దలంచి, దానిపైఁ
గదిసి జయించి, మోగలులు గాఢశతఘ్నుల నెత్తి రచ్చటన్॥ 171

చ॥ శివపతిసైనికుల్ దెగువసేయుచు, నాయకుఁడౌ మురారి యా
హవమునఁ గూలినన్ వెఱపునందక, వేలకువేలు మించి శా
త్రవు లెదిరించి పైఁబడిన దారియొసంగక, జీవితాశలన్
దవులక పోరుచుండి, రెడఁదన్ శివభూపతిరాకఁ గోరుచున్॥ 172

## శివాజీ ఓడప్రయాణము - జయసింగుతో సంధిప్రయత్నము.

చ॥ ఇటు తనరాజ్యమెల్ల యవనేంద్రునిసైన్యము లాక్రమించుచు
ప్పటికి, శివప్రభుం డట నభంగ తరంగ ఘుమంఘుమార్భటీ
నటనములొప్పు నోడపయనమ్ముల నుయ్యెలలూఁగుచుండియుం
దటుకున నాత్మభూమిఁజొరఁ దత్పరుఁడై నడిపించెఁ బైనముం॥ 173

చ॥ కడువడి నోడ వారినిధిగర్భమునం బడి వచ్చుచుండ, వెం
బడిఁ బ్రతికూలకాల మశివంకర హుంకృతి నార్చునట్లు దం
దడినిఁ దుపాను రేఁగె; లయతాండవమాడెఁ బయోధి; గాడ్పులం
బడు నొగుడాకులై చెదరి పాఱెఁ బడెన్ జెడె నోడ లత్తఱిన్॥ 174

ఉ॥ నావికు లీడఁబోనిజతనంబున నా బలుగాలివానలన్
ద్రోవలుదప్పునోడ సరితూనికలన్ నిలఁగట్టి, రాజర
క్షావిధి ముట్ట, సుళ్లకు మొసళ్ళకుఁ బాయఁగనెట్టి, ప్రాణముల్
దైవముచేతఁ బెట్టి, బెడఁదల్ గడముట్టిరి సాహసంబునన్॥ 175

చ॥ నిలిచెఁ దుపా, నపాయములనిండిన యెల్లరప్రాణ - మోడయున్
నిలిచె; విదేశమార్గముల నిల్చిన యోడ మరల్చి నావికుల్
చలనరయంబునన్ నడుపసాగిరి: ప్రొద్దులు కొన్ని పోవులో
పల శివరాజు సేరెఁ బరివారముతోఁ దన రాజ్యసీమలన్॥ 176

తే॥ ఉసురుపందెముగా మహావ్యసనవేళ
గడపి, నిరపాయముగఁదమ్ము గట్టుఁజేర్చు
నావికుల మెచ్చి, యుచితసన్మాన మిచ్చి
సెలవొసఁగి, రాయగడమును జేరె విభుఁడు॥ 177

చ॥ జరిగిన యోడయాత్ర - యిటసాగిన మొగలుదండయాత్ర - దు
ర్భరముగ సాగుచున్న నిజరాష్ట్రజనమ్ముల జీవయాత్ర ని
బ్బరముగ నాకళించి, యటుపైఁ గరణీయము లెంచి, యాప్తులం
దఱిఁ బిలిపించి, యోలగమునన్ శివరాజు వచించె నీగతిన్॥ 178

ఉ॥ "చేసినదండయాత్ర జయసిద్ధియనర్ఘ ధనలాభ మెంతయున్
జేసినయట్లు తృప్తిఁగనఁజేసి, తుదిన్ బ్రతికూలపాకమున్
జేసిన దైవనిర్ణయము చేతులఁ ద్రోయఁగరాని; దైన సం
తోసము నేఁడు ప్రాణములతో మనమందఱ మింటఁ జేరుటన్॥ 179

ఉ॥ మొగలుసేన దేశమునుముట్టుచు దుర్గచయంబుఁ గొంటకున్
లోఁగుటలేదు గాని యొకలో పెసఁగెన్ : నిజధర్మ రక్షణో
ద్యోగమునన్ దెగించి యనిదూఁకి, పురందరదుర్గమం దసు
త్యాగముజేఁసి కన్నుమఱుఁగైన మురారినిఁ దెచ్చికొందమే!॥ 180

ఉ॥ నే దరిలేనియప్పుడు గణింప కరుల్ పయిమూఁకివచ్చు - డం
దేదియుఁ దోఁచరానియపు డించుకయున్ వెఱఁబోక, దుర్గర
క్షాదర ధీరుఁడై యుసురు లర్పణసేసిన వీరవిక్రమో
న్మాది మురారి! వానియభిమాన మదెంతని తూఁచవచ్చెడున్!॥ 181

మ॥ మన బాజీప్రభుకాలిజాడ లవిగో! మందాకినీ వాలుకా
యనవీధిన్ దెరమాయకున్న; నపుడే యవ్వాని వెన్నంటుచున్
జనె వీరుండు మురారి; యీ 'ప్రభు' మహాసంతాన మిట్లంతరిం
చినచోఁ గంబములేనిమేడ భరతశ్రీ యెట్లు రాణించెడున్!॥ 182

చ॥ కడచినదానికై వగచి కార్యములే, దలవారి నెత్తుటన్
దడిసిన వీరభూమికి స్వతంత్రత నీ సమకట్టుఁ : డిప్పు డే
క్కడు రిపుసేనతో నెదిరి కుత్తుకబంటి రణమ్మునన్ భరం
పడు మన వీరయోధులకు బాసటగా నరిసేనఁ దోలుఁడీ!॥ 183

చ॥ అనుచుఁ, బురందరమ్ము మొదలౌ నిజదుర్గములందు శత్రువా
హిని నెదిరించి తోడ్పడ ననేకబలంబుల - సైన్యనాథులన్
బనుపుచు, మంతనంబుసలుపన్ మనసై రఘునాథపండితున్
ఘనుఁడగు పింగళేసచివుఁ గన్గొనుచున్, శివభూపుఁ డిట్లనెన్॥ 184

చ॥ "ఇది ప్రతికూలకాల: మిపు డెట్లు తెగించుటకైన జంకుచు
న్నదిమది - యేవిపర్యయమునఁ బడునో యని; యిందు హైందవా
భ్యుదయము కుంఠితంబగుట యొప్పదు, 'తొందరవోయి' రన్నమా
ట దగదు; కార్యముఁ బుడిసిటఁ గొని చూతము, చూత మావలన్!॥

సీ॥ * మన మెంతమెలఁకువ గొనియున్న దైవ మి
    య్యెడ నేమఱించి యిక్లిడము సేసె;
నది కారణమ్ముగా నభిమాని సముదీర్ణుఁ
    డయి, ముందుఁబడి దేశ మాక్రమించె;
మనసైన్య మెంతయున్నను నిరంతరయుద్ధ
    ముల డస్సె, సాధనమ్ములును దఱిఁగె;
జయసింహుఁ డధిక తేజశ్శాలి, యతనిసై
    న్యము లక్ష, సాధన మక్షయంబు;

ఆ॥ వె॥ కదిసి, నాల్గుమొనలఁ గట్టు దిట్టముసేసి
బలిసి, దూఁకుచున్నవాఁ డతండు,
మూలఁబడిన శస్త్రములను - దూరముచన్న
భటుల వెదకి తేరవలసె మనకు॥ 186

మ॥ * మన యుద్యోగులు జాతిబంధువులు సామంతాధిపుల్ గొంద ఱా
తనికిన్ దోడయినట్లు తోడుపడు సంధానమ్ము లున్నట్లు సూ
చన లేతెంచుచునున్న : వీ యుడుకులో సామంబునన్ వీరి లోఁ
గొన వీలున్నదె? యందఱిన్ గలిపి మారొక్కనైన మేలున్న దే?॥ 187

ఉ॥ * ఇంతలుగా బిజాపురనరేశ్వరు - లీ యబిసీనియా ధరా
కాంతులు - పోర్చుగీసులు మొగల్ సరదారుని ప్రోద్బలమ్మునన్
బ్రాంతము లాక్రమించెడు నెపమ్మునఁ జైకొని వేచియుండి, రే
కాంతవిరోధ సాధన సహాయముగా సమయమ్ముఁ గోరుచున్॥ 188

* Pages 125 - 130. J. N. Sarkar.

ఉ॥ ఈవిధి నెందుఁగన్న సుడిమెత్తులతోఁ బ్రతికూల నీల వా
తావరణంబు నేఁగి విలయంబగుదందడి నార్పుచుండ, రో
షావిలతన్ బలాఢ్యు నభియాతి నెదుర్కొనుటీతిఁకంటె - శాం
త్యావహమైన సంధి నిరపాయపథమ్మని చూడఁగూడదో!॥ 189

చ॥ 'తిమిరము లూడ్చి బాలరవిదీధితులన్ వెలయింప, నెండవేఁ
డిమి యెడలించి వెన్నెలజడిన్ గురియింప, లయాంతవేళ న
వ్య మధురసృష్టి నింప సముపాస్యము సంధి యవశ్య' మందు రు
త్తము; లది లేక యీభువనధాత్రికి రక్తపిపాస తీఱునే!॥ 190

ఉ॥ ¶ కావున, సంధి నేఁ డుచితకార్యముగా మది నెంతు; దీన రాఁ
బోవు జనక్షయం బడఁగు, ముట్టినవైరులు పట్టుఁబాయుచున్
బోవుదు, రింతలోవఱకు ముం దెడమిచ్చిన తప్పు వాయు; ఆ
పై విహితంబు లప్పటిశుభమ్ముల కొప్పుగఁ జూచికోఁదగున్॥ 191

ఉ॥ కొంత రణంబుసేసి మనకున్ బరువౌ తెరువైన, 'సంధిగా
వింత' మటన్నరీతియు వివేకముగాదు; పురందరమ్ము
సాధింతురు, కొండనాగడము తీఱకపో, దటుపైన సంధి మ
న్నింతురె? వారుఁగూడ గమనింపరె శత్రు బలాబలమ్ములన్?॥ 192

చ॥ మనమును మోగలుల్ పెనఁగిమార్కొనుచో జయమైనఁ గాకపో
యిన నది వేఱుదారి: తఱిమెంచి బిజాపురమాది వైరు లి
య్యనిమొన నిల్తు, రప్పు భరమౌఁగద యుద్ధము — సంధిగూడఁ; గా
వున మొద లిందు సంధివెరవున్ గొని, వారి నడంత మవ్వలన్॥ 193

---

¶ "With his usual foresight........he (Shivaji) resolved to interview Jai Singh." Page 149. *J. N. Sarkar.*

"This resolutiou was not suddenly adopted in a moment of despondency. ........ There must have been some deep-laid scheme of policy which justified to him and his councillers the course he pursued." P. 104 *M. G. Ranade.*

చ॥ అమితముగా బలంబును సహాయము సాధన మొప్ప, మున్నె దు
ర్గములనుబట్టి పైఁబడు మొగల్ సరదారుఁడు నేఁడు సంధికా
ర్యమునకు వచ్చునే యనుట యస్వామ; రాఁడనుకొంచు నీతితం
త్రము నడిపింత; మాపయి దురమ్ము తిర; మ్మది రేపుమా పగుణ్"॥

చ॥ అనుటయుఁ బింగళేసచివుఁ డాడె, "నిజమ్ము, మహాప్రభూ! సనా
తనమగు రాజధర్మమిది: తాను బలాధికుఁడయ్యు లోకశాం
తిని మదిఁగోరి సంధిపరిణిప్తితుఁడై, రిపునైనఁ బొందుకో
ల్పిన ధరణీధవుం డెనయు విశ్రుతకీర్తిఁ బ్రజానుమోదమున్॥ 195

చ॥ చివరకు సంధికా దయినఁ 'జేయుట త' ప్పనరాదు: దీప శా
స్త్రవుల విధానమున్ బలము తంత్రము గుట్టు నెఱుంగవచ్చు: వె
న్దవులుచు వానికిన్ బ్రతివిధానములన్ నడిపింపవచ్చు: నా
హావమున కైనవెల్ల మన మారసి కూర్పఁగవచ్చు నింతలో॥ 196

మ॥ స్మయమే వారల కుండుఁగాక, మనమే సంధింప రాకుందు రే
జయసింహుండు దిలేరుఖాను? మనతో సంగ్రామమున్ జేయుటల్
జయకాంక్షన్ గద? యూర కయ్యది లభించన్ వారు సంధింప సం
శయ మేమున్నది? 'కాదు కూడ' దనుచున్ స్వర్గంబు సాధింతురే?॥

సీ॥ మొనమొప్ప జసవంతుఁ డనదయై పాఱె, యూ
రంగ బాదునఁ దూఱు భంగమెఱిఁగి,
తమతోడి మేటిసర్దారుఁడైన సయిస్త
ఖానుని వ్రేళ్ళుతున్కలను జూచి,
యబ్జులుఖానుతో నగుఘోరఁ బులిగోళ్ళ
నలిమైన వానిపేవ్రులఁ దలంచి,
జనకవిద్రోహమున్ జలుపు బాజీఘోర
పటుశిర మ్మూఁటెఁ గ్రుచ్చుటను దడవి,

తే॥ ప్రాణవాయువు లొకచేతఁ బట్టికొనుచుఁ,
గొలువుఖడ్గ మొండొకచేతఁ గునుకుచుండ,
మొగలుసరదారు లెట్టులైన మొగియుసంధిఁ
గాచెదరుగాక చావుకై వేచినారె!॥ 198

మ॥ మనకన్నన్ మునుమున్న సంధియొనరింపన్ వారు సంసిద్ధు లం.
చని యేనెంతు: నుదారబుద్ధిఁ దమ కీయాగంబు సాగింపఁ బూ
నిన దే యెక్కువ: యిందు మీమతముకంటెన్ వారు గోరంత మిం
చినటుల్ గోరిననైన, వారిమతమున్ జెల్లించుటే మేలగున్!॥ 199

చ॥ ఇఱుకునఁబడ్డ కార్య మొకయెత్తున నెత్తుట నీతి: యందుపై
జరిగినలోటుపాటు లొకచక్కటికిన్ గొని తేరవచ్చు: మీ
రెఱుఁగని దున్న దే, తరుణమెంచి విధింపుఁడు సంధి; దీనియం
తరములు సంతరింప నుచితజ్ఞునిగా రఘునాథు నెంచెదన్!"॥ 200

చ॥ అనఁగ, శివప్రభుం డుపగతాదరుఁడై రఘునాథపండితున్
గని, "చను మీవు: చేయఁగలకార్యమునం 'దిది యిట్లు' లంచు వా
కొనఁ బనిలేదు - నీ వఖిలకోవిదమూర్తివి: మాటనేర్పునన్
మనసులుముట్టి, యెట్టియనుమానము లేదనఁ బొందు సేయుమీ!॥ 201

తే॥ వారిబలముచు, బాదుషాగారిచలము,
మనకుఁగలచిక్కు సంధిలో మఱచిపోకు:
మచటి జయసింగు హైందవుండగుటఁ గఱచి,
కలిపికొనిరమ్ము మనవైపు కార్యసిద్ధి॥ 202

ఉ॥ చేయఁగలంత పొందుపడఁజేయుము కార్యము నీవు, నీకునున్
జేయఁగరాని దే మనువుసేయఁగ దారులు తీసిరమ్ము, వేం
చేయు" మటంచు వీడ్కొలిపి, శ్రీశివభూపుఁ డవశ్యకార్యముల్
సేయఁగఁ బింగళేసచివుఁ జేకొని యేగె నిజోద్యమంబునన్॥ 203

చ॥ అనుపమ రాజనీతి విదుఁడౌ రఘునాథుఁడు సత్వరమ్ముగాఁ
జని, జయసింహు మైకొలిపి సంధివిధానము సంప్రతించి, యా
తని ననుకూలపర్యవసితంబులకున్ మఱలించి, యందు వం
చనయు నపాయమున్ గలుగఁజాలమి నెమ్మది నిశ్చయించుచున్॥ 204

చ॥ శివపతిఁ జేరి యిట్లని వచించెఁ, "ప్రభూ! మొగలాయిషాహిమున్
దవులుచు నందునందుఁగల తత్త్వ మెఱింగితి: నిశ్చితాహవో
త్సవమునఁ ద్రుళ్ళు సైన్యములు సాధనముల్ బలుపెక్కు పెక్కులు
న్నవి: జయలక్ష్మి యీవయిపునన్ ములు మ్రొగ్గెడు పెంపు గన్పడున్॥

ఉ॥ అగుట, దిలేరుఖానుమొదలౌ సరదారులు గొంద ఱందుఁ బొం
దగు తెఱఁగెంచ: రైన సకలాధికుఁడౌ జయసింగుమాట దీ
టగు: నతనిన్ గదల్చి విహితాహితముల్ వివరించి సంధికిన్
దిగునటు సంతరించితి; గణించితి వాని మనఃప్రవృత్తులన్॥ 206

ఉ॥ ఆతఁడు కార్యవేది, సమయజ్ఞుఁడు, సంగరరంగ ఫల్గున
ఖ్యాతుఁడు, జాతి నీతి మత గౌరవముల్ మది మెచ్చువాఁడు: మీ
చేతను నిండుప్రీతిఁ గనఁజేసి, సమక్షమునందుఁ బొంద ను
ద్ఘాత పరస్పరప్రియముగా సమకూర్పఁగ, మిమ్మురమ్మనెన్!॥ 207

ఉ॥ 'మాకడ నేయపాయ మనుమానపడన్ బనిలేదు మీ: కలుల్
మీకడ మాకు, నిట్లుభయ మిత్త్రిత మే' లని మూదలించె; మా
యా కవచంబు లేదని యథార్థ మెఱింగితి వానిమాటలన్
బోకడలన్; ప్రభూ! సమయమున్ నయమున్ జయమున్ గ్రహింపుఁడీ"॥

చ॥ అన విని సావధానముగ నందలి పొందిక లేర్చి కూర్చి సై
కొని, జయసింహుఁ జూచుకొఱకున్ జననెంచి శివప్రభుండు ముం
దనుపులు మీఁదిరక్షణము లారయుచున్, రఘునాథు ముందుగా
ననిపి, భటాళితోఁ జనె స్వయమ్ముగ సింహగడమ్ముఁ జేరఁగన్;॥ 209

చ॥ † శివపతి వచ్చుచుంచి, జయసింగ తనిర్ణి గొని తేర నాత్మ సై
న్యవిభుల రాజపుత్రకుల నంపి, స్వయమ్ముగ ద్వారసీమచే
రువ కెమరేగి, నెయ్య మనురూపముగాఁ గరమంటి తెచ్చి, గౌ
రవము హితానులాప మొనరన్ గుడిసైపునఁ జేర్చెఁ బీఠమున్॥ 210

శివాజీ జయసింగుల సమావేశము - సంధి.

ఉ॥ ఆదర మేదురంపు మరియాద - లభేద ప్రహ్లాదరోచితా
స్వాదములౌ తదుక్తులు శివప్రభుఁ డారసికొంచు, భావికా
ర్యోదయ దోహదమ్ములుగ నూఁకొనుచున్, గుశలానుయోగ సం
వాదము పూర్వరంగమగు వైఖరిగా వచియించె నీగతిన్॥ 211

చ॥ "ఇది సుదినమ్ము : మిమ్ముఁగను టెంతయు వేఁడుకగాక సూచితా
భ్యుదయముగా మదిన్ మెదలుచున్న; దొకానొక రాజకార్యపుం
గుదిరిక సేఁతకై యొకటఁ గూడినయట్లులుగాక బాంధవం
బొదిగినయింట విందుకుడు పొందుటగా మది యూఱడిల్లెడున్॥ 212

మ॥ కలకుంగత్తుల నృత్తముల్ మెఱపులై గర్జాధ్వనుల్ మించి, ము
మ్మరమై యొందఁ బిరంగిగుండ్లపిడుగుల్ మారొత్రియఁగాఁ, బచ్చినె
త్తురుటేఱుల్ ప్రవహింపనున్న యదనందున్ ముందుకుందూఁకి, నీ
యుఱచే యెత్తితి వానినాఁప, జయసింహా! ధీర శాంతిప్రియా!॥ 213

చ॥ అరిజన కంఠలుంఠన విహారములన్ బదనెక్కియున్న యి
ర్వురకరవాలముల్ నిదురవుచ్చి, మనంబును విచ్చి, బుగ్గలన్
నెరసిన పండుమీసములనీటున సంధివచః ప్రసంగముల్
జరుపఁగనున్న నీకనులశాంతిఁ గనన్ మది చల్లనయ్యెడున్॥ 214

† Jai Singh immediately sent his secretary Udairaj and Ugrasen Kachhwa to meet him on the way.........At the door of the tent he was welcomed by Jai Singh's Paymaster and ushered in .... The Raja advanced a few steps, embraced Shiva and seated him by his side. Page 151. *J. N. Sarkar.*

ఉ॥ పుట్టిననాఁటఁగోలె రసపుత్రకులోచిత వీరలక్ష్మికిన్
బట్టముఁగట్టి, శాత్రవ కపాలములన్ నులివెచ్చనెత్తురుల్
వట్టుచుఁ, బాదుషా విజయలక్ష్మికి దప్పినిదీర్చు నీవు నేఁ
డిట్టి ప్రసన్నమూర్తి వగు టెంతయు భావిశుభమ్ము వల్కెడున్॥ 215

చ॥ కడచినకాల మిట్టిదనఁగాఁ బనిలే: దొకయింటివారమై
యడిపముఁ బట్టి హైందవధరాభ్యుదయమ్మున కొక్కమున్నునన్
బడఁదగువార: మిందుఁ బ్రతిపక్షులమై యొకజాతిరక్తముల్
మడుఁగుల నింపువేళ ఋజుమార్గము దైవము చూపె నీగతిన్॥ 216

ఉ॥ ఆ యవురంగజేబు సమయజ్ఞత మీఱఁగ నిన్ను వాహినీ
నాయకుఁజేసి పంపె, నిది నాకుఁ బ్రియంబు; రణంబుగల్గు దోఁ
జేయఁగలట్టి సాహసము చేతులనిండుగ నున్న దైన, జా
తీయహితంబు 'పెద్దలు విధింతురుగా' కని మిమ్ముఁగోరెదన్॥ 217

చ॥ ఒకయధికారివంచు - నొకయోధుఁడవం - చిది రాజ్యతంత్ర నా
టకయని వేసముల్ గొని నటించుటగాదు: పురోభివృద్ధి చిం
తకుఁడగు నాత్మబంధువను నమ్మిక నెమ్మదిఁ బెద్దసేసి, తా
వక ముపదేశముల్ గొనఁగవచ్చితి; మేలుదలంపు మియ్యెడన్॥ 218

ఉ॥ సంధి ఘటించువేళ 'నిటుసల్పిన మే' లను కోర్కె లేదు, ని
ర్బంధము లే, దదెట్లయిన బాధయు లే; దొక లేనిపోని సం
బంధముఁ గౌఁగిలించుకొని, భారతభూ మత జాతి ధర్మ గా
ఢాంధ తమిస్ర మూడ్చుకొఱకై పలుపోకలఁ బ్రాఁకులాడెదన్॥ 219

ఉ॥ † నా యుదరైకమాత్ర భరణమ్మున కింతలుసేయ నేల రా
ధేయుఁడనైనఁ జాలు: నది తీయముగాదని యెంచికొన్న గా
ధేయుఁడనైనఁ జాలు: నొకతెంపున రెంటికిఁబోక మాతృదా
స్యాయతిఁ బాపు తార్క్ష్యుఁడనయై బయలెక్కుట నిక్కె నీతోడల్!॥

† Page 82. *M. G. Ranade.*

ఉ॥ 'ఇంత - ఇదెంత లే' మ్మనెడు నెన్నికలన్ దలమీఱు పోకడన్
బ్రతుకు సూపి, చిక్కువడుపట్టున నెట్టఁగఁజాలనేమొ! నీ
మతటెక్కుండి యింతవఱ కైహికజీవిత సర్వసార సి
ద్ధాంతముఁగొంటి; వ య్యనుభవాతిశయం బొకవ్రేలఁ జూపుమీ!॥

చ॥ ఒకట బిజాపుకేంద్రములు, మఱొక్కట మొగలుసార్వభౌమ్ము, లొం
డొకట మరాటపీరులు, మఱొక్కయెడన్ రసపుత్రశూరు, లి
ట్లొకరి కొకళ్ళు సాయపడియున్ - వికటించియుఁ దారసిల్లు టెం
దుకు? మతభేదవాదములఁ దుందుడు కెంను కటంచు నెంచెదన్॥ 222

ఉ॥ మానవు లంద ఱొకను సమానులెయయ్యుఁ, బరస్పర మ్మపా
దానము వేఱుగాఁ బలు మతమ్ములవా రయి, సంప్రదాయ శి
క్షా నుభవమ్ములన్ బహువిధాంతర సంఘములై, స్వతంత్రతా
మానము లేక స్వస్వమతమాధురిఁ గ్రోలుట యుక్తమేయగున్॥ 223

ఉ॥ ఒక్కట గుంపుగూడి, తమకొప్పినరీతి స్వతంత్రవృత్తిఁ ది
ర్యక్కులు నుండు: నైన నితరప్రతిరోధముసేసి తాము లా
వెక్కఁదలంచి పోరు, నిదియే పశువృత్తి; వృథాభిమాను లొ
క్కొక్కపు డిట్లు రేఁగి, మతయుద్ధములన్ బలియిత్తు రాత్మలన్॥ 224

ఉ॥ హైందవభూమి నొక్కమతివకాచు నవాంతరశాఖ లున్న, 'మే
మందఱ మొక్కహైందవుల' మన్న మమత్వము సోదరత్వమున్
బొందికఁ బాయ: దయ్యరఁటిమొగ్గ తుదిన్ గొలనిక్క పూఁతయున్
బిందెయుఁ గాయ పండు గుదివ్రేలెడు పొందిక విందు గొల్పదే!॥ 225

చ॥ వివిధములైన పుష్పఫల వృక్షము లొక్కవనమ్మునందుఁ బెం
పవు: నగునప్డు వాని కనువౌ విడిపాదులఁ బ్రోదిఁగన్నచో
నవి యవి యన్నియున్ బెరుఁగు: నట్టులుగా కొకపాది నన్నియున్
గవిసిన, గాలితీవియలకాఁకకుఁ బెంపుడు మొక్క లెక్కనే?॥ 226

చ॥ $ మనమత మిప్పు డీగతిఁ గ్రమంబుగఁ బెంపఱుచున్న; దల్ల యా
వను లిటఁ జేరి, సంఘబలవంతులు - రాజులు - శస్త్రధారులై
మనుకొని సర్వమున్ స్వమతముద్రకు మార్పఁదొడంగి: రిట్లుపై
కొనునుడు కేల? స్వార్థ మనుకొంచుఁ బరార్థముఁ బాపవచ్చునే?॥227

చ॥ ఇది మనభూమి; యార్యమత మే వితతంబుగ నిందు వెల్గుచు
న్నది; మనదేశవాసు లగునప్డు మతాంతరమయ్యు వారు సౌ
హృదమున మల్లికాలత యొకెత్తు - గులాబి యొకెత్తుగాఁగ నె
మ్మదిఁ గనఁబోలదే! దురభిమాన పరాక్రమణంబు గూడునే!॥ 228

ఉ॥ ¶ తాతలనాఁటినుండియు నుదాత్త గుణోత్తరులైన రామ మాం
ధాతలనాఁటినుండి భరతక్షితిఁ బూజితమౌ మతంబు చే
యఁగాఁతకుఁబాసి చేష్టడుచునుండఁగఁ జూచి సహింపలేక, నే
నీతెఱఁ గుద్యమంబు వెలయించితి మించిన సాహసంబునన్॥ 229

చ॥ తలఁచినదానికంటె వితతంబుగ విఘ్నములేచి పైఁబడన్
గలిగినఁగూడ ముందిడినకాలు మఱల్పక పోరుచుంటిఁ: గాఁ
గలయది కాకమానః దగుఁగా, కనిలో ననుఁడాఁకువారు నేఁ
డలఘులు హైందవప్రవరులా! పరులా! యని సంశయించెదన్॥ 230

చ॥ ఎవరిమతమ్ము దేశమని యింతలు ఱంతులు గొంటి, మట్టి హైం
దవు లిపు డొందుఁ దోడ్పడుటధర్మము, తప్పినఁ దప్పనిమ్ము: శా
త్రవజన పక్షమై యెదురుతాఁకుట కేమనవచ్చు! నిందునన్
శివపతి కేమిలె, మ్మిట నశించున దేదో వచింపరానిదే!॥ 231

---

$ Islam spread among the people owing to a variety of inducements and was often enforced besides at the point of the sword. Page 113. 'Muhammadan India' by *C. S. Srinivasachari & M. S. Ramaswami Aiyangar.*

¶ It may be conceded at once that the abasement of the Hindu religion at the hands of the Muslims led Shivaji to prepare himself for its defence.

Page 655. 'Muslim Rule in India' by *Ishwari Prasad*

ఉ॥ అంబరునాయకా! విరసమాడినయట్లు తలంపఁబోకు; స
త్యంబును ధర్మముఁ గనుచు నాయుధమెత్తిన క్షత్రవీర వం
శంబున మేటివీ విపుడు శస్త్రముతో నెదురెక్కి శత్రుప
క్షం బగుటల్ మనుద్యమమె కానిదొకో యనునట్లు తోఁచెడున్॥232

ఉ॥ ఉత్తరహైందవంబున బలోన్నతులౌ రసపుత్రవీర రా
జోత్తములెల్ల హైందవధరోన్నతికై తెగిపోర, మేము మా
యెత్తున నిందుఁబోరుచు జయించెద; మీగతి వారె మాపయిన్
గత్తినిదూయ హైందవ మిఁకన్ బలహీనతఁ గ్రుంగిపోవదే?॥ 233

ఉ॥ ఇంతకు మీరు తోడ్పడిన నే నొకభూపతినై సుఖింప నా
వంతయు లేదు: యుద్ధమగుపట్టున లావఱి వీఁగిపోదు నన్
జంతయు లేదు: యావనులచేటు దలంచుట లేదు: హైందవై
కాంత హితమ్ముకై పెనఁగులాడెద, యుక్తపథమ్ముఁ జూపుమీ!॥234

మ॥ హితమైతోఁచిన నాకుఁ దోడుపడు టెంతే లెస్స: కాదేని యా
ప్తతమీఱన్ నను నీవువెంటఁగొనుసంధానంబె కావచ్చు: నా
చితియైనన్ జెఱియొక్కవైపుగొనుటే చింతింపుఁ: డింతేల యం
చితమౌ నొండొకక్రొత్తదారిఁగను సాచివ్యంబు మీ కబ్రమే!॥ 235

ఉ॥ నన్నుగుఱించి, కాఁదగురణంబుగుఱించియు, సంధిసేఁతలో
న న్నియమించు సీమల ధనమ్ముల దుర్గములన్ గుఱించి మీ
రెన్నికసేయువేళ యవనేంద్రు - నరున్ - మిముఁబోలె హైందవా
భ్యున్నతిఁ జూడుఁ; డింకఁ దమపోకడయే శిరసావహించెదన్"॥ 236

చ॥ అని శివరాజు ధీరవినయానునయంబుగ విన్నవింపఁగా
విని, జయసింహుఁ డాతని వివేకధురీణత పల్కుపొందు నె
మ్మనమునువిచ్చి లో మతమమత్వము నిద్దురలేప, దాని నే
ర్పున నొడిఁగించి, వాతెఱమాటుఁగుల నవ్వున నిట్లు వాకొనెన్॥ 237

మ॥ "శివరాజా! కడుయుక్త మాడితివి; నీ శీలంబు మేలైన నీ
యవనాధీశ్వరుసైన్యనాథుఁ డిది యోగ్యంబంచు భావించునే?
యవుఁగా కేకమతానురక్తి, యిపు డత్యాసన్నమై నిల్చె సం
ధి వివేకంబొ రణంబొ, దానివిడి మైత్రీయోగ మింకేటికిన్?॥ 238

మ॥ అనిభావించెద, నైన నీ విటు రహస్యజ్ఞాన విద్యార్థివై
వినయంబున్ వెలయించి, ఖడ్గ మొఱకున్ వీడ్కొల్పి, చిత్తంబునిం
డిన విశ్వాసముఁ బెంచి, వాచవులతేనెల్ గొంచు వేంచేయ, వ
చ్చినయభ్యాగతు నాదరింపమి యనౌచిత్యంబుగా నెంచెదన్॥ 239

చ॥ వినుము శివప్రభూ! మతవివేకమునన్ గడుమేటి: వీ వొన
ర్చిన సువిమర్శనం బెకముసేయఁగ రాని; దెవాఁడు హైందవుం
డనఁదగు వానికెల్ల హృదయ స్థిరభక్తి మతాభివృద్ధి సే
యన తగు: నందు నీజతన మప్రతిమంబన వింతయున్నదే!॥ 248

ఉ॥ ఒంటరివాఁడవయ్యుఁ జటులోద్భటమౌ బలఁగంబుఁ బెంచి: తే
పంటలు లేకపోయిన నపారధనమ్ముల సేకరించి: తెం
పుంటకు లేనియప్డు వితతోన్నత దుర్గచయంబుఁ గొంటి: వీ
దంటతనం బనన్యముగదా యొక నూతనరాజ్య సిద్ధికిన్!॥ 341

చ॥ మతమునకున్ బ్రభుత్వమహిమంబునకున్ గల తోడఁటెంగి య
ద్భుతముగఁ బోరుసల్పితి: వెసుర్కొనుచున్న బిజాపురీంద్రు, లు
ద్ధతు లబిసీనియాన్నృపులు, దర్పసమగ్రులు పోర్చుగీసు లం
కితు లగుటేమి! నిల్వు పులకింపఁడె యావనసార్వభౌముఁడున్! ।242

ఉ॥ ఇంతలు సాహసంబు వెలయించిన నిన్ను మహానుభావుఁగా
నెంతురు, నిండుభక్తి భజియింతురు హైందవు; లెప్పు డేయుపా
యాంతర మందియైన స్వమతాభ్యుదయంబున నాఱువోయ య
త్నింతురు, నీరువోయ గమనింతురు, గా కెడవోఁ దలంతురే?॥ 143

ఉ॥ ఉండఁగవచ్చు నీవని 'మనుష్యమసిద్ధికిఁ దోడుసూపలే
కుండిరి, శత్రుపక్షమగుచుండిరి, హైందవు లాత్త్రకాహలు - లి
ట్లుండఁగ నేటి' కంచు, నిదియుక్తము; యిందలి దారితీరులున్
నిండగు శక్తి రక్తి యొకనేతయుఁ దాఁతయు నందుఁ గల్గెనే!॥ **244**

మ॥ 'ఇది ధర్మం - బిది జాతిస్థితిమత సాహిత్యాదికం' బంచు నే
ర్పొదవన్ జూడఁగనీక హైందవమునం దొప్పారు చీఁకట్లలో
నుదయార్కారుణతేజ మిందొదవె: యోగ్యుల్ దాక్షిణాత్యుల్ ముదం
బొదవన్ మేల్కొని: రుత్తరాయణము రాదో మీఁదఁగొన్నాళ్ళకున్!

చ॥ ఇది సహజంబ చూడు : జగమెల్ల నొకప్పుడ ప్రొద్దు తోఁప, ద
య్యదనున కంమనందు వివిధావరణంబుల నీక్ష లుండు; నె
మ్మదిఁ గను; కాలచక్రముక్రమం బిది; యొండయు గాలి వానయున్
ముదిరినమీఁదఁ బంటపొలముల్ దలవంచు ఫలించువెన్నులన్॥ **246**

ఉ॥ కావునఁ దాల్మిఁ బొందు; మిదిగాక మఱొక్కటి హెచ్చరింతు, నీ
భావమునందు యావనులపై నొకయొల్లమి దోఁచు - వారు ధ
ర్మావరణంబు దాఁటిరని; యా ననుకొ, మ్మటులైన భిన్న ధ
ర్మావసథంబు లోకముసమస్తము నీవలె నేను జూతునే?॥ **247**

చ॥ మన కహితమ్ముగా నెనటిమార్గము తోఁచిన వారికంటికిన్
మన గమనంబు మేలగునె? మంచియుఁ జెడ్డ జగంబు తేల్చు : దా
నిని మెయికొల్పునట్లు చనునేర్పరి యందఱిలోనిమేలుఁ గై
కొను : నిటు లాత్మశక్తి పెరుఁగున్, విఱుగున్ బ్రతికూలపక్షముల్॥

ఉ॥ యావనులంచు హైందవజనావళియంచును భేదవాద సం
భావనయేల? యందఱు సమానముగా హితులై విరోధులై
దైవవిధానమున్ నడుపు తంత్రపుబొమ్మలుగా నటింతు; రు
ర్భావులువోలె - నున్నడు సమభావులు నుత్తము లన్నిజాతులన్॥ **249**

చ॥ మనము మహమ్మదీయులు సమష్టికుటుంబమువోలె హైందవం
బునఁ జిరకాల ముంటి — మిటఁ బూర్వు లపూర్వు లటం చెఱుఁగఁజా
లనియటు; దాన జీవితములన్ మతనైతిక సాంఘికాది వ
ర్తనముల మార్పు లిర్వురకుఁ దప్పవు, కూడిక తప్పకున్నటుల్॥ 250

ఉ॥ ఒక్క కుటుంబమందు సుత సోదరు లాదిగఁ బిన్న పెద్దలం
దొక్కొకరీతిఁ బెక్కు లధమోత్తమవృత్తులు గల్గకుండ; వా
చిక్కులఁ దీర్చి పెత్తనముచెందుటయే కడుగొప్ప; సామ్య స
మ్యక్కృతి వొందఁజాలని సమష్టికుటుంబము అచ్చకెక్కదే?॥ 251

ఉ॥ అందఱు యోగ్యులౌ టరిది, యంద అయోగ్యులుగూడఁ గారు; నీ
వందఱిలోని మేలుఁగొనునట్టులె కీడును మార్చివేయు; మీ
మందులపాకమే యొక యమానుషశక్తి : విసమ్ము లన్నియున్
మందులె యాష ధామయ సమన్వయమం దనుభూతికావలెన్॥ 252

ఉ॥ కావున, భేదబుద్ధి వెలిగా మనదేశచరిత్రఁ జూడు, మే
ధావులు పెద్ద లేగినవిధమ్ములఁ జూడుము : భారతోర్విలో
యావను లార్యహైందవు లనాహతవృత్తిఁ బరస్పరంబు స
ద్భావముతోఁ బరస్పరమతమ్ముల నాదృతిఁగొంట కన్పడున్॥ 253

ఉ॥ * హైందవులౌ ఫకీరు - లటు యావనులౌ హరిభక్తులున్, మసీ
దందున దేవతాసదన - మందు మసీదును, వానివానికై
పొందుగ వారువారిడిన పూజలు మాన్యము, లొం హొకళ్ళపే
రందుట, వావియున్ వరుసలాడుట హైందవమందుఁ గన్పడున్!॥ 254

---

* "The Hindus began to worship Muslim saints and the Muslims began to show respect for Hindu gods."

Page 278 'Muslim Rule in India' *Ishwari Prasad.*

"The Mahomedan Kings gave inam land to Hindu temple endowments." Page 32. *M. G. Ranade.*

"Hindus .... .... were prepared to admit Muslims into their faith and did admit them as a matter of fact."

Page 322. March, 1934. *Modern Review.*

చ॥ 'మతము మనమ్ములో మరభిమాన మడంచి పవిత్రభావముల్
పితుకుచు, దైవభక్తియును విశ్వజనప్రణయంబుఁ బెంచి స
ద్గతి నిడు' నంచు, భేద మిటఁ గాంచరు పెద్దలు జాతులెంచి; యీ
గతి మత మంటుఁడీవియలకై వడి సత్ఫలసిద్ధిఁ గూర్చెడిన్॥ 255

మ॥ ¶ కలతత్త్వం బెటులున్నఁ, దోఁచినటు వ్యాఖ్యానంబుఁ గావించుచున్
'బలవంతంబుగ యావనుల్ స్వమతమున్ బట్టించినా' రండ్రు; పూ
ర్వులలోఁ బూజ్యులు గొంద ఱా యవనభూపుల్ హైందవాచార మ
ర్మ్ములిఁ బాలించినగాధలెల్ల భరతోర్విన్ బూచెఁ బూఁదోఁటలై॥ 256

సీ। † ఆదిలో దక్షిణయవనరాజ్యము 'భామి
నీరాజ్య' మనుపేర నెగడుటేమి,
'గోల్కొండ' సులతాను కొల్వులో విప్రు 'ల
క్కన మాదనలు' మంత్రులగుటయేమి,
'భద్రాచలము' రామభక్తుని తలఁ బ్రాల
ముత్తెముల్ సులతాను మోయుటేమి,
'యిబ్రహీం' మిభరామనృపతియై కవిరాజ
పండితాదరణంబుఁ బట్టుటేమి,
తే॥ మహమదాదిలుశాహి నీమాట మెచ్చి
గోవధలు మాన్పఁగా నాజ్ఞఁ గొలుపుటేమి,
గాధలిటు దక్షిణోర్వరఁ గలవు పెక్కు
హైందవ మతాభిమాన దృష్టాంతములుగ!॥ 257

---

¶ Page 110. A History of India, Part II
*C. S. Srinivasachari and M. S. Ramaswami Aiyangar.*

† Page 186. History of India,
*Meadows Taylor.*

సీ॥ [1] 'బాబరు' గోవధ పాతకంబని 'హుమ
యూను' న కొసఁగు ధర్మోపదేశ,
[2] మల హుమయూను శత్రులఁదోలి, 'కర్ణావ
తీ దేవి' యెడఁ జూపు సోదరతయు,
[3] మత రాజకీయ సంగతి హైందవులఁ గూడి
కంటఁ గన్గొన్న 'యక్బరు' చరిత్రి,
[4] షాజహా౯ సుతుఁడు 'దారా' జగన్నాథపం
డితునొద్ద నార్యసాహితిని఻ గొనుట,
తే॥ పూజ్యుఁడు 'కబీరు' మొదలుగాఁ బుణ్యమూర్తు
లెందఱో రామభక్తులై యెసఁగియుంట,
యంద తెఱుఁగుదు రుత్తర హైందవమున
యవననృపతు లస్మన్మతోత్సవముఁ గనుట॥ 258

ఉ॥ కొంద అసూయఁబెంచి ప్రతికూలతసల్పినమాట వాస్తవం
బందున నిందుఁగూడ; నిదియంతయు వ్యక్తులలోని లోపమై
కుందు ఘటించు, స్వార్థమునకుం దిగువా రిది సాధనంబుగా
నంది, మతప్రయోజన మపార్థముసేయుట యిందుఁ గన్పడు౯॥ 259

ఉ॥ కావున వారివారి ననఁగాఁ బని లేదు; మతాభివృద్ధికి౯
దోహ్రవలుసేయుచోఁ బరులదోసము లెంచుటకంటె, వారు స
ద్భావము నందునట్లు స్వమతంబున విశ్వజనీనతా విశా
లావరణంబుఁ బెంచుట యుదాత్తపథంబని విశ్వసించెద౯॥ 260

---

1 'Baber's Will' — Page 96,
A Source Book of Indian History, *K. S. Kini.*
2 Pages 262-263, Annals of Rajasthan, Volume I.
*Col. James Tod.*
3 P. 247. History of the Great Mughals, Vol. I. *Kennedy.*
4 Page 616. Muslim Rule in India, *Ishwari Prasad.*

ఉ॥ కోటలు సేన లస్త్రములు గూర్చి ప్రభుత్వముఁ బేర్చి, పెచ్చు పో
రాటల రక్తసిక్తహృదయమ్ములతో మతరక్ష సేతు, రిం
తేటికి? నాత్మరాజ్యమున నెల్లరకున్ మతధర్మభూమి పూఁ
దోఁటగతిన్ దనర్చిన మధువ్రతముల్ దమయంత మూఁగెడున్॥ 261

చ॥ ఉడుటుగ సంఘశక్తి బలుపొందినచోఁ బటు సంధిబంధమై
యొదిగినమేను రోగముల కెం దెడమీయక హాయిఁగూర్చు; ని
య్యది నిజ, మైన మేని కపుడప్పు తెవుళ్ళవి యంటకుండ, వ
య్యదనుల నన్యసేవఁగొను నౌషధమందుట కానికార్యమే?॥ 262

ఉ॥ కాదని తెంపుసేసి, కొఱగాదని ఱాపులుసేసి, సాహసో
న్మాదము రేఁపుచోఁ దెవులు మానదు, సత్త్వవరాహ: కావునన్
జేఁదులు మేసి కోర్కులెడసేసి, క్రమక్రమపుష్టి నందు టే
నాదుమతమ్ము; సాహసమునన్ బ్రతికూలత హెచ్చు కన్పడున్॥263

ఉ॥ పోరొనరించినారు రసపుత్రనరేంద్రులుకూడ దేశర
క్షారతి: రక్తవాహినులచాలునఁ దద్బలవీర్య సంపదల్
దీఱెనెకాక నెవ్వగలుదీఱెనె? దైవబలంబులేని యీ
పౌరుష మాత్మహానిఁ గొనివచ్చునకాక శుభమ్ముఁ దెచ్చునే?॥ 264

ఉ॥ చేటునుబాటు నిట్లు పరిశీలనసేయుచు నొత్తరాహులా
రాటము మ్రింగి, రిత్తబవరమ్ములఁ గుత్తుకలీయలేక, నా
బోఁటులె యఱచు యౌవనవిభుత్వముమోయ బుజమ్ములొడ్డి - రే
నాఁటికినైన శోభనదినమ్ముల హైందవభూమిఁ గోరుచున్॥ 265

చ॥ మతమని దేశమంచు నభిమానము లేదనుకోకు మాకు: నీ
జతనముఁ దప్పుగాఁదలఁచి శస్త్రము నెత్తుటగూడఁ గాదు: ని.
శ్చితమగు వీరధర్మమున జీవిత మీ యవనేంద్రుసేవ కం
కితమగుచున్ గతానుగతికీకృతమై నినుఁదాఁకు టేర్పడెన్॥ 266

ఉ॥ తాఁకుటమాత్ర గాదు, సరదారులఁ బెద్దయొనర్చి నన్నసం
ఖ్యాకబలంబుతో ననుపునప్పుడు నాపయిఁ బాదుషా మదిన్
బ్రాఁకిన నమ్మకం - బతనిప్రాపున మాపరువంబు వమ్ముగా
నీక మెలంగనయ్యె; నదనెంచి కృతజ్ఞత మ్రింగవచ్చునే!॥ 267

ఉ॥ పాపములందు మానవునపాత్రతలందుఁ గృతఘ్నవృత్తి నిం
దాపణమైన, దాత్మహతియందును గైకొనరాని : దక్రమా
టోపముగా సుయోధనుకటుత్స్వ మెఱింగియు వానిపక్షమే
చాపము నెత్తి నారుగడ సంగరమందు గురుండు భీష్ముఁడున్ 268

సీ॥ తనకు నచ్చిన మన్మలనుచు భీష్ముఁడు తన్ను
గెలుచునుపాయంబుఁ దెలిపినట్లు,
తనశిష్యులని గురూత్తముఁడు సైంధవ వధో
ద్యోగంబులో దారి యొసఁగినట్లు,
తనతల్లి ప్రార్థించెననుచుఁ గర్ణుఁడు చేతఁ
బడు పాండవులఁ జంప కుడుగునట్లు,
తన మేనయల్లుండ్ర కనుచు శల్యుఁడు కర్ణు
సారథియై యెగ్గు సలిపినట్లు,
తే॥ లనువు గలదంచు స్వామికార్యమున కెడము
నడువఁజాల, నాధర్మంబు విడువఁజాల;
వినుము శివరాజ! నామాట వెలితిగాని
యట్లు - నీమేలు కొఱవోనియట్లు నడుతు॥ 269

చ॥ † ఇతరులు యావనేందులటు లెంచక, యీ యవురంగజేబు నీ
జతనము పూరికిన్ గొనఁడు; సాధనముల్ ధనముల్ చమూపతి
ప్రతతులు సైన్యముల్ గల వసారములై పరదుర్దమంబులై
యతనికి; నీతితంత్రమున నద్వయుఁడై జగమెల్ల మ్రింగెడున్॥ 270

† "He should somehow be saved and that at the same

చ॥ † అనిమొన దూఁకి తద్బల మహార్ణవమున్ దరిఁజేరనీఁద రు
ద్రమనముఁ దరంబుగా, దొకట రూపతి సర్వబలంబు లందులో
మునుఁగునకాని : నీకుహితమున్ గొని పల్కెద, సార్వభౌముచె
ల్మిని మది నిచ్చగింపు - మిదిమే; లిట్టుపైఁ బదిమేళ్ళు సేకుఱున్।
ఉ॥ మంచితనంబు తాలకును మార్దవమున్ గలిగించు, వేఁడి సూ
పించినఁ బెట్టి పైఁబడు; నభిన్నమతిన్ నృపులెల్ల వాని సే
వించరె నేఁడు? వారిపయిఁ బేరిమి నీపయిఁ జూపఁడే? సమీ
పించిన, నిన్నువంటి రణవీరు నతం డెడవోవనిచ్చునే?॥ 272
ఉ॥ ఆతనిఁ జేరుచో మతమహత్త్వము కొంత కొఱంతవోవునన్
భీతిని మాను; మా కొలువుపెద్దలలో మనహైందవప్రజా
నేతలు పెక్కు, రానృపుల నెయ్యముఁ జేకొనవచ్చుఁ : దద్బల
స్ఫీతము సంఘశక్తి మతవృద్ధి కుపాంతవసంత మయ్యెడున్॥ 273
చ। † కావునఁ బాదుషాచెలిమిఁ గాంచుము : కాఁదగుతీరు లన్నియున్
నే వెలయింతు, నిర్వరకు నెమ్మదిగా నొకసంధిఁ గూర్తు; స
ద్భావముతోడ నన్ను హితపద్ధతి గోరితి, విట్లుసేయుటే
భావిశుభమ్ముకాఁ దలఁతుఁ, బైతగవున్ దలపోసి పల్కుమీ!"॥ 274
చ॥ అన, శివరాజు కార్యగతులన్నియు నెమ్మది నాకళించి యి
ట్లనె, "మనసిచ్చి మీ యనుభవాతిశయ మ్ముపదేశమిచ్చు మే
లునకుఁ గడున్ గృతజ్ఞుఁడను; 'లోకమువా రొకధర్మతత్త్వమున్
గనునపుడందు భిన్నరుచి గాంతు' రటం చిపుడే నెఱింగితిన్॥ 275

---

time the Badsha's interests also should be served." thought he (Jai Singh) and (said), "Aurangzeb is the mighty ruler of the Earth; you should make friendship with him. The ultimate result of hostility will not be good. .... .... I am, therefore, favourably disposed towards you."

Page 209. *Sabhasad.*

చ॥ మతముసమన్వయంబు సుకుమారముగా విపులార్థ భావ గ
ర్భితముగనున్న: దిందు వివరించినయట్లు చరింపఁగా నశి
క్షితుఁడగు నన్నుఁబోఁటి కొకజీవితకాలము చాల: దైన మీ
పితికినపాలు కాఁచుకొని, పేరినమీఁగడఁ గొందు నేఁటికిన్॥ 276

చ॥ మనసునఁ 'బాదుషాచెలిమి మంచిదిగా' దని తోఁచుచున్న మీ
యనుమతివెంటఁ బోవు టిపు డాత్మహితంబుగ నియ్యకొంటి; నిం
దునఁగల మేలుఁగీడు తమదొడ్డతనంబున నిల్చియుండు; యా
వనపతికొల్వులో శిరమువంచుట దక్కఁగఁ బొందు సేయుమీ!"॥ 277

చ॥ అన, జయసింగు లేఁతనగ వానుచు సంధివచఃప్రసంగముల్
గొని, యుభయానుకూల్యములు గూర్చి కొలందులు సంప్రతించి, యె
ల్లనియెడఁ గార్యకారణములన్ వివరించియు మేలుసూపి, త
న్మన మెసకొల్పి, సంధినియమంబులఁ దీరు ఘటించె నీగతిన్॥ 278

సీ॥ $ "శివరాజు, తానుగెల్చిన రాజ్యమున సింహ
గడమాది యిర్వదిగడము లిచ్చి,
తక్కినరాజ్యమంతయుఁ బాదుషాహిగా
రిడిన రాజ్యముగాఁగ నేలికొనుచు,
సాలుకు మూఁడులక్షలహొనాను లర్పించు
వరుస నల్వదిలక్ష లరి యొసంగి,
తనపుత్రుసాంభాజి దళవాయిపదవి రం
జిలఁ బాదుషాగారి కొలువుఁజేర్చి,
తే॥ దక్షిణంబున జరుగు యుద్ధములయందు
స్వయముగా సేనఁగొనుచుఁ దోడ్పాటుసూపి,
యొండొరుల మేలుసేఁత కొండొరులు దొడఁగి
తెఱపివారయని చెలిమి సంధింపవలయు॥ 279

$ Page 152-154 *J.N. Sarkar. - M. G. Ranade & Sabhasad*

సీ॥ శ్రీ పాదుషాగారు, సాంభాజినిఁ బంచన
హసరి తురంగసైన్యాధికారి
సలిపి మన్నన సూపవలయు: దక్షిణరాజ్య
ముల 'చౌతు' 'సర్దేశముఖి' యటన్న
పన్నులు శివరాజు స్వయముగా రాఁబట్టి
కొను హక్కు లీవలెఁ: గొంకణమ్ము
దక్షిణోత్తరభాగ ధరణియంతయు గెల్చి
కొను శివరాజును జెనకఁగూడ:
తే॥ దన్య సామంతవిహిత మర్యాద లిచ్చి,
కొలువు కేతెంచు నియమంబు తొలఁగఁజేసి,
నెరసు లరయని చెలిమిపొందికలు వెలయ
నాత్మహితునిఁగా శివరాజు నరయవలయు"॥ 280

చ॥ అని పయిరీతి సంధినియమావళి శివప్రభుఁ డామతింపఁ గై
కొనుచు, 'దిలేరుఖానుఁ డనుకూలపక్షుఁ డగుమాటలాడి ర'
మ్మని శివరాజు మైకొలిపి, యాతనితోఁ దన మేనమామఁ దో
డనుపుచు, యుద్ధమాఁపుటకునై జయసింహుఁడు పంపె వార్తలన్॥

ఉ॥ తన్నొకపెద్దసేసి వివిధమ్ములు కానుకలిచ్చి సంధికై
విన్నను వాడు వారి నుడివిందుకు మెచ్చి దిలేరుఖానుఁడున్
మన్ననఁ గాన్కలిచ్చి యభిమానము పెద్దయొనర్చి, వారితోఁ
గ్రిన్నన యేగుదెంచె నెసకంబున సింహగడంబుఁ జేరఁగన్॥ 282

ఉ॥ అందఱుఁగూడి సంధినియమావళి కొప్పఁగ సమ్మతింప, "నీ
చందము పాదుషా కెఱుకసల్పఁగఁ జారులనంపి తన్మతం
బంది తిరమ్మసేత" మనియాడుచు, నంబరు నేత సంధిలోఁ
బొందిక లెల్ల వ్రాసి, తనపోల్చినతీరు లిఖించె నీగతిన్॥ 283

---

*mention only 20 forts and Chouth & Sardeshmukhi.*

మ॥ "అమితోత్సాహముతో శివప్రభుని రాజ్యప్రాంతముల్ ముట్టి దు
ర్గములన్ బట్టితి: మందునందుఁ బటుసంగ్రామంబులై, కూలె సై
న్యము లిర్వైపుల: నింతలో నతఁడె మ మ్మర్థించె సంధింప: న
ర్హా మటం చొప్పితి మాజ్ఞవేచి తగవారన్ దీరు గావించుచున్॥ 284

సీ॥ మనయేలుబడికి నెమ్మదిఁగూర్పఁగా దక్షి
ణమునందు ముఖ్యదుర్గములఁ గొనుట,
సరి నాల్గుపదులలక్షల హూణులై మించు
నమితధనంబు కప్పముగఁ గొనుట,
యల బిజాపురముతోఁ గలిసి మార్కొనకుండ
శివరాజు మనవైపు చేర్చికొనుట,
యతనిచే వారిపెం పడఁగించి, మనసేన
కొండగుట్టల స్రుక్కకుండఁ గనుట,
తే॥ పరమలాభముగాఁ దీరుపఱచి, సంధి
నియమములఁ బాపికొంటి, మీనిర్ణయంబు
తడవు చర్చించితిమి: దీనఁ దగవుదలఁచి
తగిన యుత్తరువీయఁ బ్రార్థనము సేతు"॥ 285

మ॥ అనుచుం గమ్మ లిఖించి యంబరువిభుం డద్దానిఁ బంపించి, తో
డనె తామందిన యెల్లదుర్గములఁగూడన్ 'బాదుషాబావుటా'
దనరన్ జేసి, బిజాపురంబుగెలువన్ దండెత్తి, సైన్యంబుతోఁ
దనవెంటన్ శివరాజు ముందునడువన్ దత్ప్రాంతముల్ దైకొనెన్॥

శివాజీ జయసింగునకుఁ దోడై బిజాపురరాజ్యముపై కేగుట.

చ॥ ఇటు శివరాజుసాయమున నేచి బిజాపురరాజ్యమెల్ల మిం
గుట కిది వేళయంచు రణకోవిదుఁడౌ జయసింగు సాహసో
ద్భటముగ శేఁగి దుర్గములఁబట్టి బిజాపురపట్టణంబు చెం
గటి కెగఁబ్రాఁకి దూఁకె, నొదుఁగన్ బడ దేశము నాక్రమించుచున్॥

చ॥ జరిగినసంధికై తనమసమ్మతి - పోరుచుఁ దోడుసేతకై
పరువపుఁగాన్కలున్ బనిచెఁ బాదుషహా; మొగలాయిదండు ల
త్తటి శివరాజురాజ్యమును దాఁటి బిజాపురిపైకిఁ బోయె; నిం
తరసి శివప్రభుండు తదనంతరకార్యము నెంచెసేగతిన్॥ 288

చ॥ "నెఱపినసంధిలో స్వబలనిర్జితరాజ్యము కొంతపోయె; నీ
వెరవునఁ జుట్టుకొన్నయరివీరులముట్టడి తీఱిపోయె; నీ
తెఱఁ గుచితంబె యైన, నొకతీరున నియ్యది ముందు కీడుగాఁ
దిరుగు నటంచుఁ దోఁచుఁ; బనితీఱిన దుర్మతి మేల్దలంచునే!॥ 289

ఉ॥ సాహస మిట్లుసూపుచు బిజాపురరాజ్యమునెల్లఁ బాదుషా
కాహుతి యాయవచ్చుఁ, బయి నాఁకొనుచున్ మనపైకిరాఁడె! ఘో
రాహితకిఁ బాలుపోయువిధ మాఁగద చేసినకార్యమెల్ల! స్వ
వ్యాహతిఁ దెచ్చికొంచు బలవంతున కాస్పద మీయవచ్చునే!॥ 290

తే॥ 'అసలు సంధియే కాఁగూడ' దనియు, 'నిన్ని
గడములిచ్చియు నిటుతోడుపడుచు, వారి
క్రిందఁ జనుటేల' యని పంతగించు సైన్య
పతుల నేతాజిముఖులఁ గిడ్పఱుప నగునె!॥ 291

ఉ॥ ఇన్నియు సంప్రతింప నొకయెత్తున వీరిఁ దొలంగిపోవుటే
విన్నను : విందు ముందునడిపించినసంధికిఁ దప్పనట్లుగా
నన్నిటఁ దోడుసూపినటు లాడి, పయిన్ బయిఁ బోరొనర్చి, యీ
చెన్నఁటి శత్రుకోటి నొకచిక్కునఁ ద్రోయుచు జాఱిపోఁదగున్॥ 292

చ॥ అగునపుడున్ రహస్యముగ నాదిలుషా కొకలావు గూర్చి యీ
మొగలులఁ బాఱఁదోలునటు పూన్చినచో నిటఁ జిక్కువాయు : నీ
జగడము లిట్లుతీఱిన బిజాపుర మొంటిగ నిల్చు : నందుపైఁ
దగవులు క్రొత్తగా, విభుడు తంత్రమునన్ బడిగొంట యొప్పగున్॥

ఉ॥ ఒప్పని తోఁచుచున్న, జగమొప్పనొకో యనుశంక - నీతికిన్
దప్పుట యౌనటంచు ననుతాపము గల్గెను :. నిట్లుపోయినన్
దప్పదు కార్యహాని : యది నాకయినన్ గొఱలేదు, దేశమున్
నిప్పులఁద్రోయునై దోసఁగు నిల్చు : జగం బపు డాడిపోయదే!॥ 294

తే॥ రాజనీతిని వ్యక్తిధర్మమునఁ దూఁచి
కలుచలెంచుట మందాధికార దృష్టి :
రామదాసుని యుభయతారక పథంబు
నడిచి, యీ కాఱుచీఁకటుల్ తుడిచివైతు॥ 295

ఉ॥ 'మాటను దప్పరా' దనుక్రమంబది సాధువుఁగూర్చికాని క
ర్కోటకుఁగూర్చి కాదు : పగకున్ బ్రతికారము సేయులేని మో
మోటకు విల్వలేదు : వెరవొందుచు నీ యవనద్వయంబునన్
నాటకమాడి, యిర్వుర ఫణాశిఖరంబులఁ దాండవించెదన్"॥ 296

చ॥ అని శివరాజు కార్యగతియంతయు సూటిగ నిర్ణయించి, తో
డొనరిచినట్లె మొగలులయొద్దన యుండె, బిజాపురీంద్రుఁడున్
దనబలఁగంబుఁ బెంచి పటుదర్పము సూపుచు, గోలకొండతో
డెనసి పరాక్రమించి యలయించె మొగల్బల మెందు డీల్పడన్॥ 297

చ॥ తనబలఁగంబు లిట్లు కలఁతన్బడు టెంచి దిలేరుఖానుఁ డీ
సున జయసింగుతో ననియెఁ "జుట్టమువోలె మెలంగి, పోరున
ద్దనువులు తప్పఁదీసి, సమయంబున కొండొకచోటఁ దేలి, చి
క్కునఁబడు దారిచూపి మనకున్ శివరా జపకార మొంచెనున్॥ 298

ఉ॥ † ఆ కుటిలుండు తోడ్పడు టపాయ; ముపాయముఁగొంచు వాని బం
దీకృతునైనఁ జేయుఁ, డొక తెంపునఁ గొంట మటెంత మేలగున్;
మీ కిది కానిదైన నియమింపుఁడు న :న్నిటుసేయకున్నచోఁ
బాకముదప్పు సర్వ : మటుపై మన మేమియొనర్చి యేమగున్!"॥299

---

† Diler Khan several times urged Jai Singh "to take

చ॥ అనెడు దిలేరుఖానుహృదయమ్ము నెఱుంగుచు నంబరేశుఁ "డా
తని సవరింతులె" మ్మని నిదానమువల్కెఁ; శివప్రభుండు క
ల్గిన కలఁతల్ గణించి, కలిగించిన భేదము పండుసొంచి, క
ల్గనయిన కీడు వాసి చనఁగా మనసై జయసింగుతో ననెన్॥ 300

చ॥ * "పగతురు గుంపుగట్టుకొని పైకొని; రండఱు మొక్కవైపునన్
దగిలినఁ, బొత్తులేక - బహునాయకమై - క్రమశిక్షలేని - సే
న గెలువఁజాల, దూరక మనంబుల భేదముపుట్టి దుర్బలం
బగు: మొగిఁ యింతు నే నొకట, నప్పుడతం డిరువైపు కీడ్పడున్"॥

చ॥ * అని శివరాజుపల్కు సమయజ్ఞత నెంచి, దిలేరుఖాను తే
ల్చిన పోరపొచ్చె మెంచి, జయసింగు స్వపక్షవిరోధముల్ పెనం
గిన నిజకార్యహాని పరికించి శివప్రభు 'నొండువైపు మా
ర్గోన్ను' మనిపంప, నాతఁ డనుఁగుంబరివారము గొల్వ వెల్వడెన్॥

సీ॥ ఇటు పటుసాహసం బెనయించి, శివరాజు
మొగలాయినిర్బంధమును దొలంగి,
తోప్రవలో నేతాజితో మంతనములాడి
కలహించినటు వానిఁ దొలఁగఁజేసి,
యల బిజాపురసైన్యములఁ దాఁకిపట్లు ప
న్హాళాగడంబున నని యొనర్చి,
యట జయం బనుమాన మనిపించి, సైన్య మ
క్కడవీడి ఖేలనాగడముఁ జేరె;

---

Shivaji's life, or at least to give him (Diler Khan) leave to do so. He would assume all responsibility and see the Raja was held blameless.

Page 164, *J. N. Sarkar.*

* Page 164, *J. N. Sarkar.*

తే॥ ¶ ఘనుఁడు నేతాజి శివునితోఁ గలహమాడి
వచ్చి చెట్టేఁగి బిజాపురీశ్వరుఁడు నాల్గు
లక్షలధనంబు జాగిరుల్ లంచమొసఁగ,
నతఁడు చెలరేఁగి మొగలుసైన్యములఁ దఱిమె॥ 303

ఉ॥ $ "రెండవవాఁడు రుమ్మిన - కరిక్షితిభృత్ప్రవియా శివాజకిన్
రెండవవాఁడితం" డనఁ జరించు శివప్రభుసైన్యనాథుఁ డు
ద్దండముగా బిజాపురపుదండులు రేఁపి, మొగల్బలంబు లెం
దుండఁగనీక తోలె విషమోగ్రవనీ గిరి కూటవీథులన్॥ 304

—♦ శివాజీని దర్బారుకుఁ బిలిపింపఁ బాదుషాకు జయసింగు విన్నపము. ♦—

మ॥ జయసింగా సరదారు లోఁగొన యథేష్టద్రవ్యముల్ జాగిరుల్
పయి నుద్యోగము లాసగొల్పి విఫలప్రారంభుఁడై, వాఁడు తో
డయిరా దూఁకు బిజాపురీంద్రుఁడవడి ద్రోయన్ రాక, సంఘూర్ణితా
శయుఁడై రేఁగు దిలేరుఖాను సవరించన్ లేక, దూపిల్లుచున్॥ 305

చ॥ ఇటు తలపోసె, "నే నొకటియెంచఁగ దా నొకఁడయ్యె; నీసునన్
బెటిలి దిలేరుఖానుఁ డొకభేదముపుట్టఁగఁ బల్కె : దాన నా
రటపడి వేఱువోయె శివరాజు : బిజాపుర మింము సందుగ
ల్గుటఁగొని తోడుఁబెంచి యుడుకున్ దుడుకున్ బలియించి పైకొనెన్॥

చ॥ § ఇది యడఁగించుటెట్లు! హితమెన్నుచు నీశివరాజు రాఁడు తో
డెనుర, నతండు రాకణఁగఁ డీ గిరి కానన దుర్గకోటి ప్రా
పెనుగు బిజాపురీంద్రుఁ: డతఁ డీశివరాజునుగూడ లాభముల్
పొదుగుచుఁ బొందుకొన్న మనపూనికయంతయుఁ దాఱుమాఱగున్॥

---

¶ Neta accepted the Bijapuri bait of 4 lakhs of hun and deserting to Adil Shah, raided the Mughal territory with great vigour and effect. Page 165i *J. N. Sarkar.*

$ "The Deccanis regard Netaji as a second Shivaji." Page 159, *J. N. Sarkar.*

§ Page 299. *The Modern Review for April, 1909.*

మ॥ మును నేతాజినిఁ గొన్నవాఁడు శివభూపుం డేఁడు సాధింపఁబోఁ
డనుకోరాదు: శివాజి సంధినియమవ్యాపారముల్ మీఱఁబోఁ
డనుకోరా: దతఁ డుచితుండయిన రాజ్యాంగంబు లీపాటి: వా
తనిలోఁ దొల్లిటిసంధియం దగుకొటంతల్ గూడఁ గాన్పించెడిన్॥ 308

తే॥ ఆ కొటంతలెల్లఁ దిటఁగా ననుపుపఱచి
శివపతినిఁ జేరఁదీయుచోఁ జిక్కువాయు,
మనకు జయమబ్బు: నిదియెల్ల మనసుఁబట్టఁ
దెలిపి, పాదుషా యిటుసేయ సలుపవలయు"॥ 309

తే॥ అనుచుఁ దలపోసి జయసింహుఁ డనుపుమీఱఁ
బాదుషాగారి కిటు కమ్మ వ్రాసి పంపెఁ:
"జిత్తగింపుఁడు! సంధిలోఁ జెప్పినట్లె
సైన్యములతోడ శివరాజు సాయపడియె॥ 310

సీ॥ అతనితోడ్పాటుతో నాక్రమించితిమి బి
జాపురీ వితతరాజ్యమునఁ గొంత,
గోల్కొండసాయంబు గొని బిజాపురను వి
జృంభింప నిటఁ బరిస్థితులు మాఱె,
శివరాజునకు - మనసేనానులకును యు
ద్ధముఁగూర్చి భావభేదములుగలిగి,
"చెఱియొకవైపుగా నరులఁ దాఁకుద" మంచు
నరికట్టె నతఁడు పన్హాళగడము,
తే॥ నంతలోన శివాజిసైన్యపతి యతని
తో విరోధించి శత్రులతోడఁ గలిసె,
శత్రుపక్షము బలితమై సంగరమున
జయముగలుగుట సంశయాస్పదమ యయ్యె॥ 311

ఉ। ¶ ఈగతి నేఁటిపోరు విపరీతముగాఁ గనుపట్టెఁ : దెంపునన్
మూఁగి శివప్రభుండు తన పూర్ణబలంబునఁ దోడుసూపుచో
లోఁగు బిజాపురం : బతఁడు లోఁగుచు వైరులఁజేరికొన్న ను
ద్యోగము భార : మన్నివసతుల్ ప్రతికూలములై పెనంబడున్॥ 312

చ। ¶ శివపతి యెట్టులే మనము చేర్చికొనన్ దగువాఁడు : బుద్ధివై
భవము బలంబు తెంపు గలవాఁడు : చమూపతు లుక్కుఁదునక లు
క్కివులగు పెక్కు రాబలియుకింకరు : లాతఁడు మాకు సాయ ము
త్సవమునఁ జేయుచో మనకు దక్షిణరాజ్యములెల్ల లోఁబడున్॥ 313

ఉ॥ ♆ కావున శ్రీశివప్రభునిఁ గ్రచ్చుఅఁ గొల్పుకుఁ బిల్వఁబంచి, స
ద్భావముఁజూపి తృప్తిపఱుపందగురీతుల నాదరించి, యు
ద్ధావని కంపుఁ : డాపయి జయంబు ధ్రువం : బిదియెల్ల భారత
శ్రీవెలయించు మీకు వివరించెదుపాటియె! యాజ్ఞ నేచితిన్"॥ 314

తే॥ అనుచు లిఖియించి వేగరులైన భటుల
చేతఁ బుత్తెంచి, యట జయసింహవిభుఁడు
సంగరముభంగి వైరులజాడ లరసి
శివపతినిఁ బ్రోత్సహించి రంజించుచుండె। 315

షష్ఠాశ్వాసము - సమాప్తము

---

¶ Jai Singh called him (Shivaji) the Key of the Deccan and declared ........ that without his accession to the imperial side, the conquest of the Deccan would never be realized. Page 265, *N. S. Takakhav.*

♆ It is necessary to win Shiva's heart by all means aud to send him to Northern India to have audience of Your Majesty. Page 166, *J. N. Sarkar*

శ్రీ మత్సాఁ దేవతాయైనమః

# శ్రీ శివ భా ర త ము

## ( శి వా జీ ప్ర బం ధ ము. )

---

### స ప్త మా శ్వా స ము.

---

#### ౼ ఔరంగజేబు నాహ్వానము - శివాజీ యాగ్రాప్రయాణము. ౼

చ॥ ఘనుఁ డవురంగజేబు కుతుకంబున దక్షిణదండయాత్రలన్
దొనఁకుఫలమ్ము వేచి, తతితో జయసింహుఁడు పంపుచుత్తరం
బును గయికొంచు, నందుఁగల పోకడలన్నియు నాకళించి, నే
ర్చిన తనరాజనీతి విలసిల్ల మదిన్ దలపోసె నీగతిన్ 1

ఉ॥ “సంగతులెల్ల సంశయ విచారములన్ దలపించుచున్న; వీ
రంగమునందు నెవ్వ రపరాధులొ సాధులొ నిర్ణయింపరా,
దంగడివెట్టి తేల్చికొనునట్టి ప్రసక్తియు లే, దుపేక్ష సే
యంగల తీరు గా; దెవరియాంతకు వారగు టింపుఁ గన్పడున్॥ 2

చ॥ శివపతిఁ జేరఁదీయుట విశేషముగా జయసింగువ్రాయు; నా
శివపతిదోసముల్ దెలిపి శిక్షితుఁజేయు మటంచు వ్రాయు వై
రివలె దిలేరుఖానుఁ; డెవరిన్ గొని కార్యముఁ దీర్పవచ్చు? హైం
దవుఁ డగుమాత్ర వంచన గనందగునా జయసింగుమాటలన్!॥ 3

ఉ॥ ఇంత కతండుగోరునదియేమి - శివాజినిఁబిల్చి కొల్వులోఁ
గొంత బహూకృతిన్ జలుపఁగోరె, సమర్థ్యమగాదె? దీన ల
బ్ధాంతరుఁడై యతండు మనయండకుఁ జేరినఁ జేరవచ్చుఁ; గా
[illegible] దే?॥ 4

ఉ॥ సాయముఁ జేయకున్నను బిజాపురపక్షముఁ జేరకుండఁగాఁ
జేయుట ముఖ్య, మిందు జయసింహుఁడు తప్పఁదలంపలేదు; కా
దేయను — మిందుఁజేరునతఁ డెందులకేసుఁ? గొఱంతలెల్లనున్
బాయఁగ నాతనిన్ బిలువఁబంచెద" నం చెప నిర్ణయింపుచున్॥

సీ॥ † శివపతి కిట్లు వ్రాసె, "బిజాపురీంద్రుతోఁ
గలిగినపోర మీ సలుపుసాయ
మున సంతసించితి : మనువుగా మాకొల్వు
నందు మీ కుచితమర్యాద లీయ,
నున్నతపదవుల నొడఁగూర్ప నున్నార,
మపుడ మీ రడిగినవాక్కు లిచ్చి
యధికారపత్ర మీయఁగనుంటి, మందుకై
కొలువున కిపుడు రావలయు మీరు;

తే॥ § వచ్చునప్పుడు కాఁగల వ్యయములను భ
రింప నొకలక్షధనము నర్పించునట్టు
లచటి దక్కనుకోశగృహాధికారి
సిద్ధముగనుండుఁ, దడయక చేరరండు"॥

మ॥ అని వ్రాయించుచు నంబరీశుకడ కాయారంగజే బంపెఁ దా
నినిఁ గొంచున్ జయసింగు శ్రీశివవిభున్ బిల్పించి, మర్యాద లొ
య్యనఁ గావించి యుదంతముల్ వినిచి యాహ్వానంబుఁ జూపించి యా
తనితో నిట్లనెఁ బాదుషాఁగనెడు నుత్సాహంబు గల్గించుచున్॥ 7

---

§ "A lakh of Rupees from the Deccan treasury was advanced to him by order of the Emperor for his expenses."

Page 171, *J. N. Sarkar*

† Page 225, *Kincaid.*

మ॥ "శివరాజా! పయనింపు; మీ యవనలక్ష్మీభర్త తాఁ బిల్చుగా
రవ మెవ్వారికిఁగల్గు? నీ సముచితప్రారంభముల్ పండు భా
గ్య విశేషం బిటు దారిసూపె; నిటుపైఁ గర్తవ్యతా దీర్ఘద
ర్శివి నీకందని దేమిగల్గు? సమయౌచిత్యంబుఁ బాటింపుమీ॥ 8

ఉ॥ 'ఇంతకుముందు వాలుమెఱయించి పయింబడు నాతఁ డింతలో
నింతటియాదరంబు గనుటే' మని లోఁతు దలంపఁబోకు; మీ
కంతర మింతలేని హృదయంబుల నెమ్మదిఁగూర్ప నేన యీ
వంతెనఁ గట్టినాఁడఁ: జిరవైరము లున్నవె రాజనీతికిన్!॥ 9

మ॥ అనుమానింపకు: మేనుగూడ నటు తోడ్తేరాఁ దలంపున్న, వై
నను యుద్ధం బిటులుండ నిర్వ్యర ప్రమాణం బొప్పదం చెంతు; నా
తనయుం డచ్చట రామసింగు గలఁ, డాతం డెంతు నీవెంటరా
ననుసంధించెద: నిందునందుఁ బయిగాపైఁ యేమ బ్రాపుండెదన్॥ 10

ఉ॥ అన్నిటఁ బ్రోడ వీ, వితరు 'లా' నని 'కా' దనియున్ వచింప నే
మున్నది - పోయిరమ్ము; భరతోదయసిద్ధికి దోయిలించు నీ
యున్నతపాణి క్రిందయిన నున్నతమే యగుఁగాక; కార్యవి
షన్నత గోరువారు గరువంపడ రన్నది నీ వెఱుంగవే!॥ 11

శా॥ నేతాజీ యిటు మాటిపోవుననుచున్ నే ముందు భావింప, నీ
చేతన్ శిక్షితుఁడయ్యు వాఁ డిటులువిచ్ఛేదించు టన్యాయ్య్య; మే
మైపై తీంద్రించఁగరాదు, వానినెడసేయన్ మేలుగా: దా చమూ
నేతన్ లోఁగొను మెట్టులైన, నటుపై నీవేగు కెంతేఁదగున్"॥ 12

చ॥ అన శివరాజు వల్కె, "నిదియంతయు నే గమనించినాఁడ; నా
యనుచరుఁ డెవ్వఁ డెన్నఁ డిటులైనది లే, దితఁడైన నట్టివాఁ
డనుకొనరాదు: సంధినియమావళిపొందికలున్ దిలేరుఖా
నుని వెడమాట లాతనికి న్యూనములై యిటు తెంపుగైకొనెన్॥ 13

ఉ॥ 'కండలు నెత్తురుల్ పిడిచికట్టిన దుర్గము లిచ్చి, వారికై
భండనమాడి సైనికులప్రాణము లిచ్చి, బలంబు తగ్గుచో
నుండినసర్వమిచ్చి పడియుండుట 'యే' లనియున్, 'దిలేరుఖా
నుం డొకపెద్దయై తలుముచుండుట 'యే' లని యాతఁ డెంచెడున్॥ 14

చ॥ జరిగినరీతికై తన యసమ్మతిఁ జూపుచు వేఱుపోయెఁగా
కరులకుఁ దోడుపోఁడని యథార్థము తోఁచెను; దేశభక్తిబం
ధురులు సమస్థ లోక్ఱపుకు దూఁకెద రెల్లి తెగించి, వారి త
త్పరత పవిత్రమంచుఁ దగువైపున వారలఁ గైకొనన్ దగున్॥ 15

ఉ॥ ఇప్పటి పాదుషా చనవు, లీపయిమేలు వచించి వాని నే
నెప్పటియట్ల కొందుఁ; దమ రిచ్చెదమన్న ధనంబు జాగిరుల్
దప్పక యైనవేల సరదారుతనంబు బహూకరించుచో
మెప్పున వాఁడు మి మ్మనుగమించుచు నిర్భరచెల్మి పెంచెడున్॥ 16

ఉ॥ నే నిటు విశ్వసించి గమనించెదఁ గార్యములెల్లఁ, బాదుషా
యానతి నిర్వహింప వివిధావసరంబుల సంతరింపుచున్
బైనముసేతు" నం చతనిఁ బాయుచు రాయగడంబుఁ జేరి, యా
స్థానమునన్ శివాజి సరదారుల మంత్రులఁ జూచి యిట్లనెన్॥ 17

చ॥ "జరిగిన సంధిబంధము - బిజాపురితోనగు పోరుతీరు మీ
రెఱుఁగుదు: రిట్టులుండ యవనేంద్రుఁడు 'కొల్వుకురా' మ్మటంచు ను
త్తరమును బంపె 'నున్నతపదంబుల గౌరవమిత్తు' నంచు; 'నే
కొఱఁతయు రాదు, కల్గు ననుకూలత పో' మ్మనె నంబరీశుఁడున్॥ 18

చ॥ 'మన కిపు డేదికర్జ' మనుమాటయె నేఁడు విచార్య; మిందుఁ దోఁ
చినటుల మీరు మేమును వచింతుముగాక, వినిర్ణయంబుదే
లని దిది; యిందు నెందునఁగలంగని తెంపున నాత్మశక్తి దీ
వనగొని పోవుచో నెదురువచ్చుఁ దమంత భవిష్యదర్థముల్॥ 19

ఉ॥ దూరమునుండియైన నొకద్రోహము సేయఁదలంచు వారలన్
జేరఁగఁబోవు టెంతయు నిషిద్ధముగాఁ : గనకాభిషేక స
త్కారముఁ జేతుమన్న నది కైతవమే యనవచ్చుఁ : బాదుషా
గారిచరిత్ర యీ భరతఖండమునందొక క్రొత్త పాఠమే? 20

చ॥ ఒకట బిజాపురీంద్రుబల - మొక్కెడఁ మొగలాయిదండు లొం
డొకటిని మ్రింగవేచి కసిమొత్తులతో మన చుట్టుపక్కలన్
జకచకలాడుచున్నపుడు, సన్నహనంబున నాత్మరాజ్యర
క్షకుఁ గడుదూరమై చను టసాంప్రత మంటయుఁ దథ్యమేయగున్॥

ఉ॥ కావునఁ బాదుషాఁ గనుటకై చనరా దనితోఁచు : నైన రాఁ
బోవు విపర్యయంబు దలపోయుచు నిట్టులె యూరకున్నచో
నే వెర వెత్తియో యిరువు రేఁచరె? వారిని వీరి నాఁగఁగాఁ
ద్రోవలు మూయుతీయుపనితోఁ గలకాలము దేవులాటయే?॥ 22

ఉ॥ ఆదిలుషాబలం బణఁచినట్టులె మోగలుపాదుషా బలో
త్సాదనఁ జేసి హైందవపతాక మరుచ్చలదంచలాంచితో
న్నాదముఁ జేసి నిల్పక, యనల్పములౌ మనయత్నముల్ వృథా
గావె? దురూహసాహసముఁ గట్టినఁగా కది నెట్టవచ్చునే?॥ 23

ఉ॥ తెంపున గుంపులెత్తి పరతెంచు మొగల్బలఁగం బెదిర్చి మా
యింపఁ దలంపు సంద్రమున కేతము నెత్తుటఁ బోలు : రావణుం
డంపు నసంఖ్యమూలబల మాఁగఁగ రాముఁడు మోహనాస్త్రమున్
బంపినయట్టు లొండొకయుపాయము గావలె వారినొంపఁగన్॥ 24

ఉ॥ మోగలుకొల్వులోఁ గలరు ముఖ్యులు హైందవవీరు, లా మహా
భాగులఁ దోడుకొల్పుకొని, పాదుషహా మదిమెచ్చఁబోని యు
ద్యోగులఁ గొల్వులో యవనధూర్తులఁ గొందఱ లాగి, ప్రాంతభూ
భాగపురాజులన్ మనకు బాసటగాఁ గొని పైకొనన్ వలెన్॥ 25

చ॥ నలుగడ నిట్లు మాఱుకొనినన్ దిటవున్ దెరువేది పాదుషా
బలమఱుఁ, భావబంధమునఁ బ్రబ్బుచు హైందవులెల్ల నన్నద
మ్ములవలె నౌను; రిందు రసపుత్రులు మే మొకవంగడంబువా
రలమగు టచ్చుకొల్పినఁ దిరమ్మగు సఖ్యము కార్యసిద్ధికిన్॥ 26

తే॥ నాదుపూర్వుల పుణ్య జన్మస్థలంబు
లరసి, వారితోఁ జెలిమి చుట్టఱిక మెనసి,
తక్కహైందవజనుల నేస్తమున బలిసి,
పాదుషాగుట్టు లరసి రాఁ బయనమొప్పు॥ 27

ఉ॥ ఇంతటికార్యమెల్ల మన మిచ్చటనుండినఁ దీరుగాదు, వా
రంతరమిచ్చి రమ్మనినయప్పుడగాక మఱొక్కనాఁడు వో
నింతయు దారిలే, దహితమెన్ను చువీఁగిన సేగి దీఱు; దీ
వంతులసాహసించి పగపంచల నేఁ బులిపాలు పిండెదన్॥ 28

ఉ॥ చూఁచెద నాత్మశక్తి నిడుచూపులలో నొదిఁగించి, కార్యమున్
దూఁచెద, వైరియంతరము దోఁచెద, గర్భముఁజీల్చి దైవమున్
వేచెద; నొక్కమర్త్యుఁడు - వివేకియు సాహసికుండు కార్యదీ
క్షాచణుఁ - డెట్లుసేయు నటుసల్పుచు, నేఁ బయిచేయి వైచెదన్॥ 29

చ॥ ఒదిఁగిన కార్యమెల్ల భరతోదయసిద్ధికిఁ బాదు; దూరమై
చెదరినదెల్ల దైవ మటుసేయఁదలంచు విధాన; మంతయున్
గుదిరిక యానటంచుఁ బురికొల్పెడు నన్ను భవాని; యీగతిన్
బదిలపుఁదెంపునన్ నడిచి పాదుషహాఁగన నేఁ దలంచితిన్॥ 30

ఉ॥ ఒక్కట రాజపుత్రులు, మఱొక్కట సిక్కు, లొకంట నాఫ్గనుల్
దక్కను యావనప్రభులు దా మొకవైపు మొగల్ప్రభుత్వమున్
జిక్కులువెట్టుచుండ, మనచెల్మినిఁ గోరెడు పాదుషాహి నా
దిక్కనఁ గీడుకంటఁ గనుతెంపునకున్ జాలలేమి కన్పడున్॥ 31

ఉ। నన్నిటు ప్రోత్సహించి కడునమ్మికయుక్ మతభక్తిఁ జూపి, "నే
నన్నియుఁ గాచియుంచు" నను నంబరునాథుఁడు మేలుసేయలే
కున్నను గీడుసేయఁ జొరఁ డొండొకరొయుక్తి డి్డిమైన: బోరులో
నున్నటు తన్నెఱింగి తనయున్కి-చెడక్ జెడు గేల్తువ్వైడుక్!॥ 32

ఉ॥ ఇంతయు సంప్రతించి చననెంచితి, నందలితీరు లెంచి సా
ధింతు మనుద్యమంబుఁ, జనుదెంతు శుభంబున; వచ్చులోపలక్
గొంతకొఱంత యొందయినఁ గోల్కొ-నకుండఁగ జాగరూకులై
ప్రాంతములెల్లఁ గాచి, మనపక్షమపక్షతిగా మెలంగుఁడీ!॥ 33

సీ॥ రాజ్యాంగతంత్రి సర్వస్వంబు పరికించి,
పాంతముల్ దుర్గముల్ భద్రపఱచు
విధుల మోరోపంతుపింగళేసచివుఁ - డా
బాజిసోక్ దేవుఁ - డణ్ణాజిదత్తు
సర్వాధికారముల్ జరిపించుచుండి, యే
నాఁటికార్యంబు లాసాఁడు జీజి
యాదేవిచెంగట నర్పించి, తచ్ఛాస
నంబున సర్వంబు నడుపవలయు;
తే॥ రిపులజాడల నెఱిఁగి వర్తింపవలయు,
నడుచురీతి మాకై వేగునడుపవలయు,
నామ డామడ లెడము మే మరిగియున్న
నడు గడుగునందు నున్నట్టు లరయవలయు"॥ 34

మ॥ అని నేతాజినిఁజూచి పల్కె-, "మన యూహావ్యూహముల్ పండి యి
ట్లనుమోదంబులు పెక్కు- గూర్చె; జయసిం గర్థించె నిక్ జేరర
మ్మనియుక్, జాగిరులుక్ ధనమ్ములిడ సైన్యాధీశ్వరుక్ జేతు నం;
చనుమానింపక చేరు మందు, నటుసేయక్ రెంట మేలయ్యెడిక్॥ 25

చ॥ సమరములెత్తి మొగలు బిజాపురసేనలు దారసిల్లఁ, బ్రాం
తము లలవారి యొత్తిడి వెతఁబడకుండఁగ నీభుజాపటు
త్వము శరణంబు: వారు తమపక్షమువాఁ డనుకొన్న, నీవు ని
క్కమ మనపక్షమాట నిటఁ గల్గను గీ, డటు నేనుబోయెదన్॥ 36

తే॥ పలుకుతీపైన, మది హాలాహలము నమలు
కఱకు మొగలు చెలిమి నేమఱఁగఁబోకు:
నచటినాకు నీసాయ మేదైనఁ గలుగు,
నిచటినీకు నే దూరమౌటెఱిఁగి చొరుము"॥ 37

సీ॥ అని వారి వీడ్కొల్పి, తనరాక వచియింప
నచటిరహస్యంబు లరసి తెలుప
రఘునాథబల్లాలు రయమునఁ బంపించి,
స్వయముగా దుర్గరక్షణము లరసి,
దైవతారాధ నోత్సవములు వెలయించి,
మంగళాచార ధర్మములు నడిపి,
శ్రీభవానికి మ్రొక్కి, జీజియాదీవనల్
శిరమునఁ గొని యామె సెలవుఁ బొంది,

తే॥ పంచశత మశ్వసేన - కాల్బలము వేయి
నడువ, నంగరక్షకులు తానాజిమొదలు
పనుగు రేతేరఁ, దనయు సాంభాజిఁగూడి
యరిగె శివవిభుం 'డాగ్రా' ప్రయాణ మొంచి॥ 38

చ॥ పురమునువీడి ప్రాంతములఁ బోవుచునుండఁగఁ బాదుషాహియు
త్తర మిటువచ్చె "నీ వనుమతంబున వచ్చుట వింటి, మందుకై
తెరువున కొప్పుతీరులు విధించితి, మింపున ర" మ్మటంచు; నిం
తరసి శివప్రభుండు ముదమందుచు ముందుకుసాగె వేడుకన్॥ 39

ఉ॥ "సాహస ధైర్య శౌర్య గుణసాగరుఁడై నిజదేశ వైభవో
న్నాహ కుతూహలంబున రణంబు లొనర్చి, జయించిరా వరా
రోహ కరంబువట్టు చతురుండు శివుం డిటువచ్చె" నంచు ను
త్సాహముతో జనుల్ జనపదంబుల మూఁగిరి కానుకలిచ్చుచున్॥ 40

ఉ॥ వారలభక్తి మెచ్చి పరివారముతో 'నవురంగబాదు' కే
తేర, నొకింతమేర పరతెంచి యెదుర్కొనుకవితో సుబే
దారుఁడు పాదుషాయనుమతంబునఁ గానుకలు లక్ష్యరూప్యముల్
గారవమొప్పఁగా నిడినఁ గైకొనుచున్ శివుఁ డేగె మీఁదటన్॥ 41

ఉ॥ పావన నర్మదానిల సభాజితుఁడౌచు, నగస్త్యవాక్పకీ
భావిత వింధ్యనిర్గమన బంధురుఁడై, మధురాపురంబునన్
దేవకిసాగనంపు వసుదేవునితోఁ జెఱసాలఁ జూచి, బృం
దావన బాలకృష్ణు చరితంబులఁ జొక్కుచు నాపయిన్ జనెన్॥ 42

ఉ॥ తా నిటురాక - పెక్కుశపథంబులతో జయసింగు పంపుచోఁ
బూనిక - పాదుషా మనసుపోకడ - కొల్వునఁ గల్గఁబోవు స
మ్మాన - మొకంట రాఁగల ప్రమాదము నెన్నుచుఁ బోవుచుండ, నా
గ్రా నగరాగ్రిలక్ష్మి శివరాజునకున్ గనుపట్టె దవ్వులన్॥ 42

ఉ॥ అంతకుమున్నె యావనధరాధిపు నానతిపైనఁ దత్పుర
ప్రాంతమునన్ శివప్రభునిరాకకు వేచిన పాదుషా చమూ
కాంతులు - రామసిం, గొక మొగల్సరదారుఁడు - చేరవచ్చి య
త్యంతము సత్కరించి విడియన్ గొని తెచ్చిరి గారవంబునన్॥ 44

తే॥ కోటవెలుపల రమణీయకూలమైన
'జయపురపు రాచమేడ' లో సపరివార
ముగ శివప్రభు విడియించి, తగుసపర్య
లరసి చనిరి వా రధిపతి కెఱుకసేయ॥ 45

### శివాజీ పాదుషాకొల్వున కేగుట.

మ॥ మఱునాఁ డింద్రసభా సమగ్రసుషమా మర్మస్పృశాస్థాన మం
దిర సింహాసనమందు నోలగమునన్ డిల్లీశ్వరుం డుండ, నం
బరురాట్సూనుఁడు రామసింగు చెలియై మార్గంబుఁ జూపింపఁగా
నరుదెంచెన్ శివరాజు సైన్యయుతుఁడై యాస్థానమున్ జేరఁగన్॥ 46

సీ॥ సామంతభూకాంత చతురంగ సంకుల
ద్వారదేశమున సేవకుల నిలిపి,
తురగ దంతావళోద్ధుర వీరభటరాజి
రక్షిత కక్ష్యాంతరములఁ గడచి,
యధికార తారతమ్యక్రమ స్థానగా
రవ యుతోద్యోగివర్గముల దాఁటి,
పార్శ్వద్వయోపాంతభాగ భద్రాసనో
త్తంసి తామాత్యసత్తములఁ దఱిసి,
తే॥ సింహగమనముతో రామసింగువెంట
ధీర గంభీర ముద్ర నేతెంచుచున్న
శివపతినిఁ జూచి యౌరంగజేబు "రమ్ము -
రమ్ము శివరాజ" యని యాదరమ్ముఁ జూపె॥ 47

ఉ॥ $ మేరుశిఖా సవర్ణమగు మేలిమిగద్దియనుండి పాదుషా
వారకపిల్వ సాంబుని భవానినిఁ దండ్రిని మ్రొక్కునట్లు ము
మ్మాఱు 'సలా' మొనర్చి, నవమౌక్తిక రత్న సువర్ణ ముద్రికా
వారముఁ గానుకవెట్టుచు శివప్రభుఁ డొండొకఠీవి నిల్చినన్॥ 48

---

$ "Sabhasad says that Shivaji made a triple salam reconciling himself to the act by mentally devoting the first bow to the god Sambhu Mahadev, the second to the goddess Jagadamba and the third to his father Shahji."

Page 276, *N. S. Takakhav.*

మ॥ † అనుసంధింపుచుఁ బాదుషా కొలువుమర్యాదల్ విడంబింపఁగాఁ
గనుసన్నన్ గనె రామసింగు; నతఁడున్ గర్తవ్యమున్ జేయువాం
తున గుప్తాంబులకైదువేల కధినాథుల్ నిల్చు కక్ష్యాంతరం
బున నిల్పెన్ శివరాజుఁ, దా నచటియొప్పుల్ వేఱ వర్ణింపుచున్॥ 49

చ॥ † జరుగుచునుండె నేఁబదవ జన్మదినోత్సవ మష్ప యావనే
శ్వరున; కతండు రత్నముల బంగరునన్ దులఁదూఁగి, యందు సం
దఱకును దన్మహాధనము దానముసేయఁగ నుండె; నిట్టి సం
బరమునఁ బల్కరింపర శివప్రభు నెవ్వరుగాని కొల్వునన్॥ 50

ఉ॥ † తీఱనిసందడిన్ మునిఁగి తేలెడి కొల్వు కెఱుంగరాక యే
మీఱెడుకాల మొక్కనిమేషమునన్ దనయున్కి పోల్చికొం
చూఱటఁబాసి, యంతటి నిజోన్నతి నేఁడధమంబుగా - నహం
కార తిరస్కృతం బగుటగా శివరాజు మదిన్ దలంచుచున్॥ 51

ఉ। ఇంతటినాఁటినుండి యొరు నెవ్వనినేఁ గొలువంగఁబోని సి
ద్ధాంతము నామతించిన స్వతంత్రుఁడు, గద్దియనెక్కి మంత్రి సా
మంతుల కాజ్ఞసేయఁగల మంతునఁ బోల్చు శివప్రభుండు నేఁ
డింత యగౌరవంబును సహింపక వెచ్చనికన్ను విచ్చుచున్॥ 52

తే॥ "ఎంతవేఁడుక లున్నఁ, దా నెంత సార్వ
భౌముఁడైనను, దన కెంతబలఁగ మున్నఁ,
బిలువనంపినమర్యాద కొలువునందుఁ
దలఁపఁడో! పాదుషా యేమిదలఁచినాఁడొ!॥ 53

ఉ॥ అండకుఁజేరఁగా ధనము లంపుచుఁ, బైనిటు మాఱిపోవుచో
నొండొక కుచ్చితం బతని కుండక పో, దదియున్నఁ గొల్వునం
దుండుటయెట్లు - వేఱుపడి యోసరిలన్ జనుటెట్లు? ధర్మవి
రుండనురీతి కార్యచతురుండనుఖ్యాతియుఁ బాయుటొప్పునే!॥ 54

---

† Pages 173 and 174 *J. N. Sarkar.*

చ. ఒకఁగుట నాకుఁ గానిపని; యుద్ధతిఁ రేఁగినఁ గార్యహానికిన్
గుదురగు; నైన దాని ననుకూలముఁజేయ భవాని యున్న; ది
య్యదన శివప్రభుండు వితతాత్మబలంబున వీరపీఠమున్
బాదఁవక మానఁ" డంచుఁ దలపోసి, తనున్ దనపంక్తిఁ జూచుచున్॥

ఆ॥ వె॥ చెంతనున్న రామసింగు నీక్షించి "యీ
వరుస నున్నవారి పరువదెంత?"
యనుచు నడిగి, యాతఁ "డైదువేల్ గుఱ్ఱపు
దండుదొర" లనంగ, దానఁ గినిసి॥ 56

ఉ॥ తన్నొకయైదువేల సరదారునిఁగాఁ గొలువందు నిల్పుచున్
జిన్నతనంబుఁగూర్చె ననుచిచ్చునఁ గ్రాఁగు నెడంద మోమునన్
గన్నుల మిణ్గురుల్ గురియఁగా వెడఁబొమ్మున వీఁగి, ధీర గ
ర్జన్నవమేఘమై కుడికరంబునఁ గొల్వును మూదలింపుచున్॥ 57

శా॥ "ఏమేమీ! శివరాజు - దక్షిణజగం బేకైకవీరక్రమో
ద్దామప్రౌఢిమ గెల్చుమేటి యిపు డీదర్బారునన్ నిల్చువాఁ
డై మూల్యంబున నైదువేలసరదారై కొల్వుకాఁడయ్యెనే?
యీ మర్యాదల కొగ్గి నిల్వలవలెనే యే మిందుఁ గైమోడ్పులన్॥ 58

సీ॥ ఏ డెన్మిదేఁడులవాఁడు మాసాంభాజి
తా నైదువేల సర్దారుఁడయ్యె,
నేతాజి మా చమూనేతలలో మేటి
తా నైదువేల సర్దారుఁడయ్యె,
నని వానికోడి వీఁగిన రాయసింహుండు
తా నైదువేల సర్దారుఁడయ్యె,
నట్టిసర్దారుల కధినేత శివరాజు
తా నైదువేల సర్దారుఁడయ్యె,

తే॥ నిదియ కాంభోలు నంతరు వెఱుఁగుకేతి!
యెదుటిపరువము మన్నించు చదురులివియొ!
ననుఁ బిలువఁబంచి యిటు చిన్నతనముసూపు
పాదుషాడెందమున నెంతపదను గలదొ!॥ 59

మ॥ † జయసింహులుం డటు లాడుటేమి? మది మెచ్చన్ జేయఁగాఁ బాదుషా
నయగారంబులు వ్రాయుటేమి? యెదురై నన్నింపఁ దోడ్తేర నిం
త యుదాసీనతఁ జూపుటేమి? సభ సత్కారంబు లిట్లేమి? సుం
త యుదారంబుగఁ బల్కరించుతెఱఁగైనన్ బాదుషా యొల్లఁడో?॥ 60

ఉ॥ § తల్లికిఁ దండ్రికిన్ స్వగురు దైవతకోటికిఁదక్క నన్యుఁ డే
బల్లిదుఁడైనఁగాని తలవంపని నేను నమస్కరింపఁ, దా
నుల్లసమందకున్నఁ దలయూఁపుననే బహులీయరాదొ? యీ
యొల్లమి నాత్మయుండి కనులుండియు సభ్యుఁ డెవండు మ్రింగెడున్?॥

ఉ॥ అంతులొసంగి నన్ బిలువనంపి యగౌరవ మిట్లుచేయఁ దా
నెంతటివాఁడొ! దక్షిణమహీ తతహైందవ వీరనేత నే
నెంతటివాఁడనో! యెఱుఁగఁడేఁ - యెఱుఁగన్ బనిలేదె? యిందు సా
మంతులు సైన్యనాయకు లమాత్యులుగా నగు మీ రెఱుంగరే?॥ 62

చ॥ నియతివిధానమున్ మిగుల నేరక యోఁదలవంచి కొల్వుకాం
డ్రయి తనుఁ గొల్చుమాత్రమున హైందవవీరు లుదారగౌరవో
చ్చయమును బాసిరే? స్వకుల జాతి మత ప్రభుతా పరాక్రమో
దయములు రూక కమ్ముకొని దాసపదంబున దోసిలొగ్గిరే?॥ 63

† Page 272, *N. S. Takakhav.*

† "No costly present. no high title, no kind word even, had followed his bow to the throne." P. 85, *Aurangzeb.*

§ "His spirit could not bear such humiliation as the other Umrahs to wait at a distance with their hands before them, like mutes." P. 85, *Aurangzeb, Vol. VI. Sarkar.*

తే॥ అఖిలభారత ధర్మసింహాసనమునఁ
గాలుమోపుచు, హైందవ గౌరవంబుఁ
దలనుమోయక యఱకాలఁ దన్నివైచు
నవమతిని నైఁపనేర్చు హైందవుఁడు గలఁడె?॥ 64

చ॥ ప్రియమునఁబిల్చి నన్ బరిభవించినవాఁ డొకసాకువెట్టి మ
ర్నియ మిటు కొల్వువారికయినన్ గలిగింపఁడె? యాత్మగౌరవ
క్షయమున కొగ్గి క్రుంగి మనఁగా నెవఁడొంచెడిఁ? దానొకండ యే
మయి యిలనేలు రాజు — స్వజనాదరణంబును గాలఁదన్ననే?॥ 65

తే॥ పాదుషా యొక్కఁడొకమాట పల్కకున్నఁ
గొదవ మాకేమి? తన కేమిగొప్ప గలదు?
నమ్మి కొలువున్నవారి మనంబులందు
మేలుకొనుఁగాక యిర్వుర మేలు కీడు"॥ 66

మ॥ అని గర్జించు శివప్రభున్ గను మొగంబై, 'యేమి?యే' మంచు, 'నా'
ననియున్ 'గా' దని వారెటుల్ గనుపరీరై, కొల్వు మాన్సెత్రె; వే
గనులన్ జూచియుఁ జూడలే దనుకడంకన్ బాదుషా "యేమి యే"
మని ప్రశ్నింపఁగ, రామసిం గుచితవాక్యారంభుఁడై యిట్లనెన్॥ 67

మ॥ "అమృతప్రాయ దరీ ఝరీ విపిన సహ్యాస్వైరసంచార ధీ
ర మహారాష్ట్ర మృగేంద్రుఁ డీ యవనసమ్రా డంచితాస్థాన దు
ర్దమ సమ్మర్ద నిదాఘదాహ లుళిత ప్రత్యగ్ర ఘూమాయితాం
గములన్ గర్జిలసాగె, శీతలకటాక్షం బిందు సారింపుఁడీ!"॥ 68

చ॥ అనుటయుఁ బాదుషా వికలితాశయుఁడై "యిపు డేమిసేయ నే
యనువునమాఱునో" యని యపాయ ముపాయము నెంచి, కూర్మిఁజూ
పినయటు "సేద దీఱుటకు వే గొనిపొందు నివేశభూమి" కం
చని విడియం బొసంగె; విభునానతిఁ గైకొని రామసింహుఁడున్॥ 69

తే॥ ఒక్కజడివాన వెలిసిన యొప్పు మిగులఁ
బాదుషాకొల్వు గంభీర భావ ముద్ర
స్తిమితమైయున్నఁ, గనులలోఁ దీపరించి
ఫాలముల నాడె శబలిత భావ చపల॥ 70

చ॥ కొలువున వారువారు దమకుం దగుకీతిఁ దలంచుచుండ, నా
పులమనువారు డగ్గఱి "ప్రభూ! తమకొల్వున నిట్టులాడు నా
బలియు నెడందలోఁ గలవు పాములు; వానికి బైటరాకపో
కల కెడమిచ్చుచో నిజముగాఁ బెనుపుట్టలు పుట్టుఁగొల్వునన్" ॥ 71

చ॥ అనుటయుఁ బాదుషా యిది యథార్థ మటం, చతఁ డెంచుఁ బోవనే
రనియటు కాపుసేయఁ బురరక్షకుఁడైన 'ఫౌలాదుఖాను' కా
జ్ఞ నొసఁగి, "మాటలాడఁదగు సంగతులన్నియు రాయబారితో
ననుపుము, నీవు రావలవ" దం చెఱిఁగించె శివాజి కొయ్యనన్॥ 72

తే॥ ఇంత యెఱిఁగి శివప్రభుం "డిందు మోస
మేదియైనను గలుగకపో" దటంచు
జాగరూకుఁడై, జరుగు బాగోగు లరయఁ
బాదుషాగారి కిటు కమ్మ వ్రాసి పంపె॥ 73

మ॥ తమ యాహ్వానము వెంట వచ్చితి; ముదాత్తంబైన యాగ్రాపురీ
కమనీయత్వముఁ జూచికొం చిచటనే కాలమ్ము చెల్లించు యో
గము లేే; దక్షై బిజాపురంబు మనపైఁ గాల్దువ్వి గర్జించి రా
జ్యమునెల్లన్ గొననుండె; నిత్తఱి నవశ్యం బేము పోఁజెల్లదే!॥ 74

చ॥ పిలిచినకూర్మికిన్ విలువఁ బెంచుచు, మున్ను వచించినట్లు మా
కలవడనున్న 'దేశముఖ' హక్కులతో నధికారమిచ్చి పీ
డ్కొలుపుఁడు; పోవునట్లు రిపుకోటిపయింబడి పాఱఁదోలి, మీ
తలఁపున కెక్కు చందమున దక్షిణరాజ్యములన్ జయించెదన్"॥ 75

చ॥ అను శివరాజునుత్తరము నందుచు, నప్పుడ పాదుషాహి కొ
ల్వునఁ దగువారిఁ గూర్చికొని పొందికలన్ దలపోసె; వారలా
తనిగుణముల్ ప్రవర్తనముఁ దప్పుగఁజూపుచు వేఱువేఱు తోఁ
చినయటు లాడి; రంతఁ బరిశీలనసేయుచుఁ బాదుషా యనెన్॥ 76

ఉ॥ "ఆతనిఁ బిల్వఁబంచితి సహాయముఁగోరి, సహాయ మెంచియే
యాతఁడు వచ్చె; ద్రోహ మనునట్టిది యిర్వురయందుఁదోఁప; దే
మాతని సత్కరింపమి యధార్థమమైనఁ దిరస్కరించు సం
కేతము లేదు; లేనియపకీర్తి పయింబడు టేమనన్ వలెన్!॥ 77

ఉ॥ సందడివేళయాట నొకసత్కృతి తప్పినయంతమాత్రనీ
తుందుడుకేల? తాను బలధూర్వహుఁడైనను సార్వభౌముకొ
ల్వందున నుండు టెంచవలదా? యతఁ డాడిన పల్కుపోకడన్
ముందును వెన్కఁ గొన్ని తెరబొమ్మలప్రాపు గలట్లు దోఁపదా?॥ 78

ఉ॥ † అంతయుఁ బట్టిచూడ నసహాయుఁ డతం డనఁ గాదు; నేఁడు సా
మంతులు సిక్కు లాఫ్ఘనులు మార్కొనుచుండిరి పొంచి; యీసభా
భ్యంతరమందె మాపలుకులాడుచు వానికిఁ దోడుసూపు కా
లాంతకు లుందురేమొ! యిదియంతయుఁ దంత్రముగాఁ గనంబడున్॥

ఉ॥ * 'హాని ఘటింపఁబోని తెఱఁగారయుచున్ శివరాజుఁ బంపినన్
గాని బిజాపురంబణఁపఁ గా' దనియెన్ జయసింహుఁ; డా దిలే
ర్ఖానుఁడు తద్విరోధ పరికల్పన లెన్నుచుఁ 'బ్రాణహాని సం
ధానముగూడఁ బోలు' ననెఁ; దత్త్వవినిర్ణయ మెట్లుచేయఁగన్!॥ 80

† "...He (Aurangzeb), therefore, came into conflict with the Hindus, the Afghans and the Persians, all of whom he hated alike." Page 232, 'Muhammadan India.'
*C. S. S. Chari & M. S, R. Aiyangar.*

* Pages 180 & 181, *J. N. Sarkar.*

ఉ॥ ఆతని దుండగంబు విని యంతిపురంబునవారుగూడ న
ప్రీతి సయిస్తఖానునిచరిత్రముఁ బల్కుచుఁ 'దానుదానుగాఁ
జేతికిఁజిక్కువాని నెడసేయుట తప్పను ము' ప్పటంచు ని
ర్భీతి వచింపసాగి; రిటు పెక్కుతెఱంగులఁ జిక్కు లేర్పడన్॥ 81

ఉ॥ కావున నన్నియున్ దరిచి కార్యము గొందము; సత్కరించి స్వే
చ్ఛావిధిఁ బంపరాదు, పెనుసంకెలకున్ గుఱిసేఁతగాని హ
త్యావిధిగాని గూడదు; నయంబున నీచెఱసాల నిట్టులే
కావలి గట్టిగా నిలిపి కాలముఁబుచ్చినఁ దేలు నన్నియున్॥ 82

తే॥ పరిసరంబుల మార్పులఁబట్టి, నాఁటి
కవసరోచిత మార్గంబు లరయవచ్చు;
'గ్వాలియరు' గాని 'కాబూలు' గాని పంప
వచ్చు; నొదిఁగినచో మేలుపఱుపవచ్చు"॥ 83

సీ॥ అని తననిర్ణయంబును దెల్పి పాదుషా
శివపతి కిటు వార్తఁ జెప్పిపంపె,
"నీ వచించినదెల్ల నిజమైన, నీ తలం
చినయంతవేగ ని న్ననుపఁ గాదు,
దక్షిణదండయాత్రలఁ బూర్తి సేయఁగా
వలసిన సర్దార్లఁ బనుపుసేతు,
మఱుమైన నీకోరినటు సత్కరింపుచు
సెలవిత్తు, మందాఁక నిలువవలయు;"

తే॥ ననుచు బదులిచ్చి, "శివపతి నందు నిందుఁ
గదలకుండ, నెవ్వా రట మెదలకుండ
రాకపోకల బంధించి రక్షసేయు"
మని పౌలాద్ఖాను కుగ్రశాసనము లిచ్చె॥ 84

చ॥ పదపడి రామసింగునకుఁ బాదుషహా యిటు దెల్పె "నీ వెఱుం
గుదువు శివాజివర్తనము గొల్వున, వాఁ డధికప్రసంగముల్
గదుపక పోఁడు, నీ వతనికార్యములందున భాగహారి వ
య్యెద! విదిమెంచి కాచికొను మేమఱ కాతఁడు జాఱకుండఁగన్"॥

చ॥ అనుటయు రామసింగు బహులాడఁగఁజాలక 'చిత్త' మంచు వీ
డ్కొని, యిది తండ్రికిన్ దెలిపి కొంతమెలంకువతోడ; బాదుషా
యనుమతినీక కాపుగడ నంతకునంతకుఁ బెంపుసేయుటన్
గని శివరాజు దైవికవికల్పములన్ దలపోసె నీగతిన్॥ 86

శివాజి చెఱసాలనుండి వెడలి రాయగడముఁ జేరుట.

చ॥ "అనుకొనినంత దైన, దీఁక నైనను గాఁగలయంతదాఁక దీ
నినిఁ జననీక మేల్కొనుట నేరిమి; మానవుసర్వశక్తి మిం
చిన విధియేది సేయు - నదిచెల్లు; స్వతంత్రతలే కహంకరిం
చిన నను దైవ మీకరణి శిక్ష - పరీక్ష యొనర్చునేమొకో!॥ 87

ఉ॥ యావనసార్వభౌము మరియాద లెఱింగియు సాహసించి నే
నీవిధి రాక తప్పనుచు నిప్పుడు దోఁచెడుఁ గాని, తప్పుగా
భావము సమ్మతింపదు; విపత్తులకున్ వెనుకాడి సాహస
శ్రీ విడువాఁడు లోకహితసిద్ధిఁ దృణంబుఁ గదల్ప నేర్చునే!॥ 88

ఉ॥ ఎన్నఁడుఁగాని నాజతన మిట్లు నిరర్థకమై ప్రతీపమున్
గన్నది లేదు; కంటఁబడు కార్యము కాలికిఁ జేతి కందఁబో
కున్నది లేదు; నేఁడు సమయోచితమౌ నొకతాల్మి లేక, యాఁ
కొన్నటు కొల్వులోన దుడుకుంగొను టింతకు మూలమయ్యెనో!॥ 89

చ॥ అవు, నటు కార్యవాది బిరుసాడఁగరా దనుటొప్పు; నైన మా
నవుఁ డొకమానవంతుఁడు తృణంబుఁగ దా నగునప్పు, డాత్మగౌ
రవమున కగ్గిలోఁబడక ప్రాణభయంబునఁ బ్రాఁకులాడఁ: డి
ట్లివుట స్వభావ, మెంతటిమహాత్ములో దాని జయింపఁగావలెన్!॥ 90

సీ॥ అప్పుడుఁగూడ నే నరసితి సమయంబుఁ,
బాదుషామది వేఱుపాటుఁ గంటిఁ,
బిలుపులోఁగలకూర్మి తలఁపులో లే, దెను
రోఁకనుటలో విడిదిలోఁ గనఁగ లేదు,
కొలువులో 'రా' మ్మని పిలుచుటేగాని తీ
యనిమాట దగినమర్యాద లేదు,
సముచితస్థాన పీఠము లీగి లేదు - చే
తులుగట్టికొను నిల్వుకొలువెగాని,
తే॥ యింత విషమించు పాదుషా యెట్టిమేలు
సేయుఁ - దఱివేచి తఱిమి శిక్షింపుఁగాని!
యని యెఱిఁగి, వారి కొక్కింత యనుపుఁగొలిపి
వెడలిరా, భేదతంత్రంబు నుడువవలసె! 91

చ॥ అది యొకయెత్తు, మెత్తవడినందున మేలిమిలేదు, రేఁగుచున్
గొదకొనఁ బాదుషా కినిసి కొల్వుననే చెఱఁబట్టవచ్చు; ని
ట్లొదవిన చిక్కులో నొకరినొక్కరు నమ్మఁగఁబోని భేదముల్
మదిఁ గలిగించి, వట్టి యనుమానపుఁజీఁకటిఁ గొల్వుఁదాఁటితిన్॥ 92

ఉ॥ అంతటికొల్వులోన నెదురాడిన తెంపు దలంచి, యందులో
నెంతరహస్యమో తలఁచి యిప్పటికిన్ ననుఁ జెన్కలేర వా;
రంతియగాక నేఁ దలఁచినట్టిపనిన్ గొన నింతకంటె వే
ఱంతర మబ్బదంచు సమయమ్మును వమ్మొనరింప కాడితిన్॥ 93

చ॥ ఇటుగన నేనువచ్చుటయు నిందలికార్యము తప్పుగాదు; న
న్నిటు జయసింగుపంపునపు డింతయుఁ దా మదినెంచి 'మోసగిం
చుట కిటుసల్పెనో' యనుట చొప్పడ, దాతఁడు యుద్ధభూమి ను
ద్భటుఁడగుఁగాని జాతిమత భంగములన్ దలపెట్టఁ డెన్నఁడున్॥ 94

చ॥ తనబలమున్ బ్రతాపమును దద్దయుఁ బెద్దగ నుత్సహించి, 'నీ
కెనయగువాఁడు లేఁ' డనిన నెంతయునుబ్బు నమాయికుండు గా
వునఁ దనమాట చెల్లునని పొమ్మనెఁగా, కవురంగజేబు తెం
పునఁగొని నన్నుఁ దన్నుఁ దనపుత్రకు ద్రింగునటం చెఱుంగునే!॥ 95

ఉ॥ ఆతఁడు వంచకుండనుట యర్థముగా; దవురంగజేబు కా
ర్యాతురుఁ డాత్మలాభ మరయన్ దగదా? యిట దోషి యెవ్వఁ? డీ
భూతకథాప్రసంగములఁ బ్రొద్దులుపుచ్చక భావికార్యమున్
జేతు, నదృష్టలక్ష్మి కుడిచేతికిఁ జక్కఁ—లిగింత గొల్పుచున్॥ 96

చ॥ పొగయును వేఁడియున్ బరిసిపోవకము, న్నవురంగజేబు డా
బుగఁ గనుదోయి విచ్చుటకుమున్నుగ, నొక్క రహస్యతంత్రమున్
బొగచి బలంబుతో నెగిరిపోయెదఁ గన్నులుమూసి; యింతయున్
ముగిసెడుదాఁక నాజతనమున్ విధియొక్కఁ డెఱుంగుఁగావుతన్"॥ 97

సీ॥ అనియెంచి శివభూపుఁ డవురంగజేబున
కపుడ యీరీతి విన్నపము లంపెఁ,
"దమయాజ్ఞ వచ్చునందాఁక మే మిాపట్ట
ణమున వసింప సిద్ధముగ నుంటి,
మిచటి శీతోష్ణాను లింతయుఁ బడక మా
సైనికులందఱు జబ్బుపట్టి,
రందున వారువో ననుమతి నిప్పింపుఁ,
డదిచాలు, మామాట యరయుఁడవల"
తే॥ ననెడు విన్నప మంది, "సైన్యములులేని
యితనిలోఁగొంట సుకర" మం చెంచి యపుడ
యనుమతినిఁ బంపెఁ బాదుషా; యదియ తనకు
మిపుల ననుకూలమని యెంచె శివవిభుండు॥ 98

చ॥ అవల శివాజి సైన్యపతులందఱితోఁ బయనంబు వల్కి, "యి
ట్లవుటకు విన్నవోకుఁ, డిదియంతయు మీఁదట మేలుగూర్చు; మే
మవసరమెంచి మీ చనిచయవ్వలఁ దోడనె వత్తు" మంచు నా
ప్తవచన మాడి, ముఖ్యులగు తానజిదాసుల నొంటిఁ జేర్చుచున్॥ 99

తే॥ తన ప్రయత్నము, దానికై తగినవెరవు,
లంచు మెలఁకువ పొందిక లంతువెలిపి,
వలయుధన మిచ్చి వేశ్వేఱ వంతుగొలిపి,
సంతసముఁజూపి యందఱ సాగనంపె॥ 100

ఉ॥ కొందఱమాత్ర మందుఁ దనకున్ బరిచర్యకు నిల్పికొంచుఁ, గొ
ల్వందునఁబెద్దలున్ బురమునందలిపెద్దలు మెచ్చుపట్లు - తా
నందఱితోడు కోరికొనినట్లు నటించి, శివుండు నేర్పుమై
నందఱఁ గన్నుమూసి హృదయంబును డాసి మెలంగె నచ్చటన్॥ 101

చ॥ దినము భవానిపూజలు విధించెడు వేడుకలంచుఁ, భూసురా
ర్చనలు సుమంగలీసుపరిచర్యలు పండుగు లంచుఁ, దీఱు తీ
యన ఫలసంతతుల్ వివిధమా మధురమ్మగు పిండివంట లె
త్తిన పెనుబుట్టలన్ విలిచితీయు శివప్రభుఁ డాదరమ్మునన్॥ 102

మ॥ ప్రతిసాయం సమయంబునందు శివజీ బైరాగులన్ భక్తులన్
యతులన్ బిల్వఁగఁబంచి, పండ్లు మధురోపాహారముల్ పంచి య
ర్చితులన్ జేసి, మిటాయిపండ్లపుటికల్ చేనేత నంపించు నా
దృతి నుద్యోగుల కందుఁబెద్దలకు ఖ్యాతిన్ బ్రీతిఁ గాంక్షించుచున్॥

మ॥ తన కెందున్ బ్రతికూలముల్ నిలిచినన్ దా నింత శంకింపన
ట్లనుకూలంబులు సేసికొంచుఁ, జెఱయే నాకంబుగా మార్చు నా
తని యౌదార్యము ధీరసాహస ముదాత్తక్షాంతి వేఱొక్కచోఁ
గనమంచున్ వినమంచు డెందములు పొంగన్ బల్కి రా భూజనుల్॥

చ॥ † తనపయిఁ బాదుషా బిగువుదప్పని యాజ్ఞలు వెట్టుచున్న, వే
గను వెసకొల్పి రక్షకులు కావలియున్న, శివప్రభుండు దే
నిని గమనింపనట్లు - తన నిర్గమనంబు దలంపనట్లు - నిం
డినమది నుండినట్టులె నటించి దినమ్ములు పుచ్చెఁ గొన్నిటిన్॥ 105

సీ॥ 'దాన ధర్మములు భవానిపూజలె గాని,
తప్పించుకొనుదారి తలఁపఁ' డనియు,
'జనులకు నుద్యోగిజనుల కీతనిపైన
గౌరవాదరములు ఘనము' లనియుఁ
దలపోసి పాదుషా తన్ను దండింపలే
కదను నిరీక్షించు టది యెఱింగి,
కఠినమ్ముగాఁ జూచు కావలివా రిప్డు
సడలి, పైపైఁబోవు సరణి యెఱిఁగి,
తే॥ తాను వెడలిపో నిది మంచితరుణ మనుచు,
శివవిభుఁడు కార్యములనెల్ల సిద్ధపఱచి,
తనకు 'జ్వర' మని, యెవ్వరైనఁ దన్నుఁ బలుక
రించరా దని యెఱిఁగించి, మంచమెక్కె॥ 106

ఉ॥ అంతటి వీరుఁడై సకల యావనరాజ నిగూఢ గాఢ మ
ర్మాంత నికృంతనప్రవణుఁడై, సచివాష్టక సైన్యనాథ సా
మంతులు గొల్వఁ గొల్వైన సమగ్రరమా రమణీయుఁడైన తా
నింతటితన్నుఁ జూచికొని, యెంచె మదిన్ శివభూపుఁ డీగతిన్॥ 107

† "Repeatedly Shivaji declared openly that he was very happy at Agra .... that he was content to lead a restful, indolent life. .... This made Aurangzeb believe that Shivaji would now stay on without further trouble."

*Adi K. Sett - The Hindu, Sunday, April 2, 1639*

ఉ॥ "దైవము కన్నువిచ్చెనని తా నటు గంతులువేయుచో, నహం
భావము కన్నుమూసి యశుభమ్ములఁ ద్రోయదె! తప్పికొంటకున్
జెవగలాఁడె తా! నమృతజీవనమా తొలికాఱువానకున్
భావము పొంగుఁగా కశనిపాతము లెంచక సంచరింతురే!॥ 108

ఉ॥ ఏమియులేని నేను బలుపెక్కిన రా జగుటేమి, శాత్రవ
స్తోము మడంచుటే! మిపుడు తోడటి యీచెఱసాల నిట్టులై,
యేమియులేనివాఁడ నగుటే! మిదియంతయు దైవలీల! యి
ట్లే 'మఱియే' మటన్న బదులిచ్చు నెవం డిటఁ జీఁకటింటిలో!॥ 109

ఉ॥ నాలుగుమాసముల్ గడచె నా జననీ పదసేవ లేక, మ
త్పాలిత జన్మభూమికి సపర్యలు లేక, మదాప్తకోటితో
నోలగ మీక, నన్నుఁ దనయున్ జెఱలో నుడికించుచున్న యీ
కాలము గర్భవాసనరకమ్మునకున్ బ్రతిమై కలంచెడున్!॥ 110

ఉ॥ ప్రేవులచిక్కులో నుదర పేటికలో మలమూత్రరక్త మాం
సావిల గర్భకోశమున నాఁకలిదప్పులకున్ దపించి, రాఁ
బోవఁగఁ దీరులేక పదముల్ కరముల్ విదిలించుచున్న మా
యావృతజీవుఁ డెంత యుఱియాడునొ బైటిజగమ్ముఁ జూడఁగన్!॥ 111

ఉ॥ ఈయుఱియాట దీఱఁగలదే తనయంతన? యంతదాఁకఁ గ
న్మూయఁగవచ్చునే? యవనభూపతి యెప్పుడొ చిత్రగుప్తుఁడై
వ్రాయఁడె? గర్భరక్షణకుఁ బంపునె చక్రము నేఁడు శౌరి? నా
యాయువుతోఁడ హైందవధరాభ్యుదయంబు దొఱంగు టొప్పునే?॥

చ॥ ఇఁకఁ దడయంగరాదు; తనయేపున గర్భము నిర్గమించి బై
టికిఁ దలచూపు నర్భకుపడిన్ జెఱనుండి విముక్తిఁగాంతు; నిం
దుకుఁ దగుసాయ మేవయిపు దోఁపదు, మంతరసానియాచు సే
వకజన సౌఖ్యదాయిని భవానియె కానుపు సంతరించుతన్!॥ 113

సీ॥ 'శివరాజు నేఁడు దక్షిణభూమి మఱచినాఁ'
డనునమ్మకం బెందు నలముకొనియె,
నౌరంగజేబు న న్నసమర్థుఁగా నెంచి
కనుమూసి కడునమ్మకమున నుండెఁ,
గావలివారు నాకాన్కలఁ దనిసి బు
ట్టలఁ బరీక్షింపఁగా నలసులైరి,
సంకేతములవెంట జాగరూకత మించి
నాసేవకులు వేగునడుపుచుండి,
తే॥ రిది సమయ" మంచు శివరాజు పదనుమీఱ
సకలసన్నాహముల నెందు సంతరించి,
కనులఁ దెరఁగట్టు మసకచీఁకటులు ముసరు
నొక్కమునిమాపు వెడలిపో నుద్యమించె॥ 114

సీ॥ తనవంటివాఁడు నచ్చినబంటు 'హీరోజి'
యనువానిఁ దనతల్పమునకుఁ జేర్చి,
తన ముద్దుటుంగరి మాతనివ్రేలఁ గనిపింప
నిలువెల్లఁ దనసాల్వు నెఱయఁగప్పి,
యథావిధం బుపచార మరయఁగా నొకబంటు
వాఁకిటియందుఁ గావలిగఁ బెట్టి,
"యజమానుఁ డిపుడె క న్నంటెమోడ్చె, నెవ్వరే
నరుగరా" దనునట్టు లాజ్ఞ సేసి,
తే॥ పండ్లబుట్టల నొకట సాంభాజి నునిచి,
మఱియొకటఁ దా నొదిఁగి పండ్లు మాటుపఱచి,
ఫలములు మిఠాయి రక్షకుల్ పంచుకొనెడు
సంబరము నెంచి శివరాజు సాగఁజేసె॥ 115

వ॥ అనుదినరీతి బుట్టలు రయంబున మోయుచు సేవకుల్ భరం
బని వెలిదోఁపనీక, మనమందున జంకును గొంకు లేక చ
య్యనఁ జని; రిట్లుపోవుట క్రమానుగతంబని రక్షకుల్ - పురం
బునఁజను లూరకుండి; రిటు బుట్టలు సందులగొందులన్ జనెన్॥ 116

చ॥ నగర బహిస్స్థలంబు విజనంబగుపట్టునఁ బ్రుడ్లబుట్టలన్
దిగి శివరాజు పుత్రకుని దింపి, నిజానుచరాళి వేఱువే
ఱుగ వెనురాఁగఁ - దాను గొమరున్ గొని వేఱుగఁబోవ - నందఱున్
దగు నొకచోటఁ జేరఁ గఱదల్ వివరించి కదల్చెఁ బైనమున్॥ 117

మ॥ ఇట హీరోజియు వేఁగి, వేగుటకుముందే లేచి, తల్పంబునన్
బటువౌ దిండు నమర్చి దుప్పటము నాపైఁ గప్పి, తా వైద్యుఁ బి
ల్చుటకై యేగినయట్లు యేగె; భటుఁడున్ జూపెట్టుచున్ ముందుదె
చ్చుటకై యేగినయట్లు యేగె; శివరాజున్ జేరి రాయిద్దఱున్॥ 118

తే॥ పదిగడియలపొద్దెక్కినప్పటికి, నందుఁ
బరిజనులు రామియును శివప్రభుఁడు లేమి
రక్షకు లెఱింగి; రీవార్త లాక్షణంబె
పురములోఁ గొల్వులో నెందుఁ బొంగిపోయె॥ 119

సీ॥ 'పంజరంబునఁ జిల్క పాఱిపోయె' నటంచు
నౌరంగజేబు పెల్లదవదించి,
తనయత్న మిటుల వ్యర్థముసేయు రక్షక
భటులపైఁ గోపతాపములు గురిసి,
సందులు గొందులు సత్రముల్ చావడుల్
విడి మాఱుమూలలు వెదుకఁబంపి,
"శివరాజు నెచటఁజూచినఁ బట్టుఁ" డని ప్రభు
త్వపుసీమకెల్ల నుత్తరువులంపి,

తే॥ "చుఱుకుగా నాల్గుదెసల వెన్నఱిమితఱిమి
శివపతినిఁగాని తద్భటశ్రేణిఁగాని
వెదకి బంధింపుఁ" డని తనవీరభటుల
జవన తురగాధిరూఢుల సాగఁదోలె॥ 120

సీ॥ ఇంతలు రాఁబోవు టెఱిఁగియె శివరాజు
తమరూపు సెదర వేసములుమార్చి,
మునువచ్చుదారిఁ బోయినఁ జిక్కులగునంచుఁ
గనరాని చుట్టుమార్గముల నడిచి,
పసివట్టనైన నాస్పదమీయకుండ గో
సాయి బైరాగుల చదురుఁగలిసి,
కాశీ గయా ప్రయాగక్షేత్రముల మెట్టి
యమల గంగాప్రవాహమున మునిఁగి,
తే॥ యలసిపోయిన సాంభాజి నాదుకొనఁగ
మధురలోఁ బింగళేమంత్రిమఱఁదియింట
విడిచి, నడుమ నిక్కటులెల్లఁ గడచి, యవలఁ
బయనమై చేరె దక్షిణభారతోర్వి॥ 121

మ॥ పురమున్ బాసినదాది తొమ్మిదినెలల్ పూర్ణంబుగా నిండఁగాఁ
జెఱలో గర్భములోనఁబోలె నిడుమల్ జీర్ణించి, జన్మాంతర
స్ఫురణన్ వెల్వడి నేఁడు రాయగడమున్ జొత్తెంచు పుత్రున్ గుణా
కరు జీజాసతి కౌఁగిటన్ బొదివె నుత్కంఠాతిరేకంబునన్॥ 122

చ॥ తనయు శుభాగమంబున ముదంబునఁ బొంగిజిజాంబ దైవతా
ర్చనలు భవానిపూజలు భృశంబగువేఁడుక లన్నదానముల్
మునుకొని సల్పె; శ్రీశివవిభుండు సుతున్ బిలిపించి వెంటవ
చ్చిన తన యంగరక్షకుల సేవకులన్ దనియించి, గాన్కలన్॥ 123

సీ॥ తనప్రయాణంబు, గొల్వునఁ బాదుషాతీరు,
చెఱనుండి వెడలివచ్చినవిధంబు,
త్రోవలో యవనభృత్యులు వెంటఁబడుట, వే
సముమార్చి చుట్టుమార్గములఁ జనుట,
యొక చోఁ 'బటేలు' - వేఁజూకట గుఱ్ఱములమ్ము
వాఁడు గుర్తించుట, వారి కింత
ధనమిచ్చి తప్పించుకొనుటయు, సాంభాజి
యలయఁగా మథురలో నతని విడుట,
తే॥ మొదలుగా నిజచరితముల్ ముచ్చటించి,
యందఱును విస్మయమునఁ ద న్నభినుతింప
నలరి, శివరాజు నాఁట రాజ్యాంగవిధులఁ
జక్కఁబఱుప సన్నాహముల్ పెక్కుఁగూర్చె॥ 124

జయసింగు పశ్చాత్తాపము - మరణము.

చ॥ § అట నవురంగజేబు కడు నాతురుఁడై, "శివరాజు జాఱిపో
వుట కొకసాయమిచ్చి" రని పోకడలెత్తుచు రామసింహునిన్
దటుకునఁ గొల్వుఁబాపెఁ; బలుతప్పులు సూపుచు నిందమోపి "నీ
వటఁ దగ, విందు ర" మ్మనుచు నంబరునాథున కంపె నానతిన్॥
చ॥ అకుటిలుఁ డాత్మగౌరవ సమంచితుఁ డాజయసింహుఁ డట్లు తే
లికఁగని పాదుషాహివెడలించిన యుత్తరు వంది, బుద్ధిపూ
ర్వకముగఁ దానుజూపు ప్రభుభక్తి నిరర్థకమాటగాక నిం
దకు గుఱియాటకున్ గడు వెతంబడి యిట్లు దలంచె నాత్మలోన్॥

---

§ Suspicion naturally fell on Ram Singh. .... .... The Rajput prince was punished, first by being forbidden the Court and then being deprived of his rank and pay.

Page 186, *J. N. Sarkar.*

మ॥ "అవురారా! యవురంగజేబు తుద కిట్లన్యాయము ల్జేయువాఁ
డవునే! స్వార్థపరత్వ మింతకఱకొనా! ద్రోహిఁ గావించి న
న్నవమానించునె! హైందవుండ నగుటేనా యింతకున్మూల! మీ
యవనాధీశ్వరుసేవ పండఁగలభాగ్యం బిఁక వేఱున్నదే!॥ 127

ఉ॥ ఎన్ని తెఱంగు లెత్తి బఁకులిచ్చితి - మోసములే" దటంచు, "సం
పన్నుఁడు మీకుఁ జేర్పఁదగువాఁడు శివప్రభుఁ" డంచు, "నెట్టులే
మన్ననఁజూపుఁ డంచుః ననుమానము లెత్తుచుఁ దానుదానుగా
నన్నియుఁదప్పి, తప్పులవియన్నియు మాపయిఁ గ్రుమ్మరించునే!॥ 128

తే॥ అల దిలేర్ఖాను కొండెంబు, లల సయిస్త
ఖానుచుట్టాలయొరిమలు గమ్మనొచు,
మేము చేఁదైతి : మిన్నాళ్ళు మ్రింగనేమొ
జాతివిరసత! నే వెఱ్ఱినైతిఁ దుదకు!॥

సీ॥ అల జహాంగీరునాఁ డంచుకొన్న కృపాణి
కడఁబెట్ట కడరు నీ గడియదాఁక,
నూనూఁగుమీసముల్ నులివెట్టుటాది యీ
పలుచని కనుబొమల్ పండుదాఁక,
బలితంపుమేను కండలు రక్తమాంసంబు
లెడలిపో నంతంత కుడుగుదాఁక,
స్వ పర భేదము నెగ్గుపఱచి, యెత్తినకత్తి
కడ్డమైనది తుంటలైనదాఁక,
తే॥ శతశతాధిక యుద్ధముల్ సలిపి, విజయ
లక్ష్మిఁగొనివచ్చి తనదు కల్యాణమండ
పమున విడియించు నన్నుసైతము కృతఘ్నుఁ
గాఁ దలఁచువాని కిఁక నుపకారియెవఁడు!॥ 130

చ॥ చనవున నిన్ని నా కృతనిసంగడి నుండియుఁగూడఁ దత్ప్రవ
ర్తన మెఱుఁగంగ నైతి : శివరాజును దొందరవెట్టి కొల్వుకుణ్
బనిచితి : మీఁదకన్నుగలవాఁ డతఁ డొట నకాలమృత్యువ
ర్తన మడఁగించెఁ; గాక భరతక్షితి కెంతలు పుట్టియుండునో!॥ 131

చ॥ జయము ఘటింపఁ, దాను దన సర్వవిభుత్వముతో నితోధికా
వ్యయబల మందఁ బొందికలుపట్టియు నాసలుసూపి బాస లి
చ్చియు శివరాజు నేఁ బనుపఁ, జిక్కినవజ్రముదాఁప ట్రింగున
ట్లయి చెఱఁబట్టులే? యఱుఁగునా యతఁ డీయుదరాగ్నికీలకుణ్?॥

ఉ॥ వచ్చునె తన్నుఁజూడఁగ శివప్రభుఁ డూరక? వచ్చి రిత్తగా
వచ్చునె? గోపినాథువలె వారక నే నొళవిచ్చియున్న ము
చ్చిచ్చు జగంబునిండ నెగఁజిమ్మఁడె? యబ్జులుఖానుపేరెదణ్
గ్రుచ్చినవాఁడిబాకు - పులిగోరులు నేఁడును లేకయున్న వే?॥ 133

ఉ। అంతటివాని - హైందవ మతాభ్యుదయార్థము పూర్వ పశ్చిమా
శాంతము లొక్కచోఁ గలుపనైనఁ దెగించెడువానిఁ దక్కరో.
పాంతముఁ లేర్చుటన్న సులభంబె? స్వజాతిహితంబు మాను నా
పంతము తప్పు : దానికయి పాదుమహా యిటు బుద్ధిసెప్పెనో!॥ 134

చ॥ అవు, నిది నిశ్చయంబ : యిదియంతయు మున్నె వచించినాఁడు శ్రీ
శివపతి : నేన లేనిపరిశీలనసేసి మహమ్మదీయ - హైం
దవ మత మైత్రిఁ గోరి పలుదారులఁ దూఱితిఁ, దత్ఫలంబు లి
ట్లవగతమయ్యెఁ; నెట్టిమొగమై శివరాజును గందు నే నిఁకణ్॥ 135

చ॥ అనునయమొప్ప 'నీ యనుభవాతిశయం బొకవేళ్లఁ జూపు' మం
చని శివరాజుగోర నొక స్వాతిశయంబునఁ బొంగిపోతిఁ, ద
ద్వినయ వివేక సాహస మితిణ్ గననైతి; నతండె గండఁడై
తనకడకంట నీ పరికృతితత్త్వము 'లచ్చనగాయ' లాడునో!॥ 136

చ॥ నిజముగ నేఁడు సాంగయవనీకృతమై చెడు హైందవోర్వి దూ
రుజ లెడఁబాపి, తొంటి నిజరూపమునన్ వెలయింపఁ బెంప నీ
యజితపరాక్రముండె తగు; నాతనియెత్తులు శత్రుమర్మ బ
ల్బజ దవకీలలై యమృతవర్షములై భువనంబుఁ దన్పెడున్!॥ 137

మ॥ బలసంపన్నులు సింహవిక్రము లనల్పక్షాత్రులౌ రాజపు
త్రులు నేఁడున్ గల, రైనఁ గొందఱు నరేంద్రుల్ సఖ్య సంబంధముల్
గలవారై యవనేంద్రుఁ గొల్చి: రితరుల్ గన్మూసి: రౌపాయిక
స్ఖలితుల్ గొందఱు పోరుచున్ దెగిరి శుష్క క్షాత్రధర్మంబునన్॥

ఉ॥ ఈ విపరీతకాలమున నింతలు సంఘబలంబుఁ బెంచి, కా
ర్యావసరంబులన్ జతురుపాయములన్ నడిపించి, హైందవ
శ్రీ వెలయించువాని కుడిచేతికిఁ దోడ్పడ నోఁచ కిట్లు జీ
ర్ణావయవంబులన్ నవయునట్లు నశించెడునట్టు లయ్యెనే!॥ 139

ఉ॥ ఉన్నతుఁ డాతఁ డున్న యెడనుండుటకైనను లేదు, పాదుషా
మన్నన కిచ్చ లేదు, కొంటిమాలినబిడ్డని కన్నదమ్ములం
దున్నతి లేదు, కన్నకడు పోమెడు పున్నెము లేదు, 'లేదు లే'
దన్న వగర్పుతో బ్రతుకుటన్నది యుండియు లేమియే గదా!॥ 140

మ॥ శివరాజా! సెలవిమ్ము! నీ కుపకృతిన్ జేయంగ లేనైతి; శా
త్రవమున్ జేసినయట్టు లయ్యెఁ; జతురోదారుండవై నీవ య
న్నివెతల్ దీర్చితి, వేఁ గృతజ్ఞుఁడ; నినున్ దీవించి నీ వేలు హైం
దవభూమిన్ జనియింపఁ గోరుచుఁ బ్రయాణం బిట్లు సాగించెదన్"॥

చ॥ ¶ అను పెనుచింతఁ గుంది కృశుఁడై, యభిమానధనుం డతండు ద
క్కనుధరఁ బాసిపోవుతఱిఁ గన్నులుగుట్టు పరాభవంబుఁ దీ
ర్పను వెరవేది 'బ్రహ్మణపురంబు' కడన్ దను వుజ్జగించెఁ - బెం
చిన తనరాజభక్తి తుదిఁ జేసినపాకము లోక మెన్నఁగన్॥ 142

---

¶ Worn out by age, toil, disappointment and domestic

తే॥ వీరవిక్రమ విహరణోదారుఁ డగుచుఁ
గడకు నిజదేశభక్తితోఁ గన్నుదెఱచి
యరుగు జయసింగునస్తమయంబు వినుచు
శివవిభుఁడు నిల్వొఱప్పలఁ జెమ్మగిల్లె॥ 143

శివాజీ రాజ్యవ్యవస్థ - పరిపాలనక్రమము.

ఉ॥ ఆ యవురంగజేబిట నుదంతములన్ విని దక్షిణోర్వరా
నాయకుఁ జేసి పంపె నిజనందనుఁడైన "ముజం" కుమారుఁ, దో
డై యశవంతసింహుఁడు సహాయముఁ జేయఁగఁ బంపె; వారు సే
నాయుతులై స్వకార్యము లొనర్చిరి దక్షిణభూమిఁజేరుచున్॥ 144

చ॥ జరిగినపోరులందుఁ దమసైనికు లెంతయు డస్సి వీఁగి లా
వఱుటయుఁ, గ్రొత్తసేనలసహాయము వచ్చెడుదారిలేమి నే
ర్పఱచి ముజంప్రభుండు జసవంతునకున్ వినిపించి యుద్ధముల్
జరుపుటమాని వేఁటల విలాసములన్ గడపుచ్చెఁ గాలమున్॥ 145

చ॥ శివపతి — పాదుషా తనకుఁజేసిన మోసము లోనఁ జిచ్చుగా
రవులుచునున్నఁ - గాలబల రక్షితుఁడై పగఁదీర్ప వేచి, యా
హావమున క్కొప్పు సాధనము లాయుధముల్ బలఁగంబు గూర్చి, దు
ర్గ వితతిఁ జక్కఁజేయుచు మొగల్ సరదారులవైఖరిన్ గనెన్॥ 146

ఉ॥ వచ్చినవారిలోన జసవంతుఁడు హైందవపక్షపాతియౌ
సచ్చరితుండు, వేడుకలచందమువాఁడు ముజంప్రభుండుగాఁ
ద చ్చపలత్వమున్ గనినదక్షుఁడుగాన శివప్రభుండు పో
రిచ్చుటకంటెఁ బొందికలనిచ్చుట నేఁ డురవంచు నెంచుచున్॥ 147

---

anxieties discredited in his master's eyes .... .... the Rajput veteran set out on his homeward journey in extreme misery of mind and sense of public humiliation and died on the vay at Burhanpur.

Pages 94 & 95 "Aurangazeb" Vol. IV. *J. N. Sarkar.*

ఉ॥ కానుకలిచ్చి, నెచ్చెలిమిగన్పడ రాకలుపోకలిచ్చి, స
న్మానములిచ్చి, వారి యభిమానముఁ గైకొని "మీకు మాకు మై
త్రీ నిబిడంబు సంధి యొనరింపు" మటంచు శివాజి పాదుషా
సూనునిఁ గోరె, యుక్తమనుచున్ దనతండ్రికి వ్రాసె నాతఁడున్॥

చ॥ తనయుఁడు బేలయౌచుఁ దెగుడారితనంబునఁ బోవలేమిఁ గై
కొని యవురంగజేబు తనకున్ బ్రతికూలరణంబు లందునం
బెనయుటఁగాంచి "వీరి నెలయింపుచు నేఁటికి సంధిగూర్చుటే
యను" వని యెంచి యుత్తరువులంపె నుదారతమీఱ నీగతిన్॥ 149

సీ॥ † "శివరాజు మాతోడఁ జెప్ప కేగుట కేము
చింతించితిమి, గొప్ప సేయ నుంటి;
మిప్పు డాతనికోర్కె-యే దీర్చుచున్నార -
మతనిప్రాంతములెల్ల నతనికిచ్చి,
సాంభాజి కైదువేల్ సరదారుతన మిచ్చి,
(1) 'సర్దేశముఖ' (2) 'చౌథు' సనదు లిచ్చి,
పేర్మి 'రాజా' యను బిరుదంబునిచ్చి, 'బీ
రారు' ప్రాంతములు జాగీరు లిచ్చి;

తే॥ యిచ్చినవి మాకు నతనికి హెచ్చుగావు,
కలవు ముం దిర్వురకుఁ జేయఁగలవి పెక్కు,
మనసు మనసుతోఁ గలిపి మామైత్రి నెఱపి
యతఁడు మెలఁగుచు ముందు మే లందవలయు"॥ 150

† Page 177, *James Grant Duff.*

(1) The sardeshmukhi was a hereditary vatan (grant of land) burdened with the charge of revenue collections. The Deshmukhs (Revenue Collectors) used to receive about 10% of the revenues, 5% in cash or grain and 5% in grants of arable land. (2) 25% of the land revenue of a district.

చ॥ అని యవురంగజేబొసఁగునానతిఁ గొంచు ముజంప్రభుండు చ
య్యన శివరాజుఁ బిల్చి, ప్రియమారఁగఁ దంప్రడియొసంగు కానుకల్
సనదులు జాగిరుల్ బిరుదు సర్వము నిచ్చియుఁ జెల్మికల్మి నిం
డిన మనసిచ్చి, విందులు ఘటించి కడున్ దనియించె వేడ్కలన్॥ 151

చ॥ కుతుక కళా వినోదరసికుండు ముజంప్రభుఁ డిట్లు దక్షిణ
క్షితి రణధూమరేఖ లడఁగించి విహారములన్ గడాంగె; నీ
యతుకున మించి కార్యవిదుఁడైన శివప్రభుఁ డా బిజాపురీ
పతి నొవఁగింప, రావలయు పన్నులకై వెడలించె దూతలన్॥ 152

ఉ॥ * మోగలుపోరులం దలసిపోయిన యాదిలుషాహి యిప్పు డా
మోగలుచెల్మితో బలముఁబొందు శివప్రభు ధిక్కరింపఁగా
నాఁగక, మూఁడులక్షలగు సర్థము సాలున కిచ్చువట్లు మై
త్రీ గుణమైన సంధియొనరించె నిజాభ్యుదయంబుఁ గోరుచున్॥ 153

ఉ॥ * ఆదిలుషాహి సంధిగొను టారసి, ఢిల్లడి గోలకొండయున్
గాదన కైదులక్షలధనంబును సాలున కిచ్చునట్టి మ
ర్యాదల సంధిగూర్చె; శివరా జిటు దక్షిణహైందవోర్వి స
ర్వాదరణీయ వైభవ సమగ్రముగాఁ బెనిచెన్ స్వరాజ్యమున్॥ 154

చ॥ ఇరువదిరెండువత్సరము లిట్లు నిరంతరయుద్ధరంగముల్
దిరిగి శివప్రభుండు వెనుదీయక మోగలుసార్వభౌము కే
లొఅసి పరాక్రమించెఁ - బగయొత్తు బిజాపుర గోలకొండ భూ
వరులు విదేశవర్తకులు వంతముఁబాయుచుఁ గప్పమీయఁగన్॥ 155

ఉ॥ తోరణఁ బట్టుటాది పలుదుర్గములన్ గొని, కొంకణంబు బీ
రారు పునా సుపా మొదలు ప్రాంతములున్ బరరాజ్యసీమలున్
జేరిచికొంచు, బల్పెనయు సేనలు సైన్యపతుల్ భజింప దు
ర్వార పరాక్రమక్రమ నిరంకుశుఁడై శివరాజు రాజిలెన్॥ 156

ఉ॥ ఇంతలు రాజ్యవైభవము లెందును బెంచినయట్లు వాని కే
స్వంతయు లోప మెప్పటికిఁ జొప్పడకుండఁగఁ దీరుసేయు ట
త్యంతహితంబుగా సమయ మారయుచున్ శివరాజు నీతిసి
ద్ధాంతము లెత్తి పాలనవిధానములన్ నియమించె నేర్పునన్॥ 157

సీ॥ చిననాఁడు తోడఁజేర్చికొని జీజియామాత
వినిపించు రాజనీతినిఁ దలంచి,
తనవెంట నడిపించుకొనుచు దాదోజ నే
ర్పిన రాజ్యపాలన విలువ దెలిపి,
విజ్ఞానదృష్టి వివేకించి రామదా
సస్వామి యిడు ధర్మసరణి వలచి,
భారతాదుల ధర్మపరిపాటి విడఁదీసి
ప్రాముఖ్యగాఁ దన యనుభూతిఁ జొనిపి,

తే॥ నాఁడు నేఁడును రాఁబోవునాఁడుగూడ
ఖలముగా కెట్టినిపుణులేఁ గొలువఁదగిన
నవ్య రాజ్యాంగ పరిపాలనక్రమంబు
శివమహీపతి చతురుఁడై సిద్ధపఱచె॥ 158

సీ॥ అష్టప్రధాన సైన్యాధీశు లాదిగా
నుద్యోగులును, వారి యుచితవిధులు,
చతురంగసైన్య శిక్షణ రక్షణము, లాయు
ధాగార వివిధ కార్యాలయములు,
భూపాలనము, న్యాయములతీర్పు, వివిధమా
ర్గాయ వ్యయ వ్యవహారసరణి,
మత జాతి నీతి దైవత సాధు గో ధర్మ
వృత్తి విద్యా ప్రజా విహితగతులు,

తే॥ మొదలుగా నన్ని భాగముల్ ముందువెనుక
లరసి బాగోగు లన్నింటఁ దరిచి తెలిచి,
యనుభవ న్యాయ శస్త్ర రాజ్యవ్యవస్థ
శివమహీపతి చతురుఁడై సిద్ధపఱచె। 159

చ॥ శివపతి యిట్లు రాజ్యపరిశీలనఁ జేసెడు వత్సరద్వయ
వ్యవధినిఁగూడ మొగలులవైపునఁ గీడుజనింపకుండఁ బై
చవిఁ దనసైన్యనాథుల ముజంప్రభుఁ గొల్వఁగఁ బంపి,, వాని చె
ల్మి వెలయ బల్మిసూపి యొకమెల్పున లోఁగొనుచుండె దేశముల్॥

చ॥ ఇటు శివరాజు పైకొనుట యెంచి, బిజాపురి గోలకొండ లోఁ
గుట దలపోసి. ప్రాంతములఁ గొంటకుఁ జింతిలియుల్, ముజంప్రభుం
డటఁ బ్రతికారముల్ సలుప కాడుటకున్ గనలెత్తి, పాదుషా
కుటిలత మీఱఁ బుత్రకునకున్ దగ నుత్తరువంపె నీగతిన్॥ 161

ఉ॥ "దక్కనుఁజేరి వైభవమదంబున భోగపరాయణుండవై,
టక్కరియైన శివాజికపటంబున లోఁబడి, వానిచెల్మికిన్
జిక్కి, తదీయసేవకులఁ జేర్చి మెలంగెద : విట్టులైనచో
దక్కనురాజ్యముల్ మనకు దక్కునె? యాతఁడు దక్కనిచ్చునే?॥

చ॥ † తగ దిది, యాజ్ఞగైకొనిన తక్షణ మచ్చటి సైన్యనాథులన్
బగఁ జెఱఁబట్టు, మాపయి శివప్రభునిన్ జెఱఁబట్టు; మింతయున్
దెగువ నొనర్పకున్న వెనుదీయని మా పటుకోపవృత్తి కీ
వగుదువు పాత్ర, మింతయు బయల్పడ కోడక నిర్వహింపుమీ!"॥ 163

చ † అను యవనేంద్రునుత్తరువు లందకపూర్వమె గూఢచారు లో
య్యనఁ బఱతెంచి సంగతి సమస్తముఁ దెల్పిరి శ్రీముజంకుమా
రున : కతఁ - డా ప్రపంచన యెఱుఁగని సాత్త్వికుఁ - డంతుదెల్పి మె
ల్లన శివరాజసైన్యపతులన్ బనిచెన్ దనపొత్తుఁ బాయఁగన్॥ 164

† Aurangzeb ordered Prince Muzzam to arrest Pratap

చ॥ † అటుపయిఁ దండ్రియుత్తరువు నందుచు, వారిని వెంబడించునా
ర్భటి యువరాజు సూపి, "విడఁబాఱి రరుల్ దమయాజ్ఞవచ్చిన
ప్పటి" కని తండ్రికంపె; నిటు పాసుమహా తొలిసంధిబంధముల్
దటుకునఁ ద్రెంచి పై పడుకుతంత్రములన్ శివరా జెఱుంగుచున్॥ 165

సింహదుర్గ విజయసన్నాహము.

ఉ॥ మ్రాఁగనువెట్టియున్న మృగరాజుఁ గశాహతి మేలుకొల్పిన
ట్లై గుమలెత్తి జూలుదివియన్ గొనుమై శివరాజు వంచనా
జాగరణంబునన్ జెనకు శాత్రవులన్ గుదియింప నెంచి యు
ద్యోగుల సైన్యనాథ సచివోత్తములన్ గని యిట్లు వాకొనెన్॥ 166

చ॥ "కడచిన యింతకాలము మొగల్బలగంబున కెత్తిపోక, పైఁ
బడినపు డాఁగి మార్కొనెడుపట్టున నుంటిమి, దుర్మదాంధులై
దుడుకులు దూరుపెత్తినను ద్రోసితి; మిప్పటికైన మాన రా
చెడుగులు, వారికంటెఁ బయిచేయిగఁ బైపడి క్రుమ్మకుండుటన్॥ 167

చ॥ కొలిచినసంధిఁ బ్రాణములకున్ గుటిపెట్టె నతండు; నాఁడు 'మా
కొలువుకు ర' మ్మటంచుఁ జెఱకున్ దిగఁద్రోయుటగాక, నేఁడు బ్రము
చ్చులవలెఁ బొంచి పైఁబడియెఁ; జూపులుమాటిచి యిట్టు లెన్నికొం
పలు రగిలించెనో యతఁడు భారతరాజ్యము చేతఁబట్టుచున్!॥ 168

ఉ॥ హైందవ సార్వభౌములగు నక్బరు - తత్తనయుండు - పౌత్రుఁడీ
చందమువారె? తండ్రిఁ జెఱసాలను మ్రింగిన కక్కసీని కీ
హైందవజాతిపై నొకదయాగుణ మున్నదె? రాజధర్మపుం
బొందిక యున్నదే? యిటు ప్రభుత్వము నిల్చునె? నిల్వనేర్చునే?॥ 169

---

Rao Guzar and Shivaji at Aurangabad. The Prince connived at their escape and then wrote to the emperor that ........ the Marathas had already left before receipt of the imperial firman and in consequence could not be put under arrest.

Chapter XX, *N. S. Takakhav.*

చ॥ తనియని రాజ్యకాంక్షఁ బలుదారులఁ దూఱినఁదూఱుఁగాక, యే
మనుకొని దేవతాలయములన్నియు ధ్వంసముసేసె? సాధు గో
హననము సల్పె? హైందవమతాగమసంతతి గాల్చె? దైవ మే
మని కనుమూయు? లోక మిదియంతయుఁ జూచి భరింపనేర్చునే?॥

ఉ॥ లోకము దైవ మేమనక లోఁగిన లోఁగెడుఁగాక! ధర్మర
క్షా కఠినవ్రతంబున నిశాత కృపాణము నెత్తి ముందు నే
దూఁకెద, నాకు ముందుపడి దూఁకెడుధీరులఁ దోడుగొందు, బం
దీకృత భారతీయజననీ పదశృంఖలఁ ద్రెంచివైచెదన్॥ 171

శా॥ జీజా ప్రాక్తన సత్తపఃఫలము, షాజీ జన్మభూ భక్తి, దా
దోజీ శిక్షణ, రామదాసమునినాథుం డిచ్చు విజ్ఞాన, మ
వ్యాజోత్సాహులు మీ భుజాబలము తోడైయుండఁగాఁ జండికా
పూజాపుష్పములట్లు శాత్రవశిరంబుల్ గోయ కే నోర్తునే?॥ 172

ఉ॥ లక్షలు కోట్లుగాఁ దనబలంబులుగుంపులుగట్టి పాదుషా
దక్షిణభూమియంతయు నుదగ్రత ముంచిన ముంచుఁగాక, ఫా
లాక్షునిశూల మెత్తి ప్రమథావళివోని బలంబు లెత్తి, శ
త్రు క్షయకారి తాండవకుతూహలినై పులివేఁటలాడెదన్॥ 173

చ॥ కదలినదండు శాత్రవనికాయము పర్వులువాఱె నర్మదా
నదిఁ బడిపోవుదాఁకఁ జరణంబు మఱల్పఁగరాదు, పాదుషా
యొదిఁగినయట్టు లున్న మన మోర్పుగొనన్ బనిలేదు; హైందవా
భ్యుదయము దక్షిణోర్వి నెలవుంగొని యుత్తరభూము లేలుతన్!॥ 174

చ॥ మతిచెడి ముందు సంధినియమంబులఁ దానుగ దాఁటు పాదుషా
గతిచెడుఁగాక; వాని కెరగట్టిన ప్రాంతము లాఁగి, దుర్గసం
తతి యిపు డాక్రమించుట ప్రధానము; తత్ప్రభవార్థినాచు, దు

చ॥ మొగలులచేతి దుర్గముల ముఖ్యము సింహగడంబు, దానిపై
నగణిత సైన్య సాధన సహాయముగాఁ బెనుకాపువెట్టి మ
ర్మగులగు శాత్రవుల్ మిగుల రక్షణ నుండిరి, దానిప్రాపునన్
దగులుచు నల్గడన్ బొదివి దక్షిణరాజ్యము లాక్రమింపఁగన్॥ 176

ఉ॥ కావున దానిఁబట్టి, కడగా రిపుకాండము నెట్టి, దండయా
త్రావిధి ముట్టి, యాపయిఁ ‘బురందర’ - మాపయి ‘మాహులీగడం’
బావరుసన్ వెలార్చిన, జలాశయ నిర్గమితంబులైన న
క్రావళివోలె లావఱఁ గదర్థితముల్ యవనేంద్రసైన్యముల్॥ 177

చ॥ అయినను సింహదుర్గ మనపాయ సుసాధము కాదు; చుట్టు న
క్షయ గిరు లొప్పు, గాఢపరిఖా గహనావృతమై, సమున్నతం
బయి, బటువైనకోట గలదై, నర పక్షి సరీసృపంబులున్
బయి కెగఁబ్రాఁక రానిదయి పర్వతశృంగముపైఁ జెలంగెడున్॥ 178

ఉ॥ దొమ్మిగఁదూఁకి యావనులు ‘తుగ్లకు’ ముఖ్యులు దక్షిణోర్వి దు
ర్గమ్ములు పెక్కు గూల్చినను, జాయి గదల్పఁగ రాక యప్రభే
ద్యమ్మయి యొప్పు సింహగడ మప్పటి కిప్పటికైన; నట్టిదు
ర్గమ్మును గెల్వకుండిన స్వరాజ్యము నేమని నిల్పుకోఁదగున్!॥ 179

ఉ॥ నిన్న జిజాంబ మేడపయి నిర్మలవాయువు లానుచుండి య
భ్రోన్నత సింహదుర్గమున నాడిన మొగలుబావుటాదెసన్
గన్నులువాఱ మంచు తెరగప్పినతెప్పల నన్నుఁ జూచె: నా
యున్నతి కామెకంటితడి యెత్తఁగఁ జేతులులేక నిల్చితిన్!॥ 180

ఉ॥ ననుఁగను వీరమాత నయనంబుల కందిన లోకమాత నా
జననిమనంబునన్ గదలు శల్యము శత్రుపతాకఁ దీయఁజా
లని నను మెచ్చునే జగ? మలంఘ్యము దైవము నాఁగి యిప్డు డేఁ
జనియెద, సింహదుర్గ సువిశాలకవాటముఁ గూలఁదన్నెదన్॥ 181

ఉ॥ గుబ్బలు జొమ్మనన్ జిదిమి కోటకవాటముఁ గూల్పఁజాలు పే
రుబ్బున మొక్కవోనిభటు లుద్ధతులై చనుదెందు; గండుకా
ర్మబ్బులతోడ దుర్గశిఖరంబున నాడు పతాక లాగి, మా
కబ్బురమిచ్చువీరునకు సాయన మీ కుడిపీఠ మయ్యెడున్"॥ 182

### తానాజీ ప్రతిజ్ఞ - సింహగడములగ్గవట్టుట.

చ। అన విని తానజీ వలుదలౌ భుజమూలము లుబ్బ లేచి, యొ
త్తు నెఱయు గండుమీసముల దువ్వుచు, వల్పలి వీరకంకణం
బును నెగదోఁపి, కుంకుమపుబొట్టున మూఁడవకన్నుఁగూడ వి
చ్చి, నిడుదవాలుదూయు కుడిచే యిలసోఁక జొహారువెట్టుచున్॥ 183

చ॥ "జయము! మహాప్రభూ! యొక యసాధ్యము దీర్పఁదలంచు మీరు సం
శయమునఁ గొల్వువైపుగను చందములేటి? కొకం డొకండె ని
ర్భయముగ సింగపుంగదుపు అచ్చలకీడ్వఁగ మేరు మందర
ద్వయమున బంతులాడ బలవంతులు - గల్గరె మావళాభటుల్ ?॥ 184

ఉ॥ ఈ జగజెట్లతో జగములెల్ల నొకెత్తుగఁ జాపచుట్టు తా
నాజికి సింహదుర్గ పరిణద్ధ కవాటము లెక్కయేమి? యు
ద్ధాజిర కాలభైరవ విహారములన్ యవనేంద్ర రాజ్యల
క్ష్మీజయకేతువున్ దిగిచి మీచరణంబులఁ గాన్కవెట్టఁడే?॥ 185

ఉ॥ పుట్టిననాఁటఁగోలె వెఱపుం జవిచూడక, మీపదంబుఁ జే
పట్టిననాఁటఁగోలెఁ దొలిప్రాణము మీకయి మీఁదువెట్టి, మీ
కట్టెడు రాచమేడ పెనుకంబముగాఁ దలయొగ్గు నాకుఁ గా
కిట్టి యనుగ్రహంబుఁ బరుఁ డెవ్వనికేఁ బొలివోవనిత్తునే?॥ 186

మ॥ ఎవఁ డాధీరుఁడు? నన్ను మీఱు మగఁడై యీబావుటాఁదీయఁగా
శివుఁడా కేశవుఁడా? ప్రభూ! యిటు కటాక్షింపంగ నేనొల్ల: నీ
యవనాధీశ్వరు బావుటా దిగిచి వ్రియ్యల్ సేయ నావంతు; మీ
ర[illegible] డింతచన వీయన్ జెలదో వీనికిన్!॥ 187

చ॥ కుడియెడ నున్నతాసనముఁ గోరఁ, బ్రభూ! తమపాదపీఠిఁ గే
లిడఁగల చోటు చాలు, నెనరొత్తిన మీకడకంటినీడ పైఁ
బడఁగల చోటు చాలుఁ, గడపాటున మీమదిచల్లగాలి సోఁ
కెడునెడ చాలు, నింత పరికించిన స్వర్గము నేలినట్లగున్!॥ 188

చ॥ ఘనులగు మీ సగర్భ్యులము గాఁదగ మైనను, నాకు మావళా
జనులకుఁ గన్నతల్లియె నిజంబు జిజాంబ; తదాత్మతృప్తికై
పనుపడువారిలో మొదటి బాధ్యత నాది, యతిక్రమించి కో
రినయది లేను, నన్ వెలువరింపుము తల్లిఋణంబుఁ దీర్పఁగన్॥ 189

చ॥ అటఁ గనుపట్టు సింహగడ - మందు మొగల్బల, మిందు మద్భుజా
పటుతయు మావళాబలముపట్టు దలంపుచుఁ దోడ్పాసంగ ము
చ్చటపడవల్వ, దే నొకఁడఁ జాలుదు, నాబలఁగంబు చాలు, న
చ్చట నుడివోని మీమనసు చాలు, జయించెద సింహదుర్గమున్॥ 190

చ॥ అవిరళముద్ర నా యడుగులంటని చోటులు సింహదుర్గమం
దెవియును లేవు, కోటపయి కెక్కెడునిక్కలు మాఱుత్రోవలున్
గవఁకులు నాయెఱుంగనివి గావు; భవానికటాక్ష మెందుఁ దో
డవునను పూనిక సింహగడ మైదవనాఁటికి గెల్చి తెచ్చెదన్”॥ 191

చ॥ అని కడుఁదెంపుమీఱఁ గొలువందుఁ బ్రతిజ్ఞయొనర్చి, తానజీ
తన తనయున్ బదేండ్లచిఱుతన్ శివభూపతి చేతఁ బెట్టి, “యీ
తని ననుఁబోలె మీచరణదాసునిగాఁ గొనుఁ, డేను జేయఁగ
ల్గిన తమసేవ పాయక వెలింగెడుఁగాక యఖండదీపమై॥ 192

చ॥ ఇఁక నొకమాట, బాలకున కీతని కాఱవనాఁడు పెండ్లి, నాఁ
టికి రిపుకోటితోఁ బ్రతిఘటించిన నేఁ జనుదెంతునేని బా
సికమును గందుఁ, గానియెడఁ - జెప్పెడిదేమి - సమస్త మీవ; నే
నిఁకఁ బయనింతు, సింహగడ మిప్పటికే ననుఁ దొందరించెడున్॥ 193

తే॥ చనిన తానాజి రిక్తహస్తముల రాఁడు,
కనుఁడు విజయంబు నైదవకాళరాత్రి
వేగులోపల గడముపై వెలుఁగుఁ జూచి;
శివమహాప్రభూ! నే నింక సెలవుగొందు!”। 194

మ॥ అని తానాజి వచింపఁగా శివవిభుం డాతంక ముదాంకితా
ననుఁడై, యాతనిచేయివట్టుకొని, “తానా! యెట్లుభావించి యే
మని సాధించితి విట్టిసాహసము! సౌహార్దైకసూత్రంబునన్
నను బంధింపుచు నీవు పైకొనితి, వన్నా! ధర్మనిర్వాహివై। 195

చ॥ తనయునిపెండ్లికిఁ వదనుతప్పఁగ రాదని ‘సింహదుర్గమున్
గొనఁ జను ధీరుఁ డెవ్వఁ’ డని కోరితిఁగాని మఱొందుగాదు; నీ
మనసు నెఱుంగనే? యహితమర్దన శక్తి నెఱుంగనే? తత్కా
లున మునుదూఁకు నీతెగువలో నెటువోవఁగరాక నిల్చితిన్!॥ 196

ఉ॥ త ప్పనఁగూడ, దొ ప్పనఁగఁ దాలిమిరా, దటుచన్నపాదమున్
ద్రిప్పవు, నేన ని న్ననుసరింతు, జయంబునఁ బోయిరమ్ము; పైఁ
గప్పు నరాతులన్ దునిమి కార్యముగొమ్ము; భవిష్యదర్థముల్
తప్పమిఱుంగులో వెలువరించు భవాని యనుగ్రహించుతన్!”॥ 197

మ॥ అని తాంబూల నవాంబరాభరణ మాల్యాదుల్ బహూకార మి
చ్చి నితాంతోత్సవరీతి వీడ్కొలుప, నుత్సేకించి తానాజి యా
త్మ నివాసంబును జొచ్చి ధీరులగు నాప్తశ్రేణి రావించి మం
తనముల్ సేసి యుపాయముల్ వినిచి సన్నాహంబులన్ దీర్చుచున్॥

ఉ॥ చారులఁబంపి, దుర్గమునసంగతి వెల్పలిదారితీరు ప్రా
కారము లెక్కరీతి పయిఁగావలివారలపెంపు సైన్య వి
స్తారము దుర్గనాథు బలసంపద సర్వమెఱింగి తానజీ
వీరభటాళితో నడిచెఁ జెంపున సింహగడంబుఁ గెల్వఁగన్॥ 199

సీ॥ * అది - మాఘమాసాంత్యమగు కృష్ణనవమి, చీఁ
కటులు కన్నులుగుట్టు కాళరాత్రి,
ఘాతుక వనజంతు కహకహారావముల్
గుహలు మార్మ్రోయించు కొండత్రోవ,
పొగరేఁగు ఫూత్కారములఁ గోడెనాగు ల
క్కఱఁ బర్విలాడు నగాధపరిఖ,
గండోపలములఁ బ్రక్కలు మేసి, యెగఁబ్రాఁక
ననువీని గిరిశిఖ రాగ్రభూమి,
తే॥ యొకటి యొకటిగా నన్నింట నొదిగి మెదిగి,
దూఁకి యెఁగఁబ్రాఁకి దోఁగాడి త్రోవలెత్తి,
గుండెజడియని కాలరుద్రుం డతండు
కోటకడఁ జేరె నైర్ఋతికోణమందు॥ 200

ఉ॥ అచ్చటి కోటగోడ దిటమై నునుపైనదిగాన 'రక్షకుల్
గ్రచ్చుఱ నెచ్చరమ్ముగొని కావలియుండ' రటంచుఁ దానజీ
యచ్చటఁ గోటనెక్క ననువారసి, యిమ్ముగు సాధనమ్ములన్
జెచ్చుగ దీటుకొల్పి తన వీరభటావళి హెచ్చరింపుచున్॥ 201

సీ॥ కోట పైభాగంబుకొొస నంటుకొని పట్టు
విడకుండ నుడుమును విడుచునట్లు,
తాను దత్కటిరజ్జు వానుచుఁ బైకెక్కి
దిగుత్రాళ్ళ మేకులు దించునట్లు,
వానివెంబడి మావళానీక మేనూఱు
వడివడిగాఁ గోటఁ బ్రాఁకునట్లు
తమ్ముఁడు సూర్యాజి తక్కిన యేనూఱు
బలముతో వెనువెంట వచ్చునట్లు,

* Page 194, History of the Marathas - *J. Grant Duff.*

తే॥ తాను మునుమెత్తి ముందుగాఁ దారసిల్లి
యరులఁ దునుమాడ, సూర్యాజి యదనుఁబట్టి
పైకొనెడునట్లు, 'హరహర' ధ్వనులఁ దమ్ము
దెలిసికొనునట్లు సంకేతములు వచించి॥ 202

చ॥ ఉడుమును జేతఁబట్టి, సమయోచితలాలన ముట్టి, రజ్జువున్
నడుమునఁ గట్టి, చెందిరమునన్ నిడునామముఁ బెట్టి, "కాళికా!
చిడిముడిపాటులేక జయసిద్ధి ఘటింపు" మటంచుఁ దానజీ
విడువఁగఁ, బైకిఁబోకదియు వెన్క-మొగంబున వచ్చెఁ గ్రిందికిన్॥ 203

చ॥ "అది యశుభమ్ము - దుశ్శకున" మంచు భటావళి విన్నవోవఁగాఁ
జెదరని యాత్మనిగ్రహ విశిష్టుఁడు ధృష్టుఁడు తానజీ విధిన్
గదిమెడు వాఁడిచూపుల నెగాదిగఁ జూచి, కటారు కేల దా
నిఁ దిగిచి బుగ్గలన్ నులిమి నివ్వెఱకున్ గుఱిగా నదల్చుచున్॥ 204

చ॥ "మఱతువె కాళికా! యహితమర్దన దుర్దముఁడైన తానజీ
కఱకుఁదనంబు? ముం దిడినకాలు మఱల్పఁగఁ జూచినావె? ము
న్నిరువదియేడు దుర్గముల నిట్లు జయింపఁగఁ దోడుసూపి నేఁ
డఱమఱలేల? క్రొత్తచదువాయిది? నిన్నిటు జాఱనిత్తునే?॥ 205

ఉ॥ నమ్మికతో శివప్రభుఁడు నాపయిఁ బెట్టిన భారమేమి! పూ
జ్యమ్మగు జీజియాంబ మనసంటిన నెవ్వగఁ దీర్చుటేమి! తీ
వ్రమ్ముగఁ గొల్వులోఁ బ్రతినవట్టుట యే - మిపు డీవు సేయు కా
ర్యమ్మిదియేమి! నన్నిటు పరాభవకీలల ద్రుగ్గఁజేతువే?॥ 206

శా॥ ఆయువు లుండుదాఁక వెనుకాడగనీకును నాకుఁ గాదు; బ్ర
హ్మాయువుతోడ వైరు లెదురైనను వారక వారి కుత్తుకల్
గోయకమాన, సింహగడకూట చలద్యవనేంద్ర కేతువున్
దీయకమానఁ; బొమ్ము, వెనుదీయక కోటనుబట్టి నిల్వుమా!"॥ 207

మ॥ అని గర్జింపుచుఁ గోటపై విసరివేయన్, గోపసంఘూర్ణితా
ననమై జివ్వునఁ బ్రాఁకి యొక్కత్రుటిలోనన్ గోటపై కెక్కి ప
ట్టు నెడంబాయక నిల్చె నయ్యుడుము; తోడ్తో దాని సుస్థైర్యమున్
గని తానాజి తదంగరజ్జువునఁ బ్రాఁకెన్ బొల్చె సన్నాహియై॥ 208

సీ॥ నడుముపట్టికలోనఁ బిడిబాకు దిగదోఁపి,
కరవాలు వ్రేలాడఁగా నిమిడ్చి,
కుడిబుజంబున వేఁటకొడవలి దిగవైచి,
దానిపైఁ బటు ధనుర్దండ మిఱికి,
దాపలిబుజము నొత్తఁగ నంపపొది వెట్టి,
పెనుడాలు మూఁపుపై బిగియఁగట్టి,
కటితటంబున మోపుగడియ మోకులుసుట్టి,
ఘనకుంత మందుఁ బొందెనయఁ జొనిపి,
తే॥ యుచితపరికర లంఘనోద్యుక్తుఁ డగుచుఁ
దన్ను దనవేసమును జూచి తనకుఁ దాన
పొంగునొడ్డలితో నిడుమోకుఁ బొదివి యుబికి
గునుకుపరువుతో నెగఁబ్రాఁకి కోటనెక్కె॥ 209

ఉ॥ నాలుగువైపులన్ గని జనంబులసవ్వడి లేమి యెంచి, పై
చాలున మేకులూఁది డిగజాఱఁగ మోకులు వైవ, మావళుల్
వ్రాళుల నూఁదిపట్టి యెగఁబ్రాఁకుచునుండి; రతండుగూడఁ బై
నేలకుఁ జేరువారి శయనింపఁగఁజేయుచు నుండె నచ్చటన్॥ 210

చ॥ సరసరఁ జప్పుడౌ మొగలుసైనికుఁ డొక్కఁడెఱింగి రాఁగఁ, ద
చ్చరణరవంబుఁ బట్టి శితసాయకమున్ గుఱివెట్టి తానజీ
సరగున వానిఁ గూల్చె; నిటు సందడిసేయక మావళాభటుల్
త్వరపడి ప్రాఁకుపట్టి యెగఁబ్రాఁకిరి కొందఱు కోటమీఁదికిన్॥ 211

తే॥ ఒక్క మావళాభటుఁడు పై కెక్కునపుడు
పట్టుసడలుచు నడుముపైఁ గట్టియున్న
శాతఖడ్గము పైనుండి జాఱిపడఁగ
'ఖంగు' మని గొప్పచప్పుడు గలిగెనచట॥ 212

ఉ॥ ఆ వెడసవ్వడిన్ ద్వరితులై చనుదెంచిరి గుంపుగట్టుచున్
గావలివార; లింక జుణుఁగన్ జెడిపోవు నటంచుఁ దానజీ
తీవరమంది, యందుఁ బరతెంచిన యేఁబదిమందిమావళుల్
దో వెడలంగ వారిపయి దూఁకె నిశాత కృపాణపాణియై॥ 213

చ॥ కవిసిన కాళరాత్రి లయకాలకృతాంతులువోలెఁ జుట్టునన్
గవియుచు మావళాభటులు గత్తులకున్ బలివెట్ట, గుండె పె
ల్లవియుచు రక్షకుల్ విముఖులై పరువెత్తిరి గాని, తానజీ
యెవనినిఁగాని జాఱిచననీక పయింబడి కోసెఁ గుత్తుకల్॥ 214

చ॥ చటులరణంబు కోటపయి సాగెడు చప్పు డెఱింగి మావళా
భటులటఁ జీమబారువలెఁ బై కెగఁబ్రాఁకుచుఁ, గోటకెక్కినం
తటఁ దమవారితోఁ గలిసి దర్పముసూపుచునుండ, రక్షకుల్
బటువుగ గుంపుగట్టుకొని పైఁబడి పోరిరి చిమ్మచీఁకటిన్॥ 215

ఉ॥ "ఎందఱో! యెవ్వరో! యచటి కెందుల కెవ్విధి వచ్చిరో!" యటం
చుం దడబాటునొంది, కనుచూపులకందని కత్తిపోటులన్
గుంది, కుఠారకుంతములఁ గూలుచుఁ గావలివారు చిక్కి, రా
చిందులుద్రొక్కి పైనఁబడు చీకటిదయ్యపు వేఁటకాండ్రకున్॥ 216

ఉ॥ అంతటిదాఁక మౌనమున కానయొసంగిన తానజీ నిజో
పాంతముఁ జేర్చి గుంపుగొని పైఁబడు వైరులతుత్తుమురంపె దు
ర్దాంతవిహారుఁడై 'హరహర' ధ్వని ముందుకుసాగెఁ, దద్భటుల్
చింతులుగొల్పుచున్ హరహరధ్వనితోఁ బయిదూఁకి రార్చుచున్॥

మ॥ అని గద్దింపుచుఁ గోటపై విసరివేయన్, గోపసంఘూర్ణితా
ననమై చివ్వునఁ బ్రాఁకి యొక్కత్రుటిలోనన్ గోటపై కెక్కి ప
ట్టు నెడంబాయక నిల్చె నయ్యుడుము; తోడ్తో దాని సుస్థైర్యమున్
గని తానాజి తదంగరజ్జువునఁ బ్రాఁకన్ బోల్చె సన్నాహియై॥ 208

సీ॥ నడుముపట్టికలోనఁ బిడిబాకు దిగఁదోఁపి,
కరవాలు వ్రేలాడఁగా నిమిడ్చి,
కుడిబుజంబున వేఁటకొడవలి దిగవైచి,
దానిపైఁ బటు ధనుర్దండ మిఱికి,
దాపలిబుజము నొత్తఁగ నంపపొది వెట్టి,
పెనుడాలు మూఁపుపై బిగియఁగట్టి,
కటితటంబున మోపుగద్దియ మోకులుసుట్టి,
ఘనకుంత మందుఁ బొందెనయఁ జొనిపి,
తే॥ యుచితపరికర లంఘనోద్యుక్తుఁ డగుచుఁ
దన్ను దనవేసమును జూచి తనకుఁదాన
పొంగునొడ్డలితో నిడుమోకుఁ బొదివి యుబికి
గుసుకుపరువుతో నెగఁబ్రాఁకి కోటయెక్కె॥ 209

ఉ॥ నాలుగువైపులన్ గని జనంబులసవ్వడి లేమి యెంచి, పై
చాలున మేకులూఁది డిగజాఱఁగ మోకులు వైవ, మావళుల్
త్రాళుల నూఁదిపట్టి యెగఁబ్రాఁకుచునుండి; రతండుగూడఁ బై
నేలకుఁ జేరువారి శయనింపఁగఁజేయుచు నుండె నచ్చటన్॥ 210

చ॥ సరసరఁ జప్పుడా మొగ్గల్నసైనికుఁ డొక్కఁడెఱింగి రాఁగఁ, ద
చ్ఛరణరవంబుఁ బట్టి శితసాయకమున్ గుఱివెట్టి తానజీ
సరగున వానిఁ గూల్చె; నిటు సందడిసేయక మావళాభటుల్
త్వరపడి త్రాడుపట్టి యెగఁబ్రాఁకిరి కొందఱు కోటమీఁదికిన్॥ 211

ఉ॥ మొగలుదంతుతోడ రసపుత్రబలంబులుగూడి సాహసో
ద్యోగముఁ బెద్దసేసి పులిదూఁకునఁ బైకొన, మావళాభటుల్
మూఁగుచు రేఁగి వైరిశిరముల్ దెగఁగోసిరి - ఖడ్గనృత్తముల్
దీఁగమెఱుంగు భంగిమలు దీర్పఁగఁ, జీకటిపుల్గువేఁటలన్॥ 224

ఉ॥ చీఁకటిపోరులోఁ బరులచేతికి లోఁగెడు నాత్మసైన్యమున్
బైకొనఁజేయఁగా నుదయభానుఁ డొగిన్ దివటీలు కాగడాల్
కాఁకర బీర పూచినటుగా నలువైపు వెలుంగఁజేసి, ద
ర్వీకర భీకరాసి జళిపించుచుఁ గోల్తలవెట్టె సేనకున్॥ 225

మ॥ తమ సర్దారునిప్రాపుఁజెంది రసపుత్రవ్యూహముల్ మీఱుచున్
గములై, కుంత కుఠార ముద్గర గదా ఖడ్గాది నానాయుధో
ద్యమముల్ సూపుచు దివ్వటీవెలుఁగునన్ దర్పింపఁ, దానాజి దు
ర్దమ గర్జాధ్వను లిట్లుమ్రోసె స్వభటోత్సాహంబు గల్గించుచున్॥

మ॥ "రణభూమిన్ జెరలాడుఁ డింక భటులారా! మావళా కీర్తికా
రణమై వచ్చిన దాజి; శత్రుశిరముల్ ఱాపాడి బేతాళపా
రణముల్ సేయఁగ వేళయైనది; తమిస్రాదేవి రోషానలా
రుణనేత్రంబులు వేయి విచ్చినది - వైరుల్ జాఱిపోకుండఁగన్॥ 227

మ॥ విడిచేతన్ బుజ మప్పళించి నికటోర్వీన్ మావళావీరుఁ డొ
క్కఁడు మార్కొన్న, భయంబునన్ బులియు సింగం బెగ్గు పేడెత్తి ప
ర్విడు; నీ యావనసేన లెంత! యిపు డుద్రేకించినన్ మీర లీ
గడమున్ బామునఁ బెల్లగింపుచు శివక్ష్మాభర్త కర్పింప రే!॥ 228

తే॥ వైరికరవాల విలిఖిత వ్రణకిణాంక
బహుళతా లభ్య రణవీరపట్టభద్ర
బిరుదమున రాచకొల్వులో విలువఁ బెంప
నదనువచ్చిన, దింకఁ దారాట దగునె?॥ 229

మ॥ అదిగో! తూరుపుఁగొండపై నెఱుపు డంబై తోఁచె, నొక్కింతలో
నుదయించున్ నెల; కోడిపుంజు విజయం బుద్గీవమై పాడఁగా,
గుదులైకూల నరాతులన్ నతికి చిక్కుల్వాపి యీ బావుటా
గదలింపుం, డిది నేఁటి సైంధవ వధాంకం బౌట గుర్తింపుఁడీ!॥ 230

మ॥ కరదీపంబులఁ బట్టినారు ప్రతిపక్ష ధ్వంసనోత్సాహులై
యరు, లీరీతిఁ బరోపకారమును జేయంబూనిరో! మీరు దు
ర్భర శౌర్యాగ్ని చటచ్చటల్ రిపుతమఃప్రాగ్భారమున్ జీల్చ, ను
ద్ధురులై కోయుఁడు శత్రుగాత్రములసంధుల్ కాగడావెల్గునన్॥ 231

మ॥ మెఱుఁగుందీవియ లాడ వాలుగొని దొమ్మిన్ దూఁకి యీవైపు మొ
గ్గరమున్ జీల్చెద - రండు నా వెనుక : మత్ఖడ్గాహతోద్ధూత జ
ర్ఝరితారాతుల జాలనీ కడఁచి శీర్షచ్ఛేదనాటోప మే
ర్పాటఁ జూపింపుఁడు, కాలరుద్రపరిపాటిన్ ముందు నేఁ జొచ్చెదన్”॥

మ॥ అని తానాజి వచింపుచున్ హరహరోద్యన్నాదియై రేఁగి చెం
గున లంఘించి, కటారు కేడెము మెఱుంగుల్ వాఱ సారించి యా
వనసేనన్ నుఱుమాడెఁ; దద్భటులు నల్వైపుల్ విజృంభించి ఘూం
చి నిరోధించి కలంచి కూల్చి రరులన్ జితాహవప్రౌఢిమన్॥ 233

మ॥ తనువెల్లన్ బెనుకోఁతలైన పులియై తానాజి ఖడ్గాహతిన్
దునియల్ సేయుచు, బాకునన్ జిదుముచున్, దోరంపుఁగుంతంబునన్
బెనుదండన్ గుదిగుచ్చుచున్, బిడికిటన్ బీడింపుచున్, గాలితాఁ
పునఁ ద్రూలింపుచు మృత్యుతాండవము నేపున్ జూపె నల్వైపులన్॥

ఉ॥ తోరపువేఁడిమై నుబికి దూఁకెడు నావిరియంత్రమట్లు దు
ర్వార పరాక్రమక్రమ నిరంకుశ వీరవిహారుఁడై బలో
దారుఁడు దానజీ యెదురుదాఁకినచోఁ బొలివోవనీక య
వ్వైరులఁ గూల్చి కుప్పలిడెఁ బైరుల ముమ్మనఁ గోయుకైవడిన్॥235

ఉ॥ పూనిక కింతమేర తెగముట్టుచుఁ, బట్టిన లోఁగువారిఁ గా
లానఁగనీక తూలిపడ నవ్వులనెట్టుచు, దొమ్మిపోరునన్
బీనుఁగుఁబెంట లెక్కి మొగవిచ్చినవారలఁ బట్టుచున్, జయ
శ్రీ నిధి తానజీ బయలుచేసి చనెన్ నడికోటఁ జేరఁగన్॥ 236

మ॥ నలువైపున్ దన మావళాబలము సన్నాహంబునన్ బొల్చి దా.
యలఁ దున్మాడఁగ నుబ్బరేఁగి, పటు వీరావేశ మేపార మ
త్తిలి, తానాజి క్షణంబులో సకలమున్ దీర్పన్ విజృంభించెఁ - జే
తులు నాల్గై, కరదీపికాద్యుతుల నెందున్ దాన ప్రత్యక్షమై॥ 237

సీ॥ గుమిగొన్న రిపులపైఁ గుప్పించి, పిడిబాకు
పదనూరఁ దెగువార గుదిమి గుదిమి,
పయిదూఁకురిపులు చేడ్వడ వేఁటకాడవంట
నలిరేఁగి మునుమెత్తి నఱికి నఱికి,
కవిసినరిపుకోటి ఖడ్గముల్ కంఠముల్
చివ్వ మిన్నంటఁగా జిమ్మి జిమ్మి,
పెనువీఁకమైఁ ద్రోసికొనివచ్చు నరిసేన
గుములుగట్టఁగ నేఁటఁ గ్రుచ్చిగ్రుచ్చి,
తే॥ తెఱపిగొని వింట శరపరంపరలు గురిసి,
విరియుమొనఁ జాపకట్టుగా సురుఁగఁగొట్టి,
వెలుఁగు చీకట్లపొత్తులో నులిమి పులిమి
పిడిచి వడిఁగట్టి తానాజి వేఁటలాడె॥ 238

మ॥ నిలువున్ నెత్తుటఁ దానమాడి, కనులన్ నిండారు కెంజాయ ని
ప్పులురాల్పన్ గరవాలు కేలఁగొని ఊపుల్ వోఁ గికారించి, బె
బ్బులినా దూఁకి, మొగల్బలంబు నలువైపున్ ముట్టి తానాజి యా
వులమందన్ బలె వైరులన్ దఱిమె నాఁపున్ । బాపు ని ల్పేదఁగన్॥

చ॥ అతని భుజావిజృంభణము నాఁపఁగలేక భయాతిరేక దు
స్థితి మొగవిచ్చు సైనికులదీనతఁ గన్గొని దుర్గనాథుఁ డు
ద్ధతి మునుదూఁకి "యోడకుఁడు, దర్పమునన్ జెలరేఁగి శాత్రవ
ప్రతతులఁగూల్పఁ నావెనుక రం" డనుచున్ బురికొల్పె సేనలన్॥

ఉ॥ వీరవిహార ధీరపదవీ పరిణద్ధ భుజాపలేప దు
ర్వార పరాక్రముం డుదయభానుఁడు సేనల కుబ్బుసూపి, గ
ర్జారవ భీకరంబుగ నరాతిబలంబు నదల్చి, పెల్చనన్
దూఱెఁ గరాళఖడ్గ పరిధూననముల్ మెఱపాడుచుండఁగన్॥ 241

చ॥ అనిమొన నిల్చి దోర్బలనిరంకుశతన్ వెలయించు దుర్గనా
థునిఁగని తానజీ యెదుటఁ దోఁచిన యేన్గును గన్న సింగమై
మునుమును జీల్చికొం చడిదమున్ జళిపించుచు సింహగర్జనం
బున మునుదూఁకి శాత్రవచమూపతిపైఁ బడె ధిక్కరింపుచున్॥ 242

చ॥ ఇరుగడ నుండు దండు తమయేలికపోలిక లెంచి పొంచి ము
మ్మరముగఁ బోరుచుండ, నభిమానధనుల్ కరవాల సంగరో
స్థురులు పరస్పర ప్రధనదుర్జయమూర్తులు సైన్యనాథు లి
ర్వురు నెదురెక్కి, రొండొకరిఁ ద్రుంపఁగ నొంపఁగ మచ్చరించుచున్॥

ఉ॥ వ్రాలున మర్మముల్ నఱకు నైఖరి, పైఁబడు ఖడ్గపాతముల్
డాలునఁ దేలఁగొట్టు కరలాఘవ, మొక్కటఁజూపి యొండుచో
శూలము దింపు త్రెంపు, తెగఁజొచ్చి యెదన్ బిడిబాకు గ్రుమ్ముచోఁ
గే లెగఁదట్టి గుట్టు ఫడికించి తెగించి పెనంగి రిర్వురున్॥ 244

చ॥ ఒదిఁగినయట్టు లుండి ఋక్షసోద్ధతిమైఁ బయిదూఁకి, కుంతమున్
గదిపినయట్టు లుండి శితఖడ్గమునన్ దెగవ్రేచ్చి మ్రొండిపైఁ
జదికిలఁబడ్డయట్లు పెలుచన్ 'బలటీ' పయిఁ జొక్కళించి పై
న దుమికి ఖడ్గకౌశలమునన్ గసిమీఱఁ బెనంగి రిర్వురున్॥ 245

ఉ॥ జాలియడేగలట్లు కలుచంబడు సింగములట్లు మత్త శుం
డాలములట్లు కావరమునన్ దలలొడ్డిన కోడెలట్లు లా
ఖీలతర ప్రహారముల బిట్టు తెగంగొని రక్తధారలన్
దేలుచు నొండొకళ్ళు వెనుదీయక పొంగి పెనంగి రిప్వరున్॥ 246

చ॥ సరిసరిఁ బోరు వైరి పటుసత్త్వము నోర్వక తానజీ రుషా
తురుఁడయి వాఁడిబల్లెమును దూయుచుఁ దన్భుజమధ్య ముచ్చిపోఁ
బరుపతఁ గ్రుమ్మఁగా, † నుదయభానుఁడు సొమ్మునసోలి తూలి తె
ప్పిఱి కనలంటి వాలుగొని బిట్టడఁచెన్ బలమెల్లఁ బోయుచున్॥ 247

చ॥ కులిశముఁబోలెఁ బైఁబడు నకుంఠకృపాణముఁ బాయఁజిమ్ము † డా
పలి పెనుడాలు నొడ్డుకొని, వ్రయ్యలుగా నది గూలిపోవ ని
శ్చలుఁడయి తానజీ నడుముచక్కటిఁ జుట్టిన యుత్తరీయమున్
వలనుగవిప్పి కేలఁ బెనవైచి పయింబడె నంతకాకృతిన్॥ 248

చ॥ వలపలిచేతి వేఁటకొడవాటఁ దళత్తళలూర బిట్టుగ
ర్జిలి పయిదూఁకుచున్ "జమునిచెంగటి కంపెద నిన్నె చక్కనై
నిలు" మని యార్చుచున్, గళమునిండినరోసముఁ జప్పరించుకొం
చలఘుఁడు తానజీ పగతునంసము వ్రయ్యఁగ నేసె నీసునన్॥ 249

చ॥ పఱపున నాటు వ్రేటుదయభానునియంసముఁ జీల్చులోనఁ దె
ప్పిఱి యతఁ డంగచాపలము పేర్మి నడంగిన దూసిపోయి నె
త్తురు లొలికించె; నంతఁ గడుదుస్సహుఁడై యతఁ డీడఁబోక ని
ష్ఠుర కరవాల మెత్తి వెనుచూడక వైచె శిరంబు గూలఁగన్॥ 250

---

† Udebhan....dealt many a death-dealing blow on Tanhaji which his watchful shield received till it was cleaved in twain. Another ruthless stroke cut down Tanhaji's left arm, which dropped on the ground. The gallant hero .... .... fought his retreating foe with many a

ఉ॥ డాపలి కేలఁ బైపడుకటా రెగఁజిమ్ముచు, డాలు లేమిచే
నాఁపఁగరాక తుత్తునియలై † మణిబంధము గూలఁ, దానజీ
కోప పరాభవ జ్వలన ఘూర్ణితుఁడై పిడిబాకు నెత్తి, సా
టోపనట ద్భుజార్గళ కఠోరముగా నభియాతిపైఁ బడెన్॥ 251

ఉ॥ పీడిన కేశపాశమున విప్పినకన్నుల రాలు నిప్పులన్
గాఁడిన ఖడ్గపాతములఁ గాల్వలుగట్టిన రక్తధారలన్
వాఁడి మెఱుంగులాడు పిడిబాకున గర్జిలి దూఁకు తానజీ
పోఁడిమిఁ జూచి ప్రాణభయమున్ గొని పాఱె నరాతిసైన్యముల్ ॥252

ఉ॥ సాహస ధీరవృత్తి రభసంబుగఁ బైపడుచున్న తానజీ
బాహువుఁ దప్పివో నుదయభానుఁ డడంగియుఁ దీరుగాన కు
త్సాహముఁ బాదుకొల్పి పెలుచన్ బిడిబాకును బూని తాఁకె; ను
గ్రాహవకేళిఁ దేలి రుభయప్రతియోధులు గ్రుమ్మలాడుచున్॥ 253

ఉ॥ భండనపండితుం డుదయభానుఁడు లాఘవ మెంతచూపియున్
గండరగండఁడై బిరుదుగన్నమగండగు తానజీ భుజా
దండము నెట్టఁజాలక వెతంబడుచుండ, నతండు దోర్బలో
ద్దండత వాని నొంచి వసుధన్ బడవైచి యురంబు నెక్కుచున్॥ 254

చ॥ † పటపటఁ బండ్లుగీఁటి పిడిబాకునఁ గుత్తుక నుత్తరించి యు
ద్భటముగ నార్చె; నీతెఱపి దాపునఁ బొంచిన శత్రుపక్షపుం
భటుఁ డొకఁ డేపునన్ వెనుకపాటున దూఁకి కటారువాదరన్
దిటవునఁ దానజీగళముఁ ద్రెంప, నతం డొఱగెన్ ధరాస్థలిన్॥ 255

---

blow that sapped Udebhan's life .... .... one more blow and that was the last .... .... Tanhaji fell! Udebhan fell too — killed by Tanhaji.

Page242, *The Modern Review - March, 1909.*

చ॥ ఒకని నొకండు ద్రుంగ రభసోద్ధతిమైఁ జెరలాడు సైన్యనా
యకు లిపు డొండొకళ్ళు పరమాప్తులుగా రణవీరశయ్యపై
ముకుళితనేత్రులై రుధిరముద్రితులై శయనించుటల్ దమః
ప్రకరముఁజొపి చూచె హిమభానుఁడు తూర్పున బారెఁ జెక్కుచున్

చ॥ ముగియనిపోరు దీర్ప రసపుత్రచమూపతు లాత్మసైన్యముల్
మొగియఁగఁ జేసి మావళులమూఁకపయిన్ జెను దీమసంబునన్
దగులఁగ, మావళాభటు లదాటునఁ దండ్రిని బాయు బిడ్డలై
తెగువఁ బెనంగలేక వెనుదీసిరి శోక భయాకులస్థితిన్॥ 257

## సూర్యాజీ సింహగడము గెల్చుట.

మ॥ అట సూర్యాజి బలంబుతోడఁ ద్వరితుండై కోటపై కెక్కి, మా
ఆటవూ పందిన వీరభద్రుఁడన దుర్గద్వారముల్ జేరున
ప్పటి కుద్భ్రాంత పరావృత స్వభట సంతాపంబు గాన్పించె, నిం
తటిలోఁ గర్ణకఠోరమై వినఁబడెన్ దానాజి కన్మూయుటల్॥ 258

ఉ॥ ఒక్కనిమేష మట్లె - యెగయూపిరి, నిల్చినచూపు, పంట నో
నొక్కినచూపుద్రవే, లొదుఁగనొచ్చిన డెందముగాఁగ - సూర్యజీ
యక్కజపాటువొంది, యెఱుపారినరెప్పల నశ్రుబిందు వొ
క్కొక్కఁడు జాఱ, నా తెఱపినుండి రుషాదవకీల రాఁజినన్॥ 259

చ॥ చరచరఁగోటవైపు సని చయ్యనఁ ద్రాళ్ళుల నెల్లఁ గోసి, కే
లొరసిన వాలునెత్తి రభసోద్ధతి ముందుకుదూఁకి, భీతులై
తిరిగిన మావళాభటుల ధిక్కరణంబున రేఁపి, కార్యమున్
గుఱిగొని, జాతిపౌరుషము కుత్తుకబంటిగఁ బోసి యిట్లనెన్ 260

ఉ॥ "అచ్చపు మావళాకులమునందు జనించిన వీరుఁ డెవ్వఁడున్
జిచ్చును మిర్రింగి శాత్రవులఁ జీల్చునుగాక వితాకువొంది వె
న్నిచ్చునె? కాఱుసింగముల నెక్కుచు స్వారి యొనర్చువారి కీ
పిచ్చుక లెంత? ద్రవేటు కొకవేయిగ గొంతులు గోయఁగూడదో?॥

శా॥ నాకున్ మీకును దండ్రియున్ బ్రభుఁడు తానాజీ - కఠోరాజి ము
క్కాఁకల్ దీఱిన వీరమాళి యనిలోఁ గన్మూయ, నవ్వీరు నే
కాకిన్ జేసెదు పాఱఁబోతులకు సిగ్గా? మానమా? మావళో
ర్వీ కాంతల్ పగదీర్పలేని మగలన్ బేరంటముల్ పిల్వరే?॥ 262

మ॥ కులవిఖ్యాతికి రాజకార్యమున కెగ్గుల్ సేసి, తానాజికిన్
దలవంపుల్ ఘటియించి మీరు బ్రతుకన్ దారాడుచున్నారు? పే
రలుకన్ గోసితిఁ గోటత్రాళ్ళు, భయమేపై దూఁకినన్ దున్కలై
తల కూలున్, బరువెత్తినన్ బగతురే దండెత్తి ఖండింపరే?॥ 263

ఉ॥ అంతయు వట్టియాస, వెదుకాడిన లాభము లేదు. చిత్తవి
భ్రాంతిని మాని గుండియ దిరం బొనరించి కటారుఁబూని కా
లాంతకుదూతలై యరులనాహుతిఁబట్టుఁడు; తానజీమన
శ్శాంతినిఁ గూర్పుఁ, డీ యవనసైన్యము లేమని మిమ్ముఁ దాఁకెడున్?॥

శా॥ మానోత్తాలము మావళాకులము జన్మక్షేత్రమా నెవ్వఁడుం
గానీ కాలు మఱల్పరా, దరులమూఁకన్ జంపుటో చచ్చుటో
గానీ ప్రక్కకుఁ జూడరాదు, జయమున్ గైసేయ నావంతు: కా
దా - నాకంబు జయింత మందఱముఁ దోడై వీరదీక్షావిధిన్!॥ 265

మ॥ వినలేదో తొలికోడికూఁత? సభలోఁ బేరెత్తి తానాజి ప
ల్కినపంతంబు నెఱుంగరో? గడముపైఁ గేరింతలన్ సవ్వ యా
వనకేతున్ సయిరింతురో? తడవుఁజూపన్ గాదు లేలెండు, నా
వెనువెంటన్ జనుదెండు శత్రుబలముల్ వెన్నాడి వేఁటాడఁగన్"॥ 266

శా॥ అని సూర్యాజి యదల్చి రోషవివశుండై గోల్తలన్ జేయు, 'జై'
యని గర్జింపుచు మావళాభటులు శస్త్రాటోప మేపార మా
ర్కొని, యొక్కుమ్మడినందఱున్ గవిసి యుక్కుం దున్కలై యుగ్రన
ర్తనులై దాఁకిరి శత్రుసైనికజిహీర్షా దర్పదుర్ధర్షులై॥ 267

శా॥ దావాగ్నిచ్ఛటవోలెఁ జుట్టుకొనుచున్, దంష్ట్రాగ్రి నఖాఘాతగ
ర్జా విస్ఫూర్జిత సింహయూథమటులై శస్త్రంబుల న్నొంచి, పా
రావారోగ్ర తరంగభంగిమలు మీఱన్ దూఱి పైకొంచు, రౌ
ద్రావేశంబునఁ బోరె శాత్రవులు డయ్యన్ మావళాసేకముల్॥ 268

శా॥ ధైర్యోత్సాహము లేపుమీఱు మగఁడై దానాజికిన్ దమ్ముఁడై
సూర్యాజీ ప్రతిపక్షనిర్మథన సాసూయ త్వరాహంక్రియా
వార్యుండై రిపుకంఠముల్ నఱికి కుప్పల్వోయుచున్ మించి ని
ర్వీర్యోద్విగ్నముఁ జేసి శత్రుబలమున్ వేఁటాడె వెన్నాడుచున్॥269

ఉ॥ మూఁగిన మావళాభటులపోటున కోర్వఁగలేక, సాహసో
ద్యోగము రేఁపు దుర్గపతి దోరుట నూఱటలేక, నిర్వైరన్
దూఁగు నరాతిసేన వెనుదూయఁగలేక పెనంగలేక యు
ఱ్ఱూఁగుచు శత్రుఖడ్గములయొత్తిడికిన్ బలియయ్యె నయ్యెడన్॥ 270

ఉ॥ పాఱెడు రక్తవాహినులపాలగుచున్ రసపుత్రులందు నే
నూఱు కబంధముల్ దొరల, నొచ్చియు విచ్చియుఁ దక్కుసైన్యముల్
పాఱఁగ, వారివెంటఁబడి పంతమునన్ దెగఁబట్టి మావళా
వీరులు వేఁటలాడి, రని వీఁగిన లోఁగిన జాఱకుండఁగన్॥ 271

తే॥ "పయపులెత్తెదు రిపులపైఁ బడకుఁ" డనుచుఁ
దనబలంబును మఱలించి దర్ప మెనసి,
సూర్యజీ సింహగడముపైఁ జుంగుఁబాడ
నూఁగు మొగలుబావుటా నూడఁబెఱికె। 272

ఉ॥ ఈగతి వైరులన్ దఱిమి, యెం దెవ రడ్డములేని కోటపై
మొగలుబావుటాఁ బెఱికి, పొందినగెల్పు శివప్రభుండు ముం
దై గమనింపఁగా శిఖరమం దొక పెద్దవెలుంగుఁ బెట్టి, కా
లాఁగక సూర్యజీ గడమునంతయు లోఁగొనె జాగరూకుఁడై॥ 273

చ॥ పలపల వేగులోపల శివప్రభునానతి మెట్టి, తానజీ
పలికినపంతముఁ దెలిపి, బాహుబలలోగ్రధురుఁడైన సూర్యజీ
మెలఁకువరానినిద్ర రణమేదినిఁ బండిన యన్నమేనిపై
నొలసిననెత్తుటిన్ గడిగె నూటలువాఱెడు కంటిసోనలన్॥ 274

సీ॥ సమయజ్ఞుఁడగుచు వెచ్చని వేఁడి మనసులో
నుడిగించి సూర్యాజి యుచితమెంచి,
పట్టుతివాసీల పల్లకిలోనఁ బా
వన తానజీ కళేబరము నునిచి,
సింహదుర్గము గావ సేనల నియమించి;
యరిబలంబును దుర్గమవలఁ దఱిమి,
శరణన్నవారి కాశ్రయమిచ్చి, తనచేతఁ
బడు శత్రుధనము వెంబడినిఁ గొనుచు,
తే॥ బలఁగములు ముందునడువఁగా, భటులుమోయు
నందలములోని తానాజి ననుగమించి
యంగరక్షకుఁడై పైన మనుమతించె
శివపతినిఁజూడఁ - దొలియొండ చెఱఁగు లాడ॥ 275

చ॥ అట శివరాజు రాయగడమందు సమున్నత చంద్రశాలికా
తటమున నెక్కి- వేఁకువగుదాఁక జయాంకపువెల్గు వేచి యా
రటపడి, సింహదుర్గశిఖరమ్మున నప్పుడు వెల్గుఁ జూచి యా
ఱటగొని, తజ్జయోత్సవ పురస్కర ణోత్సుకితాంతరంగుఁడై॥ 276

తానాజీ నిర్యాణము - శివాజీ సంతాపము.

చ॥ ఉదయమునంద మాంసలతరోచ్చ తురంగము నెక్కి-, సేవకుల్
పదుగురు వెంటరా నుదుటుపాటునఁ బోవుచుఁ, గొంతమేరలోఁ
గదిసిన మావళాభటులఁ గాంచి, మొగంబుల గెల్పుసంబరం
బెదుగమి సంశయించి, 'జయ మెవ్వరికి?' దంచని హెచ్చరింపుచున్॥

తే॥ కలయఁ బరికించి "తానాజి గానుపింపఁ,
డెందుఁగల?" డనునంతలో, నందలమ్ము
వెంట సూర్యాజి యే తెంచి వినతుఁడగుచు
"నరులఁ దునుమాడి తానాజి-" యనెడునంత॥ 278

శా॥ "ఆ! తానాజి గతించెనే! యరులఁ దున్మాడించి తున్మాడుచున్
నా తానాజి గతించెనే!" యని యఖండ ప్రేమభాండోదరో
ద్భూతాశ్రూదక బిందు లుట్టిపడఁ - దోర్త్రోవార్వమ్మున్ డిగ్గి, తా
నై తానాజని డాసి పైముసుఁగువాయన్ దీసి నిర్విణ్ణుఁడై॥ 279

ఉ॥ గాయపుఁగ్రంతలన్ గరుడుగట్టిన నెత్తుటదోఁగు మేను, వి
చ్ఛాయముఖంబు, కెందొగరుఁజాఱల గ్రుగ్గిన వాలుమూఁతకం
దోయి, రదంబులన్ బెదవినొక్కినపట్టు దొలంగఁబోని వీ
రాయితముద్ర చూచి శివరాజు వెతంబడి వెచ్చనూర్చుచున్॥ 280

తే॥ "జాఱిపడినది - నాచేతి - చంద్రహాస!
మవగళితమయ్యె నా వజ్రకవచ మిపుడు!
సింహగడమున గడమేమొ చిక్కెఁగాని
పోయినది సింహ - మీ కుడిభుజము.వోలె!" 281

తే॥ అనెడుపలుకులు పెదవిపైఁ దొనఁకుచుండఁ,
దానజీ వీరశయనముద్రా విలీన
ధన్యతాజ్యోతి నరయు నేత్రముల నుబుకు
చెలిమితరితీపు లిటు లెంచె శివవిభుండు॥ 282

ఉ॥ "అంతటి ధీరమూర్తి విటులై కనుమూసితివయ్య! తానజీ!
మొంతలునేసి దైవ మెలయించె నన్ను నిన్ను వంచింగ! నీవు నా
కింతటిలోన దూరమగు టే నెఱుఁగన్ గద! బర్వదించి ని
శ్చింతుఁడవైన యట్లు వికసించితివో! యిఁక నాకుఁ బల్కవో!॥ 283

సీ॥ పరతంత్రితా భుగ్న భారతోద్ధరణోద్య
మమున నా నాయకత్వము వరించి,
మొనలేని నీ సర్వధన జన బల జీవి
తముల సర్వార్పణ ధారవోసి,
రణరంగముల నంగరక్షకతఁ బూంచి
కనుఱెప్పవోలె నన్ననుసరించి,
దుస్సాధతర వైరివర్గ భేదన వజ్ర
పాతమై బహుళాహవములు గెలిచి,
తే॥ యనుచరుండు - చమూనాథుఁ - డంగరక్ష
కుఁడు - బహిఃప్రాణ మనఁగ నళా గొలుచు నిన్నుఁ
గోలుపోయినయపుడ నేఁ గోలుపోని
దొకటియున్నదే! తానజీ! యొంటినైతి!॥ 284

శా॥ నాకై - లోకముమేలుకై కడఁగి, తానా! త్యాగివై యోగివై,
నాకర్తవ్యము లీవ తీర్చి జయమున్ నా కిచ్చి, యున్నట్టులే
నాకశ్రీ గయికొంటి, వీతప - మఖండత్యాగ మేమందు! నాఁ
గా కన్నా! ననుఁబాసి యొంటి విడిపోఁగా నీకుఁ గాలాడెనే!॥ 285

సీ॥ ప్రతిభటుండయి మీఁదఁబడుచు శాజీఘోర
పటుఁడు నాపైఁ గత్తిఁ బట్టునాఁడు,
కపటపండితుఁడైన యఫజులుఖానుతో
ద్వంద్వయుద్ధక్రీడఁ దగులునాఁడు,
దండయాత్రల సయిస్తాఖాను మేడపై
నడురేయిఁబడి పోరు నడుపునాఁడు,
నవురంగజేబు నన్నరికట్టుచెఱనుండి
యనువుమైఁ దప్పించుకొనెడునాఁడు,

తే॥ అగ్గపడి, పోరుసలిపి, తోడై తెగించి
నన్నుఁగాపాడుకొను ధీరు నిన్ను నేఁడు
కుఱుచగడమునకై బలిగొంటి, నకట!
గడము! తానాజి! బొగ్గుకై కల్పతరువు!॥ 286

తే॥ శివపతి యెవాఁడు? - తానజీ స్నిగ్ధహృదయ
బలముఁ ద్రావి, పెన్పొందిన భద్రమూర్తి,
నిజము; తానజీ! యీనాఁడు నీవులేని
శివపతి యెవండో! యెంతలోఁ బవలు - రేయి!॥ 287

తే॥ హృదయమును జీల్చి యందులోఁ బొదిగియున్న
నన్ను బహిరంగపఱచి ధన్యతను గొంటి,
వన్న! తానజీ! నేఁటి కానిన్ను దాఁచి
లేఁతవడితి! నీభాగ్యంబు లేదు నాకు!॥ 288

చ॥ గడము జయించి తెచ్చిన యఖండయశంబున కీవు పట్టభ
ద్రుఁడ - విట నిన్నుఁబంపి యెడరున్ గలిగించియు, నుద్యమంబు చే
డ్పడఁ జని, హైందవోదయముపట్టున నీదుకుటుంబమందుఁ బె
క్కిడుమలువోయు నాఱడికి నే - నిటు నీకడ నిల్చిపోయితిన్!॥ 289

ఉ॥ అందములూరు పెండ్లికొడుకా సుతుముచ్చట లానువేడ్క న
స్పందఁగఁజేసి, నాకనులయందు మనంబున నీవు నిల్చి యా
నందముఁ బొందనెంచితి వనా! యిది యెట్టి యభిన్నభావని
ష్పందత! యీ మనోలయతపంబున కేబదు లీఁగ నేర్తునే!॥ 290

చ॥ పసుపును గుంకుమాంకమును బాసికమున్ గరకంకణంబు సొం
పెసఁగిన చిన్న పెండ్లికొడు కీబెడిదంబునఁ బొక్కి యెంతవె
క్కసపడునో గదే! యతని కన్నులకాటుక మున్గి బుగ్గలన్
దుసికిలు నశ్రుధార యొకదోసము నాపయి వ్రాయునో గదే!॥ 291

శా॥ తానా! నీ విఁకఁ బల్కు, పీహృదయబాధల్ తీఱు తీ రేది? నీ
దీనానాధకుటుంబ శోకదహనార్తిన్ బాపు పాపేది? నా
పైనన్ బైకొను శత్రుసంహతులఁ దూల్పన్ దెంపు పెంపేది? య
న్నా! నీయొక్కనిలేమి యెల్లెడలఁ దానై యొంతగుందించెడిన్!॥ 292

శా॥ నా కీవంత - కొఱంత యో దయినఁ, దానా! నీవు ధన్యుండ; వ
త్యాకల్ లోఁకువ లన్నియున్ దులిపి వీరస్వర్గమున్ గొంటి; వే
కైకస్థాన ముదాత్త వీరపురుష త్యాగార్హ భోగాంకమై
నీ కాహ్వానము పెట్టె, నేల్కొనుము తండ్రీ! వీరభోగ్యంబుగన్!"॥

చ॥ అని శివరాజు వేఁడిహృదయంబునఁ బొంగు తలంపులెల్ల వా
డినకనుదోయిఁ దొన్కి వగ డిందినవా తెఱ జాఱుచుండ వా
కొని, తరితీపువోని మదికోఁతలఁ దద్రిణవీరవర్తనం
బు నరయ సూర్యజీవదనమున్ గని యాఱటవాసి యిట్లనెన్॥ 294

శా॥ "అన్నా! యన్ననుగాచి నీవయినఁ దోడై యుండ లేవైతివే?
కన్నుల్ విచ్చిన కాలరుద్రుఁ బోనువంగా నేర్చిరే వైరు? లా
పన్నుండై నినుఁ జేరెనో? ననుఁ దలంపన్ బోఁడా? - లగ్గెలగున్
మిన్నుల్ గూలిననైనఁ దా నొరుల నేమీ! సాయ మర్థించునే!॥ 295

ఉ॥ ఆహవ మొక్కఁడే నడిపెనా? కదియన్ బడి వెంట మావళా
వ్యూహము దూఁకలేదె? యొఱపొడ్డుచు నీ వట లేకపోతివే?
ద్రోహులు దొంగపోటుగ్నొనిరో? యలయించిరొ పల్వు రా మహా
బాహుని ముట్టి? తచ్చటుల భండనతాండవ మెట్లు సెల్లెనో!"॥ 296

చ॥ అనుటయు సూర్యజీ తరఁగలాడు కనుంగవ నొత్తి, మెత్తవో
యినయెదఁ జేవలెత్తి, మొనలెత్తుటనుండియు యుద్ధరంగ న
ర్తనమునఁ దానజీ కర్ర కరాళకృపాణ విహారవైఖరుల్
వినిచి, కలంకఁ బాపు నొక వెల్లువ నూఱటవోసి యిట్లనెన్॥ 297

శా॥ "ధన్యుండయ్యె మహాప్రభూ! నిజము నీతానాజి; వీరైకమూ
ర్ధన్యుండై నిజ దేశమాతృ చరణ ద్వంద్వంబు నర్చించుచున్
జన్యావ న్యరి వీర కంఠగళ దస్రస్నానముల్ దీర్చి, చై
తన్యజ్యోతి నివాళి యెత్తె సముదాత్తక్షాత్ర దీక్షావిధిన్॥ 298

మ॥ తనధర్మం బది నిర్వహించె ఘనుఁడై తానాజి - స్వ స్వామిసే
వన ధర్మంబది నిర్వహించె, నిదియున్ స్వాభావికం; బిందు మీ
తనువున్ మెప్పును సఖ్యమున్ హృదయ బాంధవ్యంబుఁ జూపాడి, తీ
యని మీలోనఁ గలంగుచే యతనిధన్యత్వంబు గా కున్న దే!॥ 299

చ॥ వలవదు మీమదిన్ వెఱఁగుపా, టరివీరులఁ గూల్చి సూర్యమం
డలమును జీల్చికొంచు, నపునఃపరివర్తన హీర వేదికన్
గొలువగు తానజీయెడఁదకున్ దమ వెచ్చనియూర్పు సోఁకినన్
గళవళ మందకున్నె! స్వజనవ్యథ మీమది సైఁపనేర్చునే!॥ 300

ఉ॥ వెన్నెలవోలె నెల్లడల విచ్చిన మీ హృదయప్రసన్నతా
భ్యున్నతిఁ గాంచఁబోని జగమున్నదె? యొండొక సేగి వల్క నో
రున్నదె? మావళాజగము నోమఁగఁ జక్రధరుండవైన నీ
విన్ని తలంపనేల? మనసిచ్చి ప్రభూ! మము నాదరింపవే!॥ 301

ఉ॥ పోయినయన్నతో సమసిపోవదు మా ప్రభుభక్తి, మావళా
జేయ నిసర్గధీరత నశింపదు, వెఱ్ఱొకఁ డెంచనేల? స్వ
ర్గీయు - మహాత్ము - నన్న బ్రదికించుకొనన్ జొరలేముగాని, మా
యాయువు లప్పగింతు మెటులైనను మీమదిఁ జిక్కఁబట్టఁగన్॥ 302

శా॥ తానాజీపయినున్న మీహృదయమున్ దత్పుత్రుపై నిల్పి, నా
పైనన్ వారి సమస్త భారములు మోపన్ జేసి మన్నింపుఁ; డెం
దైనన్ గుందని మావళాబలము తోడై రాఁ జొరంబాఱి, పం
తానన్ బూనిక దీర్తు, నెంతటియసాధ్యంబైన నుబ్బూఁచెదన్!"॥ 303

మ॥ అను సూర్యాజి యుదాత్తభంగి మదివిందై కుందువారింపఁ, దే
జినవాఁడై యిటువల్కె, “నెమ్మది నెమర్చెన్ బేర్చు నీవర్తనం
బున, ‘నా యన్నకు వన్నెగూర్పఁగల తమ్ముం’ డన్న విఖ్యాతితో
నను - మాయన్నను - దుర్గముల్ గెలిచి తన్నా! ధీరచిత్తంబునన్॥

చ॥ ప్రళయభయంకరం బయినపట్టున - నన్న గతించి మావళా
బలఁగము విచ్చి శాత్రవులుపైకొని అంపులు సేయువేళ - ని
శ్చలగతి ముందుదూఁకి రభసంబుగఁ బోరొనరించి యోటమిన్
గెలుపుగమార్చు నిన్నుఁ బరికింపఁ గనుల్ మిఱుమిట్లువోయెడున్॥

ఉ॥ బాహుబలంబు మించు ప్రతిభాబల, ముద్ధుర కార్యధూర్వహో
త్సాహము మించు నిర్వహణశక్తియు, భక్తినిమించు రక్తి య
వ్యాహతి నిన్నుఁబొందె, భవదగ్రజు బాధ్యతలెల్ల నీవ శే
షాహివలెన్ వహింపుము, సుఖాయతి నీపయి విశ్రమించెదన్! 306

ఉ॥ నెత్తుటిపొత్తులో రగులు నెవ్వగ నీకయినీవ యోర్చి, నా
చిత్తము నూఱటన్ దనరఁజేసిన నిబ్బర మేమనంగఁ! బే
రుత్తలపాటునన్ గుములుచున్న కుటుంబముఁ దేర్చి, తానజీ
యుత్తమలోకసత్క్రియల నోముచు నెల్లెడఁ జల్లఁజేయుమా!”॥ 307

చ॥ అని శివరాజు పేర్మిదొలఁకాడ వచించి, యనంతరక్రియల్
మునుకొని తీర్పఁగా జతనముల్ నడిపించి, కలంతవాయనో
పినతఁడే దానజీతనయు పెండిలివేడుక నిర్వహించెఁ - గాం
చిన తలిదండ్రులన్ మఱపుఁజెందఁగఁజేయుచుఁ బెండ్లిపెద్దయై॥ 308

తే॥ శివమహీపతిమనసులోఁ జిగురులెత్తు
నాశ్రితజనానురాగ మహాత్త్వ మరసి,
మురిసె మావళాజగమ్ము; సంబరమ్ము నెనసెఁ
బ్రకృతివర్గము; కీర్తివల్లికలు బరసె॥ 309

సప్తమాశ్వాసము — సమాప్తము.

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ శివభారతము

## (శివాజీ ప్రబంధము.)

---

### అష్టమాశ్వాసము.

---

చ॥ విరివిగఁ దానజీతనయు పెండిలి వేడుకలెల్లఁ బెంపునన్
జరిగినమీఁద నొక్కదివసంబున శ్రీశివరాజు వైభవ
స్ఫురణములొప్ప నిండుకొలువున్ గయిసేసె; నమాత్యు లాప్తులున్
బరిజనులెల్లఁ బొల్చిరి విభక్త సమస్త నిజాసనంబులన్॥ 1

#### సింహదుర్గ విజయబహుమానములు - దండయాత్రలు.

చ॥ కొలువున రాజపీఠమునకున్ గుడివైపున నొక్కపీఠ మొ
ప్పాలయ సమర్పఁగాఁబడియె; నువ్విళులూరుచు నాఁటివేడుకన్
గలయఁ గనుంగొనన్ గొలువు గాఢముదంబున వేచియుండె; ను
జ్జ్వల మణిపీఠమున్ డిగి శివప్రభుఁ డిట్లు వచించెఁ గొల్వునన్॥ 2

ఉ॥ “తీఱిన వెల్లకార్యములు : దిగ్గజసన్నిభులైన యొందఱో
వీరుల ప్రాణముల్ నమలివేయుచు సింహగడంబు నేఁడు చే
కూఱిన : దైన సంతసముగొల్ప - దుదీర్ణ శుచావిదీర్ణ త
ద్వీరకుటుంబ నిశ్వసన తీవ్రత లెందును వెచ్చపీవఁగన్!॥ 3

చ॥ అది యటులుండఁగా కొకటి యారయుఁడీ కుడివైపు పీఠ ము
న్నదిగద, సింహదుర్గమున యావనకేతువుఁ బెల్లగించి స
మ్మదమిడు ధీరమూర్తి కిది పూజ్యపుఁగానుకయాట మీ రెఱుఁ
గుదు - రతఁ డేఁడి? తచ్చరిత గోచరమై మది చుమ్మనో యెడున్!॥ 4

చ॥ కుడియెడ నున్న తాసనము గోరని ధీరుఁడు కోరనట్టులే
యడుగుమఱల్ప కుగ్రరణ మాడి, శిరంబులుగోసి వానిపై
నడుగిడి, దుర్గనేత చెలియై తనుఁగొల్వఁగ స్వర్గమెక్కెఁ! ద
మ్ముఁడు తరువాయి గెల్చె వగపొంగు మగంటిమిఁ బుక్కిలించుచున్॥

చ॥ అతని యుదారధీర హృదయంబునఁ బొల్చిన శౌర్యలక్ష్మి కం
చిత-" యనునంతలోన నవశిష్టము నెల్ల గ్రహించి సూర్యజీ
కౌతుకు నెడందతో నివముగొన్న కనుంగవతోడఁ దత్పదా
నతుఁడయి వల్కె, "దేవ! వచనజ్ఞత చాలని నన్ను సైఁపుమీ!॥ 6

చ॥ లలిత సరోజగర్భ మృదులంబగు మీమది నొక్కమూల దో
యిలి ముకుళించి నిల్వ నెలవిచ్చుటయే కడుగొప్ప నాకు; హె
చ్చులు మదిఁ గోర, నీయఁగలచో భరియింపఁగఁజాలఁ; దానజీ
కలవడు వీరపీఠమున కర్హుఁడనే! యది వాంఛనీయమే!॥

ఉ॥ తమ్ముఁడు తానజీకిఁ - బదదాసుఁడు శ్రీశివరాజమౌళి కు
గ్రమ్మగు పోరునన్ నడుపఁగాఁదగు కర్జముఁ దీర్చినాఁడ; 'యు
క్త మ్మొనరించినాఁ' డనుటకంటె విశేషముగాఁగ నొక్క ప
త్రమ్ము ఫలమ్ముఁగోర : ననుఁ దప్పఁదలంప కనుగ్రహింపవే!॥ 8

చ॥ తమమది నొండుగా నెనరుఁదత్తఱ మేటికి! వీరపీఠ భా
గ్యమునకుఁ దానజీవెనుక నర్హుఁడు తత్తనయుండు; మీ కటా
క్షము గయికొంచు నాదు సహాకారమునన్ బ్రభుకార్య ధుర్యతా
క్షముఁడయి తండ్రిపేరుగొనఁగా దయచూడుము ధర్మవత్సలా!॥ 9

ఉ॥ అన్నవహించు భార మదియంతయు నాపయి నిల్పి, వారికా
మన్ననలెల్లఁ దత్ప్రియకుమారున కీ వరమిచ్చినారుగా
మున్నె! యనుగ్రహింపుఁడు ప్రభూ! యిటఁ గాదనువార లెవ్వ! రీ
పిన్నను బెద్దసేసి, నడిపింపుఁడు తొల్లిటి దండయాత్రలన్"॥

చ॥ అనఁగ శివప్రభుండు మది నచ్చెరువందుచుఁ బల్కె, “సూర్యజీ!
యనుకొనినంతకంటెఁ బదియంతలు త్యాగముఁజూపి మమ్ములన్
దనిపితి, వెల్లవారి కొక ధర్మపథంబును జూపి; తింక నీ
తనయుని వీరపీఠమునఁ దండ్రికిమాఱుగ నీవ నిల్పుమీ!”॥ 11

చ॥ అనుటయుసూర్యజీ ముదితుఁడై తనయున్ గరమంటి తెచ్చి, యొ
య్యన శివరాజుపాదముల కానతుఁజేసి, సభాజనంబులై
పున నతు లందఁజేసి, జయపూర్వక నాదము లుల్లసిల్ల దీ
వనలిడి వీరపీఠ సముపస్థితుఁ జేసె ముదంబు నిండఁగన్॥ 12

ఉ॥ అంత శివప్రభుం డతని కాదృతిఁ జూపుచు, సూర్యజీకృతం
బంతయు నుగ్గడించి యిటులాడెఁ, “జలింపని భక్తి, రక్తి, య
త్యంతవినీతి నీతి, పటుధైర్యము శౌర్యము సూర్యజీయెడన్
దంతురమౌచు మా కొకముదంబును విస్మయమున్ ఘటించెడున్॥

ఉ॥ ఆతని త్యాగలక్ష్మికి సమర్చన, సింహగడంబు గెల్చు వి
ఖ్యాతికిఁగాన్క యీ నిశితఖడ్గము దుర్గవిభుత్వమున్ మనః
ప్రీతి బహూకరించితి; భరించిన భారములన్నియున్ జయో
పేతముగా ఘటించి మతికెక్కఁ జరించి యశంబు గాంచుతన్!”॥ 14

తే॥ అని సమర్పించి, తక్కవారిని యథార్హ
రీతుల శివప్రభుఁడు సత్కరించి, నాఁటి
కాఁగిపోయిన తొలిదండయాత్ర మఱల
వెలువరింపఁగా మది నెంచి పలికె నిట్లు॥ 15

చ॥ “ఒకఁగకయుండు సింహగడ మోర్చి జయించితి, నైన దానితో
నెద మఱువంగరాని వెత, యెన్నఁడుఁ దీఱని లోటు నిల్చె; ని
య్యదనునఁ దానజీ యొకరుఁ డండ వెలుంగమి నెందఱుండియున్
గొదవయె. సేఁటికొలుఁ సిరిగోల్పడి బాపురు' మంచుఁ గన్గొనన్॥ 16

ఉ॥ ఈకొఱ దీఱు తీరుగలదే - బలశాలులు దేశభక్తు లే
కైకసమర్థులౌ పలువు రంతటినాయకు లేచి నల్గడన్
దూఁకి విరోధివర్గములఁ దోలినఁగాక, 'యొకండు తానజీ
లేక స్వరాజ్యముం గా నిలుపలే' రను చుల్కన సోఁకవచ్చునే!॥ 17

తే॥ అన్నికొఱఁతలు దీఱఁ, గైకొన్న ప్రతిన
నిండ, హైందవలక్ష్మి కన్పండువొసఁగఁ,
దానజీ మొదల్వెట్టిన దండయాత్ర
నిలుపక జయించి, తుదిదాఁకి నెగడవలయు॥ 18

ఉ॥ ఎత్తిన దండయాత్ర బరువెత్తుచు మొగలుదండు నర్మదా
భ్యుత్తరణంబునం బదరి యుక్కిఱిబిక్కిఱి యైనదాఁక వె
న్నొత్తుఁడు, దక్షిణోర్విఁ బదమూఁదఁగనీకుఁడు; మీ పెనంకువల్
కుత్తుకబంటిగాఁ బగరకున్ దలమున్కలుగాఁ దెగింపుఁడీ!॥ 19

ఉ॥ ఎంతలు ఱంతులేచి తెగనేసెడు నేపునకైన వంచనా
దంతురులైన శాత్రవులతంత్రము లేమఱఁబోకుఁ, డాతురో
ద్భ్రాంత విహారులై యురక ప్రాణములీకుఁ, డొకొక్కవీరుఁ డ
త్యంతము భావి దేశరమ కాదరువౌట యెఱిఁగి పోరుఁడీ!॥ 20

సీ॥ అరులపాలౌ పురందరదుర్గమును ముట్ట
డించి సూర్యాజి సాధించుఁగాక,
'మాహులీ' ముఖదుర్గమండలితోఁ గొంక
ణము పింగళేపంతు గమియుఁగాక,
'జింజిరా' మొదలైన సిద్దీలదుర్గంబు
లరికట్టి రఘునాథుఁ డరుగుఁగాక,
దండనాథుండు 'ప్రతాపరావ్ గుజరు' మొ
గలురాజ్యమునఁ జొచ్చి కలఁచుఁగాక,

తే॥ యన్ని వైపులఁ గార్యంబు లరసికొనుచుఁ,
నేను స్వయముగా నన్నింట నిలిచియుందుఁ,
దగిన దండుతో మీరింకఁ దరలుఁ" డనినఁ,
జనిరి వారలు సంభృతోత్సాహు లగుచు॥ **21**

అమితాటోపముతోఁ బురందరము డాయన్ బోయి, సూర్యాజి యు
గ్రముగాఁ బోరొనరించి డీల్పడిన మొగల్‌దండుఁ జక్కాడి, దు
ర్గము గొంచున్ శివరాజుఁ జేరె; విభుఁడున్ గర్వించి తద్వీర్యశు
ల్కముగాఁ బెక్కు బహూకృతుల్ సలిపె నుల్లాసంబు దైవారఁగన్॥

తే॥ సింహగడమును గెల్చి యార్జించికొన్న
కీర్తికినిఁ, దానజీస్ఫూర్తికిని మఱొక్క
రంగు వెలుఁగొందఁగఁ బురందరంబు గెలిచి
సూర్యజీ యెల్లరమనంబుఁ జూఱలాడె॥ **23**

సీ॥ మాహులీగడముపై మార్కొన్న పింగళే
పంతు బిట్టడఁచి పైఁబడి కలంచె,
గడములోనున్న మొగలుదండు గండునై
నెదిరించి రెండుమా ర్లేచి తఱిమె,
వెనువొక బలఁగమ్ముఁగొని పంతు మూఁడవ
మా ఱఖండముగాఁగఁ బోరుసలిపె,
రెన్నాళ్లు యుద్ధమై యన్నపానాదులు
దొరకక మొగలుల్ విఱిగి విసిగి,
తే॥ కడకు విధిలేక మాహులీగడము విడిచి;
రంత బలియుఁడై పింగళేపంతు వరుసఁ
గడఁగి 'కరనాళ' మొదలు దుర్గములఁబట్టి
కొంకణమునెల్ల గెలిచె నిరంకుశముగ॥

సీ॥ రఘునాథుఁ డట జింజిరాదుర్గమును ముట్టి
కడుఁదీవ్రముగఁ బోరునడిపి యడఁచె,
దిటవెల్లఁ జెడుచుఁ బత్తేఖానుఁ డలసి యో
పికమాలి దుర్గ మర్పింపనుండె,
నతని సర్దారు లయ్యాదియొప్ప కతని బం
ధించి, ఢిల్లీశు నర్థించి పిలిచి,
ఔరంగజేబు దా నధిక లాభము లెంచి
యమితసైన్యముల సాయముగఁ బంపెఁ,
తే॥ బోరు ఘోరమై చరమాబ్ధితీరమందు
రెండుపక్షము లుసురు లర్పించుచుండ,
నుభయకోటుల విజయ ముఖ్యాఁతలూగఁ
దఱియుచును బాయు మున్నీటితెరఁగలట్లు॥ 25

ఉ॥ మోగలురాజ్యభాగముల ముట్టి కలంచి ప్రతాపరావు పె
ల్లాగడ మెత్తుచుండ, సమయంబు నెఱింగి శివప్రభుండు తో
డేగి పదేనువేల బలమెత్తుచు సూరతు ముట్టడించి, త
న్నాఁగెడువాఁడు లేక బహుళార్థములన్ గొనె మూఁడునాళ్ళలో॥ 26

మ॥ ఎలమిన్ ద్రవ్యము బండ్లకెత్తి, యటుపై "నేటేటఁ బండ్రెండు ల
క్షలు మా కప్పన మీయకున్న నిటులే గారింతు" మం చాపురిన్
గలయన్ జాటి, శివప్రభుం డరుల కొగ్గంబోని సంధానముల్
వెలయన్ బైనముదీర్చె నాత్మబలముల్ వేర్వేఱ వెన్నంటఁగన్॥ 27

క॥ శివపతి యిటు సూరతునై
భవమున్ గొనిపోవు టెఱిఁగి, వైళమ ఢిల్లీ
ధవు సైన్యపతులు వెనుకన్
దవిలిరి పలుచోట్ల నడ్డుత్రాఁకు వనువులన్॥

సీ॥ తన్ను వెన్నాడఁగా 'దావూదుఖాన్' వచ్చు
చుంటయు, దారి నొండొకబలంబు
తనుఁదాఁక వేచియుంట నెఱింగి శివరాజు
తమసేన మూఁడుభాగములు సేసి,
యొకటి ద్రవ్యముగొంచు వికటమార్గములెక్కి-
పఱచి రాయగడంబుఁ జొరెడునట్లు
వెడలించి, దారిలో వేచిన రిపుసేన
సమయింప నొక్కభాగమును బంపి,
తే॥ కడమసేనతోఁ దాను మొగ్గరముగట్టి
కదియవచ్చిన దావూదుఖానుతోడ.
ఘోరముగఁ బోరి వెన్నిచ్చిపాఱఁ దఱిమి,
కదలి త్రోవలోఁ దనసేనఁ గలిసికొనియె॥ 29

మ॥ పటుసైన్యంబులతో శివప్రభుఁడు రాఁ బాటించుచున్, ద్రోవ నొ
క్కట మోగల్బల మడ్డుదాఁకి రభసోగ్ర వ్యగ్రతన్ బోరె; ను
ద్భటధాటిన్ శివరాజు దూఁకి బలముల్ పై కొల్పి, కల్పాంతకృ
న్నిటలాక్షుండయి వైరులన్ బొదివి దుస్సీన్ దోలె దోఃక్రీడలన్॥ 30

తే॥ వారిలో వీరవనిత 'మాహబూరు' నేలు
నుదయరాముని యిల్లాలు చెదరిపోక
పాదుషావైపునిలిచి కృపాణమెత్తి
వీరధీర విహారముల్ వెలయఁ బెనఁగె॥ 31

ఉ॥ క్రిందుగఁ బోరుసల్పుచు, మొగల్బల మేపఱి వైరు లెక్కువై
వం దిటవేది యామె శరణంబునుగోరె; శివప్రభుండు నా
హైందవవీరకాంత కభయంబిడి సత్కృతి వీడుకొల్పి, స్వే
చ్ఛం దనసేనతోఁజనియెఁ జయ్యన రాయగడంబుఁజేరఁగన్॥ 32

మ॥ అటుపై సాగరదండయాత్ర లోకవైపై, 'ఖాన' దేశంబు ను
ద్భటుఁడై గెల్వఁ బ్రతాపరావు నడరింపన్, వాఁడు దర్పించి యె
చ్చటఁదానై గెలుపొంది యందలి సమస్తశ్రీలఁ గైకొంచు, న
చ్చటిగ్రామంబులఁ 'జౌథు' పన్నుగొనియెన్ శౌర్యం బవార్యంబుగన్॥

సీ॥ ¶ తతమా మొగల్విభుత్వము ధిక్కరించి ప్ర
తాపరా విటు స్వతంత్రప్రవృత్తిఁ
'జౌథు' పన్ను వసూలుసలిపి 'రసీ' దిచ్చి
శివరాజువిభుత హెచ్చించుచుండ,
నటు పింగళేపంతుఁ డడరి మోగలురాజ్య
మునఁ జొచ్చి యొండొండు మునుమువెట్టి,
'ఔడు' 'సాలేరు' 'త్రియంబకు' 'పట్టా' మొ॰
దలు దుర్గములను బ్రాంతముల గెల్చె;
తే॥ నిటుల దక్కనుభూమిలో నేపుసూపి
తనవిభుత్వము నరికట్టి తాండవించు
శివపతివిజృంభణము విని రవులుకొన్న
కనులఁ బాదుషా విస్ఫులింగములఁ గురిసె॥ 34

ఉ॥ పూనికమై శివాజి యటు పొంగుటకున్ జసవంతసింగు తో
డైనటు - లట్లుసేఁత స్వకులాదరణంబని, పాదుషాహి యు
వ్వాని మఱొక్కచోటునకుఁ బంపుచు, దక్కనుపైకి మోహబ
త్ఖాను దిలేరుఖాను నెసకంబునఁ బంపె శివాజి నొంపఁగన్॥ 35

¶ The village authorities........promised to pay Sivajee or his officers one-fourth of the yearly revenue due to government. Regular receipts were promised on the part of Sivajee. .... .... This was the first imposition of Mahratta Chouth on a province immediately subject to the Mughals. Page 201. A History of the Mahrattas, by *J. Grant Duff*.

మ॥ యువరాజున్ గయికోక వారుచు స్వతంత్రోద్యగ్రులై వ్యగ్రులై
శివసైన్యంబుల నెంమనున్ దవిలి, యుత్సేకించి దుర్గద్వయీ
సవిధప్రాంతములన్ జయించి, యటుపై 'సాలేరు' దుర్గంబుపైఁ
గవియన్ బోవుచు రెండువేలహయముల్ ఖండించి రా దాపునన్॥ 36

సీ॥ ఇది యెఱింగి శివాజి యెదురేఁగి రిపుల డీ
కొల్పఁ బంపె నిర్వదివేలబలముఁ గమిచ్చి,
పనిచె మోరోపంతు - బతియుఁ బ్రతాపరా
వును, వారు పగరతోఁ బెనఁగి, రంపుఁ
గనుమూసి మెగసి యాకసమంటు ధూళిలో
నిరువాఁగు దెగఁదూఱి నఱకులాడఁ,
దునిఁగిన కాలుసేతులు తలల్ మొండెముల్
పఱచు నెత్తురుటేట దొరలసాగె,

తే॥ తఱిఁగి పలుచనై మొగలాయిదండు వెఱచి
విఱిగి వెన్నిచ్చి పరువెత్త, వెంటఁదవిలి
తఱిమి బహిరంగ రణజయోత్సవముతోడఁ
దత మహారాష్ట్ర సైన్యసంతతులు మఱలె॥ 37

సీ॥ వెలిసినపోర నేన్గులు నూటయిర్వది,
హయము లొంటెలు చెఱి యాఱువేలు,
ధనములు యుద్ధసాధనములు వస్తువా
హనములు చేఁజిక్కె నగణితముగ,
నన్నింటిఁ దనిసి తా నందఱఁ దనియించి
శివరాజు తత జయోత్సవము నడిపి,
తనుఁ గొల్వ వలచివచ్చిన శత్రుయోధుల
కాశ్రయమిడి వారి నాదరించె;

తే॥ నిది యెఱింగి పాదుషా శివునెదుర లేక
జంకు మోహబత్ఖాను - ముజంకుమారు
దక్షిణమునుండి మఱలించి, తత్పదమున
'ఖాన్ జహానుబహాద్దరుఁ' గవియఁ బనిచె॥ 38

ఉ॥ ఆతఁ డుపాయముల్ గాని స్వయంబుగ శత్రులపైకిఁ బోక, వా
రాతతధాటి వచ్చు తెరువులన్నిట సేనలఁ గాపువెట్టె; "నీ
రీతి జయింపఁజాల, మెదిరించి పయిన్ బడి గా" కటంచు సం
ప్రీతి దిలేరుఖాను వివరించియు నిష్ఫలుఁడయ్యె నయ్యెడన్॥ 39

మ॥ బహదూ రింతటివాఁడుగా నెఱిఁగి తత్ప్రాంతంబులన్ ముట్టుచున్
బహుళార్థంబులు కొల్లగొట్టి శివభూపాలానుగుల్ నొంప, న
య్యహితం బోర్చి యతండు రాఁగల యపాయం బేద భీమాతటిన్
సుహితంబౌ గడ మొండు గట్టుకొని యచ్చో నిల్చె సాశంకుఁడై॥

ఉ॥ పంపిన సైన్యనాథులు శివప్రభుధాటి కడంగి లొంగుటన్,
దెంపరియై యతం డెవరిని గయికో కనిరుద్ధుఁడౌటఁ బా
టింపుచుఁ బాదుషా యటమటించి, తదీయవిజృంభణంబు వా
రింపఁగలేక చూచి సయిరింపఁగలే కురియూట నొత్తిలెన్॥ 41

ఉ॥ మోగలుపాదుషా యిటుల మున్కటఁ జూచి శివప్రభుండు కా
లాఁగక గోలుకొండపయి నాయితుఁడై చనె; నాతఁడున్ సుహృ
ద్యోగముఁ జూపి కానుక లమితోరుధనంబు లొసంగె; నింతలో
నోగులుబాగులై జరిగె నొండొకమార్పులు దండయాత్రలన్॥ 42

తే॥ "అల బిజాపురిసులతానుఁ డంతరించె"
ననియు, "జింజిరాహవమునఁ బెనఁగు ధీరుఁ
డైన రఘునాథబల్లాలుఁ డస్తమించె"
ననియు వార్త రా, శివుఁడుసైన్యపతిఁ దలఁచి॥ 43

ఉ॥ చిన్నతనంబునుండి యెడసేయని తెంపును రాజభక్తియుఁ
వన్నెలుదేఱ, దేశవిభవంబునకై తనవెంటదూఁకు ధీ
రోన్నతుఁ డిట్టులాట కెదనుమ్మగిలంబడి, తద్గుణాదర
స్విన్నత వెచ్చనూర్చి, శివజీ యటుపైఁ గరణీయ మెంచుచున్॥ 44

ఉ॥ చిక్కని జింజిరాగడముఁ జేర్చికొనన్ జతనంబుమాని, లోఁ
జిక్కులతో నరాజకతఁ జెందు బిజాపురి లోఁగొనంగఁ బెం
పెక్కిన సైన్యనాథుల ననేకబలంబులఁ గూర్చి పంప, లా
వెక్కుచు వార లేచి యలయించిరి దేశము నాక్రమించుచున్॥ 45

సీ॥ రాణమీఁటఁ బ్రతాపరావు పన్హాళగ
డం బాక్రమించి జయంబుఁగొనియె,
నణ్ణాజిదత్తు సైన్యముతోడ 'హుబళీ' పు
రము కొల్లగొట్టె; నం దమితధనము
సూరతుకంటె హెచ్చుగఁ జిక్కె, మఱియు నం
దలి యాంగ్లవర్తక స్థలములందు
నేడువేలకుపైన నెన్మిదినూర్ల తొం
బదినాల్గు వరహాలు పట్టువడియె

తే॥ నవల 'నంకోల' 'కారువా' రాది గెలిచి
'దేశపాండ్య' 'దేశముఖులఁ' దిరుగఁగొట్టి
'పరళి' యు 'సతార' 'చందను' 'పాండుగడము'
మొదలు దుర్గముల్ శివరాజు మొగిసి పట్టె॥ 46

మ॥ తనరాజ్యం బిటు లాక్రమించి శివజీ తాఁ గ్రమ్మఱుగావింపఁ, గో
పనుఁడై యాదిలుషావిభుం డరుల నొంపన్ జంప 'నబ్దుల్ కరీ'
మనువానిన్ 'బహిలోలుఖానుఁ' బటుసైన్యం బిచ్చి పుత్తెంచె; వ
చ్చిన యవ్వారిఁ బ్రతాపరా వెదిరి నొంచెన్ మించె దుర్వారుఁడై॥

సీ॥ ఉభయసైన్యంబుల 'కుంబ్రాణి' కడ దినా
ర్థము మీఱుదాఁక యుద్ధంబు జరిగెఁ,
జేవఁదీఱిన మరాటావారిపోటున
కాఁగలే కరులసైన్యములుబ్రమగ్గె,
"నిఁకఁ బోరఁజాల, మూరక మమ్ము విడువుఁ" డం
చరిచమూనాయకుల్ శరణుగోరి,
'రావన్న' లనుచుఁ బ్రతాపరా వాదర
స్విన్నుఁడై వారల విడిచిపుచ్చె;
తే॥ నిది యెఱింగి శివాజి "మా కెఱుకయిడక
చేతఁబడువారి విడు నవినీతి తగునె?"
యనుచు దండింప, విన్నవోయినయెడందఁ
దరలిచనె దూరమునకుఁ బ్రతాపరావు॥ 48

తే॥ * సమయమెంచి బిజాపురీసైన్యనాథు
లాక్రమించిరి మఱలఁ బన్హాళగడము,
నది యెఱింగి ప్రతాపరా వపుడవచ్చి
ఘోరముగఁ బోరి యరుల గగ్గోలుపఱచె॥ 49

మ॥ * శివరా జాతని కంపె వార్తలిటు, "నీచేఁ జిక్కియున్నట్టి శా
త్రవులన్ బుచ్చితి వప్పు, డిప్డు మఱలన్ దర్పించి దండెత్తి; రీ
యవివేకంబు దొలంగ నేఁ డరుల బ్రవ్యుల్ సేసిగా కీవు మా
సవిధంబున్ జొరరాకు" మం; చతఁడు రోషద్వేష కార్యాంధుఁడై॥

---

* He (Prataprao Gujar) was censured by Shivaji, and on the next occasion when he encountered the enemy, he achieved a complete victory with the loss of his own life.
Page 87, *M. G. Ranade.*

సీ॥ సమయంబుగానక వ్యూహములేక చోరఁబారి
దాయలఁ దునుమాడి తాను మడిసెఁ,
దొడరి బిజాపురీంద్రుని దండు తఱుమఁగా
నొచ్చి మరాటులు విచ్చి; రపుడు
"హంసాజిమోహితే" యనుచుఁ జెగచి వి
చ్చినసేనఁ బురికొల్పి, చిచ్చువోలె
నయలపై దూఁకి వెంపరలాడి, తతపరా
జయము జయంబుగా సంతరించె;
తే॥ నది యెఱింగి శివప్రభుం, డరులఁ దునిమి
జయముతో వచ్చియున్న హంసాజిపైనఁ
బేర్మిఁజూపి 'హంబీరావు' బిరుదమిచ్చి
సర్వసైన్యాధిపతిఁ జేసి సత్కరించె। 51

చ॥ తనకయి ప్రాణమిచ్చిన ప్రతాపునకై వగఁజెంది కుందుచా
టున దురపిల్లు నాతనికుటుంబము నూఱడిలంగఁజేసి, కూ
ర్చినమదిఁ దత్సుతన్ దనకు రెండవకోడలుగా గ్రహించి, పెం
పెనయఁగఁ బెండిలిన్ జరిపె నెల్లరయుల్లము పల్లవింపఁగన్॥ 52

పట్టాభిషేక పూర్వరంగము.

ఉ॥ ॐ పెండిలియందు బందుగులవిందులు సాగెడువేళ బంతిలో
నొండు మహార్హపీఠము నృపోచిత, మన్యములైన పీట లొం
డొండు నమర్పఁగాఁబడియె; నుద్ధతుఁడౌ నొకరాజబంధు వ
ట్లుండుటఁ జూచి భేదమిది యోర్వక కొందఱ గుంపుగట్టుచున్॥ 53

ॐ Shivaji occupied an elevated cushioned seat higher than the rest. The others took it insulting .... .... saying, "Is shivaji now become such a great personage in the land and have we become mere cyphers. ........Far better to leave the hall than to submit to such an indignity."

*Ch, XXIII N. S. Takakhav.*

చ॥ పదుగురలోన వావిడిచి పల్కెఁ "బ్రియంబునఁ బిల్వఁబంచి యా
కదిసిన బంధురాజిఁ జులకన్ గనుటే? తన కింత హెచ్చు సం
పద బలగంబు లేర్పడినమాత్రన సంఘమునం దొకండుగా
కదనమె? యున్నతాసనము నందఁగఁ దా నొక పట్టభద్రుఁడే?॥ 54

శా॥ ఏదీ! తాతలనుండియైనఁ గల ప్రత్యేకాధికారంబు? నాఁ
డావిల్లాసరదారుఁ డయ్యె షహాజీ, యామాత్రమే లేక తా
నై దేశంబును గొల్లకొట్టి బలియుండై, యట్టులే సంఘమ
ర్యాదల్ గూడ బలాత్కరించికొనువాఁడా పెద్ద యీనాఁటికిన్?॥ 55

మ॥ ప్రజ నేలన్ గల హక్కులేక, మఱి భూపాలాజ్ఞ మన్నించు నా
ప్రజలో నొక్కఁడుగాక, రాజును బ్రజన్ బాధించి, యన్నింట బే
రజముల్ సూపెడువాని కీపగిది నగ్రస్థానమా? లెండు బం
ధుజనుల్! విందులుచాలు, ధూర్తు నెడఁ బొందున్ బోరు కుందింపదే!"॥

మ॥ అనుచున్ బీటలుదన్ని లేచిన యసూయావిష్టులౌ వారి దు
ర్జనతాగర్జన లాలకించి, మది వెచ్చం జేయు కోపంబుఁ బె
ల్చన వారించి శివప్రభుండు సమయజ్ఞత్వంబుఁ బాటించి, యం
దునఁ దత్త్వంబు గ్రహించి పల్కె హితసూక్తుల్ వేఁడి చల్లారఁగన్॥

చ॥ "కలఁగకుఁడయ్య! మిమ్ముఁ జులకన్ గనఁగా నిటు చేఁత గాదు - భృ
త్యుల యలవాటుమై జరిగియుండఁగనోపు; గృహంబుఁజేరు బం
ధులకు సపర్యలందుటఁ గనుంగొన కున్నతపీఠ మెక్కువా
రలు గలరయ్య! మీ కగుపరాభవ మియ్యది నాది కాదొకో!॥ 58

మ॥ అరులందున్ బరులందుఁ గొల్వులను మర్యాదాప్రసక్తుల్ గ్రహిం
తురుగా కుత్తము, లింటిలో హితులయందున్ గొందరే! యిట్టి యా
తురతల్ నేఁ దలపోయ, నిండుమది విందున్ బొందఁగా సేయుఁ, డేఁ
బరిచర్యల్ నడిపింతు మీ యనుచరప్రాయుండనై నిల్చుచున్! 59

చ॥ ననుఁ దెగనాడినా రని మనంబునలే, దుపదేశ మిచ్చినా
రని గురుభక్తి యున్నది; మహత్తరకార్య మొకండు నే నొన
ర్పనియది సేయఁగా నవసరంబగుచున్ వ్యతిరేకపక్షి నా
మనమున కెక్కనాడి యొకమంచి దలంచితి, లేఁ గృతఘ్నుఁడన్॥ 60

ఉ॥ రం, డిఁక విందుగొం" డని పరస్పరమున్ మొయికోలుగూర్చి, తా
నండనయుండి బంధువుల కాదట విందులొసంగి, పూవులున్
బండులు చందనాదులును బంచి ప్రియంబున వీడుకొల్పి, యా
పుండగు పింగళేసచివుతోఁ గొలువై శివభూపుఁడిల్లనెన్॥ 61

ఉ॥ "వింటివిగాదె బంధుగుల వెక్కసపుం గొఱగాములెల్ల; లో
నంటు నసూయతో దురుసులాడిరిగా కొక కీడుసేయఁగా
నుంటిమె! లేనిపోని పగలొత్తి, యెఱుంగనిలోక మెట్లువా
కొంటకునైన వీలయిన కుచ్చిత మాడిరిగాక యున్నదే!॥ 62

చ॥ అగు ననుకొమ్ము, నాయతిశయంబునకున్ దగు నాసనం బను
ర్పఁగఁబడియుండు: నైనఁ దమవాఁ డగువాఁ డొకఁ డున్నతుండుగా
నగుటకు సంతసింపరో! యథాభిమతంబుగఁ దోడుసూపరో!
వెగటుగఁ దోఁచెనైనఁ బయివేసము నాలుకతీపు చూపరో!॥ 63

చ॥ మఱిమొకయూహఁ జూడు: మవమానము గల్గునటంచు ముం దెఱుం
గ, రటులైయెన వచ్చుటయె గా; దభిమానముతోడ వచ్చి యి
ట్లుఱుముమరొక్కొ? దీన నెవరో పగదారులు తంత్రమల్లి - రీ
తెఱఁగున మంట రేఁపి తమదీపమునున్ వెలిఁగింపఁగోరుచున్॥ 64

ఉ॥ అప్పటి కోర్మిసూపి తగవాడి పెనంకువలాపి నిందకున్
దప్పితి; మట్లుగాక యొకతాలిమి దప్పిన నెంతలెంతటా
ముప్పులు గల్గియుండు! నిది మోసమొ మౌర్ఖ్యమొ యీసా రోసమో
చెప్పఁగ రాదు; నీ వరసిచెప్పుము దానినిఁ, దత్ప్రతిక్రియన్"॥ 65

చ॥ అనుటయుఁ బింగళేసచివుఁడాఁడెఁ, "ప్రభూ! సకలజ్ఞులైన మీ
కెనయఁగరాని తీరు గలదే! యిదియెల్ల నసూయఁజెందు దు
ర్జనుల దురాగతం బనుటస్పష్టము; చుట్టములన్నవారిలో
మన సిరి కుత్సహించు నభిమానులు కన్నులకందు దైవముల్!॥ 66

ఉ॥ హైందవరాజ్యముల్ శిథిలమై పరహస్తములందుఁ గందుక
స్పందన మంది కుందువడుచందము లెందుకుఁగల్గె? నెందఱో
మందు లసూయతో దురభిమానమునన్ దలక్రిందు లేగి : రా
చందము నేటికిన్ విడువఁజాలక యీగతిఁ గాలుదువ్వెదున్॥ 67

ఉ॥ భూత భవిష్యదర్థములఁ బోలికలెత్తుచు, వర్తమానమున్
జేతికి జాఱనీక ఫలసిద్ధికిఁదెచ్చు నవీనమార్గ ని
ర్మాతలుగాన మీరు సుకుమారముగాఁ బనిగొంటి - లెవ్వ రే
రీతిఁ గలంచినన్ జలదరింపని సంఘబలంబుఁ బెంచుచున్॥ 68

చ॥ కలిగినదెల్ల భిన్నరుచికంబగు లోకముతీరు; దీనిపైఁ
గలవరపాటు మాని, యుపకారముగా మదినెంచి, యన్నిటన్
గల తగవెంచి యందఱసుఖంబుఁ గరున్ దగుదారిఁ బోక ధీ
రులగుణ; మీవిధాన మనురూపముసేయుట నేఁటి కొప్పగున్॥ 69

ఉ॥ చేసినవిందులో నొకవిశేష మెఱింగితి; నోర్వలేక పె
ల్లీసున బందుగుల్ పలికిరే యనుఁ డిం దొకమేలు గంటి; సిం
హాసన పట్టభద్రుఁ డగునంతకు 'రా' జని సమ్మతించి వి
శ్వాసముదోఁపఁ గొల్వరు ప్రజల్, మది మెచ్చరు తోడిచుట్టముల్॥

ఉ॥ ఎంతలు రాజ్యలక్ష్మి వెలయించిన నెంత బలంబులున్న సా
మంతునిఁ జూచినట్లయిన మన్ననజూఁడరు సాటిరాజు; లీ
ప్రాంతము కొల్లగొట్టు నొక 'పాళియగాఁ' డనుమాట పోదు; ప
త్రాంతర దానశాసనములైనను జెల్లవు శాశ్వతంబుగన్॥ 71

ఉ॥ ఈగతి నెందునున్ గొఱఁతలే కనుపట్టెడు; నింతగా నను
త్యాగముఁ జేయుటెల్ల జగదభ్యుదయార్థమ నైన స్వార్థమా
భోగపరాయణత్వమని పోల్చు జగం బిది ప్రత్యభన్నితై
రాగముఁ గూర్పకున్న మనరాచరికంబున కిచ్చు మెచ్చునే!। 72

సీ॥ పట్టాభిషిక్తులౌ ప్రభువులుపోలె రా
జ్యాంగపద్ధతులెల్ల నలవరించి,
చతురంగబలము లష్టప్రధానులు సుహృ
త్కోశ దుర్గాదులు గొలువ మించి,
సకలాంగయుత జల స్థల వన పర్వతా
వృత మహీవలయ విస్తృతి జయించి,
గం డడంగుచు గోలకొండ బిజాపురీ
శ్వరులు గప్పములీయ సంతరించి,
తే॥ మొగలుపాదుషా మనపైకి మొగియకుండ
నడఁచి, నాణెముల్ మనపేర నడువఁ బెనిచి,
యింతవిభవంబు వెలయించి యిపుడు గొఱఁత
యేల పట్టాభిషేకసుశ్రీలఁ దనర!॥ 73

మ॥ శివరా జేలినయంతకాల మతులశ్రీఁబొల్చి, యాపైనఁ గ
న్గవమూాయంగల తీరుగాక, విమతుల్ గారింపఁగారాని గౌ
రవ లక్ష్మీసదనంబు శాశ్వత మహారాష్ట్ర ప్రభుత్వంబు ని
ల్పవలెన్ నేఁడు సమస్తసమ్మతముగాఁ బట్టాభిషేకంబునన్॥ 74

మ॥ కలరాజ్యం బొకనాయకత్వమున సాగంజేసి, తద్వంశ్యు 'లీ
యిల మాసా' మ్మని చూచి యేలఁగల హాయిన్ గూర్చి, నెమ్మిన్ బ్రజా
వళి 'మారా' జని కొల్వఁజేసి తనుపన్ బట్టాభిషేకం బచం
చలమౌ ధర్మము వేదచోదిత, మవశ్యం బిప్డు తీర్పన్ దగున్॥ 75

ఉ॥ నా కిది యుక్తరీతిగ మనంబునఁ గన్పడు; నామపల్కులన్
లోకుల భావగీతు లనులోమ విలోమగతిన్ ధ్వనించుటన్
బోకడ మాత్రియున్న హితబుద్ధి క్షమింపుఁ" డనన్, శివప్రభుం
డాకలితాఖిలార్థ ముదితాశయుఁడై వచియించె నీగతిన్॥ 76

చ॥ "విషయము లన్నియున్ గడువివేకముతోఁ బటులోకదృష్టితోఁ
గషణ మొనర్చి సున్నితముగా నొకవజ్రముఁ దీర్చినాఁడ, వీ
విషమున మేలుగా నమృతబిందువులూర మథించినాఁడ, వీ
కృషి రమణీయ, మిట్లనుసరించు టవశ్యముగాఁ దలంచెదన్॥ 77

చ॥ ఒక విడఁదీయరాని కొతుకున్న : దొసంగితి రామదాసహా
నికి గురుదక్షిణార్థ మవనీతల, మే నభిషేకమందు పొం
దిక తగునే! గురుం డనుమతించునె తా నభిషిక్తుఁడౌట! కీ
సకలము వారొసంగు ననుశాసన మందక యందగించునే!॥ 78

తే॥ విపుల ధర్మరహస్య కోవిదుఁడు గురుఁడు
రామదాసమునీంద్రుఁ డారాధ్యమూర్తి!
యుచిత మనుచితమైనఁ దదుక్తసరణి
యనుసరించుట మనకు శ్రేయస్కరంబు॥ 79

మ॥ ప్రతికూలంబగు రీతులెల్లఁ జతురోపాయంబులన్ దీర్చి, స
మ్మతిమీఱన్ బ్రజలెల్లఁ దోడ్పడి చరింపన్ జూచి, శాస్త్రీయప
ద్ధతిఁ గర్తవ్యములెల్లఁ బండితులచెంతన్ నీవు చర్చింపు; మ
ద్భుత మేధానిధి రామదాసమునినాథున్ గొల్చి నే వచ్చెదన్"॥ 80

చ॥ అని శివరాజు కార్యగతులన్నియుఁ దీర్పఁగఁ బింగళేప్రధా
నుని నియమించి, తల్లినిఁ గనుంగొని సంగతిఁ దెల్పి సమ్మతిన్
గొని, ముని రామదాసుకడకున్ జని పాదయుగంబునంటి వం
దనమిడి, యాదరంబున నతండిడు పీఠముపై వసించుచున్॥ 81

చ॥ జరిగినపోరులన్ నిజభుజాబల భంజితులై మొగల్ బిజా
పుర యవనేంద్రులొత్తిగిలిపోవుట, రాజ్యము నాఁడునాఁటికిన్
బెరుఁగుట మున్నుగా స్వకృత వీరవిహారములున్ బ్రజాహితా
దరములు పింగళేసచివుధార్మికసూక్తులు విన్నవించుచున్॥ 82

తే॥ నాఁటి పట్టాభిషేక నిర్ణయముఁ గూర్చి
సర్వసమ్మత సదుపదేశమును గోర,
ముదితహృదయుఁడై యానందముద్రి విఱియు
కనుల శ్రీ రామదాసుఁ డిట్లని వచించె॥ 83

ఉ॥ "చల్లనివార్త, లోకమునఁ జల్వలువోసెడు వార్త, మా తపం
బెల్ల ఫలించువార్త, మొదలెత్తిన నీదు మహోద్యమంబునన్
మొల్లలు విచ్చు వార్త, తరముల్ బడి సాగిన భోఁసలే యశో
వల్లరి హైందవాంగణముఁ బ్రాఁకినవార్త లభించె నేఁటికిన్॥ 84

చ॥ సముచిత ధర్మనిర్వహణ శస్త్రము శాసనదక్షమౌ ప్రభు
త్వము తతపట్టబంధ విహితక్రియమై ధరయేలు టొప్పు; శా
స్త్రము జగ మామతించిన విధంబిది, నేఁ డిది యెంతయేని ము
ఖ్యము; మనపింగళేసచివుఁ డంతయు ధర్మము పల్కె నియ్యెడన్॥ 85

ఉ॥ నీ వొకసందియంబు గమనించెదవేటికి నాయనా! ధరి
త్రీవలయంబు నా కొసఁగుతీరున నన్ బతిఁజేయ నెంచినా
వో! వెఱివాఁడ! యాస్థవిరయోగికి రాజ్యము లేటికోయి! నా
త్రోవను నిన్ మఱల్చుమదితో నటువల్కితిఁగాక నాఁటికిన్!॥ 86

ఉ॥ ఇచ్చితి వల్లనాఁ, డెఱుఁగవే గురుదక్షిణగా ధరిత్రి నీ
విచ్చినయప్పుడే మఱల నిచ్చితి నేల్కొనుమంచుఁ; బాత్రమం
దిచ్చినదాన ముత్తమున కిచ్చిన విద్దియవోలె సత్ఫలం
బిచ్చు గురూపదేశ; మనమిచ్చితి, గద్దియనెక్కు మీ వికన్॥ 87

ఉ॥ కత్తులదన్ను రక్తములఁ గాల్వలుపాఱిచి, ధర్మబీజముల్
విత్తిన క్షేత్రనాథుఁడవు, పెంచినపైరులఁ గాపుసేయఁగా
గుత్తపుఁగంచె వైచికొని కొంపఁపుమంచియు వెట్టి దానిపై
బెత్తమువట్టి యెక్కు, మిటు పెద్దలధర్మము పెద్దసేయుమీ!॥ 88

మ॥ నిగమాపాదిత ధర్మపాలనవిధా నిర్నిద్ర భద్రావహం
బగు సుక్షత్రియ సింహపీఠ మెపుడో యంతర్హితంబయ్యెఁ, జూ
డఁగలేమన్న నిరాశ నిండికొని నీడల్ గప్పె; నీనాఁటికిన్
మగుడన్ దాని పునఃప్రతిష్ఠ యొనరింపన్ నీకుఁ జెల్లెన్ జుమీ!॥ 89

ఉ॥ చేయుము నాయనా! జగదశేష ముదావహ ధర్మసృష్టి; జా
తీయపతాకక్రింద వగదీఱిన హైందవలక్ష్మిఁ గొల్వఁగాఁ
జేయుము; వేదవేత్త లభిషేకముసేయఁగఁ బట్టబంధ భ
ద్రాయితమూర్తివై సుచరితంబుల నిల్పుము రామరాజ్యమున్!॥ 90

ఉ॥ ఆయతపక్ష్మ పూర్ణ కుతుకాశ్రు తరంగ విలీన దృష్టినై
నీ యభిషేకవైభవము నేనిటనుండియె చూచుచుందు; వి
ఘ్నాయతి గల్గకుండ హృదయంబున దైవముఁ గొల్చుచుందు; సు
శ్రీ యలరార రాజ్యము భరింపుము భోన్సల వంశవర్ధనా!"॥ 91

చ॥ అని మునినాథుఁ డిట్లు హితమాడి, శివప్రభు నెమ్మనంబునన్
బనుపడఁబోలు స్వాతిశయభావ మెఱుంగుచు దానిఁ బాపఁగా
నను వొకఁ డెంచి, యాశ్రమవనాంత విహారము పేర నాతనిన్
గొని చని, యొక్కచో బలుపుగొన్న శిలాతలమొందు గాంచుచున్॥

చ॥ "గునపము నెత్తుచున్ బగులఁగొట్టుము దీని" నటంచు సేవకున్
బనిగొని, యాతఁ డట్లు సలుపన్ దునియన్ బడు ఱాతిలోన ని
ల్చిన జల - మందు నెమ్మది వసించిన కప్పను జూపి, సస్మితా
ననుఁడయి రామదాసుఁడు వినమ్ర శివప్రభుఁ జూచి యిట్లనెన్॥ 93

ఉ॥ "గాలియు నీర మోగిరముగా నిడి యీశిలయందుఁ గప్ప నీ
లీల భరింపనేర్చిన బలీయుఁ డెవండొ యతండె సూ జగ
జ్జాల నియంత - రక్షకుఁడు - సత్ప్రభు; వాతని దొడ్డ యేల్బడిన్
బాలనవృత్తి వారె గద ప్రాక్తను లెల్లరుసార్వభౌములున్!॥ 94

ఉ॥ మానవశక్తి యల్పపరిమాణ మతంత్రము నాటఁ దత్కృతం
బైన సమస్త మల్లె యసమస్తము; యీశ్వరసృష్టి నేలఁగాఁ
దా నెవఁ - డెంతవాఁడు? బహుధా వివిధాతత జంతుకోటిలో
దేనికి నెప్పు డేది యెటు దీర్పఁగ నా - నది నేర్వ శక్యమే!॥ 95

ఉ॥ ఇంతయు దైవలీల; 'జగ మేలెద నే' ననుకో లహంతయున్
భ్రాంతి నిజమ్ము; భూపతులు పండినపంటలు పంచిపెట్టలా
వంతులెగాని పంటగొలుపన్ బలవంతులు గారు; హంతయున్
మంతయు దాత నేత పరమప్రభు వొక్కఁడు, భృత్యు లందఱున్॥

చ॥ విను శివరాజ! యింతటివివేకము చాలినవాఁడు, దైవశా
సనమును దీర్పఁ దాను నొకసాధన మంచని యప్రమత్తుఁడై
మునుకొనువాఁడు యోగ్యుఁడగు భూపతి; నీ విది యెల్ల మున్నెఱిం
గిన కృతివైన యుక్త మెఱిఁగించితి, నేల్కొను మిట్టు లీధరన్"॥ 97

చ॥ అనెడు గురూపదేశము తదాదర మంది, కృతజ్ఞతోపపా
దన విహిత క్షమార్పణ విధానములన్ నతులిచ్చి, భావికా
ర్య నియమముల్ గ్రహించి ముదమంది శివప్రభుఁ డామహాత్ము వీ
డ్కొని తన రాయదుర్గమునకున్ జని మీఁదటికార్యముల్ గనెన్॥

ఉ॥ అంతటఁ బింగళేసచివుఁ డానతుఁడై యిటువల్కె, "నెందునన్
గొంత కొఱంతలేనియటు గూర్చితిఁ గార్యములెల్ల, నెల్లసా
మంతులు బాంధవుల్ ప్రజ లమందముదంబున 'నెప్పు డీశుభో
దంతముఁ గంటఁజూతు' మనుతత్పరతన్ బ్రకటించి రెల్లెడన్॥ 99

సీ॥ పట్టాభిషేకోత్సవము శాస్త్రసమ్మతి
జరిగి ముం దెన్నియోతరములయ్యె
మనహైందవోర్వి; దానిఁగూర్చి సత్సంప్ర
దాయముల్ విస్మృతప్రాయ మయ్యె;
నిచటి పండితులెల్ల 'ఇది యూను గా' దని
మతభేదవాద సంగతికి దిగిరి;
తగవెంచి యెల్లరుదనియ సిద్ధాంతీక
రించు పండితు నేర్పరింపవలసె;
తే॥ నట్టిమాన్యుఁడు కాశికాపట్టణమునఁ
గలఁడు గాంగభట్టాచార్యగౌరవమున
నలరు షడ్దర్శనీవేది : యమ్మహాత్మ
యాజకత్వము మనకు శ్రేయస్కరంబు"॥ 100

చ॥ అనివినిపింపఁగా నుచితమంచు శివప్రభుఁ డంచితాదరం
బునఁ దనపండితోత్తముల ముఖ్యులఁ బంపెఁ - బసిండిపల్లకిన్
ఘన మణిభూషణాంబర ముఖమ్ములు గానుకలిచ్చి — గాంగభ
ట్టును గొనితేర; వార లచటుఁ జని తెచ్చి రఖండ పండితున్॥ 101

తే॥ ఏగుదెంచెడు విద్వాంసు నెదురుకొనఁగ
నల 'సతారా' గడముదాఁక నెలమి నడిచి,
శివమహీపతి రాజవైభవముతోడ
రాయగడమును జేర్చి గౌరవము లిచ్చె॥ 102

ఉ॥ ఆపయి నొక్కనాఁడు సకలాగమవేత్తలు ధర్మశాస్త్ర ని
ష్ణాపరులైన పండితు లెసంగు మహాసభ గూర్చి, సర్వవి
ద్యాపతి గాంగభట్టును సభాధిపతిన్ బొనరించి, భోసలే
శ్రీపతి గోరె నాఁటి యభిషేకవిధానము తీర్పు సేయఁగన్॥ 103

ఉ॥ వారలు ధర్మశాస్త్ర పరిపాటియుఁ బెద్దలతీరు సాంఘికా
చారము లెంచి నిర్ణయము సల్పెదు వో నొకరాజబంధు వీ
స్ట్యారతిఁబల్కె, "నెందు కిదియంతయు? వేదహితాభిషేక సం
స్కారము క్షత్రియోత్తముఁడుగాక మఱొక్కరుఁ డంద నర్హుఁడే?॥

చ॥ శివపతి క్షత్రియుండని వచింపఁగరాదు, తదీయపూర్వులం
దెవరికిఁగాని శాస్త్రవిధి నీ యభిషేకము చెల్లియుండలే
దవుట శివప్రభుండు తగఁ డందుల" కంచు నిరాకరించె; "నా
నవు" నని పండితుల్ పలుపు రాడిరి వాదబలంబుఁ బెంచుచున్॥ 105

ఉ॥ అంతట గాంగభట్టు సకలాగమ తత్త్వములెంచి యిట్లు సి
ద్ధాంతము పల్కె, "క్షత్రియుఁడుదక్క మఱొక్కఁ డనర్హుఁ డన్న తీ
రెంతయు నొప్పు; 'క్షత్రియుఁడె యీ శివరా' జని సప్రమాణకో
దంతముఁ దేల్చుదాఁకఁ బ్రకృతం బభిషేకము చెల్ల దిప్డుడన్"॥

చ॥ అనుటయుఁ బింగళేసచివుఁ డాడె, "నిజం బుచితంబు మీ వచిం
చినది, కులక్రమాగత విశిష్టమహత్త్వము లేక పట్టబం
ధనవిధి వేదచోదిత విధానములన్ నడిపింపఁగూడ: దై
నను ఘన భోంసలేకులగుణంబు సదస్యు లెఱుంగకుందురే!॥ 107

సీ। భోంసలేకుల మూలపురుషుల వంశ వృ
క్షమును వాకొను దేశచరితలందు,
శ్రీ భవానీదేవి చేయెత్తి శివపితా
మహున కిచ్చిన వరమాలయందు,
రామదాసుని తుకారాముని మధురగే
యముల మహోపదేశములయందు,
ముసలవ్వ లింటింటఁ బసివాండ్రకుబుసుపో
కకుఁ జెప్పికొను చిట్టికతలయందు

తే॥ 'శివమహీపతి సూర్యవంశీయ రాజ
మౌళి' యనువార్త లెల్లెడ మాఱుమ్రోఁగు
చుండ, వినువారలుండ వేఱొండు సాక్ష్య
మిపుడు వలయునే? యెఱుఁగదే యెల్లజగము?"॥ 108

మ॥ అనుమాటల్ శివభూపుఁ డందికొని కార్యజ్ఞత్వ మేపార ని
ట్లనె, "మీ రింతలు నిగ్గుదేల్చుటిది యోగ్యంబంచు భావింతు; ధ
ర్మ నిరోధంబగు నింద్రభోగమయినన్ మన్నింప నేనొల్లఁ; బా
వన మస్మత్కులకీర్తి పెద్దలు వచింపన్ వింటి నే నీగతిన్॥ 109

సీ॥ క్షత్రియోత్తములైన సార్వభౌములకెల్లఁ
బురుడుదీర్చినది భాస్కరకులంబు,
తద్వంశభవులు, 'మాంధాత' యు - విష్ణ్వంశ
భవుఁడు శ్రీరాముండు - లవుఁడు - కుశుఁడు,
లవమహారాజు మూలపురుషుఁ డనఁ గీర్తి
నలవరించె 'శిశోదియా' న్వయంబు,
తత్కులుల్ 'మేవాడ' దయితులు 'చిత్తూరు'
నగరనిర్మాతలు నాదుపూర్వ;
తే॥ లట్టిపూర్వులనుండి వేఱైన శాఖ
యుత్తరమునుండి మన దక్షిణోర్విఁ జొరఁగఁ
బ్రాఁకి ప్రబలిన దీ భోసలేకులంబు;
క్షత్రియులుగారె భోసలే గోత్రభవులు!"॥ 110

మ॥ అనుటన్ గైకొని గాంగభట్టు "శివరాజా! సత్యవృత్తాంత మె
ల్లను విస్పష్టము; సూర్యకాంతి నొకమూలన్ డాప శక్యంబె! యీ
యనుమానంబులు రాజకోశనిహితంబౌ వంశవృక్షంబు గ
న్గొనుచోఁ దీఱవె! చిక్కదే యదియు మీకున్ నేఁడు మేవాడలో!॥

ఉ॥ అంచితరీతి నీ యనుచరావళిఁ బంచుము; రాజముద్రికా
భ్యంచిత వంశవృక్షము రయంబునఁ దేరఁగఁ బంచి నిర్వృతిన్
గాంచుము; వేదచోదితముగా నభిషేక మహోత్సవంబు సా
ధించుము; రాజ్యపాలన విధించుము భోసలవంశవర్ధనా!"॥ 112

మ॥ అనుచో నంను సదస్యులెల్ల "ఇది యౌ నౌ" నంచు వాక్రువ్వఁ, దీ
అనియుత్సాహముతో శివప్రభుఁడు 'నీరాజీ' చమూనాథు మిం
చినసైన్యంబిడి వస్తువాహనధనశ్రీ గాన్క లర్పించుచున్
వినయంబొప్పఁగఁ గమ్మవ్రాసి పనిచెన్ వేవేగ మేవాడకున్॥ 113

సీ॥ మేవాడ రాజ్యలక్ష్మి భర్త రాజసిం
హుఁడు శివప్రభుకార్య ముత్సహించి,
చిరవిస్మృతాత్మవంశీయశాఖలు నేఁడు
పూచి కాచి ఫలించు పోలపమెంచి,
హైందవాభ్యుదయ పూర్ణేందుచంద్రికలైన
శివరాజజయముల నివతళించి,
దక్షిణభూమి హైందవరాజ్య సుప్రతి
ష్ఠా శుభోదయమున సంతసించి,
తే॥ † సవితమొదలుగాఁ దమదాఁక సాగియున్న
వంశవృక్షము వ్రాయించి భవ్య రాజ
ముద్ర యిడి, కాన్క లతివేలముగ నొసంగి
శివపతికిఁ బంపె మిగుల గౌరవముఁ జూపి॥ 114

ఉ॥ వచ్చిన వంశవృక్షము శివప్రభుఁ డాదరమొప్పఁ గొల్వుకున్
దెచ్చి "సభానుమోదమున దీనిసమర్థతఁ బల్కుఁ" డంచు వా
క్రుచ్చిన, గాంగభట్టచటి కోవిదవర్యులకెల్లఁ జూపి, ధీ
రోచ్చతరస్వరంబున సమున్నతి దానిఁ బఠించి యిట్లనెన్॥ 115

† See Appendix.

మ॥ "ఇదిగో! తెచ్చినవంశవృక్ష, మిది మీకెల్లన్ స్రుతంబైనదే
గద? 'సుక్షత్రియుఁ డీతఁడౌ' ననుట సాక్షాత్కారమైయున్నదే
గద? మే మీయభిషేక మింక సలుపంగా నాజ్ఞ యీవచ్చునే
గద? యాక్షేపణమున్నఁ దెల్పుఁ డెదియైనంగాకేమి నిశ్శంకులై?"॥

మ॥ అనఁగా నందఱు సమ్మతింప, నొక విద్యావృద్ధుఁ డగ్గలెత్తి యి
ట్లనె "నీ భూపతి వేదధర్మములు పూర్వాచారముల్ బొల్లువో
వనియ ట్లోమఁదలంచుటన్ నడిచె నీవాగ్వాదముల్; గాన నే
నును నాసంశయ మొండు వల్కెద, వలంతుల్ దానిఁ దీర్పన్ దగున్॥

చ॥ శివపతి క్షత్రియుండగుట సిద్ధమ, మైనను దత్ప్రసిద్ధిగా
రవములు నోమెఁ బెక్కులుతరంబులనుండియుఁ : గొన్నివందలేం
డ్లవధిగ వీరివంశమున నాగమరీ త్యుపనీతి సంస్క్రియా
ది విధు లెఱుంగ : మి ప్పనుమతింతురొకో యభిషేకసత్క్రియన్?॥

చ॥ ఇరువదిరెండువత్సరము లేగినచో నుపనీతిసంస్క్రియా
భరితులుగాని క్షత్రియులు 'వ్రాత్యు' లనంబడుచుండ, నెన్నియో
తరములనుండి జందెమునుదాల్చుట మున్నుగ వేదకర్మలే
యెఱుఁగనివారి వ్రాత్యులనరే? యభిషేకము వారి కొప్పునే?॥ 119

ఉ॥ పోయినరాజ్యమున్ విభవమున్ దతపౌరుషశక్తియుక్తిన
త్యాయతరీతిగా మఱల నందిన నందఁగవచ్చు; నెన్నఁడో
పోయిన వేదకర్మ - లెడఁబోయిన జాతిమహత్త్వముల్ పృథ
క్కాయము నెత్తుకున్నఁ గొనఁగాఁ దగునే తనబల్మిపెంపునన్!॥ 120

మ॥ అపరాధీనము వేదశాసనము, పూర్వాచార మద్దానికిన్
విపులాదర్శము; దానిదానఁ గొనుటే విధ్యుక్తధర్మంబు గా,
కపలాపించి పరాభవించి కృతకార్థాపత్తి గల్పించి స్వా
ర్థ పరంబౌనటు బల్మిఁ గొంట దగునే ధర్మప్రతిష్ఠాపకుల్?॥ 121

మ॥ కటువైనన్ బ్రతికూలమైనను బరిష్కార్యంబు ధర్మంబు సె
ప్పుటయే నావిధి, మీకుఁ దోఁచినటు తీర్పుం జేయుఁ” డంచాడెఁ; న
చ్చటివా రాతనిపల్కు మెచ్చి; రటుపై శాస్త్రీయసిద్ధాంత ము
ద్భటుఁడై వాకొనె గాంగభట్టు విపులోదాత్తప్రమాణంబులన్॥ 122

చ॥ “జరిపిన పూర్వపక్షము ప్రశస్తము, హేతువులున్ బ్రమాణముల్
కర ముచితంబు; లైన స్మృతికర్తల ధీర గభీర భావముల్
పరిణత దేశకాలపరిపాటియుఁ బెద్దలసంప్రదాయముల్
దరిచినఁగా కగాధ వితత శ్రుతిధర్మ మెఱుంగవచ్చునే!॥ 123

చ॥ † ‘నియమితకాలమం దనుపనీతులెవరా ద్విజులెల్ల వ్రాత్యు, లా
పయి నిగమోక్తకర్మలవి వారికిఁ జెల్ల’ వలన్నసూక్తి ని
శ్చయమగు నైన, నిందు సువిశాలవివేక విశిష్ట ధర్మని
ర్ణయములు పెక్కు సల్పిరి పురాణమునుల్ స్మృతిసంహితాదులన్॥

సీ॥ * ‘త్రిపురుషావధిగాఁగ నుపనీతిసంస్క్రియ
విఱుఁగుచో మూఁడవపురుషుఁ డైన
నశ్వమేధంబొ వ్రాత్యస్తోమయజ్ఞమో
యౌద్దాలకవ్రత మైనగాని
తగినప్రాయశ్చిత్తముగ సల్పి, యుపనీతుఁ
డగుచు, నధ్యయనయోగ్యతను బొందు’
ననిరి వ్యాస వశిష్ఠ మను గదాధర యాజ్ఞ
వల్క్యాది ధర్మప్రవక్తలెల్ల;

---

† బ్రాహ్మణ క్షత్రియ విశాం। కాలశ్చే దత్యగాదయం
సావిత్రీపతితా వ్రాత్యాః పవిహార్యాః ప్రయత్నతః॥ వ్యాసః.

* “త్రిపురుషం పతితసావిత్రీకాణామపత్యే ऽసంస్కారో నాధ్యాపనంచ,
తేషాంసంస్కారేప్సవో వ్రాత్యస్తోమే నేష్ట్వా కామమధీయీరన్, వ్యవహార్యాభవంతీతి”
వ్యాపాదయః.

తే॥ † 'రటులె నాల్గవపురుషుఁ డధ్యయన మొకటి
దక్క, నన్నిసంస్క్రియలు పొందఁగలఁ' డనిరి
పారిదిఁ బారస్కరిక గృహ్యసూత్ర వివర
ణముల ధర్మశాస్త్రార్థవిత్తములు బుధులు॥ 125

సీ॥ ♦ 'పం(డెండుతరములవఱకుఁ - బం(డెండేండ్ల
ముగియు ప్రాయశ్చిత్తముఁ గొనుమీఁద -
వ్రాత్యసంస్కార మర్హ' మటంచు గొందఱు
'తరములవెన్ని వత్సరములన్ని
ముగియు ప్రాయశ్చిత్తమునఁ జెక్కుతరముల
కును సమర్హ' మటంచుఁ గొంద ఱాన
తిచ్చి రాపస్తంబ గృహ్యసూత్రోజ్జ్వలా
వృత్త్యుపవ్యాఖ్యాన వివరణముల,
తే॥ నన్నిమతములలోఁ బురుషాంతరముల
తారతమ్యమెకాని, 'సంస్కారవిధులు
కూడ' వను పూర్వపక్షీయకోటి లేదు,
కలదు సద్విధి వ్రాత్యసంస్కారములకు॥ 126

---

† "త్రిపురుషమితి - యేషాంత్రియాణామపత్యే చతుర్థేపురుషే కృత ప్రాయశ్చిత్తే, కేవలముపనయనాఖ్యస్సంస్కారః, నాధ్యాపనాదిః.
పారస్కరగృహ్యసూత్ర వివరణె ... ... జయరామః.
"గృహ్యసూత్రోజ్జ్వలావృత్తౌ కేషాంచిన్మతం"

♦ "అత్రకేచిత్ - యస్యప్రపితామహాది నానుస్మర్యతే ఉపనయనం, తస్య ద్వాదశ వార్షికప్రాయశ్చిత్తవిధానపరే మూలే ప్రతిపురుషంసంఖ్యాయ యావంతో అనుపనీతా ఇతి" - ఇత్యస్యానుషంగో యః ఉజ్జ్వలావృత్తౌసూచితః, తత్పర్యాలోచనేన ద్వాదశపరంపరా పర్యంతం వ్రాత్య సంస్కారయోగ్యతావర్తతఇతి గమ్యతే. అన్యేతు - ద్వాదశవర్షాణీ త్యుపలక్షణం ప్రతిపురుషంసంఖ్యాయ సంవత్సరానితివచనానుసారేణ అసంఖ్యాతా నామనుపనీతత్వేపి తావద్వర్షప్రాయశ్చిత్తేన సర్వధర్మాధికారో భవతీతిమన్యంతే.
ధర్మప్రదీపము - శుద్ధితత్త్వప్రకాశ ప్రకరణము పేజి 189.

మ॥ ప్రతికూలంబుగ దేశకాలము లెదుర్పన్, దుర్గమంబౌ పరి
స్థితి షాజీపతి-కల్లై తత్పితకు విచ్ఛిన్నంబ వేదోక్త సం
స్కృతియాఁగా, కటు వారిపూర్వులకు విచ్ఛిన్నంబె యానంతరన్
మితి యేమున్నది? సాక్షులెవ్వ? రిదియున్ మీమాంసచేయందగున్॥

ఉ॥ పోయిన వేదకర్మ- మెడఁబోయిన జాతిమహత్త్వ మింక రా
దే యననేల? వచ్చుననియేగద పెద్దలు వ్రాత్యసంస్కృతిన్
జేయ ననుజ్ఞయిచ్చి; రిటుచేయుచు శుద్ధినిఁ బొందుటే పృథ
క్కాయము నెత్తు, టిన్నియు జగంబున వేదవిభుత్వపద్ధతుల్!॥ 128

ఉ॥ జాతియు దానికిన్ దగిన సంస్క్రియ తండ్రినిఁబట్టి వంశ వి
ఖ్యాతినిఁబట్టి వచ్చు; నటుగాక శరీరముఁబట్టి వచ్చునే?
యీ తెఱఁగుల్ విధించు నిగమేరితధర్మమె వ్రాత్యసంస్క్రియా
రీతి వచించె; ని ట్లనుసరింపక ధిక్కృతిసేయ నున్నదే?॥ 129

ఉ॥ ఇన్నియు సంప్రదింప మన కిప్పటి 'కీశివరాజవంశమం
దిన్నితరాలనుండి నిగమేరితకర్మలు లే' వటంచు ని
ష్పన్నము సేయరాదగుట వచ్చినలోపము వ్రాత్యసంస్క్రియా
సన్నముఁ జేసి సన్మతముగా నభిషేకము సేయు టొప్పగున్॥ 130

మ॥ ఇది శాస్త్రీయమతంబు, శిష్టజనులం దీనాఁటి యాచార మి
య్యది, పౌరాణికగాథలన్ బ్రబలదృష్టాంతంబు లిం దెన్నియే
విదితంబుల్, విపరీత మెయ్యెడల భావింపంగ లేదాట న
భ్యుదయాకాంక్షులు ముందుకేగవలె శ్రేయోదాయిమార్గంబులన్॥

ఉ॥ అంచితమైన వేదవిధి యందఱకున్ హితమైనయు, ద్దని
ర్వంచితశక్తి భక్తిఁ దదుపాసకులెల్లఁ దదీయవృద్ధికై
కొంచక ధర్మమార్గములకున్ దగున ట్లవకాశమిచ్చి సా
ధించుట యొప్పుఁగాక తెగఁదీయు తలంపుల కుత్సహింతురే?॥ 132

చ॥ పరులమతంబు నేఁడు బలవంతముగాఁ బయిరెక్కె, యుట్రోయం
తరములఁ జొచ్చి హైందవమతంబును మ్రింగుచునుండ, దేవతా
వరములు సంతరింపుచు, శివప్రభుఁ డాపద లోర్చుచుఁ దను
ద్ధరణము సల్పుటెల్ల విదితంబయ్యె, తోడ్పడ జాగుసేతురే!॥ 133

చ॥ కలవరమందు హైందవజగంబునఁ బర్విన ప్రజ్వల ద్ధలా
హాల మఱచేత మ్రింగి, హృదయంబున వేడికి రక్తబిందువుల్
జలజలఁగంటరాల నవశంబుగఁ దాండవమాడి చెమ్మటల్
బొలిచినవాని కారటముచో నభిషేకము సేయకుందురే!॥ 134

చ॥ అడరినమేలు నెంచి మనకైమనమే 'యిక సింహపీఠిపై
నడుగిడు' మంచుఁ గోరఁదగునంతటి పూజ్యుఁడు ధర్మరక్షకై
యడిగినయప్డు - లోకహితమైనవు - డాగమ ధర్మపద్ధతుల్
చెడక వెలుంగునప్పు డభిషేకవిధానము నామతింపరే!॥ 135

చ॥ ఒకరి యసూయతో బహుజనోన్నతి భంగపడంగరాదు, వే
ఱొకని కుపేక్షసేసి జగదున్నతి కడ్డుపడంగరాదు, తా -
మొకనరుఁ డొక్కసంఘ మొకయూర్జితరాష్ట్రము సర్వలోక - మి
ట్లొకఁడొకఁ డుత్తరోత్తర శుభోన్నతికై బల మీయఁగావలెన్॥ 136

మ॥ పరితో లౌకిక వైదికాశయములన్ భావించి, నే నిట్టు లీ
పరిషత్పండిత సర్వసమ్మతి రహింపన్ దీర్పు గావింతు, నే
యఱలే కాగమసంప్రదాయములఁ బ్రాయశ్చిత్తముల్ దీర్చి, ని
ర్భరసమ్మోదము మీఱఁ జేయఁగఁదగున్ బట్టాభిషేకక్రియన్॥"137

చ॥ అనువెడ సందడిన్ జయజయధ్వనిపెల్లున గాంగభట్టుతీ
ర్పును గొనియాడి యాత్మముదమున్ బ్రకటింప, శివప్రభుండు స
మ్మనము కొలంతదీఱ ముఖమండలి నొండొకవెల్గు మీఱ వం
దన మొనరించి, మించిన కృతజ్ఞత వెల్వడ నిట్లు వాకొనెన్॥ 138

చ॥ "కరముఁ గృతార్థమయ్యెఁ గులగౌరవ మొందఱి కెన్ని సంశయ
స్ఫురణములున్న నన్నియు నపూర్వ నిజ ప్రతిభావిశేష భం
గురములుగాఁగ, ధర్మపథికుల్ మదిమెచ్చఁగ వేదవీథులన్
బఱచితివయ్య పూ - లడుగుపట్టున ఆ్ఱా లెడఁబోవఁజిమ్ముచున్!॥139

మ॥ చతురంగంబుల నొడ్డి మాఱుకొనియున్ సాధింపఁగారాని య
ద్భుత వేదోదిత పట్టబంధనము కంటున్ గుందు లేకుండ నీ
ప్రతిభాశక్తి జయించి క్షత్రవిభుతా ప్రాజ్య స్వరాజ్యంబు ని
ల్పితి, వీ మేలునకున్ గృతజ్ఞులము, దూలెన్ నేఁడు దుర్వాదముల్!॥

మ॥ ఇఁకఁ జేయంగల సర్వకార్యముల మీరే నిర్ణయంబిచ్చి, వా
నికి సంభారము లెట్టి వెన్ని వలెనో నిండారఁగాఁ గూర్చి, యా
జకులున్ బెద్దలు కార్యకర్తలు హితుల్ సర్వంబు మీరాచు, వై
దిక దీక్షావిధిఁ బట్టబంధ మనురక్తిన్ బూర్తి గావింపుఁడీ"!॥ 141

మ॥ అనుమాటల్ విని గాంగభట్టు "శివరాజా! యట్లయాఁ గాక, నీ
యనుసంధానము కాదనన్ గలమె! పూర్వాన్నత్య ముప్పొంగ నేఁ
డనఁగా సర్వము నిర్వహింపు, మిపుడే యాహ్వానముల్ తోడి రా
జ నికాయంబున కంపు, మెల్లయెడలన్ జాటింపు సేయింపుమీ!॥142

సీ॥ పదియునేనూర్ల తొంబదియా ఱవు శకాబ్ద
పరిమితి నానంద వత్సరమున
నొగి జ్యేష్ఠశుద్ధ త్రయోదశి బుధవాస
రమునఁ బట్టాభిషేకము హితంబు;
పాడ్యమి మొదలుగాఁ బంచమిదాఁక వ్రా
త్యస్తోమ యజ్ఞాము లాచరించి,
యటుపైన నుపనయనాది సంస్కార, మం
తటఁ బట్టబంధనోత్సవము జరుగు

తే॥ నట్లుగా నిర్ణయించితి, నంతలోన
సకలకార్య సంభారముల్ సంతరించి,
నాఁటికిఁ గొఱంతలేని సన్నాహ మొప్ప
నియమ దీక్షితస్థితి నీవు నిలువవలయు॥ 143

పట్టాభిషేక మహోత్సవము.

ఉ॥ ఈసభ నింతమాత్రి ముగియింతు” నటంచు వినిర్ణయాపర
వ్యాసుఁడు గాంగభట్టు తెలుపన్, శివరాజు సదస్యులన్ సప
ర్యా సముపాస్తి వీడ్కొలిపి, యర్హములౌ పనులెల్లఁ దీర్ప వి
శ్వాసులఁ గార్యదక్షులగువారల మంత్రులఁ బంపె వేడుకన్॥ 144

ఉ॥ వారును రక్తిభక్తి మదిఁ బర్వులువాఱఁగ గాంగభట్టు తీ
ర్పారసి, పింగళేసచివునానతిఁ గార్యములెల్ల వార్చి, సం
భారములెల్లఁ జేర్చి, సువిభక్తముగాఁ బురమెల్లఁ దీర్చి, నా
నా రుచిరప్రకారముల నవ్యత భవ్యత గూర్చి రెల్లెడన్. 145

సీ॥ రాయగడంబు చిత్రవిచిత్ర బహువిధా
లంకారముల వేడ్కలను రహించెఁ,
బట్టాభిషేక వైభవ మహాభవన మ
ద్భుతశిల్ప రమణీయముగఁ దనర్చె,
యజ్ఞశాలలు విద్వదాస్థానములు వినో
దాగారములు పెక్కు లందగించె,
వచ్చినయతిథు లెవ్వరుగాని విడియఁగా
వసతిగృహంబు లేర్పఱుపఁబడియె,
తే॥ స్నాన పాన వినోద భోజన సుఖాస
నముల కుచితసౌకర్యముల్ కొమరుమిగిలె,
సకలవస్తు సంభారముల్ చాలినన్ని
వెలసె శివరాజమంత్రిల వితరణమున॥ 146

చ॥ ఇటు తగుకార్యముల్ సమయమెంచి యమాత్యులు నిర్వహించు నం
తట శివరాజు రాజ్యమున నాలుగుమూలలు సంచరించి, య
చ్చటి కనువైనరీతులఁ బ్రజాహృదయంబులఁ దన్పుగూర్చి యా
అటగొనె 'రా' జనఁగ 'బ్రకృతిరంజకుఁ' డన్నది సార్థకంబుగన్॥ 147

చ॥ శివపతి భక్తిమీఱఁ దనసీమల నెల్లెడనున్న దేవతా
భవనము లన్నిటన్ జికిలివాఱ నలంకృతి గూర్చి, పూజ లు
త్సవములు దీర్పఁబంచి, తులజాపురమందుఁ బ్రతాపమగ్నమం
దవహితయా భవానికొఱ కంపెఁ బృథక్కనకాత పత్రముల్॥ 148

ఉ॥ ఇంతటిలో ముహూర్తదిన మింతటనంతట దాపుగా, సుహృ
త్సంతతి చుట్టముల్ ముజుముదారులు జాగిరుదారులెల్లసా
మంతులు వేఱువేఱగు సమస్తజనంబులు చేరవచ్చి ర
త్యంతవికాస మాత్మహృదయంబులు రాజగడంబు నిండఁగన్॥ 149

ఉ॥ వేదవిధిజ్ఞమూర్తులు పవిత్రులు నైష్ఠిక యాయజూకు ల
ష్టాదశవిద్యలందును రసజ్ఞులు విప్రులు వేనవేలు రా
జాదరణంబునన్ బిలుపు నంది వెసన్ జనుదెంచి రధ్వరా
పాదిత తంత్ర నిర్వహణపద్ధతి ఋత్విజులై సదస్యులై॥ 150

ఉ॥ వచ్చెడువారు లోపలికివచ్చెడువారును వీథివీథులన్
జొచ్చెడువారలున్ విడిదిఁజొచ్చెడువారు వినోదకేళిమై
నచ్చటనచ్చటన్ దిరుగునట్టి జనంబులునిండఁ దద్విహా
రోచ్ఛలితంబు రాయగడ మొప్పె సముద్రము పొంగినట్లుగన్॥ 151

మ॥ సమయజ్ఞుండగు గాంగభట్టు బహుధాసంభారముల్ గొంచు, ను
త్తములౌ ఋత్విజులెల్లఁదోడుపడ వాజ్యస్తోమయజ్ఞంబు సే
య మొదల్పెట్టె, శివప్రభుండు నియమవ్యాపార దీక్షావిధి
క్షముఁడై నిల్వఁగ, వేదచోదిత సదాచారంబులన్ దీర్చుచున్॥ 152

సీ॥ పితృపితామహ సమాగత కళంకము హవ్య
ధూమ రేఖాకృతిఁ దొలఁగుచుండఁ,
గుటిలబాంధవ రహః కుహనాపవాదముల్
సమిధలై మంటలో సగ్గుచుండ,
నాగమ ధర్మశాస్త్రాలాపములు సర్పి
రాహుతి జ్వాలలై యలముచుండఁ,
దత సమిద్ధాగ్ని హోత్రి జ్యోతు లొలసి మో
మున క్షత్రి తేజంబు మొనయుచుండ,
తే॥ యజ్ఞవేదిక నిలిచి, దీక్షాభిరామ
శాంతమూర్తియై శివరాజు సస్వరోక్త
గాంగభట్టార్య మంత్రిప్రికారవిధుల
నాహుతులు వ్రేల్చి తనియించె హవ్యవాహు॥ 153

మ॥ యమ దీక్షా నియతోపవాసముల సాయుంప్రాత రాజ్యాహుతి
క్రియ హోమంబుల దైవతార్చనలఁ దీర్థ స్నాన దానాది కా
ర్యములన్ దీర్చుచుఁ బంచరాత్రముల వాత్యస్తోమయజ్ఞంబు సాం
తము గావించె శివప్రభుండు పరిశుద్ధ క్షత్ర తేజస్వియై॥ 154

శా॥ ప్రాయశ్చిత్తవిధాన మిట్లు నెఱవేఱన్ జాతకర్మాదు లా
మ్నాయప్రోక్తముగా విధింపుచు, ద్విజన్మత్వంబు సిద్ధింప దీ
క్షా యుక్తం బుపనీతిసంస్క్రియ వెలుంగన్ బ్రహ్మసూత్రంబుతో
గాయత్రీజపశుద్ధుఁ జేసిరి శివక్ష్మానాథు నయ్యాజకుల్॥ 155

చ॥ పరిణయబంధ బంధువగు పత్ని యొడన్ బ్రణయానుబంధముల్
పరిణతిఁబొందఁ, బొందినఫలంబగు సంతతితోఁ గుటుంబియై
పరఁగు శివప్రభుం డిపుడు పట్టపుదేవినిఁగూడి బంధుతా
పరిగతుఁడౌచు వైదికవివాహవిధిన్ గయిసేసెఁ గ్రమ్మఱన్॥ 156

మ॥ ఇటు సుక్షత్రియుఁడౌచు వేదవిహితానేకోత్తమాచార లం
పటుఁడౌచున్ శివరాజు ఋత్విజులతోఁ బట్టాభిషేకక్రియా
ఘటనాతత్పరుఁడై పయో ఘృత ఫల గ్రాసోపవాసవ్రత
స్ఫుట దీక్షావిధి సల్పె హోమనియమంబుల్ సప్తరాత్రంబులన్॥

సీ॥ మఱునాఁటివేఁకువ మంగళస్నానంబు
లంబర మాల్య భూషానులేప
నాద్యలంకారంబు లవధరింపుచు ధర్మ
పత్నీయుతుండు శివప్రభుండు
తొలుదొల్తఁ దనవేల్పు నిలువేల్పగు భవానిఁ
గొలిచి, మాతృపదాబ్జములకు మ్రొక్కి,
మంగళద్రవ్య సంభారముల్ గొనుచు ఋ
త్విజులు పురోహితుల్ వెంటనడువ

తే॥ నింద్రవైభవమొప్ప గజేంద్రయాన
ధీర గంభీర సుభగతా దీప్తుఁడగుచుఁ
దరలి చనుదెంచె నవరత్న ధగధగప్ర
భా విభాసిత మభిషేకభవనమునకు॥

చ॥ సలిల కిసాల పూర్ణకలశమ్ములఁ, బల్లవ తోరణస్రజ
మ్ముల, నిరువైపులన్ బలిసిపొల్చు నలంకృత హస్తి వాజి యో
ధుల, విజయధ్వజంబులఁ గుతూహలదం బభిషేకశాల యుం
గలిచెలువమ్ము తన్పునయఁ గాంచి చనెన్ శివరాజు లోనికిన్॥ 159

చ॥ పఱచిన పట్టుకంబళులు, పార్శ్వములం దధికారివర్గ వి
ష్టరములు, రెండుముప్పదియు స్వర్ణమణీమయ సాలభంజికల్
మురువగు మేలుకట్టుపయి ముత్తెపుజొత్తులు కెంపుగుత్తులున్
దొరసిన కొల్వుకూటము గనుంగొనుచున్ శివభూపుఁ డేగినన్॥ 160

ఉ॥ అందఱు సందడిన్ జయజయధ్వని వెట్టుచు లేచి నిల్వ, నా
నందముతో శివప్రభుఁ డనర్ఘమణీ రమణీయ పీఠికన్
జందురునట్లు వెల్గుటయు, సభ్యులు తక్కినరాచకొల్వువా
రంద ఱలంకరించిరి నిజాసనపాళి యథార్హరీతులన్॥ 161

ఉ॥ అంతట గాంగభట్టు సమయజ్ఞత మీఱ ముహూర్తవేళ య
త్యంతము దాపుగా ముదితుఁడై యభిషేకమహోత్సవం బుప
క్రాంతముఁజేయ నెంచి, శివరాజును బట్టపుదేవి నొక్కపీ
ఠాంతరమందు నిల్పి నియమార్హవిధుల్ నడిపించె వేడుకన్॥ 162

సీ॥ భరతవర్షాఖండ భాగ్యస్వరూప గం
గాదిక పుణ్యతీర్థోదకములఁ
దెప్పించి, నియమితర్త్విజుల హస్తముల నిం
చిన స్వర్ణకలశముల్ సిద్ధపఱచి,
పరిమళద్రవ్యముల్ పంచామృతంబులు
పంచగవ్యంబులు ఫలరసములు
తెచ్చి సువర్ణపాత్రికల వేర్వేఱ సు
వాసినీ మృదుకరాబ్జముల నునిచి,
తే॥ వేదపాఠస్వనంబులు వివిధమధుర
తూర్యనాదముల్ మాగధ స్తోత్రగీతు
లలముకొనుచుండ, గాంగభట్టార్యుఁ డపుడు
శివమహీనాథుఁ బట్టాభిషిక్తుఁ జేసె॥ 163

మ॥ ప్రథమాచార్యుఁడు, ఋత్విజుల్, సకలవిద్వద్బృందముల్, రాజులున్
బ్రథితాత్ముల్ కులవృద్ధులున్, సచివులున్, బంధువ్రజం, బాహవో
న్మథనోదారులు వీరులున్, సతులు, కన్యారత్నముల్ వేదవా
గ్విధి మున్మున్ను అభిషిక్తుఁజేసిరి శివోర్వీనాథు వేర్వేఱుగన్॥ 164

చ॥ శివపతి మంత్రపూత మభిషేకవిధానమునన్ దనర్చి, యు
త్సవమున వేదవిప్రులకు స్వర్ణ మహీ బహుళాగ్రహార గో
భవన నవాంబరాభరణ వాహన తల్పము లాది దానముల్
వివిధము లిచ్చి దైవతగవిన్ దనయీవి నధఃకరించుచున్॥ 165

చ॥ తనుపెనయన్ దులాపురుషదానము సేయ శివప్రభుండు త్రా
సునఁ దనయెత్తు స్వర్ణ మణి శుక్తి సుగంధము లాది తూఁచి, తూఁ
గినధనమెల్ల విప్రతతికిన్ సచివాళికిఁ బేదసాదులౌ
జనులకుఁ బంచిపెట్టె క్షణశః కణశో బహుశో యశోర్థియై॥ 166

ఉ॥ బంగరువాన వెల్లువలువాఱ ఘటించు నమోఘమేఘుఁడై
పొంగు శివప్రభుండు మెఱపుల్ గొను బంగరుపళ్ళెరాలఁ బు
ణ్యాంగనలెత్తు కప్పురపుటారతు లందినమీఁదఁ, బట్ట బం
ధాంగ మహార్హ్య మండనరమాప్తి నలంకృతుఁ డయ్యె నయ్యెడన్॥

ఉ॥ అచ్చపు రాచకేవి మొగమందునఁ దాండవమాడ, మండనా
భ్యుచ్ఛలి తాంబరాభరణముల్ మెయి వన్నెలుమీఱ, నమ్రుఁడై
వచ్చి సదస్య మాతృగురువందనముల్ ఘటియించి, గాంగభ
ట్టిచ్చిన కేలువట్టి చనియెన్ శివభూపతి సింహపీఠికిన్॥ 168

సీ॥ నవరత్నసింహాసనము సర్వతోభద్ర
మయి కుందనపుసిరి నందగింప,
అష్టకోణముల మణ్యంచితస్తంభాగ్ర
ములు నిల్వుటెరసి యొప్పులు ఘటింపఁ,
బయికప్పు మరకతప్రభల నాఁదలలెత్తి
శేషాహిపడగల చెలువు నింప,
మకర ముఖాగ్రదంష్ట్రిక - లశ్వవాలంబు
లిరువైపు శిల్పవిస్ఫురణఁ బెంపఁ,

తే॥ బైఁడిటీఁగలు వజ్రపుష్పములు కెంపు
గుత్తు లాణిముత్యాల మేలుకుచ్చుసరులు
సిరులఁ దులకింపఁ, దద్గతశ్రీవిశేష
మతుల సామ్రాజ్యవైభవోన్నతుల దొరసె॥ 169

తే॥ † సింహపీఠికి నెడటఁ బసిండిత్రాసు
నిలువుటీఁటెపై నిలిచి యొప్పులు ఘటించె
మొనసి శివరాజు లవమైన ముల్లుమ్రొగ్గ
కుండ ధర్మంబుఁ దూఁచునం చొలసె ననఁగ॥ 170

ఉ॥ పూజితభావు లష్టసచివుల్ మధురాకృతు లష్టకోణ రా
రాజితులౌచు సంయతకరంబుల నుండఁగ, సింహపీఠి వ్యా
ఘ్రాజిన - మందుపై మెఱుఁగులాడు జరీ తెలిపట్టువల్వ శో
భాజటిలంబులై నయనపర్వముగా శివరాజు డగ్గఱెన్॥ 171

చ॥ పదపడి గాంగభట్టుల సభాజనులన్ గని పల్కె, "భోన్సలే
విదిత మహాన్వయాభరణ వీరుఁడు, హైందవధర్మ రక్షణా
భ్యుదిత పురారి యీశివవిభుండు ప్రజా హృదయాబ్జబంధువై
యెదుఁగుచు, సింహపీఠిఁ గొలువీయఁగ మీహృదయంబుఁ గోరెడిన్"॥

చ॥ అనుటయు సభ్యులెల్లఁ దమయాసనముల్ డిగి కేలుదోయి నౌ
య్యనఁ బయికెత్తుచున్ జయజయధ్వని సమ్మతిఁ బల్కె, రంత ము
న్కొని శివరాజు పీఠమునకున్ దతభక్తిఁ బ్రదక్షిణించి వం
దనమిడి, కాలుసోఁకని విధంబునఁ బైకొని సింహపీఠమున్॥ 173

---

† On the left hand (stood) a pair of gold scales on a very costly lance-head, evenly balanced (the emblem of justice.)

Page 277. *J. N. Sarkar.*

సీ॥ అంతట గాంగభట్టాచార్యుఁ డుప్పొంగి
శివరాజమౌళి నాశీర్వదించి,
యల మహారాష్ట్ర రాజార్హ ముజ్జ్వలమణీ
లలితకిరీట మౌఁదల ఘటించి,
సుకుమార ఫాలపట్టిక శుభాచార సం
గత శోణతిలక మంకితముఁ జేసి,
కుడికేల నిజరాజ్య గోపాయనార్హ చి
హ్నము హైమ ధర్మదండము నమర్చి
తే॥ నడుమున భవాని ఖడ్గమ్ము నిడి, యుదీర్ణ
చాపశరముల సవ్యహస్తమున నిలిపి,
పాండుర చ్ఛత్ర చామరోజ్జ్వలత నెఱపి,
శివపతిని రాజచిహ్నా లాంఛితునిఁ జేసె॥ 174

మ॥ నిగమాశీర్వచనాక్షత ప్రసవముల్ నీరాజనశ్రీలు పె
ల్లగు తూర్యధ్వనులుఁ జయధ్వనులు స్తోత్రారావముల్ మించె; రా
యగడంబందు ఫిరంగిమ్రోఁతలు ఘనంబై మ్రోసె, రాజాజ్ఞ సూ
టిగ నావేళకు నెల్లదుర్గములు చాటించెఁ శతఘ్నీధ్వనుల్॥ 175

సీ॥ "పావన భృశబలాన్వయ రాజమౌళికి
సాహస ధీరతోత్సాహ నిధికిఁ,
బరవీర సైన్యసాగర ఘటోద్భవునకుఁ
బరదుర్గ శిఖరి విధ్వంస పవికిఁ,
జతుర తంత్రవ్యూహ చాణక్యునకు, దురా
పతిత రాణ్మండలీ భార్గవునకు,
దక్షిణభారతోద్ధరణ దీక్షితునకు
స్వమత సంస్థాపనాచార్యునకును,

తే॥ త్యాగ భోగ విరాగ సద్యోగరతికి
క్షత్రికులమణి శ్రీ శివచ్ఛత్రపతికి
జయము - జయ" మని పల్కి యుత్సవము మెఱయ
శివపతికి గాంగభట్టు వచించె నిట్లు॥ 176

మ॥ "శివరాజా! పరమేశ్వరీదయ ఫలించెన్, నేఁటి పట్టాభిషే
క విధానంబు సమస్తమున్ జరిగె; లోకఖ్యాత సూర్యాన్వయో
ద్భవ రాజన్యుఁడ వేమినీకుఁ దెలుపన్! ధర్మప్రతిష్ఠాపకుం
డవుగా నేల్కొను మెల్లరాజ్యము పురాణక్షత్రి సచ్చాత్రిలన్॥ 177

చ॥ కలికృత ధర్మవిప్లవము కారణమై, మత జాతి నీతి సం
కులత యవార్యమై, జనులకున్ హితమార్గ మగమ్యమాయె, దో
ర్బల ధన మత్తులౌ ప్రభులపాలఁ గలంగు టవశ్యమైన నేఁ
డలఘుఁడ వీవు రాజవగు టాగమ ధర్మ తపః ఫలంబగున్॥ 178

ఉ॥ వేదములున్ దదీయపదవీ పరినిష్ఠిత యజ్ఞధర్మ క
ర్మాదరణంబులున్ బలుచనై బలహీనములైన నేఁడు దు
ర్వాదములోర్చి సమ్య గుపవాసములన్ భరియించి భక్తిమై
వైదికధర్మదీక్ష నిలుపంగల నీమది యెంతదొడ్డదో!॥ 179

సీ॥ పదునైదుదినములపరిమితి నిండాఁకఁ
గఠిన దీక్షావిధిక్రమము నడిపి,
యతిథులై వచ్చిన యన్ని జాతులవారి
కల్లుండ్రికటులు మర్యాదలిచ్చి,
పూఁట కేఁబదివేలభూసురోత్తములకు
షడ్రసోపేతభోజనము లొసఁగి,
భూ ధేను నవరత్న భూషాంబరాది దా
నములు వేర్వే ఱఖండముగ నొసఁగి,

తే॥ అయిదు - పది - పదునైదు యోగ్యతనుబట్టి
భూరిదక్షిణ తక్కు-విప్రుల కొసంగి,
నేఁటి పట్టాభిషేకంబు నిర్వహించు
నీ యసమధర్మదీక్ష వర్ణింపఁ దరమె!॥ 180

ఉ॥ కూడిన యాత్మశక్తి యొనగూడిన సైన్యబలానుషక్తి తోఁ
ప్పాడిన దైవభక్తి తొనఁకాడిన ధర్మపథానురక్తి యుఙ
దోడుగ నీడగా నరులఁదోలి జయోదయకేళిఁ దేలి, కా
పాడము భోఁసలాన్వయనృపాల! చిరమ్ముగ హైందవోర్వరఙ"॥

చ॥ అని వచియించులోపల మహామహుఁడొక్కఁడు లేచివచ్చి దీ
వనలిడి "రామదాసమునివర్యులు మీకు హితోపదేశముఙ
బనిచి" రటన్నతోడన శివప్రభుఁ డుత్థితుఁడౌచుఁ బీఠ మొ
య్యన డిగి కేలుమోడ్చి; నతఁ డాదరణంబున నిట్లు వాకొనఙ॥182

చ॥ "భువనజనైకమంగళము పొంగిన యిప్పటి రాయదుర్గవై
భవ మెద గోచరింపుచు నపారముదంబుధి నోలలార్చె, నో
శివపతి యిన్నినాళ్ల కభిషిక్తునిఁజేసె భవాని నిన్నుఁ - గ
గ్గవ కలశంబుగాఁ బ్రణయగాథముదశ్రులవెల్లిఁ దేల్చుచుఙ॥ 183

మ॥ చరితార్థంబులు వేదశాస్త్రవిధు, లాస్మాకీన దీక్షా తప
శ్చరణంబుల్ ఫలితార్థమయ్యె; నెడఁదఙ సైరింపఁగారాని దు
ర్భర దావాగ్నిశిఖా చటచ్ఛటల నారాటించు హిందూధరఙ
గురిసెఙ నీ యభిషేకవృష్టి నిగమోక్తుల్ శాంతి ఘోషింపఁగఙ॥

చ॥ తలఁచిన ధర్మదీక్ష బహుధాపరిధూమిత దారుణవ్యథా
కులతకు నోర్చి ప్రాణములకుఙ వెనుదీయని తెంపు సూపుచుఙ
గెలిచితి; విందుపైనఁ బరికింపు — ముపార్జితలక్ష్మి ముప్పుచే
తులఁ బడనట్లు, నీప్రజలుతోడుగ నీవు సుఖించునట్లుగఙ॥ 185

చ॥ 'ప్రజయుఁ బ్రభుత్వ మొండొకనిపాలిపునఁ జేవఁజిగిర్చి, రెండునుఁ
విజయము నందుచుండు' నని పెద్దలు రా జొకయాత్మ గాఁ - బ్రజా
వ్రజ మొకమేనుగాఁ దెలియఁబల్కిరి; నిక్కమ చూడు మిందు భూ
భుజుఁ డిరువైపు ధర్మపథముఁ నడుపందగువాఁడు దా నగుఁ॥ 186

సీ॥ రాజు తానొక్కఁడు ప్రజయందు, నటులె జీ
వాత్మ దానొకఁడు దేహంబునందు,
దేహమునం దాత్మతేజోంశ - మటు ప్రజా
వళిఁ బ్రభుతేజోంశ మలమియుండు,
నధిక తేజోంశకులైవారు తమకుఁ ద
క్కువవాని నడుపుచు గొప్పవైరి,
తమ గొప్పతనముచేతన తక్కువగు వారి
బాగోగులకు వారు బాధ్యులైరి;
తే॥ కాన రాజును - జీవాత్మ 'తా నొకండు
వానిలో' ననియెంచక, వానిమేలు
తనదిగా నెంచ కధికారదర్ప మెనయఁ
గలుగుఁ గలవర, మిది యెఱుంగవలె రాజు॥ 187

చ॥ ఇది పరమార్థ, మీవు తఱియెంచి ప్రజాగతమౌ ప్రభుత్వముఁ
బాదుపున మేలుకొల్పి, హితబుద్ధిమెయిఁ సహకారమిచ్చి యు
చ్చదశకుఁ జొన్పు, మప్పుడు ప్రసన్నకళాఢ్యుఁడవైన రాజ వ
య్యెదవు; జగంబుగూడ భజియించు నినుఁ బరిపుష్ట హృష్టమై॥ 188

మ॥ ఒకరాజ్యాంగము దేహమందుఁ గల, దుద్యోగంబునఁ దాని శే
లికయావాఁ డనుభూతివెంటఁ బ్రజఁ బాలింపంగ నూల్కొన్నచో
సకలంబుఁ సుగమంబు; నీనడక నీసర్వంబు భాసిల్లె; నూ
రక నాడెందము నీకు విప్పితిఁ గుమారా! నేఁటి యీవెన్నెలఁ॥ 189

చ॥ అనుకొనినంతకంటెను సమర్థుఁడ, వొక్కటిసెప్ప నూఱుగా
వినఁగల, వేదిసెప్పిన నవీన మవశ్యముగూడఁగాదు; కొ
ల్వున దొరవైననేఁడు నొడిలోఁబసిబిడ్డగ నిన్నుఁబోఁచు నీ
జనని యొసంగుదీవనకుఁ జాలునె మా సకలోపదేశముల్!॥ 190

ఉ॥ పండినమేనితోఁ గమియఁబండిన పుణ్యఫలంబుతోడఁ బు
త్రుండు ధరాభిషేక మహితుండగు భాగ్యముఁజూచి తన్నుచన్
బండిన జీజియాతపము పండఁగఁ జల్లఁగ రాజ్య మేలు, మా
ఖండలలక్ష్మితో భరతఖండ మహాభ్యుదయంబు తూఁచుచున్"॥ 191

మ॥ అనుమాటల్ శిరసావహించి శివరా జావిప్రు నర్చించి, చే
రిన యధ్వర్యుల గాంగభట్టు నమితశ్రీ తృప్తులన్ జేసి, కొ
ల్వున వేంచేసిన పెద్దలన్ గురువులన్ బుణ్యాంగనాశ్రేణి నొ
య్యనఁ బూజింపుచు మాతృవందనముసేయన్ డెందముప్పొంగఁగన్॥

మ॥ ఒక ప్రత్యేకసమున్నతాసనమునం దొప్పారు నానందభూ
మిక, తేజోమయ దివ్యచక్షువుల నున్మేషించి సంతోషచం
ద్రికలన్ ద న్నభిషిక్తుఁజేయు జనయిత్రిన్ గాంచి రోమాంచకం
చుకితాంగంబుల డగ్గఱించి పదరోచుల్ మౌళి లాలించినన్॥ 193

శా॥ ఫాలోద్వేల్లిత పట్టబంధ తిలకోపర్యంచితోష్ణీష భూ
షాలంకార నవప్రభాపటలితో నాలంబి ఖడ్గంబుతోఁ
గేలన్ దండముతో నుదూఢ నృపలక్ష్మీ భాగ్యచిహ్నాళితో
మ్రోలన్ జేరు కుమారు నెత్తి మదితన్పన్ జీజియా యిట్లనెన్॥194

మ॥ "తనయా! పెద్దల పుణ్యబీజ మిటు మందారాంకురచ్ఛాయలన్
బెనుపై, కొమ్మల రెమ్మలన్ బలిసి, యుర్విన్ బూచియున్ గాచియున్
దనసీడన్ నెలవిచ్చి పుష్పఫల సంతానంబు లందించి భూ
జనులన్ దన్పుట గంటె - బెక్కులుపరీక్షల్ దాఁటియీనాటికిన్॥

చ॥ కడచిన వాదినమ్ములు: మొగల్బలసంగంబులు రేగి, నాఁడు పె
ల్లడరి చెలంగ గొనఁ దఱుమునప్డు డెటంగ దలంచఁపలేని నా
రొయిడిఁ గనుమూయుచుఁ దెఱచుచున్న సుతుం డిపు డిట్లుతీరి క
న్పడు శుభమయ్యె, నింతయు భవానికటాక్షముపంటయేసుమీ!॥ 196

మ॥ తనకుం నచ్చినశిష్యుగాఁ గొనుచు విద్యాబుద్ధులన్నేర్పి పెం
చిన దాదోజి నిజోద్యమంబు వితతశ్రీ నిట్లు పుష్పించుటల్
గనుచో నెంతలు సంతసించునొ! నినుం గన్నయ్య తానున్న నెం
తని హర్షించునొ! యంతయుం నిలిచెఁ బుత్రీ! నేఁటి కీనాపయిం!॥

మ॥ తమసర్వస్వము ధారవోసి స్వమతోద్ధారంబు హిందూ స్వరా
జ్యము సాధించిన తానజీముఖులు వీరాగ్రేసరుల్ నిర్జరో
త్తములై వారుగొ చల్లుచుండిరి భవత్పట్టాభిషేకోత్సవ
ప్రమదాశీః కుసుమాంజలుల్ స్వకృతసేవా ధన్యవాదంబులన్. 198

ఉ॥ తీరిన దబ్ధిమంథనము, తీయుబులొచుఁ దలంపులెల్లఁ జే
కూరిన; వెంతయుం దనిసి కోలున హైందవరాజ్యలక్ష్మి సు
స్మేరముఖాంబుజంబు వికసించిన; దంచిత భోంసలాన్వయ
శ్రీ రవివంశకీర్తిని భరించిన దాగమధర్మజుష్టమై॥ 199

ఉ॥ మేలగు హైందవోర్వర నమేయతపంబులఁ బుట్టువొందు ని
ల్లాలు గడించుభాగ్యముల నన్నిట నేఁ దనుపొందఁగంటి; నీ
మేలున నీమఁ దల్లినగుమేలున ధన్యతగొంటి; నాతపం
బేలె భవాని; నీవు నిఁక నేలుము నీప్రజవోలె నీప్రజం॥ 200

చ॥ హృదయములిచ్చి ప్రాణములనిచ్చి యవశ్యములైన సర్వసం
పద లెదిగించి నిన్నుఁ బరిపాలకుఁగా (గయికొన్నవారి క
భ్యుదయము లీగికంటె పర మొంబొకఁ డున్నదె! రామదాసుఁ డి
య్యదియ వచించెఁగాదె! యీనయా! గయికొన్న గుణాంబతేశముం॥

ఉ॥ పండగు నన్నుఁబోలెం దొడఁబ్రాఁకిన సీపసిబిడ్డఁబోలె భ
వ్యుండగు రామదాసమునిఁబోలెం బ్రజావళి నాదరింపు; మె
ట్లుండినఁగూడ ధర్మపథమూఁది చరించి దిశావకాశముల్
నిండినకీర్తి రంజిలుము, నీ కగుఁగాక చిరాయురున్నతుల్!॥ 202

చ॥ అను జననీశుభాశిషము నంది శివప్రభుఁ డామెయాజ్ఞ గై
కొని నిజసింహపీఠమునకున్ జనుదెంచి సముంచితాదరం
బునఁ గొలువెల్లఁగాంచి పరిపూర్ణ దయా వినయానురాగముల్
దనుకు మృదూక్తితో నభయదక్షిణహస్తముతోడ నిట్లనెన్॥ 203

మ॥ "అనురాగోపచితాత్ములౌ సచివులారా! మిత్రులారా! మహా
జనులారా! జగదీశ్వరీకరుణ మించన్ నేఁటి కీపాటి శో
భనముల్ గంటిమి; దక్షిణోర్వి స్వమతోపక్రాంత హిందూస్వరా
జ్య నిధానంబును నిల్పికొంటిమి పరీక్షాదక్ష దీక్షావిధిన్॥ 204

చ॥ కడచిన వెన్నియేనిఁ గడగండ్లు, దురంతములైన పోరులన్
దొడరుచుఁ బ్రాణమృంతములుతుంచి సమర్థులు యోధు లెందఱో
మడిసిరి; వారిత్యాగ మభిమానము నెంచి స్మరించుకంటెఁ దీ
ర్చెదు ప్రతికారమున్నదె! స్మరింపనిచో ఋణ మీఁగ నేర్తుమే!॥ 205

చ॥ అకలుష దేశభక్తిభరితాత్మకులై ప్రజలెల్ల వారివా
రికిఁ దగురీతి మే లనుసరింపుచుఁ, గీడుభరించి, తాల్మిఁబో
లికఁ బెనఁగొంచు నెందునుజలింపని పూనికఁ బోర నిట్టిపా
పకము ఫలించెఁగాక ననువంటివొకానొకఁ డేమిచేసెడున్!॥ 206

ఉ॥ చేసినదానిలోఁ గలవిశేష మెఱింగి, నితాంతభక్తివి
శ్వాసములన్ గణింగి ననుఁ బాలకుఁగా వరియించు మీకు సం
తోసముతోఁ గృతజ్ఞుఁడ; నెదుర్కొను నాపదలోర్చి మీరున్
బాసటగాఁగ నెల్లరశుభంబులకై తలయొడ్డి నిల్చెదన్॥ 207

ఉ॥ తల్లిహితంబు పెద్దలమతంబు సమర్థగురూపదేశ ము
త్ఫుల్ల సరోజదామకముతో సరిగా శిరసావహింతు; ధ
ర్మోల్లసితంబుగాఁ బ్రజలయున్నతిఁగూర్పఁ గడంగి, వారు రం
జిల్లఁ జరింతు; నింతయు రచింప భవాని యనుగ్రహించుతన్!”॥ 208

చ॥ అనుటయుఁ గొల్వులో జయజయధ్వని బారలుసాఁచి “జీజియా
జననికి రామదాసముని చంద్రునకున్ శివరాజమౌళికిన్
ఘనవిజయంబు భద్రమగుఁగా కగుఁగా” కనుబల్కు లెల్లడన్
మునుకొని మ్రోసెఁ దూర్యరవముల్ వెనుదాఁకుచుమిన్నుముట్టఁగన్॥

ఉ॥ అంత నితాంతభక్తివినయంబులు మీఱఁగఁ బాదపీఠికా
ప్రాంతముఁ జేరవచ్చి, నవరత్న దుకూల సువర్ణముద్రికా
సంతతి మేటికాన్కలిడి, సమ్మతి జాగిరుదారు లెల్లసా
మంతులు వేఱువేఱుగ నమస్కృతులిచ్చి భజించి రంచలన్॥ 210

మ॥ ఒకసర్దారునిబిడ్డఁ డున్నతబలోద్యోగంబునన్ మించి నేఁ
టికి సామంతులుగొల్వ ధీరపరిపాటిన్ బ్రాజ్య రాజ్యాంగనా
యకుఁడౌ పోఁడిమి నెంచి యర్హమగుమర్యాదల్ విడంబించి కా
నుకలన్ బంపిరి గోలకొండసులతానుం డాది భూమీశ్వరుల్॥ 211

శా॥ ఆ యానందముఁ జూడవచ్చి ‘హెనరీ ఆక్సెండ’ న్ పేరి యాం
గ్లేయ ప్రాచ్యవణిక్సమాజపతి రక్తిన్ గాన్కలున్ వజ్రరే
ఖాయుక్తంబగు నంగుళీయక మొసంగన్, బోర్చుగీస్ముఖ్య దే
శీయుల్ బేతులు గాన్కలంపి రతులశ్రీమీఱ దీనారముల్॥ 212

ఉ॥ అందినకాన్కలెల్ల నయనాంచలదృష్టుల నాదరించి తా
నందఱ నన్నిరీతుల యథార్హబహూకృతి సత్కరించి కొ
ల్వొందె శివప్రభుండు; సచివాదిక రాజనియోగివర్గమె
ల్లం దమ యర్హలాంఛనములన్ గొలిచెన్ బ్రభుభక్తి సొంపుచున్॥

సీ॥ ఆనతులొ పరిధానామాత్యుఁడాదిగా
నుద్యోగిజనుల బహూకరించి,
యెవరి యుద్యోగగౌరవములు వారువా
రంది సేవింపఁగా ననుమతించి,
యానాఁటి యన్యభాషానామముల మార్చి
సంస్కృతవ్యవహారసరణి గూర్చి,
వార్షికవేతనపరిమితి హెచ్చించి
బిరుదముల్ బహుమతుల్ పెక్కులిచ్చి,
తే॥ హార కంకణ వస్త్ర వాహనములాది
సత్కృతుల నెల్లవారి కుత్సవముగొలిపి,
శ్రీ శివచ్ఛత్రపతి యభిషేకశుభ మ
హోత్సవము దీర్చె వితత సంపత్సమృద్ధి॥ 214

మ॥ మధురోదార గళస్వనాభినయ సంపన్మాన్యతన్ వంది మా
గధ వైతాళికు లంత నీగతి శివక్ష్మానాథుఁ గీర్తించి, "రో
బుధమందార! పరాకు! భోఁసలకులాంభోరాశిచంద్రా! యతం
ద్రి ధరాభారధురీణ దక్షిణభుజస్తంభా! యదంభోదయా!॥ 215

సీ॥ సూరతునుండి జెడ్నూరుపురముదాఁక
నుత్తర దక్షిణాభ్యున్నతంబు,
నల బిజాపురినుండి యపరాంబునిధిదాఁకఁ
బూర్వ పశ్చిమ దిశాభోగ యుతము
విపులదేశము గెల్చి, వితత రాజ్యాంగ సే
నాంగ దుర్గాధిపత్యములఁ దనరి,
ప్రబల యావనవిభుత్వ త్రయంబును దాఁకి
వెన్నంటితఱిమి తద్విజయమంది,

తే॥ దక్షిణావనియందు హైందవమతాను
బంధ రాజ్యమ్ము నిలుపు వైభవమహేంద్ర!
రమ్యగుణసాంద్ర! శ్రీ శివరాజచంద్ర!.
జయము! జయము! తావక సితచ్ఛత్రమునకు॥ 216

మ॥ జగమెల్లన్ ముద మావహించెఁ; బరితశ్చంద్రాతపశ్రీలు ప
ర్వఁగ మీకీర్తి రహించెఁ; గౌతుకమునన్ బట్టాభిషేకోత్సవం
బుఁ గనన్ మీకులకర్త సూర్యుఁడు కరంబుల్ సాఁచిమిన్నాఁకె; ఢం
బుగ వీతెంచె భవానిపూజయగుచోఁ బూరించు శంఖధ్వనుల్॥ 217

మ॥ లలితాభ్యర్హిత పట్టబంధ మహితాలంకార దివ్యప్రభా
కలితుండౌ శివరాజుఁ జూత మను వేడ్కన్ బౌరపుణ్యాంగనా
వళి దూర్వాప్రసవాక్షతాంజలులెలర్పన్ మేడలన్ నిల్చెఁ - దొం
గలి నుజ్జూపులు గల్వతోరణపు సింగారంబుఁ గైసేయఁగన్”॥ 218

మ॥ అను వైతాళికపాఠముల్ విని శివక్ష్మాధీశుఁ డుత్ఫుల్లగో
చనపద్ముండయి, “శ్రీభవాని కిది పూజావేళ, మే మిప్పు డా
జననీ పాదపరాగముల్ గొను టవశ్యం” బంచుఁ దోడ్తో నిజా
సనమున్ డిగ్గిన, నెల్లకొల్వునిలిచెన్ సమ్మర్ద సంరబ్ధమై॥ 219

తే॥ పింగళేమంత్రి యుత్సవరంగమెల్ల
ముందె నియమించి శివరాజుముదలఁ గొనుచుఁ
గొలువునుండి భవానిదేవళముదాఁక
నడిపె మెఱవడి తూర్యస్వనములు సెలఁగ॥ 220

మ॥ గజరాజంబులు రెండలంకృతములై కాషాయవస్త్రాంచిత
ధ్వజమున్ బట్టుజరీజగాసిడము నుత్తాలంబుకానెత్తి య
క్ష-జమున్ గొల్చుచు మందయానముల నగ్రస్థానముం జేగ, నె
ల్లజనుల్ వెంబడిసాగి రుల్లములు సల్లాసంబు లుప్పొంగఁగన్॥ 221

సీ॥ గజయూథములు తురంగములు తేరులు కాలు
బంట్లు క్రిమమ్మొగా శౌరుదీరఁ,
గొలువుటీఁటెలు తుపాకులు ఖడ్గములు పూని
వీరభటుల్ వారివెంట నడువ,
వివిధతూర్యంబులు వింతలు చతురఁగా
స్యంబు లావెంబడి సందడింప,
జానపదుల్ పౌరజనము లుద్యోగు లా
ప్తులు బంధు లావెన్క దళముకొనఁగఁ,
తే॥ గ్రమ్మకొని మాత్రు లంగరక్షకులు గొలువ
నడుమ రాణివాసంపుటందలము నడువ,
భద్రదంతావళము నెక్కి భవ్యమూర్తి
శ్రీశివచ్ఛత్రపతి ప్రభుశ్రీలఁ దరలె॥ 222

మ॥ కలితాలంకరణ ప్రభాసుభగమా ఘంటాపథశ్రేణి గం
తులు అంతుల్గొను తుంగభంగములతోఁ దూఁగాడు సంభ్రంబునన్
జలితంబై నగరోత్సవంబు నడిచెన్ సమ్మర్దసన్నాహ తుం
దిలమై, యాటలుఁబాటలొప్పఁగ శతక్ష్మీ తూర్యముల్ మ్రోయఁగన్॥

చ॥ ఉన్నతసౌధవీథి నయనోత్పల నీలకటాక్షమాలికో
ద్భిన్న ముఖేందుచంద్రికలు పెల్లగుచున్ యమునాయుతాభ్రగం
గోన్నతిఁ బర్వఁ, బుణ్యసతు లూర్జితుఁడౌ శివరాజుపై జయా
భ్యున్నతిఁ బల్కి సేసలిడి రుద్దవిడిన్ గుసుమాక్షతాంజలుల్॥ 224

ఉ॥ అంగనలెల్లరున్ బ్రతిగృహాంగణమం దెదురేగి పొంగుచున్
బంగరుపళ్ళెరంబుల నివాళికలెత్తి జయంబువల్క, మా
తంగముపై శివప్రభుఁడు తత్పరతన్ దలవంచి వానినె
ల్లం గయికొంచు నవ్వుకనులన్ జని చేరె భవానికోవెలన్॥ 225

ఉ॥ ఏనుఁగు డిగ్గి భక్తిరథమెక్కి యదంభ వినీత వేషుఁడై
మానముతోఁ నుమాపద సమర్పితచిత్తముతోఁ, దదంతిక
స్థానముఁ జేరి, యర్చనలెసంగ భజించి శివప్రభుండు ని
ధ్యానపరాత్ముఁడై గిరిసుతామహిమంబు నుతించె నీగతిన్॥ 226

చ॥ "చిఱునగవూరు మోవి, వికసించిన చెక్కులు, సోఁగకన్నులన్
గురియు దయామృతం, బలిక కుంకుమ రేఖయుఁ, జంద్రమఃకళా
పరిగతమౌళియున్ నయనపర్వముగా మది గోచరించి నా
యరగలిఁ బాపు నీ యభయహస్తమునీడ భజింతు శాంకరీ!॥ 227

ఉ॥ యోగము యోగ మెంతయుఁ బ్రయాసదురాసద మంచు, నైహిక
త్యాగ విరాగముల్ జనులకందఱ కందనివంచు, ధార్మికో
ద్యోగము పెంపునన్ మనసుఁద్రుంచి యచంచలభక్తి సేఁత నా
భాగముగా భజింతు, ఫలపాకము నీకరభిక్ష పార్వతీ!॥ 228

చ॥ ఒకతృణమున్ గ్రహించి సకలోన్నతశక్తి ఘటించి పర్వత
ప్రకరముఁ జీల్తు: వాదరమె పట్టినచో మరుభూమి నందనా
ధికముగ మార్తు: వార్తనిగతిన్ దురపిల్లఁగనేల వాణి! తా
వక పదపద్మముల్ శరణువట్టినఁ జాలదొకో మహేశ్వరీ!॥ 229

ఉ॥ 'ఏ నవఁ' డంచు డీలుపడనేని భరించుటగాని, 'యెల్లచో
నే' నమకొంచు ముందుపడనేని సహించుటగాని యెందునున్
గానము, లోక మిట్టి! దవికంపితుఁడై నిజధర్మదక్షుఁడై
పూనిక నిర్వహింపఁ బయిపోకడ నీవ భరింతు శాంకరీ!॥ 230

ఉ॥ దక్షిణభూమి కాననతతంబుగ నుండిననాఁడు, దానిలో
దక్షులు రాజులున్ బ్రజ లుదగ్రసుఖస్థితి నుండునాఁడు, న
వ్య క్షుపిత స్వధర్మవిభవాతిశయమ్మై వృజ లుండునాఁడు - నేఁ
డక్షతశక్తి నన్నిట నియంత్రిని నీవని వేఁడెద శాంకరీ!॥ 231

చ॥ యవన మహావిభుత్వము లనర్గళవృత్తుల నాల్గువైపులన్
గవియఁగ దక్షిణోర్వి మొనకట్టుచు హైందవరాజ్య మొక్కఁడ
న్య విభవ ధిక్కృతిన్ వెలయునంచుఁ దలంప వచింప నున్నదే!
శివపతిపేర నాటకవిశేషము నాడితి వీవ శాంకరీ!॥ 232

ఉ॥ 'అక్రమ' మంచు, 'సక్రమ' మటంచును, 'విక్రమ' మంచు, 'వీర హే
యక్రమ' మంచు నా నడకలన్నిట లోకము తోఁచినట్లుగా
వక్రవినోదముల్ వలుకవచ్చు, నిజంబున కే నెవండఁ! గా
ర్యక్రమమెల్ల నీనడిపినట్లు ఘటించితిఁగాక శాంకరీ!॥ 233

ఉ॥ ఒక్కొకనాఁటిసంఘటన మొక్కతెఱంగున ముట్టి కుత్తుకల్
ద్రొక్కొననైనవేళ, నెదిరింప భరింపఁ దరింప వైరులన్
జక్కులముంప మానవునిచే నగునే! భరతోర్విపైన నీ
మక్కువ లట్టి; వే నొకసమర్థుఁడ నీవలనన్ మహేశ్వరీ!॥ 234

చ॥ మనసు కలంకదేఱ నవమానముదీఱ జయంబుమీఱ నే
ననుకొనినట్లు హైందవధరాభ్యుదయంబు ఫలించె; నీమశా
సన మిటు నిర్వహించి ఫలసంపద నీకడ నప్పగించి నేఁ
దనిసితి; నిందుపై సముచితంబులు నీవ విధింపు మీశ్వరీ!॥ 235

చ॥ శివపతికోస మింతపని సేయఁగలే, దిటు శాశ్వతంబుగా
శివపతియుండి రాజ్యపరిశీలనసేయు టసంభవంబ; యీ
భువనములోను తావకవిభుత్వము శాశ్వత, మందులోని హైం
దవ భవితవ్యసంపద సుధామధురంబని యెంతు శాంకరీ!॥ 236

ఉ॥ నాకొఱ కేవరంబునయినన్ మదిఁగోర, భవత్పదాబ్జ సే
వాకృతి చాలుఁ; జాలినశుభంబులు హైందవభూమి కిమ్ము! నే
సాఁకిన జాతి నీతి నుత సత్పథం బెప్పుడైన వమ్ముగా
నీక వెలుంగఁజేయు; మిదియే మదభీష్టఫలంబు శాంకరీ!॥ 237

సీ॥ మత జాతి నీతి దైవతభక్తి మహితమై
హైందవజగము పెంపారుఁగాక!
కులసతీజన వృద్ధ గో సాధు విప్ర సం
తతి పూజ్యపదమాముఁ దనరుఁగాక!
యామయ క్షామ చోరాది బాధలు లేక
ప్రజ మహానందంబుఁ బడయుఁగాక!
పశు శిశూత్కరములోఁ బాఁడిపంటలతోడ
నిల్లిల్లు సిరులతో నెసఁగుఁగాక!
తే॥ దేశభక్తులకీర్తి వర్ధిల్లుగాక!
దేశ చరితలు రక్తి సంధింపఁగాక!
కవుల కెందును విజయంబు గలుగుఁగాక!
నీదయ భవాని! యమృతమై నెగడుఁగాక!"॥ 239

చ॥ అనుటయు నేకవాక్యత "తథాస్తు! తథా!" స్తని మ్రోఁత కోవెలన్
ఘనముగ మ్రోసె; నర్చకుఁడు కర్పపుటారతు లిచ్చి పూలు పా
వన శుభనారికేళము భవానిప్రసాద మొసంగ దోయిటన్
గొనె శివరాజు; పొంగి తొలఁకుల్ గొనె నెల్లెడ హర్షతోయధుల్!॥

చ॥ అంచితభక్తి నిట్లు జగదంబ భజించి శివప్రభుండు హ
ర్షాంచితుఁడై మహైంద్రవిభవాతిశయంబున రాచమేడ సొ
చ్చెంచి, ప్రమంచితోచిత విధేయములెల్ల విధించి, నేలఁ బా
లించె సమగ్రనిర్వృతి ఫలింప జగంబులు సంతసింపఁగన్॥ 240

మంగళం.

# APPENDIX.

## ANCESTRY OF SHIVAJI.

Shivaji Maharaj, the illustrious founder of the Mahratha Power, derived his descent from the renowned Bhonsle family. This noble Mahratha house claimed an ancient Kshatriya origin. It is said that the family was transferred to the uplands of Maharashtra by a Rajput warrior, Devraj Maharana by name. .... .... .... In what is now known as the modern province of Oudh, there ruled for centuries the ancient princes of the royal Sesodia family. They claimed descent from the mythical Solar Race. One of these Sesodia princes crossed the Narbada and became the founder of an independent principality on its southern banks. .... .... ..... The ruling Bhonsle prince of the time was defeated and his kingdom annexed (by the famous Salivahan.) At this crisis the afflicted queen of the prince escaped with her young son of five or six years across the Narbada and sought shelter in the hospitable regions of Mewar. There she found an asylum in a poor Brahman family, her son keeping the Brahman's kine. Once, while out engaged on his cow-herd duties the boy discovered a hidden treasure. This he disclosed to his patron and acquainted him with the story of his origin and fall. The Brahman listened with sympathy and encouraged and

exhorted him to endeavour to recover his royal power, giving him to that end every assistance within his means. .... .... .... .... When the conquest of the country was completed, they erected a fort upon those mountain heights under the shadow of a temple of the Goddess Bhavani and named it Chitrakote, .... .... .... This fort .... .... .... afterwards became famous in history as the fort of Chitore. .... .... .... .... About 1275 A. D., Maharana Lakshman Singh succeeded to the throne of Chitore. (The establishment of the Mahomedan power at Delhi led to the extirpation of the royal family.) .... .... .... The King had twelve sons. The second prince Ajay Singh was the special favourite of his royal father. The Raja explained to him, how undesirable it was that his royal race should be totally extinguished and commanded him to betake himself to an inaccessible part of the Aravalli Mountains. ............ Chitore fell into the Mahomedan hands.

When Ajay Singh made his escape, he took with him Humbir Singh, the minor son of his eldest brother........ and again formed a fairly large principality. He crowned him (Humbir Singh) king of his forefathers' realm and himself took charge of the administration .... .... .... and at last with Udaipur as their capital, they established their independence.

On the demise of Ajay Singh, his son Sajan Singh thought it unwise to quarrel with his cousin for a partition of territory. .... .... .... With this design this brave prince advanced southwards. The territory of Sondhwad was conquered by him, and there he made his capital, Among

his descendants were the names of Dilip Singhji Maharana, Singhji Maharana, Bhosaji Maharana and Devarajji Maharana in succession. But at length Devarajji, quite exhausted with the frequency of the Mahomedan invasions, gave up his kingdom, and coming down to the south maintained a precarious independence as a polygar in the valleys of the Krishna and the Bhima. On coming to the Deccan he changed his name for fear of the Mahomedans and assumed that of Bhosawant Bhonsle.

In the line of direct descent from Devarajji we have Indrasen .... .... .... Sambhaji and Babaji, alias Shivaji. The last named Babaji was born in 1533. .... .... .... He had two sons Maloji and Vithoji. .... .... .... They began to look out for an employment. .... .... .... This they found by enlisting themselves in the service of Lukhji Jadhv of Sindhked. .... .... .... Maloji had a son in 1594 named Shahji by Dipabai, sister of Jagpalrao Nimbalkar, the Deshmukh of Phaltan. (Shivaji, the Liberator of the Mahratha Nation, was the second son of Shahji by Jijabai)

Chapter I. "The Life of Shivaji Maharaja."

*N. S. Takakhav, M. A.*

(శ్రీ)

## ——♦ తప్పొప్పుల పట్టిక. ♦——

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 9 | రాజపుత్రి | రాజపుత్ర |
| 8 | 16 | కాపురము | కాఁపురము |
| 10 | 22 | చిడిమిడి | చిడిముడి |
| 11 | 6 | పోవుచుండా | పోవుచునుండా |
| 12 | 19 | కు బంధువా | కులబంధువా |
| ,, | 22 | పరపూజ | పదపూజ |
| 13 | 9 | మునిగి | మునిఁగి |
| ,, | 18 | పాల | ఫాల |
| ,, | 24 | నవాబులు | యీనవాబులు |
| 17 | 21 | యనమాన | యవమాన |
| 18 | 14 | యంచులకు | యంచులకుఁ |
| 19 | 5 | నంపర్కంబు | సంపర్కంబు |
| ,, | 17 | నచ్చె | వచ్చె |
| ,, | 19 | మిముదాకి | మిముఁదాఁకి |
| 20 | 3 | బగవా | బగవో |
| 22 | 8 | దాటెఁడు | దాఁటెడు |
| 24 | 9 | పసుపు | పసుపుఁ |
| ,, | 19 | మూగిన | మూఁగిన |
| 26 | 3 | లేడు | లేదు |
| 37 | 7 | తలచి | తలఁచి |
| ,, | 10 | తూఁటూడిఁ | తూఁటాడి |
| ,, | 18 | నూఱట | నూఱటఁ |
| 38 | 23 | బుట్టినింట | బుట్టినింటి |
| 42 | 4 | నిమీల | నిమీలి |
| 46 | 5 | చేరుకు | చేకుఱు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 46 | 15 | సీఁకెలు | సీఁకెల |
| 47 | 14 | యాపులయి | యాప్తులయి |
| ,, | 21 | వచ్చినదయ్యె | నచ్చినదయ్యె |
| 49 | 10 | దలచి | దలఁచి |
| 52 | 19 | యేఁనుఁగుదూచు | యేనుఁగుఁదూఁచు |
| ,, | 23 | తూచుట | తూఁచుట |
| 53 | 15 | యుండఁగ | పిన్నడ |
| 57 | 11 | పార్వాపర | పూర్వాపర |
| 60 | 13 | మహారాష్ట్రులు | మహారాష్ట్రుల |
| 61 | 6 | నిప్పించిన | న్పించిన |
| 62 | 18 | లిచ్చియు | లిచ్చియుఁ, |
| 64 | 3 | జాఱదె | పాఱదె |
| 65 | 19 | పంజలు | పంజులు |
| 66 | 3 | మొడను | మొడమ |
| ,, | 10 | ఖల్జీ | ఖిల్జీ |
| ,, | 15 | సేఁతలకుఁ | చేఁతలకుఁ |
| 68 | 6 | ప్రాయవు | ప్రాయపు |
| 69 | 23 | వెంట | వెంటఁ |
| 70 | 13 | జెండెండు | జెండెకు |
| 71 | 7 | యతిఁవ | యతివఁ |
| ,, | 13 | వచింపగ | వచింపఁగ |
| 75 | 24 | ఖుభాశంసిమై | శుభాశంసిమై |
| 76 | 6 | తెప్పరి | తెప్పిరి |
| ,, | 22 | మపుడా | మిపుడా |
| 77 | 15 | జీజియాయిబా | జీజియాబాయి |
| ,, | 17 | ద్వారముజేరి | ద్వారముఁజేరి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 79 | 4 | శివవేరు | శివనేరు |
| ,, | 10 | బోవజాఁలు | బోవఁజాలు |
| 82 | 21 | బీజపూరుకుఁ | బీజపూరుకుఁ |
| 83 | 3 | సాంభాజియను | సాంభాజియును |
| 85 | 7 | నొప్వ | నొప్పి |
| 86 | 11 | ధీర | నీధీర |
| 87 | 5 | బుతు్రికు | బుత్రికు |
| ,, | 17 | శిండు | శివుండు |
| ,, | 24 | వా్రికుచ్చినఁ | వాకు్రిచ్చినఁ |
| 88 | 22 | యెఱుంగ | యెఱుంగఁ |
| 90 | 5 | ఉబికి | ఉబికిన |
| 91 | 8 | బడిఁయూవు | బడియూవు |
| ,, | 18 | ఉంటమి | ఉంటిమి |
| 93 | 24 | వచింపఁ | వచింప |
| 95 | 5 | సుగుణాళిఁ | సుగుణాళి |
| 96 | 5 | యదంతయు | యిదంతయు |
| ,, | 16 | వెదిగి | వెదిగిన |
| 104 | 8 | పండంగ | పండంగఁ |
| ,, | 10 | అనఁ | అన |
| 106 | 12 | మూనదు | మానదు |
| 113 | 5 | తొనుఁకాడు | తొనఁకాడు |
| 119 | 9 | ఆనుభవ | అనుభవ |
| 119 | 9 | నీవు | వీవు |
| ,, | 19 | గారము | గారవము |
| 120 | 3 | కొఁగిలి | కౌఁగిలి |
| 122 | 5 | జిజా | జీజా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 128 | 9 | ఆతఁమమిమ్మును | ఆతఁడునుమిమ్ము |
| 129 | 2 | వారి నారి | వారివారి |
| 134 | 7 | నాటిఁ | నాఁటి |
| 136 | 20 | తురుడై | తురుఁడై |
| 137 | 1 | మాకెంమకుఁ | మాకెందునుఁ |
| 145 | 5 | తోంఁచి | దోలఁచి |
| 150 | 1 | వార్షక | వార్షుక |
| ,, | 3 | కరవాలము | కరవాలముఁ |
| ,, | 19 | గొంకణ | కొంకణ |
| ,, | 24 | సూర్చు | సూర్చె |
| 153 | 13 | ఆ॥ | ఈ॥ |
| ,, | 14 | కంటఁ | కంటి. |
| ,, | 22 | నీచ్చు | నిచ్చు |
| 155 | 17 | ద్గహావ | దహాన |
| 161 | 5 | నితాన | వితాన |
| 165 | 10 | మధించు | మథించు |
| 168 | 3 | డాకఁడు | డోకఁడు |
| ,, | 10 | కన్నునఁ | కన్నులఁ |
| 169 | 1 | వాసిగ | వాసిన |
| 171 | 8 | ప్రతిష్ఠంచె | ప్రతిష్ఠించె |
| 176 | 10 | ఏగ | ఏగఁ |
| 180 | 9 | చెఱఁపట్టు | చెఱపట్టు |
| 181 | 1 | వెరిట | వెంట |
| 184 | 4 | పరుండగు | రుండగు |
| ,, | 9 | మముగొల్చి | మముఁగొల్చి |
| 185 | 8 | చెఱఁబట్టి | చెఱపట్టి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 186 | 23 | కన్గొనిఁ | కన్గొని |
| 187 | 8 | తిరగున్ | తీరగున్ |
| 188 | 23 | కేఁగెదు | కేఁగెద |
| 189 | 7 | భావమున్న | భావమొన్న |
| 191 | 14 | ప్రబుద్ధమా | ప్రబుద్ధవా |
| 194 | 15 | సయీాభాయి | సయీాబాయి |
| ” | 18 | తురుఁడై | తరుఁడై |
| 199 | 23 | శాంతితో | శాంతిలో |
| 200 | 11 | పడి | వడి |
| 201 | 3 | పోయుమా | పోయిమో |
| ” | 7 | యుక్తదుని | యుక్తమని |
| ” | 23 | చెఱఁబట్టె | చెఱపట్టె |
| 202 | 10 | డగున | దగున |
| 207 | 22 | లెల్గ | లెల్లఁ |
| 210 | 22 | జూపిఁ | జూపి |
| 211 | 14 | జాళీవ | జావళి |
| 212 | 9 | బయిటికి | బయటికి |
| 215 | 16 | ఇట్లనేఁ | ఇట్లన |
| 217 | 10 | అల్లె | అట్లు |
| 218 | 17 | పైనఁ | నైనఁ |
| 230 | 20 | నేర్పులన్ | నేర్పునన్ |
| 231 | 8 | కొల్వచ్చి | కొల్వచ్చె |
| ” | 13 | జింజిరా | జంజిరా |
| 235 | 18 | కొంత | కొండ |
| ” | 21 | బ్రతిమాలన్ | బతిమాలన్ |
| ” | 23 | అంతఃబా | అంతఃకో |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 246 | 20 | సేయ | జేయ |
| 247 | 13 | ఆ॥ | ఉ॥ |
| 253 | 13 | శిరస్త్రాణి | శిరస్త్రాణి |
| 254 | 3 | రొుప్పొంగు | యుప్పొంగు |
| 256 | 11 | మవి | మని |
| ” | 21 | అనఁ | అన |
| 258 | 14 | చెడిసోవు | చెడిపోవు |
| 262 | 3 | జీజయా | జీజియా |
| 264 | 17 | కొలానూరు | కొలాపూరు |
| 265 | 1 | మూాడుఁ | మూఁడు |
| ” | 18 | గాఁని | ఁగాని |
| ” | 24 | జణిఁగి | జుణిఁగి |
| 268 | 11 | మీాదఁ | మీఁద |
| 275 | 10 | బల్లెముల్ | బల్లెముఁ |
| ” | 13 | మెఱుపు | మెఱపు |
| 279 | 20 | దీవ్ర | దీప్ర |
| 280 | 24 | తనదారి | తనవారి |
| 281 | 22 | విరుగు | దిరుగు |
| 282 | 10 | బాఱఁ | బాఱ |
| 291 | 16 | తత్కుమారు | దత్కుమారు |
| 293 | 4 | దోపఁ | దోఁప |
| 293 | 7 | శత్రులేయు | శత్రువేయు |
| 296 | 7 | సముద్రముఁ | సముద్రము. |
| 299 | 8 | కానుక | గానుక |
| 300 | 10 | ఆశ్రీఃపాప్తి | ఆశీఃప్రాప్తి |
| 301 | 1 | గుజిరాకు | జిగురాకు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 301 | 17 | ఆలము | అలము |
| 305 | 12 | ధన్యులు తల్లుతెల్ల | ధ్వన్యులు తల్లుతెల్ల |
| ,, | 17 | వెనదవులు | వెన్దవులు |
| ,, | 24 | లోన | తోడ |
| 307 | 9 | ఒకఁదు | ఒకఁడు |
| 310 | 2 | పెనగు | పెనఁగు |
| 313 | 3 | ఇందుకుఁ | ఇందునఁ |
| 317 | 18 | దొనిపి | చొనిపి |
| 318 | 1 | తేచి | తేచి |
| ,, | 7 | గోఁడ | గోడల |
| 319 | 3 | హంతకు | యంతకు |
| ,, | 5 | దలమ్ము | బలమ్ము |
| ,, | 16 | జన | జనత |
| 325 | 10 | అణాగి | అణఁగి |
| 327 | 5 | దర్వాణ | బర్వాణ |
| ,, | 17 | మంత | మింత |
| ,, | 18 | దీర్పుట | తీర్చుట |
| 328 | 3 | గిసులుఁ | గీసులుఁ |
| 346 | 12 | ముట్టి | ముట్టె |
| 347 | 8 | జేసి | ఁజేసి |
| 363 | 8 | ఔషధ | ఔషధ |
| 364 | 16 | సారథి | సారథి |
| 373 | 3 | రాజ్యాఁగంబు | రాజ్యాంగంబు |
| 378 | 4 | నుండౌక | నొండౌక |
| 380 | 12 | [illegible] | [illegible] |
| [illegible] | [illegible] | | |

| | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 382 | 22 | అమమతంబు | అనుమతంబు |
| 383 | 21 | కూలి మైన | కూట మైన |
| 386 | 16 | నిల్వాలవలెనే | నిల్వావలెనే |
| 387 | 15 | మొఱఁగఁడేఁ | మొఱఁగఁడే |
| 392 | 23 | తృణంబుఁగ | తృణంబుగ |
| 394 | 12 | జతనమ్ముఁ | జతనమ్ముఁ |
| 395 | 13 | వేడుకలంచుఁ | వేఁడుకలంచు |
| 396 | 13 | నెడలిపో | వెడలిపో |
| 397 | 22 | అర్భకుపడిఁ | అర్భకువడిఁ |
| 400 | 24 | తనియించిఁ | తనియించెఁ |
| 401 | 11 | నాఁట | నాఁటి |
| 403 | 3 | మీఁదకన్న | మీఁదికన్న |
| ” | 15 | తేర్చుటన్న | జేర్చుటన్న |
| 408 | 8 | తెలిపి | తెలిసి |
| 412 | 20 | మొత్తఁగఁ | మొత్తఁగఁ |
| 417 | 16 | అఱమఱ | అఱమర |
| ” | 21 | వెనుకాడగ | వెనుకాడఁగ |
| 419 | 20 | చీకటి | చీఁకటి |
| 421 | 4 | జీకటిపుల్గు | జీఁకటిపుల్గు |
| ” | 18 | పేదెత్తి | పేఱెత్తి |
| 423 | 19 | చీకట్ల | చీఁకట్ల |
| 428 | 6 | దారాడుచున్నారు? | దారాడుచున్నారే? |
| 434 | 3 | దూల్పఁ | గూల్పఁ |
| 440 | 9 | దండయాత్ర | దండయాత్రఁ |
| 441 | 1 | లరసికొనుచుఁ | లరసికొనుచు |
| 443 | 21 | లెక్కవైవం | లెక్కవైనం |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 445 | 7 | బతియు | బలియుఁ |
| 451 | 15 | యధా | యథా |
| 452 | 1 | సచివుఁడాఁడెఁ | సచివుఁడాడెఁ |
| 463 | 23 | సాధ్యాపనం | నాధ్యాపనం |
| 465 | 18 | గాధలక్ష | గాథలక్ష |
| 466 | 6 | వేడికి | వేఁడికి |
| 467 | 19 | జ్యేష్త | జ్యైష్ఠ |
| 471 | 4 | సల్ప | సల్పె |
| 472 | 4 | యధార్వా | యథాస్వా |
| 479 | 8 | మాఖండలక్ష్మి | మాఖండలలక్ష్మి |
| 487 | 17 | నేయఁగ | సేయఁగ |

Desabandhu Press, Tadpatri. A-20 [illegible]